వామే భూమిసుతా పురస్తు హనుమా న్పశ్చా త్సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేష్వపి,
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమల రుచిం రామం భజే శ్యామలమ్ ॥

# శ్రీ రామ కథామృతము - సమగ్ర సమీక్ష





ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి

పి. హెచ్. డి. పట్టము పొందిన పరిశోధన నిబంధము

1984

పరిశోధకులు :

'భాషాప్రవీణ' 'విద్యాప్రవీణ'

డా॥ తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి, M.A., Ph.D.

ప్రథమ ముద్రణ
డిసెంబర్ 1985
ప్రతులు 1000

రూ. 80/-



ప్రతులు లభించు చోటు :
శి వ శ్రీ ప్ర చు ర ణ లు
కోర్టువీధి,
పొన్నూరు 522 124

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ
ఆర్థిక సహకారముతో ముద్రితము.

# గ్రంథ రచనా సముద్దేశము

ఆదికవిగాఁ బ్రసిద్ధి కెక్కిన వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణము సాహితీపరులకును ముముక్షువులకును గూడ నుపాస్యమైనది. ఆ గ్రంథమునకు వివిధ భారతీయ భాషలలోనే గాక పాశ్చాత్య భాషలలోఁ గూడ ననేకానువాదములు, పరివర్తనములు, పరిశీలనములు పరశ్శతములుగా వెలువడుటఁ దద్వైశిష్ట్యము నిరూపింపఁబడుచున్నది.

సాహిత్యాధ్యయనము గావించుచు శ్రీమద్రామాయణము నందలి బహు విశేషముల కాకృష్టుఁడనై తెలుఁగు కవులా రామాయణ సామ్రాజ్యమున నేవిధముగ తమ తమ సామంతత్వము నిరూపించుకొనిరో, నిలువరించుకొనిరో పరిశీలింప సంకల్పించు సమయమున కృష్ణా, గుంటూరు మండలములలో బహుళ ప్రచారమున నున్న శ్రీరామ కథాఽమృతముఁ జూచుట తటస్థించినది. గ్రంథకర్తల శిష్యప్రశిష్యులీ గ్రంథమును పలువిధములుగాఁ బ్రశంసించు చుండుటచే నది చదువవలె నను కాంక్ష అధికముకాఁగా నాద్యంతముఁ బఠించి యా విద్వత్ప్రశంసావాక్యములు యథార్థములని గ్రహించితిని.

ఆ గ్రంథకర్తలలో సంకల్ప స్వీకారాకల్పకల్పనుఁడు, ఆద్యప్రవర్తకుఁడు షట్కాండావధి రామాయణ పాథోధిపారదృశ్వుఁడు నైన కీ॥ శే॥ శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారికి నచ్చముగా నౌరసుఁడు, ఆ పితృపితామహ క్రమప్రాప్తమైన మహాన్వవాయ సర్వసంస్కృతికిని వారసుఁడు, కతిపయాద్యతన భరతవర్షమహర్షి శబ్దవాచ్యులలో నొక్కరు పూర్ణపురుషాయుషజీవులు, సిద్ధపురుషులు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన రాఘవనారాయణశాస్త్రిగారిని దర్శించి వారి యాశీస్సులు గ్రహించి, దివ్యానుభూతుల ననుభవించుచు నా గ్రంథ మందలి విశేషములను సమగ్రముగ నిరూపింప సమకట్టి యీ పరిశోధన నిబంధ వ్యాసంగమున కుపక్రమించితిని.

సర్వ పూర్వరామకథా శ్రవ్య దృశ్య కావ్యపరమార్థములను సంతరించుకొనియు తమదైన విశిష్టవ్యక్తిత్వ ముద్రతో బాణభట్ట తదేకైక పుత్ర భూషణభట్ట సముపజ్ఞమైన కాదంబరీ మహాకావ్యము వలె గ్రంథకర్తల స్వానుభవ భాష్యముగ నవతరించిన శ్రీ రామకథాఽమృతము వర్ణనము లందును పాత్రచిత్రణము నందును

లోకోత్తర భావసంపత్తితో, నిపుణ నిర్వహణ ప్రతిపత్తితో నలరారుటయేగాక భాస్కరాదులచే నటనట స్పృశింపఁబడిన యధ్యాత్మ రామాయణ మాద్యంతము సందర్భోచితముగా నిందనువదింపఁ బడుట, భారతీయ సంస్కృతి కాధారభూతములైన నైకవిధ కర్మవిశేషములు, శాస్త్ర విషయములు, ధర్మస్వరూపము నిందు సముచితముగ వివరింపఁబడుట మున్నగు విషయముల నిరూపించి రచింపవలయు నను సంకల్పము కలిగినది. అవి ప్రధానలక్ష్యములుకాఁగా నీ పరిశోధన నిబంధము రచింపఁబడినది.

సరళగ్రాంథిక భాషలో రచింపఁదలచుటవలన నీ పరిశోధన నిబంధరచనమునఁ గొన్ని స్థలము లందు సారళ్య సంపాదనమునకై విసంధులు గావింపఁబడినవి. అట్లే అకారప్రశ్లేషలు, సాధుశకటరేఫములు, ద్రుతకార్యములు, అర్ధబిందువులు మున్నగువాని నిర్వహణమునఁ గూడ సారళ్యమునకే ప్రాధాన్య మొసంగఁ బడినది. సుమనస్సులు సహృదయతతో గ్రహింతురుగాక !

—తరావములారు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి

ఇది కదా క్షీరాబ్ధి నెనయు హర్షాబ్ధిపై, శయనించు నా శేషశాయిమూర్తి
యిదె కదా తొడసేర్చి ఇందిరా సుందరి, కరనలార్చ లొనర్చు చరణ యుగళి
యిదెకదా విధి జన్మమెంచు మించులసంచు, పుట్టినిల్లనిపించు బొడ్డు దమ్మి
యిదెకదా నిజహితాహితుల మేలుంగీండ్లుఁ, గేలిమై మొనయించు కేలుదోయి
యిదెకదా కూర్మి నెనరుల యిల్లటంబు, కలుములకొటారు శుభవృష్టికలిత దృష్టి
యిదెకదా రామణీయకంబేలుసీమ, సత్ప్రసాదన రమమోము చందమామ.

కాదుకాదిది త్రిజగన్మోహనౌషధి, భవపాశమోక ప్రపాతకంబు
కాదుకాదిది కోటి కందర్ప సందర్భ, మైరమ్మదీయాంతరమృతనాడి
కాదుకాదిది మాయికప్రథా భూమిక, సకల జీవంజీవ చాంద్రలక్ష్మి
కాదుకాదిది పరాక్రమదీప్తి రింఛోళి, సిద్ధాశ్రమ జనాత్త సిద్ధఘటిక
కాదుకాదిది సురలోక కాంక్షితార్థ, మఖిల ధాత్రీ ప్రథిత సుకృతాబ్జవనిక
కాదు కాదిది దశరథ క్రతు సమృద్ధి, యఘహరము రామనామ రసాయనమ్ము.

నిత్యానంద రసాత్మక, మత్యాహిత మోచకము స్వయం ద్యోతక ద్ర
క్ప్రత్యయ మమలము శాంతము, ప్రత్యగ్జ్యోతి యన నీవు పరఁగుదు రామా !

అయో. కాం. 5 ఆ. 307-309 ప॥

శ్రీరామ

శ్రీ శివాయ గురవేనమః

# ఇదం కవి కుమారుండు రాఘవ నారాయణ శాస్త్రి

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥ కాళిదాసః

శ్రీరామ కథాఽమృతము. ఇది అభియుక్తులకు తప్పక రుచించి తీరవలసిన ఉభయభాషా భూషితమగు గ్రంథవిశేషము. దీనిని మా తండ్రిగారు ప్రణయించిరి. ప్రణయన మనఁగా పై కాళిదాసు శ్లోకములోనున్న విషయమును అనుభవించువారు చేయు ప్రకటనము. దీని యర్థము - వాక్కు, అర్థమువలె నెడతెగక ఏకీభావము నందిప్రపంచావభాసమునకు కారణమైన ఉమామహేశ్వరుల వందనము. అనఁగా ఏకీభావము. ఆ వాక్కు అనఁగా ప్రకృతి పురుషమధ్యమున 'అగ్ని మనః ప్రాణాపాన సంబంధముతో నుదయించు నాదము. ఇడా పింగళల మధ్యనున్న సుషుమ్నలో నావిర్భవించు షట్చక్రముల కోణముల యందున్న శక్తిరూపమైన అక్షరములతోఁ గలిసి తత్త్వన్నాయకుల ఆధిపత్యముతో బ్రహ్మరంధ్రము వఱకు నిండియున్న విద్యాశక్తి. దీనినే వేదమందురు. శాస్త్ర పురాణాది విభాగము లన్నియు దీనియందే కలవు. దీనినే శబ్ద బ్రహ్మ మందురు. ఈ శబ్ద బ్రహ్మమును 6 నెలలు ఉపాసన చేసినవారికి పరబ్రహ్మ మవగతమగునని తజ్ఞులు చెప్పుదురు. దీనినే చింతామణి మంత్రమని పేరుపెట్టి శ్రీహర్షాదులు ఉపాసించియున్నారు. ఆ శ్రీహర్షుఁడు చింతామణి మంత్ర దేవతకు చేసిన ఆకార కల్పన మీ కాళిదాసు శ్లోకమునకు వివరణమై యున్నది.

"అవామా వామార్ధే" అని యాయన ఒక శ్లోకమును వ్రాసినాఁడు. రెండు వైపుల ప్రణవమును బెట్టి మధ్య హర శబ్దము నిరాకారము చేసి శక్తిబీజమును కలిపి (౦) సున్న పెట్టిన నది చింతామణి మంత్రమగును. అదియే మహాసరస్వతి అది మూలాధారమునుండి బ్రహ్మరంధ్రము దాకా వ్యాపించియున్నది. దీనికి నాభివఱకు పరావాక్కని పేరు. నాభి నుండి హృదయమువఱకు పశ్యంతివాక్కని పేరు. హృదయము నుండి కంఠమువఱకు మధ్యమావాక్కని పేరు. ఆపైన బ్రహ్మరంధ్రము

వఱకు 'వైఖరి' అని పేరు. దీనినే "చత్వారివాక్ పరిమితా పదాని" అని వేదము చెప్పుచున్నది.

మౌనులు అనఁగా స్వభావముతో అపానమున సంచరించు నాదమును అటు పోకుండ బిగించి సూక్ష్మరంధ్రమగు సుషుమ్న కెక్కించిన ఈ ప్రపంచము మఱిచి వేదప్రపంచమునఁ బడుదురు. ఈ బ్రహ్మమయమగు వేదప్రపంచము దేవతలకు, మానవులకే గాక పశుపక్ష్యాదులకుఁ గూడ సూక్ష్మ శరీరమునఁ గలదు. ఇట్లున్న వేద మును నోరుమూసుకొని సర్వథా అనుభవించువారు మౌనులు. వారు దానిని 'అహమ్' అని అనుభవింతురు. నోరు తెఱిచిన నది 'ఇదమ్' అగును. ఆ 'అహం త్వా' అనుభవమునకే యోగులు సాంఖ్యులు, మౌనులు అందఱు శ్రమపడి ప్రయ త్నించుచున్నారు. కొన్ని జన్మముల నుండి అట్టి యోగముకాని, సాంఖ్యముగాని, ఉపాసనగాని చేసిన వారలకు ఆ వాగ్దేవి 'ఇదమ్' రూపములో భాసించుచు "అహమ్" రూపమును ప్రకాశింపఁ జేయును. అట్టి అనుభవముఁ గలవారు చెప్పు మాటలుగాని, పాటలుగాని, పద్యములుగాని, 'విద్య' అనిపింపఁబడును. 'ముద్దీ, నోరు మూసుకొని బొమ్మ'ని ఒక సామెత కలదు. అది యోగ శాస్త్రానుసారము పుట్టిన సామెత. ప్రతి యోగియు మూలాధారమును బంధించి తీరవలయును. ఆ నాదమును నోరు తెఱిచి వెడలఁబుచ్చువారు మహాకవులు. లోకసామాన్యమున దాని నుపయోగించు వారలు వ్యావహారికులు. కవిత్వముఁ జెప్పువారలుగూడ తాము లోపల ననుభవించు బ్రహ్మతత్త్వమును ముఖముద్వారా వెల్లడించుచున్నారు కనుక అది ప్రణయించుట అని వాడవలసి వచ్చినది.

ప్రణయన మనఁగా ఉన్నదానిని ప్రకటించుట గాని, క్రొత్తదానిని సృష్టించుట గాదు, కనుక మా తండ్రిగారు వారి పూర్వజన్మ విశేషమువలన, వారికి దొరికిన గురువుల వలన 11 మాసములలో సంపాదించి, తమ నిత్యానుష్ఠానములో అనుభవించిన అమృత స్వరూపమును శ్రీరామకథాఽమృతమను పేరుతో వెల్లడించిరి. ఈ గ్రంథమందు వారికి అత్యంతమైన ప్రేమ. అచ్చుకాక ముందు నిత్యమా గ్రంథమును తలక్రింద పెట్టుకొని పండుకొనెడివారు. అది ఇంట్లో పెట్టరాదా ? అని అంటే, ఆయిల్లు తగలఁబడితే ఎట్లు ? అనెడివారు. మన యిల్లు గట్టియిల్లే కదా ? అంటే, రావణాసురుని లంక కంటే గట్టిదా ? అనెడి వారు. వారి మాటలను బట్టి గ్రంథముయొక్క ప్రాశస్త్యము కనఁబడుచున్నది.

ఆయన శంకర సంస్కృత పాఠశాల అని పేరుపెట్టి 40 సం॥లు విద్యార్థులకు ఇంట్లో భోజనము పెట్టి, చదువు చెప్పినారు. సుమారు 1000 కి ఎక్కువమందియే వారిదగ్గఱ పండితులైనారు. వారి అనుభవ రూపమగు గ్రంథమును తమ విద్యార్థులకుగాని, పండితులకుగాని, పెద్దలకుగాని వినిపింప వలయుననియే కోరిక. కార్యాంతరముతోఁ బోవ వలసిన వారినిఁ గూడ నీకు నేనే బహుమతి నిచ్చెదనని నిలిపి వినిపించుచుండెడి వారు. ఆయనకు అందఱు ముఖ్యులేమైనను కవియగు చల్లా పిచ్చయ్యశాస్త్రి వారి జన్మాంతము వఱకు వారిని విడిచిపెట్టకుండగా, ననుసరించు చుండెడివారు. తమ గ్రంథములో అవసానము నాటికి కొంచెము దిగుబాటున్న, పిచ్చయ్యశాస్త్రిచే వ్రాయిం చెద నన్న, 'కాదు నీవే వ్రాయవలసినదని' కొన్ని జన్మలతో సంబంధ మున్న పుత్ర ప్రేమతో నన్నాజ్ఞాపించిరి. తర్వాత ఏదో నాకుఁ దోచినట్లుగా గ్రంథమును బూరించి తిని. ఇప్పుడా గ్రంథము చూచిన నా తెలివికిది యందునా ? వారు తపశ్శక్తిఁ గల గలవారు గనుక ఈశ్వర రూపముతోనుండి నాయందు ప్రవేశించి వ్రాయించినారని ఊహించుచున్నాను. వారి యాజ్ఞప్రకారము పూర్తిచేసి అచ్చువేయించి చందా దారుల కిచ్చి వారి ఋణముఁ దీర్చుకొంటిని. ఆ పుస్తకము లైపోయి పాఠకులకు పుస్తక ములు దొరక కన్వేషించుచుండ కంభంపాటి పురుషోత్తమశాస్త్రి తాను సామాన్యుఁడే యైనను తనకు పలుకుబడిగల ధనికుల సహాయముతో మరల అచ్చువేయించి పాఠకలోకమున కిచ్చినాఁడు. దానికి నా తండ్రి యేలోకమున నున్నను సంతోషించు చున్నాఁడని తలఁచెదను.

ఇది యిట్లుండ బంధువు, ఆప్తుఁడు, శిష్యుఁడు, పూర్వజన్మ సంబంధము గలవాఁడు అయిన చి॥ తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి ఆంధ్ర విశ్వవిద్యాలయము వారి ప్రేరణమున ఆ గ్రంథమును విమర్శఁజేసి, అచ్చువేయించి, పాఠకలోకమునకు అమృతాస్వాదనము నందించుట మా తండ్రిగారికి ఆనందకరము. వారితో గలిసి గ్రంథము వ్రాసిన నాకు ప్రౌఢముగా కనుపట్టుచోట్ల సులభముగా వివరించిన ఈ విమర్శకుని యందు ఆ మహా కవియే ప్రవేశించి ఇట్టి విజ్ఞానమును కల్గించినాఁడని అనుకొనుచున్నాను. మా తండ్రిగారిప్పుడుండి ఉంటే ఈతనికి చాలా బహుమానము చేసెడివారు. నా కట్టి శక్తిలేక ఆశీర్వచనము మాటలతో సరిపుచ్చుచున్నాను.

ఆత్రముఁ బాచి ప్రోచెదరనా ! నిను రాముఁడు, దేవి సీత, సౌ
మిత్రి యమిత్ర హంత, నిరమిత్రుఁడు మిత్ర వినేయుఁ డంజనా
పుత్రుఁడు నస్మదీయమగు పొల్తి స్వకీయత నాదరించి యా
మాత్రిక మైహికంబు సుఖమున్ పటిఁదార్చుచు దక్షిణాకృతీ !

స్వజన దౌహిత్రు స్యాలకత్వమునఁ జేరి
మత్పితృ కృతి పొనర్చి విమర్శనంబు
యౌన సంబంధమునకు విద్యానుబంధ
మెక్కు డది యిది సరినెఱయించినావు.

తూములూరు కులంబునఁ దోచినావు
దక్షిణామూర్తి నామంబుఁ దాల్చినావు
విద్యను దదర్థుల కొసంగు నుద్యమమున
పేరు గాంచితి, విద్దాన పెంపుఁ గనుము.

నిస్పృహుఁడై మహిందగ జనించియు శాంకర భాష్యమందు వా
చస్పతి మిశ్రుఁ డాచుకొనె సద్యశ ముత్తమ వ్యాఖ్యఁగూర్చి, య
ట్లే స్పృహణీయ మత్పితృ కవీశ కృతిన్ గృతిఁ గూర్చి తర్థమి
ష్టా స్పదమౌచుఁ గీర్తికిఁ, జిరాయువుపై సుఖమందు మాశ్రవా !.

---

**Prof S. V. JOGA RAO,**
M A., Ph.D., D. Litt. (Hony.)
National Professor of Telugu
Past Principal, A C L Colleges
Andhra University, Waltair

D. 23-11-85

# సహృదయ భూమిక

"అచ్ఛమైన యమృత మమరులు ద్రావినా
రోయి దానికే నసూయ పడను
పరమ మౌనియైన వాల్మీకి కృత రామ
సత్కథా సుధారసంబుఁ ద్రావి"

అను శ్రీమద్రామాయణ కల్పవృక్ష మహాకావ్య ప్రణేత శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి వక్కాణను పునశ్చరణము పురశ్చరణమును గావించుకొన్నది "శ్రీరామ కథాఽమృతము" నతిలోక మాధుర్యము నారగ్రోలిన నా యనుభూతి. ఆ యనుభూతియే నా ప్రియశిష్యుడైన చిరంజీవి శ్రీ దక్షిణామూర్తిశాస్త్రిని తత్పరిశోధనకు పురిగొల్పినది, 'డాక్టరు' పరమ పట్టభద్రుని గావించినది.

అది రామాయణ కల్పవృక్షమైనచో నిది రామాయణ కామధేనువు. రచనలో ఇందలి కొంతభాగము దానికి పూర్వకాలికము. కొంత అర్వాచీనము. వెరసి రెండును సమకాలికములు. ఒకరి కృతు లొక రెరుగరు. కాని రెండును సర్వరామ కథా ప్రియంభావుకులైన పురా మహాకవుల రమణీయ రచనా స్వమార్గముల సౌభాగ్యమును పుణికి పుచ్చుకొన్నట్టివి. ఇందలి విశేషము : బాణ భూషణ భట్టుల కాదంబరీ మహా కావ్యమువలె నిదియు పితాపుత్రోపజ్ఞము. ఎతత్కృతికర్తలు కీ॥ శే॥ తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిగారు, వారి పుత్రులు శ్రీ రాఘవనారాయణ శాస్త్రిగారు. అద్యతనాంధ్ర సాహిత్య ప్రపంచమున ఎవరు మహాకవి? అన్నచో విడుగో అని చూపి

చెప్పదగినవాడు పితృపాదుడు — ఈనాడీ సర్వభరతావని నెవ్వడు మహర్షి శబ్ద వాచ్యుడు ? అన్నచో వీడుగో అని ప్రదేశిన లక్ష్యభూతుడు పుత్రరత్నము. ఇర్వురును గీర్వాణాంధ్ర గిరాంధురంధరులు. పరమ భావుక పట్టభద్రులు. సరస్వతీ వరివస్యా చతురాస్యులు. రామభక్తి రమారాములు. అందుకే వారి కావ్యము బృహత్త్వతోపాటు మహత్తను సంతరించుకొన్నది.

ఆ మహాకావ్య పరమార్థమును ఆత్మసాక్షాత్కారము పొందిన యోగివలె దర్శించి అవగాహన చేసికొని అనుభవించి అనుశీలించిన సమీక్షా దక్షుడు మా దక్షిణామూర్తి. అతని యీ పరిశోధన నిబంధమున విషయపుష్టి, ప్రణాళికా సౌష్ఠవము, రచనా రామణీయకము, ఆదర్శప్రాయ పైమర్శిక దృక్పథము మున్నగు సర్వ సల్లక్షణములును సంపన్నమై యున్నవి.

దక్షిణామూర్తి అసాధ్యుడు. వయసున పిన్నయయ్యు, మనసున మిన్న. కవిత, పాండితి, ఉపాధ్యాయిత అను సరస్వతీ సఖులను సత్కరించిన సారస్వత దక్షుడు. "స్ఫులింగావస్థయా వహ్నిః । రేధాపేక్ష ఇవస్థితః" అన్నట్లున్నవాడు. ఇతనికి నా మంగళాశాసనము. సౌహార్దసాధువాదము.

యస్వీ

"సాహిత్య విద్యా ప్రవీణ" "వ్యాకరణ విద్యా ప్రవీణ"
"భాషా ప్రవీణ"
చెరువు సత్యనారాయణశాస్త్రి, M.A.
ప్రిన్సిపల్
S. B. S. ఓరియంటల్ కాలేజి, తణుకు.

ఓం

# సూక్తి క్షణిక

ఓం విశుద్ధ జ్ఞాన దేహాయ త్రివేదీ దివ్య చక్షుషే ।
శ్రేయః ప్రాప్తి నిమిత్తాయ నమస్సోమార్ధధారిణే ॥

ఇది Ph. D. పట్టమునకై ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు సమర్పింపబడిన పరిశోధిత వ్యాసము. అనగా పరిశోధించిన విషయముపై వ్రాయబడిన వ్యాస మన వచ్చును. లేక అట్టి వ్యాసము కూడ పరిశోధితమని చెప్పుకొనవచ్చును. ఏతద్వ్యాస పరిశోధన పరమ ఫలముగ ఈ వ్యాసకర్తకు Ph. D. పట్టము ఈయబడినది. ఈ వ్యాసమునకు శ్రీరామకథాఽమృతము - సమగ్ర సమీక్ష యని నామకరణ మొనర్పఁ బడినది.

లోకమున మనకొక్క అలవాటు కలదు. ప్రతిదానికి నొకపేరు పెట్టు కొనుట - పుట్టినవారందరికి పేర్లు పెట్టికొందురు. ఉన్నవార లున్నంతలో, లేని వారలు లేనంతలో పండుగలుకూడ జరుపుకొందురు. ఈ పేర్లు పెట్టుకొనువారి చిత్తమును బట్టి రక రకములుగ నుండును. ధర్మారావని పేరుపెట్టబడినవాడు ధర్మము నందాసక్తి లేకపోవుటయేకాక అధర్మమునందు పరమాదరము కల్గి ప్రవర్తించువాడు కావచ్చును. పాపయ్య యని పేరుపెట్టబడిన వాడు వృత్తి ప్రవృత్తులలో వేదశాస్త్రముల సమన్వయించుకొనుచు పరోపకార ప్రవణుడై లేశ మాత్రమైన పాపపుద్రోవ పోక పరిమళించవచ్చును. కొంతమంది తాము కట్టుకొన్న ఇళ్ళకు పేర్లు పెట్టుకొందురు. ప్రశాంతి నిలయము, ఆనందనిలయము నని. అందు ఆనందము, సంతోషము పేరుకు మాత్రమే పరిమితమైన దాఖలాలు మనము చాలా చూచుచున్నాము. రాజమార్గ

మున పోవుచుండ నెన్నియో పేర్లు మన మనునిత్యము చూచుచుందుము. ఈ పేర్ల కన్నింటికి సార్థకత నెంతవరకు చూచుచున్నాము ? కాని పుస్తకములకు పెట్టినపేర్లు కొంతవరకు విషయముతో సంబంధము కల్గియున్నట్లుగా నొప్పుకొనక తప్పదు. దీనిని మనము విషయ స్పర్శమును బట్టి నామ సార్థక్యము కలదనియు, విషయ సంబంధ మును బట్టి నామౌచిత్యము కలదనియు భావించుట యలవాటు. ఈ పరిశోధనా నిబంధనమునకు నీ రెండు లక్షణములు కలవని యనిపించుచున్నది.

రావణాసురుని పరిమార్చిన తరువాత రాముడు సీతతో సపరివారుడై అయోధ్యకు వచ్చినాడు. అప్పుడు భూమ్యాకాశము లేకముగా శ్రీరాముని పట్టాభిషేక మహోత్సవము జరిగినది. ఇప్పటికిని మనము ప్రతియేడు శ్రీరామనవముల పట్టాభి షేకపు టడావుడులను గాంచుచున్నాము. స్థల వైభవమును బట్టి, ద్రవ్య సంభవమును బట్టి యొక్కొక్క యెడ వైభవమునకు మన కన్నులు తిరుగుచున్నవి. ఇక నలనాటి యసలైన రాముని సిసలైన పట్టాభిషేకము చరాచర ప్రపంచ ప్రమోద సంధాయక మనుటలో ముల్లోకములవారు ముప్పేటగ నేకమై ముప్పిరలుగ కలసిపోయి ముచ్చటలు పడిరనుటలో మచ్చునకు కూడ నతిశయోక్తి యుండబోదు. ఆ యుత్సవము ముగిసి నది. తరువాత నొకనాడు మహామునులు కొందరు రామచంద్రుని చూచుటకు వచ్చిరి. రామచంద్రుడు వారల కెదురేగి యతిధి పూజలు గావించినాడు. ఋషులందరు రాముని ప్రశంసించి, రాముని పరాక్రమముల నన్నింటిని తలచి రామనామ మహిమ మును కూడ పేర్కొనిరి. ఏకలక్ష్య వృత్తితో నెల్లతీరుల నేమఱక నిన్నె తలచి మాయను జయింపగలవార మనిరి. అట్టియెడ రాముడు వినయముతో విధేయుడై రావణాదుల వృత్తాంతములను వినిపింప వలసినదిగా కోరినాడు. అప్పుడు ఋషు లందరు నగస్త్యుని పెద్దచేసిన, నా తపోధనుడు రామునకు ననేక వృత్తాంత రహస్య ములను పల్కెను. ఇది యుత్తరకాండమున మొదటి విషయము. సరే రాము డడిగినదానికి నగస్త్యుడు చెప్పుచున్నాడని శివుడు పార్వతితో చెప్పినట్లు గ్రంథకర్త పరతత్త్వమునకు నివేదించు చున్నట్లు మన కవగతమవుచున్నది.

ఇక్కడ కొంత చెప్పవలసి ఉన్నది. ఈ వ్యాసము వ్రాసినది స్వయాన నాకు బావమరది. అనగా నా శ్రీమతికి తమ్ముడన్నమాట. ఈ గ్రంధ ముద్రణకు దొరకొన్న నాటినుండి నన్నిటువంటి మాటలేవా వ్రాసిపెట్టుమని యడుగుచుండెడి వాడు. నాకు వ్రాయుట యన్న నారోగ్యమున కంతపడదు. అందుచేత నొకనాడు

మా చిన్న బావమరిది వ్రాయసకాడుగా కుదురుకొని వచ్చినాడు. నాటి సాయంకాల మిట్లే ముచ్చటించుకొనుచుండ మా లేఖకాగ్రణి రాముడన నెవరు ? విష్ణువే కదా ! "విష్ణువు నిరంతరము శివుని సేవించుకొనుట వలననే మహాలక్ష్మి యాతని పాదము లొత్తుచున్నది" అని శివ పారమ్య తంత్రము నుగ్గడించినాడు. ఇంతలో మా శ్రీమతి కల్పించుకొని విష్ణువు లక్ష్మీదేవికి తత్త్వబోధము లొనర్చిన జాడలెక్కడ కానరావు. ఎప్పుడు నా విషయముల చెప్పుము, ఈ విషయముల చెప్పుము అని పార్వతి తాన డుగు చుండుటయు, విసువు విరామము లేకుండ నిరంతర మామెకు తత్త్వబోధ నొనర్చునది శివుడే యనియు ప్రసక్తాను ప్రసక్తముగ పలుకుచు, తా నసలు భగవ దవ తారమైన రాముడు రావణాదుల చరితమును తెలియనివాడు వోలె యా మునుల నడుగుట యెందులకని పోపువెట్టినది.

నిజముగా నా కిట్టిచోట నప్పుడప్పు డిట్లుకూడ ననిపించుట కలదు. రాముడు పితృవాక్య పరిపాలనమునకు నరణ్యములకు పోయెను. దండ కారణ్యములో ఖరదూషణాదులను వధించెను. బలశాలిని వాలిని పరిమార్చెను. శతయోజనాయుత పారావారముమీద సేతువు కట్టెను. రావణ కుంభకర్ణాదుల జగదజయ్యుల నిహతుల నొనర్చెను. అటుపిమ్మట నయోధ్యకు వచ్చినాడు. అయోధ్యలోని వారెవ్వరు నా యా రాక్షసవీరుల బల పరాక్రమములను గాని, స్వరూప స్వభావములనుగాని యెఱిం గినవారు కారు. అట్టియెడ నయోధ్యావాసులగు ప్రజల కందఱకు తన పరాక్రమమును తగిన వారిచే తరతరముల నిలుచునట్లు చెప్పించుట యుభయతారకమైన పని. అంతియే కాక యా మునులందరు నీ వా రాక్షసుని చంపితివి, యీ రాక్షసుని చంపితి వని ప్రశంసించుటకంటె నాయా రాక్షసులయొక్క జన్మ కర్మ తపశ్శౌర్య వీర్యక్రౌర్యముల నభివర్ణించినచో విన్నవారి కందరకు నాయకునియందు నిబ్బడి ముబ్బడిగా నభిమానము కుదురుకొనును. ఇదియొక ప్రశంసా పర్యాయము లేని ఆత్మశ్లాఘలో శాఖాచంద్ర మణిక. అయితే యిటువంటి సందర్భములలోనే సుతారముగ మనకు దేహాభిమాన ముతో రామచంద్రుడు మానవ మనోభావ సాధారణ్యముతో గోచరించుచుండును

దశావతారములలో రామావతార మొకటి. కృష్ణావతారము వలె భగ వంతుడు తనకుతానై ఎత్తిన యవతారము కాదు. భృగు శాపమునకు తీర్పవలసిన సమాధానములలో నిదియొకటి. అందువలన నిట్టి యవతారములలో నా యా జన్మ ప్రవృత్తుల కనుగుణమైన తీరులో, నా పరిధికి లోగాని యంతస్సంవృతమైన

దివ్యత్వమున నిగూఢముగ అవతార ప్రయోజనమును సాధించుచు చూచువారికి మాత్రము తాను సాధారణ దశరథాత్మజునివలె తోచునట్లు వ్యవహరించు చున్నట్లు అనిపించును.

ఇట్టి చమత్కారము లీ రామాయణమున చాల కలవు. రామాయణ మనఁగా రాముని యొక్క అయన మనియు, రామయొక్క అయన మనియు రెండు విధములుగా నర్థము వచ్చును. "సీతాయాశ్చరితం మహత్" అన్న యాదికవి హృదయమే యిట్లూహించెను. ఈ రామాయణమున గల పాత్రలలో సీత, రాముడు, ఆంజనేయుడు, మాయకు, నీశ్వరునకు, మనస్సునకు ప్రతీకలు. ఈ కథ మన మందర మెఱిగినదియే. ఈ రామకథను సంస్కృతమున, తెనుగున, నితర భాషలందు, పలువురు వ్రాసిపెట్టినారు. కొన్నింటిలో కథ యనుస్యూతముగా నుండును. కొన్ని రామాయణములలో కథలోకూడ వ్యత్యాసము కానవచ్చుచున్నది. కొందరి రామాయణములలో కథను చెప్పెడి తీరులో విశేషములు గోచరించును. ఆయా రామాయణ కర్తల యాత్మదర్శనము వారి వారి రచనలలో ప్రస్ఫుటముగ కానవచ్చును. ప్రస్తుత మీ సామునకు గరిడీయగు మూలగ్రంథము శ్రీరామకథామృతము. అందరు రామాయణమని పేర్కొనుచుండగా దీని యందుగల ప్రత్యేకతను, విశేషములను సూచించుటకు దీనికిట్లు, పేరుపెట్టుట జరిగియుండును. అసలు 'రామాయణము', 'భారతము', 'భాగవతము' మన భారతీయ వాఙ్మయమున నీ మూడుపేర్లకు దీటైన సాటియైన మేటియైన మాట మరొక్కటి కానరాదు. ఆ ఘనత వ్యాస వాల్మీకులకే దక్కినది. వాల్మీకి నారదుని యనుగ్రహమున రామకథ నంతయు వ్రాసి దానికి రామాయణమని పేరుపెట్టి కుశలవులకు నేర్పి వారిచేత రాముని యాశ్వమేధమున యాగశాలలో పాడించెను. పూర్వాచార్య సంపాదితమై గేయాంచ దలంక్రియా కలితమై, యాబద్ధ తంత్రీలయమై గణ్యమై రక్త కంఠ పనితమై బాలకాసంచితమైన యాగానమును రఘూద్వహుడు విన్నాడు. అద్భుతాక్రాంత స్వాంతుడైనాడు. మీరు గానముచేసిన కావ్యమేమి ? కావ్యమును రచించిన దెవరు ? అని యడిగెను. అప్పుడు కుశలవు లీ కావ్యము పేరు 'రామాయణమ'ని చెప్పిరి. ఆ తరువాత నీ పేరు లోకమున పరివ్యాప్తమైనది. వాల్మీకి యీ కావ్యమును వ్రాయక మునుపు రామాయణ ముండెనో లేదో ఉన్నచో దానికి నెట్టి పేరుండెడిదో చారిత్రకులు పరిశీలించవలసిన సత్యము. రామకథను అనువదించి రచించిన వారందరు దాదాపుగా దీనిని రామాయణ మన్న పేరుతో పేర్కొన్నారు. కావ్యపక్కికలో దీనిని కథాంశముగా గొని ప్రబంధ

ముగ రచించిన వార లెవరికి తోచినట్లు వారు పేరుపెట్టుకొన్నారు. కాని ప్రకృత మూలగ్రంథమునకు శ్రీరామకథామృతమని పేరుపెట్టుటలో స్వారస్యమును మన పరిశోధనకర్త తడిమిచూచినాడు. అమృత శబ్దమునకు మోక్షమన్న యర్థము కలదు. మోక్ష మనగా సచ్చిదానంద ఘన బ్రహ్మానుభూతి. అట్టి నిర్వికల్పస్థితికి కూడ నమృతమని పేరు. 'అమృతే నావృతామ్' అని శ్రుతి. అట్టి బ్రహ్మతత్త్వ ప్రతీతి పావకమై, తద్బోధకమైన గ్రంథమునకు కూడ నమృతమన్న పేరు పొసగును. అప్పుడీ ప్రబంధము కథారూపమున రామకథా ప్రతిపాదక మగుచు తాత్పర్యమున బ్రహ్మతత్త్వ పర్యవసాయి యగుచు మిగిలిన రామాయణము లన్నియు కేవల కథాంశ ముల ననుసరించుచుండ నియ్యది మాత్రమే యుపనిషత్సారమైన విజ్ఞానము నంతర్లా ఘితము చేసికొని ప్రసరించినది. అంతియేకాక సంస్కృతమున గల వాల్మీక వాశిష్ఠ వైశ్వామిత్రాది బహురామాయణముల బహూకృతములైన మహితాంశముల నెల్ల బృహదారణ్యక రామతాపిన్యాది మహోపనిషత్తులలోని రహస్యములనెల్ల నిందు మేళవించిన తీరు మోదసహముగ గోచరించుచున్నది. ఇది యింతటి యౌపనిషద సిద్ధాంత మగుటవలననే పరమేశ్వరుని యొడిలోని శుద్ధాంతము బద్ధాంకకరణమై తత్త్వ రహస్యముల నాలకింప కుతూహలినియైనది. "పుట్టు సంద్రమ్ము దాటింపబోవు నౌక, రామ హృదయ రహస్యార్థ రమ్య టీక" యని శివుని నోట వచ్చినమాట.

మాటమాటకు మాటున చాటున చోటుచేసికొన్న కొన్ని సంకేతముల సంప్రదాయాను సారముగ సంధానించుకొన్న నలౌకికములైన కొన్ని తాత్త్విక సమాధానములు మనకు బోధపడును. ఆనందమయము మోక్షపదము నైన శ్రీనగరమే యయోధ్య. దీనినే "దేవానాం పూ రయోధ్యా" యని శ్రుతి పేర్కొన్నదని యను కొని యటనుండి మునుకొని నిభృతముగ మనస్సును నడపించినచో మాయా బింబితు డగు నీశ్వరుడు మనకు దశరథుని యందు గోచరించును. ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులు మూడు సుమిత్రా, కౌసల్యా, కైకలుగా నా యీశ్వరునకు పత్నీత్వము నెఱపినవి.

అందు జ్ఞాన శక్తి యాత్మారాముని రాముని కన్నదనుట సుసంగతమైన యూహ. చతుర్వ్యూహ విభాగ పరిష్కృతమైన రామత్వమే పరస్పర స్నేహ పరిబద్ధమైన సోదర చతుష్టయముగ భాసించినది. ఈ విధముగ న య్యాత్మారాము డవ్యక్త మాయానుభావమున జీవభావ భావితుడై స్వస్వరూపమును మరచి దేహాభి

మానమున చరించి, వశిష్ఠుని వద్ద విద్య నభ్యసించుట శ్రవణమై, విశ్వామిత్రుని యుపదేశములు మననమై, సహజ వైరాగ్యము సహజన్ముని రూపమున ననుసరింపగా పాపపర్వతముల నతిక్రమించి వాసనా తరంగిణుల నధిగమించి జ్ఞానమను తీవ్ర శరముతో తాటకయను అవ్యక్తావరణమును భేదించును. మననముతో సుసంపన్నమైన యంతర్యాగక్రమమును సక్రమముగ నడపెను. అట్టి యంతర్యాగ యోగమునకు విఘ్నము నొనరించెడి కామక్రోధాది మహోపసర్గము లనజాలిన సుబాహు మారీచ ప్రభృతుల నాధ్యాత్మిక సాధన సమన్వయ సంపత్తితో తెగటార్చును.

ఆ పిమ్మట మనన రూపమైన విశ్వామిత్రుడు దారి చూపుచుండగ సాగి పోవును. తన పాద పావన స్పర్శమున శాప తాప గ్రస్తయగు శిలను కూడ సుశీల నహల్యనుగ తీర్చిదిద్దుచు విదేహ నగరమున ప్రవేశించును. అచ్చటి నరపాలుడు శాంతమునకు ప్రతీక కాఁగా నాతని మర్యాదల నాదరించుచు నసూయారూపమైన శివ చాపము నెత్తి గుణమున సంధించి భంజించి బ్రహ్మానందాపర పర్యాయమైన నిర్వృతి రూపయగు సీతను పొందును. అంత స్వస్వరూపాను సంధానము నెలయించు మార్గమున 'నన్ను జయింపకుండ నీ పెచ్చుటకు పోగల'వని తన్నెదిరించి నిలిచిన మదరూపుడగు భార్గవ రాముని గర్వము డించును.

ఈ విధముగ సాధకుడైన జీవునకు శివధనుర్భంగ మనఁగా రుద్ర గ్రంథి విభేద మనియు, పరశురామ గర్వభంగ మనగా మదము నడంచుట యనియు, పిమ్మట నయోధ్యా నగరమున పట్టాభిషేకము జరుగనున్నది యనుట యాత్మ సామ్రాజ్య స్వారాజ్యమున స్వస్వరూపానుభవ సిద్ధి నెనయబోవుట యనియు సమన్వయించుకొన నగును. జీవుడెంతటి సిద్ధజన్ముడైనను జన్మకారణమైన శుభాశుభ ప్రారబ్ధ మనివార్యము కావున క్రియాశక్తి ప్రతీకయగు కైక చాపల్య రూపమగు నంతరాయమును కల్పింపగ ముక్తిస్థానమును వదలిపోవలసి వచ్చును. అయితే తనకుగల సంస్కార బలము వలన బహుకాల సాధనారూప వాసనా వశమున, వైరాగ్యము, నానంద వృత్తియు, వీడకుండ వెంటనుండ గుహుని పేరిట నిశ్చయరూపమగు బుద్ధిభావము తోడై సంభావింపగా, ప్రారబ్ధ మపరిత్యాజ్యము గావున విక్షేప రూపమగు దండకారణ్యమును ప్రవేశించక తప్పినది కాదు. నిరంతర తపోనుష్ఠానమున చిత్రకూట గిరి శృంగముల నధివసించుచు నహంకార విరాధుని నశింపజేయును. లోకముల నెల్లెడల సంచరించుట కలవాటు పడిన కాకాసురుని పేరి మనంబునకు గల సవికల్పతారూపమగు

నేత్రమును బోనడచి నిర్వికల్పదర్శన మొక్కటియే మిగుల్చును. శూర్పణ యనగా కామరూపవృత్తి. అద్దానిని వైరాగ్య సహకార భావనమున వికృతరూప నొనర్చును. మాయబంగరులేడి యిచ్ఛకు ప్రతిరూపము. రావణాసురుడు రజోగుణము. ఆరజస్తత్వము యిచ్ఛావ్యాజమున నానందవృత్తిని వేరుచేయుటయే సీతాపహరణవృత్తాంతము. జీవుడిచ్ఛను జయించుటయే రాముడు మాయలేడియగు మారీచుని పరిమార్చుట. ఆ విధముగ నిచ్ఛను పరిమార్చియు రజోగుణాపహృతయగు ఆనందమునకై విక్షేపారణ్యములలో వైరాగ్య సహకృతుడై సంచరించును. కబంధుడను రాక్షసుడు చింతా స్థానమున నాక్రమింపగా నాతనిని కూడవధించును. జటాయువనెడి వివేకము బహువిధముల పోరాడియు రాజసముచే నణగద్రొక్కబడియానంద వృత్తికొరకు నెమకుచున్న జీవునకు నట్టి వృత్తి రజోగుణ నిర్బంధాపహృతయని యెరుకచెప్పును.

శబరి సంతోషరూప. ఆమె చేసిన పూజ స్వాత్మవికాసము: స్వాంత వికాసము. అట్టి స్వాంతవికాసము ద్వారా నిధిధ్యాసనమును, అభ్యాసమొనర్చుటయే హనుమంతుని చూచుట. ఆ నిధిధ్యాసనరూపుడగు హనుమంతుని పర్యనుయోగము వలన చేతోమోదము సుగ్రీవమైత్రి యనెడి యభయము సిద్ధించును. అట్టి అభయము సిద్ధించుటకై సప్తతాళములనెడి యేడావరణములను ఛేదించుకొనుట తప్పనిసరియైనది. "అభయం ప్రతిష్ఠాం విందతే" అనునట్లు ప్రతిష్ఠయనదగిన తార యభయసంగత యగుటకు భయముగా గురుతింపదగిన వాలి నశింపజేయబడగా నా ప్రతిష్ఠ యభయమునకు రాజ్ఞియాయెను. ఆప్రతిష్ఠవలన సంజాతుడగు నంగదుడు సుఖరూపుడు. ఆతనికి యౌవరాజ్యమిచ్చుటయనగా విషయవిపర్యాసందము. ననుభూతిపరము చేయుట అటు పిమ్మట నిధిధ్యాసనము ఆనందవృత్తిని వెదకుటకు తనబలమును బలగము నుపయోగించును. అట్టిచో నా నిధిధ్యాసనము హనుమత్ప్రతీకము అయ్యానందరూపవృత్తిస్థితిని గమనింపబోయి అనేకోపాసనామార్గాన్వేషియై ప్రపంచమునంత గాలించి బ్రహ్మాచారణుల పథమునాక్రమించి విమోహమనెడి సముద్ర మధిగమించి లంకయనుపేరిట బోధ శక్తిని నడచివైచెను. "యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ" అన్నట్లు రాత్రియెల్లపవలై భాసింప ఆ నిధిధ్యాసనము నానంద దర్శనమునకై జాగరూకత ప్రవర్తించును. అశోకవనము చేరుటయనగా శోకరాహిత్యమును పొందుట, అచట నా నిధిధ్యాసనము హర్ష రూపమై ఆనందమయ సాధకళారూపమగు మహాదేవిని చూచును. సంకల్ప బాహుళ్యమనదగిన యశోకవనవైభవమును ఖండించెను. మరియునా నిధిధ్యాసనము దుష్ట సంస్కారరూపులౌ రాక్షసుల సమయించి తమస్స్థానీయుడగు

జంబుమాలిని, సంశయాత్మకుడగు నక్షుని నశింపజేయును. విపరీతభావ సంభావనము చేత భ్రాంతి, జ్ఞానము నావరించుట యింద్రజితుని బ్రహ్మాస్త్రమునకు హనుమంతుడు బద్ధుడగుటగా నెరుగదగును. అగ్ని సమానమైన మౌనతత్త్వము జ్వలింపగా దుఃఖ రూపమగు లంకానగరము భస్మమగును. నిధిధ్యాసన మింతటియోగప్రగతి సాధింప నధ్యాత్మారాముడు మోహసముద్రమును బంధించి స్థైర్య సత్త్వముతో సేతునిర్మాణ మొనర్చును. ఇంక నభయసహవాసముతో నాత్మసహకారముగ నెలకొన్న సద్వాసనలు విజృంభింపగా రాక్షస స్వరూప దుర్వాసనాసంహారరూప ఘోరయుద్ధమునందు విపరీత భావము, అనగా మేఘనాధుడు సంశయ రూపమగు నాగపాశమును ప్రయోగించును. అట్టి సంశయమున చిక్కుకొన్న యాత్మరూపమును సద్విచారము సత్సంచారము లతో దక్షిణోత్తర పక్ష వక్షశ్శిర్షపుచ్ఛ సంబద్ధమగు పక్షి వడువున విడిపించి వెలయించును. అటుపిమ్మట ప్రజ్ఞయనెడు నాయుధప్రకరములతో కుంభ కర్ణుడను తమోపంక్తిని కూల్చును. అదట రాజసప్రకృతి భ్రమ మను శక్తిని ప్రయోగింపగా నా భ్రమము వైరాగ్యమునకు ప్రకృతియగు లక్ష్మణుని మూర్ఛిల్ల చేయనపుడు నిధిధ్యాసన మనదగు హనుమ సంజీవనము తెచ్చి యనపాయిత్వము ఘటింపజేయును. ఆవట నా వైరాగ్యము మహత్త్వాకలితమై యింద్రజిద్విపరీతభావమునెదిరించి రూపుమాపును. సమ్మోహనమ్ములగు సాధనమ్ములతో మూలబలమునెల్ల బాధింప బూనిన రాజసము నెదిరించుటకు నాత్మారాముడను యోధుడు గాంభీర్యమను ధనువు నెక్కిడి జ్ఞానమనెడి బాణ మును సంధించెను. ఇంక నారాజసప్రకృతి రూపమగు రావణునకు పంచ జ్ఞానేంద్రియ ములు, పంచ కర్మేంద్రియములు వెరసి పదితలలు. అట్టి వానిని నరికి నరికి అహంకృతిని హరించి బ్రహ్మాస్త్రమను బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రాజస రావణ ప్రాణ హరణ మొనర్చును. అంతట మహితయగు నానందవృత్తి మౌనవహ్ని ప్రత్యుప్త శుద్ధవృత్తియై తోపగా, స్వీకరించి తనకు జనకుడగు బ్రహ్మరూపుని దశరథత్వమున వీక్షించి మోక్షపురి నయోధ్యను జేరయును.

పట్టాభిషేకమునెనయుట యనగా జీవత్వము నివర్తించి బ్రహ్మభావమున కొలువుండుట

ఇవి యంతయు నిట్టులుండ ననంతరంబ యధ్యానందవృత్తిని స్వభావ మున వదలి యదియు లోకములోగొను మోదప్రమోదముల గని కృతార్థకాగ, తనతో డిదయౌ నహంభావము లవణనామకమగు దుర్విషయము నిర్విషయము నొనర్చి

యెసగ, బంగారు సీతయను నిశ్చలానందము సహకారమొనర్ప నశ్వమేధమను మనో యజ్ఞము మార్గమున నమనస్కత్వము సిద్ధింపగా, మోదప్రమోదములు లోకమున నిలిపి తన వైరాగ్యముకూడ తమ్ము విడిచి ముందర కృతార్థత్వము చెందగ, తానుకూడ సర్వ సమాహారము నిర్వర్తించి నిర్వికల్ప నిరాబాధ నిత్యసత్య పరిపూర్ణ సచ్చిదానంద ఘన త్వమున స్వప్రకాశంబగుటయే యుత్తరకాండాంత కథాక్రమంబుగా నూహింపనగును.

ఇంత యంతరర్థము నీశ్వరుడు చెప్పగా విని యా యధీశ్వరి దయితతమా ! యట్లయిన నీవర్ణించిన రామాయణంబెల్ల నహతపూర్వంబు కదా ! యని తలపంకింప నయ్యీశ్వరుండును కారణత్వమున అండాండరూపమున బీజాంతర్గత ద్రుమంబువలె భాసించిన పదార్థము సూక్ష్మత్వమున పిండాండానుగతమున వృక్షగత ప్రసవమువలె వెలసి స్థూలప్రతీకమగు బ్రహ్మాండమున వికాస మహత్త్వములతో నింద్రియ గోచర మగునని సూక్ష్మ స్థూలసృష్టి ప్రపంచ తన్మయతా తారతమ్యములను బరికి యంత టితో నాగక భగవంతుని చరితములలోఁ దత్త్వమునకు సమన్వయింపని యితివృత్త ముండదనియు నొక్కొకచో నట్టి తత్త్వసంప్రదాయముల ధ్వనింపఁజేయు నెడలప్రకృత ప్రధాన కథాస్రవంతిలో భంగ రంగములేర్పడినను నర్థరహితముగ భావింప రాదనియు ముగించును.

మూలరామాయణములలో నధ్యాత్మ రామాయణమొకటి. ఇది విశ్వామిత్రో పజ్ఞము. ఇది బ్రహ్మాండపురాణాంతర్గతమన్న ప్రతీతిగూడ ప్రసిద్ధముగనే కలదు. ఏది ఏమైన నధ్యాత్మ రామాయణ మన్నది యాధ్యాత్మిక తత్త్వసంవిధానముల సమ్య గ్వివరణముగాఁబార్వతీపరమేశ్వర సంవాద రూపముగ వెలసినదనుట నిర్వివాదము.

శ్రీరామకథాఽమృతగ్రంథకర్తలు కథాసంవిధానమున నీమెలపును మెలకు వగా గుర్తించి యుంట ననువాదమునఁగూడ వక్తృపరంపరలో పరమేశ్వరునిఁగూడ చేర్చిరి. ఇటువంటి చేర్పులు అనువాదకుని ప్రతిభకు మాత్రమేకాక అనువాద్య బహు గ్రంథతాత్పర్యైకవాక్యతా పర్యవసాయి ప్రబంధనిర్వాహ దక్షతకుఁగూడ తార్కా ణములు.

అంతియగాక, భట్టబాణ, కుమారబాణు లేమోకాని, ఈ రామకథాఽమృత కవి కుమార కవులు మాత్రము గ్రంథ నిర్వాహ ప్రక్రియలో కూడబలికికొన్న సూచన లేమియులేవు. శ్రీ వేంకటప్పయ్య శాస్త్రిగారు తమ చివర గడియలలో వెల్లడించిన

తుదికోరిక తాము ప్రారంభించి 18000 పద్యగద్యములతో గాయత్రీ వర్ణాంకములతో సాగించిన కథాఽమృతము తక్కుంగల 6000 పద్యగద్యములతోఁదనకుమారుఁడే పూరింప వలయు ననుట. అన్న వెంటనే ఒండు రెండు అభిప్రాయములు కలిగినను, పితృపాదుల యాజ్ఞ శిరోధార్యగా భావించి, కవి కుమారు లీయమృత సాధన కార్య సర్వతంత్రమునకుఁబూనుకొనె నన్నది ప్రాస్తావికముగా వారుద్ఘాటించిన విషయమే. ఈ సందర్భమున పితాపుత్రుల మధ్య మరికొంత వాకోవాక్యము నడిచినది.

అందు కొంత యేమన? నీ కుమార కవులు తండ్రిగారితో "మీ యాశయా జ్ఞల కనుగుణముగా నేను శేషపురాణము గావింతును సరే; మీరచనా సముద్దేశ మేమియో నాకెట్లు బోధపడగలదు ? నా రీతి వేరొక రీతి యగునేమో ? అని ప్రశ్నిం చిరి. అందులకు తండ్రిగారు నీకు నా రామాయణమున నేవియేని సంశయములు పొడ సూపినవా ? అని యెదురు ప్రశ్నవైచిరి. అంత నీకుమారులు కాకాసుర వృత్తాంత ముల్లేఖించి 'కాకిపై బ్రహ్మాస్త్రమును బ్రయోగించుటలోఁగల యవకరమును, సామం జస్యమును గూర్చి ప్రశ్నముదయించినది.' అని పలికిరి. అందులకు నీకెట్టి యాలోచన పొడమిన దని పితృపాదులు ప్రశ్నింపఁగా తాను సమాధానించు కొనిన సమన్వయమును సూచించిరి. అది విన్న తండ్రిగారు పరమానంద సంభరితులై వంశోద్ధారకు నభినం దించి యీ శేషపూరణము చేయగలవాఁడవేగాక, చేయఁదగినవాఁడవుకూడ నీవేయని నమ్మికతో ననిరి. ఇంతకు మించి గ్రంథ నిర్వాహమున వారానుపానులు నిబంధించు కొన్న దాఖలాలు లేవు.

కావ్య విశ్వశ్రేయః పరమార్థ సమాలోచనమున నిరువురి చిత్త సంస్కా రము లేక రూపము లగుటయు, సర్వ పురాణేతిహాసాది సంగత కథా సామాగ్రికి నద్వైత తత్త్వైక వాక్యతా సమన్వయ జ్ఞానమే శ్రుత్యంత గోచరమైన విశ్వశ్శ్రేయ స్సుగా భావించుట ఆ సంస్కారములో నంతర్భూత మగుటయు కారణముగా నీ రచనా శరీరమున సాముద్రిక సర్వముద్రా లక్షణములకు వైలక్షణ్యము గోచరింపక దీర్చిదిద్దిన బాహ్యాంతస్సౌందర్య సుషమా వికాసము అతారతమ్య రమ్యముగాఁ బ్రకాశించినది.

ఈ శ్రీరామకథాఽమృతమున నాద్యంతము శివుఁడు పార్వతిని సంబో ధించిన పదములు పరిశీలించిన నవ్వి సందర్భశుద్ధితో కథా సన్నివేశ సౌందర్య ప్రరో చకము లగుట కవి వ్యాపార సాధారణములు కాఁగా నంతకుమించి యవియన్నియుఁ

బునరుక్తములఁ దొలగించి కేవల సంస్కృత పదముల నేర్చి, కూర్చిన పరస్సహస్ర పరమేశ్వరీ నామధేయములై పరికల్పిత పద సంపత్ పరమార్థపర సమన్వయోత్తర పరిచర్యాను గుణ రూప ధేయములై తత్పారాయణ పరాయణ భాగధేయములై విలసిల్లు చున్నవి.

పితా పుత్ర కవు లిర్వురు శాంకరాద్వైత సిద్ధాంత విశ్రాంతు లగుట యా సంస్కారములో మరొకభాగము. క్రాంత దర్శిత్వమున ఋషి భావము నెనసి 'కవీనాం కవి' యనఁదగిన కవికి పరంపరిత పరాది పర్యనుయుక్త యగు వాగ్వైఖరికి తదర్థ సమవేతకు వివర్త రూపమగు కావ్య మనఁదగు స్థూలరూపమునఁ గోచరించు వాగర్థ సమాహారమును సంకేతితయు, లక్షితయు నగు శక్తితోఁ, గొండొకచో వ్యక్తితో, నాకాంక్షా తావుల నంతకు మించిన చురుకైన ప్రసక్తితో నంతస్తాత్పర్య పర్యాలోచనమునకు శంపాళత సంపాత తళత్తళలతో వలె దారి చూపించుచు, చూపించుచు, నిరూపింప నలవికానిచోట రూపించుట కారోపించుచు ననువర్తింపఁ జేసి అర్థ వాగ్వైఖరుల క్రమానులాపనమున మధ్యమలో, పశ్యంతిలో పరలో, పరాపరలో, పర్యనుయోగమున ననుసంధానించి, సంవిదానంద భూయస్త్వమున ననుభూతియే తానుగాఁ బ్రకాశించుటయు, నదియే సర్వవాఙ్మయము పరతత్త్వ నివేదితముగా సంభావిత మగునన్న భావనయు కవితా చారితార్థ్యమునఁ బరాకాష్ఠ. పూర్వ మనేకులు కవులు, విద్వత్కవులు, కవికోవిదులు, పలువిధముల నీ యర్థములను సమర్థించుచు సగుణము నూతగాఁగొని నిర్గుణ తత్త్వము నుపశ్లోకించి వాగ్వరివశ్యల నొనరింప నీ యమృతాను వాదకులు సకల సగుణ, సత్త్వ సమాహార సాక్షియై, సకల కారణమై మనోవాగతీతమైన పరతత్వము నెడ నీ కృతి నంకితఁ జేసి సత్కృతి యొనర్చుటయు నా సంస్కారము ఫలమే. కవి కుమారులు కూడ నీ మార్గముననే ప్రయాణముచేసి "శ్రీరామకథాఽమృతార్థము' పితృపాదులతోఁ బరతత్త్వమందు నిడగంటి" నని తన సమాధినిఁ బ్రకటించిరి. పైవాక్యములో అర్థశబ్దము, 'పితృపాదులతో' నన్న తృతీయ, పరతత్త్వ మందను సప్తమి, 'ఇడ' నన్న అసమాపక క్రియా, కంటి నను క్రియాపదము ప్రత్యేక వ్యాఖ్యా సాపేక్షములై పరస్పర సమన్వయ సంవాదముతో నీ వెనుకఁ జెప్పిన విషయముల నన్నింటిని స్పృశించి, స్ఫురించుచున్నవి.

సాధారణముగ నే ప్రబంధ కర్తయైనను తన ప్రబంధమును ఎవ్వనికి అంకితము సేయనెంచునో అతని వంశ క్రమాను వర్ణనము ఆయా వైయక్తిక

విశేషములఁ బేర్కొనుటయుఁ జివరకు 'ఏవం విధ గుణనిధికిన్' అనియో మఱొక మాటతోనో షష్ఠ్యంతములు పలికి ఆతని కంకితంబుగా నీ యొనర్పం బూనిన మహా ప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన వంటి వరవడితో కథా ప్రారంభము గావించుట పరిపాటి. ఇట్టి పాటిని కొందఱు పాటింపక తమ ఇచ్ఛ వచ్చిన ఫక్కిక నాశ్రయిం చుటయుఁ గలదు. మఱి ప్రకృత ప్రబంధ కర్తయగు శ్రీ వేంకటప్పయ శాస్త్రిగారు ఇటువంటి సరిక్రొత్త రీతిలో నా మర్యాదను వెలయించినారు. అందులో స్థిరప్రజ్ఞులకు గోచరించు విశేష మిక్కడ ప్రస్తావించ వలసిన అవసరము వచ్చినది.

కృతిపతినో తద్వంశ్యుఁ డగు ముఖ్యునో వర్ణింపవలసి వచ్చినప్పుడు ఏది యే నొక పెద్దవృత్తమును, అందునా సీసమును స్వీకరించి పై పాదములలో యచ్ఛ బ్దముతో తత్తద్గుణ విశేషముల ననుబంధించి చివరకు తచ్ఛబ్ద పరామర్శమున ముగింపు గొనివచ్చుట ఆ పరిపాటిలో నొకపాటి. ఇందుకూడా ఆ పాటిని అనుసరించినట్లయి నను, అనుకరించి నట్లు కాకుండ కూర్చిరి. వీరు నొక సీసపద్యములో పై పాదము యచ్ఛబ్దార్థమున పరామర్శించిరి. 'ఒక్కొక్క పాదములో, పరతత్త్వ బోధకము లగు శ్రుతివాక్యముల ననువదించి కుదించిన వైఖరి అది యెఱిఁగిన వారికే యెఱుక. అంతేకాక తచ్ఛబ్ద ప్రయోగానంతరము తత్పరామృష్ట ప్రతిపాద్య బ్రహ్మవస్తువును ద్వితీయా విభక్తి లోగొనుట రమణీయ మగు విషయము. ఇందు రెండసమాపక క్రియలు గలవు. ఒకటి చింతార్థమగు ధ్యై ధాతువు నుండి పుట్టిన ధ్యాన శబ్దము మీద ఇంచుగాగమము వచ్చినరూపము. రెండవది దేశ్యమగుమించు ధాతువుపైరూపము. వీనిలో మొదటిది సకర్మకము. సకర్మక మనఁగా నైకాంతిక సకర్మకము కాదు. వివక్షాధీన కర్మకము. రెండవది సర్వోత్కృష్టతా ప్రతిపాదకమే గావున అకర్మకము. ఇట్లు రెండసమాపక క్రియలు, తర్వాత ప్రయోగించిన సమర్పణ క్రియకు పూర్వకాలీన ములు. ఈ మూడు క్రియలు, ధ్యాన ధారణ సమాధి క్రియలకు ప్రతీకలుగా సమన్వ యించుకొన్నప్పుడు, ఆ రమణీయత యిట్లుండును. కొన్ని క్రియల సొగసే అట్టిది. ముందు ధ్యానక్రియను పరిశీలించినచో చింతారూప వ్యాపారాశ్రయుఁడు కర్తయై పరఁగ తత్ఫలాశ్రయము కర్మ యగుట కారక సంప్రదాయము. ఇందు చింతారూప వ్యాపారమునకు ఫలము తద్విషయీ భావము. అట్లు కర్మ విభక్తిగా పరతత్త్వమును సంభావించునెడ కర్తకు నీప్సితతమమైనది కర్మ కావలయును గాన పరబ్రహ్మ మీప్సితతమము. "అయమాత్మా పరంబ్రహ్మ పరప్రేమా స్పదం యతః" "ఆత్మా న్యాత్మాన మను సందధాతి" మున్నగు వచనముల ప్రకారము పరమానంద రూపమగు

బ్రహ్మయే తానని అనుసంధానించుకొనుట ధ్యానించియున్న అసమాపకక్రియ కర్థము. ఈ యర్థమున ఇచ్చట కర్తృ, కర్మ వాచక పరామృష్టములైన 'అహంబ్రహ్మాస్మి' అను మహావాక్యమునందలి "అహం, బ్రహ్మములఐక్యము ధ్వనించు చున్నది. ధ్యానించి అన్నక్రియలోని సకర్మకత క్రమికముగా పరిణతమై మించియన్న క్రియలో అకర్మకతగా గోచరించు చున్నది. ఇయ్యది నైష్కర్మ్యమునకు సూచిక. ఈ నిధ్యానస్థితిపిమ్మట తద్ధ్యానధారా ధారణమున'కర్తృత్వకర్మ త్వాద్యాపలాపపూర్వక సమైకాత్మ్యానుభూతిసర్వోత్కృష్టమై "మించి"యను అసమాపకక్రియచే బరామర్శింపబడుచున్నది. అటుతర్వాత 'తత్సమర్పితముగా' అన్న సమాసము ప్రయోగించుట పరమరమణీయమగు నంశము అదే మనం, ప్రపంచమున కర్తృత్వ, భోక్తృత్వాది గుణములు కల్పితములు కాఁగా తదతీతాఖండ చిద్రూపము ఏ తత్సకల మాయా వ్యవహారాధిష్టానము. అదియే ఈ సమాసమున తచ్ఛబ్దముచే గ్రహింపఁబడినది. ఆ తచ్ఛబ్దముతో, సమర్పితశబ్దము సమాసమునందవలెనన్న అధికారణార్థమున అందునా అభినవ్యాపకతారూపధర్మమున సామర్థ్యమును బురస్కరించికొని సప్తమ్యంతముతో సమసింపవలెను.

అందుమీద ఆ పరబ్రహ్మమునందు మనోబుద్ధి చిత్తాహంకార వ్యాపారముల లగింపఁజేయుటయే సమర్పించుటగా స్ఫురించును. ఈ కృతి సమర్పణముయొక్క పరమార్థియగు ఆకృతియే అట్టిది. ఈ సమాసమునందలి తచ్ఛబ్దగత సప్తమీవిభక్తి స్వారస్యమే, ఈ కవికుమారుని, వాక్యమునఁగలపరతత్త్వమందు అన్న 'సప్తమిస్వారస్యమని గుఱుతించిన అదియే మనస్సునకొక అపూర్వమైన చమత్కారము.

ఈ రామకథామృతమున నెన్నియో పతాకలు ప్రకరికలు కలవు. శాంతా ఋష్యశృంగులకథ, గంగావతరణము, అహల్య, వేదవతి స్వయంప్రభ మొదలగు నవాంతరకథలు, శ్రీరామజననము, యాగరక్షణము, మైథిలీ పరిణయము, పరశురామ విజయము, వనప్రయాణము, గుహ సమాగమము, పంచవటి, సీతాపహరణము, శబరి, వాలికథ, హనుమంతుని సీతాసందర్శనము, సేతుబంధము, విభీషణ శరణాగతి, అగ్ని ప్రవేశము మొదలైన సన్నివేశములెన్నియో కలవు. వీటిని యెక్కడికక్కడతగినట్లు రమణీయముగ చొప్పించి చెప్పుటయొక యెత్తుకాఁగా, వీటికిఁగల ప్రయోజనములను కథాదృష్టితోఁగాక, కథం? దృష్టితో నింకొక కోణమునుండి పరిశీలించినప్పుడు ఆధ్యాత్మిక తత్త్వరహస్యములేగాక షడ్దర్శన సంప్రదాయములఁ గూడ ననుస్యూతములగునట్లు కొండొకచోనభిధకే పట్టము గట్టియు, నింకొకచో నలంకారముల వినియోగించుకొనియు,

వేతొకచో ధ్వనింపఁజేసియు. నిబంధించుట వేతొకయెత్తు. ఇంతటి జగత్ప్రసిద్ధయుగేతి హాసమునకొన్ని సన్నివేశములయెడను, కొన్ని పాత్రలయెడను, కొన్ని కథలయెడలను, భిన్నభిన్నములగు నభిప్రాయములు, సంశయములు, అనౌచిత్య అసామంజస్యాది వక్రోహలు, పొడముచుండుటకాలదోషములలో నొకటి. అట్టి యెడ వానిని ఖడించి అసలైన యంశమును ప్రతిపాదించి, అసంశయముగా నీ పరమార్థరూపమును నిరంతర ము గా నముద్దీపింపఁజేయుటకూడ ఈ గ్రంథరచయితల సంస్కారములోనంతర్భాగమే. ఆ యా కథలవద్ద, ఆ యా సన్నివేశములవద్ద, చెప్పవలసినంతచెప్పినను తనివితీరక పాఠకులు గమనింపరేమోయనినట్లు, వీలుకల్గినప్పుడెల్ల, వీలు కలిగినచోటులనెల్ల, నిట్టి చిరువివ్వెలు వెలిగించినారు. ఇటనింకొక కవిహృదయముగూడకలదు.

భారత సంహితలో నొక్క గమ్మత్తు జరిగినది. త్రిపురాసురవృత్తాంతము ఆ సంహితలోమూడు పర్యాయములు ప్రస్తావింపఁబడినది. మూడు పర్యాయములు గూడ, త్రిపురాసురులు ప్రపంచమును బాధించినారు. మూడు పర్యాయములకూడ దేవ తలందఱు నీశ్వరుని శరణువేడినారు. మూడు పర్యాయములుగూడ, శివుఁడు త్రిపురా సురులను సంహరించినాఁడు. స్థూలముగ నిదియేకథ. ఈసాటికతను మూడుపర్యాయ ములు పునరుక్తము సేయనేల ? అని విచికిత్సకల్గినవాఁడు తత్తత్కథాభాగములను సునిశితముగ పరిశీలించినప్పుడొక్క పరమార్థ రహస్యమునుస్ఫురించును. వారు త్రిపురా సురులు. వారికట్టపేరు పెట్టుటలోనే సృష్టిచమత్కృతి ఇమిడియున్నది.

పురమనఁగా శరీరము. త్రిపురము లనఁగా స్థూల సూక్ష్మ కారణ శరీరములు: ఈ శరీరమునందలి అసురులు శారీరకముగ వ్యాధిపీడాదికములు- ఇంకమానసికముగ షడ్వర్గములు, కారణమున నజ్ఞానము. ఈవిధముగ త్రిపురాసురులు బాధింప నీయార్తిని పోకార్పఁజాలినవాడు పశుపతియొక్కఁడే. ఆతనిని కర్మమార్గమున నుపాసింప నా రుద్రుఁడు స్థూలశరీరమునకు, సంబంధించిన జన్మ జరా రోగాది ప్రతిబంధక పరిపంథు లగు నసురులను నశింపఁజేయును. అంతట శరీరము శుద్ధమై సాధకుఁడు యోగ్యతకల్గి యుండును. అట్టి యెడ మరల నయ్యసురులు, అనఁగా కామక్రోధాదులు పీడపెట్టు చుండును. అట్టిచో నుపాసనామార్గమున నీశానుని శరణుపొంద నాతఁడు ఆయసురు లఁబరిమార్చి జీవుని జ్ఞానమార్గ సన్నిహితుని చేయును. అప్పుడుకూడ మూలాజ్ఞానా వరణరూపులగు నయ్యసురులు తుదిముట్టనీయక వేధింపగా, దిక్కుఁదోచని ఉపాస కుఁడు సదాశివతత్త్వమును సేవింప నాతండును మూలాజ్ఞానభేదము నొనర్చి కైవల్యము

వెలయించును, అంతటితో త్రిపురాసురులు నమసిరి. ఈ సంవిధానమట్లుండ నసలు మొట్టమొదటి నుండియే ఒకటవ పురమువారు రెండవ పురమువారు, మూడవపురము వారు అని హస్తామలకముగ వివరింపక త్రిపురాసురులని పేర్కొనుటచే "పరోక్ష ప్రియా ఇవహిదేవాః" అనునది మఱొక్కసారి గుర్తుకువచ్చును. ఈ విధముగ నీ త్రిపురాసురసంహార వృత్తాంతమును సమన్వయించుకొనవలెనని వ్యాసభగవానుని యాశయము. అందులకీ వృత్తాంతమును మూర్మారు పేర్కొని దీనియావశ్యకతను. పరమార్థకథను సూచించుటలో నాతఁడు కృతకృత్యుఁడైనాఁడు ఇట్లే వాల్మీకియు, తన రామాయణమున నహల్యా వృత్తాంతము రెండుమార్లు ప్రస్తావించెను. ఈ గాథకు సంబంధించి అహల్యా పురందరుల విషయమున నిప్పటిలోకమున ననేకములు దురభి ప్రాయములుకలవు. అట్టిచో వాటిని సరియైన సమాధానములతో రూపుమాపుట ఈ పునరుక్తికి ప్రయోజనము, ఇందు మొదటికథను విశ్వామిత్రునిచేత రామునకుఁజెప్పిం చును. రెండవకథను బ్రహ్మచే నింద్రునకు గుర్తుచేయించును. ఒక్కటి బాలకాండము నందు మఱియొక్కటి ఉత్తరకాండమునందు నున్నవి. ఈ రెండుచోటులయందు అను వాదకర్తలు శ్రుతివాక్యములనుగూడ ననుసంధానించుకొని సమన్వయపరచుకొనుటకు తగిన రీతిగా తీర్చినారు. ఇంద్రపదవిసామాన్యమైనదికాదు. ఇంద్రుఁడగు వాఁడిచంద్రష్ట కావలయును. ఇంద్ర ఇత్యాచక్షతేపరోక్షేణ" అన్న శ్రుతి ఈయంశమును రూఢిచేయు చున్నది. అట్టివాఁడు సర్వలోకపాలనమున నవహితుఁడై యుండనగును. మనము ఒక కథను చదువుచుందుము. ఆ కథను మొదటినుండియు నుపక్రమింపవలయును, చిట్ట చివరిదాక చదువవలయును. అప్పుడే యా కథలోని యానుపాను లన్నియు తెలియును. కథను స్థాలీపులాకముగఁజదువరాదు. ఇప్పటివారు కొందఱు అట్లుకాక ఏదియోనొక ఘట్టము మాత్రము చదివి తావన్మాత్రాధిజ్ఞాత సర్వజ్ఞతా ప్రతిజ్ఞా భారబంభ్రమ్య మాణ మానసులై విమర్శలకు దొరకొందురు. అసలీ గౌతముఁడు మహర్షి. మహర్షి యన్న మాట తపస్సంపన్నతకు పరమావధి. అంతటివాఁడుకూడ యొకసారి అహంకార సాతత్యమున రాజసప్రకృతితో నొక మహాతపము ప్రారంభించినాఁడు. మనవంటి వారము రాజస తపము చేసినచో నది మననే దహింపవచ్చును. కాని అట్టివాఁడొనర్చు రాజసతపము లోకములను దహించు పైపరీత్యమునకు నెలవై పితృలోకముల బాధించి నది. ఆ తపమును నిరోధించుట బ్రహ్మాదులవలనకూడ సాధ్యముకాలేదు. ఆతని తపో మహిమము బలహీనము కావలయును. తపము బలహీనము కావలయునన్న నియమ భంగమువలననే తప్ప మఱొక విధముగాకాదు. ఆ మహర్షి కఠోర నియమము

భంజించుటకు ప్రధానముగ కామక్రోధములలో నేదేని ప్రకోపముఁజెందవలయును. అట్టి మూపుతో బ్రహ్మ జగదేక సౌందర్యధుర్యయగు నహల్యను సృజించినాఁడు. ఆమె యందమునకు సమ్మోహితులైన ఋషి, దేవ, దానవ ప్రముఖులు బ్రహ్మను యాచించియు విఫలులైనారు. గౌతముఁడు కూడ మనసువడునేమోయని యెదురుచూచి, యెదురుచూచి చివరకు నా బ్రహ్మ తనంతట తానే యామెను వెంటనిడుకొని గౌతమాశ్రమమునకు వచ్చి కొంతకాలమచట యామెను న్యాసముగా నుంచిపోయినాఁడు. ఆమె సన్నిధానముననుండి శుశ్రూష లొనర్చుచున్నను, గౌతముని మనస్సు చలింపలేదు. నియమము సడలలేదు. ఇఁక నిది కాదని బ్రహ్మదేవుఁడు మఱలవచ్చి గౌతమునితో నింతకాలము నీవద్దనున్న యీయామెను లోకమున నెవ్వఁడు పరిగ్రహించును. నీవే యీయామెను వివాహముచేసుకొమ్మనియంటఁగట్టి పోయినాఁడు. అప్పటికిని గౌతముఁడు ఆమె రూపరేఖావిలాస సపర్యా పర్యాయములకు భ్రమయక గార్హస్థ్య నియమములఁ బాటించుచున సివారాత్రవ్రతమునఁదపము నకుఁబురిపెట్టుచుండెను. ఇఁకనీతఁడుకామమునకు లొంగఁడన్నది తెలిసిపోయినది. ఇఁక నెవ్వరు నేమియుజేయసాహసింపరైరి అట్టిచోఁ విశ్వలోకసంరక్షణము ఇంద్రునకు తప్పనిసరియై యాతనికిఁగ్రోధముఁ గల్పించి తాను తిట్లు తినినైనను ఆతనికి తపోదౌర్బల్యముఁగలిగింప సమకట్టినాఁడు. కోడియైవచ్చి అకాలమునకూసి గౌతముఁడు స్నానార్థమేగగా లోనికిఁబ్రవేశించి యహల్యను ధర్షించినాఁడు గౌతముని వేషమున నహల్యకు గోచరించియు, ఆ తపో నిధి నియమ భంగాభినివేశమున ప్రవృత్త మన్మథ రోజుచునున్న యాతని యసహజత్వమునుగాంచియామె శంకించి ప్రశ్నించినది. నేనింద్రుఁడనన్నాఁడు. నీకిది తగునా ? గౌతముఁడు కోపించిన మన యిరువురి బ్రతుకులు ఏమగునో యోచించితివా ? అని అన్నది. తావన్మాత్రచిత్త వైక్లబ్యము తత్పత్నికిఁగల్గిన నది కొంత తపోలోపమునకు సాధనమగునని గుణించుకొన్నాఁడు. ఇంతలో గౌతముఁడు మఱలి యాశ్రమద్వారము సమీపించెను. ఇంద్రుని వ్యక్తిత్వము, చేతకానితనము ఇక్కడఁజూడవలయును. అంతటితోనింద్రుఁడు అదృశ్యుఁడై పోవచ్చును. అట్లు పోయినచో గౌతముఁడు ఈ జరిగినదానికి కారణమును దివ్యదృష్టితోఁబరికించినచో నిది తన తపోభంగముకొఱకు పన్నిన పన్నాగమని తెలిసెనా ? ఇఁకక్రోధముఁగూడ నాతని నేమియుఁజేయఁజాలదు. అందుచేత అతనికి యథార్థదర్శనమున కవకాశమీయరాదు. గౌతమ రూపముననున్న ఇంద్రుఁడు కుటీరద్వారమువెడలి గౌతమునకెదురుగ నిలఁబడి యింద్రరూపమును దాల్చెను. ఇఁక గౌతమునకుఁగనుల ముందు గనపడుచున్నదానికి ఆలోచనతోఁబనిలేకపోయినది. ఇంద్రుఁడు మోసముచేసి

తనను బయటకుఁబంపి తన పత్నినిఁజెనకసంకించుచున్నాఁడని తలఁచి కోపోద్దీపితుఁడై నోటికివచ్చినయట్లు శాపములు పెట్టినాఁడు. ఇంద్రుఁడంతటి వానిని శపించుటకు ఒక్కొక్క శాపమునకు నెంతెంత తప స్సంభారప్రాగ్భారమోవ్యయమగును. ఆతని తిట్లన్నియు హృదయపూర్వకముగా నంగీకరించి యాతని రాజసతపమును నిర్వీర్య మొనర్చి, వెడలిపోయినాఁడు. అహల్యనుగూడ శిలాశాసనముఁజేసినాఁడు. ఆమె కాళ్ళ వ్రేళ్ళఁబడి మొత్తుకొనఁగా నప్పటికి దివ్యదృష్టితోఁ బరికించినాఁడు. ఏమి లాభము ? అప్పటికే జరుగవలసినది జరిగిపోయినది. ఆమె కేదో శాపావసానమునను గ్రహించి నాఁడు అది తరువాతి కథ.

ఇంద్రుఁడు చేసిన యీ సాహసమునఁ బితృలోకములు రక్షింపఁబడినవి. ఇంద్రుని యింద్రత్వ మిట్టిది. ఇంద్రుఁడు నిజముగ నిట్టి దుర్వ్యసనియే యైనచో నింత జరిగిన తర్వాత మరల స్వారాజ్యపీఠము నధిష్ఠించునా ? అధిష్ఠించి యెల్లర రావించి సమాలోచనము జరిపి ఆ శాపములలోఁ గొన్నిటి ననుభవించియుఁ, గొన్ని టికి పరిష్కారము లొనర్చికొనియు బైటపడినాఁడు. వేదస్తుత్యుఁడై నెగడినాఁడు. ఇందుఁగల పరమార్థమును జదువరులు గ్రహింపవలయును, వెనుకకు తిరిగి యాలో చింప వలయు నను తలంపుతోఁ, దగిన వివరణములతో నీ వృత్తాంతము రెండుమార్లు పరామర్శింపఁ పడినది. ఈ వృత్తాంతమును రెండుచోటుల ననువదించిన పితాపుత్ర కవులు ప్రోడిమ వీడకుండ నౌచిత్యమునకు భంగము గల్గకుండ కథారహస్య సంసూచన మునకుఁ గడఁగి కృతకృత్యులైనారు. ప్రతి సన్నివేశము నెడనిట్టివి, ఇంక నట్టివి యూహింపఁదగును.

ఈ పితాపుత్ర కవు లిరువురి సంస్కారాభిరూప్యమునఁ గానవచ్చు మహిత గుణ మింకొక్కటి కలదు. అనువాదముగాఁ గాని, స్వతంత్రముగఁ గాని వర్ణనములు సేయు నెడల యందు ప్రతిపాదింపఁబడిన యంశములు ప్రస్తుత కథాం శాను బంధము లగుటయేగాక నైక విద్యా రహస్య స్ఫోరకము లగుట. ఇట్టి సంస్కార సారూప్యముఁగల వీరి శైలీపాక పరిపాకమునుగూర్చి యించుక గమనింపఁ దగును. మైథిలీ పరిణయ కావ్య వ్యాహార భవ్యులై గజ్జకట్టిన వేంకటప్పయ్యశాస్త్రి గారి శైలి ప్రసక్తానుషంగముగ తర్వాతి రామాయణము నంతను సవిస్తరముగ ననువదింపఁ దొరకొనిన పిమ్మట ప్రౌఢిమను వీడకయ శబ్దసారళ్యము నభిలషించి ప్రావృట్ స్రోతస్విని, శరన్నదియైనట్లు స్థిమిత గంభీర ప్రసారయైనది. పాకము నారికేళమే యైనను ప్రథమ దశలో ముదురు కొబ్బరివలె చర్వణమున రసార్ణవమై,

తర్వాత యించుక లేతకొబ్బరి చందాన నాస్వాద సౌలభ్యమున నమరినది. కవి
కుమారుని శైలియు దదనుస్యూతముగఁ బ్రవహించుచు నిర్ఝరిణీ, తటిని యైనట్లు
కలివిడిఁ గొన్నది. ఇది సింహావలోకనము. డేగచూపుతోఁ జూచునప్పుడు వీరి
శైలీ ద్వయము గిరిశృంగమునకు నిరు క్రేవల నుండి జాలువారు వారి పూరముంబలె
క్రమైక్యము గాంచి యవిభేద్యంబుగా, స్వసంవేద్య మయినది. ఇక్కడ నీ మాటలు
చాలవు. ఇంకను జెప్పవలయును. బాలకాండమున పదబంధ ప్రౌఢిమ, పరుషత్వ
మనుకొనిన పొరపాటు. భావగౌరవము పడుగుపేకలై సాగినవి. రానురాను
తర్వాతికాండములలో పద ప్రౌఢిమ కల్గి, పదబంధము సారళ్యము నాశ్రయించి భావ
వైశద్యమున ప్రసన్న గంభీరముగ నడచినది. ఈ రెండు సంఘటనలకు (శైలి)
అడవితేనెకు నింటి తేనెకుఁ గల స్వాదభేదమున్నది. బాలకాండమున పదముల
పోహళింపు చాటునఁ గల యర్థ సంపద ఆ సారధారా పరిస్ఫురత్ శేఫాలిక కాఁగా
తర్వాతి కాండముల పదముల అల్లికలోని యర్థ సౌందర్యము మంచుతెరలలోని
మందారమైనది. కవికుమారుని రచనలో పదము లలతి, యలతిగాఁ దోచినను ప్రతి
పదము వెనుక నొక యర్థ గౌరవము, ప్రతిపద్యము వెనుక నొక భావ ప్రౌఢిమ గోచ
రించును. మల్లె, జాజి, మాలతి మున్నగు వివిధ పుష్పములను గుప్పిటబట్టి యొక్క
సారి వాసనజూచిన యనుభూతి కల్గను. ఈ శైలి త్రిపథగ కాదుకాని త్రివేణియైనది.
ఒకట కదంబపరిమళమిళిత వర్షాసమయ ప్రభంజనము, మఱొక్కట చూతామోద ఘుమం
ఘుమిత వాసంతిక శ్వసనము, నింకొకట నవారవింద గంధ కషాయిత ప్రాభాతికమాతరి
శ్వాశ్వాసనము నూహించినవారికి ఈ త్రివేణి యంతర్వాణియై హృదయంగమ
యగును. పటికబెల్లము తియ్యగ నుండును. పటికబెల్లము పొడిచేసినచో నయ్యె
దియు తియ్యనిదియే. పంచదార తియ్యగ నుండును. ఈ మూడింటియందు మధుర
రసానుభూతి యొక్కటియే యైనను, ఆస్వాద్య రూపమునుబట్టి, ఆస్వాదించు పద్ధతిలో
తారతమ్య మున్నది. పై మూడువిధములగు శైలులలో నిట్టి మువ్విధములగు
ఆస్వాదింపవలసిన తనములు నమరి యున్నవి. పిండివంటల లోనికి వచ్చినచో
పంచదారతో బెల్లముతో పాకముచేసి కొన్ని వండెదరు. ఆ పాకములో నించుక
కొంచెము ముదురుపాకమునఁ బడినచో నట్టి యరిశె, మహీశూరపాకము పంట పట్ట
వలసి వచ్చినను, పటుకునతెగి, చిటుకున చిద్రుపలై జలజలమని కరిగిపోవును. ఇంచుక
లేతపాకమున లడ్డూలు కట్టినచో నాలుకపై నుంచికొని ఉంచుకొనక మునుపే విడివడి
విరిసి ఆస్వాదింపఁ బడును. పిమ్మట నించుక నములవలసి కూడఉండును. ఇఁక

మెతక పాకమునఁ బడిన నువ్వు పప్పు అయినటో నమలినకొలది నమిలించి చవు లూరించును. అంతయు నొక్కచే తీపిదైనను, ఆ తీపిలో సమవేతమైన ఆయా దినుసుల కమ్మదనము స్పష్టముగ ననుభూయ మానమగును. అట్లే ఈ పై మూడు శైలులలో నర్థ మంజిమ, భావ మధురిమ యొక్కటైనను రసమును బట్టి, భావమును బట్టి, కథను బట్టి, కథనమునుబట్టి, సన్నివేశమును బట్టి, సంప్రదాయమును బట్టి నడచిన వృత్తులలో రీతులలో వాటి మేళవింపులో కవికిఁ గల శబ్ద ప్రభుత యాధారముగా తీర్చిన తీరులు, దిద్దిన యొద్దికలు కలఁబోసికొని అందించిన విందులో ననుభూతి యొకఁడైనను ఆ యనుభవ స్వాదుత్వమునకు కారణమైన స్వాదపద్ధతిలో ప్రత్యేకతలు దర్శనీయములుగ నున్నవి.

చెప్పఁదలచిన దంతయు నిబంధించుచున్నను, చెప్పవలసిన దంతయు పర్యాప్తానుగతము అగుచున్నదో లేదోయను నాసక్తి ఈ కవి ధీవరులిద్దరిలోఁ గాన వచ్చుచున్నది. "ఉన్నయదియ కవుల కూనోక్తి భీతులకు అతిశయోక్తి వలసి యప్రతిష్ఠ" యని కవి కుమార హృదయము ఎచ్చటనో అక్షర రూపము దాల్చినది.

ఉత్తరకాండమున రామరామ ప్రబంధము ముగింపుకు దగ్గఱ అగుచున్న కొలది కుమార కవిలో నీ తపనయే భావము నాక్రమించినది. అందువలననే మూల మున క్లుప్తముగఁ జేసిన సీతారామ వన విహార వర్ణనమును పెంచి పెద్దచేసిరి. ఆ వెంట మూలమున నస్పృష్టమైనను ఋతువర్ణనమును కల్పించి పెంచిరి. ఇందు వన వర్ణనము సీతారాముల విహారమును కవులు వర్ణించిన తీరు, శుకీశుకముల సరసో క్తులు, క్రాంత దర్శితకు నిదర్శనములై యొప్పుచున్నవి. ఇప్పట్టున గనుపట్టు మేల్మి యోగవిద్యా రహస్య విధానమై, సాంఖ్యతత్త్వ విశేషములకు ఖనియై, అద్వైత తత్త్వ ప్రతిపాదనముల కాకరమై "తెలిసికొన్నవారికి తెలిసికొన్నంత మహాదేవ" అన్నట్లు విషయ బృంహితమై, సంహితమై ప్రకాశించినది ఇందు కవియొక్క హృదయము, ఆత్మీయత, అనుభూతి సాధన సంపత్తి స్పష్టములుగ నున్నవి. ఇంతటి మహా ప్రబంధమును నిబంధించిన, తండ్రియు కుమారులును కారణజన్ములు.

ఈ ప్రబంధము నందలి ఏబదిరెండా శ్వాసములలోని ఆద్యంత పద్యముల నొక్కచో గుది గూర్చి చూచిన నది గురుస్తుతితోఁ బ్రారంభమై సర్వశాస్త్ర తత్త్వ రహస్య సర్వశ్రుత్యంత తాత్పర్య సమాహారరూపమై పితా పుత్ర సంహితగా నొక దర్శన గ్రంథము కాఁగలదు. ఈ యాశ్వాసము లందలి మొదలి, చివరి పద్యములలో

నిక్షేపించిన సప్రమాణములగు రహస్యాంశములు రామాయణాంత రర్థములకు ఉపస్ఫోరకములుగా, ఇంక నక్కడక్కడ చేసిన సంకేతములకు నాకూతములుగా, ఇంక నగస్త్యాదుల నోట పలికించిన రామతత్త్వ రహస్యార్థములకు రమ్య టీకలుగా, వెలయుచున్న వనుట సచేతసులగు సంఖ్యావంతులకు ప్రబోధ దీధితుల బ్రకాశించు విషయము.

ఇంతటి యీ శ్రీరామకథాఽమృతమును నామూలాగ్రము మూలానుసంధానముతోఁ బఠించి తనకుఁ గల ప్రజ్ఞాశీకకు లోఁబడి ఈ సమీక్ష నొనర్చిన మా బావమఱంది చిరంజీవి శ్రీదక్షిణామూర్తిశాస్త్రి ధన్యుఁడైనాఁడు. విషయ వైపుల్యమున సవిస్తరమై సప్రమాణములుగా పేర్కొనబడిన యనేక విషయములఁ బరిపుష్టమై కేవల పరిశోధనా నిబంధ వ్యాసమువలెఁ గాక మూలగ్రంథమునకు నుపబృంహకముగా చదువుకొనఁ దగినది. కఠోరముగఁ బరిశ్రమించి యింతటి సాహిత్య వ్యవసాయ మొనర్చి ఆంధ్రలోకమునకు నీ యుపాయనము సమర్పించిన ఈ చిరంజీవికి పరదేవతానుగ్రహము వలన నైహికాముష్మిక సకల సంపత్పరంపరాభి వృద్ధి యయ్యెడునని దీవించు చున్నాను. నా యీ పలుకులలో నేవేని నెఱసులు, దొరసులు, దొరలిన సహృదయతతో మన్నింప వలసినదిగా రసహృదయులకు మనవిచేయు చున్నాను.

ఇట్లు,

శ్రీరామకథాఽమృత కవికుమార
దౌహిత్రుఁడు
చెఱువు సత్యనారాయణశాస్త్రి

తేః౨౫౮
క్రోధన
కార్తీకపూర్ణిమ



శ్రీ శివాయ గురవే నమః

డాక్టర్ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి,
ఎం. ఏ., పిహెచ్. డి.

రీడరు, తెలుగుశాఖ
ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు
వాల్తేరు.

శారదా పీఠం
46-15-35, పండావారిపేట
విశాఖపట్నం-16.

# పరితోషము

"వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా."

వేదవేద్యుఁడైన పరమపురుషుఁడు రఘురాముఁడుగా నవతరింపఁగా వేదము శ్రీమద్రామాయణముగా ప్రాదుర్భవించినది. వాల్మీకి మహర్షి తద్రామాయణ కర్త.

సమస్త భారతీయ విజ్ఞానమునకు, జీవన విధాన సర్వస్వమునకు వేదము మూలాధారము. ఆ వేద సారము రామాయణముగా వాల్మీకిచే నిబంధింపఁబడుటచే రామచంద్రుని మహత్తర జీవిత విశేషములు పెక్కు కృతులలో అభివర్ణింపఁబడినవి. మహాభారతమందును, వాయు కూర్మ పద్మాది పురాణము లందును ఇంకను అనేక కావ్యము లందును రామకథ సుమనోహరముగ రచింపఁబడుట రామకథా ప్రాశస్త్యమును నిర్ధారించుచున్నది.

శ్రీరామకథా పరమార్థ నిర్ణాయక గ్రంథములలో అధ్యాత్మ రామాయణము అగ్రగణ్యము. దృశ్యాదృశ్యముగ శ్రీమద్రామాయణమున రాముఁడు పరమాత్మ యను విషయము బోధింపఁబడఁగా అధ్యాత్మరామాయణమున రాముని పరతత్త్వము పెక్కుతావులలో విశదపఱుపఁబడి సుస్థాపిత మొనరింపఁ బడినది.

బ్రహ్మ వాల్మీకితో భూతలమున పర్వతములు, నదులు ఎంతకాల ముండునో యంతకాలము రామకథ లోకములందు ప్రచారమున నుండఁగలదని చెప్పినట్లు వాల్మీకమున నిట్లు గలదు :

"యావత్ స్థాస్యంతి గిరయ స్సరితశ్చ మహీతలే
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి."

అది ప్రత్యక్షర సత్యబద్ధమైన వాక్కు. రామకథ ప్రాక్పశ్చిమ సీమలలో బహుళ ప్రచార మొందుచునే యున్నది. భారతీయ దేశభాష లన్నింటను రామకథ బహు చమత్కృతులతో సంగ్రంథింపఁ బడుచున్నది. తెనుఁగున రామాయణాను వాదములు, ననుసరణములును ఋంఖానుపుంఖములుగ నేఁటికిని వెలువడుచున్నవి. అందు రంగనాథ రామాయణము, భాస్కర రామాయణము, మొల్ల రామాయణము, గోపీనాథ రామాయణము, రామాయణ కల్పవృక్షము ప్రముఖములైనవి.

రామాయణాంధ్రీకరణములలో కెల్ల శ్రీరామకథాఽమృతము అత్యంత విశిష్టమైనది. కీ॥ శే॥ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు తద్రచయితలు. వారి పుత్రులైన బ్రహ్మశ్రీ రాఘవ నారాయణశాస్త్రి మహోదయులు ఉత్తరకాండమునఁ గొంతభాగమునకుఁ బూరణకర్తలు. పితాపుత్త్రు లిరువురు మహర్షికల్పులు, వారి జీవితములు ఆర్షము ఆధ్యాత్మిక మయము నైనవి.

రామకథా ప్రధానముగనే పూర్వాంధ్రకవులు రామాయణము ననువదింపఁగా తాడేపల్లి వారు శ్రీమద్రామాయణాధ్యాత్మ రామాయణములు రెంటిని సందర్భసముచితముగా మేళవించి శ్రీరామకథాఽమృతముగ రచించుట అనిదంపూర్వ విశేషము. "చలువగల వెన్నెలకు సౌరభము దలిర్చినట్లున్నది. పార్వతీ పరమేశ్వర సంవాదాత్మకముగ శ్రీరామకథను రచించుటయు అధ్యాత్మ రామాయణానుసరణమే. ఆత్మతత్త్వోద్ఘాటనమున తదనుసరణము ఎల్లయెడల ప్రస్ఫుటముగ గోచరించుచున్నది.

అధ్యాత్మ రామాయణ మందలి తత్త్వబోధక ఘట్టముల ననువదించుటయే గాక స్వతంత్రముగఁ గూడ సమయోచితముగ శ్రీరామకథాఽమృతమున వేదాంత విషయములు రచింపఁబడుట పరమశ్లాఘ్య రమణీయముగా నున్నది.

అట్లే శ్రీరామకథాఽమృతమందలి అవాల్మీకమైన ఆత్మతత్త్వ ప్రతిష్ఠాపనము అత్యంతాభినంద్యము. పుత్తడికిఁ దావి యబ్బుట వంటిది. అందలి యౌచిత్యానౌచిత్యములను ఊహించుటకంటె శ్రీరామకథను, అందలి తత్త్వమునుగూడ గ్రహించి తరించుట శ్రేయోదాయకమని నా యభిప్రాయము.

శ్రీరామకథాఽమృతానువాదకు లిరువురును బహుశాస్త్ర నిష్ణాతులు. సంస్కృతాంధ్ర సాహిత్య మర్మజ్ఞులు. వారు ఈ యనువాదమున ప్రాచీన కావ్యగత మధురభావ బంధుర శ్లోకములను, అనేక శాస్త్ర సంప్రదాయములను సందర్భ సముచితముగ నిక్షేపించినారు. సుప్తిఙ్వచన సంబంధ కారక కృత్తద్ధిత సమాస ప్రయోగము

లందును, వృత్త వైవిధ్య ప్రదర్శనమునను నైకవిధ వర్ణనా విన్యాసములను అనువాదకులు "తన కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదునా" ననల్ప శిల్ప రచనా వైదగ్ధ్యమును అనుత్తమ ప్రతిభాపౌష్కల్యమును ప్రదర్శించుట అత్యంత ప్రశంస్యము. మహాకావ్యమైన రామాయణము వీరిచే ప్రౌఢ ప్రబంధముగ సంతరింపఁబడుట పరమ స్తుత్యము. కవిత్రయమువారి భారతమువోలె, పోతనగారి భాగవతమట్లు వీరి శ్రీరామ కథామృతముగూడఁ బరిణతినిఁ బరిపక్వతను బొందినదని యంగీకరింపక తప్పదు.

కవి కావ్యము రచించును. దాని గుణసంపదను గుర్తించి యా కావ్యమునకు ప్రశస్తి చేకూర్చువాఁడు ఉత్తమ విమర్శకుఁడు. "It is a Critic who makes him a Poet" అని ఆ భాణకము. "వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిః" అని పెద్దల యభిభాషణము. శ్రీరామకథామృత మందలి గుణబాహుళ్యమును గ్రహింపఁ దలపడి కృతకృత్యులైన డాక్టర్ తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి గారు అవశ్యము శ్లాఘనీయులు. గురుకులక్లిష్టులై, సంస్కృతాంధ్ర సాహిత్యముల నధ్యయన మొనరించిన వీరు తెనుఁగులో ఎం. ఏ. పట్టము నొందుట, పరిశోధనము గావించుట, అందును శ్రీరామకథామృత కావ్యసమగ్రాను శీలనమున కుపక్రమించుట అత్యంత ముదావహమైన విషయము. శ్రీరామకథామృత సమీక్షకు సంస్కృతాంధ్ర సాహిత్య వైదుష్యము, ఆత్మజ్ఞాన వైభవము నత్యంతావశ్యకములు. ఈ రెండును శ్రీ దక్షిణామూర్తిశాస్త్రిగారి యందు గలవనుటకు ఈ విమర్శన గ్రంథమే ప్రబల నిదర్శనము.

శ్రీరామకథామృతమందలి అనువాద కౌశలము, ఆధ్యాత్మిక విషయ బోధన వైచక్షణ్యము, పాత్ర నిర్మాణ చాతుర్యము, రసనిర్వహణ సామర్థ్యము, అలంకార ప్రదర్శన వైదగ్ధ్యము, ప్రాచీన సంప్రదాయ పాలన ప్రావీణ్యము మున్నగు నెన్నియో విశేషము లీ సిద్ధాంత గ్రంథమునందు బహుధా సప్రమాణముగ నిరూపింపఁ బడినవి. శ్రీ శాస్త్రిగారి విషయ వివేచన పాటవమునకు, విమర్శన సామర్థ్యమునకు ఈ సిద్ధాంత గ్రంథము నికషోపలము. వారి ప్రజ్ఞా వైదుష్య నిరూపకమైన ఈకృతి సుకృతి. ఈ సుకృతి కృతి. "సమానానా ముత్తమ శ్లోకోఽస్తు."

వాల్తేరు
4-12-85

ఇట్లు,
వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

# కృతజ్ఞతా నివేదనము

మా స్వగ్రామము ఉప్పులూరు, కృష్ణా జిల్లా. మా తండ్రిగారు బ్రహ్మశ్రీ వేదమూర్తులు తూములూరు వేంకట్రామశాస్త్రి. మా తల్లిగారు అ॥సౌ॥ వేంకటనరసమ్మ. మేము నలుగురము అన్నదమ్ములము. 1) లక్ష్మీనారాయణశాస్త్రి 2) మంగావధానులు, 3) శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి, 4) రామకృష్ణజ్ఞానప్రసాద్. మా కొక్క సహోదరి. పేరు లక్ష్మీదేవి. బ్ర. వే. తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారి (చందోలు) దౌహిత్రులు, బ్ర. వే. చెరువు శేషయ్యశాస్త్రిగారి (బందరు) పుత్రులునైన శ్రీ సత్యనారాయణశాస్త్రిగారికి మా సోదరి నిచ్చి వివాహము జరిపినాము. దైవకృప, పెద్దల దయవలన వారు సుఖసంతాన ప్రమోదములఁ బడయుచు హాయిగా నున్నారు. బ్ర. వే. మా బావగారు 'ఆశు కవితా విశారదు'లేగాక 'అవధాన విద్యావాచస్పతులు' నగుచు విద్వజ్జన మాననీయులై ప్రశంసలఁ బడయుట జగద్విఖ్యాతము.

చిన్నతనమున చుట్టరికము నెన్నుకొనుచు చందోలు చేరిన నేను పెద్దల వాత్సల్యము, బంధువుల యాదరాభిమానములతోఁ బాటు మా అక్కగారి వలన తాతగారి తపోవిద్యామహత్త్వాదులతోఁ గూడిన పవిత్ర చరిత్రము గొంతఁ దెలియఁగంటిని. మొదటిసారిగా విన్న నేనా విషయము లన్నియు వ్రాసి లోకమునకుఁ దెలియఁ జెప్ప వలయునను సంకల్పముతో, కలము, కాగితములకై ప్రయత్నముఁ జేయుచుండ నాకీ కథాభాగ మంతయుఁ బూర్వాశ్రమమున తాతగారి శిష్యులు శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహ శాస్త్రిగారు 'అగ్నిపరీక్ష' యను గ్రంథముగా నింతకుముందే సిద్ధ మొనరించిరని తెలిసినది. ఆ విధముగా నా తల్లి నా హృదయము సాహితీ సుసంపన్నము గావించి రచనా వ్యాసంగమునకుఁ బ్రేరణ నిచ్చి, యట్టి కృషిలోఁ బ్రథమముగ గురుపీఠము నధిష్ఠించినది. నాటినుండి తాతగారియెడ శ్రద్ధాభక్తుల నలవరచుకొని, భక్తి భావమున మెలఁగుచు నేటికిట్లు వారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడనైతిని. అప్పటిలో కొంత కాలము శ్రీకాళహస్తి తాలూకాలోని మా భూములు వ్యవసాయము సేయు ప్రయత్నములో గడిచిపోయినది. విద్యాగంధముఁ బూర్తిగా దూరమైనది.

అది 1968 సం॥. మా బావగారు తాడికొండ ఓరియంటల్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా పనిచేయుచున్న ఆరోజులలో పనిపడి నేనొక పర్యాయ మచటికి వెడలితిని. సరిగా నా సమయమునకు వారు విద్యార్థులకు ప్రవచనము చేయుచుండుటఁ దెలిసి తరగతి గదికిఁ జేరి, పాఠపద్ధతికి నాకర్షింపఁబడి యొకప్రక్కగాఁ గూర్చుండి విను

చుంటిని. ఆనాటి వారి మాటలే మహిమాస్పదములగు మంత్రములై నా మనసున నాటుకొనగా, గురుభావము హృదయపీఠమున( జోటుచేసుకొని స్ఫూర్తి వికాసములను బ్రసాదింప, నంత 'నేనును మీ కళాశాలలో విద్యార్థిగా( బ్రవేశించి చదువుకొందు' నని యర్థించితిని. వారును దయతో నట్లయినచో( దెనాలిలో మా యింటనే యుండి యా కళాశాలలో( జదువుకొనవలసినది. నే నప్పుడప్పుడు తీరికవేళలలో( దెలియని పాఠము లున్నచో( జెప్ప(గలనని యాదేశించిరి. ఆవిధముగా నా గురుమూర్తి యౌదార్యము కారణముగా( దిరిగి నా చదువు ప్రారంభింప( బడినది. కొంతకాలము తెనాలి, మఱికొంతకాలము గుంటూరు సంస్కృత కళాశాలలో( జదువుకొంటిని. విద్యా బుద్ధులు( గఱపి నా విజ్ఞాన వికాసమునకు( దోడ్పడిన మా ఉపాధ్యాయు లందఱికి నేను సభక్తికముగ నమస్కరించుచున్నాను.

నేను భాషాప్రవీణ ప్రవేశ కక్ష్య చదువుచున్న రోజులలో బ్ర. వే. తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి తాతగారు తెనాలి వచ్చినారు ఆ సంవత్సర మచటనే దేవీ నవరాత్రోత్సవములు నిర్వహింప(బడినవి. అందు దుర్గాష్టమినా( డనుగ్రహముతో( బరోక్షవిద్య నాకుపదేశ మొనరించి, దేవికృపకు( బాత్రుని గావించి,నా హృదయమున( బ్రధాన గురుపీఠము నధిష్ఠించి మించి వారు నిత్యమారాధ్యులైనారు. అది నా పురాకృత పుణ్య విశేషఫలము. మా తల్లిదండ్రులతో( జెప్పి సకాలమున నాకుపనయనాది సంస్కార విధులు నిర్వర్తింప( జేయుటలో నా సద్గురుని యభిప్రాయమునకు( బరమార్థ మిద్దియని నా( దెలుంగ(జాల మైతిమి. నా శ్రీమతి నాగపద్మావతి. చిట్టా వారి ఆడపడుచు. ఆమెయు దేవ్యనుగ్రహము నంది కృతార్థురాలై, ధార్మిక జీవనమున నాకు బాసటగా నిలిచి, సాహిత్య సేవలో( జే(దోడు, వా(దోడుగా మెల(గుచు బంధు, భృత్యుల సాదరముగా నరయుచు, మైత్ర్యాది గుణముల సాటివారిలో( బ్రశంసార్హత గడించుకొన్నది. మాకొక్క కుమారు(డు. చి॥ వేంకట శివప్రసాదు. ఇద్దరాడ పిల్లలు - 1) శ్రీదేవి 2) శ్రీ రాజ్యలక్ష్మి.

భాషా ప్రవీణ పూర్తిచేసి జిల్లెళ్ళమూడి 'మాతృశ్రీ ఓరియంటల్ కళాశా లలో నాంధ్రోపన్యాసకునిగా( బనిచేయుచు ('అంఆ') అమ్మ ఆశీస్సులతో విద్యాప్రవీణ, పి. ఓ. యల్; ఎం. ఎ., పరీక్షలయం దుత్తీర్ణు(డనై, తదుపరి పరిశోధన వ్యాసంగము నకై ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు దరఖాస్తు పెట్టుకొంటిని. శిష్యవత్సలులు ఆచార్య శ్రీ S. V. జోగారావుగారు దయతో నా కవకాశము( గల్పించుచు, పర్యవేక్షకులుగా డా॥ శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని( జూపించిరి. వారును నా యభ్యర్థనము

మన్నించి, యాచార్యత్వమున కంగీకరించి, పరిశోధనా ప్రణాళిక నిచ్చి, ప్రయోగదశయం దడు గడుగున నెదురయ్యెడు సమస్యలకు సమాధాన పూర్వకముగాఁ బరిష్కారములు సూచించుచు నన్నివిధముల సహకరించి నన్నుకృతార్థునిఁ గావించిరి.

మొదటి నుండియు శ్రీరామకథాఽమృత మహిమమును గూర్చి వినినవాఁడ నగుటఁజేసి పరిశోధనా వ్యాసంగ విషయము వచ్చినప్పుడెల్ల (బెద్దలెవ్వరైనఁదద్విశేషములు వివరించు నవకాశమున్నచో బాగుండునని భావించెడివాఁడను. ఆ విషయమే యొకనాఁడు మా బావగారితోఁ బ్రస్తావింపగా వారందులకు విశ్వవిద్యాలయము వారి యనుమతి కావలయునని సమాధానించిరి. కొంతకాలము గడచినది. పరమేశ్వరానుగ్రహము, గురువుల యమోఘాశీర్వచన విశేషములు ఫలించి నాకట్టి వ్యాసంగమున కవకాశములభించినది. అప్పుడు పరిశోధనాంశమేద్ది ? యను సమస్య యేర్పడినది. ఆ విషయమున కీ॥ శే॥ శ్రీ రాచకొండ నరసింహమూర్తిగారు (జిల్లెళ్ళమూడి) దీనికింతగా విచారింపవలసినదేమున్నది. మీ తాతగారి శ్రీరామకథాఽమృతము (తాడేపల్లి వారి రామాయణము) అన్ని విధముల యోగ్యమగు మహాకావ్యము గదా ! అదియైనచో బాగుండునని సూచించిరి. అచట ఆచార్య శ్రీ S.V. జోగారావుగారును డా. శ్రీవేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారితో సంప్రదించి "నేను గుంటూరు పి. జి. సెంటర్‌లో పనిచేయుచున్నప్పటినుండియు నాకు శ్రీరామ కథాఽమృతముపై పరిశోధనఁజేయింపవలయునని సంకల్పము. ఇంతకాలము కారణాంతరముల వలన కుదిరినదికాదు. ఇప్పుడు నీవా విషయమునఁబరిశ్రమఁజేసిన బాగుండు"నని విషయనిర్దేశముఁ జేసి, నన్నాదేశించిరి. నా యానందమున కవధియే లేదు. పర్యవేక్షకులుగా గురు చరణులు డా. శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారును నా విషయమున (జక్కని ప్రోత్సాహమునిచ్చిరి. "పుంభావ సరస్వతులు" మా బావగారు నందులకు దోహదము చేసిరి. వారందఱికి నాసప్రశ్రయ కృతజ్ఞతాంజలులు ఘటించుచున్నాను.

ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విన్ బురాణావళుల్
దెనుగున్ జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబుఁదానెట్టిదో
తెనుగున్ జేయరుమున్న భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁజేసెద పునర్జన్మంబులేకుండగన్

అని పోతన సంభావించినాఁడు. అట్లే మా గురుదేవుల శిష్య కోటిలో ప్రాజ్ఞులు, పూజ్యులు పల్వురుండగా నన్నీకృతికిఁబాత్రునిఁగావించుటలో వారి యవ్యాజానురాగములు వెల్లడియగుచున్నవి. ఈ జన్మకు సార్థకత గల్పించి, యీసంతృప్తి ఘటింపఁజేసినారు.

సల్లలితోరు కీర్తి విలసద్విభవాఢ్యు, నమేయ శక్తి సం
పల్లసితాత్ము నాత్మ పరమత్త్వ వివేక విభాసి. దివ్య సం
విల్లసమాను, వేంకటకవి ప్రభు రామకథాఽమృతంబు సం
దుల్లము పల్లవించు మధురోహలు గొల్వగ భక్తిఁగొల్చెదన్.

రసభావంబుఁ బరస్పరంబొరసిరా, రమ్యంబు రామాయణం
బు, సమర్థంబుగ నిర్వహించి జనసంబున్, దివ్య ధన్యంబుగా
గ సమర్పించితి యీశ్వరార్చనకు సత్కారంబు తోరంబుగా,
నెసగంజేయవె సత్కృపామహిమఁ దండ్రీ! కావ్య తత్త్వార్థముల్.

అని ముందుగా కీ. శే. వేంకటప్పయ్యశాస్త్రిగారినిఁ బ్రార్థించి ప్రత్యక్ష దైవమగు బ్ర.వే రాఘవనారాయణశాస్త్రి గురుచరణులనాశ్రయించి వారి దయతో నందలి విశేషములు తెలియఁగంటిని. అమోఘమగు వారి శిష్యవాత్సల్యమనిర్వచనీయము.

అట్టిగురుదేవుల యనుగ్రహమున నయ్యమృతాబ్ధిలోఁగొన్ని బిందువులు గ్రోలఁగల్గితిని. అందుఁగొన్ని మాత్రమే యక్షరబద్ధముగావింపఁజాలితిని. గ్రంథ విస్తరభీతి చేనందునుగొన్నింటిని మాత్రమే ప్రకటింపనైతిని. ఆ పరమేశ్వరుఁడనుగ్రహించిన మఱికొన్ని విశేషములు తదుపరి ఐతపరుపఁగలనని పాఠకలోకమునకు విన్నవించు కొనుచున్నాను.

శ్రీ విశ్వనాథవారు "అలనన్నయ్యయు, దిక్కన్నయు నన్నావేశించిర"ని చెప్పుకొనినారు. అట్లే శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు నా కంతఃప్రేరణనొసంగియట్టి విజ్ఞానమును బ్రసాదింప, ప్రత్యక్షముగ గురుదేవులు తమ యాశీర్వాద సంపదచే నా కట్టిశక్తి నిచ్చి ప్రోత్సహించినారు. సర్వశ్రయుఁడనై వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు తెలియఁజేసికొనుచున్నాను.

తమ అమూల్యమగు నభిప్రాయమునిచ్చి నన్నాశీర్వదించిన ఆచార్య శ్రీ S.V. జోగారావుగారికి, డా. శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, శ్రీచెరువు సత్యనారాయణ శాస్త్రిగారికి కృతజ్ఞతాంజలులు ఘటించుచున్నాను.

గ్రంథముద్రణకుఁ బ్రోత్సహించియన్నివిధముల సహకరించిన శ్రీ తాదేపల్లి లక్ష్మీధర సోమయాజులుగారికి, కీ॥ శే॥ పెద్దిభొట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి కుమారులు శ్రీ లక్ష్మీనారాయణగారికి, శ్రీఅధరాపురపుశ్రీనివాసరావుగారికి, వారికుమారులు వెంకట సుబ్బారావుగారికి, శ్రీపరమాత్ముని వేంకటరమణయ్యగారికి, శ్రీవాడ్రేవు లక్ష్మీనరసింహ

మూర్తిగారికి, శ్రీ ఎనమంద్ర వెంకట్రావుగారికి, శ్రీ యడవల్లి దుర్గా నాగేశ్వరశర్మ గారికి, శ్రీ రావులపల్లి సాంబశివరావుగారికి శ్రీదీవి దీక్షితులుగారికి తదితర పెద్దలకు మిత్రులు D.V.L.N శేషగిరిరావుకు,సోమాశిబాలగంగాధరశర్మకు, నాకృతజ్ఞతలు వెల్లడించుకొనుచున్నాను. అట్లే ఆర్థిక సహాయముచేసిన సహృదయులగు వదాన్యులందఱకు నా కృతజ్ఞతలు ప్రకటించుచు, శ్రీరామానుగ్రహ పాత్రులై సంపత్సమృద్ధి విలసిల్లఁ గలందులకై యా పరబ్రహ్మమను బ్రార్థించుచున్నాను. 'అముద్రిత గ్రంథప్రచురణకు ఆర్థిక సహాయమను పేర ఆర్థిక సహాయమందించి సహకరించిన మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు (సాంస్కృతిక వ్యవహారాలశాఖ) కృతజ్ఞతాభివందనములు తెలుపుకొనుచున్నాను,

అన్ని విధముల సహకరించి నా విద్యాభివృద్ధికిఁదోడ్పడిన మాతృశ్రీ ఓరియంటల్ కాలేజి (జిల్లెళ్ళమూడి) ప్రిన్సిపాల్ డా. శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మగారికి, శ్రీభావనారాయణస్వామి సంస్కృతకళాశాలాధ్యక్షులు శ్రీK.P.S. కృష్ణభగవాన్లుగారికి, ముద్రణమున సలహాలనిచ్చి సహకరించిన శ్రీ సూరం శ్రీనివాసులుగారికి (తాడికొండ) గ్రంథాధ్యయనమున సహకరించిన శ్రీ V. V. సీతారామాచార్యులుగారికి, శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యంగారికి, శ్రీ భావనారాయణస్వామివారి దేవస్థానపు వైదికమత గ్రంథాలయాధికారులు శ్రీ P.V.R. అప్పారావుగారికి, మా కాలేజి లైబ్రేరియన్ P. సోమశేఖర్ గారికి, పాలకవర్గము వారికి, నా కృతజ్ఞతలు తెలియఁజేసికొనుచున్నాను. గ్రంథ ముద్రణము చేసిన శ్రీ రామచంద్రాప్రింటర్స్ గుంటూరు ప్రొప్రైటర్ శ్రీ రాఘవేంద్ర రావుగారికి, వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు - ముఖచిత్రము నౌదార్యముతో గీయించి యిచ్చిన M/S శాంతి ఆర్ట్స్, గుంటూరువారికి నా ధన్యవాదములు.

**డా. తూములవారు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M. A. Ph. D**

శ్రీ గణనాయకున్ సకలసిద్ధి వినాయకుఁబ్రస్తుతింత స
ర్వాగమవేది నార్తిహరు నాదిమునీంద్ర కవీంద్రవందితున్
ధీగుణదీపితున్ జగదధీనవిధానుఁ బ్రధాను, విఘ్నముల్
వీగగఁజేసి హృత్కమల పీఠి సుఖాప్తి వసించువేడుకన్

శ్రీ రఘురామనామ జపసిద్ధిఁబ్రసిద్ధివహించిమించు నా
మారుతికి న్వినమ్రమత నమస్కరణంబొనరించివేడెదన్
ప్రేరణ శక్తిమై నిలిచిప్రీతిని రామకథార్ణవంబునన్
బారము జేరఁజాలెడుజవంబు, బలంబు నొసంగికావగన్

# విషయసూచిక

సవినయనివేదనము

## శ్రీరామకథా௨మృతము - సమగ్రసమీక్ష

మొదటి భాగము

# శ్రీరామకథామృతము - సమగ్రసమీక్ష

## రెండవ భాగము



బ్ర. వే. తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రి.

శ్రీ శివాయ గురవేనమః

# సవినయ నివేదనము

మహితానందము నంద డెందమున రామబ్రహ్మముం గొల్చి, లో
క హితార్థమ్ము కథామృతంబొసఁగి సత్కారార్హుఁడై పొల్చె, ని
మ్మహిఁ దాశేపలి వేంకటప్పయ స్వధర్మ వ్యాపకాచార్యుఁ డా
స్పృహణీయున్ బ్రణుతింతు, భక్తిఁగొలుతున్ శ్రీరామరక్షార్థినై.

పొల్తిఁ దత్తనయుఁడగుచుఁ బొడమి తనరు
చుండె, రాఘవ నారాయణుం డనంగ
రూఢిఁ గొనివచ్చె ధర్మ మీ రూపున నన
నుత్తమస్తుత్యుఁడా పూరుషోత్తముండు.

శివపంచాక్షర మంత్ర సంతత తపస్సిద్ధున్ దయాశాలి బు
ద్ధి వివేకస్థిర ధర్మవర్తనుని శ్రీదేవీ సపర్యా సహో
త్సవ నిత్యప్రసితాత్ము. శిష్యజన రక్షాదక్షు, నాత్రేయు, రా
ఘవ నారాయణశాస్త్రి సద్గురునిఁ గాంక్షన్ గొల్తు నశ్రాంతమున్.

ఇది నా కిమ్మని యెన్న డెవ్వరినిఁగానీ కోరఁడాతండు లే
వెదఁ గ్రోధప్రతతి, లోభ, మోహములు లేనేలేదు పాండిత్య సం
పదకున్ గర్వము మత్సరం బొకటఁ, బోల్పం లేఁడొకండా శుభా
స్పద నిర్వ్యాజ దయానురాగ ఖనికిన్ బ్రహ్మాత్మ విజ్ఞానికిన్.

అట్టి మహనీయునకు నతులాచరించి
అంకిత మొనర్తు జన్మంబు సార్థకత్వ
మందఁగోరి శ్రీరామకథామృతమ్ము
పై సమగ్ర సమీక్షా నిబంధ మెలమి.

ఇట్లు,
సవినయ నివేదయిత

క్రోధన
మార్గశిర
పూర్ణిమ

తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి
27-12-85

శ్రీ శివాయ గురవేనమః

శ్రీ రాఘవ నారాయణు
సారాచారాభిరాము సతతము మదిలో
నారాధించెద కవికం
ఠీరవు ధీరాగ్రణిన్ గుణిన్ మద్గురునిన్.

పావనుఁడాశుభవ్రతుఁడు, పావనియాతని ధర్మపత్ని వి
ద్యావిలసద్వివేక సుగుణాంబుధి. యింతులమేలుబంతి 'శ్రీ
దేవి' స్వభావ సుందరము, దివ్యము తచ్చరితామృతమ్ము సం
భావన సేయుటే చిరతపఃఫలమంచుఁదలంతునెమ్మదిన్.

అన్నిటికన్నమిన్న హృదయంబున జాలియగాఁగ, నిత్య మా
పన్నుల మంచువచ్చు జనవర్గము బాధలు వాయఁ దీర్థమో,
తిన్నని మాటయో, బ్రతకుతీరముఁజేరగనైన బాటయో,
పున్నెము మీఱఁగూర్చుఁబరిపూత చరిత్రుఁడహో ! మహాత్ముఁడై

పలికిన పల్కులెల్ల రసబంధుర కావ్య కళానిధుల్, విని
ర్మలగతి సంచరించు మహి మానిత తీర్థము, దీవెనల్ వరం
బులయి, శుభంబుఁగూర్పు, సతతముంగడకన్నుల చూపు లిష్ట సి
ద్ధులఁగురియం,బరోపకృతిఁదోఁగు, మనీషి సమత్వబుద్ధియై

తాపసవృత్తిమై నెగడు తాత్త్వికకుంజరుఁడెందునెన్నడే
పాపము పొంతఁబో కెలమి బ్రహ్మముఁగొల్చుచు సత్యధర్మ దీ
క్షాపర తంత్రతన్ బరమకారుణికంబగు బుద్ధి యోగ వి
ద్యాపరమార్థమెంచి నిరహంకృతి బ్రహ్మముఁదానయైమనున్.

ఎందరెందఱు గురువు లీయిలను లేరు
శిష్య విత్తాప హారులై చెలఁగువారు
ఆర్యగృహ్యుఁడాచార్యుఁడయ్యతఁడొకండె
శిష్య హృత్తాప హారియై చెలఁగువాఁడు.

———

1) కవుల జీవిత చరిత్ర

2) శ్రీమద్రామాయణ వైభవము

3) భారతీయ భాషలలో రామాయణము

4) శ్రీరామకథా౽మృత రచనోద్దేశము

5) శ్రీమద్రామాయణానువాద విధానము

6) అధ్యాత్మ రామాయణానుసరణము -
అమూలక తత్త్వోద్ఘాటనము -

# కవుల జీవితచరిత్ర

శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు (1920 సం.) రామకథ "శ్రీరామ కథాఽమృతమ"ను పేర గాయత్రీ బీజాక్షరములతో 24 వేల గద్యపద్యములుగా వ్రాయసంకల్పించిరి. కాని వారు 18 వేల గద్యపద్యములు మాత్రము వ్రాసి, యంత్య శాసనముగా శేషపూరణగావింపఁ దనయులు శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారికి బాధ్యత నిచ్చి చనిరి. శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారును 6 వేల గద్యపద్యములు వ్రాసి పితృవాక్యపరిపాలనము గావించి కృతకృత్యులైరి. సంస్కృతమున బాణుఁడు, కుమార బాణుఁడు కాదంబరి రచించుట, తెనుఁగున గోన బుద్ధారెడ్డి, యాతని తనయులు కాచ భూపతి, విఠల రాజులు రంగనాథ రామాయణముఁ బూర్వోత్తర భాగములు రచించుట చరిత్ర ప్రసిద్ధములగు విషయములు. అట్టి సంప్రదాయమునకు వారసులై యీ పితాపుత్రు లిర్వురు శాస్త్రవైదుష్యముతో "నైకవిద్యారహస్యముల్ స్వీకరించి", "రామహృదయ రహస్యార్థ రమ్యటీక" యగు శ్రీరామ కథాఽమృతమును సర్వాంగసుందరముగా సిద్ధమొనరించిరి. ముందుగా నాకవుల జీవితచరిత్ర దెలిసికొనుట ముఖ్యము గావున సంగ్రహముగా నిందుఁ జెప్పబడుచున్నది.

## శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు:

వీరు శ్రీ తాడేపల్లి హనుమచ్ఛాస్త్రిగారి పుత్రులు. తల్లి లక్ష్మాంబ. స్వగ్రామము గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకా, చందోలు. వీరు స్వస్తిశ్రీ విభవనామ సంవత్సర ఆశ్వియుజ శుక్ల విదియ చిత్రానక్షత్రయుక్త మకర లగ్నమున జన్మించిరి. అప్పటికి సరియగు నాంగ్లసంవత్సరము 1867.

జ న్మ ప త్రి క :—

| | | |
|---|---|---|
| గు | | |
| కే | | కు శు |
| | రా శి | |
| ల | | రా |
| | శ | ర చం |
| | | బు |

వేంకటప్పయ్యశాస్త్రిగారికి శ్రీ సీతారామావధాని యను తమ్ముఁడు, బాలా త్రిపురసుందరి యను చెల్లెలును గలరు.

## వంశ పూర్వచరితము :

ఆత్రేయ సగోత్రుఁడగు రామభట్టారకుఁడీ వంశమునకుఁ బ్రధాన పురుషుఁడు. అతఁడు చతుర్దశ విద్యాప్రవీణుడు. అతఁడొకప్పుడు గోదావరీ తీరమునుండి కృష్ణా తీరమునందలి మునిపల్లెయను గ్రామమునకు వచ్చెనని తెలియుచున్నది. తదుపరి సింగభట్టను మహితుఁ డారు శాస్త్రములు, మూడు వేదములు చదివి, చదివించి కీర్తి నొందెను. వారికి సుబ్రహ్మణ్యావధాని యను నాతడుద్భవించెను. ఆతని కుమారుడు బుచ్చయార్యుఁడు. అతఁడు బహుశాస్త్రవేత్త. వాని భార్య యక్కలక్ష్మాంబ. ఆ దంపతులకు లక్ష్మీనారాయణుఁడు, హనుమచ్ఛాస్త్రియను నిరువురు కుమారులు. అందు హనుమదార్యుని కుమారులు — 1) శ్రీ వేంకటప్పయ్యశాస్త్రి, 2 శ్రీ సీతారామావధాని. వారిలో సీతారామావధానిని పెదతండ్రియగు లక్ష్మీనారాయణుఁడు పెంచుకొనెను. ఆ వంశమెప్పుడో కాలక్రమమున పొన్నూరు రాఁగా నటనుండి యొక కుటుంబము

చందోలునందు స్థిరపడినది. వేంకటప్పయ్యశాస్త్రి గారిట్లని తమ వంశపూర్వచరితమును శ్రీరామ కథాఽమృతమున ముచ్చటించిరి.[1]

## గురువులు :

అజ్ఞానాంధకారమును దొలగించి జ్ఞానజ్యోతిని వెలిగించువాఁడు కావున లోకమున గురువునకు నున్నతస్థానము కల్పింపబడినది. గురువును త్రిమూర్త్యాత్మకముగా సంభావించిన "గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః" ఇత్యాదులు ప్రసిద్ధములు. గురువుల యనుగ్రహము వలన సర్వము విదితమగుచున్నది. శ్రీరామ కథాఽమృతమున వేంకటప్పయ్యశాస్త్రిగారు తమ గురువులను స్తుతించినారు.[2] వారి కక్షరాభ్యాసముఁ జేసినవారు శ్రీ మాచిరాజు దండయ్య పంతులుగారు. వ్రాయఁజదువ నేర్పినవారు మేనమామయగు శ్రీ లక్ష్మీనృసింహశాస్త్రి. శివపంచాక్షరితోఁబాటు సర్వమంత్రసారమును, కాలామృతాది జ్యోతిష గ్రంథములను బోధించినవారు శ్రీ కొలచిన యజ్ఞనారాయణశాస్త్రి. వారి దీక్షానామము "కళ్యాణానందనాథ" అని చెప్పబడుచున్నది. సాహిత్యాధ్యాపనము గావించి సిద్ధాంతకౌముది నుపదేశించినవారు శ్రీ పాతూరి కోటయ్యశాస్త్రి. తర్కశాస్త్ర మభ్యసింపఁజేసినవారు శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రి. శారీరక మీమాంసా భాష్యముఁజెప్పిన వేదాంత గురువులు శ్రీ కోట నరసింహశాస్త్రి. కవితాశిల్పమునకు వన్నెఁగూర్చినవారు శ్రీ తురగా వేంకటరాజుగారు. ఇట్టి గురువుల యనుగ్రహ విశేషమున కొలది యభ్యాసములతోడనే సర్వశాస్త్ర రహస్యములను, సర్వోపనిషత్సారములను, సర్వమంత్రాగమ తత్త్వములను, మానవ ప్రత్యక్షముఁ జేసికొన్న శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారనుక్షణ శివపంచాక్షరీ జప పరాయణులేగాక శాక్తేయవరి వస్యాతత్త్వవేత్తలై పరగినారు. వీరు నిత్య శివపూజాధురంధరులై జ్ఞాన పరిపూర్ణులై సాంఖ్యయోగ రహస్యములఁ దెలిసి, చిన్ననాఁటనే యద్వైతతత్త్వము నవగతము చేసికొన్న మహామనీషి.[3] శాస్త్రిగారు దైవదత్తమగు ప్రతిభ, సద్యస్స్ఫూర్తి గలిగి సాహిత్యతత్త్వవేత్తలై లోకమున సాహిత్యచక్రవర్తులుగా గీర్తింపబఁడినారు.[4]

---

1) బా, కాం.-1 అ,,16-19 పఁలు 2) బా, కాం. 1 అ., 22–24 పఁలు

3) శ్రీరామ కథాఽమృత కవికుమార చరితము / శ్రీ చెరుపు సత్యనారాయణశాస్త్రి /

4) శ్రీ. రా. కా.—బా. కాం. పీఠిక / శ్రీ నాగలింగం వెంకటేశ్వరశాస్త్రి /

## వివాహము - సంతతి

గుంటూరుజిల్లా గోరంట్ల గ్రామవాసి శ్రీ అన్నంభొట్ల వేంకటప్పయ్య గారి ప్రథమ పుత్రిక హనుమాంబను శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారి కిచ్చి వివాహమొన రించిరి. ఈ పుణ్యదంపతులకు ముగ్గురు మగ పిల్లలు, ఐదుగురు ఆడపిల్లలు కలిగిరి. వారు— 1) రాఘవనారాయణశాస్త్రి, 2) హనుమచ్ఛాస్త్రి, 3) బాలకోటీశ్వరశాస్త్రి. 1) అక్కలక్ష్మమ్మ, 2) అన్నపూర్ణమ్మ, 3) వరలక్ష్మమ్మ, 4) సావిత్రమ్మ, 5) సరస్వతమ్మ. వేంకటప్పయ్యశాస్త్రిగారు వాపీకూప తటాకాదుల వెలయించి, యౌరస సంతానముతో బాటు సప్తసంతానములం బడసిరని శ్రీ తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రి గారిట్లు పేర్కొనినారు.—

త్రవ్వించె నూతులు తరతరంబుల కేమి
పవిలేక యుపయోగపడెడునట్లు
కట్టించె సత్రముల్ కలకాలమును బాట
సారుల శ్రమలెల్లఁ దీరునట్లు
స్థాపించె సకల సంస్థలలోనఁ దరళమౌ
పరమ పవిత్రమౌ గురుకులమ్ము
పెచ్చించె వేనకువేలుగాఁ గుళ్ళకు
గోపుర వాహన కూటములకు
అట్టి ధర్మస్వరూపుఁడు నట్టి దాత
యట్టి కవిలోకచంద్రుఁడు పుట్టుతోడ
బ్రహ్మ విజ్ఞానియున్ వంశరత్న మొకఁడె
వేంకటప్పయ్యశాస్త్రి కవీశ్వరుండు 1

## పాఠశాలాస్థాపన - విద్యాబోధన :

శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగా రతిథుల నభ్యాగతుల సాదరముగా బరామర్శించుచు నెల్లర కాదర్శముగా నడచుచు జదువుకొనిన విద్య సార్థకమగునటుల "శంకర

---

1. గురూపహారము — ద్వి ర.

సంస్కృత విద్యాలయ”మను పేర గురుకులము స్థాపించి 45 సం॥ల కాలము విద్యార్థులకు విద్యతోఁబాటన్న వస్త్రముల నిచ్చి జ్ఞానదానమొనర్చిన ధన్యజీవులు. కళాప్రపూర్ణ శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారీ విషయము నిట్లు పేర్కొనినారు.

వచ్చిన శిష్యులకున్ జదు
విచ్చుటయేకాక యన్నమిచ్చెను వస్త్రం
బిచ్చెను మాయయ వారీ
వెచ్చము దుస్సహమెమైన వెఱవఁడు లవమున్
ఆనాఁడు చర్ల బ్రహ్మయ
కానంబడె నిట్టి యీవి కల దేశికుఁడై
యేనాఁడు జాతిగర్వ వి
దానము లీద్వృక్ష కోవిదప్రాగ్రసరుల్ 1

ఊరి చివర పాఠశాలాభవనము నిర్మించి, యట్టి ప్రశాంత వాతావరణమున శాస్త్రిగారు తపో, విద్యా, కవిత్వ వ్యాసంగములఁ బ్రొద్దుఁబుచ్చుచుండిరి. వీరి శిష్యులలో నన్నివర్ణములవారు గలరు. ఈ గురుశిష్య సంప్రదాయమును మెచ్చి చందోలు కరణము మాచిరాజు రామమూర్తిగారా ప్రదేశమునకు “విద్యానగర”మని పేరిడినట్లు శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు తమ “శాంకరీస్తవము”న బ్రస్తావించిరి.

“వేంకటప్పయ్య శాస్త్రిగారు పాఠ ప్రవచనమున సాటిలేని మేటి గురువులు. కావ్యపాఠముఁ జెప్పునప్పుడు వ్యాఖ్యానము నందలి శాస్త్రపంక్తులను సలక్షణముగా సమన్వయపరిచి చెప్పెడివారు. సందర్భానుసారముగాఁ దర్క వ్యాకరణములు, మీమాంసావేదాంతములు, వాస్తుజ్యోతిషములు మొదలగు శాస్త్రములను హృదయంగమముగా బోధించెడివారు.”. 2 ఆ పాఠశక్తి యెంతటివారి నిట్టె యాకర్షించెడిదట. ఇట్టి విధానము ననుసరించియే వారి కావ్యములందు గూడ నాయా శాస్త్రవిషయము లవకాశమునుబట్టి ప్రస్తావింపబడినవి. ఆయా శాస్త్రవాసనలు గలవారి కయ్యవి యామోదము గల్గించుచు, కావ్యమై శిష్ట్యమునకు హేతువు లగుచున్నవి. రసపుష్టి గలిగిన యట్టి

1) స్మారకసంచిక-20, 21 పు॥లు. 2) శ్రీ రామకథామృత కవికుమార చరితము

రచనలు కవుల యాత్మీయమగు పాండితీపై భవమును బ్రకటించుచున్నవి. శాస్త్రిగారి యొద్ద నేపాటి విద్య నభ్యసించిన వారును లోకమునఁ బ్రసిద్ధులై పండితాగ్రగణ్యులగుట చెప్పుకొనదగిన విషయము.

ఏకశ్లోకరహస్య బోధనముచే నెవ్వాఁడు శిష్యున్ సుధీ
లోకాగ్రేసరుఁజేయు నవ్విబుధుఁగొల్తున్ వేంకటప్పార్యు న
స్తోక శ్లోకమయూఖ రాజవఖిలాఘన్ రామగాథామృతా
ఖ్యాక గ్రంథమతల్లికా జనక మద్దైర్వాణభాషాగురున్ 1

ఈ పాఠశాలయందు విద్యతోఁబాటుగా నాధ్యాత్మిక భావ సంపదకుఁబ్రాధాన్యము గలదు. నాటకాంతము సాహిత్యము, సిద్ధాంతకౌముది, అలంకారగ్రంధములు బోధించి, పంచదశి వేదాంత గ్రంథ ముపదేశించి, యభీష్టమగు శాస్త్రాధ్యయనమున కనుమతించి, యాశీర్వదించి పంపెడివారు. అచటి విద్యార్థులకు విద్యతోఁ జక్కని సంస్కారము నలవడెడిదని శ్రీ ముళ్ళపూడి నారాయణశాస్త్రిగారు వాక్రుచ్చిరి.2 శాస్త్రిగారికిఁ బ్రతిదినము శివపంచాక్షరీ జపము 12 వేలు పూర్తియైన గాని నిద్రవచ్చెడిది కాదు. అది వారి నియమము. మధ్యాహ్నవేళ స్వయముగాఁ బూలుకోసి తెచ్చుకొని భక్తితాత్పర్యములతో శివపూజ నొనర్చెడివారని పెక్కండ్రు ప్రవచించినారు. అందు శ్రీ తుమ్మలవారిట్లు శాస్త్రిగారిని ప్రశంసించిరి.

ఏసద్దేశిక సర్వతోముఖ కళాహేవాకరోచిస్తతిన్
నా సాహిత్యమెలర్చె నద్రితనయానాథార్చనాధీన ధీ
వాసున్ వాగవతారు నతనిన్ వర్ణింతుఁదాదే పలి
శ్రీసంతత్యుదితున్ గృపాప్పతి నఘచ్ఛిద్వేంకటప్పార్యునిన్ 3

## సభలు - సాహిత్యసేవ

"తిరుపతి వేంకట కవుల కంటె ముందుగా వీరవధానములు చేయఁ బ్రారంభించిరి. కేతవరము, పినపాడు మున్నగుచోట్ల శతావధానము లొనర్చిరి. అది తెలిసి గురువులు అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారు శిష్యు నుద్దేశించి "స్వేచ్ఛా రసవిరోధినీ"

1) బాపూజీ ఆత్మకథ (తుమ్మల) పీఠిక. 2) స్మారకసంచిక, పు. 17. 3) రససిద్ధి.

యన్నట్లు ఆశుకవిత్వము రసపుష్టినీయఁజాలదు, కావున నికపై నీ వవధానములు చేయ రాదని శాసించిరి"[1] ఈ ప్రాంతమున తిరుపతి వేంకట కవులు గావించిన యవధాన ములలోఁ బెక్కింటికి (పొన్నూరు, వేమవరము) శాస్త్రిగారే యాధ్వర్యమును వహించినారని తెలియుచున్నది.

## ధర్మ ప్రచారము

ఆహ్వానమును బురస్కరించుకొని యా యా సభలలో వీరు సనాతన ధర్మ విషయములుపన్యసించి ప్రబోధించెడివారు. చుట్టుపట్ల గ్రామములలోఁ బురాణప్రవచన మొనరించి ధార్మికప్రచారము గావించిరి. శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు వ్రాసిన "సత్యనారాయణవ్రత మాహాత్మ్య ము"ను గ్రంథమునఁగృతి ప్రేరణకర్త్రి సీతమాంబ శాస్త్రిగారితోనిట్లు పలికినదని వర్ణింపఁబడినది—

మీయయ్య మీరుఁజెప్పిన
నోయయ్య పురాణగాథ లున్నతి విని నేఁ
జేయఁగల పనులుఁ జేసితి
బోయన్నియునుఁ జేయ నన్ను బోటికిఁ దరమే. 1 ఆ. 16 ప

ఇట్టి శాస్త్రిగారు "చామనచాయ శరీరము గలిగి రుద్రాక్షపేరులు, విభూతి పెండెల మధ్య కుంకుమబొట్టు, పచ్చనిశాలువా ధరించెడి వారు. వారి నెరిగిన వారెల్లరు సాక్షాచ్ఛివస్వరూపులుగా భావించెడి వారు" అని శ్రీ రామకథామృత కవి కుమార చరితమునఁ బేర్కొనఁ బడినది. ఇట్లు గంభీరమైన ప్రకృతి, దర్శనీయ మగు నాకృతి గలిగి చూపఱుల కచ్చెరువు కొల్పుచుండెడివారట. చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు వేంక టప్పయ్యశాస్త్రిగారి నిట్లు సంభావించిరి.

మొగమున బ్రహ్మవర్చస మమోఘము ఫాలతలస్థకుంకుమ
ద్విగుణితమై యెసంగ గళదేశము నందు శివాక్షమాల మే
ల్మిగనిగలీన శంకరుని లీలఁ జరించుచు దేశముద్ధరిం
చు గురువరా! 1

---

1) స్మారకసంచిక—గురుస్మృతి, 25 పు. 5ప.

శాస్త్రిగారు శాస్త్రచర్చ యందుఁ గడుంగడు సమర్థు లని ములుకుట్ల సదాశివశాస్త్రిగారు తమ పాఠశాలానుభవము వివరించిరి. 1 శ్రీ శాస్త్రిగారి వైదుష్యమును గూర్చి ప్రతాపబసవకవి గారిట్లు పేర్కొనినారు.

అడుగో చంద్రపురీ బుధుండవిన సింహాస్వప్నమై ముందు వె
న్కడుగుల్సాగక కట్టి పెట్టుదురు నానాశాస్త్ర తర్కంబుఁజ
ప్పుడు విన్నన్ గుకవీంద్ర మత్తగజముల్ వోన్
బండితుల్ మెచ్చ ని
న్గాడరన్ గాంచఁ దరంబె శాశ్వతుఁడవై తో వేంకటప్పాభిధా। 2

## కృతులు

వేంకటప్పయ్య శాస్త్రిగారు తమ "రచనావిధానమునకు మున్ను సంప్రదాయ సరణి ననుసరించి నిరంతరోపాసనారూప మగు తపస్యాదీక్ష నవలంబించిరి. తరువాతనే కావ్యవిరచనమున కుద్యమించిరి." 3 ఆ విధముగాఁ బరదేవతానుగ్రహ సిద్ధసాహితుఁడగావునఁ దమ కృతులు పరమేశ్వరారాధనకే వినియోగించిన భక్తపుంగవులు వీరు.4 వీరు సంస్కృతాంధ్రముల రెంటను గృతులు వెలయించిరి. శాస్త్రిగారి రచనము లన్నియు మహిత సాహితీ సుసంపన్నములై పలువురు పండితుల ప్రశంసలందు కొనినవి.

## సంస్కృత రచనలు :

1. శ్రీశైలతీర్థ సారము : ఇది 20 అధ్యాయముల మహాకావ్యము. శ్రీశైలక్షేత్ర మాహాత్మ్య మిందు వర్ణింపఁబడినది.
2. హరిశ్చంద్రసుకృతి కావ్యము-హరిశ్చంద్ర చరిత్రమిందు వర్ణితము.
3. గురుస్తుతి శతశ్లోకి : "గురుంకోటీశ్వరం వందే" అనుమకుటముతో గురువులు శ్రీ పాతూరి కోటయ్యశాస్త్రిగారిపై భక్తితాత్పర్యములతో వ్రాసిన శతకము.

---

1) స్మారకసంచిక-గురుస్మృతి, 24 పు. 2) స్మారకసంచిక-గురుస్మృతి, 23 పు.
3) బా. కాం.-పీఠిక—శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి 4) శ్రీ. రా. క. బా కాం 1 ఆ. 31 ప.

4. అంబాసహస్రము : అమ్మవారిపై భక్తితో రచించిన వేయిశ్లోకముల స్తోత్రకదంబము.

## తెలుఁగు రచనలు :

1. శ్రీరామకథాఽమృతము : 24,000 గద్య పద్యములు-గాయత్రీ బీజాక్షరములతో నిబంధింపఁబడిన రామకథ యిందుఁ జెప్పఁబడినది.
2. శ్రీకృష్ణవిలాసము : కృష్ణలీల లిందు వర్ణితము.
3. శ్రీ కాకాని మల్లీశ్వరమాహాత్మ్యము : కాకాని క్షేత్ర మహిమమును వివరించు నైదాశ్వాసముల కావ్యము. శ్రీ మల్లీశ్వరున కంకితము. కృతిమహోత్సవ వేళ శాస్త్రిగారినిఁ బల్లకిలో నూరేగించిరి.([1])
4. భద్రాయురుపాఖ్యానము : ఇది శివమహత్త్వమును దెలుపు 5 అంకముల నాటకము.
5. త్రిశంకుస్వర్గము : త్రిశంకుని చరిత్ర. 7 అంకముల నాటకము.
6. శ్రీశంకరవిజయ కథాసారసంగ్రహస్తోత్రము : ఆదిశంకరుల దివ్యచరిత్ర యిందు వర్ణితము.
7. చలపాదులత : అధిక్షేపకృతి. 8 మందనిగ్రహము : అధిక్షేపకృతి.
9. ప్రహ్లాదసుహ్లాదము : హరికథ. 10. సీమంతినీచరిత్రము : హరికథ.
11. సావిత్రీ చరిత్రము : హరికథ. 12. భక్తతుకారామ్ : హరికథ.
13. పుష్పమంజరి : ఇదియొక పద్య సంపుటి.
14. వాస్తుసర్వస్వము }
15. స్మృతిసమాహృతి } ఇవి రెండును నేఁడలభ్యములు.
16. ప్రాస్తావిక గద్యపద్యాణములు : అముద్రితము.
17. బాలకోటీశ్వర శతకము : ఇందు "బాలకోటీశ్వరా" అనునది మకుటము.
18. హేమదుర్గాంబికా శతకము : ఇందు "హేమదుర్గాంబికా"అనునది మకుటము.

---

[1] మధురా విజయము—/పీఠిక/

19. శ్రీవేంకటేశ్వరత్రిశతి : "తిర్పతివేంకటేశ్వరా" అనునది మకుటము.

20. కావ్యకన్యా తారావళి : "కావ్యకన్యకా" యను మకుటముతో వ్రాయఁబడిన 27 పద్యము లిందు గలవు.

21. సౌందర్యలహరి యాంధ్రానువాదము : ఇయ్యది అద్దేపల్లి సోమనాథశాస్త్రి గురువుల కంకితము.

వేంకటప్పయ్యశాస్త్రిగారు సరస్వతీస్తనద్వయముఁగా బ్రసిద్ధిఁగాంచిన సంగీత సాహిత్యముల రెంటిని బాగుగా నాస్వాదించినధన్యజీవి. చిన్నతనమున 7వ యేట నుండియు నమ్మవారిపై బాటలు వ్రాయమొదలిడిరి. వీరు వ్రాసిన కొన్ని పాటలు "దేవీసంకీర్తనావళి"[2] యను గ్రంథమునఁ బ్రచురింపఁడినవి. లయజ్ఞాన మెరింగిన వీరి సంగీతసాహిత్య సృష్టిలో ప్రహ్లాద, తుకారామ్, సీమంతినీచరిత్రము, సావిత్రీచరిత్రము మున్నగు హరికథలు హృదయంగమములై సహృదయుల నలరించుచున్నవి. ఇంకను ప్రాస్తావికముగ వీరు "తలుపుదగ్గఱపాట, బంతులపాట" మున్నగునవి యనేకములు రచించిరి. త్యాగరాజకృతులు జయదేవుని యష్టపదులు మరికొన్ని కీర్తనలు తీరిక వేళ వీరాలాపించుచుండెడివారు. వీరి సంగీతశాస్త్రపరిచయ ప్రభావము శ్రీరామకథాఽమృత కావ్యరచనమున విశేషముగాఁ గలదు. వీరిని—

కవియుఁ దపస్వి పండితుడు గణ్యచరిత్రుఁడు ధార్మికుండు నేఁ

డెవఁడన ఢక్కగొట్టి వచియింపఁగ వచ్చు మహాత్మ! నిన్ను [1] అని వేమూరి సీతారామశాస్త్రిగారును"

ఆత్రేయముఖ్యమహర్షిసత్తముల మా
కనుల పండువుగఁ గన్గొనవి కొఱత
యుత్తమబ్రాహ్మణుం డొకఁడైన గలఁడె యి
జ్జగము నందనువారి సందియమ్ము
దేవభాషాజ్ఞానతృష్ణమైఁ దిరుగు వి
ద్యార్థులు పడెడు నధ్వశ్రమంబు

1. స్మారక సంచిక, 15,

రామాయణ పరంపరా రచనాసక్తి
నరికట్టు కవి పుట్టనట్టిలోటు

తీర్చితిరి మీర లాంధ్రధాత్రీ తలమున
నవతరించిన దివ్యర్షి యనఁగ భూసు
రాగ్రగణ్యుండునాఁ బండితాగ్రణియనఁ
గవివరేణ్యుండునాఁ గీర్తిగలిగె మీకు[1]

అని శ్రీ అంబడిపూడి రామబ్రహ్మకవియు సంభావించి శాస్త్రిగారి బహుముఖ ప్రజ్ఞావిశేషమును గీర్తించినారు.

## సమకాలికులు - స్నేహితులు :

శ్రీపాతూరి రామస్వామిశాస్త్రిగారు, వేంకటప్పయ్యశాస్త్రిగారు మిక్కిలి మైత్రితోఁ బరగెడివారని చల్లా పిచ్చయ్యశాస్త్రిగారి మాటల వలన తెలియుచున్నది.

ఏమాత్రం బెడలేక స
దా మైత్రిన్ సోదరుని విధమ్మున గనుచున్
స్వామివని మెచ్చు రామ
స్వామి గురుంగనఁ జనితె యపరశివమూర్తీ [2]

శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు తొలుత శిష్యులై క్రమముగా మిత్రకోటికిఁ జేరిరని తెలియుచున్నది. శ్రీ వేదాంతం కృష్ణమాచార్యుల వారును వీరి యాప్త మిత్రులని "యామావిక"లోఁ జెప్పబడినది.

## ప్రశంసలు

వేంకటప్పయ్యశాస్త్రిగారిని శ్రీ నాగలింగమ్ వేంకటేశ్వరశాస్త్రిగారు "సాహిత్యచక్రవర్తులు" [3] అనియు, శ్రీ తుమ్మల సీతారామూర్తి "నవవాల్మీకి" [4] యనియు, శ్రీ ప్రతాపహనుమచ్ఛాస్త్రిగారు, "ఆంధ్ర వాల్మీకి"[5] అనియు ప్రశంసించిరి.

---

1. స్మారక సంచిక, 10, పు, 2. చల్లా పిచ్చయ్య శాస్త్రిగారు షష్టిపూర్త్యుత్సవ సంచిక, 3, బా. కాం,-పీఠిక 4, 5. స్మారక సంచిక, 11 పు. 26 పు.

వీరు నన్నయ్య తిక్కనాది పూర్వకవుల కవితా సంప్రదాయ మార్గమున బయనించి, పలువురు పండితులచేఁ బ్రస్తుతింపఁబడినారు.

నన్నయ తిక్కనాది కవినాథుల నేర్పులు తోఁచుకై వడిన్
బన్నని బాటలో నడిపె రామకథన్ మహనీయ కావ్యమున్
పిన్నలు పెద్దలున్ దెలుఁగు పేటల నారతు లిచ్చికొల్వఁగాఁ
బున్నెపుముద్దనా విలిచిపోయెను మద్గురుఁ డాంధ్రసాహితిన్ [1]

— శ్రీ తుమ్మల సీతారామమూర్తి.

నన్నయ్య కవితాప్రసన్నత యొకచోటఁ
దిక్కన్న కుదియింపు ఫక్కియొకట
శంభుదాసుని కావ్యగుంభనం బొకచోట
సోమనాథుని పల్కుగోమొకంట
శ్రీనాథు వాచావిజృంభణం బొకచోటఁ
బోతనార్యుని భక్తిరీతి యొకట
బెద్దన కవి ముద్దుటొద్దిక లొకచోట
సూరన్న శ్లేషంపుఁదీరొకంట [2]

—శ్రీ వేమూరి సీతారామశాస్త్రి

సాంస్కృతిక సమాససంఘటనముఁ జూచి
నన్నయ్యయే యీతఁడన్న వారు
బిలిబిలి పలుకుల తెలుఁగుకూర్పులఁ గాంచి
యన్న! తిక్కన్నయే యన్నవారు
శ్రీరామభక్తివిశేషమ్ము నరసి పో
తన్న యీ సుకృతియే యన్నవారు
సమతమైనొప్పు సీసమ్ముల గన్గొని
యౌర శ్రీనాథుఁడౌ నన్నవారు

1. 2. స్మారక సంచిక.

శబ్దసంస్కారమౌచితి సాధుభావ
మరసి సర్వజ్ఞుఁడేల కాఁడన్నవారు
నున్నవారు మీకావ్యంబుఁ గన్నవారు
విన్నవారును దాసోహ మన్నవారు[1]

ఇట్లు శ్రీరామకథాఽమృతము వేంకటప్పయ్యశాస్త్రిగారు మొదటి నుండియు నారు కాండములు పూర్తిగావించి యుత్తరకాండమున 15 0౦ల పద్యములు మాత్రము వ్రాసి భావ సంవత్సర ఆశ్వీయుజ బహుళ తృతీయ నాడు /1934 సం॥/ పరలోక గతులైరి. పితృదేవుని యంత్యశాసనము ననుసరించి శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు శ్రీరామ కథాఽమృత శేషపూరణ గావించి ధన్యతగడించిరి.

## శ్రీరాఘవ నారాయణశాస్త్రిగారు :

స్వస్తిశ్రీ దుర్ముఖినామ సంవత్సర శ్రావణబహుళ ద్వితీయ మంగళవారము రాత్రి వృషభలగ్నమున వీరు జన్మించిరి, అప్పటికి సరియగు నాంగ్లసంవత్సరము 1896.

**లగ్నపత్రిక — జాతకచక్రము :**

| | | | |
|---|---|---|---|
| చం | | ల కు | |
| రా | | | గు |
| | రాశి | | ర బు<br>శు కే |
| | | శ | |

## బాల్యము :

శాస్త్రిగారికిఁ జిన్నతనమున శ్రీ మాచిరాజు దండయ్య పంతులుగారియొద్దనే యక్షరాభ్యాసము జరిగినది. వారి యన్నకుమారులు శ్రీ మాచిరాజు సాంబయ్యగారు వీరిచే నాసనములు వేయించుచు వ్రాయఁ జదువ నేర్పిరి. తదుపరి శాస్త్రిగారు పితృపాదుల సమీపముననే సంస్కృత కావ్య, నాటకాలంకారము లభ్యసించిరి. తెనుఁగునఁ బాండిత్యము గడించిరి. పూర్వజన్మసుకృతమునఁ గవితాధార యప్రయత్నముననే యలవడినది. శ్రీ దండయ్యపంతులుగారి యల్లుడు శ్రీ కేదారలింగముగారి యొద్ద బాలామంత్ర ముపదేశ మంది పలుమారు లక్షరలక్షలు జప మొనరించి తర్పణ హోమములతో శాంతిగావించి తద్దేవి యనుగ్రహము నందినారు. సహపాఠియగు ములుగు వీరభద్రశాస్త్రిగారి ప్రేరణమునఁ బదియేనవు నేటఁ బాఠశాలా విద్యార్థుల గూర్చుండ బెట్టుకొని యర్థశతావధానమొనరించిరి. విజాంపట్నము నందలి కోట రామకృష్ణగారి యింట వారి కోరిక ననుసరించి యష్టావధాన మొనర్చిరి. అది తెలిసి వేంకటప్పయ్య శాస్త్రిగారు తమ సమక్షమున గుమారునిచే నష్టావధానము చేయించి సమర్థముగ నిర్వహించిన తీరు గని సంతసించి యభ్యనుజ్ఞ నిచ్చుచుఁ జదరంగము చీట్లాట స్వయముగా నేర్పినారట.

## వివాహము :

శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారి తమ్ముఁడు పాపయ్యశాస్త్రిగారి కుమార్తె "శ్రీదేవి"తో శాస్త్రిగారికిఁ బాణిగ్రహణ మహోత్సవము జరిగినది.

## విద్యాభ్యాసము - గురువులు :

వివాహానంతరము[1] శాస్త్రిగారు తెనాలి వెళ్ళి యచట శ్రీ పిశుపాటి వీరభద్ర శాస్త్రి, పిలేశ్వరపు పురుషోత్తమశాస్త్రి, రాఘవయ్య యనువారలతోఁ బరిచయ మేర్పడి వారికిఁ దమ కవిత్వాదుల నభ్యసింపఁజేయుచు, వారి వలన నేత్రావధాన విద్య నేర్చుకొని వారితోఁగలిసి నిత్యము సభలలోఁ విద్యావిశేషముల బ్రదర్శించుచు సహృదయులగు వారి మన్ననలఁ బడసిరి.[2] అప్పటి మద్రాస్ ప్రెసిడెన్సీ గవర్నరగు 'పెంట్లెండు' వీరివి యోగ్యతాపత్రము నిచ్చి మిక్కిలిగా గౌరవించిరి.

---

1, 2. దత్తభాగవతము—అనుబంధము, 5 పు., 15, 16 పుటలు

తదనంతరము శాస్త్రిగారు గుంటూరు మండలములోని తాడికొండ గ్రామమందున్న శ్రీముదిగొండ నాగలింగశాస్త్రిగారి కడ వ్యాకరణ వేదాంతశాస్త్రము లభ్యసించిరి. గురువులతో సంచారముచేయుచు నెడనెడ నేత్రావధానాష్టావధానములు సలుపుచు వాని వలన లభించు ధనమంతయు గురువులకు భక్తితాత్పర్యములతో సమర్పించి గురువుల మన్ననలకుఁ బాత్రులైరి. వినుకొండ, వెల్లలూరు, వేల్పూరు, సుద్దపల్లి మొదలగుచోట్ల నవధానము లొనర్చిరి. సందర్భవశమునఁ దన్నుఁ గూర్చి చెప్పవలసి రాఁగా శాస్త్రిగారిట్లు పలికిరట—

ఆపస్వశంబు దివ్యాకృతి వ్యాకృతి
వరియించి మించె సద్గురునియుక్తి
కష్టభాషాకవితాంగనామణి తనం
తన చేరెఁ బూర్వజన్మంపుఁ జెలిమి
నష్టావధాన నేత్రావధాన శతావ
ధాన విధాతృత ధాత గూర్చె 1

శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారికి చెఱుకుపల్లి వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన పొదిలి సీతారామశాస్త్రిగారు (మహతి) మహావిద్య నాదరముతో నుపదేశించి శ్రీ విద్యాసంప్రదాయ రహస్యముల నిర్దేశించి శాస్త్రిగారి హృదయమునఁ బ్రధాన గురుపీఠ మధిష్టించిరి. చింతలపాటి వేంకట సుబ్బయ్యగారు బ్రహ్మోపదేశ మొనరించిన గురువులు. పరిమి నరసింహావధానిగారు శాస్త్రిగారి వేదగురువులు. శాస్త్రిగారు వారి గురువుల నిట్లు స్తుతించిరి.

ఓనమాల్చెప్పిన యొజ్జ లమాచిరా
జచ్చయ్య దండయ సాంబయలను
తాడికొండాన్వయోదధి సుధానిధి మంత్ర
గురునిఁగేదారలింగుని శివపరు
మహతియౌ విద్య సమ్మతినిచ్చిపుచ్చిన
పొదిలె సీతారామబుధవరేణ్యు

---

1. నాకు తోచిన మాట— (పితాపుత్ర కవిచరిత్రము, పు. 30)

ముదిగొండ వంశజన్ముని నాగలింగాఖ్యు
మధురావిజయకృతి మానితాత్ము(

దలచి వాక్రుచ్చి మ్రొక్కి సంస్తవ మొనర్చి
భయము భక్తియు నెమ్మది( బాదుకొన(గ(
బరిచరించెద మత్ప్రతిభాలతిక కొ
కొక్కి యల్లు నొసంగిన యూర్జితులను 1

## కృతులు :

1. శ్రీరామకథాఽమృత శేషపూరణము : ఉత్తరకాండమున 600ం ల గద్య పద్యములు పైగా రచించిరి.
2. కల్యాణకైవర్తకము : శివలీలావిలాసమును ప్రకటించు నైదాశ్వాసముల ప్రబంధము.
3. మధురావిజయము : సంస్కృతమున "గంగాదేవి" కృతి కిదియాంధ్రీకరణము
4. శ్రీ సత్యనారాయణ వ్రతమాహాత్మ్యము : స్వామి వ్రతకథా విశేష మిందు వర్ణితము. 3.ఆశ్వాసముల ప్రబంధము
5. శ్రీదత్తభాగవతము : దత్తాత్రేయస్వామి మహత్త్వమును ప్రకటించు ద్వాదశ గుచ్ఛముల మహాగ్రంథము.
6. యామావిక : మిత్రులు వాసుదేవశాస్త్రి మహారాష్ట్ర దేశభాష యందలి యీ కథ( దెలుప దాని నాధారముగా( గొని స్వకపోల కల్పిత మగు శిల్పమును బాటించి యీ కావ్యమును సుందరముగా సంతరించిరి. 1 యామావిక గ్రంథమున( జెన్న కేశవస్వామితో(దమ కృతుల గూర్చి కృతిపతుల( గూర్చి యిట్లు ప్రస్తావించిరి.

"మధురావిజయకృతి" మాలిమి నొస(గితి
గురు(డైన నాగలింగునకు( గపికి

---

1. దత్తభాగవతము—అనుబంధము. 8 వ, 4 పు.

2. యామావిక—ప్ర, ప్ర., 7, 8, 9, పుటలు

హనుమకిచ్చితిని సీతమ్మ కోర్కెకి "సత్య
నారాయణమహత్త్వ" నామ గాథ
"కల్యాణకైవర్తకము" సత్కీర్త్యండని
పిఱుపాటి కులున కర్పించితి రతి
"రామకథాఽమృతార్థము" పితృపాదుల
తోఁ బరతత్త్వ మందు నిడఁగంటి
"దత్తభాగవత" మను గ్రంథంబు విన్న
మొన్న లింగోద్భవస్వామి కెన్నఁ గూర్చి
నేఁడు నీకిడుచుంటి ననింద్య దీని
వాడ వున్నావు నీవు నావాడవనుచు 1

కాలాంతరమున వీరి శిష్యులు శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారు "మాయావిక"ను "కవిమాయ" అనుపేర నాటకముగా రచించి గురువులకే యంకిత మిచ్చిరి. పైనఁ జెప్పినవి కాక మరికొన్ని శాస్త్రిగారి రచన లిందుఁ బేర్కొనఁబడుచున్నవి.

7. నా యాత్ర : ఇది "వేంకటేశప్రభూ" అను మకుటముతో నున్న శతకము.

8. శాంకరీ స్తవము : "శాంకరీ" అను మకుటముగల శతకము.

9. సహస్రలింగేశ్వరస్తుతి : శతకము (సంస్కృతము)

10. పాండురంగేశ్వర ప్రశస్తి : శతకము.

11. బాలాత్రిపురసుందరీసమేత రాజరాజనరేంద్రేశ్వర స్తవము : శతకము

12. నాకు తోచినమాట : ఉపన్యాసముల సంకలనము.

13. శంకర గ్రంథరత్నావళి : సాధనగ్రంధ మండలివారి ప్రచురణములలో 8వ సంపుటము. శంకరుని "స్తోత్రకదంబము" నాంధ్రీకరించిరి.

14. "మత్స్వప్నః" : సంస్కృత గ్రంథము. శాస్త్రిగారికి స్వప్నమున శ్రీమాతతో జరిగిన సంభాషణమిందు వర్ణితము.

---

1 యామావిక - ప్ర. ప్ర., 7, 8, 9, పు॥లు

15. నా యాగము : యజ్ఞము నిర్వహించిన నాటి వారి యనుభవ విశేషము వర్ణింపఁబడినది. అముద్రితములు

16. కాలభాగవతము : వసంతఋతు మాహాత్మ్యమును బ్రతిపాదించునది ఇంకను బ్రాస్తావిక గద్యపద్యములనేకములు గలవు.

17. గురుసంహిత : దత్తదేవుని చరిత్రము.

18. యోగము—కర్మము:- శాస్త్రిగారి జీవితానుభవ విశేషములిందు బ్రస్తావింపఁ బడినవి.

వీరి రచనములన్నియుఁ దత్త్వప్రధానములై బుధజనామోద యోగ్యములగుచున్నవి.

## సంతతి :

శాస్త్రిగారి యౌరససంతానమును గూర్చి "నాకు తోచినమాట" యను గ్రంథమున "పితాపుత్ర కవిచరిత్రము" నందిట్లు చెప్పఁబడినది. "వీరి పుత్రుఁడు లక్ష్మీనారాయణశాస్త్రి పది పదారేండ్లలో విజ్ఞుఁడనిపించుకొని కీర్తి నిలుపుకొని చనియెను. కూతురు శ్రీలక్ష్మియన చెరువు శేషయ్యశాస్త్రి పత్నియై సత్యనారాయణశాస్త్రి యను కొడుకును గని గౌరి యయ్యెను. వాని భార్య లక్ష్మి. వారు పుత్రవంతులు." [1] అందు

1. ఉరగాభరణ శ్రీనివాసు 2. హిరణ్యగర్భ వెంకటరమణ

3. గోపాలమోహన్‌కృష్ణ. పుత్రిక శ్రీలక్ష్మి-వారెల్లరు విద్యావంతులై వర్ధిల్లుచున్నారు.

## పాఠశాలా నిర్వహణము :

ఉద్యోగావకాశము లెన్నివచ్చినను వీరంగీకరింపక తండ్రిగారు నెలకొల్పిన "పాఠశాల నిర్వహించుచు, విద్యార్థుల కన్నవస్త్రములిచ్చి పోషించుచుఁ బితృపాదుల యాశయమును నెరవేర్చుచున్నారు. ఈ విషయమును గూర్చి శ్రీ యంబటిపూడి రామబ్రహ్మకవి—

అవధానత్రయ మాచరించె మునె తానయ్యెంగదా శాబ్ది కుం
డవలన్ సత్కృతులెన్నొ సల్పుచు సువిద్యాదాననిష్ఠాతుఁడై
వివిధార్థజ్ఞుఁ డనంగ వేర్వడసె దేవీభక్తుఁడై నట్టి రా
ఘవనారాయణశాస్త్రి పెంపఁగలఁడింకన్ మీ యశోవల్లరిన్ 2

1. 9 పు., (ప్రథమ ముద్రణము) 2) స్మారక సంచిక.

అనియు, శ్రీ తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రి—

అవధానంబుల గండఁడై గెలిచి బాల్యంబందె పంచామ్మిదేం
డ్లవుచో వ్యాకరణమ్ము పూర్తియయి విద్యాబుద్ధులం జెప్పగా
నవునంచాచమనంబొనర్చికొనె దీక్షారంభమాతండు రా
ఘవనారాయణశాస్త్రి పండితకవిగ్రాహ్యుండు సామాన్యుఁడే 1

అనియు ప్రశంసించినారు.

శాస్త్రిగారింట శరన్నవరాత్రోత్సవములు విశేషముగా జరుగును. పాడ్యమి నాఁడు కలశస్థాపనఁ జేసి నవావరణ, షడామ్నాయ పూజలతో లలితాదేవికి నవమి వరకు నర్చనలు జరిపి, హోమము పూర్ణాహుతియు నిర్వర్తింపఁబడుట కలదు. విజయ దశమినాడు విద్యార్థులకుఁ గ్రొత్తపాఠములు ప్రారంభించుటయు, విద్యార్థులు తమ తమ కవిత్వములను జదివి వినిపించుటయు జరుగును. ఈ మహోత్సవము సందర్శించు టకు సమీప గ్రామముల నుండియేగాక దూరప్రాంతముల నుండియు పలువురు భక్తులు వచ్చి దేవీ ప్రసాదభాజనులగుట పరిపాటి. వచ్చిన వారందరకు భోజనాదివసతులు శాస్త్రిగారింటనే ఏర్పాటుచేయఁబడును. వీరి పాఠశాలలో విద్య నభ్యసించి, ఉపదేశ మందిన వారిలో పండితులు, కవీశ్వరులు గానివారు లేరు. వీరికి శిష్యుల వలన మిక్కిలి కీర్తిప్రతిష్ఠలేర్పడినవని చెప్పనగును. ప్రతినిత్యము నగ్న్యుపాసన, దేవతార్చనలతోఁ బాటుగా నతిథ్యభ్యాగతులను, శిష్యకోటిని యాదరించు వారి గృహము పుణ్యక్షేత్ర మైనది. ఈ పితాపుత్రులిద్దరు ఆనాటి సంస్కృత పాఠశాల లెన్నింటికో పరీక్షాధి కారులుగా వ్యవహరించిరని పౌన్నూరు పాఠశాలలో నప్పటి విద్యార్థులుగా నున్న శ్రీ పరమాత్ముని వెంకటేశ్వరరావుగారు వివరించిరి. వీరి పై దృశ్యమున కిది తార్కాణము.

వేంకటప్పయ్యశాస్త్రిగారి సద్గుణములన్నియు రాఘవనారాయణశాస్త్రిగారి యందు మూర్తీభవించినవని ముళ్ళపూడి నారాయణశాస్త్రిగారిట్లు సంభావించిరి.

ఆ దాతృత్వము నా తపఃప్రవణతన్నా శిష్యవాత్సల్యమా
నాదోపాసన మావశిత్వమునునా నానాగమావాప్తి నా

1. గురూపహారము, ప్ర. ర.. 34 ప.

వాదప్రౌఢిమ నాకవిత్వరచనాప్రాగల్భ్య మాతేజమున్
వాదేలా? కనవేంకటప్పయ గురుండీ పాత్రునందుంచెబో 1

శ్రీ ముళ్ళపూడివారే తమ అభిజ్ఞానశాకుంతలము-ఆంధ్రానువాద గ్రంథము నందు

కవితారాజ్యధురంధరుండు లలితాకారుణ్యపాత్రుండుశ్రీ
శివనిధ్యానరతుండు సద్గుణ గణశ్రీలుండు సద్యోగి పుం
గవుఁడీ నాకృతిఁ దీర్చిదిద్దిన బుధగ్రామాగ్రగణ్యుండు రా
ఘవనారాయణశాస్త్రి సద్గురుఁడు సత్కార్యార్థుఁడెప్పట్టునన్

అని వీరిని ప్రశంసించి కృతజ్ఞతాంజలి ఘటించిరి. ఇతరులు వీరిని బహువిధముల నిట్లు నుతించినారు—

గురుని నేర్మి, యోర్మి, కరుణ కవిత్వ మ
హత్త్వ భుషిత రూపునందె ననఁగ
రాణకెక్కు సుతుఁడు రాఘవనారాయ
ణాహ్వయుండు లోక మబ్రపడఁగ 2

— శ్రీ తుమ్మల సీతారామమూర్తి.

తనయుండన్న నతండె చెప్పఁదగుఁగాదా యంచు నేనాఁటికే
ననరో పెద్దలు సద్గుణాబ్ధియయి పిత్రాజ్ఞావిశేషమ్ములన్
గొనఁడొక్కో? జనకప్రబంధరచనా కూలంకష ప్రజ్ఞ పెం
పున శ్రీరామకథాఽమృతమ్ము మిగులం బూరించిపేరొందడే? 3

— శ్రీ తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రి.

అతుల తపోబలాఢ్యుడు నిరంతర నిశ్చలదేవ్యుపాసనా
రతుఁడు సనాతన ప్రథిత బ్రాహ్మణ కర్మ విశిష్టనిష్ఠుఁడా

---

1. స్మారక సంచిక—19 పు., 10 ప. 2. స్మారక సంచిక 21 పు, 3 ప.
3. గురూపహారము—ప్ర. ర., 35 ప.

శ్రిత సకలార్తిహారుఁడు వశీకృతదేహి జితేంద్రియుండు సూ
నృత ప్రియవాగ్వ్రతుండు ముని నీతిచరిత్రుఁడు బ్రహ్మవేత్తయున్ 1
— శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి.

ఇట్లు పితాపుత్రులిద్దరు మూర్తిలో, కవితామూర్తిలో సనాతన సంప్రదాయములు బ్రతిబింబింప, నాన్యతోదర్శనీయ మగు లక్ష్య సాధనతో ప్రక్రియా వైవిధ్యము గల సాహిత్యసృష్టిఁ జేసిన కవిపుంగవులు. వీరి యధీతిబోధ లాచరణ ప్రచారణములఁ బరిపూర్ణత సంతరించు కొనినవి. వీరనేక సభలలో గౌరవసన్మానములఁ బొందినారు. పండితుల కనేకులకు వారు స్వయముగా సమ్మానములు సలిపినారు. వాగ్దేవీ పరిపూర్ణానుగ్రహపాత్రులై యనన్వయాలంకారలక్షితులై జీవితము నాదర్శవంతముగ నడుపుకొనినారు. "ఉత్తమోత్తమ గురుల శిష్యుండనైతి, గురువు నయ్యెద సచ్ఛిష్యకోటికెందు"2 అనుట వీరి జీవితమున గమనింపదగు ముఖ్యలక్షణము.

బ్ర. వే. తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారి ధర్మపత్ని శ్రీదేవిగారును, కవయిత్రి యగుట 'దేవీసంకీర్తనావళి'యను పేర (3 భాగములు) అమ్మవారిపై పాటలు వ్రాసిరి. అవియన్నియు సర్వమంత్రార్థ సారసర్వ స్వములై వరలుచున్నవి. అవియామె సంగీతశాస్త్ర పరిచయమునకు, దత్త్వజ్ఞతకు నిదర్శనములగుచున్నవి.

జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తియేషాం యశః కాయే జరామరణజంభయమ్ ॥

---

1. శ్రీరామనామామృతమహిమ—గురుస్తుతి. 2. పానశాల (దువ్వూరి)

# శ్రీ మ ద్రా మా య ణ వై భ వ ము

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్॥

విశ్వమున కాధారము ధర్మము. ఆ ధర్మమును బ్రతిష్ఠించునది వేదము. వేదవేద్యుఁడగు పరమపురుషుఁడు దశరథాత్మజుఁడుగా నవతరింప నా పురుషోత్తముని వర్ణించు వేదము వాల్మీకి ముఖమున శ్రీ మద్రామాయణముగాఁ బరిణమించినది.

వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా॥ 1

ఈ రామాయణ మహాకావ్యావిర్భావ సందర్భముననే పూర్వమున్న వైదిక ఛందస్సునకుఁ దోడు లౌకికఛందస్సు నుదయించినది. ద్రష్టయగు వాల్మీకి మహర్షి కవియై వెలసినాడు.

ప్రపంచమునఁ గావ్య ప్రపంచమున బ్రసిద్ధిఁబడసి యనంత కళ్యాణ గుణాభిరాముఁడగు శ్రీరాముని చారిత్రము వర్ణించునదై సాహిత్యమున నగ్రస్థాన మలంకరించినది రామాయణము. వాల్మీకియే చెప్పినట్లు "పరం కవీనా మాధారమ్మ"గు నీ రామకథ సంస్కృతమున వెలసి ప్రపంచభాషలన్నింటిలోనికి ననువదింపఁబడి భారతదేశమున దేశభాషలన్నింటి యందును ననేక ప్రక్రియలలోఁగీర్తింపఁబడి "శ్రీరామరక్ష సర్వజగద్రక్ష" గాఁ బరిణమించి "వాఙ్మయము రామమయము" అను నంతగా నభివృద్ధి గాంచినది. సంస్కృతముననే రామకథ కావ్య నాటక చంపూ వచన రచనాది భిన్నప్రక్రియలలో వెలువడినది. వాల్మీకమునకుఁ బెక్కు వ్యాఖ్యానములు రచింపఁబడినవి. అంతియేగాక ప్రాచీనార్వాచీన ప్రాచ్యపాశ్చాత్య కవిపండితులు వాల్మీకిని, నాతని రామాయణమును బహుధా ప్రశంసించినారు. వారిలో

"వాల్మీకి నాదశ్చ స సర్జపద్యమ్" 2 అని యశ్వఘోషుఁడును ।
"స్వకృతిం గాపయామాస కవిః ప్రథమ పద్ధతిమ్" 3 అని కాళిదాసును,

---

1. అగస్త్యసంహిత. 2. సౌందరనందమ్ 3. ర. వం.—15 స., 36 శ్లో.

"అథభగవాన్ ప్రాచేతసః ప్రథమం మనుష్యేషు శబ్దబ్రహ్మణం తాదృశం వివర్తమితిహాసం రామాయణం ప్రణీనాయ"[1] అని భవభూతియు.

భాస్వద్వంశ వతంస కీర్తి రమణీరంగప్రసంగస్వన
ద్వాదిత్ర ప్రథమధ్వనిర్విజయతే వల్మీక జన్మాముసిః[2] అని జయదేవుఁడును ;

శుభ మతనుతకావ్యం స్వాదురామాయణాఖ్యం
మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః [3] అని భోజుఁడును

చేతసోఽస్తు ప్రసాదాయ
సతాం ప్రాచేతసో మునిః
పృథివ్యాం పద్యనిర్మాణ
విద్యాయాః ప్రథమమ్ పదమ్ [4]

అని గంగాదేవియు వేనోళ్ళ ప్రశంసించిరి. మురారి శ్రీమద్రామాయణమును "వాల్మీకి వాగమృతకూప"[5] మని సంభావించినాఁడు.

సదూషణాఽపి నిర్దోషా సఖరాఽపి సుకోమలా
నమస్తస్మై కృతాయేన రమ్యా రామాయణీకథా.

అని నలచంపూ వ్రాసిన త్రివిక్రమభట్టు నంజలి ఘటించినాడు.

లౌకికానాంహి సాధూనాం అర్థం వాగనువర్తతే ।
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోను ధావతి॥[6]

అని భవభూతియేభగ్యంతరముగా వాల్మీకి మహర్షికి వాచికార్చలు సమర్పించినాడు.

ఇందఱిన్ని విధములఁ బ్రస్తుతించిన రామాయణేతివృత్తమునకు శ్రీరాముసుదాత్త నాయకత్వము సిద్ధించుట మిక్కిలి హర్షింపదగిన విషయము.

---

1. ఉ. రా. చరితమ్—2 అం., 5 శ్లో. క్రింది పంక్తులు.
2. ప్ర. రాఘ.—1 అం., 9 శ్లో. 3. రామాయణ చంపూః
4. మధురావిజయమ్. 5. అన. రాఘ.—1 అం., 12 శ్లో
6. ఉ. రా. చరితమ్ 1 అం.

శ్రీరాము నుత్తమగుణములు వాల్మీకినే గాక దరువాతి కవులను విశేషముగా నాకర్షించినవి. కావుననే మురారి—

యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్యచరితమ్
గుణైరేతావద్భిర్జగతి పునరన్యో జయతికః
స్వమాత్మానం తత్తద్గుణగరిమ గంభీర మధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథముపకరిష్యన్తి కవయః 1

అనియు, జయదేవుఁడు—

స్వసూక్తీనాం పాత్రం రఘుతిలకమేకం కలయతాం
కవీనాంకో దోషస్సతుగుణగణానామవగుణః
యదేతైర్నిశ్శేషై రపరగుణలబ్ధై రిపజగ
త్యసావేకశ్చక్రే సతత సుఖసంవాస వసతిః 2

అనియు రాముని గుణగణములను బ్రశంసించిరి. "రామాదివద్వర్తితవ్యమ్, నరావణాదివత్" అని యాలంకారికులు లక్షణ నిర్ణయమును దీనినిబట్టియే గావించిరి. వాల్మీకి—

ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితం
యఃపఠే ద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే 3

అనుటనుబట్టి రామాయణముయొక్క పుణ్యగుణకీర్తనము, వేదసమ్మితమైన కావ్య స్వభావము, కావ్యపఠన ఫలమును మనోజ్ఞముగా వర్ణింపబడినవి. ఇట్టి రామాయణ మును సహృదయులు రసదృష్టితోడను, శాస్త్రజ్ఞులు శాస్త్రదృష్టితోడను, తాత్త్వికులు తత్త్వదృష్టితోడను వీక్షించి యా యా రహస్యములను బరమార్థములను బొంద గల్గినారు. రామాయణ పరమార్థమును గూర్చి డా॥ ఇలపావులూరి పాండు రంగారావుగారు "కథగా చూచినా, కావ్యంగా భావించినా, నీతి సంహితగా నిర్వచించుకున్నా, యోగశాస్త్రంగా అన్వయించుకున్నా రామాయణం సారస్వత పారిజాతంగా గోచరిస్తుంది. సామాన్య జనులకు అది చక్కని కథ. రసజ్ఞులకు అది రమణీయమైన కావ్యం. నీతికోవిదులకు నీతిశాస్త్రం. యోగులకు యోగశాస్త్రం. మంత్ర

---

1. అన. రాఘ.— అం., 9 శ్లో. 2. ప్ర. రాఘ.—1 అం., 12 శ్లో.
3. బాం. కాం.-1స., 98 శ్లో.

సాధకులకు మంత్రరాజం. ఇలా ఏ దృష్టితో చూస్తే అలా గోచరించే పలువన్నెల భవ్యచిత్రాన్ని ఇంద్రధనస్సులాంటి ఈ ఉద్గ్రంథం ప్రపంచానికి అందిస్తూ ఉంది"[1] అని వివరించినారు. నెమలి పింఛమువలె విశ్వసౌందర్యమును ప్రదర్శించిన మహాకావ్యము రామాయణము. ఇందలి కథ అతిలోక రమణీయమైనది. వివిధ పాత్రలతోఁగూడి స్వర్గమర్త్య పాతాళముల వ్యాపించి సర్వవిధములగు చిత్తవృత్తులకు నానందరస పరిణామమును గల్గించు నుత్తమోత్తమ కావ్యమీ రామాయణము.

లోకమున చతుర్విధ పురుషార్థము లవశ్యముపాదేయములు కాఁగా నందుఁ గేవల మర్థకామములు పరిత్యాజ్యము లగుచున్నవి. కానిచో నవి రాక్షసత్వమును ప్రబల జేయును. ధర్మోపబృంహితములగుచో నర్థ కామములు గ్రాహ్యములగుచున్నవి. పరిపూర్ణమానవత్వమున కది నిదర్శనము. అర్థకామములు గౌణములు చేసి, ధర్మోపాసన సలుపుట పరమార్థము. దైవీసంపద కది మార్గము. రామాయణ మీ మూడింటిని ప్రదర్శించుచున్నది. వాల్మీకియే దీనినిట్లు ప్రవచించినాఁడు.

కామార్థ గుణసంయుక్తం ధర్మార్థ గుణవిస్తరమ్
సముద్రమివ రత్నాఢ్యం సర్వశ్రుతి మనోహరమ్ 2

శోకజనితమగు శ్లోకమీ రామాయణ కావ్యరచనకు మూలము కాఁగా సీతాత్యంత వియోగపర్యంత మువవర్ణితమగు నా కావ్యము శోకము స్థాయిగాఁ గల్గిన కరుణరస ప్రధానమని శ్రీయానందవర్ధనాచార్యులు, మొదలగువారు భావించిరి. అభినవ గుప్తుడును తన లోచన వ్యాఖ్యలో విప్రలంభశంకఁ బరిహరించి కరుణరసమే యని నిరూపించినాఁడు. [3] వక్రోక్తికారుఁడగు కుంతకుఁడు మాత్రము తనకుఁ బూర్వులగు వారిచే "రామాయణము శాంతరస ప్రధానమగు కావ్యము"గా నంగీకరింపఁబడినట్లు వర్ణించినాఁడు. అట్లయిన నతని వాదమున నవతారోప సంహారమును దెలుపు శ్రీరాముని మహాప్రస్థానమువరకు వాల్మీకికృతమేయని సంభావింపఁబడియుండనోపును.

"ధర్మోహి పరమోలోకే" [4]—ప్రకృతి తన యనంత వ్యాపారములను ధర్మము ననుసరించియే కొనసాగించుచున్నది. లోక ప్రతిష్ఠా హేతు వగు ధర్మమును

1. "రామాయణ పరమార్థం", 65 పు. 2. బా. కాం.–3 స., 8 శ్లో.
3. ధ్వ. లో.-4 అ., 10 శ్లో. కారికావృత్తి. 4. వా. రా..బా.కాం.-40స., 21 శ్లో.

భంజింపరాదు. ధర్మభంగము వలనఁ బ్రకృతి వ్యత్యస్తమై విపరీత మేర్పడును. అట్టి ధర్మము సర్వథా రక్షింపఁబడవలయును. రావణకౌర్యపరితప్తము లయిన లోకము లందు గ్లానిఁ దొలగించి జగద్ధితముగా ధర్మమును సుప్రతిష్ఠిత మొనరింప రామావతారము జరిగినది. వైదికధర్మము సర్వథా రామాయణమునఁ బ్రతిపాదింపబడినది. అది యొక ధార్మిక గ్రంథముగానే కాక రసానంద జనిత మగు నుత్తమ కావ్యముగాను మన దేశ పూర్వచరిత్రను, సంస్కృతిని దెలుపు చారిత్రక సత్యముగాను, నాటి సాంఘిక జీవనమును బోధించు సాంఘిక శాస్త్రముగాను నెన్నఁదగియున్నది. సామాన్య విశేష ధర్మములు రెండును రామాయణమునఁ బ్రతిపాదింపఁబడినవి. మొదటిది సమాజమునకు హితము గూర్చు సత్ప్రవర్తనమును, రెండవది శాశ్వతానందమును గూర్చు జీవబ్రహ్మైక్యమును వివరించుచున్నవి.

లక్ష్మణునిఁ బ్రబోధించుచు రాముఁడు "అర్థకామాదులులేని ధర్మమును భజింపవలె ననియు, ఏది ధర్మమో దాని నాచరింపవలెననియు, కేవల మర్థకామములు దూష్యము" లనియు వివరించినట్లు వర్ణింపఁబడుట కావ్యోపదేశముగా నెన్నదగి యున్నది.

యస్మింస్తు సర్వేస్స్యు రసన్నివిష్టా, ధర్మో యతస్స్యాత్ తదుపక్రమేత
ద్వేష్యో భవత్యర్థ పరోహిలోకే, కామాత్మతా ఖల్వపినప్రశస్తా [1]

అర్థపరురాలైనకైక, కామపరుఁడైన రావణుఁడు లోకనింద ననుభవించి కష్టనష్టముల నందుట ప్రసిద్ధము. ధర్మపరుఁడైన రాముఁడు "మోనిగ్రహవాన్ ధర్మః[2]" అని మిక్కిలిగా కీర్తింపఁబడినాఁడు.

వాల్మీకి మహర్షి రామాయణము రచించుటయేగాక తానునునందొక పాత్రయై సమకాలీన సమాజమునకా కావ్యమునుఁ బ్రతిబింబముగాఁ దీర్చిదిద్దినాఁడు ఆనాటి సమాజమున సహజములగు సంఘటనలు నేఁటి దేశకాల సంస్కృతి విశేషము లనుబట్టి యసహజములుగను, నతిలోకములుగను దోఁచుచున్నను. కావ్యాధ్యయనపరులగు సహృదయులు వీని నన్నింటి నాకాలమునననుసరించి యవగాహన మొనర్చుకొనవలసినదే గాని యన్యథా వ్యాఖ్యానించు టుచితముకాదు.

---

1. వా. రా.-అయో కాం.- 21 స, 58 శ్లో.
2. వా. రా.-అర. కాం., 37 స., 13 శ్లో.

ఇక్ష్వాకూణామిదంతేషాం రాజ్ఞాం వంశే మహాత్మనాం
మహదుత్పన్నమాఖ్యానం రామాయణ మితిశ్రుతమ్
తదిదంవర్తయిష్యామి సర్వం నిఖిలమాదితః
ధర్మకామార్థసహితం శ్రోతవ్య మనసూయయా

బా. కాం—15 స., 3, 4 శ్లో॥లు.

అని వాల్మీకియే స్వయముగా విన్నవించుకొనినాఁడు. ఏబదియరువదేండ్ల క్రిందటి సాంఘిక జీవనమునకు, నిప్పటికిని యూహింపని తీవ్ర పరిణామములు జరిగిన రీతి నిప్పటికిని వయోవృద్ధులు వివరించుట యనుభవసిద్ధ మగు విషయమేగదా! వానిఁ దలచినప్పుడు విస్మయము గల్గుట సహజము. అవి యుగయుగముల నాఁటి సంస్కృతి. వైదిక ధర్మ మందుల కాలంబనము. ఆ రామాయణ కాలమున దేవతలు స్వయముగా విచ్చేసి లోకసంగ్రహణమునకై ఋషులఁ బ్రోత్సహించుట, యజ్ఞముల హవిస్సులు గొనుట, వరములు, బ్రసాదించుట జరిగెడివి. పితృదేవతలు దర్శనమిచ్చి కర్తవ్య మును బోధించెడివారు ఎల్లరును ధర్మకర్మములను, నిత్యానుష్ఠాన తపోయజ్ఞములను గావించుచుండెడివారు. దేవలోకమునకు యథేచ్ఛగా రాకపోకలు సాగుచుండెడివి. ప్రజలు స్వామిభక్తి కలిగి సత్యవ్రతము నెఱపుచు సుఖ సంపదలతో నలరుచుండెడి వారు. స్త్రీలు పతివ్రతలై యుండెడివారు. రాజ ధర్మము, గురుశిష్య సంప్రదాయము సుసంపన్నములైనవి. ఇట్టి రామాయణము విశ్వజనీనమైన కావ్యము. స్వర్గ మర్త్య పాతాళలోకములీ కథకు రంగములై ప్రవర్తిల్లినవి. నరులు, వానరులేగాక దేవదానవులు మఱియుఁ బంచభూతాత్మకమగు చరాచర సృష్టిసమస్తము నీ కావ్యమునఁ బాత్రలై విలసిల్లినవి. ఆయా ఘట్టముల నవరసములు మనోహరముగాఁ బోషింపఁబడినవి. ఇన్ని పాత్రలున్న యీ కావ్యమున నేపాత్ర కాపాత్ర ప్రత్యేకత వెల్లడియగునట్లు స్వరూప స్వభావ చేష్టాదికములు సుసూక్ష్మముగా సునిపుణతతోఁ చిత్రింపఁబడినవి. అనేక ములగు కావ్య శిల్పకళారహస్యములు ప్రదర్శింపఁబడి రామాయణ మనంతరకవుల కనుసరణీయమైనది. ఆ విషయమై వాల్మీకి యిట్లు వ్రాసుచ్చినాఁడు.

ఆశ్చర్య మిదమాఖ్యానం మునినా సంప్రకీర్తితం
పరం కవీనా మాధారం సమాప్తంచ యథాక్రమమ్।

— బాం. కాం.-4స., 20 శ్లో.

"కాళిదాసాది మహాకవుల కావ్యములందుఁ బ్రత్యేకగుణములుగాఁ బరిగణింపఁబడు విశిష్టకవితారీతు లన్నింటికి మూలము శ్రీమద్రామాయణ మహాకావ్య మే యని సతత కావ్యాధ్యయన శీలురగు సహృదయులు నుడువుట విమర్శకాగ్రేసరు లంగీకరించిన సత్యము"[1] అని శ్రీ రాచకొండ నరసింహమూర్తిగా రనుట సంభావనీయము.

## ఇతివృత్త నిర్వహణము :

రాముని బాల్యమునుండి రావణ వధాపర్యంతము వర్ణింపఁబడిన షట్కాండ పరిమితమగు పూర్వరామాయణము నందు వాల్మీకి పురుషోత్తముఁడగు రాముని మానవునిగనే చిత్రించినాఁడు. అట్టి నడవడి లోకమున కాదర్శమై నెగడినది. అందాతని కాత్మ విష్ణుత్వజ్ఞానము లేదు. అట్లుండుట బ్రహ్మ రావణున కిచ్చిన వరములకుఁ బ్రతిబంధకము. అట్టియెడ నవతార ప్రయోజనము శూన్యమగును. కావున నంతవరకు విశ్వామిత్రాదులగు ఋషులకేకొద్దిమందికో రాముఁడు విష్ణువు నవతారమని తెలియునని చెప్పవచ్చును. అట్లు తెలియుటలో తప్పులేదు. ఆత్మవిస్మృతి మానవత్వమును సూచించును. అట్టి మానవత్వ చిత్రణమున నుత్తమ గుణములనేకాక సహజ దౌర్బల్యములను గూడ వర్ణించి వాల్మీకి సహజత సంపాదించినాఁడు. సీతాగ్నిప్రవేశ సందర్భమున దేవతలు నీవే శ్రీహరివని నెత్తిన నోరు వెట్టుకొని యెంతగా మొత్తుకొనినను "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్.[2]" అని పలికినాఁడు. ఉత్తరకాండమునఁ బట్టాభిరామునిఁ జూడవచ్చిన యగస్త్యుఁడు రావణాదుల పూర్వవృత్తాంతము వివరించి యా యా యవతారములతో లోకరక్షణ మొనరించిన "శ్రీహరివి నీవే" యని నిరూపించుచు రాముని యందాత్మ విష్ణుత్వజ్ఞానము క్రమోన్మీలనము గావించినాఁడు. పితామహుని ప్రేరణమున యముఁడు తాపసవేషమున రాఁగా వానితో సర్వము నెఱింగినవాని వలె నవతారోపసంహారమునకుఁ దన సంసిద్ధతఁ దెలియఁజేసినాఁడు.[3] "యోఽహం యస్య యతశ్చాహం భగవాం స్తద్బ్రవీతు మే"[4] అను రాముని ప్రశ్నకు సమాధానమీయమగ స్త్యుని కథనము. ఇట్టి గంభీరమగు నితివృత్త

---

1. కంకంటి ఉత్తరరామాయణ పరిశోధనా వ్యాసము.

2. యు. కాం.—120 స., 11 శ్లో. 3. ఉ. కాం.—104స., 17—19 శ్లో॥లు.

4. యు. కాం—120 స., 11 శ్లో.

నిర్వహణమున వాల్మీకి ప్రదర్శించిన చాతుర్యము బహుధా ప్రశంసనీయమైనది. ఇందా ధునికులు నిర్వచించు నితివృత్త మధ్యమునఁ బూర్వకథా కథన రూపమగు పద్ధతి నిర్వహింపఁబడినది. పూర్వ రామాయణమున రాముఁడవతరించి యుద్ధతుఁడగు రావణుని సంహరించిన విధము వర్ణింపబడి, రావణుని జననాది వృత్తాంతములు, వరములు, వాని యౌద్ధత్యము, నుత్తర రామాయణమున వర్ణింపఁబడినవి. రావణాదుల సంహరించిన రాముని స్వరూప ముత్తరకాండమున రావణాదుల పూర్వవృత్తాంత కథనానంతరమున సహృదయుని హృదయమున విశిష్టముగ గోచరించుట యనుకథవైక వేద్యము.

ఇఁక నుత్తరరామాయణము పూర్వరామాయణమునకుఁగేవలము ఖిలగ్రంథముగాఁ గాక పూర్వరామాయణము నందలి పాత్రలగు రావణ కుంభకర్ణాది రాక్షసుల యొక్కయు, వాలి సుగ్రీవాంజ నేయాది వానరులయొక్కయు, జన్మవృత్తాంతములతోఁ బాటు ప్రధాన కథకు సంబంధించిన రామకృత సీతాపరిత్యాగము, కుశలవుల వృత్తాంతము, సీతాకృత భూప్రవేశము, లక్ష్మణ పరిత్యాగము, రాముని మహా ప్రస్థానము మొదలగునవి యుత్తర రామాయణేతివృత్తములుగా వర్ణింపఁబడినవి. ఇట్లు పూర్వోత్తర రామాయణ కథాభాగములు రెండును గలిసి కావ్య పరిపూర్ణతను సంతరించుకొని కృత్స్న రామాయణముగాఁ బరిగణింపఁబడినవి.

> కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్
> పౌలస్త్య వధమిత్యేవ చకారచరితవ్రతః
>
> — బా. కాం.-4సం., 7 శ్లో.

## పాత్రల స్వరూప స్వభావ వైచిత్రి :

ముల్లోకముల నాక్రమించిన యీ కావ్యేతివృత్తము సమస్తసృష్టి జాతమును బాత్రలుగా సంగ్రహించినది. ఇందు పశుపక్ష్యాదుల యొక్కయు, నర వానరుల యొక్కయు, దేవ దానవ యక్షరక్షోగణముల యొక్కయు, విచిత్ర చిత్తవృత్తులతోఁ బాటు తేజోబల వైభవ ప్రాభవములు సునిరూపితములైనవి. ఇట్టి కావ్యము సృష్టి వైవిధ్యమును బ్రకటింప సమర్థమగుచున్నది.

వాల్మీకి నారదుల సంవాదమునఁ బేర్కొనఁబడిన "గుణవాన్ కశ్చవీర్యవాన్" ఇత్యాది యుత్తమ గుణములు పదునారింటికిని రాముఁడు లక్ష్యభూతుఁడు. అట్టి

గుణగణసంస్తవమే విపులమగు రామాయణ మహాకావ్యము. ఇంకాతని యాదర్శమాన వత్వము, సీతాపాతివ్రత్యము బహుధా కీర్తింపఁబడినవి. "రామ రామయోరయనం రామాయణమ్" అను నర్థమున వాల్మీకి కృతిని రామాయణ మనుటయే గాక సీతా మహచ్చరితముగాఁ గూడ వ్యవహరించుట యౌచిత్యసుందరము.

పాపానాం శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ।
కార్యం కరుణమార్యేణ న కశ్చి న్నాపరాధ్యతి॥ [1]

అని తన్ను హింసించిన రాక్షసీబృందమును సహితము హింసింప వలదని కరుణించిన మృదుహృదయ సీత. "ఏకస్య మరణం మేఽస్తు మాభూత్సర్వ వినాశనమ్"[2] అని లోకహితము గోరియాత్మార్పణముఁ జేయఁ జాలిన త్యాగశీలి లక్ష్మణుఁడు. "సహి కళ్యాణ చారిత్రః కైకేయ్యానందవర్ధనః" అని ప్రశంసింపఁబడినవాఁడు భరతుఁడు. శత్రుఘ్నుఁడు శత్రుఘ్నుఁడు. ప్రఖ్యాత బల పౌరుషశాలి వాలి. రావణుఁడు లోక విద్రావణుఁడు. "ధర్మో రక్షతి రక్షితః" అని నిరూపించినవాఁడు విభీషణుఁడు. అపూర్వ ఘోరదర్శనులు కబంధ విరాధులు. తాటక, శూర్పణఖాది రాక్షసీస్వభావము లోకవిలక్షణము. దశరథుని మిత్రుఁడు జటాయువు పరోపకార పరాయణుఁడు. ధర్మతత్పరుఁడయ్యు, రాజ శాసనమునకు బద్ధుఁడై యనుసరించిన విచిత్ర చరిత్రుఁడు కుంభకర్ణుఁడు. విభీషణ కుంభకర్ణులు రావణసోదరు లయ్యు స్వభావముచే వైవిధ్యము నుఁబ్రదర్శించిరి. దశరథుఁడు, వాని పట్టపురాణులుఁబరమపురుషుని సంతతిగాఁ బడసిన మహితచరితులు. సుమంత్రుఁడు మంత్రిసత్తముఁడు.

శబరి ముగ్ధత, యాంజనేయుని ప్రభుభక్తి, కార్యదీక్ష, దక్షత, గుహుని సౌమనస్యము, సుగ్రీవుని మైత్రి ప్రశంసార్హములైనవి. ఋష్య శృంగుని పాత్ర మొక యపూర్వసృష్టి. మండోదరీ, త్రిజటల పాత్రలు విశిష్టములైనవి. రామలక్ష్మణుల, వాలిసుగ్రీవుల, రావణ కుంభకర్ణుల సోదరభావములలో నర, వానర-అసుర ప్రవృత్తులు నిపుణముగా నిరూపింపఁబడినవి. నీలుఁడు రాళ్ళను నీటిపైఁ దేల్చు విశేష సామర్థ్యము గలవాఁడు. స్వయంప్రభా వృత్తాంతమత్యంత సుందరము. రాముని చేతిలో నిహతులైనవారందఱు వికృతుల విడిచి యుత్తమగతులను బొందిరి. మఱియు

---

1. యు. కాం.-116 స., 44 శ్లో. 2. ఉ. కాం.-105 స., 9 శ్లో

ననుయాయులు భక్తులు రామునితో మహాప్రస్థాన మొనరించి యుత్తమలోకముల నధిష్ఠించిరి. సృష్టిస్థితి లయపరిణామమిందు సప్రమాణముగ నిరూపింపఁబడినది. "సర్వ శ్రుతి మనోహరము", సర్వోపగమ్యము నగు శైలీ లాలిత్యములు వాల్మీకి రామాయణమునకుఁ బ్రత్యేక లక్షణములు.

రాముని యశ్వమేధయాగ సందర్భమున కుశీలవు లగు కుశలవుల వలన గానము సేయఁబడిన యీ రామాయణ కావ్యము సహృదయుఁడగు పాఠకున కొక్కసారిగ మొదటినుండియు మధురమగు సంగీత రూపకముగఁ దలపునకువచ్చి హృదయమునఁ బ్రతిధ్వనించుచుండును. ఎవరెన్నిమారులీ కావ్య సౌందర్యమును బరామర్శించినను నింక నెన్నియో విశేషములతో నవ్యార్థస్ఫురణల సంభావ్యమై యల రారుచున్నది. కావుననే శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు "రామాయణ భారతములు సముద్రములు. ఏదో యొక తీరము నుండి చూడగలుగుదుము. అంతయుఁజూడఁ జాలము" అని వక్కాణించినారు. [1]

శ్రీమద్రామాయణ వైశిష్ట్యమునెన్నుచు మల్లాది గోపాలకృష్ణశాస్త్రిగారిట్లు పేర్కొనిరి—"రామాయణము నందంతటను వైదిక ధర్మ ముగ్గడింపఁబడినది. భార్య భర్త, వారి సంతానము, బంధుమిత్రాది పరివారము, వారు పాలింప వలసిన వైయక్తిక, సామాజిక ధార్మిక నిర్వహణము, పాటింపవలసిన శమదమాదులు, నిత్యనైమిత్తికములగు సంధ్యాగ్ని—ఉపాసనలు, క్రతువులు, దేవాతిథి పితృపూజలు, ప్రతివారును ననుష్ఠింపదగిన సత్యపాలన, భూతదయ ప్రియభాషణము మొదలగునవి చక్కగా నిరూపింపఁబడినవి. మరియును తండ్రి—పుత్రుఁడు, యన్న—తమ్ముఁడు, స్వామి—సేవకుడు, గురువు—శిష్యుఁడు, భగవంతుఁడు—భక్తుఁడు, మిత్రుఁడు—మిత్రుఁడు శత్రవు—శత్రువు నొండొరుల యెడ నెట్లు ప్రవర్తింపవలయునో బోధించునది రామాయణము.[2] "మానవజాతియొక్క విశేషించి భారతీయ సమాజము యొక్క (వారే మతమునకు, సంప్రదాయమునకు చెందినవారైనను సరియే) శీలచారిత్ర నిర్మాణమునకు ఉత్తమమైన సాధనము శ్రీమద్రామాయణ కావ్యసంహితయే. ఇంతకంటే నుత్తమ సాధనము మరియొకటి లేదనుట నిర్వివాదాంశము. [3]

---

1. శ్రీమద్రామాయణ వైభవము (పీఠిక) కుశీలవులు=గానవిశారదులు.

2. శ్రీమద్రామాయణ వైభవము 3. శ్రీమద్రామాయణము-విశ్వశ్రేయము.

శ్రీ కల్లూరి చంద్రమౌళిగారీ కావ్యప్రశంస గావించుచు "వైయక్తిక క్రమశిక్షణమును, సాంఘిక సమన్వయ పాలనమును, స్వరాజ, స్వారాజ్యములను సమకూర్చు సాధనములను, నాంతరంగిక శుభములను జేకూర్చు" నని పలికిరి. ఈ విధముగ రామాయణము "విశ్వశ్రేయః కావ్యమ్" అనుటకు లక్ష్యభూతమై యొప్పు చున్నది.

"భాగవతం తెలుసుకోటానికి భక్తి, భారతం తెలుసుకోటానికి భక్తితోపాటు యుక్తి, రామాయణం తెలుసుకోటానికి భక్తియుక్తులే కాకుండా శక్తి కూడా ఉండాలంటారు పెద్దలు"ని జోశ్యుల సూర్యప్రకాశరావుగారును తద్విశేషము నుగ్గడించుచుం దమ "తెలుగు రామాయణాల రమణీయత"లో వివరించినారు.

ప్రకృతి వర్ణనాపాటవము, మనస్తత్త్వ విశ్లేషణ, తత్తజ్జాతి స్వరూప స్వభావనిరూపణతోఁబాటు వాల్మీకి రామాయణమున తర్క వ్యాకరణ వాస్తు జ్యోతిష శిల్ప సాముద్రిక నిమిత్తాదులైన యనేక శాస్త్ర విషయములు సందర్భోచితముగాఁ బ్రపంచన మొనరించినాఁడు. మఱియు సాంఘిక రాజకీయ ఆర్థిక సాంస్కృతిక విశేషము లెన్నియో యిందుదోఁపించినాఁడు. ఇవి యన్నియుఁ గావ్యవైశిష్ట్యము నినుమడింపఁజేయుచున్నవి.

## మంత్రశాస్త్రము :

బ్రహ్మ నాదస్వరూపము. నాదము నుండియే యక్షరములు జనించినవి. అన్ని యక్షరములు మంత్రములే మానవశరీరమున కనుగుణమై శబ్దాభివ్యక్తి కుపకరించునవియైన యక్షరములను సన్నిహితము గావించునవి మననము చేయగా నవి మంత్రములగును. మంత్రమును జపింపగా నది పరావాక్కును స్పృశించును. అట్టిచో హృదయస్పందన మేర్పడును. అట్టి స్పందన బ్రహ్మ సంబంధమును గల్గించును. అదియే యానందానుభూతికి నెలవు. అట్టి హృదయ స్పందనను గలిగించు ధ్వనులు వాల్మీకమునఁ గలవు. అది యాతని ఋషిత్వము వలన సిద్ధించినది. గాయత్రీ బీజాక్షరముల నిబంధించుట యందులకుఁ బ్రతీక. రామాయణ పఠన కాలమున నా ధ్వనితరంగములు తమ పని సేయ నారంభించును. నిజమునకు ప్రతి కావ్యమునకు రసము, రసాలంబనమగు నాయకుఁడు, స్థాయి భావము నుండి, యాలంబనము భావమయ

1. రామాయణ సుధాలహరి

మగునప్పుడు మనస్సు తద్రూపమును జెందును. అట్టి సందర్భమున యోగమునందు సిద్ధించు నేకాగ్రత సహృదయుఁడగు పాఠకునకు సిద్ధించును. విశేషించి రామాయణమున నట్టి సిద్ధి లభించుట యనుభవైకవేద్యము. కావున ననేకులు రామాయణము జదివి యట్టి స్పందన మనుభవించి రామకథ ననేకరీతుల వర్ణించిరి. మఱియు యోగమున నుపాస్య దైవముపాసకునకు విభిన్న దశలలో, విభిన్న రూపములలో దర్శనమిచ్చునట్లు రామాయణమున రాముని రూపము వివిధ ఘట్టములలో వివిధ రీతుల దర్శనమిచ్చును. వాల్మీకి యా యా సందర్భములలో నిదమిత్థమని యంగాంగ వర్ణనఁ జేయలేదు. అట్టి వర్ణన సాధ్యము కాదు. అయినను సహృదయున కారూపము గోచర మగును. అట్టిది యపరిమితమైన మంత్రశక్తి వలన సిద్ధించును. ఇతర కావ్యము లందు కవి వర్ణించినది మాత్రమే గోచరించును. రామాయణమున—1) బాలరాముఁడు, 2) కల్యాణరాముఁడు, 3) కోదండరాముఁడు, 4) పట్టాభిరాముఁడు, 5) ధర్మప్రభువైన రాముఁడు, 6) మోక్షప్రదాత యగు రాముఁడు మొదలగు రూపముల రాముఁడు దర్శన మిచ్చుట హృదయంగమము. రామాయణము, రామాయణము నందలి భాగములు నిత్యపారాయణార్హములై నేఁటికిని పఠన పాఠనములలో నుండుట మంత్రత్వమునకుఁ దద్వైభవమునకుఁ దార్కాణము. అందు సుందరకాండ, ఆదిత్యహృదయము మొదలగునవి ముఖ్యముగా నెన్నదగి యున్నవి.

రామాయణమున నన్ని కాండలలో సుందరకాండ మత్యంత సుందరము' సురుచిరమునై యలరుచున్నది. "ఆది కవి వాల్మీకి మునిచంద్రుఁడు సైతం ముచ్చట పడిన కాండ సుందరకాండ."[1] మహర్షి యా యా కాండలలో వర్ణితమైన కథాభాగాన్ని బట్టి పేరుపెట్టి "కిష్కింధా యుద్ధకాండల మధ్య జరిగిన విశేషాలకు సుందరకాండ అని నామకరణము చేయుట"[2] ఇందులకుఁ బ్రమాణము. అందు వర్ణింపఁబడిన త్రిజటాస్వప్నము గాయత్రీమంత్రము. 3 సుందరకాండ కుండలినీ యోగమే. 4

మఱియు "గాయంతం త్రాయత ఇతి గాయత్రీ." స్తోత్రము చేయువానిని రక్షించునది గాయత్రి యని భావము. గాయత్రిని మించిన మంత్రము లేదు—

1, 2. సుందరాకాండ—ఉషశ్రీ, పీఠిక, పు. 6

3. షోడశి—గుంటూరు శేషేంద్రశర్మ, పుIIలు 104-10

4. ,, ,, పు. 87

"నగాయత్ర్యాః పరం మంత్రమ్." ఈ గాయత్రీ మహా మంత్రమునకు విశ్వామిత్రుఁడు ఋషి. సూర్యమండలాంతర్వర్తియైన నారాయణుఁడు దేవత. గాయత్రీ మంత్రము జగత్కారణుఁడైన పరమేశ్వరుని గూర్చిన ధ్యానరూపము. దీనిని జపించి బుద్ధివృత్తు లను లెస్సగాఁ బ్రవర్తింపఁజేసికొనుట ఆవశ్యకము. అందఱకు నది సాధ్యము కాదే మోనని కరుణామయుఁడగు వాల్మీకి రామాయణమున గాయత్రీ మంత్రమును నిక్షే పించెను. రామాయణమునఁ గూడఁ బ్రధాన ఋషి విశ్వామిత్రుఁడు. సూర్యవంశ సంజాతుఁడు శ్రీరాముఁడు దేవత. గాయత్రీ బీజాక్షరములను వేయి శ్లోకముల కొకటిగాఁ బ్రతిపాదించినాఁడు. ఈ రామాయణమును జపవుటచే గాయత్రీ జపించిన ఫలము సిద్ధించును."[1] అని శ్రీ భాష్యం అప్పలాచార్యులవారు సంభావించి సమన్వ యించిరి.

## యోగశాస్త్రము :

రామాయణమును యోగపరముగాఁగూడ యోజించినవారు కలరు. అందు డా॥ ఇలపావులూరి పాండురంగారావుగారు రామాయణ పరమార్థమును గూర్చి యిట్లు వివరించిరి-"తాత్త్విక దృక్పథంతో చూస్తే రామాయణం శారీరక మీమాంసగా కని పిస్తుంది. వేదాంతులు తమ వేదాంతదర్శనాన్ని శారీరక మీమాంస అనే పేర్కొన్నారు. దీనినే బ్రహ్మసూత్రం అని కూడా అన్నారు. సూక్ష్మంగా పరిశీలిస్తే ఈ బ్రహ్మ సూత్రం రామాయణంలో కనిపిస్తుంది. షట్కాండల్లో సంచరించే రామాయణ మహాయనంలో షట్చక్రాలు గోచరిస్తాయి. కైకేయి వర యాచనలో మూలాధారం, చిత్రకూటంలో స్వాధిష్ఠానం, అత్రి, అనసూయ, అగస్త్యుల ఆతిథ్యంలో మణిపూరం, కబంధ వధలో అనాహతం, పంపాసందర్శనంలో విశుద్ధి, సుగ్రీవాజ్ఞలో ఆజ్ఞాచక్రం స్పష్టంగా కనిపిస్తాయి. సీతా సందర్శనమే సహస్రారబిందు దర్శనం. రామాయణంలోని పాత్రలపేర్లు కూడా (వాలి, సుగ్రీవుడు, కుంభకర్ణుఁడు, శూర్పణఖ, దశకంథరుఁడు, కబంధుఁడు, త్రిశిరుఁడు) శరీరంలోని అవయవాలకు సంబంధించి ఉండటం గమనించదగ్గ విషయం. రాముఁడు ప్రాణస్వరూపుఁడు. సీతాదేవి ప్రణవ స్వరూపిణి. ప్రణవసమేతమైన ప్రాణసంచారమే సీతారాముల అయనం. అదే రామాయణం."[2]

---

1. సుందరకాండము—తత్త్వదీపిక, పు. 13
2. రామాయణ పరమార్థం, పు. 69

## అధ్యాత్మ కథ :

పరమార్థ దృష్టితోఁజూచినప్పుడు రాముఁడు పరబ్రహ్మ. సీత శక్తిస్వరూపిణి. వాల్మీకమునకు వ్యాఖ్యాప్రాయములైన "అధ్యాత్మ రామాయణాది" గ్రంథములీ విషయమును విదిత మొనర్చినవి.

వాల్మీకే ర్మునిసింహస్య కవితా వనచారిణః
శృణ్వన్ రామకథానాదం కో నయాతి పరాంగతిమ్.

ఇట "పరాంగతిమ్" అనునది పరలోకగమన మనియు, పరమపద మనియు నర్థద్వయము నిచ్చుచున్నది. దీనినిబట్టి "వాల్మీకి కవిగా బాహ్యమును, మునిగా అంతరర్థమును ప్రతిపాదించెనని తెలియుచున్నది. కావ్యగానమున మాధుర్యము, ఆత్మతత్త్వమును బ్రతిపాదించుటలో గాంభీర్యము, రామాయణమున కలవని తెలియుచున్నది. వాల్మీకి కోకిలయై రామకథను మధురముగ పలికెను. మునిసింహమై ఉపనిషదర్థములను గర్జించెను. మొదటి స్వరము చెవికిని, మనసునకును తరుగని హాయిని ప్రసాదించును. రెండవది శాశ్వతమగు స్థానమును చేకూర్చును."…. "శ్రీ రామాయణము బాహ్యముగ రామకథ. అంతరముగ ఆత్మకథ. రామాయణము బాహ్యముగ కావ్యము. అంతరముగ ఉపనిషత్తు." 1

తత్త్వదృష్టితో గాంచినచో రామాయణము అందలి పాత్రలు ప్రతీకాత్మత్వమును భజించి పరతత్త్వోన్ముఖమైన సమన్వయముతో నొప్పుచున్నవి.

తాత్త్వికులు రామాయణాంతరర్థము నిట్లు వెలయించిరి—"రామాయణమునందుఁ జెప్పఁబడిన కథ యంతయు ప్రతి శరీరమునఁ గలదు. మోహము అజ్ఞానము నగు సంసారము సముద్రము. రాగద్వేషాదులు రాక్షసులు. శాంతి సీత. ఆత్మా రాముఁడు రాముఁడు పంచవటి పరిశుద్ధాంతఃకరణము. తమోద్రిక్తత, మాయామోహము రావణుడు. ఈతఁడే జీవి. లంక దేహము. విషయవ్యాపారము అశోకవృక్షవాటిక.2

1. సుందరకాండము—తత్త్వదీపిక, పు. 10
2. హనుమ—శ్రీ దివాకరుని వెంకట సుబ్బారావు, పు. 5

ఈ విధముగ రామాయణము ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక మార్గ ముల నుపాదేయ మగుచున్నది. బ్రహ్మ ప్రేరేపించి, నారదుఁడుపదేశించిన కావ్యము రామాయణము వాల్మీకి దివ్యజ్ఞానమున నద్దానిని దర్శించి మధుర మధురాక్షర ముగా నక్షరతత్త్వము నాలపించి జగద్వంద్యుఁడైనాఁడు. రామాయణము శాశ్వత మైన యఖండకీర్తినంది జగమునవ్యాప్తి చెందినది. అట్టి రామాయణ వైభవ మింతింతనరానిదై యున్నది. ఎందరెన్ని గతుల వర్ణించిన నది రమణీయతను బంచి యిచ్చుచునే యున్నది.

శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు వాల్మీకిమహర్షిని సంభావించిన తీరు సహృదయ హృదయంగమమై, రామాణయము నెడవారికిఁగల దృక్పథమును వెల్లడించుచున్నది.

పుట్టం బుట్టినదిట్ట కావ్యరమకుంబుట్టిల్లు పాపౌఘమున్
మట్టంజాలినమేటి పున్నెముల విన్నాణంపు బల్పెట్టె, మే
ల్బుట్టిం బాగమరాశి కంచిత తపస్సోమాత్మ దృక్కన్యకే
ల్పెంట్టంబట్టిన సామినాచెలఁగు వాల్మీకిన్ మదిన్ గొల్చెదన్

శ్రీ. రా. క., బా. కాం 1. ఆ.

భరతఖండమున నే ప్రాంతము వారైననువారే భాషమాట్లాడు వారైనను భారతీయులందఱికిని రాముఁడారాధ్యుడు, రామాయణము పారాయణ యోగ్యమునగు చున్నది. ఈ విధముగ నీ గ్రంథము జాతీయతా భావసంపదకు మూలకందమై యొప్పు చున్నది. అట్టి రామాయణము రచించిన ఋషి ఋణముదీర్పనెవ్వరికి సాధ్యముకాదు.

కావుననే శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు
"ఈ సంసారమదెన్నిజన్మలకు గానీ మావివాల్మీకిగా
ధాసంక్రాంతఋణంబు దీర్పఁ గలదా! తత్కావ్య నిర్మాణచే
ఖా సామగ్రి ఋణంబుఁ దీర్పగలదా!" అని ప్రశ్నవేసికొని కర్తవ్యముగా నెంచి కృతజ్ఞతతోఁ దాను "శ్రీమద్రామాయణ కల్పవృక్షమును" గానముచేసి భక్త్యం జలి ఘటించినారు.

# భారతీయ భాషలలో రామాయణము

శ్రీమద్వాల్మీకి రామాయణము భారతీయ సంస్కృతిని బ్రతిబింబింపఁ జేయు నుత్తమ గ్రంథము. సహజ రసానుకూల్య మగు రామకథ వాల్మీకి వాక్కులందలి మాధుర్యముతోఁ గలిసి మహత్త్వపూర్ణమగు మహాకావ్యముగాఁ బరిణమించి యాస్వాదయోగ్య మగుచున్నది. ఆదికావ్య మగు నీ రామాయణము కవిలోకమున నుపాదేయమై భారతీయ భాష లన్నింటిలో ననేక ప్రక్రియలద్వార కీర్తింపఁబడినది. సంస్కృతముననే యియ్యది విశ్వరూపము దాల్చి వివిధముగ దర్శన మిచ్చుచున్నది. అందులో ననంత కల్పనాశిల్పము చోటు చేసికొనినది. తక్కిన భాష లన్నియుఁ దదనుగుణముగా రామకథా సుధామాధుర్యఫలములఁ బంచిపెట్టి తమ కృతకృత్యతను బ్రకటించుకొనినవి. ఈ రామకథ భరతఖండముననే గాక ఖండాంతర భాషల యందును బ్రసిద్ధిగాంచినది. ఇందు శ్రీ ములుకుట్ల నరసింహావధానిగారి శ్రీరామాయణ సారోద్ధారము, శ్రీమతి పండా శమంతకమణిగారి తెలుఁగు సాహిత్యములో రామకథ, శ్రీ విద్వాన్ రావూరి దొరసామిశర్మగారి తెలుఁగు సాహిత్యములో రామకథ, డా॥ జే. వి. సుబ్బారాయుఁడుగారి "తెలుగులో రామాయణాలు" మొదలగు గ్రంథముల నాధారముగాఁ జేసికొని రామాయణమే యే భాషలలో నెట్లెట్లు వర్ణింపఁబడినదో స్థూలారుంధతీన్యాయముగాఁ బరిశీలింపఁబడుచున్నది. అధ్యాత్మ రామాయణానువాదములు నిందుఁ జెప్పఁబడుచున్నవి.

సంస్కృతమున నధ్యాత్మరామాయణము, వాశిష్ఠ రామాయణముల వంటి రామాయణములు 24 అర్ష ప్రోక్తములుగాఁ జెప్పఁబడుచున్నవి. మహాభారతమునందష్టాదశ పురాణముల యందీ రామోపాఖ్యానము వర్ణింపఁబడినవి. ఇవికాక-1) రామాయణ రత్నాకరః, 2) ఉమాసంహితా, 3) ఆగస్త్య సంహితా, 4) పాంచరాత్రాగమస్థ పద్మసంహితా, 5) పరాశరసంహితా, 6) శ్రీరామ పూర్వోత్తరతాపిన్యుపనిషదౌ, 7) తారసారోపనిషత్, 8) రామచంద్ర కథామృతమ్, 9) ప్రసన్నరత్నావళిః, 10) రామాయణ సారసంగ్రహః, 11) రామహృదయోపనిషత్, మొదలగునవియు రామకథను బ్రస్తావించుచున్నవి. ఇంకను కావ్యములందీ రామకథ యిట్లు వర్ణింపఁబడినది.

1) కాళిదాసు—రఘువంశము
2) భట్టి—రావణవధ

3) కుమారదాసు—జానకీహరణము
4) భోజరాజు—చంపూరామాయణము (భోజచంపూ)
5) దేవయార్యుఁడు—ప్రసన్నరామాయణము
6) సాళువ నరసింహరాయ—రామాభ్యుదయము
7) వామనభట్టబాణుఁడు—రఘునాథచరితము
8) అభినందుఁడు—రామచరితము
9) మాధవవిద్యారణ్యులు—రామోల్లాసము
10) వేంకటనాథకవి—పాదుకాసహస్రము
11) అభిరామకామణి (కవయిత్రి)—అభినవరామాభ్యుదయము
12) మధురవాణి—రామాయణ సంస్కృతానువాదము
13) రాజచూడామణి దీక్షితుఁడు—రామకథ
14) చక్రకవి—జానకీపరిణయము
15) వేంకటేశుఁడు—రామయమకార్ణవము, రామచంద్రోదయము, రామకర్ణామృతము.
16) శరభోజి—రాఘవచరిత్రము
17) విష్వక్సేనుఁడు—రామచరితము
18) గోపాలరాజు—రామచంద్రోదయము

ఇంకను క్షేమేంద్రుని రామాయణమంజరి, శాక్యమల్లుని ఉదార రాఘవము, చిత్రకవి జానకీపరిణయము, రఘునాథుని రామచరిత్రము, శేషకవి కల్యాణరామాయణము, వీరరాఘవుని భద్రాద్రి రామాయణము, రఘునందన విలాసము, విక్రమరాఘవము, ఉత్తరరాఘవము మొదలగునవి రామకథా, రామప్రభావ ప్రతిపాదక పద్యకావ్యములు.

కవిరాజకృత మగు రాఘవపాండవీయము, హరదత్తసూరి రాఘవ నైషధీయము, సోమేశ్వరకవి రాఘవ యాదవీయము, ధనంజయుని రాఘవ పాండవీయము, వేంకటాధ్వరి యాదవ రాఘవీయము మున్నగునవి ద్వ్యర్థికావ్యములు. చిదంబరకవి రాఘవ యాదవ రాఘవీయము, అనంతార్య యాదవ రాఘవ పాండవీయము మున్నగునవి త్ర్యర్థి కావ్యములు. ఇంక చిత్రకావ్యము లెన్నియో కలవు. భోజరాజు చంపూ ప్రక్రియ ననుసరించి లక్ష్మణుఁడు, రాజశ్యాముఁడు, ఘనశ్యాముఁడు

ఏకామ్రనాథుఁడు మొదలగువారు పూర్వరామాయణ కథాచంపువులను, యతిరాజు, శంకరాచార్యుఁడు, హరిహరనాథుఁడు, వేంకటాధ్వరి, గరళపురిశాస్త్రి మొదలగువారు ఉత్తరరామాయణ కథాసంబంధు లగు చంపూకృతులను వ్రాసినవారిలోఁ బ్రసిద్ధులు. వాసుదేవుఁడు, దేవవిజయగని, సార్వభౌముఁడు అను కవులు రామకథ గద్య కావ్యముగా సంతరించిరి.

## నాటకములు :

ఇంకఁ గొందరు రామకథాప్రధానములగు నాటకముల రచించి నారు. అందు భాసుఁడు వ్రాసిన యజ్ఞఫలము, ప్రతిమ, అభిషేకనాటకములు, దిఙ్నాగుని కుందమాల, భవభూతి మహావీరచరితము, ఉత్తరరామచరితము, శక్తిభద్రుని ఆశ్చర్య చూడామణి, మురారి అనర్ఘరాఘవము, రాజశేఖరుని బాలరామాయణము, జయదేవుని ప్రసన్నరాఘవము, రామభద్రుని జానకీపరిణయము, మహాదేవకవి అద్భుతరామాణము, భాస్కరకవి ఉన్మత్తరాఘవము, మాయురాజు ఉదాత్తరాఘవము మొదలగునవి ప్రసిద్ధములు.

## శ్రీమద్రామాయణము - ఆంధ్రానువాదములు :

ఆసేతుహిమాచలము వ్యాప్తి నంది యీ రామకథ భారతీయ భాష లన్నింటిలో వివిధ ప్రక్రియల ననుసరింపఁబడి, యెనలేని ఖ్యాతి నందినది. అందు నాంధ్ర దేశ ప్రజలకు రామాయణమునకు నత్యంత సన్నిహితసంబంధము కలదు. రాముఁడరణ్యవాససందర్భమునఁ గొంతకాల మీదేశమున నివసించి యుండుటఁ దత్పాదస్పర్శచే నిది పవిత్రత సంతరించుకొనినది. రాముఁ డాంధ్రుల కిష్టదైవము. అందు జననామములు, గ్రామనామములు విశేషముగ రామాయణ సంబంధము గలవై యుండుట ప్రసిద్ధము. ఇప్పటికిని వివాహాదు లందు సీతారాముల పెండ్లిపాటలే పాడుట పరిపాటి. ఆదర్శ దాంపత్యమునకు సీతారాములే యుదహరింపఁబడుటయు, రామ దేవాలయములు, భజన మందిరములు, భక్త సంఘములు నాంధ్రమున నెచ్చోటఁ జూచిన దర్శన మిచ్చుచు "జగమంతా రామమయ" మనుటను నిరూపించుచున్నవి. అట్లే సాహిత్యమున రామ కథానకములకుఁ బ్రముఖస్థానము గలదు. అందుఁ బ్రతి కవియు నేదోవిధముగ రామునిఁ దలపోయని సందర్భము గానరాదు.

ఆంధ్రమున వాల్మీకి రామాయణము యథామాతృకముగను, స్వతంత్రముగను ననువదించిన ఘట్టములు పెక్కు గాననగు చున్నవి. అందు బూర్వరామాయ

ణము గొందఱు, నుత్తరరామాయణము గొందఱు, నేక దేశములను మరికొందఱు వ్రాసిరి. సంపూర్ణరామాయణమును వ్రాసిన వారును గొందఱు కలరు. అందు—

## చంపూకావ్యము :

1) నన్నయ వ్రాసిన రాఘవాభ్యుదయము, తిక్కన తాతగారు రచించిన రామాయణము, ఉపలభ్యము కాలేదు.

2) ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము అలభ్యము

3) భాస్కరరామాయణము భాస్కరాదులచే విరచితము (12–13 శతాబ్ది మధ్యభాగము)

4) కొలని సత్యనారన-ఆంధ్రకవితాపితామహుం డని బిరుదు-సింహాసన ద్వాత్రింశిక యందు కొలని గోపరాజీ విషయమును వివరించినాడు— గ్రంథమలభ్యము.

5) మొల్ల రామాయణము—కవయిత్రి మొల్ల

6) సకల వర్ణనాపూర్ణ రామాయణము—చిత్రకవి వేంకటరమణ

7) రఘునాథ రామాయణము—రఘునాథరాయలు

8) యథావాల్మీకి రామాయణము—ఘనగిరి రామకవి—గ్రంథ మసమగ్రము.

9) యథావాల్మీకి రామాయణము — మానూరి గోపాలరావు — జయంతి రామయ్య పంతులుగారు ఆధునికాంధ్ర వాఙ్మయవికాస వైఖరిలో దీని గూర్చి ప్రస్తావించిరి (116 పు.)

10) యథాశ్లోక తాత్పర్య రామాయణము—గద్వాల సంస్థానాధిపతి యగు చినసోమ భూపాలుని యాస్థానవిద్వాంసులు కాణాదము పెద్దన సోమయాజి మొదలగువారారుగురు ఆరు కాండలు రచించిరి.

11) రామాయణము—కవి "చెన్నూరు రామన్న"

12) రామాయణము—బసవకవి—కావలి వేంకటరామస్వామి దక్కను కవుల చరిత్రలో నిది ప్రశస్త రచన యని తెలిపిరి—గ్రంథ మలభ్యము.

13) రామాయణము - వారణాసి లక్ష్మీపతి—శ్రీపాద వేంకటచలపతికవి-రామకృష్ణోపాఖ్యాన ద్వ్యర్థికావ్యమువ నిది పేర్కొనఁబడినది.

14) శారద రామాయణము-మడివ్యాళయ్య-గ్రంథ మముద్రితము.

15) గోపీనాథ రామాయణము - గోపీనాథము వేంకటకవి.

16) ఆంధ్రవాల్మీకి రామాయణము - శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గ్రంథము 7 కాండలు. వ్యాఖ్యానసహితము

17) ఆంధ్రశ్రీమద్వాల్మీకి రామాయణము - జనమంచి శేషాద్రిశర్మ-వీరే ధర్మసార రామాయణము గూడ రచించిరట.

18) సుభద్రారామాయణము - సీరము సుభద్రాంబ.

19) సరస్వతీ రామాయణము - చేబ్రోలు సరస్వతీదేవి.

20) శ్రీకృష్ణరామాయణము - శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

21) శ్రీరామాయణము - వేంకటపార్వతీశకవులు- (వేంకటరావు - పార్వతీశము.)

22) రామాయణ కల్పవృక్షము (విశ్వనాథ రామాయణము) —శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

23) విశిష్టరామాయణము - గడియారము వేంకటశేషశాస్త్రి (నిర్వచనము)

24) విచిత్రరామాయణము-నరసింహదేవర వేంకటశాస్త్రి-చంపూ 7 కాండలు.

25) శ్రీయోగానందాంధ్రరామాయణము - చిల్లరిగె యోగానందయ్యపంతులుగారు.

26) గోవిందరామాయణము-ఆత్మకూరి గోవిందాచార్యులు 7కాండలు రచింపఁబడినవి

27) శ్రీమద్రామాయణము - కోపల్లె శివకామేశ్వరరావు

28) శ్రీమద్వాల్మీకి రామాయణము - అమర్ అలీషాకవి. "ఆంధ్రరచయితలు" అను గ్రంథమున విట్లని శ్రీమధునాపంతుల వారు చెప్పిరి.

## ద్విపదరామాయణము :

1) రంగనాథరామాయణము-గోనబుద్ధారెడ్డి (నేటికిని కర్తృత్వము వివాదగ్రస్తము)

2) ద్విపదరామాయణము-తాళ్లపాక అన్నమాచార్యులు-చిన్నన్న తన అన్నమాచార్య చరిత్రమున నన్నమాచార్యులు రామాయణము రచించెనని పేర్కొనెను.

3) వరదరాజ రామాయణము - కట్టా వరదరాజు - "శ్రీమద్రామాయణము"ని దీనికి నామాంతరము.

4) ఏకోజీరామాయణము - భోసల ఏకోజీ.

5) ద్విపదరామాయణము - రాఘవరెడ్డి - ఈతను ద్విపదలో రామాయణము రచించినట్లు గోలకొండ కవుల సంచిక తెలుపుచున్నది.

6) వినుకొండ రామాయణము - విజయరామకవి - ఆంధ్రసాహిత్య పరిషత్తు నందు దీని ప్రతి భద్రపరుపఁబడినది.

7) మానికొండ రామాయణము - మానికొండ సత్యనారాయణశాస్త్రి- "తెలుగు వాల్మీకమ"ని దీనికి నామాంతరము.

8) ద్విపద రామాయణము - కవి ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రి

## ద్విపదోత్తర రామాయణములు :

ఉత్తరకాండ మాత్రమే ద్విపదలో రచించినవారు గొందఱు కలరు.

1. రంగనాథ రామాయణము-గోనబుద్ధారెడ్డి పూర్వరామాయణము రచింప నాతని తనయులు కాచభూపతి, విఠలరాజు అను (సోదర కవులు) వారు ఉత్తరకాండ వ్రాసి కావ్యమును బూరించిరి.

2) ద్విపదోత్తర రామాయణము-ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు.

## కావ్యములు :

రామకథ నాలంకారిక పద్ధతిలో రసప్రధానముగ, వర్ణనాప్రచురముగ, సంక్షేపముగ వర్ణించినవారు కలరు. ఇట్టి ప్రక్రియనే యాంధ్రమునఁ బ్రబంధ మని కావ్యమనియుఁ బేర్కొనిరి. 16వ శతాబ్ది యందు వెల్లివిరిసిన ప్రబంధవాఙ్మయమున రామకథాత్మక కావ్యములు పెక్కులు కలవు.

1) రామాభ్యుదయము - కవి : అయ్యలరాజు రామభద్రుఁడు

2) రామచంద్రోపాఖ్యానము - రేవణూరి వేంకటార్యుఁడు

3) రామవిలాసము - ఏనుగు లక్ష్మణకవి

4) రామకథాభిరామము - అనంతరాజు జన్నయ

5) రామకథాసారము - దిట్టకవి పాపరాజకవి

6) రామచంద్రోపాఖ్యానము - మిక్కిలి మల్లికార్జునుఁడు - దీనికి రామచంద్ర చరిత్రమని నామాంతరము - ఇందు 7 కాండలకథ వర్ణితము.
7) రామచంద్రోపాఖ్యానము వారణాసి వేంకటేశ్వరకవి
8) సీతారామచరిత్రము - మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి
9) శ్రీరామావతారము - వడ్డాది తిమ్మరాజకవి - ఏకాశ్వాస ప్రబంధము
10) రామకథా సారసంగ్రహము - మండ కామేశ్వరశాస్త్రి
11) రామకథా సుధాలహరి - చామర్తి శేషగిరిరాయకవి
12) దాశరథి విలాసము - క్రొత్తపల్లి లచ్చయకవి
13) పట్టాభిరామవిలాసము - నాగలింగకవి
14) శృంగారరాఘవము - చెఱుకుమూడి కృష్ణయ
15) రఘురామవిజయము - అవంచ నావన
16) సీతాచరిత్రము - అప్పలరాజు
17) శ్రీరామచరిత్రము-నండూరి బాపమంత్రి
18) రామోదయము-రంగయ-షట్కాండములు వ్రాయఁబడినవి
19) శ్రీమద్రామాయణ కథాసంగ్రహము-కవయిత్రి కాంచనపల్లి కనకాంబ
20) జనప్రియ రామాయణము-శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

## అచ్చతెనుఁగు కావ్యములు :

1) యయాతి చరిత్ర - పొన్నెగంటి తెలగనార్యుఁడు - తొలి యచ్చతెనుఁగు కబ్బము. ఇందు సందర్భము గల్పించి యాతఁడు రామకథఁ జొప్పించినాఁడు.
2) శుద్ధాంధ్ర రామాయణము - అడిదము భాస్కరకవి-ఈతడు శుద్ధాంధ్ర రామాయణము వ్రాసినట్లు సూరకవి కవిజనరంజనమున గల యాశ్వాసాంత గద్యమున తెలియుచున్నది—గ్రంథ మలభ్యము
3) అచ్చతెనుఁగు రామాయణము — కూచిమంచి తిమ్మకవి
4) శుద్ధాంధ్ర నిరోష్ఠ్యసీతాకల్యాణము - మరింగంటి సింగరాచార్యులు
5) శుద్ధాంధ్రోత్తర రామాయణము-శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు
6) నిరోష్ఠ్యసీతాకల్యాణము - పిడుపర్తి బసవప్ప
7) అచ్చాంధ్ర నిరోష్ఠ్యనిర్గద్యదాశరథి చరిత్ర - అబ్బరాజు హనుమంతరాయశర్మ

## ఉత్తరరామాయణములు :

7 కాండలు గల వాల్మీకి రామాయణమున భాస్కరాదులు కొందఱు 6 కాండల కథయే యాంధ్రీకరించిరి. అందుత్తర కాండ వ్రాయఁబడలేదు. అందుల కనేక కారణము లున్నను ముఖ్యముగాఁ గొందఱు ఉత్తరకాండ వాల్మీకి కృతము కాదని యభిప్రాయపడుట, దానికిఁ బ్రసిద్ధులు వ్యాఖ్యానము వ్రాయకుండుట వారు చూపిన యుక్తులలో నొకటి. వాస్తవమున కది నిజము కాదు. ఉత్తరకాండకు శ్రీ గోవింద రాజీయాది వ్యాఖ్యానములు గలవు. అవి సంస్కృతమున "చౌకాంబా ప్రెస్"వారు ముద్రించిరి. అదియునుగాక ఉత్తరకాండము లేనిచో రామాయణమున 24,000 శ్లోకములు వ్రాయఁబూనిన వాల్మీకి ప్రతిజ్ఞ పారము ముట్టనేరదు. రావణాదుల పూర్వచరిత్ర, రాముని రాజ్యపరిపాలనా విశేషములు, రాముని సంతానము యజ్ఞయాగాది క్రతు నిర్వహణము, అవతారోపసంహారము మొదలగు ముఖ్యాంశములతోఁ గూడిన యుత్తరకాండ లేక రామాయణము పూర్తి కాదు. కావున నా కథాభాగమును ప్రత్యేకముగా రచించిన మహాకవులు కొందఱు గలరు. అందు ముఖ్యమైనవి—

1) నిర్వచనోత్తర రామాయణము - తిక్కన
2) ఉత్తరరామాయణము - కంకంటి పాపరాజు
3) ఉత్తరరామాయణశేషము-జయంతి రామభట్టు-తిక్కన కృతి కిది శేషపూరణము
4) పట్టాభిరామాయణము - ఘట్టా వేంకటరామకృష్ణకవి
5) పట్టాభిరామాయణము - శరగోపాలావారి
6) ఆంధ్రరామాయణాద్భుతోత్తరకాండము - నందగిరి వేంకటప్పారావు పంతులు

## తెనుఁగులో అధ్యాత్మ రామాయణానువాదములు :

అధ్యాత్మరామాయణము దెనుఁగున ననేకు లనేక ప్రక్రియలలో రచించిరి. 1. పద్యకావ్యములు, 2. ద్విపదకావ్యములు, 3. యక్షగానములు, 4. కీర్తనలు, 5. వచన గ్రంథములు.

## చంపూకావ్యములు :

1. అధ్యాత్మరామాయణము — కంచర్ల శరభనకవి

2. అధ్యాత్మరామాయణము - ఉ
వామనపురాణమున సీతc డధ్యా
నది. నేcడీ రామాయణ మలభ్య

ఇంకను రాపాక శ్రీరామకవి, కాణాదము పెద్దన రామపంతుల రామమూర్తి, ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు, నాథకవి, కోటమరాజు నాగయ, కృష్ణగిరి వేంకటరమణకవి, అల్ల కవి, రామయామాత్యులు, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి, ఉప్మాక శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు మొదలగువారు 18–20 శతా రామాయణము నాంధ్రీకరించినవారిలోc బ్రముఖులుగాc గీర్తింప

ఆంధ్రమున నింకను ననేకార్థక కావ్యములు, చిత్రకావ్యములు, రామకథైక దేశికములు, రామకథా ప్రాస్తావికములు, రామ మహిమాత్మకములు, శతకములు, దండక ములు, లఘుకృతులు, చాటువులు, యక్షగానములు, వచనకావ్యములు, నాటకములు, ఉపాఖ్యానములు, ఖండకావ్యములు, సంకీర్తనలు, హరికథలు, బుఱ్ఱకథలు, జానపద గేయములు, వ్యాసములు, విమర్శనములు మొదలగునవి యెన్నియో రామకథా సంబంధములు వెలసినవి.

## వంగసాహిత్యము :

1) "కృత్తివాస" ఓఝూరామాయణము - మఱియు నీకవి రచించిన "సీతారబార మాస్యా", "లక్ష్మణేర్ శక్తిశేల", "రామరాస", "అద్భుతరామాయణ" మున్నగు నవి రామకథా ప్రధాన కావ్యములు గలవు.

2) "రామాయణగీత" - చంద్రావతి

3) "దళ్యుకేనరామా" - చంద్రావతి

4) "రామశంకర రామాయణము" - రామశంకరదత్తు

5) "విష్ణుపురీ రామాయణము" - శంకరకవిచంద్ర

6) సీతావనవాస
7) ఉత్తరరామచరిత్ర — ఈశ్వరచంద్ర విద్యాసాగర్

8) "రామాయణ"-జయప్రసాద, రామప్రసాదులు [తండ్రి కొడుకులు]
9) వాల్మీకి ఓతత్సామయికవృత్తాంతే – ప్రఫుల్లచంద్ర వంద్యోపాధ్యాయ
10) వాల్మీకి ప్రతిభ - రవీంద్రనాథఠాగూర్
11) మేఘనాథవధ - మైకేల్ మధుసూదనదత్
12) సీతాపహరణ - ద్వారకానాథరాయి

ఇంకను ఈ భాషయందు పెక్కు రామకథానకములు, కావ్యములు, నాటకములు మొదలగునవి స్వతంత్రానువాద పద్ధతులలో వ్రాయబడి ప్రచారములో నున్నవి.

**ఓఢ్రిసాహిత్యము :**

ఇందు సరళాదాసు "విలంక రామాయణము", విచిత్రరామాయణము" బలరామ్‌దాస్ "బలరామ్‌దాస్‌రామాయణము" ఇంకను గొందఱు వ్రాసిన కావ్యములు ప్రచారమున గలవు.

**పంజాబీసాహిత్యము :**

"రామలీల" నాటకము

**కాశ్మీర సాహిత్యము :**

ఇందులో దివాకర ప్రకాశభట్టు అను నామాంతరము గల ప్రకాశరాముఁడు రామావతార చరిత, లవకుశయుద్ధచరితములను రచించెను.

**హిందీసాహిత్యము :** శ్రీరామచరితమానస్-తులసీదాసు. సాకేత-మైథిలీశరణగుప్త.

**తమిళసాహిత్యము :** కంబరామాయణము – కంబకవి

**కన్నడసాహిత్యము :**

1) భువనైక రామాభ్యుదయము - పొన్నకవి
2) రామచంద్రచరిత్రపురాణము—నాగచంద్రుఁడు
3) తొరవె రామాయణము-కుమారవాల్మీకికవి
4) రామధ్యానచరిత - కనకదాసు

5) సీతాకల్యాణము - హెళవనకట్టె గిరియమ్మ
6) రామకథావతారము—దేవచంద్రకవి
7) ఉత్తరరామచరిత - బసవప్పశాస్త్రి

ఇంకను ఆధునికులు పలువురు కన్నడమున రామకథాప్రధాన మగు కావ్యములు వ్రాసిరి.

మళయాళ సాహిత్యము :

1) రామచరిత
2) కట్టళకపాట్టుగళ్ - కావ్యసంపుటము
3) కట్టిళరామాయణము - రామఫణిక్కర్
4) అధ్యాత్మరామాయణము } ఎళుత్తచ్చన్
5) ఉత్తరరామాయణము }
6) రామాయణచంపువు - పునంనంబూద్రి
7) రామనాట్టం అట్టకథ - కొట్టారకారతంబురాన్

మహారాష్ట్రి సాహిత్యము :

1) రసాళరామాయణము - నరహరిసోనార్
2) సుందరకాండము, యుద్ధకాండము-సమర్థరామదాసస్వామి
3) సీతాస్వయంవర్ -జయరామస్వామివడగాంకర్
4) లవకుశాఖ్యానము
5) పద్మరామాయణము
6) దామరామాయణము } మోరోపంత్ రచనలు
7) సీతాగీతము
8) మంతర్ రామాయణము

ఇట్లు రామాయణగాథ భారతీయ భాషలలో ననేక రూపముల వెలసినది. సంగ్రహముగా నా విషయ మిక్కడ బ్రస్తావింపబడినది.

క్రీ. పూ. 2వ శతాబ్దికి ముందు శాలివాహనచక్రవర్తి కాలమున జీవించి యున్నట్లు చెప్పఁబడుచున్న గుణాఢ్యమహాకవి పైశాచీభాషలో రచించిన "కథాసరిత్సాగరము"నందును రామాయణ కథాసారము గలదు. ఇంకను బౌద్ధజాతకకథ లందు రామాయణము వర్ణింపఁబడినది.

థాయ్, రష్యన్, జపనీస్, మలయా, ఇండోనేషియా మొదలగు భారతీయేతర భాషలందును రామకథ కొద్ది మార్పులతోఁ గానవచ్చుచున్నది. ప్రపంచమున్నంత కాలమీ రామాయణ ముండునని బ్రహ్మ వచనము గదా! అది యట్లే లోకమున వ్యాపించినది.

యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే
తావద్రామాయణకథాలోకేషు ప్రచవిష్యతి

— బాం. కాం.-2 స., 36 శ్లో.

చరితం రఘునాధస్య శతకోటి ప్రవిస్తరమ్ ।
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్ ॥

యః కర్ణాంజలి సంపుటై రహరహస్సమ్యక్పిబతాదరా
ద్వాల్మీకేర్వదనారవింద గళితం రామాయణాఖ్యం మధు
జన్మవ్యాధి జరావిపత్తి మరణై రత్యంత సోపద్రవం
సంసారం సవిహాయగచ్ఛతిపుమాన్విష్ణోః పదం శాశ్వతమ్॥

# శ్రీరామకథాఽమృత రచనోద్దేశము

శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు పరమేశ్వరసేవాయత్తచిత్తవృత్తులై యధ్యయనాధ్యాపనాది సత్కర్మానుస్థానపరులై యుండ 1920 సం॥ ప్రాంతమున నొకనాడు దైవానుగ్రహమున వీరి కప్రయత్నముగ శ్రీ సీతారామ వివాహఘట్టము నందలి ఈ క్రింది పద్యము స్ఫురించినదట.

ఈయది సీత నాసుత సదీడిత త్వత్సహధర్మచర్యకుం
బాయక నిల్చు సాధ్వి పరభాగమహోన్నతచాయవోలె ని
న్నేయెడగొల్చు భద్రమిఁక నింతి కరంబుఁ గరంబునం గ్రహ
ర్షాయితవృత్తిగైకొనుము సంపద సొంపెసలారుచుండఁగన్
— బా. కాం-10 ఆ., 364 ప.

అంత శాస్త్రిగారా పద్యమును బర్యాలోచించుచునది-

ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ
ప్రతీచ్ఛచైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వపాణినా
— బా. కాం..73 స., 2 శ్లో

అను వాల్మీకి శ్లోకభావానుసరణముగా గుర్తెఱింగి పూర్వాపర సందర్భము లను గూర్చుకొని లోకకల్యాణకారకు లగు సీతారాముల కల్యాణమహోత్సవ కథా భాగమును "మైథిలీ పరిణయము"ను పేర ముందుగా నారాశ్వాసముల ప్రబంధముగా నిబంధించిరి. అనంతర మది శ్రీరామకథాఽమృతమున బాలకాండగా సిద్ధము చేయఁబడి శ్రీ రామపట్టాభిషేకోత్సవము వఱకు గల షట్కాండ పరిమిత రామాయణము రచింపఁబడినది. ఉత్తరకాండము రామాయణము నందలి సంశయాస్పదములగు ననేక విషయములకు సమాధానభాగ మగుటను మఱియు రామునకు నాత్మవిష్ణుత్వజ్ఞాన మేర్పడి మహాప్రస్థానము వరకు వర్ణింపబడినగాని యుపక్రమోపసంహారపూర్వకమగు రామావతార వర్ణన సంపూర్ణము గాదు కావునను, నుత్తర కాండ ప్రారంభించి 1500 పద్యములు మాత్రము రచించి వేంకటప్పయ్యశాస్త్రిగారు పరమేశ్వర స్వరూపులు కాఁగా వారి కుమారులు శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు తండ్రి యాదేశానుసారము 6 వేల

పద్యములతో నద్దాని శేషపూరణ గావించిరి. ఇట్లు పితాపుత్రులా రామాయణము నకు "శ్రీరామకథాऽమృతము"ను పేర సమగ్ర స్వరూమును గూర్చిరి.

శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు బాలకాండ పీఠికలో "శ్రీరామకథాऽమృత మను పేర నేనీ యాంధ్ర ప్రబంధమును రచింపఁదొరఁకొని శ్రీ వాల్మీకి సంయమి వ కృతి నాంధ్రీకరించుచు నధ్యాత్మరామాయణ ఘట్టము లిందుఁ జేర్చుచు ననుబంధి వర్ణనాంశ ముల స్వతంత్రించుచు నీ గ్రంథము నుత్తరకాండంబు తోడం గూడ, గాయత్రీ చతుర్వింశతి వర్ణాంకిత చతుర్వింశతిసహస్ర గద్యపద్యాత్మకంబుగ మునిభావరహస్య వివరణంబొప్పఁ దత్ప్రసాద విశేషంబునం బూరింపఁ గలిగితిని," అని పేర్కొనుటం బట్టి వారు నిర్మింపఁ దలచిన గ్రంథ స్వరూపము, ప్రణాళికయు వెల్లడియగుచున్నవి. "శ్రీరామ కథాయాః అమృతమ్" శ్రీరామకథాऽమృతమ్."

శ్రీరామకథాऽమృత మనగా శ్రీరామకథలోని సార మనియు "మునిభావ రహస్యవివరణ" మందలి ప్రధానోద్దేశ మనియు దెలియుచున్నది. ఆ విషయమే శాస్త్రిగారు—

తన్మునిమథిత చరితమున సారాంశం
బనునిది రామకథాऽమృత
మను సంజ్ఞం దనరియుంట కర్థంబెకదా !
బా. కాం.- 1 అ.' 36 ప.

అని సంభావించినారు. మఱియు శ్రీరామకథాऽమృత మనఁగా నిట్లు భావింప దగియున్నది.

1) శ్రీరామకథా ఇతి అమృతమ్—శ్రీరామకథాऽమృతమ్
"శ్రీరామకథ"యను అమృతము గావున నిది శ్రీ రామకథాऽమృతము.

2) శ్రీరామకథా ఏవ అమృతమ్—శ్రీరామకథాऽమృతమ్
శ్రీరామకథయే స్వయముగా నమృతము గావున నియ్యది శ్రీరామకథాऽమృతము

3) శ్రీరామకథానాం అమృతమ్—శ్రీరామకథాऽమృతమ్
లోకమున నున్న రామకథ లన్నింటిలోని సార మిందుఁజేర్చి చెప్పఁబడినది గావున నిది శ్రీరామకథాऽమృతము.

ఈ గ్రంథ రచనోద్దేశమునకుఁ బేరిరణఁ గలిగించిన విషయములను గూర్చి చెప్పుఁచు "శ్రు॥ భద్రో భద్రయా సచమాన అగాత్స్వసారం జారో అభ్యేతి పశ్చాత్" అనునిది మొదలగు శ్రుతియు, రామతాపినీ, రామహృదయాద్యుపనిషత్తులును రామచరిత్ర ప్రశంస నొనరించుచుండుటయు, నభినవగుప్తదులగు నలంకార శాస్త్రవేత్తలు "బ్రహ్మా నందాదవ్యతిరిచ్యతే కావ్యరసః" అనియు "నాయకో యది వర్ణ్యేత లోకోత్తర గుణో త్తరః" అనియు, ఉత్తమోత్తమ నాయకస్తు శ్రీరామ ప్రభురేక ఏవ, అనియు వక్కా ణించియున్నారు. మురారి భట్టకవీంద్రుఁడును దన నాటకమున, రామచరితమును రచింపని కవుల యగలికత్వమును నిరూపించియున్నాఁడు. ఇట్టి హేతు పరంపరలు ప్రబంధరచనా కుతూహలి యగు నా హృదయమునఁ బ్రవేశించి ప్రేరేపించినవ"ని శాస్త్రి గారు పీఠికలో వివరించియున్నారు.

ప్రపంచమున మానవుఁ డెంత విజ్ఞానమును సంపాదించినను జిత్తశాంతి దాని పరమావధి. అట్టిది కావ్యము వలనఁ గలుగును. అలంకారికులు పరనిర్వృతి దాని ముఖ్యప్రయోజనముగా నెన్నుట గమనింపదగియున్నది. శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారును "అభినవగుప్తపాదాదులగు నలంకారవేత్తలు "బ్రహ్మానందాదవ్యతిరిచ్యతే కావ్యరసః" అని కీర్తించినారని యుదహరించుచు శ్రీరామకథాఽమృత గ్రంథ రచనకుఁ బై విషయము ప్రేరణ హేతువులలో నొకటిగాఁ బేర్కొనిరి. దీనినిబట్టి వారానందాను భూతికై కావ్యరచన గావించిరని తెలియుచున్నది. శ్రీ నీలకంఠ దీక్షితుల వారు శివలీలార్ణవమునఁ జెప్పినట్లు కవిత్వ మొక యోగసాధన మగుట వీరు విశ్వసించి యనుసరించిరనవచ్చును.

అనాయతప్రాణమసంయతాక్షమ్
అబ్రహ్మచర్యాఽనశనాది ఖేదం
చిత్తం మహేశే నిభృతం నిధాతుం
సిద్ధః కవీనాం కవితైవయోగః - శి.లీ.-1 స॰

లోకమున మహర్షులు సుందరమగు కథ నాధారముగాఁ గాని పరమార్థ మగు తత్త్వమునుఁ బ్రతిపాదించుట లక్ష్యముగా భావించిరి. భంగ్యంతరముగాఁగాక కేవల తత్త్వమే ప్రత్యేకముగా బోధింపరాదా? యన నది వేదాంతగ్రంథమై సర్వు లకు రుచింపకపోవచ్చును. అట్టిది గ్రహింపనందఱకు నర్హత లేకపోవచ్చును. అత్తటి

నవశ్యము బోధింపవలసిన తత్త్వ ముపదేశించు టెట్లు ? కావున వారు వైద్యుఁడౌషధముతోఁబాటు రోగి కొసగు ననుపానము వలె హృదయావర్జక మగు కథచే నున్ముఖుని గావించుకొని భవరోగహారిణి యగు పరతత్త్వమును బోధింప యత్నించిరి. ఆ ప్రయత్నమే రామాయణ భారత భాగవతాద్యనేక పురాణేతిహాసముల రూపమును దాల్చినది. శ్రీరామాయణ సారోద్ధారము నందీ విషయ మిట్లు వివరింపఁబడినది.

"నను తర్హి భవన్మతానుసారేణవిద్యా వినాశపూర్వకాత్మ ప్రాప్త్యర్థముపదిష్ట శ్రీరామాయణగ్రంథేఽన్యాపదేశముఖేన అధ్యాత్మోపదేశః కిమర్థః కృతః? సాక్షాత్ కిం నకృతః ఇతి చే దుచ్యతే - యదుక్తమితిహాస సముచ్చయే తదేవ సమాధాన మితి. తథాహి సర్వేషామపి జీవానామవిద్యావశాద్వైషయికమేవ సుఖం పరమార్థమభిమన్యమానత్వాత్ సాక్షాత్తత్త్వ ముపదిష్టమపి నతేషాంసుప్రతిష్ఠితత్వ మితి మనీషయా ప్రత్యక్షానుభూతగర్భజన్మ జరామరణాది సంసారమనుపపన్న్య తత్రైవ దోషోద్ఘాటన ద్వారాహేయతాబుద్ధి ముత్పాద్య తన్మధ్యే ధ్వనిరూపేణ తత్త్వే ఉపదిష్టే సతి తేషాం సుప్రతిష్ఠితం భవ తీత్యాశయేన శ్రీమద్బాదరాయణాగస్త్య వాల్మీక్యాది బ్రహ్మవిద్వద్వరిష్ఠైరేవం పరోక్షతయా ప్రపంచితమిత్యుక్తం తత్ర. అపిచ లంకా శరీరపరా విభీషణో బుద్ధిః ఇంద్రజిన్ముఖా రాగద్వేషాదయః ఇత్యాదినా గోవిందరాజేన వ్యాఖ్యాతత్వాత్. బహువ్యాఖ్యాతృభిరేవ మేవం విధాధ్యాత్మికార్థ కల్పనమితి సర్వ మనవద్యమ్"[1] కావుననే శాస్త్రిగారు "శ్రీ వాల్మీకి సంయమి వరకృతి నాంధ్రీకరించుచు నధ్యాత్మరామాయణ ఘట్టము లిందుఁ జేర్చుచు" శ్రీరామకథాఽమృతము సిద్ధముఁ జేసిరి. ఇందు వాల్మీకి కథతోఁబాటధ్యాత్మము నందలి తత్త్వము వివరింపఁబడుటవలన నేక కాలముననే తత్ప్రయోజనము లభ్యమగు చున్నది. విభిన్నార్థములు గల కావ్యము లొకటిగాఁ జెప్పుట ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యములలో దర్శన మిచ్చుట లోకవిదితము. వీరొక కథతోఁగూడిన రెండు విశిష్ట కావ్యములు స్వీకరించి యొకే గ్రంథముగ ననువదించుటలోఁ దమ ప్రత్యేకతఁ బ్రదర్శించిరి. ఇందా తత్త్వము యొక్క సమగ్రత నిరూపింపఁబడి యైహికాముష్మిక ఫలములు రెండును బ్రసాదింప సమర్థ మగుచున్నది. ఆ విధముగ వారాశించినట్లు రామకథ కమృతత్వము సిద్ధించుచున్నది.

వాల్మీకి రామాయణము లోకమున నాదికావ్యము కాఁగా నెందరో స్వీయ భావములు చేర్చి వ్యాఖ్యానములు ఘటించి యనల్పకల్పనలతో వింతరుచులొదువ

---

1. బా. కాం॥—పీఠిక, 13 పు.

వినూతనాకృతిఁ గల్పించి యాస్వాదయోగ్య మొనరించిరి. శాస్త్రిగారీ విషయము నిట్లు సూచించిరి—

చేని కాపు చెఱకు చెట్టు పెట్టి రసంబు
గాఁచి యచ్చుపోసి ఘనతఁబెట్టఁ
బాకవిదులు దాని బహుభక్ష్యభేదాప్తి
ననుభవింపఁజేయు టనదు పనియె

— శ్రీ. రా. క.-బా. కాం., 1 అ., 37 ప.

వాల్మీకి కవితావ్యవసాయము చేసి రామాయణ మను బెల్లపుటచ్చు సిద్ధము గావించినాడు. పాకవిదు లనఁగా వైదర్భ్యాది పాకవిదులగు కవులు. దాని బహు భక్ష్యభేదము లొనరించి యనుభవింపఁజేయుదురు. అట్లు గావించుట సామాన్యమైన విషయ మేమియు గాదు. కేవలము బెల్లము మధురమయ్యు నధికముగా నాస్వాదింపఁ జాలము. వరిపిండి మొదలగు ననేకములగు నన్య పదార్థముల సమ్మేళనమున వివిధ ములగు వంటకములు సిద్ధింపఁజేయ సుఖముగా ననుభవింపఁగలము. శాస్త్రిగారు తమ కావ్యమున రామకథా విశేషము లన్నింటినిఁ జేర్చి "యవికల సంపదలఁ బొదలునట్లు సహృదయ హృదయంగమముగా సంతరించిరి. పూర్వసాహిత్యములోని చమత్కార సుందరములగు ఘట్టములు, శ్లోకములు, భావములు సముచితరీతిఁ బ్రకృతోపయోగముగ నిందు నిబంధించి స్వతంత్రమగు ఫక్కి ననుసరించి క్రొత్తదనములు గూర్చిరి. "భిన్న రుచిర్హిలోకః" అని గదా యార్యోక్తి.

వాల్మీక్యా మహర్షిసత్తములు రామకథార్ణవమును దమ బుద్ధివిశేషమున మథించి రససిద్ధులై యయ్యమృతము నాప్యాయనముగా లోకమున కందించి యుండ మనమును దిరిగి యీ కృతి నిర్మితికిఁ బూనుకొనవలెనా ? యను సందియముడెంద మునఁ బొడమియు విరమింపఁబోవ రచనాకుతూహలమీ ప్రయత్నమునకుద్యమింపఁ జేయుచున్నదని చెప్పుచు—

అనఘులు నాకుజప్రముఖులా రఘువర్య కథార్ణవంబు హె
చ్చినమతి మందరాకలనఁ జేరి మథించి రసాప్తి మించి యొ

య్యన జగమెల్లఁ బ్రోచి రటులారయఁ గల్గునె నన్నుబోంట్లకి
ట్లని విరమింతుమన్నఁ దమకాగవు కుత్తుకబంటి కోరికల్!

— బా. కాం.-1 అ., 34 ప.

అని వివరించిరి, అదుకొననేని తీవ్రకాంక్ష యీ మహాకావ్యరూపమును ధరించినది. మఱియుఁ దమ కట్టి శక్తి సామర్థ్యములు, పాండిత్యవిశేష సంపదయు గలదా? యని శంకించి, యీశ్వరానుగ్రహము, రామకథా మహిమము తమ కభయ మిడి యీ కృషిని సఫలత నందింపఁ గలవను విశ్వాసమున సమాధానపడిరి.

వెలయు వ్యాకృతి శిక్షాది వివిధశాస్త్ర
లలిత పాండిత్య లక్షణోజ్జ్వలతఁ గానఁ
దరుణ ధవళకిరణ కలాభరణచరణ
సరసిజాజస్రసక్తైంకర్యసరణిదక్క

— బా. కాం.-1 అ., 33 ప.

నీటఁదేలె గిరులు నేలఁద్రొక్కిరి సురల్
పూరి బ్రహ్మశరతఁ బొల్చె, ఱాయి
మగువయయ్యె దేని మహిమ నీయదె తన
కట్టి రాము చరిత మభయ మిపుడు

— బా. కాం.- 1అ., 35 ప.

ఆంధ్రమునఁ గవిత్రయమువారి భారతము, పోతన భాగవతము సర్వజనా మోదము నందిన యనువాదములు. రామాయణమునకు సమగ్ర సుందర మగు నను వాదము నాటినుండి నేటివఱకు రాలేదని సాహిత్యలోకమునఁ బలువురు పెద్దల యభి ప్రాయము. ఆ లోటు వీరి కావ్యము ద్వార తీరిన దనవచ్చును.

వాల్మీకి తపస్వి. తపశ్శక్తిసంపన్నుఁ డగు వాల్మీకి రామాయణము నాంధ్రీక రించువా రవశ్యము తపస్సంపన్నులై నప్పుడే యా గ్రంథమునకు న్యాయము చేకూ రును. ఆర్షధర్మమును బ్రతిపాదించుచు వేదమే కావ్యముగ బరిణమించిన రామాయణ మును వీరుపాసించి యోగశక్తితో రామకథా దర్శనము చేసి తత్త్వమావిష్కరించు టలోఁ గృతకృత్యులైరి. అట్టి వీరి యనువాదము రామాయణము నెడఁ గుతూహలము బుట్టించుటకు సమర్థమై యొప్పుచున్నది.

సంస్కారమునుబట్టి మనస్సు. మనస్సును బట్టి మార్గము నేర్పడునని పెద్దల యభిభాషణము. ధార్మికమైన యుత్తమ సంస్కారము, పరమేశ్వరానుగ్రహ ప్రసాదసిద్ధమగు సాహితీసంపదఁ గలవా రగుటంజేసి లోకోత్తర మహత్త్వ పూర్ణమగు రామకథ వర్ణింప సంకల్పము కలిగినది. ఇవ్విధముగ వీరు తమ జీవితము నధ్యాత్మ సుందరముగా మలచుకొని కవితావ్యాసంగము తపస్సుగా సాధించి సంకల్పసిద్ధులై లోకమునకు మార్గదర్శకులైనారు.

పరమేశ్వరార్పితంబై
పరఁగెడు నర్థమెదియేనిఁ బరమార్థంబై
పరతత్త్వయోగఘటనా
పరమగునని పెద్దలెల్లఁ బలుకుదు రెపుడున్
— బా. కాం.- 1 అ., 31 ప.

అని విశ్వసించి వీరు తమ కృతిఁ బరమేశ్వరార్పితంబు గావించిరి.

ఏవిభు సత్కృపాగరిమ నీకృతి యాకృతిఁగాంచె నాయెడన్
భావముపొంగ నా భువన పావనమూర్తికి దీని నిచ్చెదన్
దైవత వల్లభాదులకుఁ దత్పరిపాలిత సస్యహేతుకం
బై విలసిల్లు హవ్య మెటు లయ్యజమానుఁ డొసంగునట్లుగాన్
— బా. కాం.- 1 అ., 38 ప.

ఇట శాస్త్రిగారి పరమార్థము "పరతత్త్వ యోగఘటనము"ని తెలియుచున్నది. ఇయ్యది "శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించి" సుఖాత్ములైన మహాపురుషుల యాశయానుసరణ మగుట హృద్యము. మఱియు శాస్త్రిగారు కావ్యరచన యజ్ఞభావనతో నిర్వహించిరి. కావ్యమును హవ్యముతోఁ బోల్చుట యౌచిత్యసుందరమై గ్రంథపావిత్ర్యమును జాటుచున్నది. బ్రహ్మాగ్ని యందు శబ్దేంధన హవ్యమును వ్రేల్చుటగా భావించిరి. ఇందు శాస్త్రిగారి నిష్కామబుద్ధి, వినయశీలము వెల్లడియగుచున్నవి. వీరు తమ జీవితము సహితము యజ్ఞార్థకర్మగా భావించి జీవించినారు. శాస్త్రిగారు తాము కృతిపతిగా సంభావించిన పరమేశ్వరుని గూర్చి యిట్లు వ్రాసుచ్చిరి. త్రిమూర్తుల కతీతుఁడగు సదాశివుఁడుగా నాతఁడు దెలియదగియున్నాఁడు.

యత్ప్రకాశమున నియ్యఖిలంబునకు జన్మ
నిష్ఠావినాశముల్నివ్వటిల్లు
నెత్తావు వలనుండి యెదగూడి వాక్కులు
మలయలేకూరక మఱలివచ్చు
నేపదం బసదుగా నెఱుఁగు వాఁడెందు లే
నే లేడటంచు శ్రుత్యాలి వలుకు
నెచ్చోటుగన్నఁ దాసచ్చిదానందాత్మ
నొప్పారుచున్నట్టి యుక్తి దోఁచు
నేసవిత్రుమూర్తి మన బుద్ధు లెపుడు ధర్మ
ముఖ్యగోచరములు గాఁగ మోహరించు
నప్పరాత్పరు నవ్యయు నభవు భవ్య
నిత్యుఁ బరమేశు నియతి ధ్యానించి మించి

— బా. కాం.- 1 అ.' 40 ప.

శ్రీ రాఘవనారాయణశాస్త్రీగారును "రామకథాఽమృతార్థము పితృపాదు లతోఁబరతత్త్వమందు నిడఁగంటి"నని చెప్పటయునీయర్థమును సమర్థించుచున్నది.

ఇట్లు శ్రీ రామకథాఽమృతము నాంధ్రమునఁ బ్రత్యేకముగా వ్యాఖ్యాన ప్రతిపత్తిగల స్వతంత్ర గ్రంథముగా రూపొందింప నధ్యాత్మరామాయణము నందలి తత్త్వోద్ఘాటనముతోఁబాటు వాల్మీకమునకు గల వ్యాఖ్యానచతుష్టయములోని విశేషము అను జేర్చి మునిభావ రహస్యవివరణము గావించిరి. రామాయణ వేదమునకు వీరు శ్రీరామకథాఽమృత మనుపేర స్వీయానుభవ మహాభాష్య మిట్లు ఘటించి రామకథా సాహితి కపూర్వ మణిమయాలంకృతి విశేషమును గూర్చి సంభావనీయులైనారు.

1) యథామూలము

2) మూలప్రపంచనము

3) మూలకుంచనము

4) మూలత్యాగము

5) ఆన్యథాకరణము

6) స్వతంత్రత

7) వ్యాఖ్యానానుసరణము

ఆంధ్రసాహిత్యము భారతానువాదముతోఁ బ్రారంభింపఁ బడినది. క్రమముగ సంస్కృతము నందలి పురాణములు, కావ్యములు, నాటకములు ననూదితములు కాఁగా బరిపూర్ణతను స్వతంత్రతను సంతరించుకొనినది. భారతానువాదమున కవిత్రయము వారు యథాశ్లోకానువాదముకాక, భావానువాద పద్ధతి ననుసరించిరి. క్రమముగ నితరు లకుఁ గూడ నట్టి పద్ధతియే యొరవడియైనది. పోతన భాగవతము ననువదించుచు వ్యాఖ్యాన పంక్తులలోని విశేషములను వివరించుట గమనింపఁదగిన విషయము. శ్రీనాథుఁడు సంస్కృత సాహిత్యము నందలి మనోహరములగు శ్లోకములను, ఘట్టము లను ననువదించి తన కావ్యముల నలంకరించుట యాతని యనువాద స్వాతంత్ర్యము నకు నిదర్శనము.

భాస్కర రంగనాథ గోపీనాథాది రామాయణములు తెలుఁగున ననేకములు వెలువడినను సమగ్రమగు రామాయణానువాద మువ్పడింపలేదు. కావుననే యాంధ్ర మున నెన్నియో రామాయణములు వెలసినవి. శ్రీరామకథాఽమృత కవులు "రామా యణ పరంపరా రచనాసక్తి నరికట్టు కవిపుట్ట నట్టిలోటు"[1] దీర్చిరి. రామాయణాను వాదములలో "శ్రీరామ కథాఽమృతము" విశిష్టమైనది.

"శ్రీ వాల్మీకి సంయమివరకృతి నాంధ్రీకరించుచు నధ్యాత్మరామాయణ ఘట్టము లిందుఁజేర్చుచు ననుబంధి వర్ణనాంశముల స్వతంత్రించుచు నీగ్రంథము నుత్తర కాండంబుతోడం గూడ గాయత్రీ చతుర్వింశతి సహస్ర గద్య పద్యాత్మకంబుగా మువిభావ రహస్య వివరణం బొప్ప రచించితి" మని తమ యనువాద విధానమును గూర్చి శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు శ్రీరామకథాఽమృతము బాలకాండ పీఠికలో ముచ్చటించిరి.

మఱియు నుత్తరకాండమందగస్త్యుఁడు రావణాది రాక్షస సంహారమునకు శ్రీరాముని బ్రశంసించుచు "నిన్ని జగములు కల్పించి పోషించి తుదకు సంహార మొనర్చెదవు. అట్టి విశ్వంభరునకు బ్రకరణమునుబట్టి కుదింపుగాని పెంపుగాని యొనర్పుట వింతకాదు" అనినట్లు లీవిధముగా వర్ణింపఁ బడినది.

ఇన్ని జగములు గల్పించి యేలమి మోచి
సంహరించెద వింతయు క్షణములోనె

---

1) స్మారక సంచిక – అంబడిపూడి రామబ్రహ్మకవి, పు. 15

యట్టి విశ్వంభరునకుఁ జోద్యమె కుదింపు
గాని పెంచుటగాని ప్రాకరణికముగ
— పూ. భా., 7 ఆ., 295 ప.

విశ్వంభరుఁ డనఁగా కవి యను నర్థము గలదు. "విశ్వంభరః కవిః"[1] అని నిఘంటువు. కావున కవి ప్రకరణము ననుసరించి తన కావ్యప్రపంచమును పెంచుట, కుదించుట యందు స్వాతంత్ర్యమును వహించు నను నర్థము లభించుచున్నది. ఇందు వీరి కావ్యరచనావిధానము తెలియవచ్చుచున్నది. ఆంధ్రీకరణము కేవల స్వతంత్రమై ప్రకరణోచితముగ పెంపు, కుదింపు గలిగి రచింపఁబడినట్లు స్పష్టము.

ఆట్లే రాజధర్మము ననుసరించి యుషఃకాలమున వైతాళికులు "విభుగుణము లనావిల సుభగీతితతుల"గాఁ బాడి మేల్కొల్పు సందర్భమున "తదీయ గుణగణంబుల స్వకవితాగుణగణముల గూర్చి వర్ణించిరనియు, నట్టియెడ భావాబ్ధి పొంగుననియు వర్ణింపఁబడినది

కవుల కాలానుసారంబుగాఁ దదీయ
గుణగణంబుల స్వకవితాగుణగణముల
గూర్చి వర్ణింపఁ దొడఁగిరి కొమరుమిగుల
నట్టియెడఁ బొంగుఁగాదె భావాబ్ధి భావ్య
— పూ. భా., 9 ఆ., 304 ప.

తదీయ గుణగణము లనఁగా రాముని గుణగణములేకాక వాల్మీకి కవితా గుణము లనియు భావింపవచ్చును. శ్రీరామకథాఽమృతమున వాల్మీకి కవితావైభవముతోడ దమ కవితాగుణముల జోడించి సుందరమగు వినూతనాకృతి కల్పింపఁబడిన దను పరమార్థ మిందు సూచింపఁ బడినది. ఇట కవు లనువాద విధానమునఁ బాటించిన పద్ధతి నిరూపింపఁ బడినది.

శ్రీరామకథాఽమృతానువాదమున శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు షట్కాండ మహితమగు పూర్వభాగరామాయణముఁ బూర్తిగావించి యుత్తర కాండమున పూర్వ

1) అమరకోశము

భాగము చతుర్థాశ్వాసము నందు 461 పద్యములు మాత్రము రచించిరి. శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు తదాది యుత్తరకాండ పరిసమాప్తి పర్యంతము ననువదించిరి. శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు మొత్తము 18, వేల పద్యములు వ్రాయ నించుమించుగా 6 వేల పద్యములు శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు వ్రాసినారు. అనువాదమున నిరువురి ప్రత్యేకత స్ఫుటముగా గోచరించును. ఈ ప్రకరణమున నిరువురు వాల్మీకి రామాయణము నెట్లనువదించిరో పరిశీలింపఁ బడును. తరువాతి ప్రకరణమున కవుల "అధ్యాత్మరామాయణానువాద విధానము" సమీక్షింపఁ బడును.

శ్రీరామకథామృతము నామూలాగ్రముగా సమీక్షించినచో నాంధ్రీకరణమున మూలాధికతయే యెక్కువ యని స్పష్టము కాఁగలదు. కవులు "ముని భావ రహస్య వివరణం బొప్ప రచింపఁ" బూనుట, సద్గుణప్రీతి, 24,000 గద్య పద్యములు తెలుఁగున వ్రాయవలయు నను సంఖ్యా నియమము, మొదలగునవి యన్నియు నిందులకు కారణములైనవి. అందు బాలకాండ, ఉత్తరకాండలు మిక్కిలి విపులముగా వర్ణింపఁ బడినవి. అరణ్య కిష్కింధ సుందరకాండములు మూలమునకంటె సంక్షేపింపఁబడినవి. అయోధ్యా యుద్ధకాండములు దాదాపు యథామూలములు. సీతారామ కల్యాణ పర్యంత మగుకథాభాగము తొలుత "మైథిలీ పరిణయ"మను పేర స్వతంత్రముగా రచింపఁబడి శ్రీరామకథామృతమున నది బాలకాండగా సంకలింపఁ బడుటయు, ఉత్తర కాండ శేషపూరణము గావించిన శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారి ఔత్సాహిక ప్రదర్శనమును, బాల ఉత్తరకాండములు పెంపు వహించుటకుఁ గారణములై యుండు నని యూహింపవచ్చును. ఉత్తరకాండము నందలి ప్రక్షిప్త పాఠములని చెప్పఁబడిన కథా భాగములను గూడ వీరనువదించిరి. శ్రీరామకథామృతము నందు యథామూలముగ సంపూర్ణముగ నున్న ఘట్టములు మృగ్యములు ప్రతి సన్నివేశమునను అనువాదకుల ప్రత్యేకత నిరూపించునట్టు లేదియో యొక విశేషణమో యలంకారమో యధికముగాఁ బ్రయోగింపఁబడును. ప్రాధాన్య వివక్షచేత నధిక భాగము మూలానుసారముగ నుండుటచే నాఘట్టములు యథామూలానువాద విభాగమునకు లక్ష్యములుగ గ్రహింపఁ బడుచున్నవి.

అనువాద గ్రంథము లందు మూలగ్రంథమును యథాతథముగా ననువదించుట, విడుచుట, పెంచుట మున్నగు విషయములు పాటింపఁబడునుగావున ననువాదములను—1) యథామూలము, 2) మూల ప్రపంచనము, 3) మూలకుంచనము, 4) మూలత్యాగము, 5) స్వతంత్రత, 6) అన్యథాకరణము, 7) వ్యాఖ్యానానుసర

ణము అను విషయములు ప్రధానములుగా దలంచి పరిశీలింపవలయును. శ్రీరామ కథామృతానువాద పద్ధతి పై విషయముల ననుసరించి సమీక్షింపఁబడును. ఇందొక్కొక్కటి ప్రత్యేకముగాఁ బరిశీలింప వలయునన్నచో నొక్కొక్క గ్రంథ మగును. కావున నిట స్థాలీపులాక న్యాయముగా ప్రధాన ఘట్టము లందు వీరు ప్రదర్శించిన యనువాద విధానము వివరింపఁబడు చున్నది. ముందుగా "యథామూలము" పరిశీలింపఁబడుచున్నది.

## యథామూలము :

మూలమున నున్నదున్నట్టు లాంధ్రీకరించుట యథామూలము. వాల్మీకి రామాయణము నందలి ఘట్టములు శ్రీరామకథామృతమున యథా మూలముగా నెట్లనువదింపఁ బడినవో యిందు సంగ్రహముగ బరిశీలింపఁబడుచున్నవి.

బాలకాండమున అయోధ్యాధిపతి, ఇక్ష్వాకువంశ ప్రభువగు దశరథుఁడు వేదవిదుడు, సర్వార్థసంగ్రహుఁడు, దీర్ఘదర్శి, మహాతేజుడు మున్నగు విశేషణములతో వాల్మీకమున నిట్లు వర్ణింపఁబడినాఁడు—

తస్యాం పుర్యా మయోధ్యాయాం వేదవిత్సర్వ సంగ్రహః
దీర్ఘదర్శీ మహాతేజాః పౌరజానపద ప్రియః
ఇక్ష్వాకూణా మతిరథో యజ్వా ధర్మపరో వశీ
మహర్షికల్పో రాజర్షి స్త్రిషు లోకేషు విశ్రుతః
బలవాన్నిహతామిత్రో మిత్రవాన్ విజితేంద్రియః
ధనైశ్చ సంగ్రహైశ్చాన్యై శ్శక్ర వైశ్రవణోపమః
—బా. కా., 5 సర్గ., 1–3 శ్లో.

శ్రీరామకథామృతమున నీఘట్టము యథామూలముగా నిట్లాంధ్రీకరింపఁబడినది—

వేద వేదాంగ సంవేత్త సర్వాఖిల్ల
సంగ్రహుం డఖిలార్థ సంగ్రహుండు
దీర్ఘదర్శి సమృద్ధ తేజుండు పౌర జా
నపద ప్రియుండు నన్నా హవనుండు

దశరథ శ్రేష్ఠుండు యజ్వ ధర్మపరుండు
జన వశీకరణ విశారదుండు
బ్రహ్మర్షికల్పుఁడీ రాజర్షియనుచు ము
ల్లోకముల విఖ్యాతిఁబొరసె నప్ర

మేయ బలుఁడు స్వబలహతామిత్రుఁడట్ల
యుక్తమిత్రుఁడు విజితేంద్రియుం డతండు
వరధన నిధానముల శక్ర వైశ్రవణుల
బోల్పనగుచుఁ బ్రజావళిఁ బ్రోచుచుండె
— బా. కాం.- 1 ఆ., 333 ప.

రాక్షసుల జంపి యజ్ఞసంరక్షణము గావింప శ్రీరామునిఁ బంపుటకు పుత్ర వ్యామోహమున సంశయించుచున్న దశరథునకు విశ్వామిత్రుఁడు రాముని మహత్త్వమును బరాక్రమమును దెల్పుచు "మహాత్ముడఁగు రాముని సత్య పరాక్రమము నే నెఱుంగుదును. మహాతేజుఁడగు నీ వశిష్ఠుఁడును దెలిసినవాఁడే. ఇంకను దపోనిష్ఠులగు మును లెల్లరకును విది విదితమే" యని చెప్పినట్లు వాల్మీకమున నిట్లు వర్ణింపఁబడినది.

అహం వేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమమ్
వశిష్ఠోఽపి మహాతేజా యేచాన్యే తపసి స్థితాః
— బా. కాం.—19 స., 14 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నీ శ్లోకము యథామూలముగ నిట్లాంధ్రీకరింపఁ బడినది—

అధిప! యెఱుఁగుదు నేను మహాత్మ రాము
సత్యవిక్రముఁ డనుచుఁ బ్రశస్తుఁ డనుచు
నీ మహాతేజుఁడు వశిష్ఠుఁ డెఱుగు మఱియు
నెఱుఁగుదురు సుతపోనిష్ఠు లెల్ల మునులు
— బా. కాం.-5 ఆ., 42 ప.

అయోధ్యకాండమున సీతారాములతో నరణ్యమునకుఁ బోవుచున్న లక్ష్మణుని సుమిత్ర "రాముని తండ్రి యగు దశరథుని గాను, సీతను తల్లి నగు నన్నుగాను, అడవి నయోధ్యగాను భావింపుము. నాయనా! సుఖముగా పోయిరమ్ము" అని ఆశీర్వదించినట్లు వాల్మీకమున గలదు. అయ్యది శ్రీరామకథామృతమున యథామూలముగా నాంధ్రీకరింపఁబడినది.

రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛతాత యథాసుఖమ్
— వా. రా., అయో., 40 స., 9 శ్లో.

అన్న దశరథుగా రాము నెన్నగనుము
మలసి నన్నట్టె భావింపుమా జనకజ
నటవినెప్డు నయోధ్యఁగా నరసికొనుము
ననుచుము యథా సుఖస్థితి మనుము చనుము
— శ్రీ. రా. క., అయో., 4 ఆ., 195 ప.

వాల్మీకమున రాముఁ డరణ్యములకుఁ బోవుటకు దుఃఖించుచున్న కౌసల్య నూరడించుచు సుమిత్ర రాముని మహత్వమును వివరించుచు నాతని సర్వోత్తమునిగా నిరూపించినట్లు వర్ణింపఁ బడినది. ఆ ఘట్టము గూడ శ్రీరామకథామృతమున యథామూలముగ నాంధ్రీకరింపఁ బడినది.

సూర్యస్యాపి భవేత్సూర్యో హ్యగ్నేరగ్నిః ప్రభోః ప్రభుః
శ్రియాః శ్రీశ్చ భవేదగ్ర్యా కీర్త్యాః కీర్తిః క్షమా క్షమా
దైవతం దేవతానాం చ భూతానాం భూత సత్తమః
— వా. రా., అయో., 44 స., 15 16 శ్లో.

అరుణున కాతఁడే యరుణుఁ డగ్గికి నగ్గి ప్రభు ప్రభుండు దా
సిరి సిరి కీర్తికీర్తి కటు సిద్ధికి సిద్ధి క్షమా క్షమర్థి ని
ర్జరులకు నిర్జరోత్తముఁడు సర్వచరాచర భూతజాత కృ
త్స్నరుచిర భూతభూతుఁడును జావ్వె తదర్థము గానిదుండునే
— శ్రీ. రా. క., అయో., 4 ఆ., 278 ప.

"తదర్ధముగాని దుండునే" యనుట పై భావమునకు వివరణమై రాముని విశ్వాత్మకత వెల్లడించు చున్నది.

అరణ్యకాండమున శ్రీరాముఁడు ఖరాదులతో యుద్ధ మొనరించు సందర్భమున రాముని రౌద్రరూపము యథామూలముగా శ్రీరామకథాఽమృతమున వర్ణింపఁబడినది. (14 స., 24, 25 శ్లో.) (2 ఆ., 134. 5 ప॥లు)

రాముఁ డెట్టివాఁ డని రాముఁ డడుగ శూర్పణఖ "దీర్ఘబాహువు" విశాలాక్షుఁడు, చీరకృష్ణాజినాంబరుఁడు, కందర్పసమరూపుఁడు నగు రాముఁడు దశరథుని కుమారుఁ డని వచించి క్రమముగా నతని తేజో రూప బల పరాక్రమములఁ గూర్చి వర్ణించినట్లు వాల్మీకమున గలదు. అది శ్రీరామకథాఽమృతమున యథామూలముగా నాంధ్రీకరింపఁ బడినది.

దీర్ఘబాహు ర్విశాలా క్షశ్చీర కృష్ణాజినాంబరః
కందర్ప సమరూపశ్చ రామో దశరథాత్మజః
శక్రచాపనిభం చాపం వికృష్య కనకాంగదం
దీప్తాన్ క్షిపతి నారాచాన్ సర్పానివ మహావిషాన్
నాదదానం శరాన్ ఘోరా న్నముంచంతం శిలీముఖాన్
న కార్ముకం వికర్షంతం రామం పశ్యామి సంయుగే
హన్యమానం తు తత్సైన్యం పశ్యామి శరవృష్టి భిః
వా. రా. అరణ్య.-34 స., 5–7 శ్లో.

అనువాదమున నిట్లు గలదు—

ఉరుతర దీర్ఘబాహుఁడు విశాలేక్షణుం
డటు చీర కృష్ణాజినాంబరుండు
కందర్ప సమరూప కలితుఁడు రామనా
ముఁడు దాశరథి జగన్మోహనుండు
శక్రాయుధ నిభంబు చాపంబు ధరియించుఁ
గనకాంగదము లందుఁ గ్రాలుచుండ
దీప్తాశుగముల నుదీర్ణ మహావిషా
శీవిషాభముల సృజించుచుండుఁ

గొనుట కూర్చుట తివియుట కోటినెఱయ
విడుచుటయు ననునవి గానఁబడ వతండు
ధనువు చేఁబూని నిలఁబడుఁ దన్నెదుర్చు
వారు శరవిద్ధులై యిల వ్రాలుచుండ్రు
శ్రీ. రా. క. అరణ్య.-2 ఆ., 332 ప.

సీతాపహరణోద్యమమున సాయపడు మని కోరుచున్న రావణునితో మారీచుఁడు "స్వార్థచిత్తులై సతత ప్రియవాదులైన పురుషులు రాజునకు లభించుట సులభము ప్రియము కాకున్నను హితము పథ్యము నగు పలుకు పలుకువారును, వినువారును లభించుట దుర్లభము" అని చెప్పినట్లు వాల్మీకమున గలదు. శ్రీరామకథాఽమృతమున నిది యథామూలముగ నాంధ్రీకరింపఁ బడినది.

సులభాః పురుషాః రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః
— వా. రా., అర. కాం.-37 స., 2 శ్లో.

ఎందునేనియు దొరకుదు రేలువాని
కిచ్చకము దోఁప వచియింప నెంచువారు
పథ్యమును హితమును నైన పలుకు పలుకు
వాఁడులేఁ డది యాలించువాఁడు లేఁడు
— శ్రీ. రా. క., అర. కాం.-2 ఆ., 385 ప.

కిష్కింధాకాండమున సుగ్రీవప్రేషితుఁడై హనుమంతుఁడు రామలక్ష్మణులను సమీపించి వినయభరిత మగు సంభాషణమున వారల సంతుష్టులను గావించెను.

ఆ సందర్భమున రాముఁడు లక్ష్మణునితో హనుమంతుని వాగ్విభవమును గూర్చి ముచ్చటించుచు —

నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతమ్
బహు వ్యాహరతా నేన న కించిదపశబ్దితమ్
న ముఖే నేత్రయోర్వాపి లలాటేచ భ్రువో స్తథా

అన్యేష్వపి చ గాత్రేషు దోషః సంవిదితః క్వచిత్
అవిస్తర మసందిగ్ధ మవిలంబిత మద్రుతమ్
ఉరస్థ్సం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే
సంస్కారక్రమ సంపన్నా మద్రుతా మవిళంబితామ్
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయ హారిణీమ్
అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా
కస్య నారాధ్యతే చిత్త ముద్యతా సేకరేరపి

— వా. రా., కి. కా., 3 స., 29-33 శ్లో.

అని చెప్పినట్లు వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథాఽమృతమున నది యథామూలముగా నాంధ్రీకరింపఁ బడినది.

ఏనాడు చదివెనో యిన్ని వ్యాకరణమ్ము
లపశబ్ద మని నుడులందుఁ జొరదు
త్వరితమ్ము నానుడుతనము సందిగ్ధత
విస్తర మనరాదు వెదికి కనిన
కల్యాణి సంస్కార కలిత వాగ్దేవియే
యాడింపజాలె నిట్లనగవలయు
నక్షరములు తావు లంది వ్యంజనలతో
మధ్యమస్వరమున మానితములు

గాఁబలుకు వీనిపై వైరి కత్తి యెత్తి
యేని మఱలఁడె తన బుద్ధి నీసడించు
కొనుచు నవయవముల సృష్టియనఘ! యీతఁ
డెవరి చిత్తవృత్తుల హరియింపలేఁడు

— శ్రీ. రా. క.-కి. కా., 1 ఆ, 69 ప.

ఈ కిష్కింధాకాండ మందలి ప్రసిద్ధమైన వర్షర్తు వర్ణనము ఏబదినాల్గు శ్లోకములలో మనోహరముగ నిర్వహింపఁ బడినది.[1] తదనువాదము శ్రీరామకథాఽమృతమున 35 పద్యములలో యథామూలముగ సాగినది.[2]

1) వా.రా. కి.కాం., 28 స., 2-56 శ్లో॥లు. 2) శ్రీ. రా.క.-కి. కా., 2ఆ., 14-48 ప॥లు

హనుమంతుడు తన బలమును గూర్చి వానరులతోఁ జెప్పుట 21 శ్లోకములలో మూలమున వర్ణింపఁబడినది. శ్రీరామకథాఽమృతమున నయ్యది యథా వాల్మీకమాంధ్రీకరింపఁ బడినది. (కి. కా. 67 స. 9-29 శ్లో॥లు) (3 ఆ. 300-308 ప॥లు)

సుందరకాండమున హనుమంతుడు రావణాంతఃపురమున మండోదరిని గాంచి సీత యని భావించి "అధికమగు నానందమునఁ జప్పట్లు చరచియు, తోక ముద్దిడుకొనియు, నృత్య మొనరించియు, స్తంభముల నెక్కి దూకియు, తన హర్షాతిరేకమును వానరజాతి స్వభావానుగుణముగాఁ బ్రదర్శించెను" అని వాల్మీకమున గలదు.

హర్షేణ మహతాయుక్తో ననంద హరియూధపః

అస్ఫోట యామాస చుచుంబ పుచ్ఛమ్
ననంద చిక్రీడ జగౌ జగామ
స్తంభా నరోహ న్నిపపాత భూమౌ
విదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్

వా. రా.-సుం. కాం., 10 స., 53, 54 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమున నయ్యది యథామూలముగా నాంధ్రీకరింపఁబడనది.

కొట్టెఁజప్పట్లు ముద్దిడుకొనియెఁ దోఁక
నందె నానంద మెద నాటలాడెఁ బాటఁ
బాడె నడిచెఁ గంబములకుఁ బ్రాఁకె దుమికెఁ
గపుల ప్రకృతిని దర్శింపఁగాఁ గడంగి

— సుం. కాం.-1 ఆ., 293 ప.

అశోకవనమున హనుమంతుడు సీతను గాంచి దాశరథి వృత్తాంతము వినిచిన క్రమము మూలమున 13 శ్లోకములలో గలదు.[1] శ్రీరామకథాఽమృతమున నది యథావాల్మీకముగా 10 పద్యములలో నాంధ్రీకరింపఁ బడినది.[2]

హనుమంతుని వాక్యములలో విశ్వాసమును బెంపొందించుకొనుటకై సీత రామలక్ష్మణుల స్వరూపస్వభావము లెట్టివో తెలుపుమని యడుగగా హనుమంతుఁడు

---

1) వా. రా.—సుం. కాం., 31 స., 3—15 శ్లో॥లు.
2) శ్రీ. రా. క.—సుం. కాం., 2 ఆ., 227—36 ప॥లు

వారిని వర్ణించిన విధము వాల్మీకమున 14 శ్లోకములలో జెప్పఁబడినది.[1] అయ్యది యథామూలముగా శ్రీరామకథాఽమృతమున నాంధ్రీకరింపఁ బడినది.[2] అందు—

త్రిస్థిర స్త్రి ప్రలంబశ్చ త్రిసమ స్త్రిషు చోన్నతః
త్రితామ్ర స్త్రిషుచ స్నిగ్ధో గంభీర స్త్రిషు నిత్యశః
— వా. రా.-సుం. కాం., 35 స., 17 శ్లో.

"మూడుతావుల స్థిరమైనవాఁడు, మూడింట ప్రలంబుఁడు, మూడిఁటసముడు, మూడింట నున్నతుఁడు, మూడింట తామ్రస్నిగ్ధగంభీరతల నొప్పువాఁడు" అని మూలముగ గలదు. అయ్యది యథామూలముగ శ్రీరామకథాఽమృతమున నిట్టు లనువదింపఁ బడినది.

మూఁడుతావులఁ దిటవగువాఁడు మూఁట
నగుఁ బ్రలంబుండు మూఁడిట నగు సముండు
నొప్పు మూడింట మూడింట నున్నతత్వ
తామ్రతల స్నిగ్ధ గంభీరతల నతండు
— సుం. కాం.-2 ఆ , 309 ప.

యుద్ధకాండమున రావణుడు మంత్రాలోచన మొనరించుటకై మంత్రులఁ బిల్వ నంపి వారితో మంత్రము యొక్క అవశ్యకమును జెప్పుచు "లోకమునఁ బురుషులలో నుత్తమ మధ్యమాధమ భేదము లున్నట్లే మంత్రములు ముద్విధములు. అందు మంత్రు లందఱు నొకటిగా నుండి శాస్త్రదృష్టితో యోజించునది యుత్తమము. తమలో విభేదము లున్నను మంత్రులు మంత్రాలోచన సందర్భమున నొకటిగా వ్యవహరించి యొకే నిర్ణయము గైకొనునది మధ్యమము. మంత్రు లెవ్వరికివారు తమ తమ మతములే మతములని పట్టుదలపట్టు మంత్రమధమము" అని వివరించుట వాల్మీకి రామాయణమున 10 శ్లోకములలో వివరింపఁ బడినది.[3] శ్రీరామకథాఽమృతమున నయ్యది 9 పద్యములలో యథామూలముగ నాంధ్రీకరింపఁ బడినది.[4]

1) వా. రా.—సుం. కాం., 35 స., 8—21 శ్లో॥లు
2) శ్రీ. రా. క.-సుం. కాం., 2 ఆ., 303—15 ప॥లు
3) వా. రా.-యు. కాం., 6 స., 5—14 శ్లో॥లు
4) శ్రీ. రా. క.-యు. కాం., పూ. భా., 2 ఆ., 9—17 ప॥లు

రావణుని మాతామహుఁడగు మాల్యవంతుఁడు రావణునితో "సీతను రామున కప్పగించి రామునితో సంధి యొనర్చుకొమ్మ"ని చెప్పుచు "ధర్మ మధర్మము నెప్పుడు గ్రసించునో యది కృతయుగము, అధర్మమే ధర్మము నెందుఁ దలఁగఁ జేయునో యది కలియుగము."

ధర్మోవై గ్రసతేఽధర్మం తతః కృతమభూద్యుగమ్
అధర్మోగ్రసతే ధర్మం తతస్తిష్యః ప్రవర్తతే
— వా. రా.-యు. కాం., 35 స., 14 శ్లో.

అని బోధించినట్లు వాల్మీకమున గలదు. అయ్యది శ్రీరామకథాఽమృతము నందు-

ధర్మ మెప్పు డధర్మంబుఁ దాగ్రసించు
నదియె కృతయుగ మను కాలమయ్యె నట్ల
ధర్మమే ధర్మగతి నెప్డు దలఁగఁజేయు
నట్టి యానాడె కలియుగమౌ నధీశ
—శ్రీ. రా. క.-యు.కాం., పూ. భా., 5 ఆ., 16 ప.

ఆదిత్యహృదయ స్తోత్రము 30 శ్లోకములలో వాల్మీకి రామాయణమునఁ జెప్పఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నది 19 పద్యములలో యథామూలముగా నాంధ్రీకరింపఁ బడినది.[2]

ఉత్తరకాండ యందు రావణుఁడు "అశ్మనగరమున మణిమయము మహేంద్రసదనోపమము నగు నొక భవనరాజమును గాంచినట్లు వాల్మీకమున గలదు. అది శ్రీరామకథాఽమృతమున యథామూలముగా నాంధ్రీకరింపఁ బడినది.

వైడూర్య తోరణాకీర్ణం ముక్తాజాల విభూషితమ్
సువర్ణ స్తంభ గహనం వేదికాభి రలంకృతమ్
వజ్రస్ఫటిక సోపానం కింకిణీజాల సంవృతమ్
బహ్వాసనయుతం రమ్యం మహేంద్రసదనోపమమ్
దృష్ట్వా గృహవరం రమ్యం దశగ్రీవః ప్రతాపవాన్
వా. రా.-ఉ. కాం., 1 స., 2, 3, 4 శ్లో॥లు
[ అధిక పాఠే 23 సర్గ తర్వాత ]

1) వా. రా.-యు. కాం., 107 స., 1—31 శ్లో.
2) శ్రీ. రా. క.-యు.కాం., 10 ఆ., 261-79 ప॥లు

అని మూలము. అనువాద మిట్లున్నది—

వైడూర్యతోరణవర సమాకీర్ణమ్ము
మౌక్తికజాలక మానితమ్ము
జాతరూప స్తంభజాత రూపశతమ్ము
లలితాంకవేదికాలం కృతమ్ము
స్ఫాటికవజ్రసోపాన సంస్థానమ్ము
కింకిణీజాలానుకీలితమ్ము
శయ్యాసనాది ప్రశస్తోపచారమ్ము
రమ్యాన్య పరికర రాజితమ్ము
మందిరమ్మో! పురందర మందిరమ్మో!
.... .... ....
ఘన గృహ మొకండు గనె దశకంథరుండు
— ఉ. కాం.-పూ. భా., 4 ఆ., 526 ప.

హనుమచ్చరిత్ర వర్ణించుచు వాసవుఁ డొనరించిన యకృత్యమునకు కుపితుఁడై వాయువు తన్నుఁదా నుపసంహరించుకొని కుమారునితో గుహ యందు జొరబారిన సందర్భమున లోకము దుస్థితి వాల్మీకమున 3 శ్లోకములలోఁ జెప్పఁ బడినది. శ్రీరామకథామృతమున నది యథామూలముగ ననువదింపఁ బడినది. వాల్మీకము—

విణ్మూత్రాశయ మావృత్య ప్రజానాం పరమార్తికృత్
రురోధ సర్వభూతాని యథావర్షాణి వాసవః
వాయుప్రకోపాద్భూతాని నిరుచ్ఛ్వాసాని సర్వతః
సంధిభి ర్భిద్యమానైశ్చ కాష్ఠభూతాని జజ్ఞిరే
నిస్స్వాధ్యాయ వషట్కారం నిష్క్రియం ధర్మవర్జితమ్
వాయుప్రకోపా త్త్రైలోక్యం నిరయస్థ మివాభవత్
— ఉ. కాం.-35 స., 50—52 శ్లో॥లు

**అనువాదము—**

సంధులు సంధులు సడలి భూతాంగము
  త్కాష్ఠభూతంబులై కదలవయ్యె
విణ్మాత్రకోశ ప్రవేశంబతఁడు వీడఁ
  బొట్టలుబ్బుటె కనుపట్టుచుండె
నుండిరో! యూడిరో! యుచ్ఛ్వాస నిశ్వాస
  ములులేమి నిశ్చయమ్ములు తొలంగె
సమసె స్వాధ్యాయ వషట్కారముఖ్య ధ
  ర్మక్రియా కలిత తంత్రములు మున్నె
యింద్రు రోధమ్ము వర్షమ్ము లెట్టులుడుపు
వాయురోధమ్ము నట్లె సర్వమ్మడంచె
....  ....  ....

— పూ. భా.-8 ఆ., 59 ప.

వాల్మీకమున సీతాపరిత్యాగానంతరము దుఃఖించుచున్న రాముని యోదార్చుచు లక్ష్మణుఁడు "పుత్రమిత్రకళత్ర ధనాదుల యందు స్నేహము నధికముగాఁ బెంచుకొనరాదు. వారితో వియోగము ధ్రువము" అని చెప్పినట్లు వర్ణింపఁబడగా నది శ్రీరామ కథాఽమృతమున యథామూలముగా నాంధ్రీకరింపఁ బడినది—

తస్మాత్పుత్రేషు దారేషు మిత్రేషు చ ధనేషు చ
నాతి ప్రసంగః కర్తవ్యో విప్రయోగోహి తైర్ధ్రువమ్
— 52 స., 12 శ్లో.

పుత్రులను మిత్రులను ధనములను దార
లను వియోగంబు ధ్రువమని మనము నందు
నిశ్చయించియె క్రీడింప నెగడవలయు
నెందును నతి ప్రసంగంబు నెనయరాదు

— ఉ. కాం.-ఉ. భా., 3 ఆ., 100 ప.

ఈ విధముగ రామాయణము నందలి కొన్ని ఘట్టములు యథామూలముగా ననువదింపఁ బడినవి.

## మూలాధికత :

మూలమున రేఖామాత్రముగ నున్నదానిని యాంధ్రీకరణమున వివరించుట, మూలమునఁ గల యేకదేశమును గ్రహించి యాభావమును స్పష్టపఱుచుట మొదలగు వాని వలన "మూలాధికత" సిద్ధించును. అనువాదమున నవి సహజము. కావుననే భక్త్యావేశ బంధురుఁ డగు పోతన భాగవతము మూలమునకు రెండింతలై పెంపు గాంచినది.

శ్రీరామకథామృతానువాదమున విశేషించి గోచరించునది మూలాధికత. సహజముగా విషయ ప్రపంచనాశీలురగు శ్రీరామకథామృత కావ్యనిర్మాతలుఁ గాయత్రీబీజాక్షర సంయుతముగా 24,000 గద్యపద్యములు వ్రాయ సంకల్పించుట, వివిధ శాస్త్రసంప్రదాయ విషయ ప్రతిపాదనము, మునిభావ రహస్యవివరణము విట్టి పెంపుదలకు హేతువు లగుచున్నవి. అట్లే అనువాదకులు ఈ గ్రంథమును ప్రబంధ పద్ధతిలో రచింప సంకల్పించుటచే పుర ఋతు సూర్యచంద్రోదయాది వర్ణన సందర్భమున నెంతయో మూలాధికతను జూపియున్నారు. ప్రత్యేకించి బాలకాండమున, నుత్తరకాండమునను మూలాధికత యధికముగా గలదు.

వాలి సుగ్రీవుల జన్మవృత్తాంత కథనమున నగస్త్యుఁడు రామునితో పూర్వమీ కథ నారదుఁడు నుడువగా వింటివి. నేడు నీకా వృత్తాంతమును మొదలంట దెల్పెదనని చెప్పుచు—

> అమ్మహామతి నాకిట్టు లానతిచ్చె
> వినుము మొదలింటినుండి తద్విధ మటంచు
> విట్టి నెలవులఁ బుట్టువు లెత్తుమనినఁ
> బూర్వముల నెత్తుఁగాదె యాపుణ్యుఁడనఘ
> – ఉ. కాం., పూ. భా., 7 ఆ., 300 ప.

అనినట్లు వర్ణింపఁబడినది. వాలిసుగ్రీవుల జన్మోదంత కథన సందర్భమున వానరజాతి పుట్టుపూర్వములతో నారంభించుటంబట్టి యీ కావ్యరచనావిధానమున పెంపుదల యెట్లుండునో విశదపఱుపఁ బడుచున్నది. శ్రీరామకథామృత రచనాప్రణాళికలో మూలాధికత యెట్లు ప్రాధాన్యము నొందుచున్నదో కూడ స్పష్టమగుచున్నది.

బాలకాండమున ఋష్యశృంగముని చరిత్రము వాల్మీకి రామాయణమున 50 శ్లోకములలోఁ జెప్పబడినది. [1] శ్రీరామకథాఽమృతమున మూలాధికముగా నిది 88 పద్యములలో వర్ణింపఁబడినది.[2] కవులీ ఘట్టమును ప్రత్యేక ప్రబంధముగా బరిగణింప దగురీతి విశిష్టముగాఁ దీర్చి దిద్దిరి. వీరు ఋష్యశృంగుని స్వరూప స్వభావములు వర్ణించినతీరు మనోహరము. (బా. కాం.-1 ఆ., 444 ప.) చూ. పాత్రచిత్రణము

దశరథ పత్నులు యజ్ఞపాయసము భుజించి హుతాశనాదిత్య సమాన తేజము లగు గర్భముల ధరించినట్లు వాల్మీకమున వర్ణింపఁబడినది.[3] శ్రీరామకథాఽమృత మున నట్టియెడ "గౌసల్యాదుల గర్భలక్షణ వర్ణనము" మూలాధికముగా 20 పద్యము లలో మనోహరముగా సాగినది.[4] పాండిమ, కార్శ్యము, మాంద్యము, నడుము ప్రవృద్ధ మగుట, ఆవలింత లధిక మగుట, రోమరాజి ప్రకాశించుట మొదలగునవి గర్భలక్షణము లని వాగ్భటుఁ డిట్లు పేర్కొనియున్నాఁడు.

క్షామతా గరిమాకుక్షే మూర్ఛా ఛర్ది ररోచకమ్
జృంభా ప్రసేకః సదనం రోమరాజ్యాః ప్రకాశనమ్[5]

శ్రీరామకథాఽమృతమున ఆ దశరథాంగనల గర్భధారణ లక్షణములు సమగ్రముగ నభివర్ణితములు. అందుఁ బాండిమమును కవు లిట్లు చమత్కరించినారు.

పాలకడలి సెజ్జవాని మూర్తుల బొజ్జ
లందుఁదాల్చి అలన లలరుచునికిఁ
దద్యశంబు పైకి దరలె నా మోములు
వెల్లరుచుల కలిమి వెలసె నపుడు

— బా. కాం.-3 ఆ., 3 ప.

1] వా. రా.-బా. కాం, 9, 10 స.
2] శ్రీ. రా. క.-బా. కాం., 1 ఆ, 423–511 పద్యములు
3] వా. రా. బా. కా., 16 స., 30 శ్లో
4] శ్రీ. రా. క.-బా. కా., 3 స., 2-21 ప.
5] అష్టాంగహృదయమ్ - 1 అ., 50 శ్లో.

"విష్ణుమూర్తి రూపములను గర్భమునఁ దాల్చుటచేఁ గల్గిన యశస్సు ముఖము నుండి బైటకు వెడలుచున్నదో యన్నట్లు వారి మోములు వెల్లనైనవ"ని భావము. ఇట్టి కల్పన మనోహరము.

దశరథునిచే రామాదుల జాతకర్మ నామకరణాదులు క్రమముగా నిర్వహింపబడినట్లు-
"తేషాం జన్మక్రియాదీని సర్వకర్మాణ్యకారయత్"— (18 స., 25 శ్లో.)

అని వాల్మీకమున గలదు. ఆది శబ్దముచే నన్నప్రాశన చౌలోపనయనాదులు గ్రహింపఁదగి యున్నవని వ్యాఖ్యాతలు వివరించిరి. శ్రీరామకథాఽమృతమున నవి 122 పద్యములలో నతి విపులముగా వర్ణింపఁ బడినవి.[1] ఇట్టి వర్ణనమున కవుల వైదిక నిష్ఠ, విధి విహిత కర్మాచరణమునం దాసక్తి వెల్లడి యగుచున్నవి. మఱియు నీ విధులు లోకమున నవశ్య కర్తవ్యము లని రామాదులకు జరిగినట్లు వర్ణించుట ద్వార సూచింపఁబడినది. అందు కుమారుల "అన్నప్రాశన" సందర్భమున రాముఁ "డన్నము - అన్నాదుఁడు - అన్నదుఁడు" అని వర్ణించుట యాతని విష్ణుత్వమును బ్రతిపాదించు చున్నది. "అన్న మన్నాద ఏవచ"[2] అని విష్ణుసహస్ర నామము.

వాల్మీకమున కందర్పుడు కఠోరతపస్సమాధినిష్ఠుఁడైన పరమేశ్వరుని తపో భంగ మొనరించి ముక్కంటి యగు నాతని కంటి మంటల దగ్ధుఁడై యనంగుఁడగుట ఆ ప్రదేశమున కంగదేశ మను నామము కల్గుట, అతి సంగ్రహముగాఁ జేర్కొనఁ బడినవి.[3] శ్రీరామకథాఽమృతమున నీఘట్టము 20 పద్యములలో మూలాధికముగా వర్ణింపఁ బడినది.[4]

వాల్మీకమున పై ఘట్టమున తారకాసురుని ప్రసక్తియే లేదు. శ్రీరామకథాఽమృతమున సమయోచితముగా నాకథ వివరింపఁ బడినది. బ్రహ్మముఖమున నీశ్వర విభూతి వర్ణించుట యాతని మహత్త్వమును నిరూపించు చున్నది. కవి, శివభక్తి తాత్పర్యములకీ మూలాధిక మగు వర్ణన తార్కాణము.

---

1] శ్రీ. రా. క.-బా. కాం., 3 ఆ., 105-227 ప॥లు
2] భార., అను. ప., 149 అ., 105 శ్లో.
3] వా. రా.-బా. కాం., 23 స., 10–14 శ్లో॥లు
4] శ్రీ. రా. క.-బా. కాం., 5 ఆ., 160–79 ప॥లు

ఏదేవుని జమూర్తు లెనిమిది భూతంబు
　　లై దు చంద్రార్కులు యజ్వయు నన
నేమేటి కే నగ్ని యలశౌరి క్రతు లబ్ధి
　　సురగిరి యంత్రాది పరికరముల
మే విభుఁ గూర్చు మహేశ మృత్యుంజయ
　　కాల కాలాది కాఖ్యల నిరూఢి
యేసామి కుత్తుక యెల్ల లోకము లేర్చు
　　చెట్ట విసముపాలి చెఱకౌలంబొ
యమ్మహాత్ము సదయు నది హర్షరూపు న
నాది విధను శరణ మనుఁడు శర్వుఁ
డాదరించి మనుచు నభవు చిదంశమై
బొడము జ్యోతి యసుర మడచు వింద్ర
　　　　—బా. కాం.-5 ఆ., 169 ప.

తన వెంట వచ్చు రామలక్ష్మణులకు విశ్వామిత్రుఁడు సిద్ధాశ్రమమును గూర్చి చెప్పినవిధము వాల్మీకమున 18 శ్లోకములలో సంగ్రహముగా వర్ణింపఁ బడినది.[1] శ్రీరామకథామృతమున నయ్యది మూలాధికముగా 80 పద్యములలో సర్వాంగ సుందరముగా వర్ణింపఁబడినది.[2] బలిసిద్ధి నంది, విష్ణుదేవుని యమగ్రహము బడసిన ప్రదేశము గావున నిది సిద్ధాశ్రమము. శ్రీరామకథామృతమున నియ్యెడ "వామన చరిత్ర" ప్రత్యేక ప్రబంధముగా నెన్నఁదగురీతి సిద్ధము చేయఁబడినది. బలి పాత్ర చిత్రణ మమోఘము. విష్ణువు వామ నావతారమున వటువై బలి యజ్ఞవాటికను జేరి నట్లు వర్ణించిన విధము మనోజ్ఞము.[3] ఈ ఘట్టమునఁ బోతన ప్రభావము విశేషము.

అంశుమంతుఁడు గంగావతరణమునకై పుణ్యప్రదేశ మగు హిమవన్న గాగ్రమున ఘోరమగు తప మాచరించినట్లు—

---

1] వా. రా.-బా. కాం., 29 స., 4-22 శ్లో॥లు
2] శ్రీ. రా. క.-బా. కాం., 5 ఆ., 330—410 ప॥లు
3] బా. కాం.-5 ఆ., 361 ప., 383 ప.

"హిమవచ్ఛిఖరే పుణ్యే తపస్తేపే సుదారుణమ్"- (బా. కాం.-42 స., 3 శ్లో.)

అని వాల్మీకమున గలదు. శ్రీరామకథాఽమృతమున నాతని తపోవిధానము మూలాధికముగా వర్ణింపఁ బడినది. "ఎండ, వాన గాలి మొదలగునవి లెక్కచేయక, మనోవిగ్రహమునకుఁ దగిన ధైర్యమును బెంచుకొని యెత్తుపల్లములను అనఁగా నుచితా నుచితములను గమనింపక పర్వులెత్తు నింద్రియాశ్వములను హృదయము నందలి లక్ష్యబంధనముచే నిలిపి, ధ్యానయోగ రసాయనమున క్లేశముల యౌద్ధత్య మును మాన్పి, ప్రాణాయామమున భవబంధము లెడలింపనగురీతి నాతఁడు తప మొన రించినట్లు చెప్పుట మనోజ్ఞము.

వడిగాలి సడిసన్న గడచి పాటెడు మది
మలయించు ధృతిఁబెంచి నొలయఁజేసి
మిట్టు పల్లమునాక మిడుకఁజూచు ఖవాజి
తతి లోని లక్ష్యబంధమున నిలిపి
ధ్యానయోగ రసాయనానూన గుణయుక్తిఁ
బదరు క్లేశంబుల యదరు మాన్పి
యంచపట్టున నూర్పడంచు నేర్పున జన్మ
కర్మహాస నిరాస గతికిఁ జాలి
యెడసి ముప్పదిరెండు వేలేండ్లుఁ దపము
సలిపె గంగావతరణంబు దలపున నిడి
— బా. కాం.-6 ఆ., 221 ప.

వాల్మీకమున "సుదారుణమ్" అని యున్నదానికిది వ్యాఖ్యాప్రాయము.

అట్లే "భగీరథుఁడు ఊర్ధ్వబాహుఁడై పంచాగ్ని మధ్యమున నిలచి మాసా హారమున జితేంద్రియుఁడై తప మాచరించె న"ని వాల్మీకమునఁ గలదు.

స తపోదీర్ఘ మాతిష్ఠ ద్గోకర్ణే రఘునందన
ఊర్ధ్వబాహుః పంచతపాః మాసాహారో జితేంద్రియః
— బా. కాం.-42 స., 13 శ్లో.

ఈ ఘట్టమున శ్రీరామకథాఽమృతమున భగీరథుని తపోవిధానము మూలాధికముగా వివరింపఁబడి యిట్లు వర్ణింపఁ బడినది. దేవతా ప్రసాదము సిద్ధించుట ధ్యానిష్ఫలము. అట్టి తపమిటపాటింపఁ బడిన దనుట హృద్యము.

గోకర్ణ క్షేత్రమునకుఁ
బాకారి స్తుతుఁడు చని ప్రపన్నుండై మా
సైకాహ భోజియై య
స్తోక నియతిఁజేసె దపము సుర లగ్గింపన్

బొట్టనవ్రేలాది పుడమి నెట్టన నిల్చి
బాహువు ల్నిల్వునఁ బరఁగఁజాచి
నాలుగగ్గులు వెల్గ నడచక్కఁ దానయి
రవినేకదృష్టి తెఱవునఁ జూచి
కుండలినికి మేలు కోలు నెక్కొనఁజేసి
హంస తత్త్వవికాస మరసి మోచి
క్షుత్పిపాసల జోలి సొలయక విడనాడి
యలజడి యను నడి నవలఁద్రోచి
దివ్యవర్ష సహస్రము త్రెఱపిలేని
తపము నిష్ఠఁ దలిర్ప (6 ఆ., 232—33 ప॥లు)

ఆంధ్రీకరణమున "ఊర్ధ్వబాహుః, పంచతపాః" అను పదములకు సీస పద్యము నందలి మొదటి రెండు పాదములు వివరణములు కాఁగా "కుండలిని మేలు కొల్పి హంసతత్త్వవికాస మరయుట" యనునది మూలాధికము. రాజర్షి యగు భగీరథుని తపోవిభవ మిటఁ జక్కఁగాఁ బ్రకటితమైనది. పాత్రచిత్రణ మత్యంత సుందరము.

అయోధ్యాకాండమున రామపట్టాభిషేకోత్సవముఁ బురమునఁ జాటఁబంచిన సందర్భమున "జనబృందము లనెడి ఊర్మి సంఘర్షణ వలన నేర్పడిన హర్ష ధ్వానము లతోఁ గూడి రాజమార్గము సాగరము వలె ఘోషించు చున్నద"ని వాల్మీకమున వర్ణింపఁబడినది.

జన బృందోర్మి సంఘర్ష హర్ష స్తనవత స్తదా
బభూవ రాజమార్గస్య సాగరస్యేవ నిస్వనః
— అయో. కాం.-5 స., 17 శ్లో

శ్రీరామకథాఽమృతమున రామ సుధాంశుని యభ్యుదయము కారణముగా నట్టి యుత్సవము సిద్ధించెనని వివరణము వ్రాయుట విశేషము. మూలాధిక మగు నీభావము క్రొత్త యందమును సంతరింపఁ జేసినది.

జనసంఘ హర్ష వీచీ
ఘన సంఘర్షణ వినాద కలనలఁ బుట భే
దన వారిధి రామ సుధాం
శుని యభ్యుదయమునఁ బొదలు చొప్పతఁడరసెన్
— అయో. కాం.-21 ఆ., 256 ప.

రాముడు అత్రిమహర్షి యాశ్రమముఁ జేర ననసూయ సీతతోఁ బతివ్రతా ధర్మంబు లుగ్గడించిన విధము వాల్మీకమున 7 శ్లోకములలో వర్ణింపఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నీఘట్ట మతివిపులముగా 50 పద్యములలో వర్ణింపఁబడినది.[2] ఈ ధర్మప్రసంగము మూలాధికము. [మూ. కథాసంవిధాము]

అత్రిమున్యాశ్రమమున రాముఁడు మునులచే నర్చితుఁడైనట్లు వాల్మీకమునఁ గలదు. "అర్చితాస్తాపసైః" (అయో. కాం.-119 స., 16 శ్లో.) "మునిభావరహస్య వివరణంబొప్ప" రచింపఁబూనిన శ్రీరామకథాఽమృతమున నయ్యది—

భవ్యములు వన్యములు మూలఫలములేర్చి
కూర్చి యాశ్రమవాసులఁ గూర్చువారిఁ
జేర్చి యాతిథ్య మొసఁగి పూజించె వారి
నా తపోధనవర్యుఁ డత్యాదరమున-10 ఆ., 268 ప.

అని మూలాధికముగా నాంధ్రీకరింపఁ బడినది.

రాముఁడు దండకారణ్యమును బ్రవేశింపఁబోవునప్పుఁ డచటి తపస్వులు ద్విజులు స్వస్తివచనములు పలికినట్లు—

తపస్విభి ర్ద్విజైః కృతస్వస్త్యయనః — (119 స., 22 శ్లో.)

---

1] వా. రా.-అయో. కాం., 117 స., 22—28 శ్లో॥లు

2] శ్రీ. రా. క.-అయో. కాం., 10 ఆ., 88—137 ప॥లు

శ్రీరామకథాऽమృతమున నా స్వస్తివచనములు—

విన్ను జయలక్ష్మి వరియించి నెగడుఁగాత
నీ యసము ముజ్జగమ్ముల నెరయుఁగాత
నీ తలఁపు లెల్ల ఫలియించు నెటిన బీద
సాదలకుఁ గల్గు కష్టము ల్సమయుఁగాత
అయో. కాం., 10 ఆ., 292 ప.

అవి మూలాధికముగా వివరింపఁబడినవి. భావికథార్థసూచక మగు నీ వివరణము కవి కథాకథన దక్షతను నిరూపించుచున్నది.

ఆరణ్యకాండము నందు శ్రీరామప్రభృతులు అగస్త్యముని యాశ్రమము నకు బోవు మార్గమున రమ్యములగు ప్రదేశములను బెక్కింటిని సందర్శించిరి. అందొకచో "విమల జలపూరితమగు నొక్క సరస్సు గీతవాదిత్ర నిస్వనములతో వీనుల శ్రావ్యమై హృదయము నలరించునదై కన్పట్టెను. "ఇందు సంగీతము వినవచ్చు చున్నదే గాని యెవ్వరును గానరారైరి" అని రాముఁడు ప్రశ్నించినట్లు వాల్మీకమున వర్ణింపఁబడినది.

ప్రసన్న సలిలే రమ్యే తస్మిన్ సరసి శుశ్రువే
గీతవాదిత్ర నిర్ఘోషో నతు కశ్చన దృశ్యతే
— అర. కాం., 11 స., 7 శ్లో.

శ్రీరామకథాऽమృతమున నా గీత విశేషములఁ గూర్చి వివరించుచు—

అంతరతుష్టికిం దగిన యట్టులు బాహిరతృప్తిఁ గాంచనౌ
నంతఁ దదంతరాంతరమునం దరయం బడె సౌధసార మి
ట్లింతలు సేయునే వెలయు నేవియు రస్యమ కాక శ్రవ్యమే
వింతలు గావె యంచు రసవిశ్రుత గేయ నిబంధ నోన్నతుల్
పలుకుల్దొట్రిల నౌచితీకలనకున్ భంగంబు కావింప దు
జ్జ్వల రాగోన్నతి బీరువోదు రసభావ ప్రక్రియ ల్మాల వ
ప్పలుకుందొయ్యలి యిన్ని సంపదలకు న్బైఁగాపు గాకున్న వి
ప్పలి యింపంగల గీతమున్నెయని వారేకాగ్రత న్నిల్వగన్
— అర. కాం.-1 ఆ., 167-63 పద్యాలు

అని మూలాధికముగా వర్ణింపఁబడినది. రస భావ మాధుర్యములతోఁ గూడిన గీతములు సర్వేంద్రియతర్పణ మొనరించి యలరించుచున్న వనుట యౌచిత్య సుందరము. ఇట్టిది కవి సంగీతశాస్త్ర పరిచయమును, దదభిరుచిని వెల్లడించు చున్నది.

లంక యందు రాక్షసీమధ్యమున శోకపరాయణయై యున్న సీతను రావణుఁడు గాంచెను. ఆమె యశ్రుపూర్ణముఖియై వాయువేగవశమున సముద్రమున మునుగు నావ వలెను, మృగ సమూహము నుండి దూరమై కుక్కలచే ముట్టడింపఁబడిన మృగి వలెను దీనయై గోచరించుచున్నదని వాల్మీకమున వర్ణింపఁబడినది.

అశ్రుపూర్ణముఖీం దీనాం శోకభారాభిపీడితామ్
వాయువేగై రివాక్రాంతాం మజ్జన్తీం నావమర్ణవే
మృగయూధ పరిభ్రష్టాం మృగీం శ్వభి రివావృతాం
అథో ముఖముఖీం సీతాం మభ్యేత్యచ నిశాచరః
— అర. కాం.-55 స., 4–5 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమున నా ఘట్టము నందు—

సుడిగాలి నల్లడల్పుట్టిన మున్నీట
మునుగ బాటెడు నౌక ననుకరించి
తన యూథముం బాసి తఱిమి కుక్కలు ముట్ట
డింప వడంకు లేడిని నయించి
యిభమెత్తి యొక్కచో నిడిన మవ్వమువీడఁ
గలఁగు సరోజిని గతిని గాంచి
శశిపొత్తెడలి బలు శాపోపహతి నేల
నెనయు నౌతారక ననుగమించి

శోక భారావనమ్రయై సోగకనుల
నుండి వెలువడి యశ్రువుల్మెండుకొనఁగ
నొండుదిక్కనరామికి నొదిఁగియున్న
యా వెలఁదిమిన్నఁ గదిసె రక్షోవిభుండు
—— అర. కాం.—3 ఆ., 292 ప.

అని యామె దైన్యస్థితి మూలాధికముగా నభివర్ణింపఁబడినది. సీసపద్యము నందలి 3, 4 పాదములు కేవలము కవి స్వోపజ్ఞకము కమనీయమునై విలసిల్లు చున్నవి. గజముచే వేఱొక తావునకు గొంపోఁబడిన సరోజిని, శాపవశమున చంద్ర సంబంధమును వీడి దివినుండి భువికిఁ జేరిన తారయు నిందుపమానములుగా స్వీక కరించుట సందర్భోచితములై సీతా సహజసౌందర్య సౌకుమార్యాదికముల నభివ్యక్తము చేయుచున్నవి.

సీతాన్వేషణపరులై వెడలుచు రామలక్ష్మణులు రమ్యమగు శబరి యాశ్రమ మును జేరిరని వాల్మీకమున గలదు. "తత్ర శబర్యా రమ్య మాశ్రమమ్" (74స., 4 శ్లో)

శ్రీరామకథాఽమృతమున నా యాశ్రమ రమణీయత మూలాధికముగా నిట్లు వర్ణింపఁబడినది.

మెఱుఁగారు చక్కని మేనుల పొదలిక
లొప్పెదలు పూవులఁగాంచి పొదలుచుండ
నొండొరుల్మురువొప్ప నొలయించు ముచ్చట
లత్తెత్తి విని చిల్క లబ్రపడగ
నెమ్మోముదమ్ముల నీకెంచి నేఁటి వే
యని తేఁటి కొమలాటలాడి పాఱ
విల్లమ్ము లరసియు వెఱపేద హరిణము
ల్కల్యాణదృష్టుల కలిమి వొగడ
— అర. కాం.—4 ఆ., 297 ప.

ఇందు రామలక్ష్మణుల సౌమ్యగంభీరతలతోఁ బాటు ఆశ్రమములోని పూఁబొదలు, చిలుక కదుపులు, తేటి గుంపులు, లేళ్ళ సమూహములు మున్నగునవి మనోహరముగా వర్ణితములైనవి.

కిష్కింధాకాండలో వాలి దుందుభి రాక్షసుని జంపి కళేబరము విసిరివేయగా నది మతంగాశ్రమ సమీపమునఁ బడినది. ఆశ్రమము రుధిరసిక్తమైనది. ప్రాంత పాదపములు భగ్నము లైనవి. అట్టియెడ ముని "ఎవనిచే నీ భీభత్సము సృష్టింపఁ బడినదో యాతఁడు గాని, యాతని యమాత్యులు గాని నా యాశ్రమమునకుఁ జుట్టును

యోజనదూరములోపలఁ గాలిడిన వారక్కడే నశింతుర"ని శపించినట్లు వాల్మీకమున గలదు. [కి. కాం.-11 స., 53–55 శ్లో॥లు]

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ ముని
"అంత చక్కన తాపసాశ్రమంబయ్యె నే
మర్యాదగలదె ప్రమత్తులకును
మా తెందులేరని మసలుచు న్నాడు
తన కింద్రవరము సాధకమటంచు" అని యాగ్రహించి

క్రోఁతులని మిన్నకుండిన
నా తరువుల ఫలములెల్ల నములుచు నేఁడి
ట్లీతరఁబడి మేలేంచిరి
పాతకమగుఁగాదె చెడుఁగు పందలఁజేర్పన్
— కి. కాం.—1 ఆ., 219–220 ప.లు

అనినట్లు మూలాధికముగా ననువదింపఁ బడినది. వరబలమున ప్రమత్తుఁడగు వాలి దౌష్ట్య మిట సునిరూపితమై, ముని యిడిన యుగ్రశాపమునకు దగినంత కారణమును సూచించుచున్నది. "క్రోఁతులని మిన్నకుండిన" యనుట స్వభావోక్తి సుందరము. "ఇట్లీతరఁబడ మేలెంచిరి" యనుటలో నర్థమత్యంత తిరస్కృతవాచ్య ధ్వనియై యవ్వానరుల కృతఘ్నత వెల్లడించు చున్నది. ఇట్లీ యధిక్షేపము రమణీయార్థ ప్రతిపాదక క్షమమై సహృదయుల నలరించుచున్నది. మఱియు "చెడుగు పందలఁజేర్చుట పాతక మ"ని దుస్సాంగత్యములోని దోష ముద్ఘాటింపఁబడినది. శాపాయుధుఁడగు ముని తపఃప్రభావముఁ జక్కఁగాఁ బ్రకటింపఁ బడినది.

సుగ్రీవాజ్ఞ ననుసరించి వివిధ పర్వతప్రాంతముల నుండి సీతాన్వేషణకై వానరు లేతెంచిరి. "అట్టి వానరులు గెంటుచు, గంతులు వైచుచు, గర్జించుచు నానందోత్సాహములతో బహువిధములగు శబ్దములను జేయుచు వచ్చి సుగ్రీవునకుఁ దమ రాక విన్నవించిరి.

ఆగతాశ్చ నివిష్టాశ్చ పృథివ్యాం సర్వవానరాః
ఆప్లవంతః ప్లవంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః

అభ్యవర్తంత సుగ్రీవం సూర్య మభ్రగణా ఇవ
కుర్వాణా బహుశబ్దాంశ్చ ప్రహృష్టా బాహుశాలినః
శిరోభిర్వానరేంద్రాయ సుగ్రీవాయ న్యవేదయన్
— 39 స., 40, 41 శ్లో॥లు

అని వాల్మీకమున వర్ణింపఁబడినది. శ్రీరామకథాఽమృతమున నా కపుల యుత్సాహపూరిత మగు చేష్టలు విపులముగ నిట్లు వర్ణింపఁబడినవి—

ఒండొరుల గెంటుచు నఖండ రభసం బెసఁగ
మెండుకొని వృక్షముల గండశిలలం ద్రో
యుం డలరు నవ్వనికి రం డెలయు నియ్యల ని
లుం డొలసి యానతిఁ గొనుం డొకఁడుమాత్రన్
గండడతు మింక దనుజుం డెదిరెనేని బల
మండసెడి పాల నొడయం డెడక మెచ్చున్
బండువది జానకిఁ గనుం డధిపుఁ జేర్ప మొన
యం డవల మేకొనుఁడు నిండు మది నుండన్

అని గంతులు వైచుచు ను
బ్బునఁ బొదలుచు రామదేవుఁ బొగడుచుఁ దత్కీ
ర్తినిఁ గీర్తించుచు నప్పా
వను లగచరు లొప్పి రచలవంశాభరణా !
— 2 ఆ., 282—83 ప॥లు

ఇందు వానరముల చపలస్వభావముతోఁ బాటు ధీరత బహు రమ్యముగ నభివర్ణితము. అట్టి భావము "లయగ్రాహి" యందు వర్ణించుట వృత్తౌచిత్యము. "రామదేవుఁ బొగడుచుఁ దత్కీర్తినిఁ గీర్తించుటం" జేసి యగచరులు పావనులై యొప్పిరనుట హృద్యము.

మఱియునియ్యెడ వానరవీరుల సోత్కర్షప్రకటనోచితమగు వచన రచన మూలాధికము. (2 ఆ., 284—85 వ॥లు) "కుర్వాణా బహుశబ్దాంశ్చ ప్రహృష్టా బాహుశాలినః" అను మూలమున కిది యంతయు వివరణప్రాయము. వానరయోధుల

బలపరాక్రమ పరిగణనము, వారి స్వామిభక్తి పరాయణత, వారి యానందోత్సాహములు బహుధా ప్రశంస నీయ మగు వైఖరి నిందుఁ బ్రకటింపఁ బడినవి. ఇట్టి వర్ణనము వీరరస ప్రధానమై భావి కథాపరిపుష్టికి దోహద మగుట విశేషము (చూ. పాత్రచిత్రణము)

హనుమదాది కపివీరులు పిపాసార్తులై యొకానొక గుహాయందు బ్రవేశించిరి. అంతఁ గొంత ముందునకేగి కాంచనమయ మగు నొక వనము గాంచిరి. అందలి విశేషమును దెల్పుచు వాల్మీకమున 14 శ్లోకములు వర్ణింపఁ బడినవి.[1] శ్రీరామ కథామృతమున నా గుహావిశేషములు మూలాధికముగా 11 పద్యములలో వివరింపఁ బడినవి.[2] స్వయంప్రభ పతిప్రభావమిట కీర్తితమగుట రమ్యము.

సుందరకాండలో సీతాన్వేషణపరుఁడై హనుమంతుఁడు లంకం బ్రవేశించి "వివిధాకృతి రూపములతో నున్న భవనముల యందొక భవనమునుండి వేఱొక భవనమునకుఁ బోవుచు సీతను వెదకఁజొచ్చెనని వాల్మీకమునఁ గలదు–

భవనా ద్భవనం గచ్ఛన్ దదర్శ పవనాత్మజః
వివిధాకృతి రూపాణి భవనాని తత స్తతః (– సుం.కాం,-4 స., 9 శ్లో.)

శ్రీరామకథామృతమున నీఘట్టము నందు విచిత్ర భవనములతో గూడిన యా నగర సౌందర్యాదికము నిరూపించుచు మూలాధికముగా నిట్లు వర్ణింపఁ బడినది·

ఒక హర్మ్యమీక్షించి యొండు గన్గొని నంత
నదె యిదియను భ్రాంతి యానహిల్ల
నొకవీథి గాంచి వేఱొండు గైకొన మున్ను
దాఁగన్న యద్దాని తత్త్వమొలయ
నొక మణిస్తంభంబు నొరసి యొండెడఁజూడ
నొక్కఁడే యను తలం పుల్లసిల్ల
నొక భిత్తిఁదిలకించి యొగినన్యఁబరికింపఁ
గైవల్యమున రెండు గ్రాలుచుండ
నబ్రమున ముగ్గితేలుచు నాతఁడరసి
పొలుప కాకెందు దీనికి పొరపులేదు

1] కి. కాం.-50 స., 25-38 శ్లో॥లు 2] కి. కాం.-3 ఆ., 64-74 ప॥లు

దీని మర్మంబు బ్రహ్మకే తెలియఁబోలు
నని మదిఁ దలంచె విద్యారహస్యమూర్తి

చాలొక్కింతయుఁ దప్ప కొక్కరకమై చాల్పు న్వెడల్పుం దగన్
డాలెం దేయది పోలనౌ నటులెయుండం జొక్కపుం జావా
కీలుంబొమ్మల యొప్పు లప్పగిది నేకీ భూతము ల్గాఁగ వాఁ
డాలోలాత్మతఁగాంచె సృష్టియవురాయంచు న్స్మరోల్లాసినీ

వచ్చలకాంతు లొక్కయెడఁ బచ్చికపట్టున యొప్పుసూపఁ గ
న్విచ్చిన మూసిన స్సరిగ నీలమణిద్యుతు లావరింపఁ బై
పెచ్చుగ స్ఫాటికస్ఫురణ వీచులు దార్కొనఁ జిత్తవృత్తి పా
టచ్చెరియైన యన్నగరి డంబున కోడె నతండు శాంకరీ

— 1 ఆ., 179–81 వ॥లు

మనోహరమగు నిట్టి వర్ణన కవి వర్ణనాప్రియత్వమును, లంకానగర వైభవమును జాటుచున్నది.

లంకాదహన సందర్భమునఁ "ప్రజలందఱు భయభ్రాంతులై స్వగృహములను రక్షించుకొనుటలో భగ్నోత్సాహులై యాక్రందించుచు, నటునిటు పరువెత్తుచు హనుమంతుని కపిరూపు గొని వచ్చిన యగ్నిగా నెన్నుచుండిరి. తుములమగు శబ్ద ముద్భవించు చున్నది. స్త్రీలు చంటిబిడ్డల నక్కున జేర్చుకొని దైన్యమున నా కాక కోర్వక నేలగూలుచున్నార"ని వాల్మీకమునఁ గలదు.

నూనమేషోఽగ్ని రాయాతః కపిరూపేణ హా ఇతి
క్రందన్త్యః సహసా పేతుః స్తనంధయ ధరాస్త్రియః

— సుం. కాం.-54 స., 26 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నీఘట్టము—

కపిరూపుగొని వచ్చెఁగాని యగ్గియ యూతఁ
డనుచు నిట్టలముగ నఱచువారు
తోఁక చిచ్చట వీని తోఁకఁ జిచ్చిడి వీడు
టిధియేమి వెరవంచు నేడ్చువారు

సీతఁదెచ్చిననాఁడె చెడె లంక గాకేమి
శోకింప ఫలమంచు సొగియువారు
ఖరదూషణాదుల గడెలో నగల్చినా
తని దూత కిదియెంత యనెడువారు

నగుచుఁ జంటిబిడ్డ లక్కున గదియంగఁ
జిక్కబట్టికొనుచుఁ జెలువ మెడల
నెఱులు జీరుకాడ నేలఁ గూలిరి కాక
కోర్వ కసుర యువతు లువిద! వింటె-[సుం.కాం.-3 ఆ., 301 ప.]

అని మూలాధికముగాఁ జిత్రించిరి. "క్రందన్త్యః" అనుటకు వివరణముగా వారేమని యాక్రందించిరో సీసపద్యములోని 2, 3, 4 పాదములు పరిగణింప నగును. "హనుమంతుఁడు తోఁక చిచ్చు వాని తోఁకకు నిప్పంటించి విడిచి నా రిదేమి న్యాయమని యేడ్చువారు, సీతాసాధ్వినిటఁ దెచ్చిననాడె యీ లంకకుఁ గీడు మూడినది. ఇంతకాల ముపేక్షించి యీనాఁ డీవిపత్తునకు శోకింపనేమి ఫలమని దుఃఖించువారు, ఖరదూషణాదుల నొక్క గడియలోఁ జంపిన వీరాగ్రేసరుఁ డగు రాముని దూత కావున నీ కార్య మీతని కెంత యనెడువారు నగుచు నాక్రందించిరని వర్ణించుట వలన హనుమ సృష్టించిన భీభత్సము సునిరూపితమైనది. కార్యమును బట్టి కారణము యొక్క విశేషమును బ్రకటించుట సుందరమగు కావ్యశిల్పము.

హనుమంతుఁడు రావణునకు హితము బోధించుచు "రామునకు సీత నప్పగించి శరణు వేడుము. కాకున్న రామున కిట్టి యపకార మొనరించి జీవించుట దుర్లభము. దేవ దానవాదు లెవ్వరు రాముని ముందు నిలువఁజాలరు. బ్రహ్మరుద్రాదులు సహితము రామవధ్యుడవైన నిన్ను రక్షింపఁజాలరు" అని చెప్పినట్లు వాల్మీకమున గలదు. [సుం. కా.-51 స, 43—5 శ్లో॥లు]

శ్రీరామకథాఽమృతము నందీ సందర్భమున రావణుని పూర్వకథాస్మరణమున పరాభవ పరంపర నేకరువు పెట్టుచు నాతని యశక్తత నిరూపించుట మూలాధికము.

వాలిసంధిఁట నొక్కింత వగరుదక్కఁ
గార్తవీర్యుని కొట్టునఁ గందువాఱె
నమ్మగఁటిమికిఁ దెలిదీవి యన్నులిడ్డ
పుండుపై నేఁడు పోలేరు బొబ్బవాడమె
— సుర. కాం., 3 ఆ., 229 ప.

మఱియు రామునకు రావణునకు బలవైభవ పరాక్రమములలో నాంతర్య మును నిరూపించుచు శివధనుర్భంగము, పరశురామ గర్వాపహరణము, వాలి వధ, ఖరదూషణాదుల సంహారము మొదలగునవి యుదాహరించి రాముని యసామాన్యత, రావణుని యల్పత్వము నుగ్గడించుట హృదయంగమము. తన్ను నెదిరి నెఱుఁగక వర్తించుట తగదని చెప్పుట ప్రస్తుతాంశమునఁ దెలియనగు నీతి. శ్రీరామకథాఽమృత మున నీ క్రమ మంతయుఁ జక్కఁగా వర్ణింపఁ బడినది. (3 ఆ., 232 ప.) ఇందు హనుమ "సిగ్గుమాలిన నీవు వినుట కిష్టపడినను నీవంటి మూర్ఖులకు జెప్పుట నాకు సిగ్గగు చున్నద"నుట రావణుని యజ్ఞతను విశేషముగ నిరూపించుచున్నది.

హనుమంతుఁడు సీతా దర్శనానంతరము కార్యాలోచనము చేయుచు "కార్యజ్ఞుఁ డగువాఁడు నిర్దేశించిన కార్యముతోఁబాటుగాఁ బూర్వకార్యాఽ విరోధమగు నితర కార్యములు గూడ సాధింపవచ్చున"ని భావించినట్లు వాల్మీకమున గలదు.

కార్యే కర్మణి నిర్దుష్టే యో బహూన్యపి సాధయేత్
పూర్వకార్యాయవిరోధేన స కార్యం కర్తుమర్హతి
— సుర. కాం.-41 స., 5 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నా విషయము వివరించుచుఁ గార్యసాధనమును బట్టి తత్కర్తల యుత్తమ మధ్యమాధమాది యోగ్యతలు నిర్ణయించుట మూలాధిక ముగా వర్ణింపఁబడినది. ఇట్టి వివరణ మా సమయమున జేసిన హనుమత్కార్యమును సమర్థించు చున్నది. (సుం. కాం.-3 ఆ., 11 ప) [చూ. పాత్రచిత్రణము]

యుద్ధకాండమున విభీషణ శరణాగతి సందర్భమున రాముఁడు శరణాగత రక్షణము నందలి విశేషమును జెప్పుచు కపోత వృత్తాంతము నుదహరించినట్లు వాల్మీక మున సంగ్రహముగా వర్ణింపఁబడినది.

శ్రూయతేహి కపోతేన శత్రుశ్శరణమాగతః
అర్చితశ్చ యథాన్యాయం స్వైశ్చమాంసై ర్నిమంత్రితః
స హితంప్రతి జగ్రాహ భార్యాహర్తార మాగతం
కపోతో వానరశ్రేష్ఠ! కింపున ర్మద్విధోజనః
–యు. కాం.-18 స., 24, 25 శ్లో॥లు

శ్రీరామకథాऽమృతమున నీ కపోతవృత్తాంతము విపులముగా 8 పద్యములలో మనోహరముగా వర్ణించుట మూలాధికము.[1] ఇందు సతి పుణ్యలోక తాత్పర్యమునఁ బతికిఁ బరమహితంబౌ ధర్మమును దెలుప నది యతిథి సమర్చనము గావించినట్లు రసవత్తరముగా వర్ణింపఁ బడినది.

ఇట్టి వివరణము శరణాగత రక్షము నందలి విశిష్టతను వెల్లడించుట కుద్దేశింపఁ బడినది. అట్టి యద్భుత కథాసంవిధానమున కవి కృతకృత్యతఁ బ్రకటింప బడినది.

రావణవధానంతరము రాముఁడు సీతాసమేతుఁడై పుష్పకము నధిరోహించి యయోధ్యకుఁ బోవు మార్గమధ్యమున సీతాపహరణము తరువాత జరిగిన స్వచరిత విశేషములు సీతకు నాయా ఘట్టముల వివరించినాఁడు. అందు సేతు బంధమును త్రైలోక్యపూజిత మగు పరమపవిత్ర తీర్థరాజముగాను, పరమేశ్వరుఁడు రామునకు బ్రసన్నుఁడై దర్శన మిచ్చిన పుణ్యప్రదేశము గాను వర్ణించినట్లు వాల్మీకమునఁ గలదు.

ఏతత్తుదృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః
సేతుబంధ ఇతిఖ్యాతం త్రైలోక్యే నాభి పూజితమ్
ఏతత్ పవిత్రం పరమం మహాపాతకనాశనమ్
అత్ర పూర్వం మహాదేవః ప్రసాద మకరోత్ప్రభుః
- యు. కాం.-126 స., 15, 16 శ్లో॥లు

శ్రీరామకథాऽమృతమున నియ్యది 10 పద్యములలో మూలాధికముగా వర్ణింపఁ బడినది.[2] అందు సేతువు మాహాత్మ్య మిట్లు వర్ణింపఁ బడినది.

---

1) శ్రీ. రా. క.-యు. కాం., పూ. భా., 3 ఆ., 80–87 ప॥లు
2) శ్రీ. రా. క.-యు. కాం., ఉ. భా., 2 ఆ., 116–27 ప॥లు

దీనిఁ గనుంగొనం గనిన దేవి! పునర్భవ మొందఁ దెట్టివాఁ
డేనియు "నేను సేతువున కేగెద స్నాన మొనర్తుఁ దర్పణం
బానెడిఁ బైతృకంబు గల యంతలు సేయుదు" నంచు నిచ్చలున్
దా నవినం దరించుఁ బితృతండముతోడ మృణాల జిద్భుజా!

పున్నెముల నెలవు దీనిం
గన్న గృతార్థులకు నెల్లఁ గామ గవియనం
గన్నది పేరు సకల సం
పన్నులఁ జేయు న్నరులనుఁ బల్లవపాణీ!

యు. కాం.-ఉ. భా., 2 ఆ., 120-21 ప॥లు

"రాముఁడు పట్టాభిషిక్తుఁడు కాఁగా భూమి సస్యవతియైనది. పాదపములు ఫలవంతములైనవి. పుష్పములు పరిమళ భరితములైనవి" అని రామోత్సవ విశేషములు వాల్మీకమున వివరింపఁ బడినవి

భూమిః సస్యవతీచైవ ఫలవన్తశ్చ పాదపాః
గంధవంతిచ పుష్పాణి బభూవో రాఘవోత్సవే-[యు. కాం.-131 స., 68 శ్లో]

శ్రీరామకథాఽమృతమున నియ్యెడ "భూమిః సస్యవతీ, పాదపాః ఫలవన్తః పుష్పాణి గంధవంతి అను భాగములు ప్రబంధఫక్కి మూలాతిశాయిగ నిట్లు వర్ణింపఁ బడినవి.

మోటులు పల్లవమ్ముల జొంపములతోడ
సాంద్రతర చ్ఛాయ సంతరింప
శాద్వలమ్ముల నిండుచాల్పు ల్పసరువన్నె
రత్నకంబళముల రాణఁబొనర
పవ్వంపుఁ బూగుత్తు లువ్వెత్తుగొని తీఁగె
లొగి సిరుల్తావులు నొలసి వెలయ
స్కంధాత్ప్రభృతి ఫలోచ్చయ సుమదళ సంప
దాఢ్యంబులై ప్రమాకులందగింప

నధిపు మేలన్నఁ దనమేలె యనెడు నిచ్చఁ
బైరుపచ్చల సుసమృద్ధి బరఁగె వసుధ
యమర భువినిదె నిత్యకల్యాణమట్లు
పచ్చతోరణలని ప్రజల్ప్రస్తుతింప

మఱియు మూలమున భూమిని గూర్చియే చెప్పఁబడగా నిటఁ బంచ భూతములు నధిక తేజమునఁ బ్రకాశించినవనుట విశేషము. (యు. కాం.-ఉ. భా. 2 ఆ., 504—8 ప॥లు) ఇట రాముఁడు సర్వభూతాంతరాత్ముఁ డగు పరమాత్మునిగా సంభావింప బడినాఁడు. రామరాజ్యమున సర్వము సుసంపన్నమైనది.

ఉత్తరకాండమున ధర్మాత్ముఁడగు పులస్త్యబ్రహ్మ "స్వాధ్యాయ నియతేంద్రియుఁడై తప మాచరించినట్లు" వాల్మీకమునఁ గలదు.

తపస్తేపే సధర్మాతా స్వాధ్యాయ నియతేంద్రియః - (ఉ.కాం.-2 స., 8 శ్లో.)

శ్రీరామకథాఽమృతమున నాతని తపోవిధానము యోగార్ధబంధురమగురీతి వివరణాత్మకముగా నాంధ్రీకరింపఁ బడుట మూలాధికము [ఉ. కాం. పూ భా. 1 ఆ., 62—3 ప॥లు] ఇట్టి వర్ణనపులస్త్యముని పాత్రచిత్రణమునకు దీప్తినిచ్చు చున్నది.

రమణీయ ప్రదేశ మగుట పులస్త్యాశ్రమమున దేవ గంధర్వ కిన్నర కింపురుషాంగనలు ప్రీతితో నాడుచుఁ బాడుచు శబ్దములు గావించుచుఁ గ్రీడించుచు ముని తపస్సునకు విఘ్న మాచరించి రని వాల్మీకమున గలదు.

దేశస్య రమణీయత్వా త్పులస్త్యోయత్ర సద్విజః
గాయంత్యోవాదయంత్యశ్చ లాసయంత్య స్తథై వచ
మునే స్తపస్విన స్తస్య విఘ్నం చ క్రు రనిందితాః
— ఉ. కాం.-2 స., 11—12 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమున మూలాధికముగా 40 పద్యములలో నా కన్యల విలాసవిభ్రమములు విహారవిన్యాసములు సరససల్లాపములు జలక్రీడా పుష్పాపచయ మన్మథపూజాదులు విపులముగా వర్ణింపఁబడినవి.[1] ఈ ఘట్టమునఁ బ్రబంధ పద్ధతిని బోలిన దీర్ఘ వర్ణన మాకన్యల స్వేచ్ఛావిహారమునుఁ బ్రకటించు చున్నది. మఱియుఁ

1] శ్రీ. రా. క.-ఉ. కాం., పూ. భా., 1 ఆ., 64-103 ప॥లు

బులిస్త్యుఁడు తన తపోభంగము గాకుండునట్లు వారినిఁ దీవ్రముగ శపించుటను సమర్థించు చున్నది. కథాసందర్భోచిత మగు నిట్టి వర్ణనములు కావ్య శోభాహేతువులై నెగడు చున్నవి. ఆ కన్యల విహారము లిట్లు పేర్కొనఁ బడినవి.

పూలుగోయుదురు పూఁబోడు లాదరమొప్పఁ
బూవింటి వేలుపుఁ బూజసేయ
విరిదమ్మి కొలఁకుల విహరింతు రొయ్యార్లు
సిరి యిచ్చకంబున సిరి గడింప
దూఁగుటుయ్యెలలూఁగ దొరకొంద్రు చంద్రాస్య
లుడులగోళ్ళఁ దెమల్చునోజ మొలయ
బొదరు టిండ్లం దూటీ పొదలం దలంతురు
ముద్దియల్ దాఁగుడుమూఁతలాడ
గానగోష్ఠిప్రసంగంబు లానయింత్రు
ఆలఁగరగించు నొడ్డారమాలగింప
నెమ్మెలాఁడులు బ్రహ్మర్షి యొక్కటి తప
మాచరింపఁ దిరంపడు నవ్వనమున

— ఉ. కా., పూ. భా., 1 ఆ., 66 ప.

"ధర్మమే పరమ ప్రాప్యమని తలంచి కుబేరుఁడు ధర్మాత్ముఁడై వనమున వేయివత్సరములు తపమాచరించి"నట్లు వాల్మీకమునఁ గలదు.

చరిష్యే నియతో ధర్మం ధర్మోహి పరమాగతిః
సతువర్ష సహస్రాణి తపస్తప్త్వా మహావనే— (ఉ. కాం.-3 స., 11 శ్లో.)

శ్రీరామకథాఽమృతమున ధర్మము యొక్క ప్రాధాన్యముఁ బ్రాశస్త్యము గూర్చి మూలాధికముగా వివరింపఁబడినది.

ధర్మంబు పరదేవత యనం బ్రసిద్ధమౌ
ధర్మంబె తపమునై తనరుచుండు
ధర్మంబు యోగవిద్యానిరూఢంబగు
ధర్మంబె పరమనాఁదగిన గతియు

ధర్మంబనందె వేదములు సాంగములుండు
ధర్మంబె లోకము ల్తదధిపతులు
ధర్మం బహింస సత్యము బ్రహ్మచర్యంబు
ధర్మంబె స్వాహా స్వధా ప్రముఖము
లరయఁగా ధర్మమే పురుషార్థ మెందు
నర్థకామంబు లద్దాని యందె డిందు
ము క్తి యఱచేతిలోని దై మురిప మమరఁ
దారసిల్లును దా ధర్మతత్పరులకు
కావున నియతము ధర్మం
బేవేళ ఘటిల్లఁజేయు నెల్లశుభములం
దావలమై సంచితమగు
కావల ముడిగించు నంచుఁ గాంతు మనమునన్

— పూ. భా.-1 ఆ., 197-98 ప॥లు

ఇట మూలము నందలి "ధర్మోహి పరమాగతిః" అనుటకు వివరణముగా నాధర్మము యొక్క విశ్వరూపమును నిరూపింపఁజేసిన శాస్త్రిగారి ధర్మాభిరతి బహుధా ప్రశంసనీయమైనది.

రావణాదుల పూర్వచరిత్ర వివరించు సందర్భము నందు పాతాళమున బలి రావణునితో విష్ణువు సామర్ధ్యమును జెప్పుచు "హిరణ్యకశిపుని సంహరింప నారసింహ రూపమును దాల్చి రౌద్రాకృతితో సర్వుల భయభ్రాంతుల నొనరించి యాతనిఁ జేతులతో నెత్తి గోళ్ళతోఁ జీల్చి యమపురి కంపినాఁడు. అతఁడే నిరంజనుఁడగు వాసుదేవుఁడు. అతఁ డిప్పుడాద్వార దేశమున నున్నవాఁడ"నినట్లు వాల్మీకమున వర్ణింపఁబడినది.

ఉత్పన్నో రాక్షసశ్రేష్ఠ! నృసింహాకృతి రూపధృత్
దృష్టంచ తేన రౌద్రేణ క్షుబ్ధం సర్వ మశేషతః
తత ఉద్ధృత్యబాహుభ్యాం నఖై ర్నిన్యేయ మక్షయమ్
ఏష తిష్ఠతి వై ద్వార్థో వాసుదేవో నిరంజనః

- ఉ. కాం.-అధికపాఠే., 1 స., 72, 73 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమున నరసింహావతార రహస్యమును వివరించుచు మూలాధికముగా 10 పద్యములలో నది యనువదింపఁబడినది.[1] బ్రహ్మ వరములకు భంగము వాటిల్లకుండునట్లు పగలు రేయి కాని సంధ్యాసమయమున నింటను బయలను గాని చోటు గడపయే యుద్ధరంగము కాఁగా నాకాశము భూమి కాని ప్రదేశమున తొడల యందుఁ జేర్చి యేయస్త్రము గాని నఖములతో నాతని విదారణ మొనరించి చంపిన విధ మిట్లు మనోహరముగా వర్ణింపఁ బడినది.

పొర్లిద్రుతుం గేడుదాఁకఁ బోరువాని శరాలి
కదలక మ్రింగె ముఖంబు దెఱచి
సంధ్యాసమయమందు సంరబ్ధుఁడునుగాక
బాహుల నాతనిబట్టి తిగిచె
వేశ్మంబుగాకుండ వెలుపల గాకుండఁ
గడపనే యుద్ధరంగం బమర్చె
నాకాశమని భూమియని పల్కరాకుండఁ
దన తొడల్సాచి శాత్రవునిఁదార్చె

ధాతవర మల్లియుండ విదారణంబొ
నర్చె తద్హృదయంబప్డు నఖశిఖలనె
వాఁడు దేవాదిదేవుం డ వార్యబలుఁడు
వాసుదేవుండు ద్వారనివాసి యనఘ
—ఉ. కాం.-పూ. భా., 4 ఆ., 580 ప.

రావణిచే నిర్జితుఁడగు నింద్రుని విడిపించుకొనిపోవుచు బ్రహ్మ యింద్రున కహల్యావృత్తాంతమును స్మరణమునకు దెచ్చుట వాల్మీకి రామాయణమున 30 శ్లోకము లలో సంగ్రహముగా వర్ణింపఁబడినది.[2] "విష్ణులోభవ" యని శపించిన గౌతమ ముని వాక్యముల కిది ఫలితమని వివరించుట యీ కథాంశము నందలి తాత్పర్యము. శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలాధికముగా 43 పద్యములలో నతి రమణీయ

1] శ్రీ. రా. క.-ఉ. కాం., పూ. భా., 4 ఆ., 575-84 ప॥లు
2] వా. రా.-30వ స., 26-55 శ్లో॥లు

మగు సరణి సంతరింపఁబడినది.[1] బాలకాండ యందలి యహల్యావృత్తాంతమునకు నిచటి కథకు రచనాగతమగు విలక్షణత గోచరించుట గమనింపఁదగి యున్నది. ఈ రెండు ఘట్టములను పితాపుత్రు లిర్వురు రచించుట మఱియొక విశేషము. గౌతముని యుత్తమ గృహస్థునిగా నెల్లలోకములు గీర్తించిన విధమిందు వర్ణించుట మనోజ్ఞము. (ఉ. కాం.-పూ. భా., 4 ఆ., 580 ప.) చూ. పాత్రచిత్రణము.

రావణుని మంత్రులు "నారీజనముతో గూడి జలవిహారము గావించుచుఁ దన సహస్రబాహువులతో నదీప్రవాహమును నిరోధించిన కార్తవీర్యార్జునుని గాంచిర"ని వాల్మీకమున గలదు.

నదీం బాహుసహస్రేణ రుంధన్త మరిమర్దనమ్ - (ఉ.కాం.-32 స., 15 శ్లో.)

శ్రీరామకథాऽమృతమునఁ గార్తవీర్యుని జల స్థల విహారములు మూలాధికముగా 35 పద్యములలో రసనిర్భరము లౌనట్లు విశేషముగ వర్ణింపఁబడినవి.[2]

రాముఁ డడుగ నగస్త్యుడు "హనుమచ్చరిత్ర" వివరించుట వాల్మీకమున 102 శ్లోకములలో వర్ణింపఁబడినది.[3] శ్రీరామకథాऽమృతమున నయ్యది 182 పద్యములలో సర్వాంగ సుందరముగ మూలాతిశయితమగు విధమున వర్ణింపఁ బడినది.[4] "హనుమచ్చరిత్ర" ప్రత్యేకముగ నెన్నదగిన కావ్యకళాఖండముగా దీర్చిదిద్దుట సహృదయుల నలరించుచున్నది. "ఉదయాస్తగిరుల నడుమ దిరుగుచు హనుమంతుఁడు సూర్యుని యొద్ద వ్యాకరణశాస్త్ర మభ్యసించె నని వాల్మీకమున గలదు.

అసౌ పునర్వ్యాకరణం గ్రహీష్యన్ సూర్యోన్ముఖః ప్రష్టుమనాః కపీంద్రః
ఉద్యద్గిరే ర స్తగిరిం జగామ గ్రంథం మహద్ధారయ న్నప్రమేయః
— ఉ. కాం.—36 స., 45 శ్లో.

శ్రీరామకథాऽమృతమున హనుమంతుఁడు సూర్యుని గురువుగా నెన్ను కొనుటలోఁ గల యౌచిత్యము నుగ్గడించిన విధమిట్లు మనోహరముగా వర్ణింపఁ

---

1] శ్రీ. రా. క.-ఉ. కాం., పూ. భా., 6 ఆ., 319–61 ప॥లు
2] శ్రీ. రా. క.-ఉ. కాం., పూ. భా., 7 ఆ., 81-115 ప॥లు
3] వా.రా.క.-ఉ.కాం., 35 స., 19-65 శ్లో॥లు, 36 స., 1-55 శ్లో॥లు
4] శ్రీ. రా. క.-ఉ. కాం., పూ. భా., 8 ఆ., 6-187 ప॥లు

బడినది. లోకమున నుండి తన రూపు నుపసంహరించు కొని, వజ్రాహతుఁడై మూర్ఛితుఁడగు తనయునితో గుహలోఁ జొఱఁ బాఱిన వాయువును ప్రసన్నుని గావించుకొనఁబోయిన దేవతలలో సూర్యుఁడు హనుమకు సకల విద్యలు ప్రసాదింతునని మాట యిచ్చినాఁడు. నేఁడది గుర్తుంచుకొని హనుమ సూర్యుని గురువిగా నిశ్చయించి యాతనిఁ జేరి విద్య లర్థించిన విధము వివరముగా విట్లనువాదమున రచింపఁబడినది—

అలనాఁడెల్ల ఘటించుచోటఁ దపనుం డర్థార్థ మర్థించి కా
వలె నన్నప్పుడు విద్దెలెల్లఁ జదివింపంబూని యాచార్య కం
బెలమిన్ నేనె వహింతునన్న నుడులన్ హృద్వీథిఁ జర్చించి పో
యె లసద్రాజ మరాల రాజిత నభోహేరాల లీలాగతిన్

అటు చని కాంచి మేరుగిరి కన్యహమోలిఁ బ్రదక్షిణం బొన
ర్చుట పనిగా వడింజను గురుంగని మ్రొక్కుచుఁ జుట్టివచ్చి యు
త్కటమగు భక్తి యోగమున గాలికొమారుఁడు మూర్ధభాగ సం
ఘటిత వికస్వరాంబుజయుగ ప్రతిమాంజలిబంధుఁడై యనున్

దేవ! యనుగ్రహింపవలె దేవర మున్ సెలవిచ్చినట్టు లా
యా వివిధాగమంబు లితిహాస పురాణ ముఖాఖి లాంగముల్
కావలె నంచు వచ్చితి నికామదయా! జననంబు సార్థకం
బై వెలుగొందఁజేయు మనయం బనయజ్ఞుని నన్ను విజ్ఞుగాన్

బాహ్యమాంతరమైన సర్వంబు తమము
నాహరించెడు దొరవంచు నాశ్రయించి
నాఁడ సత్యప్రతిష్ఠితా! నాఁటిమాట
సూటి మదినెంచి నన్నేలఁజూడుమయ్య

ఉ. కాం.-పూ. భా., 8 ఆ, 148-51 పుులు

ఇట విశిష్టమగు గురుశిష్య సంప్రదాయ ముగ్గడి పఁబడినది. గురు వనగా శిష్యు నజ్ఞత బోఁగొట్టి విజ్ఞునిఁ జేయువాఁడు.[1] అంతరతమ మనగా నజ్ఞానము.

---

1) శ్లో॥ గుకార స్త్వంధకారస్స్యాత్ రుకార స్తన్నిరోధకః ।
అంధకారనిరోధత్వాద్గురు రిత్యభిధీయతే॥

సూర్యుఁడు "బాహ్యమాంతరమైన సర్వంబు తమము నాహరించెడు చోర." మఱియు నాతఁడు సత్యప్రతిష్ఠితుఁడు కావుననే హనుమ "ఉత్కట మగు భక్తియోగమున" నా గురువు నాశ్రయించినాఁడు. నికామదయతో నాతఁడు బోధింప శిష్యుఁడు "జననంబు సార్థకంబై వెలుఁగొందఁజేసి" కొనినాఁడు. ఇచట సూర్యుఁడు ఉత్తమోపాధ్యాయ వర్గ ప్రతినిధి. హనుమ విద్యార్థితతి కగ్రగణ్యుఁడు. విద్య వలన నజ్ఞతఁ బాసి జన్మసార్థక మగుట కోరఁదగిన విషయ మని ఫలితాంశము. ఇట్టి శైక్షికోపాధ్యాయవృత్తి భారతీయ సంస్కృతిలో నున్నతస్థానమును గడించుకొన్నది. ఇట్టి సంప్రదాయముల నెన్నింటినో వివరించుట శ్రీరామకథాఽమృత కవుల ప్రత్యేకత. అట్టి విశిష్టత కావ్య గౌరవము నినుమడింపఁజేయు చున్నది.

పట్టాభిషేకోత్సవానంతరము రాముఁడు వానరవీరుల వీడ్కొల్పుచు నంగ దుని సుగ్రీవున కప్పగించి, వీనిఁబ్రీతితోఁ గాపాడుమని చెప్పినట్లు వాల్మీకమునఁ గలదు.

అంగదం చ మహాబాహో ప్రీత్యా పరమయా యుతః
పశ్య త్వం .... — (ఉ. కాం., 40 స., 3 శ్లో.)

శ్రీరామకథాఽమృతమున నంగదు నప్పగించిన విధము పరమ రమణీయ ముగఁ దీర్చిదిద్దుట మూలాధికము.

మెత్తన మేను చిత్తమును మేలిమిఁ గన్నది వృత్త ముత్తమం
బిత్తఱిఁగాదు వీనివిధ మెల్ల నెఱింగితి నాఁటఁగోలె శూ
రోత్తముఁ డీతఁ డీపుడమి నొక్కఁడ తాల్పఁగ నోపు నీకు నా
యత్తు నొనర్చినాఁడ నెటు లారసెదో ? పులిపిల్ల నీసుతున్

కాయము నొసంగినాడు నీకై రణముల
నీకుఁగీరితిఁదెచ్చినాఁడీ కుమారుఁ
డకుటిలుఁడు నిన్నె తండ్రిగా నాత్మఁదలఁచె
నాదు ప్రాణమ్ము లితఁడను నయ మెనయుము

— పూ. భా., 10 ఆ., 151–2 ప॥లు

"లోకనయం బెంచి వచించుచుంటిని జూమీ" అని రాముఁ డనినట్లు వర్ణింపుట కవి లోకజ్ఞతను వెల్లడించుచున్నది. మఱియు నిం దంగదుని పాత్రవిశిష్టత చక్కఁగాఁ జిత్రింపఁబడుట మనోహరము.

రామునిచే విసృష్టులై యిండ్లకేగు కపుల నిర్వేదమును గూర్చి —

వియోగజాశ్రు ప్రతిపూర్ణలోచనాః

ప్రతిప్రయాతా స్తు యథానివాసినః — (ఉ. కాం., 40 స., 30 శ్లో.)

అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథాఽమృతమున నా వానరవీరుల వియోగ వ్యథ 28 పద్యములలోఁ గరుణరసము చిప్పిల హృద్యముగా వర్ణించుట మూలాధికము.[1] రాముని కంటె నన్య మెయ్యదియు సహింపఁజాలని కపుల భావము వివరించుచు—

ఏటికిఁ బట్టణంబులు మహీస్థలు లేటికిఁ గాననంబు లిం
కేటికిఁ దేనెలున్ ఫలము లేటికిఁ గందము లేటి కిట్టి మా
కేటికి నిండ్లు వాకిళులు నేటికిఁ బెండ్లము లెల్లబాంధవుల్
నాఁటికి నొక్కసారి యయినన్ రఘురాముని జూడకుండినన్

— 10వ ఆ., 204 ప.

అని, మఱియు రామభావనా భావితాంతఃకరణు లయి మునులకులేని యేకాంత భక్తి గలుగఁ గపుల గట్టివల్లైన రాముని దర్శించి యానందబాష్పములు, నాతఁడు కనుమఱుగైనట్లైన విరహాశ్రువులు దోఁగఁ గన్నుల తడియారని కపుల స్థితి వర్ణించుట మనోజ్ఞము. [10 ఆ., 231 ప.]

ఇంతటి భక్తిభావబంధురు లగుటచేతనే ప్రాణములు రామార్పణము గావించి రావణు నంతటివాని నెదరించి పోరిరి. గడ్డిపోచ గాండీవముగఁ జిత్రింపఁగల నుత్తమ సాహితీప్రతిభు లగు శ్రీరామకథాఽమృత కవుల చేతిలోఁ గపులు యోగిపుంగవులుగా నగుట విచిత్రము కాదు. భగవద్వియోగదుస్సహత్వ లక్షణమగు భక్తితత్వమిట బహుథాప్రపంచింత మగుట హృద్యము. [చూ. పాత్రచిత్రణము]

---

1] శ్రీ. రా. క. ఉ.కాం., పూ. భా., 10వ ఆ., 204–31 ప॥లు

సీతారాములు పుష్పఫలభరితమై ప్రకృతిసుందరమగు నశోకవనమున బ్రవేశించి, వివిధములగు ప్రదేశములను సందర్శించి, యొకచో సుఖాసీనులై యుండ విశారదులగు వారు నృత్యగీతవాద్యములతో రాజదంపతుల సంతోషింపఁజేసినట్లు వాల్మీకమున 22 శ్లోకములలో వర్ణింపఁబడినవి.[1] శ్రీరామకథాఽమృతమున నీ ఘట్టము 120 పద్యములలో నతి విపులముగ వర్ణింపఁబడుట మూలాధికము.[2] అనువాదమున వన విశేషములు దెలుపుచు మార్గదర్శకములై శుకదంపతులు సీతారాములతో ముచ్చటించుట యను కల్పన మౌచిత్యమును వెలార్చుచున్నది. శుకము రామునితోఁ జెప్పినట్లు ఇట్లు వర్ణింపఁబడినది—

ఓ మహారాజ! చూచితే యుల్లసరణి
దేవదారుద్రుమావళి దివ్యమరయఁ
జుట్టుకొనివచ్చె నీతోట సురుచిరముగ
నిందు విశ్రమ మెనయక యేఁగరాదు

దాని కవ్వలఁజూడు చందన వనంబు
నందన వనంబు నందంబు నందుకొనుచు
సాహసంబున నాత్రోవఁ జరణ మిడెదొ ?
త్రాచులేచిన వందు సీతా కలత్ర!

— ఉ. భా., 1 ఆ., 21, 22 ప.

ఈ ఘట్టమున నుద్యాన వన వర్ణనముతోఁబాటుగా శారీరక మీమాంసాశాస్త్ర విషయము లర్థాంతరవృత్తి స్ఫురించునట్లు వర్ణించుట కవి ప్రతిభకు నిదర్శనము. అవి యెఱుక గల వారి మెదడుకు మేత కాఁగా నితరుల కెడఁద రసానంద మనుభవమునకు దెచ్చు చున్నవి. శుకాంగన సీతతో నిట్లనుచున్నది-

పుష్పశబలమ్ము లంచిత భూరుహములు
తీరజమ్ములు ప్రతిబింబ చారు తమము

---

1] వా. రా.-ఉ. కాం., 42 స., 1-22 శ్లో॥లు
2] శ్రీ. రా. క.-ఉ. కాం., ఉ. భా., 1 ఆ., 5-124 ప॥లు

లెందు వేష్టింప లోవెలి నింపు లొలుకు
కలిమి వీక్షింపు మాకర్ణ కలితనయన!
— ఉ. భా., 1 ఆ., 97 ప.

ఇందు ప్రకృతివర్ణనతోఁబాటు యోగమార్గమున దర్శింపనగు సహస్రార కమలాదు లతిమనోహరముగా నభివర్ణింపఁబడినవి. మఱియు రాజదంపతుల నెదుట సుందరాంగనల నృత్య గీత ప్రదర్శన గావింపఁ బడినదని యిట్లు వర్ణించిరి-

అత్తఱి నృత్తగీతముల నందెల నందిన యట్టి వార ల
త్యుత్తమ యావనసంపదల నూర్జిత లాసవపాన మానితల్
పుత్తడిబొమ్మలే యనఁగఁ బొల్చెడు బాలలు లీలలొప్ప రా
జోత్తము మ్రోల నాడిరి జయోపహిత ప్రవర ప్రబంధముల్
— ఉ. భా., 1 ఆ., 117 ప.

ఇట రాముని విజయమును జాటు ప్రబంధము లనఁగా రామాయణ కథా ఘట్టములని భావింపవచ్చును. రాముని సత్య పరాక్రమ సౌశీల్యాదులను బ్రకటించు సన్నివేశములఁ బెక్కింటిని పలువురు కవులు బహుప్రక్రియలలోఁ గీర్తించుట ప్రసిద్ధము. రాముని మ్రోల వారు రావణసంహారాది కథలు చక్కఁగా నాడి పాడిరి. తాటకవధ, యాగసంరక్షణము, శివధనుర్భంగము, పరశురామ గర్వాపహరణము మొదలగు ఘట్టములు నిందు గ్రహింపఁదగియున్నవి.

"సీతారాము లిరువురు గలసి సుఖముగా విహరించుచుండ భోగద మగు శిశిరఋతువు గడచినది. క్రమముగా నన్నిఋతువులు సీతారాముల సేవించినవి. ఇంతలోఁ బదివేల సంవత్సరములు గడచినవి. తిరిగి శిశిరర్తువు సంప్రాప్తించిన" దని వాల్మీకమున గలదు.

తథా తయో ర్విరహతో స్సీతా రాఘవయో శ్చిరమ్ ।
అత్యక్రామ చ్ఛుభః కాల శ్శిశిరో భోగద స్సదా ॥
దశవర్ష సహస్రాణి గతాని సుమహాత్మనోః ।
ప్రాప్తయో ర్వివిధాన్ భోగా నతీత శ్శిశిరాగమః ॥
— ఉ. కాం.-42 స., 25, 26 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమునం దీసందర్భమున ఋతువర్ణనము విపులముగా 46 పద్యములలో నిర్వహింపఁ బడినది.[1] ఇట్టి సుదీర్ఘ వర్ణనము పదివేల సంవత్సరములు గడచిన వనుటను సూచించుచున్నది. ఇందు ఋతువు లారు స్వభావోక్తి సుందరముగా వర్ణింపఁబడినవి.

ఇట్లు శ్రీరామకథాఽమృతమున వాల్మీకి రామాయణములోని ఘట్టములను మూలాధికముగా వర్ణించిన సందర్భములు స్థాలీపులాకన్యాయమున బరిశీలింపఁ బడినవి.

## మూలకుంచనము :

మూలకుంచన మనఁగా మూలమున విపులముగా నున్న విషయమును సంగ్రహపఱిచి చెప్పుట. సామాన్యముగా ననువాదకులు ఔచిత్యపోషణమునకో, తామాశించిన పరమార్థ నిరూపణమునకో ఒక్కొక్క యెడ మూలకుంచనము గావింతురు.

మునిభావరహస్య వివరణంబొప్పఁ జెప్పఁబూనిన శ్రీరామకథాఽమృత కావ్య రచనమున మూలకుంచనమున కవకాశము తక్కువ. బాలకాండము మొదట "మైథిలీపరిణయమ"ను పేర బ్రత్యేక స్వతంత్ర ప్రబంధముగా రూపొందింపఁ దలఁచిన కథాభాగ మగుట నందు మూలకుంచనమునకుఁ బ్రసక్తి లేదు. రమణీయ మగు వర్ణనలతో బహుశాస్త్ర సంప్రదాయ రహస్య వివరణములతో సర్వాంగసుందరముగా సిద్ధముఁ జేయబడిన యీ గ్రంథభాగమున మూలప్రపంచనమునకే ప్రాధాన్యము సిద్ధించినది.

అయోధ్యాకాండమున భరతుఁడు సపరివారుఁడై చిత్రకూటమున కేతెంచి రాము నయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁడవు కమ్మని యర్థించినాఁడు. ఆ సందర్భమున వశిష్ఠుఁడు శ్రీరామునకు నిక్ష్వాకువంశ క్రమము విపులముగా వర్ణించి "మనువు నుండి దశరథుని వఱకుఁ గల రాజులలో జ్యేష్ఠుఁడే రాజ్య మొనర్చెను. కనిష్ఠుఁ డెన్నడునుఁ జేయలేద"ని చెప్పినట్లు వాల్మీకమున 34 శ్లోకములలోఁ గలదు.[2] శ్రీరామకథాఽమృతమున నీవిషయమిట్లు సంగ్రహముగాఁ జెప్పఁబడినది.

---

1] శ్రీ. రా. క.-ఉ. కాం.-ఉ. భా., 1 ఆ., 174—219 ప॥లు

1] వా. రా.-అయో. కాం., 110 స., 3—36 శ్లో॥లు

అల మను ప్రజేశుఁడాదిగా దశరథ
ప్రభుని వఱకు నగు పరంపరాప్తి
జ్యేష్ఠుఁడేలె నే కనిష్ఠుండు నేలఁడు
ధర్మ మర్మమిట్లు దనరు చుండె
— అయో. కాం., 9 ఆ., 2?3 ప.

బాలకాండమున రామాదుల వివాహసందర్భమున నిక్ష్వాకువంశ ప్రశంస విపులముగాఁ గావింపఁబడినది. మఱల నిట వర్ణించుట పునరుక్తికి నెలవగునేమో యని సంభావించుట మూలకుంచనమునకుఁ గారణముగా నూహింపవచ్చును.

అరణ్యకాండమున లక్ష్మణుఁడు మాయామృగమును గూర్చి రాక్షస మాయగా నభివర్ణించినాడు. అది విని రాముఁ డట్లయినచోఁ దపోధనుల రాక్షసబాధ లేకుండు నట్లు చేయవలెగదా! పూర్వ మగస్త్యుఁడు వాతాపిని జంపి వనము నిష్కంటక మొన రించిన విధమున నేనును రాక్షస సంహార మొనరించెద నని చెప్పెను. ఈ సందర్భ మున నగస్త్యుఁడు వాతాపిని జంపిన విధము మూలమున 9 శ్లోకములలో విపులముగా వర్ణింపఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యది—

ఈతఁడి పీనిం జంపెద
వాతాపి నగస్త్యమౌనివలె వారకెటున్
సీతం గాపాడుచు నీ
వీతలమున నుండు మనకు మెద్దియు నింకన్
— అర. కాం.-3 ఆ., 35 ప.

అని రాముఁ డనినట్లు సంగ్రహముగాఁ జెప్పఁబడినది. అగస్త్యాశ్రమము నకుఁ బోవునప్పుడు సుతీక్ష్ణముని రామాదుల కగస్త్యచరిత్రఁ జెప్పుచు నాతఁడు "వాతా పీల్వలులనుఁ బొడ వడగించిన విధము వివరించుట అయోధ్యాకాండమున విపులముగా వర్ణింపఁబడినది. మఱల నిటఁ బునరుక్తమగునేమో యని "పీనిం జంపెద వాతాపి నగస్త్యమౌని వలె" నని రాముఁ డనినట్లు వర్ణించుట మూలకుంచనము.

1] వా. రా.-అర. కాం., 43 స., 37–45 శ్లో॥లు

సీతాపహరణార్థమై రావణుడు మారీచునిఁ దోడ్పడుమని యర్థింపఁబోయిన సందర్భమున మారీచుఁడు రావణునితో "నీ యకృత్యము మానుమ"ని చెప్పుచు రాముని బలపరాక్రమ వైభవము, రాముని వలనఁ దనకుఁ గలిగిన యనుభవము వివరించి రామునితో వైరము వలదని చెప్పుట వాల్మీకమున 58 శ్లోకములలో విపులముగా వర్ణింపఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నా ఘట్టము సంగ్రహముగా 26 పద్యములలో ననువదింపఁబడినది.[2]

పంపాసరోవర ప్రాంత ప్రకృతి సౌందర్య వర్ణనము మూలమున విపులముగా 20 శ్లోకములలో వర్ణింపఁ బడినది.[3] శ్రీరామకథాఽమృతమున నా ఘట్టము మిక్కిలి సంగ్రహముగా 4 పద్యములలో వర్ణింపఁబడినది.[4] విరహియగు రాముని కట్టియెడ దీర్ఘ వర్ణనము బాధాహేతు వగునేమోయని మూలకుంచనము గావింపఁబడి యుండనోపును.

హనుమంతుఁడు రామలక్ష్మణుల చరిత్ర విని సుగ్రీవుని సఖ్యమునకై వారల ఋశ్యమూకమునకుఁ గొంపోయెను. వారట నుండ నంత హనుమంతుఁడు మలయ గిరికిఁ జేరి నూతనాగతులగువారిఁ జూచి భయపడి యందున్న సుగ్రీవునకు రామలక్ష్మణులఁ గూర్చి చెప్పి యాతని ఋశ్యమూకమునకుఁ దోడ్తెచ్చెను. ఈ సందర్భమున సుగ్రీవునకు దాశరథుల చరిత్రఁ జెప్పుట మూలమున 7 శ్లోకములలో వర్ణింపఁబడినది.[5] శ్రీరామకథాఽమృతమున నయ్యది "సందర్శించి యెల్ల వృత్తాంతం బెఱింగించి యాతనిం దోడుకొని వచ్చి రఘువీరుల సన్నిధానంబు వడయం జేసిన" అని సంగ్రహముగాఁ జెప్పబడినది. [కి. కాం.-1 ఆ., 103 ప.] ముందుగా లక్ష్మణునిచే హనుమంతునకు రాఘవుల చరిత్ర వివరింపఁ బడినది. ఇట మఱల నది యనువదింపఁ బడక "యెల్లవృత్తాంతం బెఱింగించి" యను నొక్క ముక్కతోఁ బ్రస్తుత కథ పునరుక్తి దోషములేకుండ ముందునకు సాగిపోయినది.

---

1] వా. రా.-అర. కాం., 38, 39 స॥లు, 33+25—58 శ్లో॥లు

2] శ్రీ. రా. క.-అర. కాం., 2 ఆ., 400—26 ప॥లు

3] వా. రా.-అర. కాం., 75 స., 11—30 శ్లో॥లు

4] శ్రీ. రా. క.-అర. కాం., 4 ఆ., 346—49 ప॥లు

5] వా. రా.-కి. కాం., 5 స., 1—7 శ్లో॥లు

సుగ్రీవుఁడు పట్టాభిషిక్తుఁడై కిష్కింధ నున్న సందర్భమున వర్షర్తువు గడచి శరదృతువు సంప్రాప్తించినది. అట్టి శరదృతు వర్ణనము మూలమున 62 శ్లోకములలో నతి మనోహరముగా సాగినది.[1] శ్రీరామకథాఽమృతమున నది సంగ్రహముగా 10 పద్యములలోఁ జెప్పఁబడినది.[2]

సుగ్రీవుఁడు సీతాన్వేషణమునకు వెడలు వానర వీరులకు నల్దిక్కులఁ గల విశేషములను వివరించినాఁడు. అంతయు విని శ్రీరాముఁ డాతనితోఁ నీవీ దిశా విశేషము లెట్లెఱింగితి వని ప్రశ్నించినాఁడు. సుగ్రీవుఁ డందులకు సమాధానముగా వాలి దుందుభుల యుద్ధము, వాలి వైరముఁబూని సుగ్రీవుని దిగంతముల వఱకుఁ దఱుముట మొదలగునవి చెప్పినట్లు మూలమున 18 శ్లోకములలో గలవు.[3] శ్రీరామకథాఽమృతమున నది సంగ్రహముగా ననువదింపఁబడినది. [కి. కాం.-3 ఆ., 18—19 ప॥లు] ఇంతకు బూర్వమే రాముఁ డడగు సుగ్రీవుఁడు వాలి విరోధకారణము విపులముగా దెలిపియున్నాఁడు. మఱి రెండవసారి చెప్పనవసరములేదు. కావున "అన్న! నాటి వైరమున నన్ను తఱుమంగ వలనుదప్పి" తిరిగితి నని సంగ్రహముగా నా ఘట్టమిట స్మరింపఁబడినది. వివరించుట పునరుక్త మగును.

జాంబవంతుఁడు సముద్రలంఘనమునకై హనుమంతునిఁ బ్రోత్సహించుచు హనుమ దుత్పత్తిక్రమము, జననమాదిగ నాతఁడొనరించిన యద్భుతావహములగు సాహసకృత్యములఁ గీర్తించుట వాల్మీకమున 30 శ్లోకములలో వర్ణింపఁ బడినది.[3] శ్రీరామకథాఽమృతమున నా ఘట్టము 10 పద్యములలో నతి సంగ్రహముగా ననువదింపఁబడినది.[4] హనుమచ్చరిత్ర యుత్తరకాండమున మిక్కిలి విపులముగ వర్ణింపఁ బడినది. కావున కథావేగమున కంతరాయము లేకుండుట కిందు సంగ్రహముగాఁ జెప్పఁబడినదనవచ్చును.

---

1] వా. రా. కి. కాం., 30 స., 1—62 శ్లో॥లు

2] శ్రీ. రా. క.-కి. కాం., 2 ఆ., 96—103 ప॥లు

3] వా. రా.-కి. కాం., 46 స., 3—20 శ్లో॥లు

4] వా. రా.-కి. కాం., 66 స., 8—37 శ్లో॥లు

5] శ్రీ. రా. క.-కి. కాం., 3 ఆ., 285—94 ప॥లు

హనుమంతుఁడు రావణాంతఃపురముఁ బ్రవేశించి రతి వివశలై రావణుని చుట్టును వివిధ భంగిమములలో నిద్రించుచున్న యంతఃపురస్త్రీల గాంచినట్లు మూలమున 20 శ్లోకములలో శృంగారైక భావనమున విపులముగా వర్ణింపఁబడినది.[1]

శ్రీరామకథాఽమృతము సంక్షిప్తము—

పాదమూలమ్మునఁబడియుండి రెందఱు
ప్రార్థనాయోజన పరిఢవిల్ల
హస్తాగ్రగతలయి యలరువీరలఁదెచ్చె
భుజశక్తి స్ఫురణంబె బోధసేసి
తలమానికమ్ము లుత్తలమున నున్నారు
తవిలున మెచ్చులు దవిలి కొంద
ఱిటు కెలఁకుల వార లలఁతులే యివ్వాని
మోహనలీలకై మొనసినారు

బళిర యిటులుండవలె మహాప్రాభవంబు
హీన పరమార్థ సంపద యెట్టులౌనొ
పో తృతీయంబు పురుషార్థ మీతనిదియ
వీని సరివత్తురే లోకవిభులు సిరుల

—సుం. కాం.–1 ఆ., 285 ప.

అని మూలకుంచనముగా ననువదింపఁ బడెనది. వారట్లు నిద్రించుటలో గల భావము హనుమని ముఖమునఁ జెప్పించుట పరమ రమణీయము. అంతకంటె నధిక ముగ నాతఁడు వివరించుట తగదు. ఇట్టి వర్ణన పాత్రోచితమై కవి సంయమనమును బ్రకటించు చున్నది. ధర్మార్థకామమోక్షములలో నా తృతీయ పురుషార్థమగు కామ మీతని సొత్తుగా సంభావించుటతో రావణుని పాత్రచిత్రణమున నౌచిత్యము పరసీమ ముట్టినది. తుదకా పురుషార్థ మాతఁడధర్మముగ ననుభవింపఁజూచుటచే నది యాతని వినాశహేతువై నది. కావున నిం"దతిసర్వత్ర వర్జయే త్త"నుట యెఱుంగఁదగిన సత్యము.

హనుమంతుఁడు లంకాపురము, రావణాంతఃపురము నెల్లెడఁ బరిశోధించి సీతం గానక విషణ్ణచిత్తుఁడై విచారించుచు సీత వార్తఁ దెలియనినాడు క్రమముగ రాఘవ

1] వా. రా.–సుం. కాం., 10 స., 30–49 శ్లో॥లు

వంశము, వానరవంశము సమూలముగా నశించుననియుఁ దలపోసి యందులకుఁ దాను గారణము కారాదనియు నిశ్చయించుకొని యిష్టదైవముల ధ్యానించి యశోకవనముఁ బ్రవేశించె” నని వాల్మీకమున విపులముగా 69 శ్లోకములలో వర్ణింపఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నీఘట్టము 22 పద్యములలో సంగ్రహముగా వర్ణింపఁబడినది.[2]

అశోకవనమున సీతను గాంచి సీతారాముల యనురూప శీలసంపదల కచ్చెరువడుచు “రాముని భార్య సీతయు దుఃఖార్తయైన దనిన కాలము దురతిక్రమమైనది కదా! యని హనుమ బాష్పపర్యాకులేక్షణుఁడై విలపించెను. తుల్యశీల వయో వృత్తముల చేతను, దుల్యాభిజన లక్షణములచేతను సీత రామున కన్నివిధములఁ దగియున్నది. ఇట్టి యీమెకై కదా రాముఁ డింతలు సేసెనని పూర్వవృత్తము లన్నింటినిఁ దలపోయుట వాల్మీకమున 32 శ్లోకములలో వర్ణింపఁబడినది.[3] శ్రీరామకథాఽమృతమున నవి అతి సంగ్రహముగ 7 పద్యములలో ననువదింపఁ బడినవి. ఈ సీతకై రాముఁ డింతలు సేసెనాఁడని భావించుచు నాతఁడు పలికినట్లు వాల్మీకమున నున్నదానికి శ్రీరామ కథాఽమృతమున నిట్లు సంగ్రహముగా ననువాదము సాగినది-

ఆఁక పడురక్కసుల ద్రుంచె నా కబంధుఁ
గెడపె వాలి దవ జ్వాలి గీటడంచెఁ
గీశ బలములఁగూర్చె సుగ్రీవుఁబట్ట
భద్రు నొనరించి శ్రీరామభద్రుఁ డలరి

సుం. కాం.-I ఆ., 405 ప.

రాముఁడు ఖరదూషణాది 14 వేల రాక్షసుల సంహరించుట మొదలగునవి [16 స., 7-12 శ్లో॥లు] మూలమున వివరముగ వర్ణింపఁబడగా ననువాదమున “ఆఁక పడురక్కసుల ద్రుంచె” నని సంగ్రహముగా జెప్పఁబడినది.

యుద్ధకాండమున నఖిలలోక భయంకరమైన యుద్ధము జరుగనున్నదని తెలుపు నిమిత్తములు గనవచ్చుచున్నవి. లక్ష్మణా! యుద్ధసన్నద్ధులము గావలయు నని

1] వా. రా.-సుం. కాం., 13 స., 1-69 శ్లో॥లు
2] శ్రీ. రా. క.-సుం. కాం., 1 ఆ., 318-339 ప॥లు
3] వా. రా.-సుం. కాం., 16 స., 1-32 శ్లో॥లు

చెప్పుచు రాముఁడు "పరుషవాయువులు వీచుట, భూమి కంపించుట పర్వతశిఖరములు చలించున్నట్లగపడుట చెట్లు కూలుట" మున్నగు పెక్కు నిమిత్తముల వర్ణించుట మూలమున విపులముగా 9 శ్లోకములలో సాగినది.[1]

శ్రీరామకథాఽమృతమున నీ విషయముఁ "క్రూరములగు నిమిత్తములు పెక్కు-సరణుల గనుపట్టునని తెల్పితిని గదా! అవి నేఁడు నెట్టన ననుబద్ధములై కన్పట్టుచున్నవి. చూచితే లక్ష్మణా!" యని రాముఁ డనినట్లు సంగ్రహముగాఁ జెప్పఁబడినది. (యు. కాం.-పూ. భా., 5 అ., 121 ప.)

ఇల్లేవిధముగా శ్రీరామకథాఽమృతమున వాల్మీకి రామాయణానువాదము నందలి "మూలకుంచనము" నెడనెడఁ బరిశీలింపఁబడినది.

## మూలత్యాగము :

ఆంధ్రీకరణమున మూలము ననువదింపక విడిచిన ఘట్టము లిందుదాహరింపఁ బడినవి. శ్రీరామకథాఽమృతమున నిట్టి ఘట్టములు మిక్కిలి యరుదు. ఎల్లి యెడలఁ బెంపుదలయేఁ గన్పట్టును.

అయోధ్యాకాండమున రాముఁ డరణ్యములకుఁ బోవుచుఁ దన తల్లిఁ గౌసల్య ననుమతి వేడు సందర్భమున "పూర్వము యయాతి స్వర్గము నుండి భ్రష్టుఁడై తిరిగి స్వర్గమును జేరినట్లు నేను బదునాలుగేండ్లు వానవాస మొనరించి తీర్ణప్రతిజ్ఞుఁడనై తిరిగి యయోధ్యకు రాఁగలన"ని చెప్పినట్లు వాల్మీకమునఁ గలదు.

తీర్ణప్రతిజ్ఞశ్చ వనాత్ పునరేష్యామ్యహం పురీం
యయాతి రివ రాజర్షిః పురా హిత్వా పునర్దివమ్
- 21 స, 46 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నది యనువదింపఁబడలేదు. యయాతి స్వర్గభ్రష్టుఁడై తిరిగి స్వర్గమును జేరినట్లు భారతమునఁ బ్రసిద్ధము. రాముఁడు పితృవాక్య పరిపాలనమునకై యడవికి వెడలుచున్నాఁడే కాని రాముని యందే దోషములేదు. అది యాతనికి శిక్ష కాదు. ఇట నుపమానముఁ జెప్పుటలో పాత్రోత్కర్షలేమి యనువాదకు లకు సమ్మతము కాకపోవచ్చును.

---

1] వా. రా.-యు. కాం., 41 స., 12–20 శ్లో॥లు

అరణ్యకాండమున రామాదులు మునుల వీడ్కొని నానావిధములగు మృగ గణములతో నిండియున్నదియు, శార్దూల వృకసేవితమును, ధ్వస్త వృక్ష లతా గుల్మములును, దుర్దర్శమగు సలిలాశయమును, నానావిధ పక్షిసమూహములును, ఈలపురుగుల రొదలును గల యరణ్యమధ్యమును జూచిరని వాల్మీకమునఁ గలదు. (అర. కాం. 2 స., 2, 3 శ్లో॥లు) శ్రీరామకథాఽమృతమున నీవర్ణనము విడువఁబడినది. అధ్యాత్మ రామాయణ మిట ననుసరింపఁబడినది.

విరాధుఁడు సీత నెత్తుకొనిపోవుటఁ జూచి రాముఁడు లక్ష్మణు నుద్దేశించి "జనకరాజపుత్రియు, నా కత్యంత సుఖసమృద్ధి గూర్చు భార్యయు, శుభాచార సంపన్నయు నగు సీత విరాధు నంకమునఁ జేర్చఁబడినది. కైక కోరిక యీనాటికి సంపూర్ణ సిద్ధి నందినది. స్వరాజ్యహరణము కంటెను, పితృవియోగము కంటెను సీతకుఁ గలిగిన పరస్పర్శ వలన నాకు మిక్కిలి దుఃఖము సంభవించినది" అనుచు బాష్పశోక పరిప్లుతుఁడైనట్లు 7 శ్లోకములలో వర్ణించుట వాల్మీకమునఁగలదు.[1] శ్రీరామకథాఽమృతమున నీఘట్టమనువదింపక విడువఁబడినది.

రాముఁడగస్త్యుని దర్శింపఁబోవుచున్నా నని చెప్పగా సుతీక్ష్ణుఁ డాతనికి మున్యాశ్రమ మార్గము నుపదేశించుట వాల్మీకమున 7 శ్లోకములలో విపులముగా వర్ణింపఁబడినది.[2] శ్రీరామకథాఽమృతమున నది యనువదింపక విడువఁబడినది. రామాదులతో సుతీక్ష్ణుఁ డనుసరించినట్లు అధ్యాత్మరామాయణమునఁ గలదు. అట్టియెడ మార్గ ముపదేశింప నవసరములేదు. శ్రీరామకథాఽమృతమున నావిధ మనుసరింపఁబడినది.

కిష్కింధాకాండమున వాలి వధకు శోకించుచున్న తారను హనుమంతుఁ డోదార్చుట, వాలి కర్తవ్యనిర్ణయము చేయుట, సుగ్రీవునకు సందేశ మిచ్చుట, మఱియు తార విలపించుచు రాముని నిందించుట, సుగ్రీవ విలాపము, రామలక్ష్మణులు తారాంగద సుగ్రీవులను ప్రబోధించుట మొదలగునవి శ్రీరామకథాఽమృతమున ననువదింపక విడువఁబడినవి.[3] ఇప్పట్టున నధ్యాత్మరామాయణ మనువదింపఁ బడినది. వాల్మీకము నందలి యీ ఘట్టమునకు వివరణముగా నధ్యాత్మరామాయణానుసారము

---

1] వా రా.-అర. కాం., 2 స., 16-22 శ్లో॥లు
2] పైది 11 స., 36-43 ,,
3] వా. రా.-కి. కాం., 21-25 స.

శ్రీరామకథామృతమున "రాముఁడు తారకు జ్ఞానోపదేశము సేయుట, తార సందియములకు శ్రీరాముఁడు సమాధానముగాఁ దత్త్వము బోధించుట మొదలగునవి వర్ణింపఁబడినవి.

సుగ్రీవునకు రామాజ్ఞఁ దెలుపఁ గ్రుద్ధుఁడై వచ్చిన లక్ష్మణుని గాంచి వానరవీరులు తమ విభునిఁ బ్రబోధింప ప్రాకార పరిఘలు దాటి యత్నించిరనియు, లక్ష్మణుఁడయ్యెడ కోప సంరక్తలోచనుఁడై దీర్ఘోష్ణములైన మహోచ్ఛ్వాసలతో సధూమపావకుని వలెను, కుపిత పన్నగము వలెను వరలుచున్నాఁడని 10 శ్లోకములలో వర్ణింపఁబడుట వాల్మీకమున గలదు.[1] శ్రీరామకథామృతమున నియ్యది యనువదింపక విడువఁబడినది. మఱియు లక్ష్మణుఁడయ్యెడ కిష్కింధాపురద్వారదేశమును దాటి సుగ్రీవుని గృహమునకుఁ బోవుచు మధ్యదేశమున నెన్నియో ధనధాన్యములతోను, స్త్రీ రత్నములతోను సుశోభిత మగు కపివీరుల గృహారామములు, గిరి నదీ విశేషములను బొడగాంచినట్లు వాల్మీకమున 6 శ్లోకములలో వర్ణింపఁబడినది.[2] శ్రీరామకథామృతమున "భర్తృశాసనోద్యుక్తచిత్తవర్తనత్వరమాణుఁడై"న లక్ష్మణుఁడు వాని నుపేక్షించెనో యన్నట్లు పూర్తిగా ననువదింపక వాని వర్ణనము త్యజింపఁబడినది.

హనుమంతుఁడు రాక్షసీమధ్యమున నున్న సీతను బొడఁగాంచెను. ఇట్టియెడ వికృత ఘోరదర్శనులగు రాక్షసస్త్రీల వర్ణన వాల్మీకమున 15 శ్లోకములలో గలదు.[3] మూలమున నిట్టి వర్ణన సీత దైన్యస్థితిఁ బ్రకటించునదై యున్నది. ప్రాతోత్కర్ష గూర్చు నీవర్ణన మేలనో యనువాదమున విడువఁబడినది. వేవురు చెట్టరక్కసులు వేడబము ల్పచరింప" (1 ఆ., 398 ప.) నామె వెతఁ బొల్పడినట్లు సూచింపఁ బడినది. ఇట్టి కథాభాగము విడుచుటలోఁగల యౌచిత్య మెఱుకపడదు.

ఇట్లీవిధముగా శ్రీమద్రామాయణానువాద పరిశీలనమున "మూలత్యాగము" నకు సంబంధించిన ఘట్టములు శ్రీరామకథామృతమున గోచరించుచున్నవి.

---

1] వా. రా.-కి. కాం., 31 స., 22–31 శ్లో॥లు

2] పైది , 33 స., 7–12 ,,

3] వా.రా.-సుం., కాం., 17 స., 4–18 ,,

## అన్యథాకరణము :

యత్స్యా దనుచితం వస్తు నాయకస్య రసస్యవా
విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథావా ప్రకల్పయేత్
— సాహిత్యదర్పణం

ఏదేని ప్రత్యేకమగు ప్రయోజనాపేక్షచేఁ గాని యౌచిత్య, పోషణ పాత్రచిత్రణముల నుద్దేశించిగాని కథా, నాయక, రస విషయము లందుఁ గావించిన మార్పునే యన్యథాకరణ మని చెప్పవచ్చును. సామాన్యముగా రామాయణ భారత భాగవతాది పురాణేతి వృత్తములు కథాంశములుగా స్వీకరించి రచింపఁబడిన యనేక సంస్కృతాంధ్ర కావ్యనాటకము లందిట్టి యన్యథాకరణము గోచరించుచునే యున్నది. సంస్కృతమున రఘువంశ కుమారసంభవ మాఘ నైషధాదులు, శాకుంతల ప్రతిమానన్థరాఘవాదు లుదాహరింపఁ దగియున్నవి. తెనుఁగున మను వసుచరిత్రాది ప్రబంధము లందు నీ లక్షణము గోచరించును. శ్రీరామకథాఽమృతమున నట్టి యన్యథాకరణమున కవకాశము తక్కువ. "ఉభయ రామాయణ ధోరణుల నుట్టంకించినను ఈ గ్రంథము కథావ్యత్యాసాదులకు తావీయక సుపరిష్కృతమై ఏక ముఖంబునంబారు గంగా యమునా ప్రవాహములంబోలి పావనమై వెలారు చున్నది" అని శ్రీ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగా రభిప్రాయ పడుట యుక్తి యుక్తము. ఐనను మూలమున నొకవిధముగా వర్ణింపఁబడి యను వాదమున మఱొక్క విధముగా సంతరించిన విషయము లేమైన కొన్నియున్నచో వింద ప్రస్తావించుట ప్రస్తుతవ్యాసోద్దేశము.

బాలకాండమున సీతాస్వయంవరమునకు రావణుఁడు వచ్చి శివధనుస్సు నెక్కుడ యత్నించి విఫలుఁడై యవమానమున నేగినట్లు వర్ణించుట యన్యథాకరణము. వాల్మీకమునం దయోధ్యాకాండమున ననసూయఁ బ్రశ్నింప సీత తన స్వయంవర వృత్తాంతము వివరించినట్లు గలదు.1 శ్రీరామకథాఽమృతమున నా ఘట్టము బాల కాండమున శ్రీరాముని శివధనుర్భంగమునకు పూర్వమే వర్ణింపఁబడుట విశేషము.

వచ్చి తనలావు బీరమ్ముఁ బిచ్చలించి
గడిఁది సింగాణిఁ బొదవింపఁబోడరి బడలి
వింశతి భుజుండు వెరవేది వెలుకఁబాతె-(బా. కాం., 4 ఆ., ప.)

అని శివుఁడు పార్వతితోఁ జెప్పినాఁడు.

---

1] వా. రా.-అయో. కాం., 118 స., 24-54 శ్లో॥లు

అరణ్యకాండమున రక్షోవధ సమర్థన సందర్భమున రాముఁడు సీతతో నాడిన మాటఁ దప్పననియు, మునుల యోగక్షేమములకై రాక్షసులఁ జంపితీరుదు ననియుఁ జెప్పుచు నావిషయమున నవసరమైనచో నిన్ను లక్ష్మణుని, తుదకుఁ బ్రాణము లైనను త్యజింతునని పలికినట్లు వాల్మీకమునఁ గలదు. (10 స., 18-19 శ్లో.) అనువాదమున రామునిచే "మాన నిఁక మిన్నేనియుఁ బైనొఱిగిన"నని చెప్పించుట యన్యథాకరణము.

## స్వాతంత్రత:

ఆపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే ॥

అపారమగు కావ్యప్రపంచమున కవియే బ్రహ్మ. అతఁ డెట్లు సంకల్పించిన నీవిశ్వమట్లు పరివర్తన మందును. కవి కావ్యనిర్మాణ సందర్భమున ననల్ప కల్పనాశిల్పమును బాటించుట నైజము. అనువాదమైనను కవి ప్రత్యేకతను నిరూపించు ఘట్టము లందు గోచరించు టనుభవ సిద్ధము. కవి యభిరుచి ననుసరించి కావ్యము రూపుదిద్దికొనుట సహజమగుటంజేసి యాంధ్రవాఙ్మయమున రామకథా సాహిత్య మింత వైవిధ్యమును సంతరించుకొనినది. మూలమునలేని విషయము లనువాదమునఁ జేరినచో నవి యమూలకములు. లేక స్వతంత్రములు ననుట పరిపాటి.

సందర్భశుద్ధి గలిగి, రసపోషణమునకుఁ బాత్రచిత్రణమునకు నుపకరించుచు గథాపుష్టిఁ గూర్చు నమూలకములగు నెన్నియో విషయములు భాస్కర రామాయణాదులందు వలె శ్రీరామకథామృతమునను బొందుపరుపఁబడినవి. "అనుబంధి వర్ణనాంశముల స్వతంత్రించుచు నీ గ్రంథము" రచించుట వారి రచనా ప్రణాళికలో భాగమగుట విదితము. ఈ ప్రకరణమున నావిశేషములు ప్రస్తావింపఁబడును.

అర్థివేఁడెద విన్మహర్షిసత్తమ! కూర్చు
మీప్రశ్న యోగార్థ మెలమిదొనఁక
—బా. కాం., 1 ఆ., 2 ప.

అని వాల్మీకి నారదుని యర్థించినట్లు చెప్పుటలోఁ గేవల రామకథయేగాక యోగార్థ బంధురముగా నది వర్ణింప సంకల్పించిన శ్రీరామకథామృత కవుల

యుద్దేశము, రచనలోని ప్రత్యేకత వెల్లడియగుచున్నవి. ఇది వారి స్వతంత్ర భావ మునకు నిదర్శనము.

జనకుఁడు సీతాస్వయంవరము బ్రకటించినాఁడు. భూమిపైనున్న రాజు లెందఱెందఱో వచ్చినారు. లంకాధిపతి రావణుఁడు నచట చేరినాఁడు. కాని వారెవ్వరు శివధనుస్సుఁ గదిలింపఁజాలరైరి. వీర్యశుల్క యగు సీత హరి రాకకై విరహార్తితో నెదురుతెన్నులు చూచినది. హరి కానరాఁడు. కలతఁజెందిన సీత నామె చెలు లూరడించిరి. "నీ తండ్రి లక్ష్మివంటి నిన్ను మన్మథుని యబ్బవంటివాని కిచ్చి పెండ్లి సేయునని లోకమర్యాదానుగుణముగాఁ చెప్పినట్లు బాలకాండమున నిట్లు కల్పింపఁబడినది-

> ఇంతకుముందు పుట్టినతఁ డెలిక గావలె నిక్క మింతెగా
> కింతటఁబుట్టఁబోఁడుగదె యింతిరో! నీకు మగండు తాత దా
> నంత జడుండె? నీ విభవ మాఱడిపుచ్చునె లచ్చిఁబోని ని
> న్గంతుని యబ్బఁ గూర్పనగుఁ గాని యొరు న్ఘటియింపనెంచునే

తాత యనఁగా సంస్కృతమునఁ దండ్రియనియుఁ దెనుఁగునఁ బితామహుఁ డనియు నర్థములు గావున బ్రహ్మ "లక్ష్మివైన నిన్నుఁ గంతుని యబ్బ ననఁగా విష్ణుని గూర్చునని యనుట స్వభావోక్తి సుందరము. అమూలకమగు నిట్టి వర్ణన 36 పద్యములలో మనోహరముగా సాగినది.[1] గౌతమాశ్రమ వర్ణన సందర్భమున నారదముని సహాయమున గౌతముఁడు ప్రసవింపఁ బోవుచు ద్విధాముఖియైన గోప్రదక్షిణము జేసి భూప్రదక్షిణముఁ జేసిన ఫలము నంది యహల్యఁ జెట్టపట్టిన విధమిట్లు స్వతంత్రముగా శ్రీరామకథామృతమున వర్ణింపఁబడినది. బా. కాం.-7 ఆ., 16-18 ప॥లు.

రామలక్ష్మణులకు శతానందుఁడు విశ్వామిత్రచరిత్రఁ జెప్పెడు సందర్భమున ముందుగా నమూలకమగు విశ్వామిత్ర జన్మవృత్తాంతముఁ జెప్పుటలో స్వతంత్రత గాన నగును.[2] విశ్వామిత్రుని వంశక్రమము ఋచీకుడు పుత్రకామేష్టి యొనర్చి చరుద్వయముచేఁ దన భార్యకు నామె తల్లికి సంతానముఁ బ్రసాదింపఁజేయుట, తత్ఫలముగ విశ్వామిత్రుఁడు జన్మించుట యను మహాభారత మందలి వృత్తాంత మిచ్చటఁ జేర్చి చెప్పఁబడినది. కావుననే "ఇమ్మహనీయు చరిత్రం, బిమ్మగ నాయరసి నంత

---

1] శ్రీ. రా. క.-బా. కాం., 4 ఆ., 278-313 ప॥లు

2] పైది , 7 ఆ., 227-235 ప॥లు

లెఱిగించెద"[1] నని శతానందుని ముఖమున శ్రీరామకథాఽమృత కవి పల్కించినాఁడు. ఈ సందర్భముననే త్రిశంకుచరిత్రతోఁబాటుగా నమూలకమగు "హరిశ్చంద్ర చరిత్ర"యు 40 పద్యములలో మనోహరముగా వర్ణింపఁబడినది.[2] హరిశ్చంద్ర చరిత్రతో విశ్వామిత్రచరిత్రకుఁ గల సంబంధము ప్రసిద్ధము. అట్టిది వర్ణించినగాని విశ్వామిత్రచరిత్ర సమగ్రము కాదు. కావున నీ కథాభాగము మూలమునకుఁ బుష్టిని, పాఠకునకుఁ బరితుష్టిని గూర్చుచున్నది. ఇది యొక ప్రత్యేక లఘు ప్రబంధముగా నెన్నఁదగినంత సమగ్రసుందరముగనున్నది. సందర్భోచితమగు నీ కథావర్ణనము కవుల రచనా స్వాతంత్ర్యమునకు నిదర్శనము.

శివధనుర్భంగమునకు బూర్వమే సఖుల వలన విని, రాముఁ బ్రతికృతి కలనఁగాంచి హరి నవీనావతారమే యౌనని తలంచిన సీతాయోగవిప్రలంభ శృంగార వర్ణనము, ఆమె చెలులకు నిజాభిప్రాయంబుఁ దెలుపుట, చంద్రోపాలంభము, మన్మథోపాలంభము, మలయానిలోపాలంభము, ఉద్యానవన విహారము, శైత్యోపచారకల్పనము, సీత తన చెలికత్తెలతోఁ దన యవస్థల నుగ్గడించుట, మఱియు శ్రీరాముఁడు లక్ష్మణునితోఁ జంద్రుని గూర్చి ముచ్చటించుట, లక్ష్మణుండు రామునిఁ బ్రశంసించుట, రాముఁడు ధనుర్మిషంబున సీతా విషయకానురాగంబు వెల్లడించుట, లక్ష్మణుండు రాముని యభిప్రాయంబు శుభోదర్కంబని విన్నవించుట మొదలగు నమూలకమునగు కథాంశము లన్నియు శ్రీరామకథాఽమృతమున 158 పద్యములలో స్వతంత్రముగా వర్ణింపఁబడియున్నవి.[3] వాల్మీకమున సీతారాముల పూర్వరాగము వర్ణింపఁబడలేదు. ఇట సందర్భమును గల్పించుకొని పరస్పరానురాగ ప్రసక్తి నభివర్ణించుట యౌచిత్యసుందరమై ప్రబంధ ఫక్కి ననుసరించు చున్నది. రసపోషణ మత్యంత మధురము. రాముఁడు విష్ణువగుట, తాను లక్ష్మి యగుటయు నెఱింగి మానుషత్వాశ్రయణమునను లోకానుసరణమున నిట్టి యవస్థఁ గాంచెనని చెప్పుచు "భవబంధ మెట్టివారికైన నేమి సేయద"ని సమర్థించుట మనోహరము.

కమలవాసిని తానయ్యుఁ గంజనేత్రుఁ
డగుటెఱింగియు మానుషత్వాశ్రయణము

---

1] శ్రీ. రా. క.-బా. కాం., 7 ఆ., 227 ప.
2] పైది , 461–501 ప॥లు
3] పైది , 8 ఆ., 43–200 ప॥లు

కతన లోకానుసరణంబు గాంచె నింక
నెద్ది సేయదు భవబంధమేరినైన —(బా. కాం.-8 ఆ., 45 ప.)

సీతారాముల వివాహానంతరముఁ "బువ్వముబంతి" జరిగినట్లు విపులముగా 22 పద్యములలో వర్ణించుట యాంధ్రీకరణమున కవి పాటించిన స్వాతంత్ర్యమునకుఁ బ్రమాణము.[1] పెండ్లి సమయమున బంధువులు, మిత్రులు, పలువురు నొకచోఁ గూడుదురు. అట్టియెడ సంభాషణా చమత్కారము, వినోదము వెల్లి విరియుట సహజము. ఆ క్రమమిట్లు హృదయంగమముగా వర్ణింపఁబడినది.

లలిఁజాటూక్తులు హాస్యకల్పనలు లీలాలాలనోల్లాసముల్
లలిత ప్రస్తుత లర్థపూరణము లాలాప ప్రచారంబులు
జ్వల వక్రోక్తివిభావనల్ రస పరీవాహంబులై యొప్పెఁ బెం
డిలి బువ్వంబున వేడ్కలెల్లఁ బరిపాటి న్మేలుకొన్నట్లుగన్
— 10 ఆ., 417 ప.

పెండ్లివారు వేడుక లలర వెలయించిన విందు విశేషములు రసికజన సంభావ్యములయినట్లు చెప్పుట మనోహరము.

రసపాకంబుల మెప్పులొప్పె వలపుల్ రాణించె సౌగుణ్య మా
యసదృక్షంబన నయ్యె దోషవిరహం బౌ చిత్యముంబొల్చెఁగా
వ్య సమభ్యున్నతి భూషితం బగుచుఁ బ్రాజ్యంబైన యాభోజ్యమే
రసికుల్ మెచ్చరు మైథిలీ పరిణయారంభంబున న్భావినీ!
— 10 ఆ., 423 ప.

ఇట్టి వర్ణన కావ్యపరముగా నన్వయింపఁబడుట వలనఁ దద్విశిష్టతయుఁ బ్రకటింప సమర్థమగుచున్నది. ప్రథమమున శ్రీ వేంకటప్పయశాస్త్రిగారు "మైథిలీ పరిణయమ"ను కావ్యము రచింపఁబూనిన విషయ మిట స్మరింపఁదగి యున్నది. "వలపు" అను పదము శ్లేషించి వాసన యనునర్థమేగాక "వ్యంగ్యము" అను నర్థాంతరము నొసఁగుట సందర్భసుందరము.

---

1] శ్రీ. రా. క.-బా. కాం., 10 ఆ., 404—25 ప॥లు

అయోధ్యాకాండమున రామాదులు గంగానదిని దాటు సందర్భమున గుహుఁడు రామునితో "ఱాతి నాతిఁ గావించిన నీపాదరజము నా కొయ్యపడవఁ బడతిఁ గావించునేమో యని భయమందుచున్నా"నని చెప్పి ముందుగా రాముని పాదములు కడిగి శిరమున ధరించి "నా నావపైఁ జేర్చి నిన్ను నది దాఁటించెదను. నీవు నన్ను భవాబ్ధి యవ్వలిదరిఁ జేర్చుమ"ని యర్థించినట్లు మూలమునలేని భావము శ్రీరామ కథాऽమృతమున వర్ణించుట కవియొక్క స్వాతంత్ర్యమును బ్రకటించు చున్నది.

నీపాదంబులు గడిగెద
మూఁపున ధరియించి తరణి మొనయించెద ని
న్నాపగ దాఁటించెద న
న్నాపయిఁ జేర్పవె భవాబ్ధి యవ్వలి దరికిన్
— అయో. కాం.-5 ఆ., 157 ప.

ఇట్టి కల్పన రామమయ మానసుఁడగు గుహుని భక్తితాత్పర్యములను వెల్లడించుచున్నది. గుహునిఁ బరమయోగిగా దర్శింపఁ జేసిన పాత్రచిత్రణమున నిది ముఖ్యాంశము. [చూ. పాత్రచిత్రణము]

అరణ్యకాండమున రామప్రభృతులు సుతీక్ష్ణ మునితోఁ గూడి యగస్త్యాశ్రమమునకుఁ బోవుచుండ మార్గమధ్యమున ముని యగస్త్యుని ప్రభావమును, నాతఁడు వాతాపీల్వలులను పొడవడగించిన క్రమమును జెప్పినట్లు మాత్రమే వాల్మీకమున వర్ణింపఁబడినది. శ్రీరామకథాऽమృతమున నిప్పట్టున నగస్త్యుఁడు సముద్రజలములఁ గ్రోలి విడుచుట, వింధ్యవారణము గావించుట మొదలగు నమూలక కథావిశేషములు 15 పద్యములలో వర్ణింపఁబడినవి.[1] ఇవియన్నియు నగస్త్యుని ప్రభావ వర్ణనమున నంశములే యగుట మిక్కిలి యౌచిత్యము సంపాదింపఁబడినది. కథకు సమగ్రత చేకూరినది.

పంచవటి యందు జటాయువు రామునకుఁ దన చరిత్రఁ జెప్పుచు "కశ్యప ప్రజాపతికి వినత కద్రువలను నిరువురు భార్యలు కలరు. అందు వినతకు నరుణుఁడు గరుడుఁడు నను నిరువురు తనయులు. అందు నే నరుణునకు శ్యేని యందుదయించితిని. మాయన్న సంపాతి" అని వివరించినట్లు వాల్మీకమున గలదు. (అర. కాం.-14 స., 31—2 శ్లో॥లు.)

---

1) శ్రీ. రా. క.-అర. కాం., 1 ఆ., 231—45 ప॥లు

శ్రీరామకథాఽమృతమున నీసందర్భమునం దమూలకమగు "గరుడో పాఖ్యానము" స్వతంత్రముగా 9 పద్యములలో వర్ణింపఁ బడినది.[1] అందు వినత కద్రువతోడి పందెమున నోడి సపత్ని కూడిగము సేయుచుండ విహగేంద్రుఁడు సుతుఁడై బుట్టి తల్లి వగ మాన్పినాఁడని యిట్లు వర్ణింపఁ బడినది—

కద్రువతోడి పందెమునఁ గానని కర్మముగాఁగ నోడి వి
ర్ణిద్ర నళాక్షి యవ్వినత రీతిఁ దొలంగి సపత్ని కూడిగం
బద్రుతవృత్తిఁజేయ సుతుఁడై విహగేంద్రుఁడు తోఁచి యాపె ము
న్మద్రఁదొలంచె స్వీయమగు పున్నెము పూరుషభావమున్దగన్

— 1 ఆ., 329 ప.

వినత గర్భమున గరుడుఁడుదయించుట "స్వీయమగు పున్నెము పూరుష భావమును దాల్చినద"ని సంభావించుట హృద్యము.

రావణసంహారానంతరము రాముఁ డయోధ్యకు రాఁగాఁ "బౌరులెల్లరు తమ తమ గృహములపై నున్నతములైన జయపతాక లెగుర వేసిరి"

తతో హ్యభ్యుచ్ఛ్రియన్ పౌరాః పతాకా స్తే గృహే గృహే ।

అని వాల్మీకమునఁ గలదు. అట్టియెడ శ్రీరామకథాఽమృతమునఁ బురము నలంకరించి "వీర లక్ష్మీపుమవతార విలసితుఁడగు రామచంద్రుని రాకతో "నభిరామ యోగవర్ధితామోదులై నితాంత గౌరవ మొప్పార" పౌరులు తమ ముద్దియలతోఁ గూడి భక్తిపరవశులై కన్నులపండువుగా రాముని దర్శించి ప్రసూనములు, లాజ, అక్షతలుఁ జల్లిరనియు, పురంధ్రీజనము నొండొరులకు రాము మాన్యచరితములు తెలిపిరనియు సందర్భోచితమగు స్వతంత్ర కల్పన గావించిరి. ఇట్టి వర్ణన 13 పద్యములలో సాగుట రమణీయము.[2] దృఙ్మానస రసాయనమగు రాముని మానసమున మనన మొనరింప వారల కాత్మానంద మనుభవమునకు వచ్చినదట. వారు రామకథా శములు, రాముని సుగుణ సంతతులు సంస్తవన మొనరించిన తీరు హృద్యము. అందు రాముఁడు పరనారీసోదరుఁ డనుట నతని 'ఏక పత్నీత్వమును' దెలుపు చున్నది. [చూ. పాత్రచిత్రణము]

---

1] శ్రీ. రా. క.-అర. కాం, 1 ఆ., 324—32 ప॥లు

2] శ్రీ. రా. క.-యు. కాం.-ఉ. భా., 2 ఆ., 427—39 ప॥లు

ఉత్తరకాండమున పట్టాభిషిక్తుఁ డగు రాముని బ్రశంసింప నగస్త్యాది మును లేతెంచి రాముని సంభావించినట్లు వాల్మీకమున వర్ణింపఁ బడినది.

త్వాంతు దిష్ట్యా కుశలినం పశ్యామో హతశాత్రవమ్
దిష్ట్యా త్వయా హతోరాజన్ రావణో లోకరావణః
— 1 స., 17 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నియ్యెడ రాముని విష్ణుత్వమును నిరూపించుచు మునులు నితాంత భక్తపాలన కళాపారీణుఁ డగు విష్ణుని పూర్వావతార విశేషగాథలు కీర్తించినట్లు వర్ణించుట యమూలకము. (పూ. భా. 1 ఆ., 32 ప.) [చూ. పాత్ర చిత్రణము.] ఇందు రామావతారమునకు ముందున్న మత్స్య, కూర్మ, వరాహ, నార సింహ, వామన, భార్గవరామావతారములు ప్రస్తావింపఁ బడుట విశేషము.

అగస్త్యుఁడు హనుమచ్చరిత్ర నభివర్ణించు సందర్భమున నాతఁడు రుద్ర వీర్యోద్భవుఁ డని చెప్పఁబడు నమూలకమగు నొకానొక కథావిశేషము వివరించుట యాంధ్రీకరణమున కవుల స్వాతంత్ర్యమును బ్రకటించుచున్నది.[1]

హనుమదాదుల చరిత్రతోఁబాటుగా నగస్త్యుఁడు "మానవనాథ! యియ్యది యు విననైనదియే నుడివెద నదనున స్మారితంబైన దీ యుదంతంబని" రాము నుద్దేశించి యమూలకమగు దశరథు బాల్యచరితముఁ జెప్పినట్లు 39 పద్యములలో వర్ణించుట కవి యనువాదమునఁ బాటించిన రచనా స్వాతంత్ర్యమును వెల్లడించు చున్నది.[2] వాల్మీకమున దశరథుని బాల్యచరిత్రము వర్ణింపఁబడలేదు. అయోధ్యాధిపతియై చిర కాలము సంతానములేక వ్యథఁజెందు దశరథుఁడే రామాయణ మహా కావ్యమున మనకుఁ దొలుతగా దర్శన మిచ్చును. రామపట్టాభిషేక సంరంభ సందర్భమున కైక కిచ్చిన వరద్వయము స్మారితంబైన తటి నాతని ప్రౌఢ పరాక్రమము మాత్రము సూచితమైనది. దానికిఁదోడు బాల్యచరితముఁ జెప్పఁబడినఁగాని సమగ్రత సిద్ధింపదను భావనతో నదియు నిట సంతరింపఁబడుట పరమ రమణీయము. (చూ. కథాసంవిధానము)

---

1] శ్రీ. రా. క.-ఉ. కాం.. పూ. భా., 8 ఆ., 17–19 ప॥లు
2] పైది , 8 ఆ., 201–39 ప॥లు

అగస్త్యుఁడు "రాముని చరితమున బహు రహస్యములు కలవని వాక్రుచ్చుట" శ్రీరామకథామృతమున 17 పద్యములలో స్వతంత్రముగా వర్ణింపఁబడినది.[1] ఇందు రాముఁ డడవికేగుట, కాకాసుర వృత్తాంతము, రావణుఁడు సీత నెత్తుకొని పోవుట మొదలగు కథాంశముల యాంతర్యము వివరింపఁ బడినది. రాముఁడు విశ్వామిత్రుని నుండి గ్రహించిన అస్త్రములఁ బునశ్చరణ గావించుకొనుట యరణ్యవాస ప్రయోజన మనియు, దేవకలాతని తపోమహిమఁ బరీక్షించుట కాకాసుర కథాపరమార్థ మనియు, రావణుఁడు రామునితో కలహము కల్పించుకొనుటకే సీత నపహరించి యుద్ధమున నాతనిచే హతుఁడై యాతనిలో లీనమైనాఁ డనియు నీఘట్టమున సూచింపఁబడినది. అగస్త్యుఁడు పట్టాభిషిక్తుఁడైన రామునితో రావణుఁడు సీతను లంకయందుంచిన విధమును బల్కు సందర్భమున "మాతేవ పరిరక్షితా" అను వాక్యములోని వ్యంగ్యమును శ్రీ శాస్త్రిగారు గ్రహించి సీతాపహరణోదంత ప్రయోజనముఁ జిత్రించి రనవచ్చును.

అగస్త్యుఁడు శ్రీరామునితో సారాంశముఁ జెప్పుటయు నిట్టిదే. ఈ కథాభాగము 19 పద్యములలో వర్ణింపఁబడినది.[2] ఇందు జ్ఞాని యగు రావణుని పాత్ర చక్కగా వివరింపఁబడినది. సీతతో రావణుఁ డవిన పరుష వచనము లన్నింటికి లోనర్థం బొకటి లోకార్థ మొకటియుఁ గలదని చెప్పఁబడినది.

తా నెన్నియొ నుడివె నుడుల్
లోనర్థం బొకటి యొకటి లోకార్థముగా
నూనిన వని కనుకూలము
గా నుతులవిగాఁగ నెఱుక గల వారలకున్

— ఉ. కా.-పూ. భా., 9 అ., 259 ప.

అట్టివాఁడు గావుననే రావణుఁ డాగమశాస్త్రమునమంత్రమూర్తిగా నుపాస్యుఁ డగుచున్నాఁడు.[3] రామాయణమునఁ బ్రసిద్ధ వ్యాఖ్యాతలిట్టి భావమే వెల్లడించిరి.

---

1] శ్రీ. రా. క.-ఉ. కాం, పూ. భా., 9 అ., 10-26 పాలు
2] పైది , 247-65 పాలు
3] మంత్రశాస్త్రము

తన వినాశమును దానే కొనితెచ్చుకొనన రావణుఁడు విభీషణుఁడు వంశకర్త కాఁగలఁ డని యెంచి విడిచి పుచ్చినాఁ డని కల్పించుట యిందలి వినూతనాంశము.

జానకీజాని యీ విభీషణు వెలార్చె
రావణుం డనఁగలదె యర్థ మ్ముచితము
శుద్ధభావుండు వీఁడతిశూరుఁ డగుట
వంశకర్త యగుతమంచు వదలెఁగాక

— 9 ఆ., 160 ప.

యోగదృష్టి గల కవులు సీతారాములు గావించిన "వనవిహారమును వర్ణించుట" యనునది శ్రీరామకథా-ఉమృతమున గల్పించిన యద్భుత సన్నివేశము.[1] తొలుత వాల్మీకము ననుసరించి సీతారాముల వనవిహారము వర్ణింపఁబడినది. అందు శుకదంపతులు వన విశేషములు వివరించుట మూలాధికము. అట్టి యేకాంత వన విహార సందర్భమునఁ బరిచారికాదు లెవ్వరు వారి ననుసరింపరు గావున యోగ దృష్టి గల కవులు యోగమున దర్శించి యా సీతారామ వనవిహార విశేషములను వర్ణించినట్లు మిక్కిలి స్వతంత్రముగాఁ జెప్పఁబడినది.

ఆ పుణ్యదంపతుల మే
లీ పగిదిఁ దలిర్చుటెల్ల నెంచి కవులు మా
కీ పట్టె పట్టనుచు వా
గ్వ్యాపార రమావిహార కలఁగొని రగజా !

ఉ. భా., 1 ఆ., 125 ప.

యోగమున గలిగిన సుఖపారవశ్యము ననుభవించుటేగాని యా సమయమున బలుకుటకు వీలుకాదు. పలుకునప్పుడా యోగానుభవము కలుగదు. అది మామూలు నోటిపాట. కావున యోగమునఁ జూచినది చూచినట్టులే యన్యూనాతిరిక్తముగా "శుకము వియతి" వర్ణింప నగునని యనుట గంభీరార్థ మధురము. శుకము మనము నేర్పిన పలుకులే పలుకును గాని తదితరములు పలుకకుండుట యనుభవసిద్ధము.

---

1] శ్రీ. రా. క.-ఉ. కాం., ఉ. భా., 1 ఆ., 125–73 పలు

చూచునప్పుడు సుఖమునఁ జూపు మనుఁగు
నొడువునెడ సాగు మామూలు నోటిపాట
చూచినది చూచినట్టులే శుకము నియతి
వలచి వర్ణింప వగునదో వైభవంబు

— ఆ., 129 ప.

అందు నాత్మకు వలె నాఱు సంస్థానములు గలవు. సీతారాముల విహరణమునకై యంచలు గట్టిన విమాన మొకటి సిద్ధము సేయఁబడినది. పరిచారికలు గొలువ వారందధిష్ఠించి యాయా విహారప్రదేశముల కేగి విహరించిరి.

ఆఱు సంస్థానములు కలవాత్మకు వలె
నందు రామారమణుల విహారణములకు
నంచలంగట్టిన విమానమందుఁ జెంది
రుత్తమగతంబు జన్యలు నొనరి కొలువ

— ఉ. భా., 1 ఆ., 132 ప.

ఆఱు సంస్థానము లనఁగా శరీరమునఁ గల షట్చక్రములు. అంచలం గట్టిన విమాన మనఁగా శ్వాస నిరోధమున నేర్పడిన యాత్మశక్తి. ఇట్లు యోగ మార్గమున బయనించు నా షట్చక్రవిహారణమే యిందు వ్యంగ్యముగా వర్ణింపఁ బడినది. ఎఱుకఁ గల వారికది యనుభవసిద్ధము. బహుమానపాత్రము నగుచున్నది. అందొక విహారమును గూర్చి యిట్లు వర్ణింపఁబడినది.

అదె విశ్వరూప మదె సం
మదముల నెలవదె విచిత్రమండనములు తీ
రదె భోగాపణ మదె సం
విదుపార్జిత వైభవం బవేలంబు బలే.

ప్రాభవవిస్తులంబు నిజభావ విభావ్యము సర్వవర్ణ సం
శోభిత మాయుధీయ శతమస్తనికా పరిపాల్యమాన మ

శోభ మనంత మద్భుత మగోచర తత్త్వము తత్పదం బన
న్యాభుఁడు సెందె రాఘవ మహాప్రభుఁ డప్రమిత ప్రమేయుఁడై
—1 ఆ., 158—9 పll లు

అందు రాముఁడు సద్వితీయుఁడయ్యు నద్వితీయ సుఖం బనుభవించినాఁడు. ఇయ్యది సహస్రార కమలవై భవమగుట ననిర్వచనీయము.

ఇట్లు శ్రీరామకథాఽమృతమున స్వతంత్రముగ నపూర్వమగు కల్పనా శిల్పము పాటింపఁ బడినది. కావ్యశోభ నినుమడింపఁజేయు నీ స్వతంత్రత కథా పరిపూర్ణతకు కథనవై పుణికి నుపకరించు చున్నది.

## వ్యాఖ్యానానుసరణము :

వాల్మీకి రామాయణము ప్రసన్న గంభీరమగు మహాకావ్యము. లోక సంగ్రహార్థమై యనేకులు వారి వారి ప్రతిభా పాండిత్యము ననుసరించి యనేక వ్యాఖ్యానములు వెలయించిరి. అందు ప్రసిద్ధమైనవి కతక, తీర్థీయ, తిలక, గోవిందరాజీయము లను వ్యాఖ్యాన చతుష్టయము. అనువాదమున నాంధ్రకవులు పూర్వుల వ్యాఖ్యాన విశేషములను జేర్చి తమ తమ కావ్యములు సంతరించుట సముదాచార పద్ధతిగా నెన్నఁదగియున్నది. అట్టివానిలో భాగవతానువాద కర్త పోతనమహాకవి శ్రీధరీయము నందలి కొన్ని విషయముల ననువదించుట ప్రసిద్ధము. శ్రీరామకథాఽమృత కావ్య నిర్మాతలు వ్యాఖ్యానముల యందలి విశేషములు వివరించుచుఁ దమ కావ్యమును సుబోధ మొనరించిరి. కవి "మునిభావరహస్య వివరణంబొప్ప"[1] రచింతు నని గ్రంథమున పేర్కొనుట గమనార్హము. కావుననే వీరు "శ్రీరామకథాఽమృతము"ను రామహృదయ రహస్యార్థ రమ్యటీక[2]గా సంభావించిరి,

వ్యాఖ్యాన విశేషముల ననువదించుట వలన కావ్యమున కొక దీప్తి కలిగి, సుగమమై శ్రీరామకథాఽమృత మాంధ్రమున వ్యాఖ్యాన ప్రతిపత్తి గల విశిష్టమగు మహాకావ్యముగా సంతరింపఁబడినది.

బాలకాండమున వాల్మీకి స్నానార్థమై నదీతీరమున కేగి సకరుణ మగు క్రౌంచద్వంద్వ వియోగజనిత మగు శోకమును—

---

1] శ్రీ. రా. క.- బా. కాం., పీఠిక, 2 పు.
2] ,, - ఉ. కాం., పూ. భా., 1 ఆ., 18 ప.

మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిధునాదేక మవధీః కామమోహితమ్[1]

అను శ్లోక రూపమునఁ బ్రకటించినాఁడు. ఇట వ్యాఖ్యాత లందఱు నిషాద పరమగు నర్థమునేగాక శ్రీనివాస పరమగు నర్థమును గూడ వివరించిరి. మానిషాద! అనఁగా లక్ష్మికి నిలయుఁడవగు ఓ విష్ణువా! అని భగవన్మంగళాశాసనపరముగా ప్రాచీనాచార్యులచేత నీ శ్లోక మభివర్ణింపఁ బడినది. ఇందు "క్రౌంచ మిధున శబ్దము నకు రాక్షస జంట, వానర జంట యను నర్థము లభించుట వలన రామావతారస్ఫూర్తి కలుగుచున్నది. శ్రీరామకథాఽమృతమున నీసందర్భము వ్యాఖ్యాతల విశేషార్థము లతోఁబా టనువదింపఁ బడినది. ఇట నర్థాంతరమును వాల్మీకియే భావించి పలికినట్లు చెప్పఁబడుట విశేషము.

నిషాదపరమగు నర్థము—

ఓ నిషాదుండ! యీ యిలనుండఁబోకు
మింక శాశ్వతులగు సమలేల నీకుఁ
గ్రౌంచమిధునంబులోన నొక్కండు కామ
మోహితముఁ బొరిగొంటివి మోనమనక

బా. కాం., 1 ఆ., 96 ప.

శ్రీనివాసపరమగు నర్థము—

శ్రీనివాసుండ యీయిల స్థితిదలిర్చు
మింక శాశ్వతులై సమ లెలయుచుండఁ
గ్రౌంచ మిధునంబులోన నొక్కండు కామ
మోహితముఁ బొరిగొన్న యప్పున్నెమునను

— బా. కాం., 1 ఆ., 98 ప.

దశరథుఁడు శ్రీరామాదుల జాతకర్మాదికము నిర్వర్తించెనని "తేషాం జన్మ క్రియాదీని సర్వకర్మాణ్యకారయత్" [బా. కాం., 18 స., 22 శ్లో.] అని

1] వా. రా.-బా. కాం., 2 స., 15 శ్లో.

వాల్మీకి రామాయణమునఁ గలదు. గోవిందరాజీయమున "ఆదిశబ్దేనాన్నప్రాశన చౌలోపనయనాదీని గృహ్యంతే" అని వివరింపఁబడినది. ఈ ఘట్టము శ్రీరామకథాఽమృతమున వ్యాఖ్యాన విశేషములతోఁ జేర్చి చెప్పఁబడినది. ఇందు జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయనాదు లతివిపులముగా వర్ణింపఁబడినవి. [బా. కాం.- 3 ఆ., 104–227 ప॥లు]

రామాదుల విద్యావైదుష్యములఁ గూర్చి వాల్మీకమున–

సర్వే వేదవిదశ్శూరాః సర్వే లోకహితే రతాః
సర్వే జ్ఞానోపసంపన్నా స్సర్వే సముదితాగుణైః
–బా. కాం., 18 స., 24 శ్లో.

అని చెప్పబడినది. గోవిందరాజీయ వ్యాఖ్యానమున "వేదవిదః అధీతవేదాః .... శూరా ఇత్యనేన అధీతధనుర్వేదత్వ ముచ్యతే. లోకహితేరతాః ఇత్యనేన ధనుర్వే దాభ్యాసకార్య పరత్వమ్. వేదార్థజ్ఞానసిద్ధిమాహ జ్ఞానేతి. జ్ఞానకార్య గుణసంపత్తి మాహ సముదితో గుణైరితి. గుణైః దయాదిభిః అసన్నితివిశేషః" అని వివరింపఁ బడినది. వారు సాంగములగు వేదము లభ్యసించి ధనుర్విద్యావిశారదులై జ్ఞానసంపన్నులై దయాది గుణములతోఁ బ్రకాశించుచున్నారు. శ్రీరామకథాఽమృతమున నీవిషయము 12 పద్యములలో వివరముగా వ్యాఖ్యాన విశేషములతో నాంధ్రీకరింపఁబడినది. వేదోపబృంహణము లగు శాస్త్రము లన్నియు వేదాంతార్థబంధురములుగాఁగా బ్రహ్మ తాదాత్మ్యబుద్ధితో నభ్యసింపఁ బడినట్లు వర్ణించుట వ్యాఖ్యానమునఁ జెప్పఁబడిన "వేదార్థజ్ఞానసిద్ధి"ని వెల్లడించుచున్నది. [చూ. పాత్రచిత్రణము.]

విశ్వామిత్రాగమన సందర్భమున దశరథుడు భక్తిప్రపత్తుల నాతనిఁ బూజించి కుశల మడిగి తన భాగ్యము నెన్నుచు "మృతుని సంప్రాప్తి, నీరులేనిచోట వర్షాగమనము, సదృశభార్యల యందు సంతతి కలుగుట, పోయిన ధనము లభించుట, ఉత్సవాదుల యందు గలుగు సంతోషము వంటిదిగా మీ యాగమనమును దలపోయుచున్నాను. ఓ మహామునీ ! నీకు స్వాగతము" అనినట్లు వాల్మీకమున గలదు. [బా. కాం.-16 స., 49, 50 శ్లో॥లు] "మహోదయే" యను మూలములోని పదమునకు గోవిందరాజీయ వ్యాఖ్యానమున "మహః పుత్ర వివాహాద్యుత్సవః. మహ ఉద్ధవ ఉత్సవః ఇత్యమరః. తస్యోదయే" అని కలదు. శ్రీరామకథాఽమృతమున–

మృతుని ప్రాప్తి మరుస్థలామితసువృష్టి
యప్రజాపత్యలబ్ధి నష్టార్థలాభ
మట్లు పుత్రవివాహాది కాభ్యుదయము
నెంత నీరాక కెనయని యేమనమున

— బా. కాం., 5 ఆ., 18 స.

యని వ్యాఖ్యాన మందలి విశేషమును జేర్చి యనువదింపఁ బడినది. దశరథ పుత్రుల వివాహము విశ్వామిత్ర పాత్రప్రయోజనములలో నొకటి. అది యిఁట సూచింపఁబడుట హృద్యము. వ్యాఖ్యానానుసరణము వలన నిట్టి యందము లభించుట విశేషాదరణీయ మగుచున్నది.

అయోధ్యాకాండమున భరద్వాజునకు భరతుఁడు తన తల్లులను బరిచయము చేయు సందర్భమునఁ గైకను దూషించెను మహర్షి యది విని భరతునితో "కైక దూష్యరాలు కాదనియు రాము ప్రవ్రాజనాగమమున దేవదానవ ఋషిసమూహము లకు హితము జరుగుననియుఁ జెప్పినట్లు" వాల్మీకమునఁగలదు. [అయో. కాం.- 92 స., 30—1 శ్లో॥లు.]

తత్త్వదీపికావ్యాఖ్యానము నందు "కైకేయీ దోషేణ నావగంతవ్యా కైకేయ్యాం దోషదృష్టిర్న కర్తవ్యేత్యర్థః. కైకేయ్యాః దేవప్రేరితత్వాదితిభావః" అనియు, గోవిందరాజీయ వ్యాఖ్యానమున "త్రత హేతుమాహ రామేతి. సుఖో దర్కం సుఖోత్తరం అతీతానాగతవర్తమానజ్ఞో మహర్షిః భావిరావణవధాదికం హృది నిధాయ దేవాదీనాం సుఖోదర్కం భవిష్యతీత్యుక్తవాన్" అనియు వివరింపఁ బడినది. శ్రీరామకథాఽమృతమున నీఘట్టము నందు- [అయో. కాం.-7 ఆ., 262-65 ప॥లు] మహర్షి వ్యాఖ్యానముల యందలి యర్థముఁ బ్రకాశితమగు పద్ధతిఁ బలికినట్టు లను వదింపఁబడినది. "దోషదృష్టిర్నకర్తవ్యా" అనుదానికి "దోషమిడకుము" అనియు "దేవప్రేరితత్వాత్" అనుదానికి "ఇది దైవకల్పితంబు" అనియు వివరణము. త్రికాలజ్ఞుఁడగు ముని భావి రావణవధాదికము మనమున నిడుకొని శుఖోదర్క మగు నని చెప్పినదానికి "రామధూర్జటి యిప్లే మిష దుష్టులఁ బోకార్పఁగ సుషమాంచిత యగుచు జగతి సొబగొందుఁజుమీ" యనియు "సర్వహితమిది" యనియు "వహితమున్ బోకడఁచి హితము నెలకొన నీకడ కరుదేరనెంచు" ననియుఁ జెప్పుట తాత్పర్యము. [అయో. కాం.-7 ఆ., 362-65 ప॥లు]

భరతుఁడు శ్రీరాముని దర్శింపఁ జిత్రకూటమునకు రాగా శ్రీరాముఁ డతనిఁ గుశల ప్రశ్నాదికములఁ బరామర్శించు సందర్భమున "నీ వేదములు, ధనములు, దారలు, శ్రుతము సఫలీకృతములైనవా ?" యని ప్రశ్నించినట్లు వాల్మీకమున గలదు.

కచ్చిత్తే సఫలావేదాః కచ్చిత్తే సఫలాక్రియాః
కచ్చిత్తే సఫలా దారాః కచ్చిత్తే సఫలం శ్రుతమ్
— అయో. కాం -100 స., 72 శ్లో

ఆ శ్లోకమునకు గోవిందరాజీయమున 'కచ్చిత్తే సఫలావేదా ఇతి .... తే వేదాః త్వదధీతవేదాః సఫలాకచ్చిత్ అగ్నిహోత్రాద్యనుష్ఠానేన సఫలీకృతా కచ్చిత్. క్రియంతే సాధ్యంత ఇతి క్రియాః ధనాని త్వత్సంపాదితాని దానభోగాభ్యాం సఫలీ కృతాని కచ్చిత్. తే దారాః సఫలాః కచ్చిత్ రతిపుత్రాభ్యాం సఫలా కచ్చిత్. తే శ్రుతం శాస్త్రశ్రవణం సఫలం కచ్చిత్ శీలవృత్తాభ్యాం సఫలం కచ్చిత్' తథాచ మహాభారతే -

"అగ్నిహోత్ర ఫలావేదాః దత్తభుక్త ఫలం ధనమ్
రతిపుత్ర ఫలా దారా శ్శీలవృత్త ఫలం శ్రుతం" ఇతి.

అని వ్యాఖ్యానింపఁ బడినది. శ్రీరామ కథామృతమున నీ వ్యాఖ్యాన విశేషములు జేర్చి యీ ఘట్ట మనువదింపఁ బడినది.

ఇందు 'తేవేదాః త్వదధీత వేదాః సఫలాకచ్చిత్ అగ్నిహోత్రాద్యనుష్ఠానం బుల చేతను' అనియు, 'ధనాని త్వత్సంపాదితాని దానభోగాభ్యాం సఫలీకృతాని కచ్చిత్' అను దానికి 'నీ ద్రవ్యంబులు దానభోగంబుల చేతను' అనియ, 'తేదారాః రతిపుత్రాభ్యాం సఫలాః కచ్చిత్' అను దానికి 'నీ దారవర్గంబు రతి పుత్రుల చేతను' అనియు, 'తేశ్రుతం శాస్త్రశ్రవణం సఫలం కచ్చిత్ శీలవృత్తాభ్యాం సఫలం కచ్చిత్' అనుదానికి 'నీ శ్రుతంబు శీలవృత్తంబుల చేతను సఫలత్వము గాంచుచున్నవియే' అనియు విశేషార్థ సహితముగా ననువదింపఁ బడెను. [అయో. కాం. 8 ఆ. 235 వ.]

అరణ్య కాండమున జటాయువు రావణునితోఁ బోరి నిహతుఁడై నేలగూలి నప్పుడు సీత దుఃఖమున నాతని స్పృశించి విలపించినదని వాల్మీకమునఁ గలదు.

ఆలింగ్య గృధ్రం నిహతం రావణేన బలీయసా
విలలాప సుదుఃఖార్తా సీతా శశి నిభాననా
— అర. కాం.-52 స., 3 శ్లో,

గోవిందరాజీయ వ్యాఖ్యానమున 'ఆలింగ్యేతి – కరభ్యాం సంస్పృశ్యేత్యర్థః' అని ఔచిత్యముగా వివరింపఁ బడినది. శ్రీరామ కథాఽమృతమున నయ్యది – 'కరమున నాతని న్నిమిరి' .... '1 అని యాంధ్రీకరింపఁ బడినది.

జటాయువు మరణమునకుఁ జింతించి పితృదేవతల కొనరించు నౌర్ధ్వదైహిక క్రియలు జరిపినట్లు చెప్పుచు మర్త్యులకు స్వర్గమనము నుద్దేశించి ద్విజులు ప్రేత కెట్టి మంత్రములు జపింతురో రాముఁ డామంత్రములు పఠించె నని వాల్మీకమునఁగలదు.

యత్తత్ప్రేతస్య మర్త్యస్య కథయన్తి ద్విజాతయః
తత్స్వర్గ గమనం తస్య పిత్ర్యం రామో జజాపహ
అర. కాం. - 68 స., 34 శ్లో.

ఈ శ్లోకమునకు గోవిందరాజీయ వ్యాఖ్యానమున ప్రేతస్య మర్త్యస్య మనుష్యస్య యత్తత్ ప్రసిద్ధమ్ మంత్రజాతం స్వర్గమనం స్వర్గప్రాపకం పఠంతి. పిత్ర్యం పితృదేవతాకం తజ్జజాప యామ్య సూక్తాదికం జజాపేత్యర్థః' అని వివరణము గావింపఁ బడినది. శ్రీరామ కథాఽమృతమున నియ్యది వ్యాఖ్యానమునఁ జెప్పఁ బడిన యర్థముఁ జేర్చుచు వర్ణింపఁ బడినది.

రౌద్రయామ్య సూక్తరాజ పారాయణం
బొనరఁజేసి ముక్తియోగ విధియు
జరిపి సౌమ్య ! నీవు సర్వోన్నతుండవై
పరమపదము సేరి పరఁగుమనిన
— అర. కాం. - 4 ఆ, 182 ప.

---

1] అర. కాం, — 3 ఆ., 239 ప,

రౌద్రయామ్యసూక్త పారాయణ మొనరించినట్లు చెప్పుట వ్యాఖ్యానాను సరణము.

రామలక్ష్మణులు నాశబరి యాశ్రమమును జేరిరి. అంత శబరి వారిని జూచి లేచి కృతాంజలియై యెదురేగి వారి పాదముల స్పృశించి పాద్య మాచమనీయము యథా విధిగా నిచ్చి పంపాతీర సంభవములు సంచితములునైన వివిధములగు వన్యముల నిచ్చి సత్కరించినట్లు వాల్మీకమునఁ గలదు.

తౌచదృష్ట్వా తదాసిద్ధా సముత్థాయ కృతాంజలిః
రామస్య పాదౌ జగ్రాహ లక్ష్మణస్య చ ధీమతః ॥
పాద్యమాచమనీయంచ సర్వం ప్రాదాద్యథావిధి
మయాతు వివిధం వన్యం సంచితం పురుషర్షభ
తవార్థే పురుషవ్యాఘ్ర! పంపాయాస్తీర సంభవమ్
— 74 స., 6, 7, 17 శ్లో॥లు

ఈ ఘట్టమున గోవిందరాజీయ వ్యాఖ్యానమున 'సంచిత మిత్యనేన రామస్య చిత్రకూటగమనాత్ ప్రభృతి సంపాదితత్వం ఆదరేణ గుప్తత్వం చ తత్తత్ఫల జాతీయ మాధుర్యం పరీక్ష్య స్థాపితమితి సంప్రదాయః' అనియు తత్త్వదీపికా వ్యాఖ్యానము నందు 'మయా త్వదర్థం వన్యం సమ్యక్ పరీక్ష్య మాధుర్యయుక్తం సంచిత మిత్యర్థః తదుక్తం పాద్మే - శబరీం ప్రస్తుత్య —

ప్రత్యుద్గమ్య ప్రణమ్యాథ నివేశ్య కుశవిష్టరే
పాదప్రక్షాళనం కృత్వా తత్తోయం పాపనాశనమ్
శిరసాధార్య పీత్వాచ వన్యైః పుష్పైరథార్చయత్
ఫలాని చ సుపక్వాని మూలాని మధురాణిచ
స్వయమాసాద్య మాధుర్యం పరీక్ష్య పరిభక్ష్యచ
పశ్చాన్నివేదయామాస రాఘవాభ్యాం దృఢవ్రతా
ఫలాన్యాస్వాద్యకాకుత్స్థః తస్యైముక్తిం పరాందదౌ ఇతి"

అనియు వివరింపఁ బడినది. శ్రీరామ కథాఽమృతమున నీ వ్యాఖ్యాన విశేషములను, పద్మపురాణస్థ విషయములను జేర్చి యీ ఘట్ట మనువదింపఁ బడినది.

వచ్చువారి తీరు వారక గనుఁగొని
యెదురువోయి హర్ష మెసక మెసఁగ
బ్రాముకొనియెనేమి భాగ్యమో తత్పదా
బ్జములఁ గనుల శబరి కమలనయన !
పాదములఁ గడిగి తజ్జల
మాదృతి శిరమున ధరించి యలరారఁగనెన్
మోదం బామోదము సం
మోదం బానందమును సమూహతఁబొదువన్

కొని చని యన్నదమ్ములనుఁ గోటికి నొక్కఁడె చాలు నన్న య
య్యనుపమ భక్తి నెక్కొనఁగ నంచిత పీఠము లుంచి చేర్చి య
య్యనువునఁ బూజసేసి రుచులారసి వన్యలనేర్చి తెచ్చి యుం
చిన యవియంచు నొండొకటఁ జిక్కని చక్కని పండ్లొసంగినన్
— అర. కాం. - 4 ఆ., 297—99 ప॥లు

వ్యాఖ్యానము లందలి 'తత్తత్ఫల జాతీయ మాధుర్యం పరీక్ష్య స్థాపితమ్' 'వన్యం సమ్యక్ పరీక్ష్య మాధుర్యయుక్తం సంచితమ్' అనువానికి 'రుచులారసి వన్యలనేర్చి తెచ్చి యుంచినయవి' యనునది చక్కని యనువాదము. పద్మపురాణస్థ మగు 'నివేశ్య కుశవిష్టరే' యనుదానికి 'నంచితపీఠము లుంచి చేర్చి' అనునదియు 'పాదప్రక్షాళనం కృత్వా తత్తోయం పాపనాశనం శిరసాధార్య' అనుదానికి 'పాదములు గడిగి తజ్జల మాదృతి శిరమున ధరించి' అనునది యనువాదము. రాముఁడు శబరి యెంగిలి తినెనా ? లేదా ? అను మీమాంస కిట లేదను చక్కని సమాధానము సంప్రదాయాను బద్ధముగాఁ జెప్పఁబడినది. శబరి పాత్ర చిత్రణము సహృదయ హృదయంగమము.

కిష్కింధా కాండమున రామసుగ్రీవుల మైత్రి సందర్భమున సుగ్రీవుడు పత్రపుష్పభరితమైన చందనశాఖ నొకదానినిఁ దెచ్చి భూమిపై నమర్చి రాఘవునితోఁ గూడి కూర్చుండె నని వాల్మీకమునఁ గలదు.

తత స్సవర్ణబహులాం ఛిత్వా శాఖాం సుపుష్పితాం
సాలస్యాస్తీర్య సుగ్రీవో నివసాద స రాఘవః
— కి. కాం. - 5 సం., 19 శ్లో.

గోవిందరాజీయ వ్యాఖ్యానమున 'స రాఘవ ఇత్యనేన **ఏకాసనత్వ** ముక్తమ్' అని కలదు. శ్రీరామకథాఽమృతమున నయ్యది వ్యాఖ్యానానుసరణముగా—

అని పూవు ల్దళము ల్దలిర్ప లలితంబైయున్న యొండొక్కశా
ఖను( జేచే(గొని తెచ్చి రామునకు శ్రీ కల్యాణసౌగుణ్య ధా
మునకు న్విష్టరము న్బొనర్చి భుజముల్పొంగంగ నద్దేవు నా
జ్ఞను గూర్చుండె సహాసనస్థితి సమైశ్వర్యంబు చేకూరగన్
— కి. కాం.-1 ఆ,, 115 ప.

అని యనువదింప( బడినది. "సహాసనస్థితి సమైశ్వర్యంబు చేకూరగా" నని వివరించుట హృద్యము.

సుగ్రీవు(డు రామునకు వాలి విరోధకారణము(దెలుపుచు "నాత(డు దఱుమ దిక్కు లెల్ల( దిరిగి కారణాంతరమున వాలి ఋశ్యమూకమునకు రా( జాలమి నేనిట మంత్రులతో నుంటి" నని చెప్పినట్లు వాల్మీకమున(గలదు. [కి. కాం.-10 స., 27, 28 శ్లో॥లు]. అందులకు గోవిందరాజీయ వ్యాఖ్యానము నందు, శ్రీమహేశ్వరతీర్థ విరచిత వ్యాఖ్యానము నందును "కారణాంతరే మతంగశాప నిమిత్తే సతి వాలినో దురాధర్షం దురాక్రమం దుష్ప్రాపం" అని కారణాంతరము వివరింప( **బడినది.** శ్రీరామకథాఽమృతమున నయ్యది మునిశాపముగా( దెల్పుచు వ్యాఖ్యానాను సరణముగా ననువదింప( బడినది. [కి. కాం.-1 ఆ., 190 ప.]

రాము(డు సుగ్రీవున కభయ మిచ్చుచు నాతనికి గలిగిన కష్టము తనదిగా భావించుచున్నట్లు "ఆత్మానుమానాత్ పశ్యామి" [కి. కాం.-10 స., 34 శ్లో.] అని పలికెను. గోవిందరాజీయ వ్యాఖ్య యందు "ఆత్మానుమానాత్ ఆత్మవత్సర్వ భూతాని ఇతి న్యాయాదిత్యర్థః" అని దానికి వివరణము సేయ(బడినది. శ్రీరామకథాఽమృత మున నది "నా కష్టమట్టు లనుకొని" [కి. కాం.–1 ఆ., 195 ప.] యని వ్యాఖ్యా నానుసరణముగా ననువదింప( బడినది.

సుందరకాండమున సీతాన్వేషణకై హనుమంతుఁడు వారిధి లంఘించి లంకకుఁబోవుచుఁ దోడి వానరులతో "రాఘవ నిర్ముక్తమగు శరము వలె వాయు వేగమున నేనచటి కేగి సీతను గనుఁగొని కానని పక్షమున లంకతోఁ గూడ రావణునిఁ బెకలించి తీసికొని వత్తు" నని చెప్పినట్లు వాల్మీకమునఁ గలదు.

యథా రాఘవ నిర్ముక్త శ్శర శ్శ్వసనవిక్రమః
గచ్ఛే త్తద్వ ద్గమిష్యామి లంకాం రావణపాలితాం
నహిద్రక్ష్యామి యదితాం లంకాయాం జనకాత్మజామ్
— సుం. కాం.-1 అ., 39, 40 శ్లో॥లు

ఈ ఘట్టమునకు రామానుజీయ వ్యాఖ్యానమున "రాఘవ శరదృష్టాంతేన స్వస్యావిళంబత్వా ప్రతిహతత్వామోఘత్వాదికం సూచితవాన్" అని వివరింపఁబడినది. శ్రీరామకథాఽమృతమున నియ్యది—

ఇదె రామాస్త్రమపోలె లంక పస మాయింపం బ్రవేశింపఁ బో
యెద సీతంగని కాని నాఁడసురతో నేతెంతుఁ దద్వాసభూ
పదమెల్లం బెకలించి మోచికొని సంపల్లీల కైకోలు గాం
చెద మీకెల్లరకుం బ్రియంబుగ యశశ్శ్రీలాలనోత్సాహినై
"మేలివార్త దెత్తు జాలింబడకుఁడింక రిత్తవోవుదునె మరుత్తనయుఁడ"
— సుం. కాం.-1 ఆ., 24, 25 ప॥లు

అని వ్యాఖ్యానానుసరణముగా ననువదింపఁ బడినది. "ఇదె" అనునది యాతని యొక్క అవిళంబత్వమును, "లంక పసఁమాయింపంబ్రవేశింప బోయెద" అనునది యప్రతిహతత్వమును "రిత్తవోదునె" యనునది యమోఘత్వమును దెలుపుచు వ్యాఖ్యానార్థగర్భితము లగుట నిరూపించుచున్నవి.

హనుమంతుఁడు సీతకు రామనామాంకిత మగు ముద్రిక నీయగా నది చూచి సీత భర్తృసమాగమము నందినట్లుగా సంతోషించె నని—

గృహీత్వా ప్రేక్షమాణాసా భర్తుః కరవిభూషణమ్
భర్తారమివ సంప్రాప్తా జానకీ ముదితాఽభవత్
— సుం. కాం.-36 స., 4 శ్లో.

ఈ శ్లోకమునకు గోవిందరాజీయ వ్యాఖ్యానమున "గృహీత్వా దేశాంతరా దాగతం బంధుం దృష్ట్వేవ స్వయం గృహీతవతీ. ప్రేక్షమాణా వర్తమానార్ద్రేన శానచా దత్తదృష్టిం నవిచాలితవతీత్యుచ్యతే. సాపూర్వం రావణత్వేన శంకితవతీ. భర్తుః కరవిభూషణం పాణిగ్రహణకాలే హస్తస్పృష్టమాభరణం. కరవిభూషణ మిత్యనేన భోగాతిశయాత్ ప్రణయకోపే ప్రవృత్తే పరస్పరమాలోకన భాషణాది విరహ దశా యాం కాంక్షితే భాషణే మానాతిశయేన మౌనేకృతే రామోంగుళీయకం భూమౌ చ్యావయతిస్మ. తదా వ్యాజేన చ్యుత మంగుళీయక మితి సీతయాభిభాషితే ప్రణయ కోపశైథిల్యాత్ పరస్పరసంశ్లేషో భూయోప్యభూత్. ఏవం ఘటకభూతం కర భూషణం భర్తారమివ సంప్రాప్తా. అంగుళీయక దర్శనాత్తస్య కాంతస్య కరం స్మృతవతీ. తత్స్మృత్వా బాహుం తత్స్మరణేన తద్విగ్రహం ఏవం భావనాప్రకర్షేణ తం పురస్థితమివ మత్వా తమాలింగితవతి. జననీబుధ్యా మునిత్వం ప్రాప్తేవేత్యాహ జననీకృతభోగస్య అవర్జ్యత్వాత్. జానకీ శోకహర్షాభ్యాం క్లేష్టు మనస్వైకులే జాతా ముదితా భవత్. ఇయమిదానీం ముదితా. ఉదర్కే కిం భవిష్యతీతి న జాన ఇత్యా హరిః తనిశ్లోకీ" అని వివరింపఁబడినది. "అంగుళీయకము గ్రహించి వారని దృష్టిఁ బరికించుచుఁ బాణిగ్రహణ సమయమున స్పృష్టమైన యీ కరభూషణము ప్రణయ కుపితులగు దంపతుల పరస్పరాలింగన సౌఖ్యమునకు హేతువైన దగుట దద్భావనాభావితాంతఃకరణ యగు సీత భర్తృ సమాగమ ప్రాప్తి సంభవించిన యట్లు సంతసించిన ద"ని చెప్పఁబడినది. ఇయ్యర్థము శ్రీరామకథాఽమృతమునఁబ్రతిపాదింపఁ బడి వ్యాఖ్యానానుసరణముగా ననువదింపఁ బడినది.

అని యర్పించిన నందిపుచ్చికొని నెయ్యం బొయ్యన న్మీల న
వ్వనజాతాయతనేత్ర భర్తృపదభావస్ఫూర్తి తద్భూషణం
బునఁ బెంపొంద నిమేష మొల్లని గుణోద్భూతిన్ దృగైక్యంబు నె
ట్టన సంధిల్ల రసాలసత్వకలనాఢ్యత్వమ్ము శోభిల్లఁగన్

— సుం. కాం.-2 ఆ., 354 ప.

ఆ భూషణము నందు భర్తృపద భావస్ఫూర్తి పెంపొంద రెప్పపాటును సహింపక తదేకదృష్టితో దర్శించి మధురానుభూతి నలరిన దనుట హృద్యము. ఘటియు నాయము ముద్రిక నక్కున జేర్చి మొగమూన గద్దియుంచి చెక్కులఁ దార్చి

చల్లని తియ్యని పలుకులు పారవశ్యమునఁ బలికినట్లు చెప్పుట యాభరణము నెడఁగల ప్రీత్యతిశయమును బ్రకటించుచున్నది.

అక్కునఁజిక్కఁబట్టి మొగమానఁ గదియించి మెఱుంగుఁ జెక్కులన్
జక్కని హత్తికోల్చెబిపి చల్లని తీయని పల్కులెవ్వి యో
గ్రుక్కిడి తోడి నెయ్యమునఁగూర్చి తనర్చెను గొంత కొంతుపై
మక్కువ యంగుళీయకము మన్ననఁ జెన్నలరారుచుండగన్

పారవశ్యమంతపవిజేసెఁగాకున్న
మానకెనయు సిగ్గుమలఁచి మమ్ము
నాఁడు గూర్చి తల్లు నేఁడు నా గొడవలు
దలఁచి తరలి తనునె తరళనయన

— సుం, కాం.-2 ఆ., 356—57 ప॥లు

"మమ్ము నాడు గూర్చితట్లు" అనుట ప్రణయకోప ప్రవృత్తిఁబరస్పర మాలోకన భాషణాది విహారములులేని దశ యందు వేడుకొని నభిమానాతిశయమున మౌనము వహించినవేళ రాముడు ముద్రిక భూమిపై బడవేయుట, తన్నిమిత్తముగా నంగుళీయకము జారినదని సీత పలికినంతఁ బ్రణయకోపశైథిల్యము జరిగి పరస్పర సంశ్లేషము సంభవించుట యనునది నిపుణముగాఁ బ్రతిపాదింపఁ బడినది.

వ్రేలిపొత్తున ననిచితి విభుని కడ ని
కేమి గతినుంటివో యిప్పుడెఱుకపడదు
దేశముంబాసి యియ్యుపదేశమునకు
వచ్చితే యనె నద్దేపి వామనేత్ర !—2 ఆ., 358 ప.

"పూర్వము విభుని వ్రేలిపొత్తున నతిశయించితివి. ఇప్పుడికేమి గతి నుంటివో యెఱుక పడదు. దేశమును బాసి యియ్యుపదేశమునకు వచ్చితే" యను టలో జానకి శోకహర్షములు బ్రకటితము లగుచున్నవి. తద్విరహి యగు రాముఁ డేదశఁ గృశించినాఁడో యను భావమున "నికేమి గతి నుంటివో యిప్పు డెఱుక పడదు" అనుట వలన శోకము, నింతకాలమునకు రాముని క్షేమవార్త యందినది గదా యను భావమున "నియ్యుపదేశమునకు వచ్చితే" యనుట వలన హర్షము భావ్యములైనవి.

యుద్ధకాండమున విభీషణ శరణాగతి సందర్భమున రాముఁడు సుగ్రీవునితో "కపోత మొకండు భార్యాహ_ర్త యగు శత్రువు శరణ మని రాఁగా సముచితమగు రీతిఁ బూజించి స్వీయ మాంసభక్షణమున నిమంత్రించె నని వింటివి గదా! వానర శ్రేష్ఠ! ఇంక నావంటివారి విధమేమని చెప్పుదును" అనినట్లు వాల్మీకమునఁ గలదు. [యు. కాం.-18 స., 24, 25 శ్లో॥లు]

ఈ ఘట్టమున గోవిందరాజీయ వ్యాఖ్యానము నందు కపోతవృత్తాంత వివరణముతోఁబాటు "వానరశ్రేష్ఠ!" యను మూలములోని సంబోధనమునకు వానర మొక్కఁటి వ్యాఘ్రభీతునిఁ గాచిన కథ వివరింపఁబడినది. "వానరశ్రేష్ఠ! పునరప్యేకస్తిర్యక్ శత్రుం కిరాతం రరక్షేత్యేనాం కథాం శ్రుణు" అని వానరము వ్యాఘ్రభీతుఁడైన నరుని రక్షించిన కథ వివరింపఁబడినది. గోవిందరాజీయ వ్యాఖ్యానోద్ఘాటితమైన ఈ కథ అనువాదమున నిట్లు పేర్కొనఁబడినది. శ్రీరామకథామృతమున నీ కథావిశేషము—

వానరంబు గాచె వ్యాఘ్రభీతుని నొక్క-
నరునిఁ దన్నుఁ ద్రోచి నయముఁ బాసి
నట్టి వానిఁ జక్కనయ్యెఁ దాఁదనదగు
పలుకు నెఱపఁ జెట్టుపైకిఁ జేరి

బ్రాతిగ నొక వానర మటు
నీతి మెయిన్మెలఁగెఁ దనగ నీ వల్పుఁడవే
కాతర్యమేల మేటివ
నీతరమున వారలం దనిందితచరితా

— యు. కాం.-పూ. భా., 3 ఆ., 88-89 ప॥లు

అని వ్యాఖ్యానానుసరణముగాఁ జెప్పబడినది "సమానానా ముత్తమ శ్లోకో భవ" అను వేదోక్తమగు నాశీర్వాద విధమిందు రమణీయముగఁ బ్రతిపాదింపఁబడినది. ఉన్నత చరితుఁడే యుత్తమ శ్లోకుఁడగుట ప్రసిద్ధము. నీవు నట్టివాడవు కమ్మని యిందు రాముని యుపదేశము.

రామబాణ భయార్దితుఁడగు రావణుఁడు తన యనుచరులతో సంభ్రమించుచు నిక్ష్వాకు కులనాథుఁడైన "అనరణ్యుని" చేతను "వేదవతి" చేతను దనకు గలిగిన శాపము లతోఁబాటు ఉమానందీశ్వర రంభా వరుణకన్యాశాపములఁ బ్రస్తావించుట వాల్మీకమునఁ జెప్పబడినది.

శప్తోఽహం .... ....
ఉమానందీశ్వర శ్చాపి రంభా వరుణకన్య కా
యథోక్తా స్తపసా ప్రాప్తం నమిథ్యాఋషిభాషితమ్
— యు. కాం.-60 స., 11 శ్లో.

ఇట గోవిందరాజీయ వ్యాఖ్యానమున 'ఉమేతి. ఉమాదయశ్చత్వారః తపసా తపః ప్రభావేన యథోక్తాపి యథోక్తవంతః తథా ప్రాప్తం సిద్ధమ్. ఋషి భాషితం నమిథ్యా భవతిహి. నందీశ్వర రంభాశాపావుత్తర రామాయణే ప్రోక్తా. ఉమావరుణ కన్యకాశాపౌ చాన్నైనైవ సిద్ధౌ' అని వివరింపఁ బడినది. ఉమానందీశ్వరాదులు నల్వురు. వారిలో నందీశ్వర రంభా శాపము లుత్తర రామాయణమునఁ జెప్పఁబడినవి. ఉమావరుణకన్యకాశాపము లియ్యెడ రావణుని వాక్యము వలననే తెలియుచున్నవి. మహేశ్వరతీర్థుల తత్త్వదీపికా వ్యాఖ్యానము నందా కథాభాగములఁ గూర్చి 'ఉమాశాపస్తు కైలాసగిరిచలనవేలాయాం రావణ! తే స్త్రీ నిమిత్తం వధ ఇత్యేవం రూప ఇతి జ్ఞేయం' ............ వరుణకన్యకాపుంజికస్థలా. తేన చ తన్నిబంధన బ్రహ్మశాపో వివక్షితః సోఽపి స్త్రీధర్షణ నిమిత్త వధరూపః' అని వివరింపఁబడినది. శ్రీరామ కథాఽమృతమున నీ కథావిశేషములు వ్యాఖ్యానాను సరణముగా ననువదింపఁబడినవి. 'కైలాసగిరి నెత్తు వేళ నుమయు వరుణుని పుత్రిక పుంజికస్థలను నిర్బంధించిన కతనబ్రహ్మయు స్త్రీ నిమిత్తమున మరణము సిద్ధించు నని శపించిరి.

ఉమ కైలాస గిరీంద్ర మెత్తు తఱి స్త్రీ యొప్పున్ నిమిత్తంబుగా
నమరద్వేషణ నీదు చేటున కనెన్ హా నంది యానంది శా
ప మొసంగెన్ గపిరూపు నన్నగితి నీ పక్షంబు వారిన్ బ్లవం
గములే కూల్తు రటంచు రంభ కృతియు న్గాంచెంపఁగాఁ జొప్పడెన్

పుంజికస్థల వరుణుని పుత్రి నొడిసి
నట్టి కతన కఱుఁ డట్టులార్చి తిట్టె
గద యెఱుంగుదు రిమ్మెయి కథలు గొన్ని
మీరుఁ దపసుల నుడిచొప్పు మిథ్య యగునె
— యు. కాం. — పూ. భా., 7 ఆ., 17-18 ప॥లు

ఉత్తరకాండమున రావణుఁడు రంభను పరాభవింప దీనవదనయై యేగి నలకూబరునితో నాతని దౌష్ట్యము విన్నవించినది. అది విని నలకూబరుఁడు క్రుద్ధుఁడయ్యుఁ గ్రోధమాచుకొని ధ్యాన నిమగ్నుఁడైనట్లు వాల్మీకమునఁ గలదు.

ఏతచ్ఛ్రుత్వాతు సంక్రుద్ధస్తదా వైశ్రవణాత్మజః
ధర్షణాం తాంపరాం శ్రుత్వా ధ్యానం సంప్రవివేశహ
— ఉ. కాం. — 26 స., 50 శ్లో.

గోవిందరాజీయమున నీ శ్లోకమునకు 'ధ్యానం సంప్రవివేశేతి ఏతదుక్తః సత్యోవాఽసత్యోవేతి జ్ఞాతుమితిశేషః' అని 'తద్వచన మిథ్యాతథ్య నిర్ణయార్థమై ధ్యానము వహించె' నని వివరణము గావింపఁబడినది. శ్రీరామ కథాఽమృతమున నయ్యది వ్యాఖ్యానానుసరణముగాఁ జెప్పబడినది.

అనుచు మొత్తుకొనెడు నత్తలోదరిఁజూచి
తనదు క్రోధమాఁచి తలయు నూఁచి
ధనద తనయుఁ డొనరు ధ్యానంబుఁ జొరఁబాఱెఁ
గల్ల నిజము లెల్లఁ గాంచ నెంచి
— ఉ. కాం, పూ. భా., 6 ఆ., 68 ప.

'సత్యోవాఽసత్యోవేతి జ్ఞాతుమ్' అనున దిట 'గల్ల నిజము నెల్లఁ గాంచ నెంచి' అని యనువదింపఁ బడినది. ఇట్టి ధీర గంభీర భావోన్నతునిగాఁ జెప్పుట నలకూబరుని పాత్రచిత్రణమునఁ బ్రశస్తత సంపాదింపఁబడినది.

అగస్త్యుఁడు హనుమంతుని బాల్యమును వర్ణించుచు 'తన్ను మ్రింగ వచ్చిన బాలుని దోషజ్ఞుఁడుకాఁడీతఁడనియు, మున్ముం దధిక భారమాతనిపై యాయత్తమైనదనియు సూర్యుడు దహింపలేదని వాల్మీకమునఁ జెప్పబడినది —

శిశురేష స్త్వదోషజ్ఞ ఇతిమత్వా దినేశర్వః
కార్యం చాత్ర సమాయ త్త మిత్యేవం న దదాహ సః
— ఉ. కాం. — 36 స., 30 శ్లో.

ఈ శ్లోకమునకు తిలకవ్యాఖ్యానమున 'అదోషజ్ఞఃసూర్య సమీపగమనే మాం దహేదితి దోషానభిజ్ఞః' అని వివరణము గావింపఁబడినది. శ్రీరామ కథాఽమృతమున నది —

ఉష్ణకిరణుండు నస్థు కదుష్ణుఁడగుచు
నెఱుగఁడీ యర్భకుండు తానెదియు ననుచు
నధికమగు కార్యభారమాయ త్త మితని
యందనుచు నూరకుండె దాహంబు మాని
— ఉ. కాం. - పూ. భా., 8 ఆ., 34 ప.

యని యనువదింపఁబడినది. 'అదోషజ్ఞః' అను మూలమునకు 'సూర్యుని సమీపమున కేగ నాతఁడు దహించునను విషయ మెఱుంగనివాఁడ' ని చెప్పఁబడిన వ్యాఖ్యాన విశేషమును 'నెఱుగఁడీయర్భకుండు తానెదియు ననుచు' అని యనుసరింపఁబడినది. 'దినేశ్వరః' అనునది యనువాదమున 'ఉష్ణకిరణుండు' అనుట సాభిప్రాయము. 'శిశుః' అనునది 'యర్భకుండు' అనుట చక్కని అనువాదము. సార్థకము.

ఇట్లు శ్రీరామ కథాఽమృతమున వాల్మీకి రామాయణ వ్యాఖ్యాన విశేషములు పెక్కు సందర్భము లందు సముచితముగ ననువదింపఁబడి విబుధ జనామోద యోగ్యము లగుట ప్రశంసార్హము.

---

అంజనగన్న నోము ఫల మర్క ఫలీకరణోద్యతుండు మృ
త్యుంజయ వీర్యుఁ డ స్త కులిశోద్ధతి దేవవరాంచితుండు ధీ
రంజిత భానుసూనుఁ డిత రామపదుం డవనీసుతా విప
ద్భంజనుఁ డస్రపాంతకుఁడు పావని పావన మూ ర్తి ప్రోవుతన్.
శ్రీ. రా. క. బా. కాం. 1 ఆ. 8 ప.

R–18 ]

# అధ్యాత్మరామాయణానుసరణము -
## అమూలకాధ్యాత్మిక భావోద్ఘాటనము

1. కథానువాదము
2. అధ్యాత్మిక విషయానువాదము
3. అమూలకాధ్యాత్మిక భావోద్ఘాటనము

వాల్మీకి రామాయణానంతరము 24 ఆర్ష రామాయణము లావిర్భవించినవి. అవి వాల్మీకి రామాయణమునకు వ్యాఖ్యానప్రాయములని ప్రాచీన పండితుల విశ్వాసము.[1] అట్టి రామాయణము లన్నింటను బహుళ ప్రచారప్రసిద్ధుల నందినది అధ్యాత్మరామాయణము. శ్రీతాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు వాల్మీకి రామాయణము ననువదించుచు నధ్యాత్మరామాయణమును గూడ యథాక్రమముగఁ గలిపి యనువదించి శ్రీరామకథామృతమును సంతరించినారు. ఆ కావ్యమున నధ్యాత్మరామాయణానుసరణ మెట్లున్నదో యనుశీలించుట అత్యంతావశ్యకము. ప్రస్తుత వ్యాసమున నావిషయము ప్రస్తావింపఁబడుచున్నది.

'ఆత్మాన మధికృత్యకృతం అధ్యాత్మం అధ్యాత్మంచ తత్ రామాయణంచ అధ్యాత్మరామాయణమ్' అని అధ్యాత్మరామాయణ శబ్దమునకు వ్యుత్పత్తి. ఇట ఆత్మ శబ్దము చేతవాల్మీకి రామాయణమున కాత్మయగు / వ్యంగ్యమగు / తత్త్వము చెప్పఁబడుచున్నది. దానిని ప్రధానముగాఁ జేసికొని చెప్పఁబడిన రామకథ గలది గావున నది అధ్యాత్మ రామాయణ మని ప్రాచీన సంప్రదాయోక్తి.

వాల్మీకి రామాయణముననే విశ్వామిత్రుఁడు పలికిన 'అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్'[2] అను వాక్యమునను పరశురాముఁడు వచించిన 'అక్షయ్యం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరమ్'[3] అను మాట యందును రాముఁడు పరమాత్మ యనియు, సీతా వర్ణనమునకు సంబంధించిన 'మాయామివచ రూపిణీమ్' అను వాక్యము నందు సీత ప్రకృతిస్వరూపిణియనియు వ్యంగ్యముగ సూచింపఁబడిన దనియు మఱికొన్ని కథాఘట్టములు గూడ పై విషయమునకు దోహదమొనరించుచున్న వనియు పెక్కండ్రు పండితు లుదాహరించియున్నారు.[4]

---

1. శ్రీరామాయణసారోద్ధారము - బాలకాండ పీఠిక
2. బా. కాం. - 19 స., 14 శ్లో.
3. బా. కాం. - 76 స., 17 శ్లో.
4. క. శ్రీమద్రామాయణ నవనీతము పు॥లు 40, 41
   చ. తెలుగు సాహిత్యము - రామకథ పు. 29

రామాయణ మందలి 'రహస్యంచ ప్రకాశంచ యద్వృత్తం తస్యధీమతః,[1] అను వాక్యమందలి రహస్యంచ అను పదమునకు రామాయణమున ఆత్మపరమైన అర్థము రహస్యముగఁ గలదనియు దానిని మిగిలిన రామాయణములు, కొన్ని పురాణములు వివరించిన వనియుఁ బండితలోకమునఁ బ్రసిద్ధము.

'రామకథానామ్ అమృతమ్ రామకథాఽమృతమ్' అను భావముతో శ్రీరామకథాఽమృత కావ్యము రచింపఁబడుటచే నధ్యాత్మరామాయణమందలి ఆత్మతత్త్వము గూడ వాల్మీకి రామాయణానువాదమున సమయోచితముగ స్థానము సంపాదించుకొనినది. శ్రీ వేంకటప్పయ్యశాస్త్రివర్యులు శ్రీరామకథాఽమృత కావ్యపీఠికలో శ్రీ వాల్మీకి సంయమి వరకృతి నాంధ్రీకరించుచు నధ్యాత్మరామాయణ ఘట్టము లిందుఁ జేర్చుచు.... మునిభావ రహస్య వివరణం బొప్పఁగా' తామీగ్రంథము ననువదింపఁబూనినట్లు పేర్కొనినారు.

కేవల తత్త్వోద్ఘాటనమే యొనర్చినచో నది సర్వులకు సులభగ్రాహ్యము కాని యొక వేదాంత గ్రంథము కాఁగలదు. దానినే యొక కథలో మిశ్రిత మొనర్చి రచించిన రుచ్యమై బహుజనాస్వాద యోగ్యమగును. కావున శ్రీ శాస్త్రిగారు రామాయణానువాద సందర్భమున నధ్యాత్మ రామాయణమును గూడఁ గలిపినారు. ఇట్టి రచనము గుణవత్తరమైనది. వాల్మీకి వ్యాసాది ఋషి సంప్రదాయ మిట్టిదేయగుట ప్రశంస్యము.

శ్రీరామకథాఽమృతమున కొన్ని అధ్యాత్మరామాయణ కథా ప్రధాన ఘట్టము లనువదింపఁబడినవి. కొన్ని అధ్యాత్మిక విషయ ప్రధాన సందర్భములనుసరింబడినవి. సందర్భోచితముగ నమూలకములగు కొన్ని తత్త్వ విషయములు ప్రతిపాదింపఁబడినవి.

శ్రీరామకథాఽమృతమున నాద్యంతము శివుఁడు పార్వతితో రామకథను జెప్పి నట్లు వర్ణింపబడినది. ఇది యధ్యాత్మరామాయణాను సరణము.

అధ్యాత్మరామాయణమున బాలకాండము నందు పార్వతీపరమేశ్వర సంవాద ప్రకారమనుపేర రామకథాతత్త్వము 19 శ్లోకములలో వివరింపఁబడినది[2] శ్రీరామకథాఽమృతమున నీఘట్ట మధ్యాత్మ రామాయణానుసరణముగ 24 పద్యములలో వర్ణింప బడినది.[3]

---

1. వా. రా. - బా. కా. 5 స.
2. అ. రా. - బా. కాం.. 1స , 6-24 శ్లో॥లు
3. శ్రీ. రా. క. - బా. కాం., 1అ, 157-80 ప॥లు

పాయసాన్నప్రదాన ఘట్టమున వాల్మీకి రామాయణమునకు అధ్యాత్మ రామాయణమునకు వ్యత్యాసముఁ గలదు. అధ్యాత్మ రామాయణమున దశరథుడు ముందుగా పాయసమును రెండు భాగములు చేసి యొకభాగము కౌశల్యకు, మరియొక భాగము కైకకు విచ్చెననియుఁ దర్వాత వచ్చిన సుమిత్రకు, కౌసల్య కైక, తమ భాగము లందర్ధ మర్ధముఁ బ్రీతితో నొసంగి రనియుఁగలదు. (అ. రా. బా. కా. 3స. 10-12-2)

ఈ ఘట్టము శ్రీరామకథాఽమృతమున నధ్యాత్మరామాయణాను సారముగనే యనువదింపఁబడినది. (బా. కాం. 21 ఆ 297-78 పు॥లు)

దశరథుఁడు తనయులలోఁ బ్రథమునకు రాముఁడని నామకరణముఁ జేసినట్లు 'జేష్ఠం రామం మహాత్మానం' [1]అని వాల్మీకమునఁ గలదు. అధ్యాత్మమున మునులు యోగమున నెవని యందు రమింతురో యతఁడు రాముఁ డనియు, రమణుఁడు గావునను రాముఁ డనియు వశిష్ఠునిచేఁ జెప్పఁబడినట్లు గలదు.

యస్మిన్ రమన్తే మునయో విద్యాయాఽజ్ఞానవిప్లవే
తంగురుః ప్రాహ రామేతి రమణాద్రామ ఇత్యపి

— బా. కాం. — 3 స., 40 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నయ్యది —

విద్యచే నజ్ఞానభావంబు వెడల నెవని
యందు యోగులు రమియింతు రట్టి ఘనుఁడు
రాముఁ డితఁడయ్యె మఱియుఁ దా రమణమునను
రాముఁడగు నని ముని భవ్యనామధేయ

— బా. కాం. — 3 అ., 109 ప.

అని యధ్యాత్మానుసరణముగా ననువదింపఁబడినది. రామలక్ష్మణులు భరత శత్రుఘ్నులు కలిసి మెలఁగుటకుఁ గారణము పాయసాంశ మని యెన్నుచు నధ్యాత్మ రామాయణమున —

---

1. బా. కా. — 18 స., 21 శ్లో.

లక్ష్మణో రామచన్ద్రేణ శత్రుఘ్నో భరతేనచ
ద్వంద్వీభూయచ రక్తౌ తౌ పాయసాంశానుసారతః
— బా. కాం. — 3 స., 42 శ్లో.

అని కలదు. శ్రీరామకథామృతమున నయ్యది యథామూల మనువదింపఁ బడినది.

రాముఁబాయఁ డెపుడు రమణిరో ! లక్ష్మణుం
డటులె భరతుఁ బాయఁ డతని తమ్మ
డందగించె ద్వంద్వమై వారు మెలగుఁట
లౌనె యెంత పాయసాన్నమహిమ
— బా. కాం. - 3 ఆ., 157 స.

తాటకా సంహార ఘట్టమున నధ్యాత్మరామాయణము నందు 'రామ బాణమునఁ గొట్టబడి తాటక యరణ్యమున రుధిరమును గ్రక్కుకొనుచు పడినదై యంతలో సుందరమగు నతివ రూపమును ధరించి రామునకు నమస్కరించి తదాజ్ఞఁబడసి దివమున కేగెన'సి వర్ణింపఁబడినది ( బా. కాం. 4 స. 30. 32 శ్లో॥లు ) శ్రీరామకథామృతమున నయ్యది మూలానసరణముగా నాంధ్రీకరింపఁబడినది' (బా. కాం. 5 ఆ. 371, 286, 298 స॥ లు)

ఈ సందర్భమున 'తాటకాకృత స్తవము' మూలాధికముగా 9 పద్యములలో వర్ణింపఁబడినది. [1] అనువాదమున నస్త్రము మంత్రపూతముగఁ బ్రయోగింప నగు నను రహస్యము వివరింపఁబడినది. తాటకావధ జగత్ప్రమోద సంధాయి యగుననియుఁ జెప్పఁబడినది. మరియు నాయమ 'మేఘమాలఁ దొఱఁగి మెఱయు చందురు రేక చెలువ మలవరించి' మెరయుచున్నదను నౌపమ్యము సుందరము. ఆమె శాపముక్త యగుట నది సూచించుచున్నది. ఆమె 'మనము తదియాంఘ్రి కమల మగ్నతఁ బొదలుట' భక్తిభావమునకుఁ, బరాకాష్ఠ. వాల్మీకమున వియ్యెడ 'శరేణోరసి వివ్యాధ సా పపాత మమారచ' — బా, కాం. - 26 స., 26 శ్లో. / అనియే కలదు.

1. శ్రీ. రా. క. - బా. కాం., 5 ఆ., 287 - 95 ప॥ లు

గౌత మాశ్రమ వర్ణన ఘట్టమున నకృత్య మొనరించిన యింద్రునిఁ జూచి గౌతముఁడు "సహస్ర భగవానుఁడవుకమ్మని". శపించుట, అహల్యను "శిలవు గమ్మి"టయని శాసించుటయను కథాభాగము లధ్యాత్మ రామాయణానుసరణములు (శ్రీ. రా. క., 7. ఆ. 44 ప.)

శివధనుర్భంగ ఘట్టమున 'దేవతలు పుష్పవృష్టి కురిపించి స్తోత్రములతోఁ బొగడిరి. దేవదుంధుభులు మ్రోగినవి. అప్సరసలు నృత్య మొనరించిరి' అని యధ్యాత్మమునఁ గలదు. శ్రీరామకథాఽమృతమున నాఘట్టము 6 పద్యములలో మనోహరమగు సుందరదృశ్యముగాఁ జిత్రింపఁబడినది. [2]

ఆచ్ఛాదయన్తః కుసుమైర్దేవాః స్తుతిభి రీడిరే
దేవదున్దుభయో నేదుర్నన్నృతు శ్చాప్సరోగణాః
— ఆ. రా. - బా. కాం., 6 స., 27 శ్లో.

అందు దేవదుందుభులు మ్రోగిన విధముఁ దెలుపుచు శ్రీరామ కథాఽమృతమున —

నహి భయం జహిరయం నాక నాయక తిష్ఠ
సానంద మానంద యస్వ మనుచు
రఘుసింహ శిశునా నిరస్తాని భవధభో
ర క్షాంసి రక్షా విలక్ష మనుచు

అస్తి దాశరథి ర్దయాశరధిర్వ్యాథ
శరధిర్ధుతాశర శ్శరణ మనుచు
సేయం వృణోతి సర్వేశ్వరీ శ్రీరముం
మహితో మహా న్మహోస్మాక మనుచు

1. బా. కాం. - 48 ప., 30 శ్లో.
2. శ్రీ. రా. క. - బా. కాం., 9 ఆ., 150-56 ప॥లు

స్వర్గ విజయస్వ రచయ రంజన మటంచు
మ్రోగె వినువీధి నిరపాయముగ సురేంద్ర
మానసోల్లాస కలనాను మాపకములు
దేవదుందుభు లత్తఱి దివిజ వినుత

— బా. కాం. - 9 ఆ., 152 ప.

ఇట్లు వర్ణించుట మిక్కిలి యౌచిత్యము. దేవతలు సంస్కృతమున భాషించుదురుఁగావున దుందుభులు తదనుగుణముగా దేవభాషలో మ్రోగిన వనుట హృద్యము. ఇట్లు మూలము నందలి భావము స్పష్టముగా వివరింపఁబడినది. అధ్యాత్మ రామాయణానుసరణమున నిది మూలాధికతకుదాహరణము.

అయోధ్యాకాండమున కల్యాణానంతరము తల్లిదండ్రులకుఁ బ్రీతిఁ గూర్చుచు సుఖమున్న రాముని( జేరి నారదుఁడు రాక్షస వధారూపమగు కర్తవ్యమును స్మరింపఁజేసి యాతనిచే నభయమును గొనినట్లు అధ్యాత్మ రామాయణమున 41 శ్లోకములో వర్ణింపఁబడినది. [1]

శ్రీరామకథాఽమృతమున నది ముప్పది పద్యములలో యథామూల మనువదింపఁ బడినది. [2] మూలమున నారదాగమనము శ్రీరామపట్టాభిషేకోత్సవ ప్రకటనకుఁ బూర్వమే వర్ణింపఁబడినది. శ్రీరామకథాఽమృతమున పట్టాభిషేక వార్త విని భయపడిన దేవతలు బ్రహ్మదేవుని ద్వార నారదునిఁ బంపినట్లు లన్యథాకరింపఁ బడినది. అనువాదమున నిట్టి మార్పు సందర్భోచితమై వెలయుచున్నది.

'దేవాసుర సంగ్రామ సమయమున దశరథుఁడు దేవతలకు సాయ మొనరింపఁబోయెను. కైకయు నాతని ననుసరించినది. యుద్ధము నందు రథచక్రపు టిరుసునకుఁ గల మేకొకటి ఖండితమై పడినది. అది దశరథుఁ డెఱుఁగఁడు. నీవయ్యెడ ధైర్యముతో చేయి పెట్టి నిలిపితివి' అని మంథర స్మరింపఁజేసినట్లు లధ్యాత్మమునఁ గలదు.

---

తదాఽక్షకీలోన్యపత చ్ఛిన్న స్తస్య నవేద సః
త్వంతు హస్తం సమావేశ్య కీలరంధ్రేఽతి ధైర్యతః

— అయో. కాం. - 2 స. 68 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నది 'తేరిచీలత్రాల నేరిమి నెఱపితివ' ని యను వదింపఁబడినది.

శ్రీరాముఁ డరణ్యవాసమునకై కేఁ బోవ నిశ్చయించి ప్రతిజ్ఞ నలుపుచు పితృ కార్యనిర్వహణము పుత్రున కవశ్య కర్తవ్యముగా నెన్నుచు 'నెవఁడు తండ్రిచే నాజ్ఞా పింపఁబడకున్ననుఁ బితృకార్యము సేయుచున్నాఁడో వాఁడుత్తముఁడు. తండ్రిచేఁ జెప్పఁబడి చేయువాఁడు మధ్యముఁడు. పితృ నియుక్తుఁడయ్యు నాచరింపనివాఁ డధముడు' అని తలపోసె నట్లధ్యాత్మ రామాయణమునఁ గలదు.

అనాజ్ఞప్తోఽపి కురుతే పితుః కార్యం స ఉత్తమం
ఉక్తః కరోతి యఃపుత్రః స మధ్యమ ఉదాహృతః
ఉక్తోఽపి కురుతే నైవ సపుత్రో మల ఉచ్యతే
— అయో. కాం. — 3 స., 60, 61 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమున నది —

చెప్పక మును గురు నిష్టం
బొప్పగ నొనరించుఁవాడె యుత్తముఁ డొకటన్
జెప్పఁగ జేయును మధ్యముఁ
డప్పని విని తలఁగు మూఢుఁడధముఁడయెందున్
— అయో. కాం. — 3 ఆ., 123 ప.

అని యథామూలముగా నాంధ్రీకరింపఁ బడినది.

శ్రీరామాదులు చిత్రకూటమును జేరి వాల్మీకి మహర్షిని సందర్శించినట్లు మాత్రమే వాల్మీకమునఁ గలదు.

ఇతి సీతాచ రామశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః
వేభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్
— అయో. కాం. — 56 స., 16 శ్లో.

అధ్యాత్మ రామాయణమున వాల్మీకి రాముఁని బూజించి రామ మహాత్మ్యము

నభివర్ణించి, నిజ పూర్వవృత్తాంతం బెఱింగించినట్లు 46 శ్లోకములలో వర్ణింపఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలానుసరణముగా 58 పద్యములలో నాంధ్రీకరింపఁ బడినది.[2]

పూజయిత్వా జగత్పూజ్యం
భక్త్యాఽర్ఘ్యాదిభి రాదృతః – అయో. కాం.-6 స., 48 శ్లో.

అని వాల్మీకి భక్తితో రాముని నర్ఘ్యపాద్యాదులతోఁ బూజించె నని మూలమునఁ జెప్పఁబడినది. శ్రీరామకథాఽమృతమున నయ్యెడ మూలాధికముగా రామమయ మానసుఁడై వాల్మీకి సమర్పించిన 'వాచికార్చలు' తత్త్వార్థ సంభృతములై యాతని మహర్షిత్వమునకు నిదర్శనముగా నెగడుచున్నవి. (అయో. కాం. 5 ఆ., 307-9 ప॥లు

ఋషి దృష్టిలో రాముఁడు పరబ్రహ్మ. ఆనంద రసాత్మకమగు పరం జ్యోతి స్వరూపము.

భరతుఁడు రాము నయోధ్యకు రమ్మని, యభిషిక్తుఁడవై రాజ్యమేలు మని కోరినాఁడు. పితృవాక్య పరిపాలనవ్రతుఁడైన రాముఁ డందుల కంగీకరింపక భరతుని యభ్యర్థన ననుసరించి, పాదుకల నిచ్చి పంపుచుఁ గైకను పరిభవింపక గౌరవింపు మని చెప్పెను. అందుఁ బ్రయాణ సన్నాహమున నుండ నదను జూచుకొని కైక కౌసల్యా నందను రాము నభినందించి స్తుతించుట, కైకను రాముఁడూరడించి వరము లొసంగుట యను కథాభాగ మధ్యాత్మరామాయణమున 14 శ్లోకములలో వర్ణింపఁ బడినది.[3] శ్రీరామకథాఽమృతమున నది మూలభావానుసారముగా 22 పద్యములలో నిబంధింపఁ బడినది.[4] విషయవివరణ మాంధ్రీకరణమున నధికము.

అరణ్యకాండమున రామాదులు దండకారణ్యమునఁ బ్రవేశించునపుడు రాముఁడు లక్ష్మణునితో 'ఇటనుండి ప్రయత్నపరులమై ధనువు నెక్కిడి శరములు కరముల ధరించి జీవాత్మ పరమాత్మముల నడుమ మాయ వలె సీత మన యిరువురి నడుమ నడువఁగా జాగరూకులమై సంచరింపవలె న' నినట్లు లధ్యాత్మమునఁ గలదు.

---

1. అ. రా. – అయో. కాం., 6 స., 43-88 శ్లో॥లు
2. శ్రీ. రా. క. – అయో. కాం., 5 ఆ., 303-360 ప॥లు
3. అ. రా. – అయో. కాం., 9 ఆ., 305-26 శ్లో॥లు
4. శ్రీ. రా. క. – అయో. కాం., 9 ఆ., 305-26 ప॥లు

ఇతఃపరం ప్రయత్నేన గన్తవ్యం సహితేన మే
ధనుర్గుణేన సంయోజ్య శరానపి కరేదధత్
అగ్రేయాస్యామ్యహం పశ్చా త్త్వ మన్వేహి ధనుర్ధరః
ఆవయో ర్మధ్యగా సీతా మాయే వాత్మ పరాత్మనోః
— అర. కాం. — 1 స., 12, 13 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమున నయ్యది —

.............. ధృఢ వివేకమూని సంస్కృతినట్లు
దీనమెలఁగ వలయు దీప్తశరుల
మగుచు మనకు నడుమ నవనిజ జీవేశ్వ
రాంతరస్థ మాయ యనఁ బొసంగ
— అర. కాం. — 1 ఆ., 38 ప.

అని యథామూలముగా నాంధ్రీకరింపఁ బడినది.

రాముఁడు విరాధుని సంహరించి ఖననమొనరింప నాతఁడు దివ్యపురుషుఁడై రామునితో తనకు రాక్షసత్వము ప్రాప్తించిన విధమెఱింగించినట్లు వాల్మీకమున ఆరు శ్లోకములలోఁ గలదు.[1] అధ్యాత్మ రామాయణమున నా విరాధుఁడు గంధర్వ రూపము దాల్చి విశేషముగా రాముని స్తుతించి యాతని సెలవు గైకొని దివమునకు వెడలినట్లు కలదు. ( అ. రా. అర. కాం, 1 స. 36-42 శ్లో॥లు )

శ్రీరామకథాఽమృతమున నియ్యది యథామూల మాంధ్రీకరింపఁ బడినది, ( అర. కాం. 1 ఆ. 83-6 ప॥లు )

రావణుని ప్రేరణమున మారీచుఁడు మాయామృగరూపముఁ దాల్చి పంచవటిఁ జేరకమున్నె రాముఁడు సీతతో 'రావణుఁడు భిక్షురూపమున నిక్కడకు రానున్నాఁడు. నీవగ్ని తేజోంతర్హిత వై యుండి మాయారూపము ధరించి లంకఁజేరి రావణవధానంతరము నిజరూపమును బొంది నన్ను జేరుదువని చెప్ప నామె యట్లే చేసినట్లు లధ్యాత్మ రామాయణమునఁ గలదు. (అర. కాం. 7 స. 2-4 శ్లో॥లు)

---

1. వా. రా. — అర. కాం., 4 స., 14-19 శ్లో॥లు.

శ్రీరామకథాఽమృతమున నయ్యది యథామూలముగా ననువదింపఁ బడినది. (అర. కాం. 2 ఆ, 453-55 ప॥లు)

అనువాదమున రాముఁ డనంతవిలాసుఁ డని చెప్పఁబడినది. సీత నగ్నితేజోంతర్హితగా నుండుమని యాదేశించి తత్కారణముగా లోకకంటకుఁ డగు రావణుని సంహరించుట యా విలాసములలో నొకటి. కావున నది సాభిప్రాయము. అట్లే దేవాంతకుఁ డగు రావణుఁడు "అహంయువు" అనగా గర్వము కలవాఁడు. అతని గర్వమే కన్ను మిన్ను, గాననీయక తుదకాతని వినాశమునకు కారణమైనది, అట్టి గర్వమే మాయాసీత నిజసీతల భేదమును తెలిసికొనలేనివానిగాఁ జేసినది. రావణ సంహారము సురలకు, సాధుపుంగవు లగు మునులకు, శుభమును, సుఖమును, ప్రసాదించునది గావుననే "సురలు మునులు వచ్చి కొలువ రావణుని సంహరించి భవద్యోగముం గనువాఁడ"నని రాముఁడు పల్కినట్లు వర్ణించుట మూలాధికమై భావి కథార్థసూచకమై సహృదయుల నలరించుచున్నది.

కిష్కింధాకాండమున సుగ్రీవుఁడు పట్టాభిషిక్తుఁడై కిష్కింధ యందు సుఖముండి శరత్కాల మేతెంచినను, మిత్రకార్యమును దలబెట్టకుండుట గమనించి హనుమంతుఁడు సుగ్రీవునకు రామకార్యావసర మెఱిగించుట యధ్యాత్మ రామాయణానుసరణము. (4స. 44-8 శ్లో॥లు) (శ్రీ రా. క. కి. కాం. 2ఆ. 105–7 ప॥లు)

అనువాదమున హనుమంతుఁడు "ఇట్టి సంపద వారి యెల కటాక్షపుఁ జూడ్కి గాక యొండొక్కటిఁ గలదె కలుగ' అని సుగ్రీవునితోఁ బలుకుట మూలాధికమై రామ పరాక్రమ ప్రకటనతోఁ బాటుగాఁ దదాశ్రయమునఁ గలుగు సిద్ధిని వెల్లడించుచున్నది, అట్లే "దేవి బాసి విభుఁడు తెలిలుచు నుండ" యనుట రాముని తీవ్ర వియోగవ్యథను స్మరింపఁజేయుచు రామకార్యావసరము నుగ్గడించు చున్నది.

ఈ సందర్భమున "నుపకారికి నపకార మొనరించినవాఁ" డెవ్వఁడు లోకమున వెలయఁ డనియు, దత్కార్యపరీతమానసుఁడు పుణ్యసంపద వృద్ధిఁబొందు ననియు. రాజ్యసుఖసంపద లెల్ల నస్థిరము లనియు, మిత్రయోగలబ్ధియే యధిక మనియు నుపదేశించుట మూలాధికము. (కి. కాం. 2 ఆ 108-9 ప॥లు)

సంపాతి వానరులకు చంద్రనాముఁడను ముని చెప్పిన జీవోత్పత్తి క్రమమును 35 శ్లోకములలో వివరించినట్లు అధ్యాత్మమునఁ గలదు.[1] శ్రీరామ కథాఽమృతమున నది 22 పద్యములలో మూలానుసరణముగా ననువదింపఁ బడినది.[2] అందు జీవుఁ డెన్నడు మరణింపఁడు. ఒక శరీరమును వీడి కర్మాను గుణముగా వేఱొక శరీరమును దాల్చు చున్నాఁడు. అట్టియెడ మాతృగర్భస్థుఁడగు జీవుఁడు తన సమస్త జన్మముల యందలి పూర్వ కర్మములను స్మరించి దుఃఖమునఁ జింతించిన క్రమము వర్ణించుట మనోజ్ఞము.

సుందర కాండమున హనుమంతుఁడు సముద్రమును దాటుట కుద్యమించుచుఁ "ప్రాణములు పోవునప్పుడు ప్రాణు లెవ్వని స్మరించినంత మాత్రమున నపారమగు భవాంభోధిఁ దరించు చున్నారో యట్టి రాముని దూతనగు నాకు సముద్రమును లంఘించు టెంత ? యని సంభావించినట్లు అధ్యాత్మమునఁ గలదు.

ప్రాణప్రయాణసమయే యస్యనామ సకృత్స్మరన్
నర స్తీర్త్వా భవామ్భోధి మపారం యాతి తత్పదమ్
కిం పునః తస్య దూతోఽహం .... ....
తమేవ హృదయే ధ్యాత్వా లంఘయా మ్యల్పవారిధిమ్
— సుం. కాం. — 1స., 4, 5 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమున నయ్యది —

ఎవని నంతకాల మెనయుచో నొకపరి
యేనిఁ దలచి మనుజు లీదువార
లల భవాబ్ధి నతని యలఘు కింకరున కి
క్కడలిఁ గడచు టెంత కమల నయన — సుం. కాం. 1అ., 101 ప.

అని యనువదింపఁ బడినది. మూలమున హనుమంతుఁడు సముద్ర లంఘనమునకు ముందుగా నిట్లు తలఁచినాఁడని యుండ, ననువాదమున హనుమంతుని సముద్ర లంఘనమును వర్ణించు శివుఁ డాతఁ డవ్వలి తీరముఁ జేరినాడని తెలుపుచుఁ బార్వతితో ననినట్లు చెప్పఁబడినది. అనువాదకులు హనుమ పారము ముట్టిన తర్వాత నిట్లు తలపోయుటలో నౌచిత్యము గలదని భావించినట్లు తెలియుచున్నది. సందర్భోచితముగ నిట్టి మార్పు వారి కథాకథనమునకుఁ దార్కాణము.

---

1. అ. రా. — కి. కాం., 8 స., 12 46 శ్లో॥లు.
2. శ్రీరా. క. — కి. కాం., 3అ., 217–38 ప॥లు

హనుమంతుఁడు సీత కడ సెలవు గైకొని కొంత దూర మేగి కార్యాలోచన మగ్నుఁడై 'కార్యార్థియై వచ్చిన దూత యెవ్వఁడు స్వామికార్యమునకు నవిరోధముగా గొంచె మధిక కార్యమును నెఱవేర్పక పోవుచున్నాఁడో వాఁ డధముఁడ'ని భావించినట్లు అధ్యాత్మ మునఁ గలదు.

కార్యార్థ మాగతోదూతః స్వామి కార్యాऽవిరోధతః
అన్యత్కించి దసంపాద్య గచ్ఛత్యధమ ఏవసః

— సుం. కాం. - 3 స., 69 శ్లో.

శ్రీరామకథాऽమృతమున నయ్యది ఉత్తమ, ఉత్తమోత్తమ, మధ్యమ, అధమ, అధమాధమ భేదములతో మూలాధికముగా నిరూపించుట రమణీయము. మూలమున నధమ మొక్కటే పేర్కొనఁబడగాఁ దక్కినవి స్వోపజ్ఞకము లగుట విశేషము. ఇట్టి వివరణము వివేకియగు హనుమంతుని పాత్ర చిత్రణమున విశిష్టతను సంపాదింపఁజేయుచున్నది.

ఒకపనికై చని యొండొక్కఁడునుఁ గూర్చు
యోజన మొనయువాఁడుత్తముండు
తన యొప్పు కొనినది తార్కాణఁగా జేసిఁ
మఱలివచ్చు నతండు మధ్యముండు
తోచినంత లొనర్చి త్రోవఁ బట్టున యేని
దలఁపగా నధముఁ డాతాంత్రికుండు
చెప్పిన కార్యంబు పెడఁగ రిత్తకు రిత్త
యరుదెంచువాఁ డధమాధముండు

మొదలి కర్జమ్మెడలకుండ మూఁడుదారు
లొరసి చూచియుఁ గాకున్నునుక్క మిగిలి
స్వామి యానతిఁ దలమోచి చక్కపఱచి
యొలయనేర్చినవాఁడుత్తమోత్తముండు

— సుం.-కాం. 3 ఆ., 11 ప.

వాల్మీకమున నీఘట్టము నందు —

'కార్యనిర్దిష్టుఁ డగువాఁడు పూర్వకార్యమునకు భంగము లేకుండ నితర కార్యము లెన్నియేని సాధింపవచ్చును, అర్థసాధనమున సమర్థుఁ డగువాఁ డిట్లు సేయ నగును' అని మాత్రమే కలదు. (సుం. కాం. 14 స. 5, 6, శ్లో॥లు)

శుకుఁడగస్త్యమౌనిచే శప్తుఁడై తాను శాపవిముక్తుఁడైన విధము నధ్యాత్మరామాయణమున విపులముగ నిరువది శ్లోకములలో వర్ణింపఁబడినది. [1] శ్రీరామకథాఽమృతమున నది పదిహేడు పద్యములలో యథామూలముగ నాంధ్రీకరింపఁ బడినది. [2] అట్లే యుద్ధరంగమున కుంభకర్ణ విభీషణుల సంభాషణముఁ గూడ నధ్యాత్మరామాయణానుసారముగ [3] శ్రీరామకథాఽమృతమున ననువదింపఁ బడినది. [4]

వాల్మీకిరామాయణమున హనుమంతుఁడు జాంబవంతుని మాట ప్రకారము హిమవత్పర్వతమునకుఁ బోయి యందలి ఓషధి పర్వతమును గుర్తించి యోషధులను దెలియ నశక్యము కాగా నా పర్వతమునే పెకలించుకొని సూర్యోదయమునకుఁ బూర్వమే వచ్చెనని కలదు. అధ్యాత్మరామాయణమున నా కథాభాగమిట్లు కలదు — 'హనుమంతుఁడు ద్రోణాద్రి యందున్న సంజీవినిఁ గొనివచ్చుటకు వెడలినాఁడు. కాలనేమి రావణప్రేరితుఁ డయ్యు తత్త్వముపదేశించి యాతఁడు వినమి తదాజ్ఞ పాటించి హనుమ వచ్చు మార్గమధ్యమున హిమవత్పర్వతము నందు ఆశ్రమము నిర్మించి ముని వేషధారియై యాతనికి మార్గనిరోధముఁ గావింప యత్నించినాఁడు. ఇంతలో పిపాసార్తి యైన హనుమ సరోవరమున దిగి తన్ను మ్రింగ వచ్చిన మకరినిఁ జంపినాఁడు. అయ్యది స్త్రీరూపమును దాల్చి ధాన్యమాలిని యను నప్సరసగాఁ గోచరించి కాలనేమి కుతంత్రమునుఁ దెల్పినది. అది తెలిసి హనుమంతుఁడు తన ముష్టి ఘాతముచే నాతని భగ్నశీలిని గావించి ద్రోణాద్రికిఁ జని యోషధులు గొనివచ్చినాడు.' [5] శ్రీరామ కథాఽమృతమున నీ కథాభాగము అధ్యాత్మరామాయణానుసరణముగా 39 పద్యములలో

---

1. అ. రా. యు. కాం., 5 స., 5-24 శ్లో॥లు
2. శ్రీ. రా. క.- యు. కాం., పూ. భా., 4 ఆ., 136-54 ప॥లు
3. అ. రా.- యు. కాం.- స. 8., 9-15 శ్లో॥లు
4. శ్రీ. రా. క. - కాం., యు. కాం., పూ. భా., 7 ఆ., 328-38 ప॥లు
5. అ. రా. యు. కాం., 6 స., 36-63 శ్లో॥లు, 7 స., 1-33 శ్లో॥లు

ననువదింపఁ బడినది. [1] వాల్మీకమున సంజీవన్యోషధము తెలియక హనుమ పర్వతము గొనివచ్చినట్లు మాత్రమే వర్ణింపఁబడినది. అధ్యాత్మానుసరణ మగుననువాదమున వర్ణితమగు నీకథయందు హనుమంతుని కార్యదీక్ష, రాముని యల్పత్వముఁ జెప్పఁబడి, పాఠకుని యౌత్సుక్యమునుఁ బెంపొందించునదై యున్నది. ఇట్టి సన్నివేశ నిర్వహణ మద్భుతము.

రాముఁడు భార్గవుని యాదేశమున పాతాళహోమము సేయుట, యంగదాదు లద్దాని విఘ్న పరచుట, యధ్యాత్మరామాయణమున 31 శ్లోకములలోఁ జెప్పఁబడినది. [2] [3] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలాధికముగా 85 పద్యములలో ననువదింపఁబడినది. [3] అనువాదమున రాముఁడు తన యసహాయస్థితి శుక్రాచార్యునితో మొరపెట్టుకొనుట వర్ణించిన విధము హృద్యము. మూలము —

భగవన్ రాఘవేణైవం లఙ్కా రాక్షసయూథపైః
వినాశితా మహాదైత్యా నిహతాః పుత్రబాంధవాః
కథం మే దుఃఖ సన్దోహ స్త్వయి తిష్ఠతి సద్గురౌ

— అ. రా. యు. కాం., 10 స., 5, 6 శ్లో॥లు

అనువాదము —

నరుఁడు రాఘవుఁడు వానర యూథపులఁగొంచు
దరలినాఁ డంబుధి దాఁటినాఁడు
పలుకోటు లగచరు ల్చలిసిరా మన లంక
నలమినాఁ డెల్లరఁ దఱిమినాఁడు
లగ్గ వెక్కి మహాబలముల నొక్కట మారి
మసఁగినాఁడేడై బ నెసఁగినాఁడు
పుత్రుల బంధులఁ బొలియించి నాపయి
వాలి నాఁడన్నిఁటఁ జాలినాఁడు

1. శ్రీ. రా. క.- యు. కాం., పూ. భా., 9 ఆ., 743-871 ప॥లు
2. అ. రా.- యు. కాం., 10 స., 5--35 శ్లో॥లు
3. శ్రీ. రా. క.- ఉ. కాం. పూ. భా., 10 ఆ., 9-95 ప॥లు

నా యలవుతోడి చలమొంట నవయఁజొచ్చె
నేమి చెప్పుదునయ్య నీ యెలమి గలుగ
నెల్లెడల ముంపఁదేల్పంగ నితఁడె నేర్చు
ననఁబొగడు గంటి నేఁడిట్టు లగడుగంటి

యు. కాం.- 10 ఆ. 14 ప.

రాముని నాభిదేశమున నమృతభాండము గలదని వివరించి యనలాస్త్రమున దాని శోషింపఁజేయు మని విభీషణుఁడు తద్వధోపాయముఁ జెప్పుట యధ్యాత్మమునఁ గలదు — యు కాం.- 1 . స. 52-54 శ్లో॥

శ్రీరామకథామృతమున నయ్యది మూలానుసరణముగా ననువదింపఁబడినది. యు. కాం., పూ. భా. 10 ఆ. 388-90 ప॥లు

ఉత్తరకాండమున నవతారోప సంహారమునకై దేవత లేకాంతమున సీతతోఁ బలికిన పలుకులు సీత రామునకు నివేదించినది. అది విని రాముఁడు సీతా పరిత్యాగ పద్ధతి వివరించి 'నీవు వాల్మీక్యాయాశ్రమముఁ జేరి యుండి తదనంతరము తనయులతో వచ్చి ప్రతిజ్ఞ సలిపి భూవివరము ప్రవేశించి వైకుంఠముఁ జేరుము. నేనును పిమ్మట రాగలను' అని సమాధానించుట యధ్యాత్మమునందు 13 శ్లోకములలో గలదు.[1] శ్రీరామకథామృతమున నయ్యది మూలానుసరణముగా ననువదింపఁబడినది.[2] మూలమున సీతాపరిత్యాగమునకుఁ బూర్వమే యీ ప్రసంగము జరిగినట్లు వర్ణింపఁబడినది. అనువాదమున మాత్రము నయ్యది సీతాపరిత్యాగకథ విన్న పార్వతి 'యట్లు ధర్మపత్ని నడవుల పాలు సేయుటకుఁ గల కారణమేమ'ని యడుగ 'దీని మూలంబు నామూలాగ్రంబు సంగ్రహించి వచించెద' నని శివుఁడు వివరించినట్లు మార్పుచేసి చెప్పఁబడినది. ఇట్టి కల్పన కవుల కథాకథన నైపుణిని వెల్లడించుచున్నది. పార్వతి ప్రశ్నించుచు 'మగల ప్రేముడుల ప్రమాణ మిట్టిది కద! నిండుచూలాలి నడవులఁ

---

1. అ. రా.- ఉ. కాం., 4 స., 32-44 శ్లో॥లు
2. శ్రీ. రా. క.- ఉ. కాం., ఉ. భా., 2 ఆ., 288-310 ప॥లు

ద్రోవ పాపంబుఁ గాకుండునో? 'సూక్ష్మమూహించినన్ ధీరులెంత్తురె?' యనియు నది యట్లుండ

ఈ కథావిధాన మెక్కడనో తెచ్చి
యదికినట్టులుండెఁ బ్రాణనాథ !
సుఖ సుఖాననుండి సుదతి వనంబేల
కోరె, నెట్లు వాదుఁగూర్చె విభుఁడు

రాజుదలఁచికొన్న రావె దెబ్బలు వాదు
లెదిరిమీఁద మోపు టెపుడుఁ గలద
కాకయున్న రాజ్యకాంక్షిణియే? కైక
దానిపేరుఁ జెలుపఁబూన లేదె?

అప్పగిది సిప్పుఁడు గూడ నీ నెపంబున నేదియే నొక యెత్తునెత్తలేదు కద! కాకున్న -

రాముఁ గలవరించు ప్రజయేడ ? రాముని
రామ వెడల నడచు రంగమేడ ?
అయుత వత్సరమ్ము లతిశుచి యననైన
చాన కేటి దూఱు ? ఛావు తుదకు

నాకుం జూడ దంపతు లిరువురు నేకీభవించియే యీ యాట లిటులాడుచున్నారని తోఁచుచున్నది'. (శ్రీ. రా. క. - ఉ. కాం., ఉ. భా. 2 ఆ., 274-79 ప॥ లు) అనియుఁ బలికినట్లు వర్ణించి సామాన్య పాఠకునకుఁ గలుగు సందేహములకు సమాధానముగా భృగుశాపము వివరించి శివునిచేఁ బ్రత్యుత్తరముఁ జెప్పించుట సంవిధాన చాతురి. కవి కథా కథన దక్షత.

ఈ విధముగ శ్రీరామకథాఽమృతముఁ వాల్మీకి రామాయణముతోఁ బాటుగా నధ్యాత్మరామాయణమును గూడఁ గొన్ని ఘట్టములందు మనోజ్ఞముగ ననుసరించినది.

## 2. అధ్యాత్మిక విషయానువాదము :

శ్రీరామకథామృతమున నధ్యాత్మరామాయణ కథా ఘట్టములతోఁబాటు కవులధ్యాత్మిక విషయ ప్రధానములగు ఘట్టములను సైతము ననువదించి తత్త్వోద్ఘాటనకు యత్నించిరి. అవి వారి యధ్యాత్మికోత్తమ సంస్కార నిరూపకము లగుట ప్రశంస్యము.

బాలకాండమున సీత, రామాజ్ఞ ననుసరించి హనుమంతునకు తత్త్వబోధ గావించుచు శ్రీరామహృదయము వివరించుట యధ్యాత్మము నందలి విషయము. [1] శ్రీరామకథామృతమున నది యథామూల మనువదింపఁబడినది. [2] అందు —

> రామం విద్ధి పరబ్రహ్మ సచ్చిదానంద మద్వయమ్
> సర్వోపాధి వినిర్ముక్తం సత్తామాత్ర మగోచరమ్
> ఆనందం నిర్మలం శాంతం నిర్వికారం నిరంజనమ్
> సర్వవ్యాపిన మాత్మానం స్వప్రకాశ మకల్మషమ్
> మాం విద్ధి మూలప్రకృతిం .... .... ....
>
> — బా. కా.- 1 స., 32-4 శ్లో॥లు

అను మూలము శ్రీరామకథామృతమున నిట్లనువదింపఁ బడినది —

> వత్స ! రాముఁడద్వయ పరబ్రహ్మమూర్తి
> సచ్చిదానందరూపుఁడు స్వప్రకాశుఁ
> డమలుఁడు నిరంజనుఁడు శాంతుఁ డఖిలగతుఁ డ
> నామయుఁ డుపాధిముక్త సత్తామయుండు
> ఆదిమధ్యాంత విరహితుం డచలుఁ డతఁడు
> తెలియుమీ భద్రమగుఁగాత ధీసమేత

---

1. — అ. రా. - బా. కాం., 1 స., 30-52 శ్లో॥లు
2. శ్రీ. రా. క., బా. కాం., 1 ఆ. 181-205 ప॥లు

నన్ను మూల ప్రకృతిగాఁ గనంగలిగిన
నజ్ఞ భావంబెడలునయ్య యాంజనేయ

బా. కాం.- 1 ఆ., 187-88 ప॥లు

ఇట సీతారాముల తత్త్వ మెఱుంగ నజ్ఞభావం బెడలు ననుట మూలాధికమై ఫలశ్రుతిగా నెన్నఁదగియున్నది.

రాముఁడు జన్మించిన సందర్భమున శంఖచక్రాది భవ్యచిహ్నములతో శ్రీమన్నారాయణునిగా దర్శన మొసంగ నాతనిఁ గౌసల్య స్తుతించిన విధ మధ్యాత్మము నందలి ఘట్టము. [1] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలభావాను సరణముగా ననువదింపఁ బడినది. [2]

అందు 'పూర్ణస్త్వం పురుషోత్తమః' అనుదానికి అక్షరుఁడగు విరాట్పురుషుఁ డను నర్థము గావున కౌసల్య —

యములు తమేవం విద్వా
నమృత ఇహభవతి ముఖాభిలామ్నాయస్మృతిన్
నెమకెద రెద్దావి మహో
ద్యమ నీవది యనుచుఁ దత్త్వ మరసితిఁజుమ్మీ

— బా. కాం.- 3 ఆ., 45 ప.

అని పురుషసూక్త విధానంబున సంభావించినట్లు స్వతంత్రముగాఁ గల్పింపఁ బడినది. ఇట 'తమేవం విద్వా నమృత ఇహభవతి' ఇత్యాదిగాఁ గల శ్రుతి యమూలకము.

రామపాదస్పర్శచే శిలారూపమును విడిచి ప్రకృతిరూపమును దాల్చిన యహల్య రాముని 'పద్మజ శంకరాదులచే వెదుకఁబడువాఁడు, నానందస్వరూపుఁడు వేదవేద్యుఁడు. నారదాదులచేఁ గీర్తింపఁబడువాఁడు. సమస్త ప్రకృతికి నధికుఁడు పురాణ పురుషుఁడు. సర్వవ్యాపకుఁడు. ఓంకారపదవాచ్యుఁడు. జగన్మయుఁడు. జ్ఞానస్వరూపుఁడు.

---

1. అ. రా.- బా. కాం., 3 స , 16-35 శ్లో॥లు
2. శ్రీ. రా. క.- బా. కాం., 3 ఆ., 40-72 ప॥లు

నవ్యయుఁడు నైన నారాయణునిగా సంభావించి శరణు వేడి నమశ్శతము లర్పించుట' యధ్యాత్మరామాయణము నందు గలదు. [1] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూల భావానుసరణముగా ననువదింపఁ బడినది, [2]

రామాదుల వివాహానంతర మయోధ్య కేగు సందర్భమున పరశురాముఁ డేతెంచి వైష్ణవచాపము నెక్కిడిన రాముని 'సర్వేశ్వరుఁడు సర్వవ్యాపకుఁడు జగత్ సృష్టిస్థితిలయ కారకుఁడగు విష్ణువుగా నెరింగి పూర్వవృత్తాంతమును దలపోసి పుట్టు కృతార్థతం బొరసిన విధ మెంచి రాముని స్తుతించుట, రాముఁడాతనికి వరము లిచ్చుట యధ్యాత్మమునఁ గలదు. [3] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలభావాను సరణముగా ననువదింపఁబడినది. [4]

అయోధ్యాకాండమున వశిష్ఠుఁడు దశరథుని యాజ్ఞ ననుసరించి రాముని పట్టాభి షేకమునకు వ్రతదీక్షితునిఁ గావింప వచ్చెను. రాముఁ డాతని సంభావించినాఁడు. వశిష్ఠుఁ డాతని విష్ణుత్వమును బ్రస్తుతించి, దేవ రహస్యము నవతార ప్రయోజనమునగు రావణవధఁ బ్రస్తావించి 'నీసంబంధమును గోరియే యిక్ష్వాకుల యింటఁ బౌరోహిత్య కృత్య మంగీకరించితిని. నేడది ఫలించినది. లోకమును మోహింపఁజేయు మాయ త్వదధీన మగుట నన్ను మోహింపఁజేయకుండు నట్లు చేయుమ'ని కోరుట యధ్యాత్మము నందలి విషయము.[5] శ్రీరామ కథాఽమృతము నందది యనుసరింపఁబడినది. [6]

రాముని యరణ్యావాసమున కిచ్చగింపని లక్ష్మణుని క్రోధావేశ ముపశమింపఁ జేయుటకై రాముఁడు తత్త్వోపదేశ మొనరించినాఁడు. అవిద్యా మూలకమగు సంసార బంధము నుండి క్రోధాదులను జయించుట ద్వారా ముక్తిని పొందు విధ మిందు విపు

---

1. అ. రా.- బా. కాం., 5 స., 37-65 శ్లో॥లు
2. శ్రీ. రా. క. - బా. కాం., 7 అ., !16-39 ప॥లు
3. అ. రా.- బా. కాం., 7 స., 20-50 శ్లో॥లు
4. శ్రీ. రా. క.- బా. కాం.. 10 అ., 481-69 ప॥లు
5. అ. రా. - అయో. కాం., 2స., 22–32 శ్లో॥లు
6. శ్రీ. రా. క. – అయో. కాం., 1 అ., 230–42 ప॥లు.

లముగాఁజెప్పఁబడినది.[1] అధ్యాత్మము నందలి యీవిషయము శ్రీరామకథాఽమృతమున మూలానుసరణముగ ననువదింపఁబడినది.[2]

రాముని యరణ్యవాసమునకై దుఃఖించుచున్న సాధుజనుల నుద్దేశించి వామదేవుఁడు 'రాముఁడు విష్ణువు, సీత లక్ష్మి, లక్ష్మణుఁడు శేషుఁడు, రాముఁడు మాయతో గూడి యాయా యాకారములు గలవాఁడగు చున్నాఁడు. రజస్సత్త్వ తమోగుణముల నుండి బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపములఁ బ్రవర్తించు చున్నాఁడు. జగద్ధితార్థమై మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశురామ రామావతారములఁ దాల్చినాఁడు దుష్టశిక్షణ శిష్టరక్షణ మాతని కర్తవ్యము. రావణవధార్థమై యాతఁ డడవుల కేగు చున్నాఁడు. తిరిగి వచ్చి మనల సుఖముగాఁ బాలింపఁగలఁడు. రాముని భజింపుఁడు. ముక్తి లభించును. మీరు శోకింప వలదని ప్రబోధించుట యధ్యాత్మమున విపులముగ 20 శ్లోకములలోఁ గలదు.[3] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలాను సరణముగా 16 పద్యములలో ననువదింపఁ బడినది.[4] మఱియు రామనామ మహత్వము నెన్నుచు కలి కల్మషాపహారి యగునని –

రామనామ్నైవ ముక్తిస్స్యాత్ కలౌ నాన్యేన కేనచిత్
– అ. రా.-అయో. కాం., 5స., 27 శ్లో

అని మూలమున నుండ నయ్యది శ్రీరామకథాఽమృతమున

కలికాలుష్యమడంచుఁ ద్రెంచు విపదాక్రాంతిన్ సమర్థించు ని
విష్టలమౌ సంపదఁ దెల్పిఁబెంచు ద్విషదాడంబంబు మాయించు మా
యల మంత్రంబుల సంచు మంచు మిహిరుం డట్లాహరించున్ విని
ర్మల మీరామపదం బెదం జొనిపి సంభావింపుఁ డేవేళలన్
– శ్రీ. రా. క. – అయో. కాం: 4 ఆ., 42 ప.

అని మూలాధికముగా ననువదింపఁ బడినది. ఇట్టిది కవి, రామభక్తి తాత్పర్యములకు విదర్శనమై శ్రీ రామకథాఽమృత రచనోద్దేశమునకుఁ బ్రేరణముగా నెన్నదగియున్నది.

---

3. అ. రా. – అయో. కాం., 4 స.. 18-42 శ్లో॥లు.
4. శ్రీ. రా. క. – అయో. కాం: 3ఆ; 306–26 ప॥లు.
5. అ. రా. – అయో. కాం; 5స; 10-29 శ్లో॥లు
6. శ్రీ. రా. క. - అయో. కాం: 4 ఆ: 28-44ప॥లు

తృణశయ్య నిద్రించుచున్న సీతారాములఁ గాంచి దుఃఖించుచున్న గుహుని యూరడించుచు లక్ష్మణుఁడు 'సుఖదుఃఖములు కర్మవశత సంప్రాప్తించు చుండును. పాపపుణ్యాత్మక మగు కర్మ మవశ్యభోక్తవ్యము, విధివిహిత మగు దానివి సురాసురు లెవ్వరు దాటఁజాలరు. రాత్రింబవళ్ళ వలె సుఖదుఃఖము లొకటి వెంట నొకటి కల్గు చుండును. సుఖముల దుఃఖము, దుఃఖముల సుఖము/నీరును బురద/జలపంకములవలె నొకదానితో నొకటి కలసి యుండును. కావున బుద్ధిమంతుఁడు వీని కన్నింటికి నతీత ముగా నుండఁదగు' నని లోక ధర్మమును వివరించుట యధాత్మమునఁ గలదు.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలానుసరణముగా ననువదింపఁ బడినది. [2]

సుఖస్య దుఃఖస్య నకోఽపి దాతా
పరోదదాతీతి కుబుద్ధిరేషా
అహం కరోమీతి వృథాఽభిమానః
స్వకర్మసూత్ర గ్రధితోహి లోకః

- అ. రా. - అయో. కాం., 6 స. 6 శ్లో.

ఎవఁడొ సుఖదుఃఖములఁ గూర్చు నెడయఁజేయు
ననుచుఁ దిట్టిన దీవించినను ఫలంబు
గలదె స్వార్జిత కర్మము ల్కారణములు
గా నహంకృతి వితయగుం గాదె సఖుఁడ

- శ్రీ. రా. క. - అయో. కాం., 5 ఆ., 132 ప

లక్ష్మణుని ముఖమున నీవిధముగా తత్త్వబోధ గావించుట పాత్రౌచిత్య సంపాదకము.

భరద్వాజుఁడు రామాదుల యాగమనవార్త విని యెదురేగి యర్ఘ్యాదులచే సంభా వించి రాము నుద్దేశించి 'పరమాత్ముఁడవైన నీవు మాయామానుషమూర్తివై జన్మించి

---

1. అ. రా. అయో. కాం. 6స., 5 - 15 శ్లో॥లు
2. శ్రీ. రా. క. - అయో. కాం., 5 ఆ: 131 - 6 ప॥లు

లోకకంటకుల సంహరింప నరణ్యవాసమున కిట్లరుదెంచితివని నేనెఱుంగుదును. నిన్ను బ్రకృతి కంటెను బరుండగు పురుషునిగాఁ దెలిసికొనుచున్న నేను కృతార్థుఁడను' అని పలికినట్లు అధ్యాత్మమునఁ గలదు.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యది యనుసరింపఁ బడినది.[2]

దశరథుని మరణమునకు దుఃఖించుచున్న భరతు నోదార్చుచు వశిష్ఠుఁడు 'జీవితము క్షణభంగురము, ఈ లోకమునఁ బుట్టిన జీవికి మృత్యువు తప్పక సంభవించును, జీవుఁడు కర్మవశమున దేహమునుఁ బొందును. జీర్ణవస్త్రము వలె దీనినిఁ వీడి మరల వేఱొక దేహమును ధరించును. ఆత్మకు చావుపుట్టుకలు లేవు. ఆనంద రూపమగు నాత్మకు జననాది షడ్భావ వికారములు కలుగవు. సత్యజ్ఞాన స్వరూపమున నాశములేనిదై యుండును. కావున మరణమును గూర్చి దుఃఖింపరాద'ని తత్త్వ ముప దేశించుట యధ్యాత్మమునఁ గలదు.[3] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలాను సరణముగా ననువదింపఁబడినది.[4] వాల్మీకమున నీ సందర్భము నందు తత్త్వజ్ఞుఁ డగు వశిష్ఠుఁడు సర్వభూతముల చావుపుట్టుకలఁ గూర్చి వినిపించినట్లు -

> శ్రావయామాస తత్త్వజ్ఞ
> స్సర్వభూత భవాభవౌ ! - వా. రా. - అయో. కాం., 78 స., 3 శ్లో.

అని మాత్రమే కలదు. వశిష్ఠుఁడు తత్త్వజ్ఞుఁ డగుట లోకన్యాయమును వివరించినాఁ డనుటకు వ్యాఖ్యాప్రాయముగా నధ్యాత్మమున నీ తత్త్వమిట్లు చెప్పఁబడినది.

అరణ్యకాండమున రామాదులు సుతీక్ష్ణాశ్రమము జేరఁ ముని విధి విధానముగాఁ బూజించి 'సీతాపతీ ! నేనెల్లప్పుడు నీ మంత్ర జపముఁ జేయువాఁడను. నీదాసాను దాసుఁడను. సంసార సముద్రమును దాటుటకు నీ పాదములే యోడ యగును. లోకము లెల్ల నీమాయచే పరిభ్రమించు చున్నవి. అజ్ఞానమున దేహబుద్ధి గల నన్ను నుగ్రహింప నీవే వచ్చితివి, సర్వభూతముల హృదయాంతరాశముల నీవు వసింతువు. శుద్ధ సత్త్వరూపమున నున్న నిన్నుఁ బ్రత్యక్షముగాఁ గనుఁగొను చున్నాను. రామా !

---

1. అ. రా. - అయో. కాం., 6 స: 36-40 శ్లో॥లు
2. శ్రీ రా. - అయో కాం; 5 అ, 248 - 52 ప॥లు
3. అ. రా. - అర. కాం., 7 స., 93 - 104 శ్లో॥లు.
4. శ్రీ. రా. క. - అర. కాం., 6 అ., 576 - 83 ప॥లు.

నీవరూపు(డవయ్యు కోటి మన్మథాకార సుందరమగు రూపమున ధనుర్బాణములు ధరించి ప్రసన్నమైన మనస్సు, చిఱునగవు గలిగి దర్శన మిచ్చుచున్నావు. ఇది నా భాగ్య విశేషము. ఇట్టి నీరూపము నా మనంబునఁ జిరకాలముండుగాత' యని స్తుతింప, రాముఁడు వరములఁ బ్రసాదించినట్లు అధ్యాత్మమునఁ గలదు.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యది యనుసరింపఁ బడినది.[2]

అగస్త్యుఁడు తన యాశ్రమమునకు వచ్చిన రామాదుల సంపూజించి, వన్యముల నారగింపఁ జేసినాడు. సుఖోపవిష్టుఁడై యేకాంతమున నున్న రాముని జూచి ముని 'రామా ! దేవతలు భూభార తరణమునకై నిన్ను బ్రార్థించినది మొదలేను నీరాకకై యెదురు చూచుచుంటిని. నిన్నే తలచుచుంటిని. సృష్టికిఁ బూర్వము నిర్వికల్పుఁడవు. నిరుపాధికుఁడవునై యుంటివి. నీయందున్న మూలప్రకృతి (మాయ) యీ ప్రపంచ మును గల్పించుచున్నది. తొలుత మహత్తు, మహత్తు నుండి యహంకారము, దాని నుండి త్రిగుణములు, నందుండి పంచభూతములు, వానివలన స్థావర జంగమాత్మక మగు జగత్తు నుద్భవించినది. బ్రహ్మ విష్ణు రుద్ర రూపముల నీస్సృష్టి స్థితి లయముల నిర్వహించుచున్నావు. జాగత్స్వప్నసుషుప్తుల కంటె విలక్షణుఁడవై సాక్షిమాత్రుఁడవై, జ్ఞానరూపమునఁ బ్రకాశించుచున్నావు. త్వద్భక్తిసంపన్నులు మోక్షము నందుచున్నారు. వేయేల రామా ! సాధుసంగతియే మోక్షహేతువు. నీ భక్తులే సమదర్శనులు, సాధు పుంగవులు నగుచున్నారు. వారితో నేర్పడు సాంగత్యము వలన నీ కథలందు రతి, నీయందు భక్తి యుదయించును. అట్టి భక్తి వలన నధికమైన జ్ఞానము కలుగును. అందువలన నిత్యము నీ భక్తులతో నాకు సహవాసము కలుగుగాక ! నేఁడు నాచేసిన తపములు, యజ్ఞములు ఫలించినవి. సీతా సమేతుఁడవై నీ వెల్లప్పుడు నా హృదయ మున నిలువుము. గమనాగమనముల నా మనము నీయందు లగ్న మగునట్లుగా నను గ్రహింపుము, అని 28 శ్లోకములలోఁ దత్త్వయుక్తిఁ బ్రార్థించుట యధ్యాత్మమునఁ గలదు.[3] శ్రీరామకథాఽమృతమున నియ్యది యథామూలముగా 19 పద్యములలో నను వదింపఁ బడినది.[4]

---

1. అ. రా. - అర. కాం., 2 స., 27-40 శ్లో॥లు
2. శ్రీ. రా. క. - అర. కాం., 1 ఆ., 185-202 ప॥లు
3. అ. రా. - అర. కాం., 3 స., 17-45 శ్లో॥లు
4. శ్రీ. రా. క. - అర. కాం., 1 ఆ., 280-95 ప॥లు

పంచవటి యందున్న సమయమున నొకనాఁడు వికలమనస్కుఁడైన లక్ష్మణునకుఁ దత్ప్రార్థన ననుసరించి పురుషోత్తముఁడైన రాముఁడు 'అజ్ఞానము దలఁగఁ మోక్షమార్గ మరయగఁ దత్త్వ ముపదేశించుట విస్తృతముగా 39 శ్లోకములలో నధ్యాత్మమునఁ జెప్పఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యది 22 పద్యములలో మూలానుసరణముగా ననువదింపఁబడినది.[2]

భరతుని గుణములు వర్ణించుచు దుఃఖించు లక్ష్మణుని కలతఁ దీర్చుటకై రాముఁడు తత్త్వోపదేశము గావించుట మిక్కిలి యౌచిత్యము.

రాముఁడు జటాయువు మరణింప నుత్తమ లోకములఁ బ్రసాదించి దహన సంస్కారములఁ గావించినాఁడు. అంత జటాయువు దివ్యరూపమును ధరించి వర విమానమున నుండి యోగిగణ స్తూయమానుఁడగు రాముని గీర్తించుట యధ్యాత్మమునఁ గలదు.[3] శ్రీరామకథాఽమృతమున నయ్యది యథామూలముగా ననుసరింపఁబడినది.[4] ఇందు రఘునాయకుని భక్తులపాలి 'భాగ్యలక్ష్మి వరము' గా సంభావించుట స్వతంత్రత. మఱియు –

స్మితరుచిత వికాసితాన నాబ్జ మతిసులభం సురరాజ నీలనీలమ్
సితజలరుహ చారునేత్ర శోభం రఘుపతి మీశ గురోర్గురుం ప్రపద్యే
— అ. రా. - అర. కాం., 8 స., 51 శ్లో.

ముద్దులుగుల్కు మేల్నగవు ముచ్చట లొల్కెడు మోము నీలపుం
బద్దులు దిద్దు క్రొమ్మెఱుఁగు పట్టగుమేను దయామయాబ్ధికిన్
హద్దనఁ జాలి, జాలి తెలఁగల్లనఁ బాపఁగఁనోపు చూపు నీ
యొద్దన కాక యెల్లకడ నొక్కెడనేనియుఁ గద్దె రాఘవా!
— శ్రీ. రా. క. - అర. కాం., 4 ఆ., 194 ప.

---

1. అ. రా. - అర. కాం., 4 స., 16-55 శ్లో॥లు
2. శ్రీ. రా. క. - అర. కాం. 1 ఆ., 390-412 ప॥లు
3. అ. రా. - అర. కాం., 4 స., 16-55 శ్లో॥లు
4. శ్రీ. రా. క. - అర. కాం., 1 ఆ., 390-412 ప॥లు

ఇట మూలములోని 'సితజలరుహచారునేత్రశోభం' అనునది యను వాదమున 'దయామయాబ్ధికిన్ హద్దనఁ జాలి జాలి తెలఁగల్లనఁ బాపఁగానోపు చూపు' గాఁ జెప్పుట రాముని కారుణ్యమును, శరణాగతరక్షణమును వెల్లడించుచున్నది. ఇట్టి భావన మమూలకమై హృదయంగ మగుచున్నది. దాశరథి కరుణాపయోధిగా సంభావింపఁబడుట పరమోదారము. పాత్రౌచిత్య సుందరము నగుచున్నది.

కబంధుఁడు గంధర్వరూపమును దాల్చి ప్రదక్షిణ నమస్కారము సేయించి కృతాంజలియై రాముని 'సూక్ష్మము మనోవాచా మగోచరము నగు పరబ్రహ్మముగా, స్థూలమగు విరాడ్రూపునిగా' సంభావించి శరణు వేడుట యధ్యాత్మము నందలి విషయము.[1] శ్రీరామకథామృతమున నయ్యది మూలానుసరణముగా ననువదింపఁ బడినది.[2]

శబరి రాముని వేడగా భక్తియే మోక్షహేతువని యట్టి భక్తి సాధన విశేషమును, జెప్పుట ముక్తిఁ బ్రసాదించుట యధ్యాత్మమునఁ గలదు.[3] శ్రీరామకథామృతమున నయ్యది మూలానుసరణముగా ననువదింపఁబడినది.[4] "మద్భక్తు లగువారి యెడఁ జాతి లింగ వయోభేదంబులు, తపోదాన యజ్ఞంబులు కారణములు కావు. ఇతరులు నన్నుఁ జూడఁజాలరు" (అర. కాం., - 10 స., 20, 21 శ్లో॥లు) అనునెడ 'భక్తిపరులగువారు నాభాగ్య మనుచు వారి కష్టసుఖంబుల వలను గనుచు మొనయు వాఁడ' ననుట యమూలకము. (శ్రీ. రా. క. - అర. కాం., 4 ఆ., 317 ప.)

కిష్కింధాకాండమున సుగ్రీవునకు నమ్మకము గలుగ రాముఁడు తన బలముఁ బ్రదర్శించినాఁడు. అంత సుగ్రీవుడు రాముని శక్తి నమ్మి నీవు జగన్నాథుఁడవగు పరమాత్మవు. నా పూర్వ పుణ్య విశేషమున నీమైత్రి లభించినది. మహాత్ములు నిన్ను సంసార వినివృత్తికై భజించుచున్నారు. దారాపుత్ర ధన రాజ్యములు సమస్తము నీ మాయచేఁ గల్పింపఁబడినవి. మట్టి కొఱకు యత్నించువాఁడు నిక్షేపము వలె నానంద

---

1. అ. రా. - అర. కాం., 9 స , 30-54 శ్లో॥లు
2. శ్రీ. రా. క. - అర. కాం., 4 ఆ., 267-81 ప॥లు
3. అ. రా. అర. కాం., 10 స., 20-32 శ్లో॥లు
4. శ్రీ. రా. క. - అర. కాం., 4 ఆ., 317-22 ప॥లు

జ్ఞానస్వరూపుఁడ వగు నిన్ను నా భాగ్యాతిశయమునఁ బొందితిని. త్వత్పాదభక్తి నా కనుగ్రహింపు మని యర్థించుట' యధ్యాత్మ రామాయణము నందుఁ గలదు.[1] శ్రీరామ కథాఽమృతమున నియ్యది యనుసరింపఁబడినది.[2] అనువాదమున మూలకుంచనము గాన నగును.

వాలి మరణమునకు దుఃఖించుచున్న తారకు రాముఁడు 'దేహము దేహస్థుఁ డగు జీవుడు వేరు. నీ పతి దేహమందువా ? జడమగు నా దేహము మాంసాస్థిక లతోఁ గూడి హేయమై నీ చెంతనే కలదు. ఇక జీవుఁడందువా ? యతఁడనా మయుఁడు. జననమరణాది వికారము లాతనికి లేవు. ఆకసము వలె సర్వగతుఁ డలేపకుఁ డద్వితీయుఁడు నిత్యజ్ఞాన సుఖమూర్తి నిర్మలాత్ముఁ డాతనికై యేశ్వఁ బని లేదు' అని తత్త్వ ముపదేశింపఁ దార యట్లయిన 'సుఖదుఃఖమాదిగాఁ గల సంసార బంధ మెవనిదని యడుఁగ నాత్మానాత్మ వివేక మెఱుక పరచి దేహాభిమానజంబయిన శోక మెడలించుట యధ్యాత్మమునఁ జెప్పఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నియ్యది మూలానుసరణముగా ననువదింపఁబడినది.[2]

వాలిని వధించి కిష్కింధారాజ్యమున సుగ్రీవు నభిషిక్తుఁ జేసి రాముఁడు ఋశ్యమూకమున నున్న సమయమున నొకనాఁడు లక్ష్మణుఁడు రాముని భక్తితో లోకమున యోగులు నీ యారాధనము సేయు విధము వినగోరుచున్నా' నని యడుగ రాముఁ డవ్విధిఁ జెప్పుట యధ్యాత్మమున విపులముగా 30 శ్లోకములలోఁ గలదు.[5] ఇందు నిత్యపూజా హోమ బలి సమర్పణ విధులు విశేష పూజావిధులు సుదీర్ఘముగా వర్ణింపఁబడినవి. శ్రీరామకథాఽమృతమున నివి యన్నియు మూలము ననుసరించి 28 పద్యములలో ననువదింపఁబడినవి[6] మఱియు 'కల్పగ్రంథములందు భగవంతునిఁ

---

1) అ. రా. - కి. కాం., 1 స., 76-93 శ్లో॥లు

2) శ్రీ. రా. క. - కి. కాం., 1 అ., 232-40 ప॥లు

3) అ. రా. - కి. కాం., 3 స., 13-36 శ్లో॥లు

4) శ్రీ. రా. క. - కి. కాం., 1 అ., 382-403 ప॥లు

5) అ. రా. - కి. కాం, 4 స., 6-40 శ్లో॥లు

6) శ్రీ, రా, క, - కి, కాం, 2 అ., 65-93 ప॥లు

బూజించుటకు షోడశోపచారములు, చతుష్షష్ట్యుపచారములు విధివిహితములై యున్నవి. భక్తుఁడా విధాన లక్షణము లెఱింగి చేయఁగలిగిన విధానము ననుసరింపఁదగు' నవి చెప్పట యమూలకము. ఇట్టిది కవి సంప్రదాయ విశేషవిజ్ఞతకు నిదర్శనము.

సదమలమతి! యుపచర్యలు
పదాఱు నఱువదియునాల్గుఁ బరఁగును గల్పా
స్పద తద్విధాన లక్షణ
విదితుండై యొనయనోపు విధిఁగొన నొప్పున్

హనుమదాది వానరవీరులు తన గుహలోఁ బ్రవేశింప వారిననుగ్రహించి స్వయంప్రభ రామునిఁ జేరి 'నేను నీదాసురాలను. బహువర్ష సహస్రములు నీదర్శనము కొఱకు తపమొనరించితిని. నేటికా తపస్సు ఫలించినది. మాయాతీతుఁడవైన నీవు మానుష విగ్రహముఁ దాల్చి సంచరించుచున్నావు. భక్తులఁ బరిరక్షింప నవతరించితివి. రామా! మోక్షప్రదమై యజ్ఞానమును, నశింపఁజేయు నీపాదయుగము దర్శించి భజించు భాగ్యము లభించినది. ఆది మధ్యాంతరహితుఁడవు. పరమపురుషుఁడవు నైన నిన్ను దలంచుచున్నాను. లోకమున సచ్చరిత్ర వెలయింప నవతరించితివి. నీ కథలు విని నీ పాదపద్మములు దర్శించువారు సంసార సముద్రముఁదరించుచున్నారు' అని స్తుతించుట రాముఁ డామెకు వరములు బ్రసాదించుట యధ్యాత్మము నందు 24 శ్లోకములలోఁ జెప్పఁబడినది. [1] శ్రీరామకథా సమ్మృతమున నయ్యది మూలభావాను సరణముగా 17 పద్యములలో ననువదింపఁ బడినవి. [2]

ప్రాయోపవేశమునకు సమకట్టు నంగదుని సంభాళించి హనుమ 'రాముఁడు సాక్షాన్నారాయణుఁడవ్యయుండు గాని నరమాత్రుఁడు గాఁడు. సీత జనసమ్మోహ కారిణి, భగవతి యగు విష్ణుమాయ. లక్ష్మణుఁడు భూమి కాధారమైన యాదిశేషుఁడు. రాక్షసగణమును వినాశ మొనరింపఁ బ్రహ్మచేఁ బ్రార్థింపఁబడిన వారలై లోకరక్షకు లైన వీరలు మాయచే మనుష్యభావంబున నవతరించిరి. మన మందఱము వైకుంఠవాసి యగు విష్ణుని పార్షదులము. పరమాత్మ మానవుఁడు కాగా మనమును నతని మాయచే

---

1. అ. రా. - కి. కాం. 6 స., 60-84 శ్లో॥లు
2. శ్రీ, రా. క., కి. కాం, 3 ఆ. 103 119 ప॥లు

వానరరూపమునఁ బొడమితిమి. మనము పూర్వము జగన్నాథుఁ డగు నారాయణునిఁ దపస్సుచే నారాధించి యాతనిచే ననుగ్రహింపఁబడినవారమైతిమి. ఇప్పుడా మాయా మానుషమూర్తికి సేవచేసి మరల వైకుంఠమున సుఖముండఁగలము' అని యుద్బోధించి నట్టు లధ్యాత్మమున 12 శ్లోకములలోఁ గలదు. [1] శ్రీరామకథామృతమున నయ్యది మూలము ననుసరించి యనువదింపఁబడినది. [2]

సుందరకాండమున హనుమంతుఁడు రావణుని గాంచి 'రావణుఁడా! నీరాక్షస బుద్ధి మానుము. వివేకమున మంచి చెడులు విచారించి సంసార మోక్షమును గల్గించు నట్టిదైన వీగతి నాశ్రయింపుము. నీకది మేలుఁ గూర్చును. దేహాత్మబుద్ధుల రెంటను నీకది యుక్తముకాదు. స్వప్నమునఁ దోఁచు దృశ్యముల వలె నజ్ఞానమునఁ దోచుచున్న యీ శరీరాదు లన్నియు మిథ్యయే యని తెలియుము. దేహబుద్ధిని సంసారబంధము గలుగుచున్నది. జ్ఞానస్వరూపుఁడను జన్మనాశములు లేనివాఁడను ఆనందరూపుఁడ ననుకొన్నచో ముక్తుఁ డగును. దేహ ప్రాణ మనోబుద్ధు లాత్మ కానేరవు. ఆత్మజ్ఞాని యైనప్పుడే మోక్షము లభించును. మోక్షసాధనముఁజెప్పెద సావధానుఁడవై వినుము. విష్ణుభక్తిచే నంతఃకరణశుద్ధి, దానిచేఁ బరోక్ష జ్ఞానము, దానంజేసి నిధిధ్యాసమున పరోక్ష సాక్షాత్కారముఁ గలుగును. కావునఁ బురాణపురుషుఁడు ప్రకృతికి నతీతుఁడు సర్వవ్యాపకుఁడు నగు విష్ణువైన రాముని భజింపుము. మూర్ఖత మాని రాముని యందు శత్రుబుద్ధి విడచి శరణు పొందుము. అతడు శరణాగతుల రక్షించును. కాకున్న నీయజ్ఞానము నిన్ను దహించును. నీ వధోగతిపాలగుదువు' అని తత్త్వము వివరించుట యధ్యాత్మమున 11 శ్లోకములలో గలదు,[3] శ్రీరామకథామృతమున నయ్యది యనుస రింపఁబడినది.[4] ఇట యనువాదమున మూలకుంచనము గననగును.

యుద్ధకాండమున శివుఁడు పార్వతితో రాముఁడు మాయామానుష మూర్తి యైనియు శోక-మోహము లతని దరిఁజేర వనియుఁ జెప్పుచుఁ దత్త్వ ముపదేశించుట

---

1. అ. రా. కి. కాం. - 7 స. 11-22 శ్లో॥లు
2. శ్రీ. రా. క. - కి. కాం. 3 ఆ. 157-62 ప॥లు
3. అ. రా.- సుం. కాం., 4 స., 15--25 శ్లో॥లు
4. శ్రీ. రా. క.- సుం. కాం., 3 ఆ., 218-21 ప॥లు

యధ్యాత్మమున గలదు.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలానుసరణముగా ననువదింపఁ బడినది.[2] 'రాముఁ డద్వితీయుఁడు జ్ఞానస్వరూపుఁడు పరమాత్మ సనాతనుఁడు. యథార్థమగు రాముని స్వరూపము నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వానిని దుఃఖాదులు స్పృశింపవు. అట్టియెడ నానందస్వరూపుఁడు నాశరహితుఁడు నగు రాముని జేరవనుటలో నాశ్చర్యమేమున్నది. దుఃఖ హర్ష భయ క్రోధ లోభ మోహ మదాదు లజ్ఞాన లక్షణములు. జ్ఞాని యగు రాముని యందవి సంభవింపవు. దేహాభిమానికి మాత్రమే దుఃఖము. ఆత్మకు లేదు. రాముఁడు పరమాత్మ. పురాణపురుషుఁడు నిత్యుఁ డానందస్వరూపుఁడు. పూర్ణకాముఁడు. మాయాగుణ సంగతుఁ డౌట నజ్ఞానులీతని యందు సుఖదుఃఖములు గలవని భ్రమించుచున్నారని' యందు వివరింపఁ బడినది.

రావణుఁడు మంత్రాలోచనము సేయు సందర్భమున కుంభకర్ణుఁడు రావణు నుద్దేశించి నీచేఁ బ్రారంభింపఁబడిన యికార్య మాత్మనాశనమునకే గాని వేఱు కాదు. సీతాపహరణ సందర్భమున రాముఁడు నిన్నుఁ జూచి యుండలేదు. చూచియుండునేనినీవు బ్రతికి వచ్చెడువాఁడవు కావు. రాముఁడు మానవుఁడు గాఁడు. సాక్షాన్నారాయణుఁడు. యశస్వినియు, రామపత్నియు నగు సీత లక్ష్మి, రాక్షస వినాశము కొఱకై యామె నీచేఁ దేఁబడినది. మహామీనము విషపిండము మ్రింగి యెట్లు వెనుకఁ దపించునో, యట్టి నీవు సీతఁ దెచ్చి తపించుచున్నావు. ఫలమేమి?' అని పలికినట్టు లధ్యాత్మమునఁ గలదు.[3] శ్రీరామకథాఽమృతమున నయ్యది యనుసరింపఁబడినది.[4]

విభీషణుఁడు రావణునకు రామమహత్త్వముఁ దత్త్వముఁ దెలియఁజెప్పుట యధ్యాత్మరామాయణము నందలి విషయము.[5] శ్రీరామకథాఽమృతమున నయ్యది మూలానుసారముగా ననువదింపఁ బడినది.[6]

---

1. అ. రా.- యు. కాం., 1 స., 50-4 శ్లో॥లు
2. శ్రీ. రా. క.- యు. కాం. 1 ఆ., 206-12 ప॥లు
3. అ. రా.- యు. కాం., 2 స., 14-17 శ్లో॥లు
4. శ్రీ. రా. క. యు. కాం.- పూ. భా. 2 ఆ. 166-8 ప॥లు
5. అ. రా. - యు. కాం., 7 స., 57–70 శ్లో॥లు
6. శ్రీ. రా. క. - యు. కాం., పూ. భా., 2 ఆ., 260-66 ప॥లు

శ్రీరాముని శరణువేడి విభీషణుఁడు భక్తి శ్రద్ధా సమన్వితుఁడై కృతాంజలి యగుచు పరబ్రహ్మమూర్తీ! నీ పాదభక్తిగొని జ్ఞానయోగము నందగోరుచున్నాను. నన్ను సంసార సముద్రము నుండి రక్షింపుము.' అని స్తుతించినట్లు అధ్యాత్మమున 19 శ్లోకములలోఁ గలదు.[1] శ్రీరామకథామృతమున నియ్యది మూలానుసరణముగా 20 పద్యములలో ననువదింపఁ బడినది.[2]

శుకుఁడు రావణునకు రామ తత్త్వ ముపన్యసించుట యధ్యాత్మరామాయణ మునఁ గలదు.[3] శ్రీరామకథామృతమున నయ్యది యనుసరింపఁబడినది.[4]

రామబాణ భయంబున సముద్రుఁడు దివ్యరూపమును ధరించి తనలోని దివ్య మణులను దెచ్చి రామునకుఁగానుకగా నిచ్చి దండప్రమాణము గావించి 'ముల్లోకములను రక్షించువాఁడా! రామా! నన్ను రక్షింపుము. స్థూలములైన పంచభూతములు నీచే జడములుగా సృజింపఁ బడినవి. జడస్వభావుఁడనైన నేను నిన్ను గుర్తింపఁజాల నైతివి. తామసమైన యహంకారము వలనఁ బుట్టిన భూతములు తమోగుణసిద్ధమైన జడములై యుండుట సహజము. నీవు నిర్గుణుఁడవు. నిరాకారుఁడవు. నీవు మాయతోఁ గూడి యున్నప్పుడు విరాట్పురుషుని గాఁ బ్రకాశించుచున్నావు. నీయందున్న త్రిగుణ ముల వలన దేవతలు, ప్రజాపతులు, రుద్రుడు పుట్టిరి. మందబుద్ధిని, జడుఁడను నైన నేను నిన్నుఁ దెలియఁజాలనైతిని. స్వామీ! మూర్ఖము లయిన భూతములను శిక్షిం చుట వలననే సన్మార్గము లభించును. శరణాగతవత్సలుఁడవైన నిన్ను నేను శరణు పొందుచున్నాను. నా కభయ మొసంగుము. నీకు లంకకు దారి యిచ్చెదన'ని ప్రార్థించినట్లు అధ్యాత్మమునఁ గలదు.[5] శ్రీరామకథామృతమున నయ్యది యనుసరింపఁబడినది.[6]

---

1. అ. రా. - యు. కాం. 3స., 14–32 శ్లో॥లు
2. శ్రీ. రా. క. - యు. కాం. పూ. భా., 3 .అ, 110-29 ప॥లు.
3. అ. రా. - యు. కాం., 4స., 41 – 56 శ్లో॥లు
4. శ్రీ. రా. క. – యు. కాం., పూ. భా., 4అ., 116-30 ప॥లు
5. అ. రా. - యు. కాం., 3స., 66–78 శ్లో॥లు
6. శ్రీ. రా. క. - యు. కాం., పూ. భా. 3 అ., 282–75 ప॥లు.

కుంభకర్ణుఁడు మరణింప దేవ మునీశ్వరుఁడగు నారదుఁ డేతెంచి రాముని స్తుతించుట యధ్యాత్మను నందలి విషయము.[1] శ్రీరామకథామృతమున నయ్యది యనుసరింపఁ బడినది.[2]

సోదర మరణమునకు దుఃఖించు విభీషణునకు రామాజ్ఞ ననుసరించి లక్ష్మణుఁడు 'జీవుల యొక్క జననమరణములు ప్రారబ్ధము ననుసరించి జరుగు చుండుననియు, కూడి విడువడుటలు నట్లే సంభవించుననియు, నీశ్వరుఁడే యన్నింటికిఁ గర్తయనియు, దేహమునకు జీవునకు సంబంధ మవివేకముచేఁ గల్పింపఁ బడినదే గాని నిత్యము గాదనియు, జీవన్ముక్తునకు స్వప్నావస్థయందున్న వానివలె సంసారదుఃఖము గలుగఁ బోదనియు, దత్త్వముపదేశించి పరమాత్మ యగు రాముని యందు మనము లగ్న మొనరించి భూతభవిష్యద్వర్తమానములకు వగవక నిర్విచారుఁడవై యుండుమని' బోధించుట యధ్యాత్మమునఁ జెప్పఁబడినది.[3] శ్రీరామకథామృతమున నయ్యది మూలానుసరణముగా ననువదింపఁబడినది.[4]

సీతతో గూడి అయోధ్యఁ బట్టాభిషిక్తుఁ డగు రాముని రుద్రాదులు స్తుతించుట యధ్యాత్మరామాయణమున 23 శ్లోకములలో సాగినది.[5] జగత్కారణుఁడు జగదధినేత సర్వము నైనవాఁడు రాముఁ డనుట యిందలి సారాంశము. శ్రీరామకథామృతమున నది యథామూలముగా 23 పద్యములలో మనోజ్ఞముగా ననువదింపఁ బడినది.[6]

ఉత్తరకాండమున లక్ష్మణుఁ డడుగ రాముఁడు శ్రుత్యుపపాదితమగు జ్ఞానమును బోధించుట యధ్యాత్మరామాయణమున 60 శ్లోకములలోఁ గలదు.[7] శ్రీరామకథా-

---

1. అ రా - యు కాం: 8స; 32–68 శ్లో॥లు
2. శ్రీ రా క — యు కాం; పూ భా: 7 ఆ: 460—88 ప॥లు
3. అ రా - యు కాం; 12 స., 10-66 శ్లో॥లు
4. శ్రీ రా క - యు కాం: ఉ భా; 1 ఆ: 14-26 ప॥లు
5. అ రా — యు కాం: 15స; 51—73 శ్లో॥లు
6. శ్రీ రా క - యు కాం; ఉ భా; 2 ఆ; 474 - 95 ప॥లు
7. అ రా - ఉ. కాం: 5స: 3-62 శ్లో॥లు

మృతమున నయ్యది మూలానుసరణముగా 80 పద్యములలో ననువదింపఁ బడినది. [1] అనువాదము కొంత మూలాధికముగా సాగినది. వేదాంతార్థ వివరణ మందులకు హేతువుగా నెన్నఁగును.

వాల్మీకి కుశునకు బంధమోక్షక్రమ మెఱిగించుట యధ్యాత్మమున 20 శ్లోకములలోఁ జెప్పఁబడినది. [2] శ్రీరామకథామృతమున నయ్యది మూలానుసరణముగా 21 పద్యములలో ననువదింపఁ బడినది. [3]

ఇట్లు అధ్యాత్మరామాయణమునఁ గల జీవోత్పత్తిక్రమము మొదలు బంధమోక్షక్రమము వఱకు నైన జీవధర్మములు, ఆత్మానాత్మ వివేకము భక్తి కర్మ జ్ఞాన వైరాగ్యాదులతోఁ గూడిన తత్త్వవిశేషములు వివరముగా శ్రీరామకథామృతమున ననువదింపఁ బడినవి. రామకథతోఁబాటు తత్త్వసంపదయు సులభముగా నవగతమగుట దీని ప్రధానమగు లక్ష్యము. అది సర్వవిధముల నిందు సుసంపూర్ణమైనది.

## 3. అమూలకాధ్యాత్మిక భావోద్ఘాటనము :

కొన్ని ఘట్టములలో వాల్మీకమునను, అధ్యాత్మమునను జెప్పఁబడని తత్త్వ విషయములు స్వతంత్రముగా శ్రీరామకథామృతమునఁ బొందుపఱుపఁబడినవి. సహజముగానే శ్రీరామకథామృత కవులు భక్తపుంగవులు నాత్మవేత్తలు నగుట వారి యాత్మీయత కావ్యమున గోచరించుచున్నది. వారి సంస్కారమునకుఁ దోడు తత్త్వార్థబంధురములగు వాల్మీకాధ్యాత్మములు దోహదములు కాఁగా కావ్యమున ననేక ఘట్టముల నమూలకతత్త్వోద్ఘాటనము గావించిరి. అది వారి వైదుష్యమునకు నిదర్శనము.

శ్రీరామకథామృతమున బాలకాండము నందు రామాదుల బాల్యక్రీడలను వర్ణించుచు నిట్లు చెప్పబడినది.

---

1. శ్రీ. రా. క. - ఉ. కాం., ఉ. భా., 3 ఆ., 344-423 ప॥లు
2. అ. రా. - ఉ. కాం., 6 స., 37-56 శ్లో॥లు
3. శ్రీ. రా. క. - ఉ. కాం., 8 ఆ, 13-35 ప॥లు

వారల మీర లిల్లుగలవారలు నిద్దుర కొంచ దొంగ లీ
దారిని వత్తురేని( జనుదారిని( గాచుకొనుండు సొత్తులం
చూరక హెచ్చరించి మఱియొక్కెడ(దానును( బవ్వళించి య
వ్వారి మెఱంగి డాఁగు నిజ పద్ధతి వారర యం దలంప(గన్

– శ్రీ. రా. క. - బా. కాం., 3 ఆ., 177 ప.

రాముఁడు బాలుఁడై తోడిబాలురతోఁ గూడి యాటలాడుచున్నట్లు కన్పడినను జీవాత్మపరమాత్మలకు సంబంధించిన పరమార్థతత్త్వము నిగూఢముగా నిందుఁ జెప్పఁబడుట మనోజ్ఞము. ఇట్టి వర్ణనము మూలమున లేదు. కామక్రోధాదులు శత్రువులు, జ్ఞానము సంపద. ఉపేక్షించినచో దొంగ లాధనము నపహరింతు రనునది హెచ్చరిక. పరమాత్మ జీవాత్మతోఁగూడి సాక్షీభూతుఁడై యుండుట మాయావృతుఁడైన జీవుఁడది యెఱుంగలేకుండుట అను వేదాంత విషయము లిందు క్రీడావిశేషముగా వివరించుట చమత్కార చారువు.

రామాదుల ఉపనయన ఘట్టము నందు దశరథుఁడు వశిష్ఠుని యనుమతి ననుసరించి కుమారులకుపనయనముఁ జేయ సంకల్పింప రాముఁడు వుటువై మెఱగిఁనాఁడనివర్ణించుట రాముని సాక్షాద్విష్ణువుగాసంభావించిన విధముఁదెలుపు చున్నది. (బా. కాం. 3 ఆ. 199 ప.) ఎవని నిశ్శ్వసితంబు లిజ్జగత్త్రియిఁ ద్రయీకలనఁ బెంపొంది ప్రఖ్యాతిగాంచె' ననుట విరాట్పురుషుని నిశ్శ్వసితములే వేదములను 'యస్యనిశ్శ్వసితం వేదాః' అను శ్రుతి వాక్యమును సూచించుచున్నది. వేదములకు 'త్రయి' యనునది నామాంతరము. 'ఎవని నామావృత్తి యెసఁగు సన్మౌనుల కలరు మంత్ర రహస్యమై తనర్చె' ననుట రామ తారకమంత్ర రహస్యమును దెలుపుచున్నది. వాల్మీకి మునియే యందులకుఁ బ్రమాణము. 'ఎవని శ్రీచరణాంబు లవము త్రిమార్గనాఁదగి తాత సృష్టిఁబూతగ నొనర్చె' ననుట 'విష్ణుపాదోద్భవా గంగా' యను శ్రుతిని సమర్థించుచున్నది. 'ఎవని సందర్శనంబెల్ల సంయములకు బ్రహ్మ సాక్షాత్కార పదవి యయ్యె' ననుట రాము నద్వితీయ పరబ్రహ్మమూర్తిగా నిరూపించుచున్నది. తపోనిష్ఠుఁ డగు విశ్వామిత్రుఁడు 'అహం వేద్మి మహాత్మానం రామంసత్య పరాక్రమమ్

వశిష్ఠోఽపి మహాతేజా యేచాన్యే తపసి స్థితాః వా. రా. - బా. కాం., 19 స., 14 శ్లో. / అనుట యిందులకుఁ బ్రమాణము, ఇట్టి సంభావన యమూలకము. జనకుని యజ్ఞభూమియందు నాగేటి చాలున మందసంబునఁ బొడమిన కన్నెమిన్నను గూర్చి చెప్పుచు —

తన పేటికావృత్తి ఘన గుహాభ్యంతర
పరవస్తు భావోపపత్తి నెరపఁ
దన దివ్యతేజంబు జనన స్థితి వినాశ
ములు ముజ్జగమ్ములు మొనయఁజూడ
దన మంగళాకృతి దనుజభీతి విమగ్న
దైవతా వలిదేల్చు దారిగాంచఁ
దన మందహాసంబు తాపసోత్తమ మహా
వరణ తమఃపాలి వ్రయ్యఁజేయఁ
దనయపాంగ తరంగితోదార దృష్టి
అమిత సామ్రాజ్య మాత్మీయులందఁగోరఁ
దన యజాండ ప్రసూత్వంబు దాఁచి కన్నె
మిన్నయై తోఁచె నాప్రోఢ కన్నె గిరిజ

శ్రీ. రా. క. - బా. కాం., 4 ఆ., 132 ప॥

అని వర్ణించుట 'యోగమాయ'యే సీతగా జన్మించిన దను విషయము నిరూపించుచున్నది. బాలిక పెట్టెలో నుండుట సర్వాతీత యగు నీశ్వరి సహస్రారకమలపీఠస్థ యగుటను దెలుపుచున్నది. అది యోగి జనైకవేద్యము. ఇట్టి భావన మనోజ్ఞము.

మఱియు సర్వమంగళయై ప్రకృతి పురుషులను గూర్చుట, శక్తి స్వరూపిణియై యఖిల గోళములను బాలించుట, యన్నపూర్ణయై బ్రహ్మాదులను బోషించుట, మాయారూపిణియై జ్ఞానమణిని మఱుఁగు పఱుచుట యను పరమేశ్వరి కృత్యములు, బొమ్మల పెండ్లిండ్లు, నచ్చనగాయలు, బువ్వముబంతి, వెన్నెల కుప్పలు మొదలగు నాటలలో వ్యక్తమగుచున్నవని సీత బాల్యక్రీడలు వర్ణింపఁ బడినవి.

కూర్చు బొమ్మలపెండ్లి కూటమ్ము లొంపొంప్ల
గూర్తి విమ్మెయి నన్న గుర్తుఁదెలియ
నాడు నచ్చనగాయ లఖిలగోళంబు లి
ట్లాడింతు నను భావ మచ్చుపడఁగ
నడుపు బువ్వముబంతి నలువ మున్నగ నన్న
మిడుదునేనను సన్న గడలు కొనఁగ
నెన్ను వెన్నలకుప్పలేఁ గప్పు మణిగన్న
వారెపో ఘనులన్న వలను మెలయ
మలయు నాల్గుకంబముల ఖేల నలువురిఁ
గికురు వెట్టు తనదు కీలు దోఁపఁ
దోడి బాలికాలిఁగూడి యాశ్రుతిమౌళి
కేళి లీలఁ జెలఁగువేళ బాల !

— శ్రీ. రా. క.- బా. కాం., 4 ఆ., 156 ప॥

బ్రహ్మ విష్ణు రుద్ర యీశానులు నలువురిలోఁ దాను సదాశివరూపమున నుండి నాలుగు కంబముల ఖేల నాడుచున్న దనుటలోఁ బంచకృత్యపరాయణమై సర్వ విశ్వమును నడుపుచున్న దను విషయముఁ జెప్పఁబడినది. సృష్టి, స్థితి, లయ తిరోధా నానుగ్రహములు పంచకృత్యములు. మఱియు

అవని మెలఁగువార లందఱు నావిడ్డ
లేనుఁదల్లి ననుచు నింతి యాడ
జనని నిక్కమింత యని పొంగునృపుభాగ్య
సరణి వొగడ నెవరితరము తరుణి

— శ్రీ. రా. క. - బా. కాం.. 4 ఆ., 158 ప.

అని వర్ణించుట సీతాదేవి జగన్మాతృత్వమును భంగ్యంతరముగా వెల్లడించుచున్నది. అట్లే జనకుని రాజర్షిత్వము నిరూపించుచున్నది. సాధారణముగాఁ బిల్లలాడుకొను నప్పు డాడపిల్ల 'నేనమ్మనట, మీరు పిల్లలు' అని యనును. సీతయు నట్లే యనినది.

నిజమున కామె విశ్వజనని. ఇట్టిది స్వభావోక్తి సుందరమయ్యు సత్య ప్రతిపాదక మగుట హృదయంగమము.

తాటక శాపవిముక్తి నంది రాముని స్తుతించుట యమూలకము.[1] 'మంజు భాషిణి' వృత్తముల నామె స్తుతించుట, రాముఁ డామెను మంజుభాషిణీ ! అని సంబోధించెనుట వృత్తరచనా చమత్కారము. ఇందు 'ఏది శబ్దమున కందనిదో యది నీ రూపని శ్రుతులు పలుకుచున్నవి. నీవు మహత్తు కంటె యున్నతుడవు. ఇతరములు నిన్నుఁ గననేరవు".[2] అనుట "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహ" ఇత్యాది శ్రుత్యర్థమునుఁ బ్రతిపాదించుట మనోజ్ఞము.

విశ్వామిత్ర యాగపరిసమాప్త్యనంతరము సిద్ధాశ్రమమున మునులు గోష్ఠి నుండి ప్రమాణచతుష్టయ పూర్వకముగా రాముని పరబ్రహ్మ మని సంభావించుట యమూలకమగు తత్త్వోద్ఘాటనము. (శ్రీ. రా. క. బా. కాం. 6 అ. 6 ప.)

భారతీయ శాస్త్ర సంప్రదాయమును బట్టి యే విషయమైనను సతర్కముగ సప్రమాణముగా యోచించి ప్రత్యక్షము స్వానుభవముతో సరిపోల్చుకొని నిర్ణయించుట పద్ధతి. ఇట రామ బ్రహ్మ నిరూపణ మట్లు గావింపఁబడినది. ప్రమాణములు నాలుగు. ప్రత్యక్షానుమా నోపమాన శబ్ద ప్రమాణములు. ఊహయే సాధనముగాఁ గలది యను మానము గావున లక్ష్యనిర్ణయమున కది సమర్థము గాదు. పరబ్రహ్మముతోఁ బోల్పఁ దగినది మఱియొండు లోకమున లేకుండుట నుపమానప్రమాణము సిద్ధింపదు. శబ్ద ప్రమాణమున అనఁగా వేదమున శ్రవణేంద్రియము ద్వార మున్ననుభవించిన యానంద మిప్పుడు ప్రత్యక్షమునఁగాంచి స్వానుభవముతో నెంచి 'రామతత్త్వమే పరబ్రహ్మమ'ని మునులు సిద్ధాంతీకరించిరి. తత్త్వవిదు లెల్లరు మున్ను పాటించిన క్రమ మిట్టిదే. పర బ్రహ్మమును గాంచిన వారికి నితర వృత్తు లింకెట్లుండును. అట్టియెడ నిత్యతృప్తిఁ గడల్కొన సర్వము నానందమయమే యగును. ఇది యోగులగువారి యనుభవముఁ దెలుపుచున్నది. (చూ. పాత్రచిత్రణము)

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతో మిథిల కేగుచు గౌతమాశ్రమ వర్ణన

---

1. శ్రీ. రా. క. - బా. కాం., 5 అ., 287 -95 పద్యలు.
2. శ్రీ. రా. క.- బా. కాం., 5 అ., 293-4 పద్యలు

సందర్భమున ముని రామున కహల్యా వృత్తాంతముఁ జెప్పి యామె నీ యనుగ్రహము నకై యీ యరణ్యపథమునఁ ద్వదేకశరణ్యయై యున్నదని నుడువుచు రాముని మహత్త్వము నుగ్గడించుట యమూలకము.

తృణము మేరువు మేరువుఁ దృణము సేయ
నీక కాదెద్దు నిను మేలి నియతిఁ దలచు
తరము వారికి నొసఁగెదు తావకీన
యశము గొనియాడ నొల్లకు వశమె యీశ !
శ్రీ. రా. క. - బా. కాం., 7 అ., 80 ప.

ఇట 'ఈశ' యను పదము రామునకుఁ గల సర్వాధిపత్యము నుగ్గడించు చున్నది. అట్టి వానికి నసాధ్య మెద్దియును లేదు. శివుఁడీ విషయమును బార్వతి కిట్లు వర్ణించి చెప్పినాఁడు.

హరిఁ దలఁచిన హరిఁ బొగడిన
హరినామావృత్తి మనిన హరి నేననినన్
హరిపద మందుదురటె యా
హరియంఘ్రి కసాధ్యఁ మెద్ది యగరాజసుతా !
పొడమె నేది గంగ పుట్టిన చోట బ్ర
హ్మదు లెపుడు దేని నవధరింతు
రెల్లశ్రుతుల నొసట నుల్లసిల్లెడు చెంది
రంపుఁగలన ముదము నింపు నెద్ది
ఆ పదరజ మటుసోఁకిన
నాపదలు పందంబు వదలి యటఁజనగ సతీ
రూపము ముని శుభవాగను
రూపముగా వెలసె శాప రూఢి తలఁగుటన్
— బా. కాం. – 7 అ., 95-97 పll లు

వాల్మీకమున నీ ఘట్టము 'యావద్ రామస్య దర్శనం శాపస్యాన్త ముపాగమ్య తేషాం దర్శనమాగతా' (బా. కాం., 49 స., 16 శ్లో.) అని మాత్రమే వర్ణింపఁబడినది. అమూలకమగు హరిమహాత్మ్యవర్ణనము కవి భక్తి తాత్పర్యములకు దత్త్వోద్ఘాటనమునకు నుదాహరణముగా నెన్నఁదగియున్నది.

విశ్వామిత్రుఁడు రాముని మేలుకొలుపుచు 'సావిత్రీ మంత్రమునకు లక్ష్యభూతుఁడు నానందలక్ష్మికి నిలయుఁడు, త్రిమూర్తి స్వరూపుఁడు, శ్రేయః పదము, నవ్యయశ్రీ విద్యానిధి యగు సూర్యుఁడు నాయా స్థితులతో నీవే తానను భావమును దెలుపుచున్నాఁ డని యనుట యమూలకము.

సావిత్రీ పదమంత్ర లక్ష్యకలనా సంస్థాన మానంద ల
క్ష్మీవాసంబు త్రిమూర్తికూటము మహాశ్రేయఃపథం బవ్యయ
శ్రీ విద్యానిధి చిద్విలాసమగు రోచిస్స్వామి యాయాస్థితిన్
నీవే తానను భావముం దెలిపెడిన్నిర్వ్యాజుఁడై రాఘవా
— బా. కాం. - 9 ఆ., 56 ప.

నిర్గుణుఁడు, నిర్వికారుఁడు నగు పరబ్రహ్మ తన మాయతోఁగూడి రజస్సత్త్వతమోగుణముల బ్రహ్మ విష్ణు రుద్రులుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. సూర్యుని నుదయ సాయం మధ్యాహ్న సమయముల బ్రహ్మ విష్ణు రుద్రరూపుల (త్రిమూర్త్యాత్మకుఁడుగా) సంభావించుట ప్రసిద్ధము. ఈ సందర్భముననే విశ్వామిత్రుని ముఖమున రామావతారము వలనఁ గల యవతార విశేషములు గీర్తింపఁబడుట యమూలక తత్త్వోద్ఘాటనము. (బా. కాం., 9 ఆ., 46 ప.)

జనకుఁడు రాముని శివధనుర్భంగ వార్తతోఁబాటు సీతారాముల వివాహ శుభలేఖ దశరథునకుఁ బుత్తెంచినాఁడు. అది విని దశరథుఁడానందమున మిన్నందినాఁడు. ఇట దశరథుఁ డొక యుపాసకుఁడు గాను, రాముఁడుపాస్య దైవముగాను సంభావింపఁబడుట హృద్యము. (బా. కాం., - 10 ఆ., 42 ప॥)

కందునో యేనాఁడు గనులపండువుగ నా
కల్యాణమూర్తి సింగారమనుచు

విందునో యేనాఁడు వీనులు దనియ నా
విద్యావినోది వాగ్విభవ మనుచుఁ
గొందునో యేనాఁడు గోర్కులుదీర నా
చంద్రాస్యు స్మేర ప్రసాద మనుచు
నుందునో యేనాఁడు హాయలు నెక్కొనఁగ నా
కరుణాబ్ధి దృక్కలాకలన ననుచు
సరయ నది త్ర్యక్షరియొ షడక్షరియొ కాని
పాయకున్నది నామదిఁ బాదు కుదుర
నేఁటి కమ్మంత్రము ఫలించె వియతి నతనిఁ
గాంచి ముదమందుచేఁ దీనఁగల ఫలంబు

బా. కాం. - 10 ఆ., 42 ప.

ఒక మంత్రము నుపాసించి సిద్ధిఁ బొందుట వలన నభ్యుదయము, తద్దేవతా దర్శనము, గల్గుట ఫలము. ఉపాసనావిధియం దియ్యది యనుభవసద్ధము. దశరథుఁడు రాముని విశ్వామిత్రుని వెంట నంపిన నాఁటినుండియు రామధ్యానమే చేసినాఁడు. అది త్ర్యక్షరియో షడక్షరియో కాని దాని ఫలితముగాఁ బుత్ర వివాహరూప మగు శుభో దయముతోఁబాటు తా నింతకాలము హృదయమునఁ బాయక పాదుకొల్పిన రామ దర్శనము సిద్ధింప నున్నది. రాముఁడిప్పుడు జయలక్ష్మిని, గృహలక్ష్మిని వరించి మించినాఁడు, మంత్రశాస్త్రము ననుసరించి త్ర్యక్షరి 'శ్రీరామ', షడక్షరి 'రాం రామాయ నమః'. ఈ పద్యమున 'కందునో, విందునో' యిత్యాదులు త్ర్యక్షరియు, 'కందునో యేనాఁడు, విందునో యేనాఁడు' యిత్యాదులు షడక్షరియునగుట చమత్కారము. దశరథుఁడు రామబ్రహ్మము నుపాసించి శుభములు పడసినాఁ డనుట పరమార్థము. ఇట్టి యమూలక తత్త్వోద్ఘాటనము సందర్భసుందరము, పాత్రౌచిత్య బంధురము నగుచున్నది.

సీతారామ కల్యాణ సందర్భమున జనకుఁడు రాముని పాదములు గడగి తీర్థము మూర్ధమున ధరించినట్లు వర్ణించుట రాముని విష్ణుత్వమును బ్రతిపాదించు చున్నది.[1] ఇయ్యది యమూలకతత్త్వోద్ఘాటనము. శ్రుతి సీమంతినుు లీతని పదరజము సిందూరముగా ధరించుచున్నారు. ఈ విషయమున 'శ్రుతి

---

1. బా. కాం. - 10 ఆ., 358 ప.

సీమంత సిందూరీ కృత పాదాబ్జధూళికా' [1] అనుటప్రమాణము. 'శ్రీరామో లలితాంబికా' అను సంప్రదాయజ్ఞుల మతము నిందుగ్గడింపఁబడినది. (శాక్తేయము)

గుహుఁడు రాముని 'విరాట్పురుషునిగ'' సంభావించిన తీరు శ్రీరామకథాऽమృతమున నమూలకము తత్త్వ ప్రధానమునగుచున్నది. అట్లే గుహుని యాజ్ఞానుసారము రామాదులను గంగానది యవ్వలితీరమునకుఁ జేర్చు నావికులు రామగీతము లాలపించుచు రాముని పరమార్థతత్త్వముగా సంభావించుట యమూలకము. [2]

ఇట ధీవరులు 'బోధకలనా సుధీవరులైరి' యనుట వారి యాత్మజ్ఞాన సంపదను బ్రకటించుచున్నది. ముముక్షువులగుట వారు తత్త్వమెఱుంగ గలిగిరి. వారికి రామగీతములట్టి జ్ఞానఫలమును బ్రసాదించినవి. అంతటి గుహునకు ననుచరు లగుట వారికట్టి యోగ్యత సిద్ధించినది. (చూ పాత్ర చిత్రణము)

అయోధ్యాకాండమున రామాదులు వాల్మీక్యాశ్రమమునకుఁ బోవ నాఁతడు రాముని 'సకల భూత భావనాతరాత్మ' యగు విష్ణువుగా సంభావించి 'తన్మయ మానసుఁడయి యనితరభావమునఁ బొగడి' నట్లు వర్ణించుట యమూలక తత్త్వోద్ఘాటనము. (5 ఆ. 306-8 పాలు)

అరణ్యకాండమున నత్రిముని శిష్యులు రామునికి త్రోవఁజూప వచ్చి యటఁ గల నది దాటించిన సందర్భమున 'రామనామము జపించిన మాత్రమున సంసృతిం దాటి శుభము లెనయజాలుదు రనిన, వారల నది దాటించిన వారి భాగ్య మెట్టిదో ?' [4] యని తలంచుటచే రాము సేవలఁ గలుగు ఫలముగ్గడింపఁ బడినది. ఆతఁడు మోక్షప్రదాత యనుట తాత్పర్యము. ఇయ్యది యమూలకము.

సుతీక్ష్ణాశ్రమ వర్ణన సందర్భమున 'నచటి శారికలు రామనామార్థమును బ్రశ్నింప శ్రుత్యర్థమును బోధించుచు శుకరాజి సూనృతములు పలుకుచున్నవి. 'విష్ణువే రక్షకుఁడు. మరి యొకఁడు లేఁడను కోయిలల పంచమస్థాయి ప్రపంచితములు విన

---

1. లలితాసహస్రనామము, 68 శ్లో.
2. అయో. కాం. 5 ఆ. 110-11 పాలు.
3. అయో. కాం. 5 ఆ. 297 ప.
4. అర. కాం. 1 ఆ. 15 ప.

వచ్చుచున్నవి. లేళ్ల హరి యాగమనము నూహించుచు నుబ్బియాడుచున్నవి. తుమ్మెదలు గేయ ప్రబంధావళి లభించినదని పన్నుగడలు సలుపుచున్నవి'. ఇవి యన్నియు నయ్యది మున్యాశ్రమ మని యడుగకయమున్నె చెప్పకయ చెప్పుచున్నవ' నుట మనోజ్ఞము. గేయ ప్రబంధములు రామకథా విశేషము లగుట ప్రశంసార్హములు. ఇట్టి తత్త్వోద్ఘాటన మమూలకము. ఇట ప్రకృతి వర్ణన కథార్థోపయోగి యగుట కవి ప్రతిభావిశేషము.

రామనామార్థమ్ము రహి శారికలు వేఁడ
    శ్రుతిగూర్చు శుకరాజి సూనృతములు
మనుప విష్ణుఁడె కాక మరి లేఁడను పికాళి
    పంచమస్థాయి ప్రపంచితమ్ము
లరగాదు పొందిదె యరుదెంచు హరి యంచు
    నుబ్బియాడెడు లేళ్ల యుల్లసితము

లబ్బెగేయ ప్రబంధావళి మాకంచుఁ
    బాడఁజొచ్చెడు తేంట్ల పన్నుగడలు
నడుగకయమున్నె వాచం యమాశ్రమమ్మె
యదియును సుతీక్ష్ణమునిచంద్రునిదె యటంచుఁ
జెప్పకయ చెప్పె ................

— అర. కాం. - 1 ఆ., 175 ప.

కిష్కింధాకాండమున సీతాన్వేషణమునకై పిలిపింపఁబడిన వానరవీరుల నుద్దేశించి సుగ్రీవుఁడు రామకార్యావసరము నెఱుకపఱుచుచు —

ఇది సర్వభూతంబు లెనసి సేవింపనౌ
    పరవస్తు విద్వానఁ బరఁగుధర్మ
వెఱిఁగి భావించిన నెల్లలోకంబులు
    సంతుష్టిఁగాంచును స్వర్గలెలమి

మెచ్చి సన్మానింత్రు మేలొడ్ల కొనరించు
వారి జీవితమె భవ్యం బనంగ
మన కుపకారియై మనుచు నియ్యోడయనిఁ
గొలిచిన నింకిటఁ గొఱతలున్నె

త్వరపడుడు శ్రేయమొనఁగూడు తఱి ఘటిల్లె
నన్ను ఋణముక్తుఁజేయుఁడు నాదు చనువు
వడయుఁడు నిజప్రభావము ల్వెలనుపడఁగ
జనక సుత వార్తఁగొనితేరఁ జాలి కపులు

— కి. కాం. - 2 ఆ., 366 ప.

మూలమున నిప్పట్టున —

తతఃకృతం దాశరధేర్మహత్ప్రియం
మహత్ప్రియం చాపి తతోమమప్రియం

— వా. రా. - కి. కాం., 43 స., 51 శ్లో.

అని మాత్రమే గలదు. శ్రీరామకథాఽమృతమున తత్త్వోద్ఘాటనము మనోహరము, నమూలకమునై రాముని పరమార్థస్వరూపునిగా నిరూపించుచున్నది. సుగ్రీవుని పాత్ర చిత్రణమున విశిష్టత సంపాదింపఁబడియాతని విజ్ఞతను వెల్లడించుచున్నది.

సుందరకాండమున హనుమంతుడు లంకను ప్రవేశించి యన్వేషించి సీతం గానక యొకచోఁ జేరి చింతించుచు 'చిత్కళాఖ్య లక్ష్మి సిరి విద్యుల్లేఖ' వలె నెందుంచఁ బడినదో ? మహితయాయమఁ బొడగాంచి భవము గడవ నెవ్విధిగాంతునో గదా' యని తలపోసినట్లు వర్ణించుట యోగి, చిద్రూపిణినిఁ గాంచి భవము గడచుటను దెలుపు చున్నది. సుందరకాండ యోగశాస్త్రము. సీత చిద్రూపిణి. హనుమ యోగి. అతఁ డామెను బొడగాంచుట, చిత్కళ దర్శించుట. సాధకుఁడు సిద్ధిఁబొందుట. ఇట్టి సంప్రదాయార్థము నిట నుద్ఘాటించుట యమూలకము.

చిత్కళాఖ్యలక్ష్మి సిరిని విద్యుల్లేఖ
ఘాఁతి నెందు దాపఁబడెనొ కాల

మహిమ రాముదేవి మహిత యాయమఁబొడ
గాంచి భవము గడవఁగాంతు నొక్కొ
— సుం: కాం. - 1 ఆ., 230 ప.

అని లక్ష్యము మదినిడి య
య్యనిలసుతుఁడు సొచ్చె
(— సుం. కాం. - 1 ఆ., 231 ప.)

ననుటయుఁ బైనఁజెప్పఁబడిన యోగార్థ వివరణమున కుపబలకమగుచున్నది.

ఉత్తర కాండమున లోకవిద్రావణుఁ డగు రావణుని సంహరించి యయోధ్యఁ బట్టాభిషిక్తుఁడై యున్న రాముని యభినందింప వచ్చిన ఋషి సంఘము కుశలాదికముఁ బ్రశ్నించి 'భక్తపాలనము నందలి పరవశముననే మత్స్యాది యవతారములఁ దాల్చితివి. నేడు రామావతారమున భువనకంటకు రావణునిఁ బొలియింపఁ జేసితివి' అని ప్రశంసించిరి. నీవు సాక్షాద్విష్ణుఁడవ' ని నుతించుట యిందలి తాత్పర్యము. ఇది యమూలకము. (ఉ. కాం. పూ. భా. 1 ఆ. 32, 33 పలు) మఱియు 'నక్షతఁ బోకార్చి ముక్తి గూర్చుటకుఁ ద్వద్భక్తియే సమర్థ మగును. 'రామ' యను నక్షర ద్వయమే (ఆమయముల) రోగముల నశింపఁజేయును. యమదూతల దోమలపిండు వలెఁ దోలును. రాక్షస వినాశ మొనరించును' అని రామ మహత్త్వ మమూలకముగాఁ బ్రతిపాదింపఁబడినది. (ఉ. కాం, పూ. భా, 1 ఆ. 44, 45 పలు)

అగస్త్యుఁడు రామునకు రావణాదుల పూర్వచరిత్ర వివరించి రాముని చరితమున బహు రహస్యములు కలవని వాక్రుచ్చుచు రాముని చరితమున రహస్య మనని యక్కరమ్మొక్కఁడును లేదనియు, నొక్కొక్క వర్ణము నతి దురితహర మగునని పలుకుట హృద్యము. (ఉ. కాం. పూ. భా. 9 ఆ., 10, 20 పలు)

రాముని పట్టాభిషేకోత్సవ సంరంభములు ముగిసినంత జనకుఁడు రాముని వీడ్కొని మిథిల కరుగుచు సీతతో ముచ్చటించుట ('సీతా జనక సంవాదము' న) నాంతర్యమునఁ జీవుఁడు తన బుద్ధివృత్తిని పరమేశ్వరాయత్తము గావించి శుద్ధుఁడై

యుండుటాదిగాఁ గల తత్త్వముఁ బ్రతిపాదింపఁ బడినది.[1] పరమేశ్వరికి భక్తునికి నడుమ నున్న సంబంధము వారిరువురి సంబంధముగా నిందు వర్ణితము. ఇయ్యది యమూలకము.

అష్టకష్టములకును బాసైతి వెట్లొ
రమణి ననుగూర్ప నెడసె భారమ్మఖిలము
సుఖ సుఖంబున నున్న నీ శుద్ధవృత్తి
కేను బరిపాల్యనే యింక నిద్ధచరిత

ఉ. కాం. - పూ. భా. 10 ఆ., 54 ప.

యౌగికార్థమున నిట నష్టకష్టము లనఁగా నష్టాంగ యోగములని యర్థము. సీతను రామున కిచ్చి జనకుఁడు నిశ్చింతతో నుండుట ప్రకృతార్థము.

జనకుఁడు రామునిఁ గని సగుణబ్రహ్మగా సంభావించుటయు నీ సందర్భమునఁ జెప్పఁబడుట గమనార్హము. నిరతిశయ ప్రీతి, చిత్తము నియతి దలిర్చుట, యన్యమును గోరకుండుట యీశ్వర సందర్శనమునకు ఫలములు.

నీదు దర్శనమున నిరతిశయప్రీతి
నొదవె నీతి గతికి మది దలిర్చె
నో సుగుణముల ఖని ! యో మహారాజ ! నా
కేమి వలయు నయ్య యింతకన్న

— ఉ. కాం. - పూ. భా., 10 ఆ., 63 ప.

రాముఁడు యుధాజిత్తును సాగనంపువేళ నాతఁడు 'తదు<sup></sup>న్య పరాంబ' తనకు రాముఁడు 'పరమాత్మ' యని చెప్పినట్లు నుడివి సంభావించుట యమూలక తత్త్వోద్ఘాటనము. (ఉ. కాం. పూ. భా. 10 ఆ. 81-83 పాలు) ఆతని కవి సిద్ధించినవి.

భరతుఁడు రామునకుఁ బౌరకార్యములు విన్నవించు సందర్భమున భక్తితో రాముని ప్రసాదమును వేడుట జీవేశ్వరుల సంబంధ కథనమై రాముని లోకేశ్వరుఁ డగు విష్ణువుగాఁ బ్రతిపాదించుచున్నది.[1]

---

1. శ్రీ. రా. క. - ఉ. కాం. పూ. భా., 10 ఆ. 51-60 పాలు

అచలం గట్టిన విమానమందు జేరి సీతారాములు వనవిహార మొనర్చునెడ నందొకొక్క విహారమున నొకొక్క రూపమున విహరించి కడకు 'వేయి రేకుల తామర విరి విధమున సంస్కృతమ్మవు నచ్చోట జేరిర' ని వారి విహారమును గవులు వర్ణించిరి. అట్టిదౌ వర్ణనమున సీతారాములు సర్వదేవతా రూపముల సంభావింపఁ బడుట యమూలక తత్త్వోద్ఘాటనము. శ్రుతిస్మృతుల భిన్నత్వమున నట్టి విభాగ మేర్పడెఁగాని తత్త్వమున నొక్కటే యనుట సారాంశము.

కామేశ్వరీ మహాకామేశ్వరాద్వైత
సౌఖ్య సంపత్ప్రకాశ మిదె యొకొ
లక్ష్మీహృషీకేశ లక్ష్యవిశేషితా
ద్వైత విద్యాప్రమేయ మిదె యొకొ
బ్రాహ్మణీ బ్రహ్మ ప్రభావ సంపాదిత
ద్వైతేతిహాసికార్థ మిదె యొకొ
పౌలోమకన్యాదివస్పతి ప్రస్ఫుర
ద్వైత సాద్వైత బంధ మిదె యొకొ

యెడసినట్టు లుండి యేకత్వ మెనసిన
సర్వవేదముల రస మిదె యొకొ
వివిధ హోత లేకవిధగతి కయ్యెడు
తతికిఁ దోఁచనగు పవమిదె యొకొ

అనుభావంబుల కిక్కయౌ విచటఁగాదా ? మోదమెవ్వారికిన్
ముని మూర్ధన్యులు నిశ్చల ప్రణిహితాత్మల్గాంచువారట్టి ము
న్నవిరూప్య ప్రకృతి ప్రకార కలనావ్యాసక్తు నెల్లెట్లొ ? నేఁ
డనిమేష స్థితి సర్వదృశ్యమగు భాగ్యం బసామాన్యమే

— ఉ. కాం. - ఉ. భా., 1 ఆ., 160-61 ప॥లు

అట్టియెడ స్త్రీపురుషులను లింగభేదము కానరాదు. కేవల చిద్రూపమే గోచరించును. అందు స్త్రీకి ప్రాధాన్య మొసగిన శాక్తేయ మతమగును. పురుష ప్రాధ

మ్యమున శైవ వైష్ణవాది మతములు బహుళము లగును. తల్లింగభేద మపగత మగుచో నఖిల సమ్మతమగు నద్వైతము సిద్ధించును.[1] అని వివరించుట సంభావనీయ మగుచున్నది. సమన్వయ పద్ధతి హృద్యము.ఇదియే సర్వసిద్ధాంత సారము.

ఐతిహాసికులు రామాయణము కథగా వర్ణింప నాత్మవేత్తలగు వారంతరర్థంబు గలదని వివరింతురు. శ్రీరామకథాఽమృతమునందును "రామాయణాంతరర్థ సంగ్రహము" 38 పద్యములలో నధ్యాత్మసుందరముగా వివరింపఁబడు టమూలకము.[2]

పరమేశ్వరుడు పార్వతితో "నిదియకాదెద్దియైన భగవంతుని యవతార చరితములయందు యోగమునకు గాని, న్యాయమునకు గాని పరమార్థమున నన్వయింపని యితివృత్తంబుండదు. సరిగదా మహాపురుషుల చరితములన్నియు నన్నియతిన వర్తిల్లు నంత మాత్రమునకుఁ గథా భాగంబర్థరహితమనరాదు. పాఠకులు, శ్రోతలు నాయాయి విషయంబులను గమనించి యధోచిత పరిపాటినావర్తింపవలయు నియ్యదియె రహస్య మియ్యదియె పరమార్థ మియ్యదియె వేద్యంబని" వివరించినట్లు వర్ణించుట కవులితి హాసము నాధ్యాత్మిక దృష్టితో నవగాహనఁ జేసికొనినరీతి వ్యక్తమగుచున్నది. ఇట్టి సమన్వయ సిద్ధాంత మలవర్చుకొన్నవారు గావుననే యధ్యాత్మ రామాయణము వాల్మీకముతో జోడించి తత్త్వార్థయుక్తిననువదించిరి. ఇట్లు శ్రీరామకథాఽమృతమెడ నెడ నధ్యాత్మ రామాయణము ననుసరించి రచింపబడి గుణవత్తరమైనది.

---

1. శ్రీ. రా. క. ఉ. కాం. పూ. భా. 10 ఆ. 274–301 ప॥లు
2. శ్రీ.రా.క. — ఉ.కాం., ఉ.భా, 10 ఆ., 8–45 ప॥లు.

# శ్రీరామకథాఽమృతము – సమగ్రసమీక్ష

## రెండవ భాగము

## శ్రీరామకథాఽమృత కావ్యసమీక్ష

1. కథాసంవిధానము 2. పాత్రచిత్రణము 3. రసపోషణము 4. వర్ణనలు 5 శైలి 6. వేదశాస్త్ర సంప్రదాయ పాలనము 7. పూర్వకవి పద్యానుసరణము ( సంస్కృతాంధ్రములు ) 8. లోకోక్తులు 9. పదప్రయోగ దక్షత 10. అలంకారములు

## కథాసంవిధానము :

కావ్యమున కథను సులభసుందరముగాఁ జేసి చెప్పుట సుకవి చాతుర్యము నకు నిదర్శనము. మహర్షి వాల్మీకి శ్రీమద్రామాయణమున నట్టి కళను పుష్కల ముగాఁ బ్రదర్శించి కవిలోకమునకు మార్గదర్శియైనాఁడు. కాళిదాసాది మహాకవు లట్టి మార్గముననే పయనించి యఖండ కీర్త్యున్నతులను బొందినారు.

తెనుఁగున నన్నయ తన "ప్రసన్నకథా కవితార్థయుక్తి"తో "నవిత్వవిశా రదుఁడై" కవిలోక ప్రశంస లందుకొనినాఁడు. అట్టి యున్నతపథముననే నడచి నాచన సోముఁడు "కథాసంవిధాన చక్రవర్తి"గా గౌరవింపఁబడినాఁడు. పెద్దన తన "అల్లిక జిగిబిగి"తో నాంధ్ర కవితాపితామహుఁడై తనరినాఁడు. అట్లే కవిపుంగవులగు శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు, శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు "శ్రీరామ కథాఽమృత" కావ్యశిల్ప నిర్మాణమును దక్షతతో నిర్వహించి యట్టి కళను సుసంపన్న మొనర్చిరి. "సుకవి యుత్తమ కథకుఁడు"గా నెన్నఁబడుట వీరి యెడ సార్థకత నందినది. కథాకథన దక్షత పాఠకున కౌత్సుక్యము గూర్చునదై యుండుట పర మార్థము. అట్టి పరమార్థ మిందు సర్వవిధముల సాధింపఁబడినదనుట నిస్సంశయము.

ఇందు ముఖ్యముగా 1) భావికథార్థ సూచన. 2) ఆశ్వాసాద్యాశ్వాసాంత పద్యము లందుఁ బూర్వోత్తర కథావిషయములఁ బ్రతిపాదించుట. 3) అధ్యాత్మిక తత్త్వప్రతిపాదనము. 4) కథలోని గూఢార్థ వివరణము. 5) సంబంధి కథా వర్ణ నము. 6) కథలోని సన్నివేశముల స్థితిగతు లందలి మార్పులు. 7) అమూలకము లగు సన్నివేశముల నాదరించుట. 8) ఆత్మీయమగు రచనావిధానమును బ్రకటించుట మున్నగునవి పరిశీలింపఁబడును. ఇవి యన్నియు రచనాశిల్పమునకు సంబంధించిన విషయము లగుట గమనార్హము లగుచున్నవి.

## 1) భావి కథార్థ సూచన :

జరుగఁబోవు కథావిషయమును వర్ణనము లందు గాని, పాత్రల ముఖమున గాని, ముందుగాఁ దెలియఁజెప్పుట భావికథార్థ కథన మందురు. నాటకమున వియ్యాది సంధి, సంధ్యంగములు, నర్థోపక్షేపకములు మొదలగునవి ప్రవర్తింపఁబడుట ద్వార నిర్వహింపఁబడుచున్నది. పూర్వాపర కథా సందర్భముల సంయోజన గావించి సుగమ మొనర్చుట తత్ప్రయోజనముగా భావింపఁబడుచున్నది.

బాలకాండమున విశ్వామిత్రమహర్షి యజ్ఞసంరక్షణార్థము రాముని తనతోఁ బంపవలసినదిగా దశరథుని వేడుటకై యయోధ్యకు విచ్చేసినాఁడు. దశరథుఁ డాతనికి సబహుమానముగా స్వాగత సపర్య లొనరించి, యంజలి ఘటించి భక్తి యుక్తులుఁ దొలుకాడ విశ్వామిత్రునిఁ బ్రస్తుతించుచు నాతని యాగమనమును గూర్చి—

యథా మృతస్య సంప్రాప్తి ర్యథావర్ష మనూదకే
యథా సదృశదారేషు పుత్రజన్మాఽప్రజస్యచ
ప్రణష్టస్య యథాలాభో యథాహర్షో మహోదయే
తథై వాగమనం మన్యే స్వాగతం తే మహామునే
— బా. కాం.-18 స., 49, 50 శ్లో॥లు

అని సంభావించినట్లు వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథాఽమృతమున నయ్యెడ దశరథుఁడు—

మృతుని ప్రాప్తి మరుస్థలామిత సువృష్టి
యప్రజాపత్యలబ్ధి నష్టార్థలాభ
మట్లు పుత్రవివాహాది కాభ్యుదయము
నెంతు నీరాక కెనయని యేమనమున
— బా. కాం.- 5 ఆ., 18 ప,

అనినట్లు వర్ణింపఁబడినది. "పుత్రవివాహాదికాభ్యుదయము నెంతు నీరాక కెనయని యేమనమున" అనుటలో దశరథుని సంతోషముతోఁబాటు విశ్వామిత్ర పాత్ర ప్రయోజనమగు రామాదుల వివాహము సూచితమైనది. ఆదిపదముచే రామలక్ష్మణులను వెంటఁగొంపోయి "బలాతిబల" మొదలగు విద్యలకుఁ దోడుగా నపూర్వాస్త్ర సంపదఁ బ్రసాదించుట, యాగసంరక్షణానంతరము దేవతలచే వరబలముల నిప్పించుట, జనకుని యజ్ఞ సందర్శనము, శివధనుర్భంగము, దశరథ తనయుల వివాహము మున్నగున వన్నియు సునిపుణముగా సూచింపఁబడినవి. మూలమున "మహోదయే" అని మాత్రమే యుండ నాంధ్రమున నమూలకముగా నిట్టి సౌందర్యము సంతరింపఁ బడినది.

రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట మిథిల కరుగుచుండగా నాతఁడు గంగావతరణ, సముద్రమథనాది కథల వారి నలరించు చుండెను. సాయంసమయ మగుట మార్గమధ్యమున "సుమతి రాజ్యమున నీరేయి వసించి రేపకడ మిథిలేశుఁ డగు జనకుని దర్శింపవచ్చు"నని విశ్వామిత్రుఁ డనినట్లు వాల్మీకమున గలదు.

ఇహాద్యరజనీం రామ సుఖంవత్స్యా మహేవయం
శ్వః ప్రభాతే నరశ్రేష్ఠ జనకం ద్రష్టుమర్హసి
— బా. కాం.- 47 స., 19 శ్లో

శ్రీరామకథాఽమృతము నందీ ఘట్టమున మూలమున లేకున్నను రాముఁడు వినమ్రుఁడై —

అమృతవార్ధి నోలలాడించితే మౌని
చంద్ర! మమ్ము నీ ప్రసాదలబ్ధి
నింక జాలు గరఁగుటెంతటి పని యని"
— బా. కాం.-6 ఆ., 35౨ ప.

పలికినట్లు వర్ణింపఁబడినది. విశ్వామిత్రుఁడు వివిధములగు కథలు నుడువుచు "నమృతవార్ధిలో నోలలాడించినాఁడు. రాముఁ డందులకు "మౌనిచంద్ర"నీ ప్రసాదలబ్ధి నింక జాలుఁగరగు టెంత యనినాఁడు. అనఁగా ముని "జాలకైనను హృదయము కరుగునట్లు చేయువాఁడని సంభావింపఁబడినాఁడు. మఱియు నిట మఱు నాఁడు జరుగఁబోవు నహల్యాశాపవిమోచనము సూచితమైనది. భావికథార్థ స్ఫోరక ముగా నిర్వహింపఁబడిన యీ ఘట్టము సహృదయుల నలరింపఁజాలినదై యొప్పు చున్నది. విశ్వామిత్రుఁ డది యెఱింగినవాఁడు గావున "తపసి మురియుచుండె నంత" అనుట విశేషము. ఇట కవుల కథాప్రసన్నతయు నిరూపింపఁబడుట హృద్యము.

శివధనుర్భంగ వార్తవిని దశరథుఁడు జనకుని యాహ్వానమున సపరివారుఁడై మిథిల కేగు సందర్భమున నాగరులు భరత శత్రుఘ్నులనుఁ జూచి పెండ్లికుమారులుగాఁ దలపోసిన విధము దశరథు నలువురు తనయుల వివాహ విధిని స్ఫురింపఁజేయు నియ్యది యమూలకము.

పిన్నకుమారు లిర్వురను బెద్దఱికం బలరార మేలి క
న్నన్నలఁ దేరలెక్కి మహిజానికి గన్నుల విందు సేసి రా
చిన్నెలెఱింగి నాగరులు శ్రీఘ్రమె పెండ్లికుమారు లౌదురీ
యన్నలు నంచు భావము బయల్పడ వేడుక మాటలాడగన్

— బా. కాం.-6 ఆ., 35 ప.

అయోధ్యాకాండమున రాముఁడరణ్యావాసమునకుఁ బోవుచుఁ దల్లిఁగౌసల్యను "అనుమతి నెఱపుము జగద్ధితార్థ మరయుచున్" [1] అని వేడుకొనుటనుబట్టి రాముఁ డరణ్యమున కేగి దుష్టరాక్షస సంహార మొనర్చి దేవ ముని జన సమూహములకు మేలు గూర్చుట యను నర్థము సముపపాదితమై భావికథార్థసూచక మగుచున్నది. సంద ర్భాంతరమున భరద్వాజుఁడీ విషయమునే కైకేయిని నిందించు భరతునితో—

నదోషేణావగంతవ్యా కైకేయీ భరత త్వయా
రామప్రవ్రాజనం హ్యేతత్సుఖోదర్కం భవిష్యతి
దేవానాం దానవానాంచ ఋషిణాం భావితాత్మనాం
హితమేవ భవిష్యతి ....

— అయో. కాం.-92 స., 29, 30 శ్లో॥లు

అని పలికినట్లు వాల్మీకమున గలదు. ఇట్టి గంభీరార్థ ప్రతిపాదనము కడుం గడు నమర్థమై కవి కథాకథన దక్షతను నిరూపించుచున్నది. అమూలకమగు నీ యర్థము ఆంధ్రీ కరణమునకు వెన్నె గూర్చుచున్నది.

భరతుఁడు సపరివారుఁడై చిత్రకూటమున కేగి రాము "నయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁడవు కమ్మ"ని యర్థించు సందర్భమున —

అనుచు గైక సుకృతమాత్మఁబొందుమహాభు
జుండు కనుల నీటిసోనతోడ
యన్నపాదయుగళి కభిషేకవిధి గూర్చు
నెఱిని శిరసుమోపి నెఱయుటయును

— అయో. కాం.-9 ఆ., 22 ప.

---

1) 3 ఆ., 249 ప.

భరతుఁడు రామునకు నమస్కరించుచుఁ గన్నీటి ధారల నాతని పాదములఁ గడిగినాఁడు. అది భరతుని భక్తి భావమునకు నిదర్శనము. మఱియుఁ బదునాలుగేండ్లగు వఱకు రాముఁ డయోధ్యకు మఱలి రానందున భరతుఁడు రామపాదుకలకే యభిషేక మొనరించు భావికథార్థ మిట సుందరముగాఁ బ్రతిపాదింపఁబడినది. ఇట్టి సన్నివేశ నిర్వహణ మమూలకము.

రాముఁడు దండకారణ్యమును జేరి పంచవటి యందు నివాస మొనర్చు సందర్భమున—

ఆరుల గాల్చుచిచ్చొ యన రాముఁ డచ్చోటు
సేరి మెఱసె .... ....

— అర. కాం.-1 ఆ., 339 ప.

అని వర్ణించుట వలన శూర్పణఖ పరాభవము, ఖరదూషణాది 14000 రాక్షసుల సంహారము సూచింపఁబడినవి.

రామలక్ష్మణులు లేనిసమయమున వంచనమెయిఁ బంచవటి యందు బ్రవేశించి తన్ను బలాత్కారముగ నెత్తికొనిపోవుటకు యత్నించు రావణునితో సీత—

నీవు గొనెడు చిచ్చు నిన్నొంటిఁబోనీయ
దిరుగుఁ బొరుగువారి నెల్లఁగాల్చు
రాజు చెట్ట వాని రాష్ట్రమెల్ల హరించు
ననెడు మాట నిక్క మసుర! వినుము

—అర. కాం.-3 ఆ., 152 ప.

అనినట్లు వర్ణింపఁబడినది. అగ్నిసదృశ నగు నన్నుఁ బాపమనక గొంపోవనున్న నీవు, నిన్నాశ్రయించినవారు వినాశము బొందక తప్పదను విషయమును వెల్లడించుచున్నది. లోకమునఁ బవిత్రతను జాటుటకు నగ్నితో సాదృశ్యముఁ జెప్పుట ప్రసిద్ధము. "అగ్నిర్మాణవకః" ఇత్యాద్యాలంకారిక ఫణితి యిందులకుఁ బ్రమాణము. ఇట సీతయే చిచ్చు. సీతం గొంపోయిన రావణుఁడు చిచ్చుఁగొంపోయినవాఁ డయ్యెను. ఆ చిచ్చే సుందరకాండమున నాంజనేయుని రూపమున లంక దహించినది. "ఏషోగ్ని రాయాతః కపిరూపేణ హా ఇతి" అని వాల్మీకి వాక్యము. రావణుని నిలువెల్లఁ గాల్చి

నది. తదనుచరుల నాశ మొనర్చినది. ఇట్టి గంభీరార్థ ప్రతిపాదన మొనరించుచు సీత నోట వెలువడిన మాట లమూలకములు, భావి కథార్థసూచనములునై కథా కథనమున శాస్త్రిగారి నైపుణిని దెలుపుచున్నవి.

సీత పర్ణశాల యందు లేకుండుటను గాంచి దుఃఖించుచు నడవి నెల్లెడఁ జెట్టులను, బుట్టలను, బశువులను, బక్షులను సీత జాడ గూర్చి ప్రశ్నించుచుఁ దిరుగుచున్న సందర్భమున రాముఁడందు వానరము నుద్దేశించి—

వానరవర్య! యెల్లెడ శివం బెనయం గల వెంచి పల్కుమా
సూన శరాసు నాఱవ ప్రసూనపుముల్కు ధరాతనూజ న
మ్మానినిఁ గాంచి తేని ననుమానము వీడుము తోడివారిలో
నీ నెఱి వన్నెకెక్కఁ దఱినిల్పెద రాజ పదాగ్ర్య పీఠికన్
— అర. కాం.- 3 ఆ., 58 ప.

అని యడిగినట్లు వర్ణింపఁబడినది. మున్ముందు రాముఁడు వానరముఖ్యులతో సఖ్య మొనర్చి వారి కొసఁగు ప్రాధాన్య మిందు సూచితమైనది. వారి సాహాయ్యముననే వారధి బంధించి రావణసంహారము గావించుట రామాయణేతివృత్త మగుట విదితము. ఇట్టి కల్పన మమూలకము హృదయంగమమునై యొప్పు చున్నది.

కిష్కింధాకాండము నందు రాముఁడు సీతావిరహదుఃఖమున బరవశత్వము నందుచు —

ఈ, చక్కి మెలంగుచున్న యది సాధ్వి యటంచు వచించువారు లే
రక్కట యింతతోడ్పడిన నప్పురిఁగాల్పనె వైరిఁగూల్పనే
— కి. కాం.- 2 ఆ., 147 ప.

అని పలికినట్లు చెప్పుట కవి స్వోపజ్ఞము. ఇందు భావికథార్థ మగు లంకాదహనము, రావణ సంహారము సూచింపఁబడినవి.

సముద్రలంఘనమునకై జాంబవంతుఁడు హనుమంతునిఁ బ్రేరేపించుచు—

నీతేజగ్గియు లంక గప్పునమునై నీరాజనం బ్వజ్జయ
శ్రీ తృప్తిన్నటియించుఁగాతఁ బ్రఖతిశ్రీ విన్వరింపంగ సా

కేతాభిఖ్యపురీ వతంసమునఁ గిష్కింధం బురంధ్రీజనా
సీతమ్ముల్సుమముల్కటాక్ష తతులన్నీ పైఁబడుంగావుతన్ 3 ఆ., 295 ప.

అని యాకాంక్షించినట్లు వర్ణింపఁబడినది. హనుమంతుని తేజ మగ్గిగను లంక గప్పురముగను సంభావింపఁబడుట మనోహరము. ఇందు లంకాదహనము, సీతాదర్శన రూపమగు కార్యసిద్ధి, ద్యోతకము లగుచున్నవి. ఇట్టి స్వతంత్రభావ సంపద కవిప్రతిభావిలసిత మగుట ప్రశంసార్హము.

సుందర కాండమున సీత రామునకుఁ హనుమంతునితో సందేశమున్ జెప్పి పంపుచు దన దైన్యస్థితి వర్ణించి దురదృష్టమునకు నొచ్చుకొని "మదీశునెమ్మదిం, బాదుకొనంగఁ దెల్పుమట బాట విధాత విధింపకుండునే"[1] అని పలికినట్లు వర్ణింపఁబడినది. ఇట్టి భావన మమూలకమై సముద్రమున వారధి బంధనమును సూచించు చున్నది.

యుద్ధకాండమున విభీషణుఁడు రావణునిచే నిందింపఁబడి సభనుండి నిష్క్రమించి, రాముని సమాశ్రయింపఁబోవుచుఁ దల్లి కైకసి యనుమతి వేడగా నామె నీ ధర్మము నిన్ను రక్షించునని పలుకుచు—

> పొమ్మన్న చిరంజీవివి
> గమ్మన్నా! రామవిభుని కారుణ్యమునన్
> రమ్మన్నా మహితుఁడవై
> యిమ్మన్నా మహము మరల నీకన్నులకున్
> — యు. కాం.-పూ. భా., 2 ఆ., 271 ప.

రామవిభుని కారుణ్యమునఁ జిరంజీవివై మహితుఁడవగుచుఁ దిగిరి వచ్చి మా యందఱకు సంతోషమును గూర్చుమని దీవెన లొసఁగినట్లు వర్ణించిన విధము రమణీయత వెలార్చుచున్నది. లోకమునఁ జిన్నలు తమకు నమస్కరింపఁ "చిరంజీవ" యని పెద్ద లాశీర్వదించుట సంప్రదాయము. అట్టి సంప్రదాయ పాలనమునకు దోడుగా

---

1) 2 ఆ., 452 ప.

నిట రాముని కృపవలన విభీషణుఁడు "చిరంజీవి"యై లంకాధినేతయై తన వారి కామోదము గూర్చుట యను భావికథా విషయములను సూచించుచున్నది.

ఉత్తరకాండమున రామపట్టాభిషేకోత్సవమున కేతెంచిన జనకుఁడు తిరిగి మిథిల కరుగుచు రాము నుద్దేశించి —

రామ! పావననామ నీ రామతోడ
దమ్ము గుజ్జులతోడ నేత్రమున దవిలి
సుచిరముగ రాజ్యమేలుము సుహితకృతులఁ
దండ్రి మఱపించెఁ గొడుకని ధరవొగడఁగ
సీత బంగరుబొమ్మ నీ సిరులఁబెంప
నశ్వమేధాదు లొనరింపు మాదరమునఁ
బ్రజల ధర్మంబుతోఁ బ్రోవఁ బాటుపడుము
భావ్యమదె కాదె నీయట్టివాని కనఘ
సంతానము జోడగు మే
ల్సంతానము సుఖమొసఁగు సౌమ్యుఁచనీయెదన్
సంతోస మెనయు మని శ్రీ
మంతుఁడు భరతానుగమ్యమానుండగుచున్

— ఉ. కాం.-పూ. భా., 10 ఆ., 66-8 పၤలు

ఓరామా! భార్యతోడను దమ్ములతోడను గూడి చిరకాలము రాజ్యమేలుము. సత్కర్మముల నాచరించి తండ్రి మఱపించెఁ గొడుకని లోకమువొగడ, బంగరుబొమ్మ సీతతోఁ గూడి యశ్వమేధాదు లొనరింపుము. ప్రజల ధర్మమున బాలింపుము. కల్ప వృక్షములతో సమానమైన మేల్సంతానమును బడసి సుఖింపు" మని దీవించి వెడలి నట్లు వర్ణింపఁబడినది. ఇట జనకుని వాక్కులలో రాముఁడు దశవర్షసహస్రములు సుఖముగా రాజ్యమేలి జనాపవాదము కారణముగ సీత నడవికిఁ బంపి, బంగరుబొమ్మ సీతతో నశ్వమేధాదు లొనరించుట, "జోడగు మేల్సంతానము" అనగా బరాక్రమ వంతులు కవలలు నగు కుశలవు లను తనయులను బడయుట మొదలగు రామ రాజ్యము నంపలి విషయము లన్నియు బ్రస్తావింపఁబడినవి. ఇట్టి భావికథార్థ స్ఫోరక మగు రచన మమూలకము, హృద్యమునై సరసుల నలరించుచున్నది.

రాముఁడు గర్భవతి యగు సీతకు గర్భదోహదక్రియగా నామె కోరికను దీర్ప నిశ్చయించి "నీకుఁ గల కోర్కెఁదెలుపుమ"ని యడుగుచు—

నేమ తీర్పవలయు నీకోర్కె యెయ్యది?
యేమి కోరుచుంటివేః మహేచ్ఛ!
నెలఁత! మౌని లాలనీయం బపత్యంబు
నీకు నసముఁగూర్ప నెగడ వలయు

— ఉ. కాం.- ఉ. భా., 2 ఆ., 14 ప.

అని సీత నడిగిన విధము వాల్మీకి ముని మన్నన లందిన కుశలవుల జనన మును సూచించుచున్నది. ఇయ్యది యమూలకము. లోకమున గర్భవతుల కోర్కెల నాదరించి తీర్చుట, అట్లుకానిచో ననర్థము శంకించుట పరిపాటి. మునిమాన్యమగు సంతతియుదయింప వలయు ననున దాశంస. ఇట్టి రమణీయార్థ ప్రతిపాదన మత్యం తముఁ బ్రశంసనీయ మగుచున్నది. కవిలోకజ్ఞత కిది నిదర్శనము.

గంగాతీరమున "సీత నరణ్యముల విడిచిరమ్మ"ను రామాజ్ఞ కడలుచున్న లక్ష్మణునిఁ గాంచి యది రామని మోగమునఁ గల్గిన దుఃఖముగా సంభావించిన సీత లక్ష్మణునితోఁ "దాపసాశ్రమముల దర్శించి శీఘ్రముగ రామప్రభుని సేవింపఁబోవు దమ"ని పల్కుచు—

తాపసుల నెలవెనయుదుఁ దడయ కనఘ
సంతతి గాననయి వచ్చి స్వామిమెచ్చ
నచ్చపుం గీర్తి వెలయ నిత్య సుఖమందుఁ
దాన శపథంబొనర్తు నింతకును సౌమ్య!

— ఉ. కాం.- ఉ. భా, 2 ఆ., 150 ప.

అని యూరడించినట్లు వర్ణింపఁబడినది. ఆలసింపక మున్యాశ్రమముల జూచి పుణ్యసంపదఁ బడసి, స్వామి మెచ్చ సత్కీర్తి వెలయ సుఖములందుదాన నిది యంతయు నిజమని శపథ మొనరించుట ప్రకృతార్థము. ఇటఁ దాపసుల నెలవెనయుట యనఁగాఁ దాను వాల్మీక్యాశ్రమమున కరుగుట, "అనఘసంతతిని గాననయి" యనఁగా నసాహసన్య విద్యా బలపరాక్రమ సంపన్నులగు (కుశలవుల) సంతతిని గని, వచ్చి

యనఁగా వాల్మీకి మునితోఁ గూడి యశ్వమేధ యాగసందర్శనమున కేతెంచి, స్వామి మెచ్చునట్లుగాఁ బతివ్రత యను నచ్చపు గీర్తి వెలయ శపథ మొనర్చి "నిత్యసుఖ మందు"ట యనఁగాఁ దన యవతార పరిసమాప్తి గావించి భూమాత యొడిలో నొదిగి వైకుంఠమునకుఁ జేరి రాముని రాకకై వేచియుండుట మొదలగు విషయములతోఁ గూడిన భావికథా భాగము సూచితమగు చున్నది. అమూలకమగు నిట్టి కల్పన మాలో చనామృతమై సహృదయ హృదయానందదాయక మగుచున్నది.

## 2) ఆశ్వాసాద్యాశ్వాసాంత పద్యములందుఁ బూర్వోత్తర కథావిషయములఁ బ్రతిపాదించుట :

శ్రీ రామకథాఽమృతము "పరమేశ్వరార్పితంబై పరగెడు"నది యగుచుఁ "బరమార్థంబై పరతత్త్వయోగ ఘటనాపరమై" యొప్పుచున్నది.[1] అందాశ్వాసాద్యాశ్వాసాంత పద్యములు పరమేశ్వర సంబోధన పరములై యలరుచున్నవి. అట్టి పద్యములలో వేదాంతార్థ విషయ వివరణతోఁబాటు యథావకాశము పూర్వోత్తర కథా కథనమున కవులు ప్రదర్శించిన చాతుర్య మిందు వివరింపఁబడుచున్నది.

బాలకాండ ప్రథమాశ్వాసమునఁ బ్రథమముగ—

శ్రీయున్గౌరియు వాణియున్గొలువ సచ్చిత్తత్త్వమయ్యున్మహా
మాయారూఢి నతండితండను భిదాత్మత్వంబు రూపించి యెం
దే యోగీంద్రులు స్వాత్మరాముఁడనఁ దానేవెల్గు నేవెల్గు న
న్నాయంజాలని ప్రేమ నాహరిహరబ్రహ్మంబు రక్షించుతన్ —1 ఆ., 1 ప.

అని సచ్చిత్తత్త్వము కీర్తింపఁబడినది. మాయతోఁగూడి యొకే తత్త్వ మిన్నిరూపముల బ్రవర్తిల్లుచున్నదని చెప్పు "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" అను బృహదారణ్యకోపనిషద్వాణి యిందు గతార్థ మగుచున్నది. మఱియు యోగులకు మాత్ర మాతఁడు స్వాత్మరాముఁడు. ఇట "యోగినః రమన్తే అత్ర ఇతి రామః"

1) బా. కాం.-1 ఆ., 39 ప.

అను నర్థము ప్రతిపాద్యమై రామకీర్తనతో శ్రీరామకథాఽమృతమునకు నాంది పలికి నట్లైనది.

తృతీయాశ్వాసమున రామాదుల జననాది విశేషములు వర్ణితములైనవి. ఆ కథాభాగమును సూచించు నాశ్వాసాది పద్యమున నావిర్భావ విషయము ప్రస్తావింపఁ బడుట హృద్యము.

శ్రీవిద్యాదేవీ సం
భావిత భాసురవిలాస పరిష్కృత సుభగా
భావుక జగదండ విభూ
త్యావిర్భావాది కల్పనాధిష్ఠానా! — 3 ఆ., 1 ప.

పంచమాశ్వాసమున యాగరక్షణార్థమై రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట నరుగుచు రాముఁడు మాయాబలసమన్విత యగు తాటకను సంహరించుట, మారీచ సుబాహులాదిగా గల రాక్షసుల శిక్షించుట, మునిజనుల కానందమొలయ యాగపరిరక్షణము గావించి శ్రేయోదాయకుఁ డగుట వర్ణింపఁబడినవి. అట్టి కథా భాగమును వివరించుచు చతుర్థాశ్వాసాంతమున —

మాయాదూరవశీకృత
మాయా మాయిక జనాపమార్గవిదళన
శ్రేయః ప్రదాన నిపుణ
శ్రీయుతమూర్తిత్రయానుశిష్టవిశేషా
— 4 ఆ., 316 ప.

అని సంభావించుట చారుత్వమును వెల్లడించుచున్నది. చతుర్థాశ్వాసమున యోగ మాయాజనన ఘట్టము వర్ణితమగుటయుఁ జక్కగా సూచింపఁబడినది.

షష్ఠాశ్వాసమున యాగపరిసమాప్త్యనంతరము విశ్వామిత్రుఁడు మునిగోష్ఠి నుండి ప్రమాణపురస్సరముగాఁ "రామతత్త్వంబిదియె పరబ్రహ్మమ"ని నిరూపించుట, మిథిల కేగుచు రామలక్ష్మణులకు సముద్రమథనాది కథావిశేషములు వివరించుట వర్ణితము లయినవి. షష్ఠాశ్వాసాంతమున—

అమృతప్రదాన నిపుణానుశాసనా
విమతాక్షహాలహల వేదనాదనా
ప్రమితి ప్రమాణవిధిభాసిభాసనా
సమతీత తత్త్వపరసామగాయనా

— బా. కాం.-6 ఆ., 371 ప.

అని పరమేశ్వరుని సంభావించుట వలనఁ బై కథాభాగములు సూచితములైనవి. అష్ట మాశ్వాసమున సూర్యాస్తమయ చంద్రోదయ, చంద్రాస్తమయ సూర్యోదయములు వర్ణింపఁబడినవి.

శ్రీ మదహిమకిరణాఽమృత
ధామాస్తమాయోదయ ప్రధానవిశేష
భ్రామిత కలాముహూర్తా
ద్యామంత్రిత కాలరూపతాంచిత దేవా ?

— బా. కాం.-8 ఆ., 1 ప.

అని యాశ్వాసాదిని వర్ణించుట యందలి విషయములు సునిపుణముగా సూచింపఁబడినవి. దశమాశ్వాసమున రామాదుల వివాహమహోత్సవ సంరంభము, పరశురామ ప్రసాదము వర్ణింపఁబడుట—

శ్రీకల్యాణగుణాంచ
త్ప్రాకామ్యవిభూతి లక్ష్యపావనచరిత
శ్రీకారిత ప్రసన్న జ
నాకారిత పరమపద మయాత్మవికాసా !

— 10 ఆ., 1 ప.

అను నాశ్వాసాది పద్యమున సూచితమైనది.

అయోధ్యా కాండమున చతుర్థాశ్వాసమున రామునకు వనవాసానుజ్ఞ నిచ్చుట సతితో, ననుజ సహితుఁడై రాముఁడు విశ్వేకారమున నరణ్యముల కేగుట మొదలగునవి వర్ణింపఁబడినవి. పట్టాభిషేక వార్త వినినప్పుడు, వనవాసవార్త వినినప్పుడు రాము

డెట్టి వికారమును లేక గంభీరముగ వర్తించె ననుట యాతని యుదాత్తతకు లక్షణముగా గీర్తించుట సువిదితము. ఆ విషయ మాశ్వాసాది పద్యమున నిట్లు సూచింపఁబడినది—

శ్రీసంయోగ వియోగౌ
దాసీన్య విలక్షణాత్మతాంచిత నిగమాం
తాసాద్య దైవపుర చి
త్ప్రాసాదాగ్రానుభావ్య పరమైశ్వర్యా
— 4 ఆ., 1 ప.

నవమాశ్వాసమున సపరివారుఁడై భరతుఁడు రాముని యయోధ్యకుఁ దోడ్తెచ్చుటకై చిత్రకూటమున కేతెంచుట, రాముఁడు పాదుకలు ప్రసాదించి భరతుని కటాక్షించుట మొదలగు కథాభాగము వర్ణింపఁబడినది. ఆశ్వాసాది పద్యమున నా విషయము వివరింపఁబడుట మనోహరము.

శ్రీపాదుకావహన దీ
క్షాపారమ్యాంచితాత్మజనరక్షా త
త్పాపాపనోదలక్ష్య
వ్యాపార కృపాకటాక్ష యఖిలాధ్యక్షా !
— 9 ఆ., 1 ప.

అరణ్యకాండమున ప్రథమాశ్వాసము నందాదిపద్యమున నా కాండ యందలి విషయము లన్నియు సూచితమగుట హృద్యము.

చతుర్థాశ్వాసమున కబంధవధ, శబరి ననుగ్రహించుట మొదలగు కథా భాగములు వర్తిల్లినవి.

లింగవిశిష్టజాతి భృదలీక వికార విదూరభావనా
సంగత భక్త లోకచయ సంస్కరణాత్తవిచారచేతనా

ఇత్యాద్యాశ్వాసాంత పద్యమున నయ్యే విషయములు సూపపాదితము లైనవి.

సుందరకాండమున తృతీయాశ్వాసము నందు హనుమంతుఁడు అక్ష కుమారుని సంహరించుట, ఇంద్రజిత్సేనరూపుమాపుట, లంకాదహనము గావించుట మొదల

గునవి వర్ణితములైనవి. అశ్వాసాంత పద్యమున నవి యన్నియు సూచితమగుట సంభావ్యము.

యుద్ధకాండమున పూర్వభాగము ప్రథమాశ్వాసము నందు సుగ్రీవుఁడు రామునకు యుద్ధోత్సాహమును గల్గించుట, రావణుని మంత్రాలోచనము మొదలగు నవి వర్ణింపఁబడినవి. ఆ కథా భాగమును సూచించు నాశ్వాసాది పద్యము హృద్యము.

శ్రీహేతుభూత మంత్రో
త్సాహోంచిత శక్తియోగ సంభృత మహిమ
ప్రాహుణకీకృత నిగమ
వ్యాహృత సామ్రాజ్యకృత్య యఖిలస్తుత్యా

ఆశ్వాసాంతమున——

సురాసుర హితేషణా! సుజన సద్గుణాన్వేషణా
పరాన్వయ విభీషణా! బహు కలాసమాశ్లేషణా
వరాభయ విభూషణా! వలదఘౌఘసంశోషణా
పరావరవిశేషణా! పృథిత భక్తసంతోషణా!

అని వర్ణించుట ముందు 2, 3, ఆశ్వాసములలో జరుగబోవు విభీషణ శరణాగతి, రాముఁ డభయ మొసంగుట మొదలగు కథాంశములను సూచించుచున్నది.

ఉత్తర భాగము ద్వితీయాశ్వాసమున సీతారాముల సమాగమము, పట్టాభిషేకము, రాజ్యభార ధురంధరత, శుభలక్షణవ్యాప్తి మొదలగునవి వర్ణితములైనవి. ఆ కథాంశములను సూచించుచు నాశ్వాసాది పద్యము రచింపఁబడుట మనోహరము.

శ్రీసాన్నిధ్య విశేషో
ద్భాసి వికాసాప్రమేయ బహు శుభగుణ ల
క్ష్మీ సంప్రదాయకలనా
ప్రాసంగిక విశ్వరూప భవ! పరమేశా!

— యు. కాం.- ఉ. భా., 2 ఆ., 1 ప.

ఉత్తరకాండ పూర్వభాగము ప్రథమాశ్వాసమున నగస్త్యాది మహర్షులు పట్టాభిషిక్తుఁ డగు రాముని సంభావింపవచ్చుట మొదలగు కథాంశములు వర్ణింపఁబడినవి.

> శ్రీమైత్రావరుణి ప్రము
> ఖా మేయ తపోవిరూఢ యమివరచరితో
> ద్దామ లసద్వరివస్యా
> కామద సుగుణోత్తర ప్రకాండపరేశా !
>
> —1 ఆ., 1 ప.

ఆశ్వాసాది పద్యమగు నిందు భావికథార్థము సుందరముగా సూచింపఁబడినది. ఉత్తరకాండ యనుటయుఁ దెలియఁజేయఁబడినది.

అష్టమాశ్వాసమున హనుమచ్చరిత్ర వర్ణించుట యాశ్వాసాది పద్యమున వెల్లడి యగుచున్నది.

> శ్రీ మేదినీతనూజా
> తా మార్గసుమార్గణవ్రత ప్రజ్ఞాత
> స్థేమాన్యతత్వ హనుమ
> త్స్వామి తదాత్మత్వసిద్ధ సమరసభావా !
>
> —8 ఆ., 1 ప.

ఉత్తరభాగమున ప్రథమాశ్వాసమున సీతారాముల వనవిహార విశేషములు వర్ణింపఁబడినవి. ఆ విషయ మాశ్వాసాది పద్యమున బ్రతిపాదించుట ముదావహము.

> శ్రీ సీతారామ పదా
> బ్జా సంచిత భూవివిధ విహారవిలాస
> ప్రాసంగికైక వీచీ
> భాసుర మహిమార్ణవ ప్రణవనిజసత్త్వా !
>
> —1 ఆ., 1 ప.

చతుర్థాశ్వాసమున రాముని రాజ్యపాలనము నందలి ధర్మవర్తనము వర్ణింపఁబడినది. రాముఁడు కుక్క విన్నపము మన్నించుట, గృధ్రోలూకముల వివాదము

పరిష్కరించుట మొదలగునవి యిందుల కుదాహరణములు. అశ్వాసాది పద్యమున నా విషయము వివరింపఁబడుట మనోహరము.

శ్రీ సేవితాంఘ్రిరేణూ
భాసురధర్మప్రసంగపాలన లోలో
ల్లాసమయ సగుణమూర్తీ
ధీసమవేతా. గుణప్రతీత స్ఫూర్తీ!

— 4 ఆ., 1 ప.

ఇట్లు శ్రీరామకథాఽమృతమునందంతట నాశ్వాసాద్యాశ్వాసాంత పద్యములఁ బూర్వోత్తర కథావిశేషములు వివరింపఁబడుట మనోజ్ఞము, రచనాశిల్పమునై వెలయు చున్నది.

## 3. అధ్యాత్మిక తత్త్వ ప్రతిపాదనము :

అక్షర పరబ్రహ్మము నుపాసించుట ద్వారా తత్త్వము నెఱుంగుట సాహితీ ప్రపంచము యొక్క పరమలక్ష్యము. కళ లన్నింటి యందును గ్రహింపఁదగు పరమార్థ మదియే యని పెద్దల యభిప్రాయము. "... విద్యా యావిముక్తయే" అనున దార్యోక్తి. అదియే భారతీయ సాహిత్యవ్యక్తృత మనుటలో నెట్టి సంశయము లేదు. కామశాస్త్రము సహితము ధర్మప్రబోధమునకై యుద్దేశించి రచించిన మహోన్నత సంస్కృతి యందంతకంటె భిన్నభావన యుండుటకు వీలులేదు. వాల్మీకిమహర్షి రామాయణమున నెన్నియో విధములఁ దత్త్వప్రతిపాదనము గావించినాఁడు. కవులు, వ్యాఖ్యాతలెందరో యావిషయమును విపులముగ వివరించినారు. అట్టి సంప్రదాయము విస్మరింపక శ్రీరామకథాఽమృత కవులు నాధ్యాత్మిక తత్త్వప్రతిపాదనము గావించిరి. కేవల కథయే కాక తత్త్వపరమార్థము వివరింపఁబడుట కావ్యమునకు విశిష్టత సిద్ధించినది. అట్లని తత్త్వప్రతిపాదనము కథాంశముల కెట్టి భంగమునుగాక తజ్ఞుల నలరించుట ప్రశంసార్హము. సామాన్యులకు సుబోధమొనర్చుట పరమార్థము.

శ్రీరామకథాఽమృతము బాలకాండమున[1] "దనయాశ్రమమున కేతెంచిన నారదు నతిథి పూజల దన్పి వాల్మీకి "అర్థి వేడెద నిన్మహర్షి సత్తమ కూర్పు, మీప్రశ్న యోగ్యార్థ మెలమిదొనక" అనుచు సున్నత గుణగరిష్ఠుఁ డగు పురుషోత్తము నొక్కనిఁ

1) బా. కాం.-1 ఆ., 2 ప.

దెల్పుమని వేడినట్లు వర్ణించుట వలన కవులు రామకథ సంభావించినతీరు సుస్పష్టమగు చున్నది. "శాస్త్రవేత్త"లగు కవులు "నైకవిద్యారహస్యముల్ స్వీకరించి"1 "అఖిల తత్త్వసారమగు" వియ్యది "రామహృదయ రహస్యార్థ రమ్యటీక"2గా నంతరించిరి. తదనుగుణముగానే వర్ణనలు పాత్రపోషణము, నిర్వహింపఁబడినవి. స్వతంత్రముగా వర్ణింపఁబడిన రామాదుల బాల్యము, సీతకైశోరకము మొదలగున వందుల కుదాహరణ ములు. సీతారాముల వనవిహార వర్ణనమున నమూలకమగు యోగవిద్యారహస్య విశేష ములు వివరించుట రామకథా వాఙ్మయమున శ్రీరామకథామృతము యొక్క ప్రత్యే కతను నిరూపించుచున్నది. "రామాయణాంతరర్థ సంగ్రహ" వివరణము కావ్యమున కొక దీప్తి నిచ్చుచున్నది. ఆత్మవేత్తలగు కవుల సమర్థత నది ప్రకటించుచున్నది,

1) రామకథాపరమార్థమును జక్కఁగాఁ గ్రహించి చెప్పుట, 2) వాల్మీకము నకు వ్యంగ్యమని వారు సంభావించిన యథ్యాత్మమును జోడించుట, 3) సందర్భమును బట్టి వ్యాఖ్యాన పంక్తులను సమన్వయించి విశేషార్థ ప్రకాశన మొనర్చుట శ్రీరామకథా మృత కవుల కథాకథనము నందలి ప్రత్యేకత. అసుర వినాశనము- అమరాభ్యుద యము ప్రయోజనముగా నెన్నదగు రామావతారమున బహు రహస్యములు గలవని "సారాంశము" నగస్త్యుని ముఖమున విపులముగాఁ జెప్పించుట వారనుసరించిన కథా కథనము నందలి మఱియొక విశేషము.3 ఇవి యన్నియు లోకమున రామాయణము గూర్చి పలువురు వెలిబుచ్చు సంశయములకుఁ జక్కని సమాధానములుగా నెన్నదగి యున్నవి.

## 4) కథలోని గూఢార్థ వివరణము :

వాల్మీకి రామాయణమున గూఢముగాఁ జెప్పఁబడియున్న కథార్థములను పాఠకలోక సంగ్రహార్థమై వివరించుట కథా సంవిధానదక్షతలో నొక విశేషము.

గౌతము డింద్రుని దుశ్చేష్టితమునకు గోపించి—

"అకర్తవ్య మిదం తస్మా ద్విఫల స్త్వం భవిష్యసి"—బా.కాం.-48 స., 27 శ్లో

---

1) ఉ. కాం.-ఉ. భా., 10 ఆ., 56 ప. 2) పూ. భా., 1 ఆ., 17 ప.

3) ఉ. కాం.-పూ. భా., 9 ఆ., 12–25 పద్యలు, 247-55 పద్యలు

అని శసించినట్లు వాల్మీకమున గలదు. విఫలుఁ డగుట యనఁగా నండ యుగము లేనివాఁడగుట. కావుననే దేవతలు పరమేష్ఠి యాదేశానుసార మాతని మేషాండుని గావించిరి. తదుపరి దేవకార్యార్థి యైన యింద్రుఁడు వైష్ణవయాగము గావించి యఘములఁ బాసెను. మఱియు తపస్తేజము విఫలతఁ జెందిన కారణముగా నాతనిని గాలాంతరమున మేఘనాథుఁడు బంధించి యవమానించినాఁడు. "విఫలస్త్వం భవిష్యసి" అనిన గౌతముని వాక్యముల యియ్యది నిగూఢమై బరగినది. శ్రీరామకథాఽమృతమునఁ దదర్థమును వివరించుచు గౌతముఁడు—

విన్నుఁ బగతుఁడు తలఁబట్టి చెన్నుమంటఁ
గలిపి లంఘించి బంధించి కాలఁదాచి
కొంచుఁ బోయెడునెడ నీదు క్రించుతనము
కావర మడంగు బొమ్మని కసరునంత

— బా. కాం.-7 ఆ., 45 ప.

అని యింద్రుని భావిదురవస్థఁ బ్రకటించినట్లు వర్ణింపఁబడినది. విశ్వామిత్రుఁడీ విషయమును "ఆదటనా, ఘనవాహుఁడు రావణిచేఁ గనెనోటమి యనెడు గాథ గలదు కుమారా!"[1] అని రామునకు దెలిపినట్లు వర్ణింపఁబడినది. ఉత్తరకాండమున నగస్త్యుఁడు రావణాదుల పూర్వచరిత్రఁ జెప్పుచు నాతఁడు స్వర్గముపై దండెత్తి పోవుట, రావణుని తనయుఁడగు మేఘనాథు డింద్రుని జయించి యింద్రజిత్తగుట వివరించినట్లు కలదు. "మునిభావరహస్య వివరణంబొప్ప" రచింతుమన్న శ్రీరామ కథాఽమృత కవుల యభిప్రాయ మియ్యెడ స్పష్టము.

నాయకోత్కర్షను నిరూపించు కాకాసుర వృత్తాంతము నందిట్టి రహస్యమే వివరింపఁబడినది. రామాస్త్రమమోఘము నప్రతిహతమునగుట నిర్వివాదము. దేవతలింద్రాపత్యమగు కాకాసురుని రాముని తపోబలపరీక్షణమునకై పంపిరి. అట్టియెడ రాముని యస్త్రప్రయోగమునఁ గాకము మరణింపరాదు. తపోబలము మాత్రమే ప్రదర్శింపఁబడవలసియున్నది. కావుననే యది ముల్లోకములు రాముని జయపతాకగాఁ దిరిగి వచ్చినది. యాగరక్షణమునకై వెడలునప్పుడు విశ్వామిత్రుఁడు మహితాభిమానమునఁ బ్రసాదించిన

1) 7 ఆ., 76 ప.

య స్త్రిముల్లీ యరణ్యావాసము నెపమునఁ బురశ్చరణ గావింపఁబడుచున్నవి. రాముఁ డత్తటి వేల్కాంచి పూరి మంత్రించి బ్రహ్మాస్త్రముఁ బ్రయోగించినాఁడు. విద్రచేనకులి యగు వనికి మంత్రము ఫలింపదు. కావున రాముఁ డయ్యెడ యోగనిద్రలో నున్నాఁ డనుట సారాంశము. అట్లు తపస్సంపదతో మానవత్వమున రావణుని సంహరించు నంతటి యస్త్రశక్తి సంపాదింపఁబడినది. దానినే యగస్త్యుఁడు రహస్యముల యందతి రహస్యముగాఁ బేర్కొనినాఁడు.

అవనిజామనోహరా! యెన్నదగు రహ
స్యముల యందు నతిరహస్య మిదియుఁ
గాకిపైన నీవు కమలజాస్త్రంబేయ
నపుడె చెడక జగము లదితిరుగుట

— ఉ. కాం.-పూ. భా., 9 ఆ, 15 ప.

## 5) సంబంధి కథావర్ణనము :

వాల్మీకి రామాయణమున గల కథాంశముల వర్ణించు సందర్భమున వానికి సంబంధించిన విషయము లన్యపురాణము లందుఁ జెప్పఁబడియున్నచో నా విశేషము లాయా ఘట్టముల వివరించుట శ్రీరామకథాఽమృత కవుల కథాకథనమున నొక పద్ధతిగా నెన్నదగియున్నది. ప్రధానముగా బాలకునకుఁ దద్విషయ పరిజ్ఞానము గల్పించుట, మూలకథకు సమగ్రతఁ జేకూర్చుట యనునవి వాని ప్రయోజనములు. అట్టి ప్రక్రియ ద్వార కావ్యమున కొక విశిష్టతయు సంపాదింపఁబడుచున్నది.

1) బాలకాండమున కామాశ్రమ వృత్తాంత కథన సందర్భమున రసపోషణమునకు, కథాపుష్టికి "తారకాసుర విజృంభణ ఘట్టము" వివరించుట (5 ఆ., 161-70 పాలు)·

2) అహల్యావృత్తాంత కథన సందర్భమున గౌతముఁడు నారదుని ప్రోత్సాహమున నాశ్రమము నందుఁ బ్రసవించుచున్న గోవును జుట్టివచ్చి భూప్రదక్షిణము వలని ఫలము నంది యహల్యను వివాహమాడునట్టి యోగ్యత సంపాదించుట (7 ఆ., 15-18 పాలు).

3) శతానందుఁడు విశ్వామిత్రచరిత్రఁ జెప్పుచు మూలమునలేని విశ్వామిత్రుని జన్మక్రమము నభివర్ణించుట (7 ఆ., 228—35 పాలు).

4) విశ్వామిత్ర మహిమమును వర్ణించు సందర్భమున మూలాధికముగా "హరిశ్చంద్రోపాఖ్యానము" వివరించుట (7 ఆ., 461-501). ఇదియు నాతని మహత్త్వమును బ్రకటించునదే యగుట సందర్భసుందరముగా నలరుచున్నది.

5) అరణ్యకాండమున ముని "యగస్త్యుని" చరితంబు సెప్పు సందర్భమున నాతఁడు వాతాపీల్వలులఁ బొడవడగించిన విధముతోఁబాటు మూలాధికముగాఁ దన్మహిమమును నిరూపించు వింధ్యవారణ వృత్తాంతము, మున్నీటంగల నీరు గ్రోలి విడుచుట మొదలగునవి వివరింపఁబడినవి (1 ఆ., 229—45 పద్యాలు).

6) జటాయువు తన వృత్తాంతమును వినుచు సందర్భమున మూలాధికముగా "నరుణ గరుఁడోపాఖ్యానము"ఁ జెప్పుట (1 ఆ., 324—30 పద్యాలు)

7) హనుమచ్చరిత్ర వర్ణించు సందర్భమున శివాంశసంభూతుఁడను సంబంధమును బురస్కరించుకొని కుమారస్వామి జననమును గూర్చి ముచ్చటించుట (ఉ.కాం- పూ. భా., 8 ఆ., 16 – 18 పద్యాలు), ఆగమోక్తవిధానంబున హనుమన్మాహాత్మ్యము వివరించుట (178—83 పద్యాలు).

8) ఉత్తరకాండమున రావణాదుల చరిత్రతోఁబాటు మూలమునలేని "దశరథ బాల్యచరితము" చెప్పఁబడినది. అతని మహిమానుభావము, శనితో నైన యుద్ధము, దశరథుని విజయము మొదలగు కథాంశములు విపులముగా వర్ణింపఁబడుట వలన దశరథ చరిత్రకుఁ బరిపూర్ణత సంతరింపఁబడినది (ఉ. కాం.- పూ.భా., 8 ఆ., 201—36 పద్యాలు).

9) వాలిసుగ్రీవుల జన్మవృత్తాంతకథన సందర్భమున వానరజాతియుత్పత్తి క్రమము వర్ణించుట (ఉ. కాం.- పూ. భా , 7 ఆ., 301—10 పద్యాలు).

## 6) కథలోని సన్నివేశముల స్థితిగతు లందలి మార్పులు :

వాల్మీకమునఁ గల కథాంశములకుఁ బ్రయోజనము నుద్దేశించి యాంధ్రీకరణమున సందర్భశుద్ధితో సన్నివేశములఁ గొన్ని మార్పులు సలుపుట జరిగినది. ఇట్లు సేయుట వలన కథాకథనమునఁ బ్రసన్నత సంపాదింపఁబడుట ఫలముగా నెన్నదగును. అట్టి ఘట్టము లియ్యెడఁ బ్రస్తావింపఁబడుచున్నవి.

వాల్మీకము నందుత్తర కాండమున రావణాదుల పూర్వవృత్తాంతములు వివరింపఁబడినవి. అందు "వేదవతి చరిత్ర" చెప్పఁబడినది. జన్మాంతరమున నామెయే సీతగాఁ బొడమినది.[1] శ్రీరామకథాఽమృతమున నా కథాభాగము బాలకాండమున వర్ణింపఁబడినది. విష్ణుని యోగమాయ, వేదవతియై రావణుని దౌష్ట్యమును నిరసించి, యగ్నిఁ బ్రవేశించి, సీతగా జన్మించి రావణసంహారమునకు గారణమైన దను విషయ మాంధ్రీకరణమునఁ గ్రమముగా వివరింపఁబడినది. "సీత పుట్టుక లంకకు చేటు" అను లోకోక్తిని సమర్థించు నీఘట్టము విపులముగా వర్ణింపఁబడుట మనోహరము.[2] సీత యాభిజాత్యము, నవతారప్రయోజనము నిందుగ్గడింపఁబడుట సారాంశము.

వాల్మీకి రామాయణమున సుందరకాండయందు సీత యభిజ్ఞానమునకై హనుమంతునితోఁ జెప్పి పంపినఁ "కాకాసుర వృత్తాంతము" యథార్థముగాఁ జిత్రకూటమునఁ బ్రవర్తిల్లినది. అట్లు జరిగినదని వాల్మీకమున నయోధ్యాకాండలో సూచింపఁబడలేదు. శ్రీరామకథాఽమృతమున నావిషయము జిత్రకూటమున నొకనాటి వృత్తాంతముగా వర్ణింపఁబడినది.[3] తిరిగి సుందరకాండమున కథా గమనమునకై సీత ముఖమునఁ జెప్పింపఁబడినది. ఇట్టి వర్ణనము కథాపరిపూర్ణతకు సాయపడునట్లు లనువాదకులు సంభావించి రనుకొనవచ్చును.

సుందరకాండమున హనుమంతుఁడు "రావణునకు బుద్ధి సెప్పు" సందర్భమున నుత్తరకాండ యందలి కథావిశేషము నుదాహరించుట శ్రీరామకథాఽమృతమునఁ గాననగును.

వాలి సందిఁట నొక్కింత వగరుదక్కెఁ
గార్తవీర్యుని కొట్టునఁ గందువాఱె
నమ్మగఁటిమికిఁ దెలిపీవి యన్నులిడ్డ
పుండుపై నేఁడు పోలేరు బొబ్బవోడమె

— సుం. కాం.-3 ఆ., 227 ప.

1) 17 స., I–44 శ్లో॥లు 2) బా. కాం.-4 ఆ., 2–127 ప॥లు

3) అయో. కాం.-8 ఆ., 5–10 ప॥లు

## 7) అమూలకములగు సన్నివేశముల నాదరించుట :

వాల్మీకమున లేకున్నను ప్రజాదరణమునుఁ బొంది లోకమునఁ బ్రసిద్ధి కెక్కిన కొన్ని సన్నివేశములు కవిలోకముచే నాదరింపఁబడుట సువిదితము. అట్టి యమూలకములగు సన్నివేశములు శ్రీరామకథాఽమృతమున నిట్లు గ్రహింపఁబడినవి.

1. గౌతమాశ్రమమున నింద్రుఁడు కోడియైకూయుట,
2. శివధనుర్భంగమునకు ముందు సీతారాముల పరస్పరానురాగమున వర్తిల్లుట (అయోగవిప్రలంభ శృంగారము),
3. రావణుఁడు సీతాస్వయంవరమున శివుని విల్లెక్కిడుటకు యత్నించి విఫలుఁడైనాఁడని వర్ణించుట,
4. గుహుఁడు రాముని పాదములు గడిగి మూఁపున ధరించి పడవ నెక్కించు కొనుట,
5. దేవాసుర సంగ్రామమున దేవతలకు సాయమొనరింపఁబోవు దశరథునితోఁ గైకయు వెడలి భర్తకు బాసటయై నిలిచి రణరంగమున రథచక్రపు శీల వ్రాల నేరిమితోఁ గాపాడినట్లు వర్ణించుట,
6. విభీషణుఁడు రావణునిచే సభ నుండి వెడలగొట్టఁబడి రాముని శరణువేడఁ బోవుచుఁ దల్లికై కసి యనుమతిఁ బడయుట.

## 8) ఆత్మీయమగు రచనావిధానమునుఁ బ్రకటించుట :

కావ్యము కవిహృదయమునకు దర్పణము వంటిది. కావున నందు కవి స్వీయభావమును స్వేచ్ఛగా బ్రకటించుట సంభవించును. అట్టిచో వారి కేర్పడిన స్థితిగతులు ననుభవించిన సుఖదుఃఖములు రచనావిధానమున ననుసరించిన పద్ధతులు మున్నగున వన్నియు భావవీధి దర్శన మిచ్చుట కావ్యప్రపంచమున పరిపాటి. శ్రీరామ కథాఽమృత కవులాత్మీయ మగు రచనావిధానమును బ్రకటించినతీరు హృద్యమై యది వారి కథాసంవిధానమున నొక భాగముగా నెన్నఁదగియున్నది.

రామునితో రావణాదుల పూర్వచరిత్రఁ జెప్పుచు నగస్త్యుఁడు వాలి రావణుని బంధించిన వృత్తాంతము నుడివి యట్టివాలిని నీవు సంహరించితివి. "సృష్టి స్థితి లయ

ములు నిర్వహించు నీకు ప్రకరణము ననుసరించి పెంపు కుదింపులు చోద్యములు గావ"ని పలుకు సందర్భమున —

ఇన్ని జగములు గల్పించి యెలమి మోచి
సంహరించెద వింతయు క్షణములోనె
యట్టి విశ్వంభరునకుఁ జోద్యమె కుదింపు
గాని పెంచుటగాని ప్రాకరణికముగ

— ఉ. కాం.-పూ. భా., 7 ఆ., 295 ప.

అని వర్ణించుట కవుల యాత్మీయమగు కావ్యరచనాక్రమమును దెలియఁ జేయు చున్నది. ఇందు "విశ్వంభరుఁడ"నఁగా కవి. అట్టి కవి కర్మ కావ్యము. కావ్యమున బెంపు గాని, కుదింపు గాని ప్రకరణానుగుణముగాఁ జేయుట సహజమని తమ యాంధ్రీకరణ విధానమును వెల్లడించుట గమనార్హము. అవసరమని భావించినప్పుడు, అవకాశము లభించినప్పుడు ధర్మవిశేషములు వివరించుట శ్రీరామకథాఽమృత కావ్య రచనా పద్ధతులలో నొకటిగా నెన్నదగి యున్నది. అనసూయ సీతతోఁ బతివ్రతా ధర్మము లుగ్గడించి—

స్త్రైణచూడామణీ! సత్ప్రసంగమునకు
ముచ్చటాడెడు నెఱిగూర మురిపెమూర
నుగ్గడించితి సాధ్వి! సాధూక్త ధర్మ
మార్గ మిట్లని నీమీఁది మమతనూది

— అయో. కాం.-10 ఆ., 128 ప.

అనిపలికినట్లు వర్ణింపఁబడినది. ఇట లోకసంగ్రహార్థమై మూలాధికముగా ధర్మ ముపన్యసింపఁబడి కాశీఖండము నందు బృహస్పతి లోపాముద్రతోఁ జెప్పిన ధర్మ విశేషములను దలపించుచున్నవి.

వాల్మీకిమునిభావరహస్య మెల్లి వివరించుట శ్రీరామకథాఽమృతము నందలి ప్రత్యేకతగా నెన్నదగి యున్నది. రామకథ విన్పింపుమని శివునిఁ బ్రార్థించు పార్వతి—

పలుకుబడి పొసంగఁ బలుకుము రామక
థాఽమృతంబు గ్రోల నంతకంత

కథికమయ్యెఁ దృష్ట యధిప! యొక్కింతయు
గ్రిక్కుకుండఁ దృష్టి తెలుఁగుపడఁగ
— ఉ. కాం.-పూ. భా., 1 ఆ., 8 ప.

అని వేడుకొనినది. దానికి శివుడు "నీ యిచ్చవలగొని నేనివరించెదఁ దెలివిమై నొక్కింత గ్రిక్కుకుండఁ గల రహస్యమెల్ల"1 అని చెప్పినాఁడు. "ఒక్కింత గ్రిక్కుకుండ" ననఁగా వాల్మీకి మహర్షి కథాపరమార్థము విడువక, సంగ్రహింపక యను నర్థము లభించుటంజేసి రామకథ చెప్పఁబూనిన కవుల రచనావిధానముఁ దెలియ వచ్చుచున్నది.

రవికులతిలకా! యిక్కథ
అవికల సంపదలఁ బొదలు నవియే నీకే
వివరంబొప్పగ వినుతుఁగ
విపరప్రవరాప్త లెలయు విధ మేర్పడగన్
— 1 ఆ., 53 ప.

అని కవివరుఁడగు వాల్మీకి భావ మేర్పడఁ బలుకుదు ననుటయు నయ్యర్థ మునే వివరించుచున్నది. "యిక్కథ అవికల సంపదలఁ బొదలు నవి" యనుటలో విరుద్ధ చిత్తవృత్తిత్వము గల యోగసంపదతో నెగడుచున్నవని తెలియుచున్నది. ఇట్టి పరిపక్వ భావసంపద కవి రామాయణమును దర్శించిన విధమును బ్రకటించుచున్నది.

భావాబ్ధి పొంగునెడ నొక్కొకచో మూలమునకు స్వీయ కవితాగుణములఁ జేర్చి చెప్పుటయుఁ గలదని వివరించుచు పైతోకలు రాముని గుణముల భావించి యనావిల గీతములఁ బాడిరని వర్ణించిరి.

కవులు కాలానుసారంబుగాఁ దదీయ
గుణగణంబుల స్వకవితాగుణగణములఁ
గూర్చి వర్ణింపఁదొడఁగిరి కొమరు మిగుల
నట్టియెడఁ బొంగుఁ గాదె భావాబ్ధి భావ్య !
—ఉ. కాం.-పూ. భా., 9 ఆ., 304 ప.

1) 1 ఆ., 17 ప.

అయ్యెడ వైతాళికులు "యథావిధి తమ తమ విద్యాప్రద్యోతమ్ముల మేల్మి హెమ్ము కల్మిఁ బ్రకటింపఁ జొచ్చిర"ని వర్ణించుటయుఁ బై విషయమునే సమర్థించు చున్నది. మఱియు "శాస్త్రవేత్త" లగు వీరు "నైకవిద్యారహస్యముల్ స్వీకరించి" కావ్యము నలంకరించిన రచనావిధానమును విశద మొనరించుచున్నది.

ఒక్కొక్కయెడ నాంధ్రీకరణమున మూలాధికమగు సౌందర్యము సంత రింపఁ బడుటయు సిద్ధించినదని సీతారాముల వనవిహార సందర్భమున–

> శిల్పవిజ్ఞాను లధిప! యీ చిత్తమలర
> గడఁగి కల్పించినారు తత్కావనమ్ము
> నసలు దాని సౌభాగ్యమ్ము నతిశయించు
> పసల నెసలారుచున్నది పరిసరమున
>
> — ఉ. కాం.–ఉ. భా., 1 ఆ., 27 ప.

అని వర్ణించి తమ కావ్యవిశిష్టతయు నుగ్గడించుట యెన్నఁదగియున్నది. ఇందు శిల్పవిజ్ఞాను లనఁగా కావ్యశిల్పవిజ్ఞాను లగు కవు లనియు అసలు దాని సౌభా గ్యమ్ము నతిశయించుటయనఁగా మూలమగు వాల్మీకము నతిశయించుట యనియు, పరి సరమున ననఁగా సమకాలీన సాహిత్యప్రపంచమున ననియు, పసల నెసలారుట యనఁగా కావ్యగుణసంపదల నొప్పుచున్న దనియు కావ్యపరమగు నర్థము భావింపఁదగి యున్నది. అయ్యర్థము కవుల కావ్యరచనావిధానమును సూచించు చున్నదనవచ్చును. వాల్మీకి గావించిన యా వనవర్ణనము తెముఁగున కంకంటి మొదలగువారు ప్రౌఢప్రబంధ శైలితో ననుసరించిరి. శ్రీరామకథామృతమునందా సందర్భమును కవులు యౌగిక మగు శాస్త్రవిషయములతోఁ బరిష్కరించిరి.

"ఆగమవిద్యాధ్యుర్యులగు"

> .... వనపాలు రుచితనందన సమృద్ధి
> మున్నె నంపర్కృతమగు వనమున్ వసీన
> గతిఁబరిష్కృత మొనరించి రతివ మిన్న !
>
> —ఉ. కాం.–ఉ. భా., 1 ఆ., 7 ప.

మఱియునావిషయమును దెలుపుచు—

> ఆ పుణ్యదంపతులమే
> లీపగిదిఁ దలిర్చు పెల్లి నెంచి కవులు మా
> కీ పట్టె పట్టనుచు వా
> గ్వ్యాపార రమావిహారకలఁగొని రగజా !
>
> — 1 ఆ., 125 ప.

అని వర్ణించుట సంభావింపఁదగియున్నది. ఆయ్యది స్వీయమగు యోగాను భవమును దెలుపుచున్నది.

కథాకథనమునఁ గడు శ్రద్ధ వహించి యెన్నడో జరిగిన విషయములను వాగ్ద ర్పణమున బ్రదర్శించునట్లు వివరించుట శ్రీరామకథాఽమృతమునఁ బ్రత్యేక గుణముగా నెన్నదగియున్నది. రావణాదుల పూర్వచరిత్ర మంతయు నగస్త్యుఁడు వివరింప విని రాముని పార్శ్వమున నున్న విభీషణుఁడు—

> ఔ రా మును పెన్నడో జరిగె బ్రహ్మమునీంద్రుఁ డగస్త్యుఁడిప్పుడా
> భీమపరాక్రమ క్రముల వింతలు దర్పణమందుఁ బోలె వా
> గ్దామము నందు గ్రుచ్చి యుచితంబుగఁ జూపుట బాపురే
>
> — ఉ. కాం.—పూ. భా., 364 ప.

యనినాఁడని వర్ణించుట హృద్యము. ఇట విభీషణుఁడు శ్రోత. అతని ముఖమున నీమాటఁ జెప్పించుట వలన నది శ్రీరామకథాఽమృత కావ్య పాఠకుని హృద్గతాభిప్రాయముగా నంభావింపఁదగియున్నది.

ఒక్కొక్కయెడఁ గథా విషయములు విపులముగా వర్ణించుటయు వీరనుస రించిన పద్ధతి గాఁదెలియుచున్నది. వాలి సుగ్రీవుల జన్మక్రమము లెట్టివో వివరింపుమని రాముఁ డడుగ వర్ణింపఁబూనిన యగస్త్యునిఁ గూర్చి—

> ఇట్టి నెలవుల బుట్టువు లెత్తుమనిన
> బూర్వముల నెత్తుగాదె యా పుణ్యుఁడనఘ !
>
> — ఉ. కాం.-పూ. భా., 7 ఆ., 300 ప.

అని చెప్పఁబడినది. వాలి సుగ్రీవుల జన్మక్రమ మడుగ వానరజాతి యుద్భవ మును గూర్చి వర్ణించు నాతని కథన పద్ధతినిఁ గవుల రచనాక్రమముగా నిరూపింప వచ్చును. అట్లే "అడిగితి వింత సెప్పుమని యంతకు నంతలు విస్తరించి నేనొడివితి"1 నన్న యగస్త్యుని పలుకులీ యర్థమునే సమర్థించుచున్నవి.

హనుమచ్చరిత్రఁ జెప్పు సందర్భమున—

దేవీ! దేవనుతుండు రామవిభుఁడాతీరొప్పఁ బ్రశ్నింపఁ ద
ద్భావప్రాభవ మిట్టిదం చెఱిఁగి లోపాముద్రనాథుండు వా
గ్దేవి స్ఫీవ్యనలంక్రియారసిత సద్రీతి క్రమాంచద్రస
ద్భావస్ఫూర్తులు వొంగగా నవతరింపంజేసెఁ దానాసభన్

— ఉ. కాం.-పూ. భా., 8 ఆ., 4 ప.

అని వర్ణించుట కవుల స్వీయరచనా సౌందర్యసంపద్విభవమును వెల్లడించు నదై యున్నది. తత్—ఆ వాల్మీకి ముని యొక్క భావప్రాభావ మిట్టిదని గుర్తెఱింగి, తమకంటెఁ బూర్వులు వ్యాఖ్యాతలు తెలియఁజెప్పిన విశేషములు జేర్చుచుఁ గావ్యమును ధ్వన్యలంకారరసభావరీతి మాధుర్యములు వెలయ సంతరించిన విధమిట్లు వివరింపఁబడిన దనుట కవకాశము గలదు. రామునకు "అంత నమ్ముని గదితమ్ములందెసఁగు కథన చాతురి, తత్తత్ప్రకరణగతము సహజమై చిత్రి మదికి విస్మయము"2 గూర్చినట్లు వర్ణించుటయుఁగవుల రచనావిశేషమును దెలుపు చున్నది.

ఒకప్పుడు మూలమున లేకున్నను కథా సంబంధియగు విషయములు అన్య గ్రంథము లందలివి వివరించుట కవుల యాత్మీయమగు రచనావిధానము. శతానందుఁడు విశ్వామిత్రచరిత్రఁ దెల్పు సందర్భమున—

ఇమ్మహనీయు చరిత్రం
బిమ్ముగ నా యరసినంత లెఱిఁగించెద

— బా. కాం.-7 ఆ., 227 ప.

అని మహాభారతము నందలి విశ్వామిత్రుని జన్మప్రకార మిందుఁ జేర్చి చెప్పుట యిందులకుఁ బ్రమాణము. మఱియు సందర్భమున కుచితమని తోచినవియు,

---

1) ఉ. కాం.-పూ. భా., 9 ఆ., 74 ప. 2) 9 ఆ., 286 ప.

జెప్పఁదగిననియు నగు కథావిశేషములు జేర్చి చెప్పుట శ్రీరామకథామృతమున పరి పాటి. రావణాదుల పూర్వచరిత్రయు, వాలిసుగ్రీవుల జన్మక్రమములు, హనుమచ్చరిత్రయు వివరించి యగస్త్యుఁడు "మానవనాథ! యియ్యదియు విననై నదియే వొడివెడ నదనున స్మారితంబై నవీ యుదంత" మని దశరథుని బాల్యచరితము "మహాద్భుత కథాకథనాయత్తచిత్తుఁడై" చెప్పినట్లు వర్ణించుట కవుల తీయ్యాయమైన రచనాక్రమము నకు నిదర్శనము. 1

శ్రీ వేంకటప్పయ్య శాస్త్రిగారు బాలకాండమునఁ గల ప్రౌఢశైలిం గని సన్నిహితులగువారు తెలుప "శైలి కొంచెము మార్చినఁ గాని యెల్లరకు సులభముగా నుండదని యాదారిఁ ద్రొక్కినట్లు తత్కాండములోని—

నేఁటిపడిన పాట్లు పాటరిపోకుండ
నందఱకును దెలియనై నబానఁ
గిలెటింగి రామకీర్తన మొనరింత
నవసరంబు సుకృత మందఁజేయ
— సుం. కాం.-1 ఆ., 223 వ.

అను పద్యము తెలుపుచున్నది" అని రాఘవ నారాయణశాస్త్రిగారు ఉత్తర కాండ పీఠికలో నివేదించిరి.

శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు శ్రీరామకథామృతమున షట్కాండములు పూర్తిచేసి యుత్తరకాండమున నించుమించు 1500 పద్యములు రచించిరి. మొత్తము 18000 పద్యములు. శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు 6000 పద్యములతో శేష పూరణ గావించి పితృపాదుల యంత్యశాసనము నిర్వర్తించిరి. శ్రీ వేంకటప్పయ్య శాస్త్రిగారి "కవనమునం దుదిపద్యము—

ఆ మారీచ ప్రముఖుల
నా మానవభోజి దయితుఁ దదిసాంత్వనమీ
షా మాననలం దమపుచుఁ

1) ఉ. కాం.—పూ. భా., 8 ఆ., 200 వ.

గామాభిగమంబుఁ బుష్పకంబెనయఁజనెన్"

- ఉ. కాం.-పూ. భా., 4 ఆ., 461 ప.

అని శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు పీఠికలో నుగ్గడించిరి. అంత విజముగ శాస్త్రిగారుఁ బుష్పకంబెనసి పుణ్యలోకంబులకుఁ జనిరి. ఈ కావ్యమున శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారి తొలి పద్యము—

ఓ మనువంశసుధాంబుధి
సోమా! రామా! శమనుని చొప్పట్లగుటన్
భీమపరాక్రముఁ డాశర
సామంతుఁడు పెచ్చుపెరిగె జయలేశమునన్

— 4 ఆ., 462 ప.

ఇయ్యది కృత్యాది కాకుండుటంజేసి యిట రాఘవ నారాయణశాస్త్రిగారి కిష్టదేవతాప్రార్థనాదుల కవకాశము లేదు. కావున "ఓ మనువంశ సుధాంబుధి సోమా! రామా!" అను సంబోధనలతో రాముని బ్రస్తుతించి తమ యభీష్టమును సిద్ధింపఁజేసికొనిరి. "ఓమనువంశ" అనుచోట ఓంకారస్ఫూర్తి కలుగునట్లు శుభాక్షర సంయోజనతోఁ గవితఁ బ్రారంభించుట గమనింపఁదగిన విషయము. కావ్యతత్త్వ విదులగు సహృదయుల కిది యామోదయోగ్య మగుట తథ్యము. ఇందు "శమనుని చొప్పట్లగుట" యనునది వారి పితృపాదుల మరణమును సూచించుచున్నది. అట్టి పరిస్థితులలో రచన ప్రారంభించి తండ్రి కిచ్చిన మాట ప్రకారము శేషపూరణ గావించి శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు సమగ్రముగ గ్రంథ మచ్చొత్తించిరి. అందుత్తరకాండ శేషపూరణ సేయు సందర్భముననే ముద్రణ భారమును స్వీకరించిరి. పవలెల్ల ముద్రిత ప్రతుల సవరించుచు (ప్రూఫులు దిద్దుట,) రాత్రి సమయము లందు నూఱు పద్యములకుఁ దక్కువ కాకుండ వ్రాసి మఱునాటి ముద్రణ కందించుట జరిగినదట. అట్టి సందర్భమునఁ గృతికూర్పు సక్రమముగా జరుగునో జరుగదో యను శంక వారి కుండెడిదట. ఈ విషయము శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు వ్యాసకర్తతో స్వయముగాఁ జెప్పినారు. హనుమచ్చరిత్ర గూర్చి యడుగుచు రాముఁడు "ఈ యథార్థమీవ యేర్పడ బలుకుము సంగ్రహింపకుండ సంయమీంద్ర" యనినాఁడు. అంత "వెరవరియౌ

నమ్ముని నెమ్మనమాందోళనమునఁబడెఁ గృతికూర్పిది యెటువోనఁగునో యనుచున్"[1]
అని వర్ణించుట యానాఁటి శాస్త్రిగారి భావవీచికయే కావ్యనిబద్ధమైనదనుట కవకాశము గలదు. ఇన్ని కథలు వివరించిన ముని కీర్తికి నెమ్మన మాందోళనమునఁ బడుటెట్లు? అది నిజముగా శాస్త్రిగారి యాత్మీయత యనియే చెప్పఁదగియున్నది. ఆ విషయమునే శాస్త్రిగారు హనుమత్కథాప్రారంభమున—

ఎంతటివాఁడు పూనవలె నీ ప్లవగేశ్వర మంత్రి సత్కథో
దంతము విప్పి చెప్పఁగలదా? యలదాక్ష్యము నన్ను బోటికిన్
వింతల మూలకందమవు వీని ప్రతాపరసప్రవాహ మే
యంతకుఁ జాలి జాలు కొనునంచు ధుర న్వహించితిన్

— ఉ. కాం.-పూ. భా., 8 ఆ., 7 ప.

అని యగస్త్యుని ముఖమునఁ జెప్పించుటయు గమనింపఁదగియున్నది.

తొలుత వాల్మీకి నారదుని "అర్థి వేడెద నిన్మహర్షిసత్తమ కూర్పు మీ ప్రశ్న యోగార్థ మెలమివౌనక"[2] అనినాఁడనుటంజేసి రామకథ యోగార్థబంధురముగా రచింపఁబూనిన కవి హృదయము వ్యక్తమగుచున్నది. కావ్యమాద్యంతము వారి యాశయమునకుఁ దగినట్లే నిర్వహింపఁబడినది. తుదకు "రామాయణాంతరర్థము"[3] సంగ్రహముగా వివరించు టింపులకుఁ బ్రమాణము. అది విని "అట్లయిన నీ వర్ణించిన రామాయణంబెల్ల నభూతపూర్వంబకదా యని సవిచికిత్సంబుగా నాభాషించు" పార్వతికి శివుఁడు—

అండజయాన! యెద్దియును నౌనె యబద్ధ మనంగ మున్నె యం
డాండము నందు బీజగతమైన ద్రుమంబవ నుండి వెండి పిం
డాండము నందు వృక్షగతమైన ప్రసూనమురీతి నుండి బ్ర
హ్మాండము నందునౌ తటి మహత్త్వముఁజెందు వికాసమేర్పడన్

ఇదియ కా దెద్దిదైన భగవంతుని యవతార చరితముల యందు యోగమునకు గాని న్యాయమునకు గాని పరమార్థముఁగ నన్వయింపని యితివృత్తంబుండదు.

1) పూ. భా.-8 ఆ., 7 ప. 2) బా. కాం.-1 ఆ., 2 ప.
3) ఉ. కాం.-ఉ. భా, 10 ఆ., 8-45 పః

సరిగదా మహాపురుషుల చరితమ్ము లన్నియు నన్నియతిన వర్తిల్లినంతమాత్రము నకుఁ గథాభాగంబర్థరహిత మనరాదు. పాఠకులు, శ్రోతలు, నాయాయి విషయంబుల గమనించి యథోచిత పరిపాటి నావర్తింప వలయు, నియ్యదియె రహస్య మియ్యదియె పరమార్థ మియ్యదియె వేద్యంబ"ని చెప్పినట్లు వర్ణించుట వలన కవులు రామాయణ మును దర్శించి, యవగతము చేసికొని తెలియఁజెప్పిన విధము విశదమగుచున్నది.[1]

ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే
ప్రాయేణ పూర్వభాగార్థో ధర్మశాస్త్రేణ కథ్యతే

వేదము యొక్క ఉత్తరభాగార్థము అనఁగా నుపనిషదర్థము (జ్ఞానము) ఇతిహాసపురాణాదులచేతను, పూర్వభాగార్థము అనఁగా కర్మతంత్రము ధర్మశాస్త్రము చేతను ప్రకాశింపఁజేయబడుచున్నది అను నార్యోక్తి యిందులకు ప్రమాణమని చెప్ప వచ్చును.[2]

పాక మర్థ గాంభీర్యము గల కావ్యగుణముగా నాలంకారికు లంగీకరించిరి. ద్రాక్షానారికేళాది పాకము లందలి భేదములు, బహిరంతఃస్ఫురద్రసము ద్రాక్షాపాకము. అంతర్గూఢ రసోదయ మగునది నారికేళపాకము.[3] శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు శ్రీరామకథామృత కావ్యపాకము ద్రాక్షాపాకము, నారికేళపాకము లందలి వెలుతులను దీర్చునదిగా సంభావించినారు.

ద్రాక్షాపాకము నారికేళరసముం దార్కొణగాఁ దేనెపుం
ద్రేకస్ఫూర్జిత సారముం బెరయ కెల్లెపాటి మాధుర్యమౌ
నక్షుద్రం బెటులౌ సుధాద్రవ మసుత్యాగార్థ నాన్వేషణన్
దీక్షన్ రామకథామృతంబు వెలుతుల్దీర్చున్ రసోల్లాసినీ
— బా. కాం.-10 ఆ,, 522 ప.

ద్రాక్షాపాకమున దేనె, నారికేళ రసమున శర్కరయుఁ జేర్చిన గాని యవి మాధుర్య ధుర్యములు కావు. అట్లే యసుత్యాగానంతర మందు మాత్రమే లభించు సుధాద్రవము నక్షుద్రమైనదిగా నెన్నుట తగదు. కావున నన్నిటికన్న మిన్నయై జీవిత

1) 10 ఆ, 45—7 పు॥లు 2) భాస్కరరామాయణ పీఠిక
3) ప్ర. రు. కా. ప్ర.—35 శ్లో.

కాలమందనే యనుభవసిద్ధమగు నమృతము "శ్రీరామకథాఽమృతము" అని వారి భావముగాఁ దెలియనగుచున్నది. శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు "రాఘవీయ మమృత పాకమ"ని సంభావించినారు. 1 ఇట రాఘవుని చరిత మమృతపాకము. అట్లే శాస్త్రి గారి కవితయు నమృతపాకముగా నెన్నదగియున్నది.

అనేకవిధములగు రచనాశిల్పచమత్కృతులను శ్రీమద్రామాయణమున ఆర్ష కవి యగు వాల్మీకి ప్రదర్శింపగా ఋషికల్పులైన శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి గారు వానిని గ్రహించి శ్రీరామకథాఽమృతమున బహువిధములైన విశేషములతో కథా సంవిధానమును దీర్చిదిద్దినారు. సామాన్యముగ నొకరి శిల్పరచన మింకొకరి కలవడుట దుష్కరము. కాని శ్రీరామకథాఽమృతమును శేషపూరణ మొనరించిన శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు తమ పితృపాదుల కవితావిశేషములతోఁబాటు కథా సంవిధాన కౌశలమును గూడ గ్రహించి మనోహరముగా "తద్రచనయే" యనునట్లు ఘటించుట ప్రశంస్యము. "వీరు తిక్కన యొక్క వైదిక సంప్రదాయాను బంధమునకు, ఔపనిషదర్థనివేశన ప్రథితములగు నాశ్వాసాంత పద్యములకు తెలుఁగునుడికారపు సొంపునకు మురిసి, సొగసి అట్లే తమ వాఙ్మయమును గూడ వెలార్పగొప్ప జతనము చేసినార"ని శ్రీ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారనుట శ్రీ రామకథాఽమృత కావ్య కథా సంవిధానవిశేషములను నిరూపించు చున్నది.

రామకథా సుధార్ణవ తరంగ భృతింబెనుపొందుచున్న శ్్రీ
రామకథాఽమృతంబిది విరామమొకింతయు లేని భక్తినే
శ్రీ మహితాత్ములానుదురొ చిత్సుఖభూమ మహోదయంబులు
ద్దాములు వారి కబ్బుఁజుమి తారకమంత్ర రసైక తానతన్

— బా. కాం.—10 ఆ., 521 ప.

1) ఉ. కాం.—ఉ. భా., 6 ఆ., 2 ప.

# పాత్రచిత్రణము :

పాత్ర రసమున కాధారము. పాత్రచిత్రణము కావ్యమున రసపోషణము నకు దోహదకారి యగుచున్నది. పఠితను శ్రోతను ఆకర్షించుశక్తి కావ్యమునఁ దన్ని ర్వహణము వలననే సిద్ధించుచున్నది. బ్రహ్మ, లోకమున వివిధములగు స్వరూప స్వభావములు గల వ్యక్తులను సృజించినట్లే కవి కావ్యమున నన్నిపాత్రలకును రూప రేఖావిలాసము లందును, చేష్టాస్వభావముల యందును ప్రత్యేకత నిరూపించి విశిష్టత వెలార్చును. అట్టి సృజనాత్మకశక్తి నభివ్యక్తము గావించుటచేతనే కవికి "కవిబ్రహ్మ" "కవిపితామహ" బిరుదములు సాహిత్యలోకమున సార్థకములై వెలసినవి.

అనువాద కావ్యమున మూలమున నున్నదున్నట్లుగాఁ జిత్రించుట యనువాద కుల సామర్థ్యమునకు నిదర్శనము కాఁగాఁ దత్ప్రతిభావిశేషమున విశిష్టత నాపాదించుట వారి ప్రత్యేకతను నిరూపించును.

ఒక కావ్యము నవగతము జేసికొనుట వారి వారి సంస్కారమునుబట్టి సిద్ధించును. అధ్యాత్మసుందర మగు జీవితవిధానము గల శ్రీరామకథాఽమృత కవులు వాల్మీకి రామాయణమును జదివినప్పుడు వారి కుదాత్తధర్మము, నుత్తమ ప్రకృతి గలిగిన పాత్రలు విశిష్టరూపములతో సాక్షాత్కరించినవి. వారు దర్శించిన దాని కను గుణముగఁ దమ కావ్యమునఁ బాత్రలను భారతీయ సంస్కృతి ప్రతిష్ఠా పతాకలుగా నధ్యాత్మభావసుందరములుగాఁ జిత్రించినారు.

వాల్మీకి రామాయణమున, నధ్యాత్మరామాయణము నను గల పాత్రల స్వరూప స్వభావాదికమును శ్రీరామకథాఽమృత కవు లించుమించు యథాతథము గనే తమ యనువాదమునఁ బోషించినారు. దానితోఁబాటు పాత్రచిత్రణమున వారికిఁ గల దక్షతా నిరూపకములుగా కొన్ని ఘట్టములను విశిష్టముగ రచించినారు. సామాన్యము లుగ నుండు విషయములను విడిచి యనువాదకులు తమ ప్రత్యేకతను నిలుపుకొనుటకై యాయాపాత్రలను జిత్రించుటలోఁ బ్రదర్శించిన చాతుర్య మెట్టిదో మాత్రమే సంగ్రహ ముగ నీ ప్రకరణమున నిరూపింపఁబడును.

రామాయణము శతాధిక పాత్రలతోఁ గూడిన మహాకావ్యము. కథా నిర్వ హణమునఁ బ్రతి పాత్రయు నొక ప్రత్యేకతతో వ్యవహరించినది,

రామాయణము, సీతాచరిత్రము అను పేర్లనుబట్టి రాముఁడు, సీత అను పాత్రలను ప్రధానముగఁ జేసికొని వాల్మీకి రామాయణమును మధురముగఁ దీర్చిదిద్దినాఁడను విషయము సువిదితము.

రామాయణమున రాముఁడు నాయకుఁడు. పెక్కు పాత్రలతోఁ బ్రత్యక్షము గనో పరోక్షముగనో అనుబంధము గలవాఁడు. ఆర్షకవి యగు వాల్మీకి సముచిత ప్రాధాన్యముతోఁ బాత్రలను మనోహరముగఁ జిత్రించినాఁడు. "యా న్తిన్యాయప్రవృత్తస్య తిర్యఞ్చోఽపి సహాయతామ్" అను మురారి యభిభాషణము రాముని విషయమున సర్వథా సత్యము.

రామాయణమున పురుషపాత్రలు స్త్రీపాత్రలు తిర్యక్పాత్రలు నని పాత్రలను ప్రధానముగ మూడు విధములుగ విభజింప వీలుగలదు. స్వభావాదికమును బరిశీలించినచో మనుష్యపాత్రలు ఋషిపాత్రలు రాక్షసపాత్రలు నని గూడ విభజించి పరిశీలింపవచ్చును. హనుమత్, వాలి సుగ్రీవాది పాత్రలు వానరజాతికిఁ జెందిన వగుటచేఁ దిర్యగ్విభాగము నకే చెందినవైనను దేవతాంశములను బొంది బహువిధ విద్యా సంస్కారములతోఁ బ్రవర్తించినట్లుగా రామాయణమున నభివర్ణింపఁ బడినవి.

## పురుషపాత్రలు:

**రాముఁడు :** విద్వల్లోకమున రామాయణ కావ్యనామమునకు "రామస్య అయనమ్ రామాయణమ్" అని వ్యుత్పత్తి ప్రసిద్ధి కెక్కినది. "రాముఁడు స్థానముగా వసఁగా నివాసముగాఁ గల గ్రంథము" అని భావము. రాముని చరిత్ర ప్రధానముగాఁ గలది యని తాత్పర్యము.

కావ్యనాయకుఁ డగు రాముని పాత్రచిత్రణమున వ్యాఖ్యాతలు, పౌరాణికులు 1) రాముఁడు పురుషోత్తముఁడు, 2) శ్రీమహావిష్ణువు, 3) పరమాత్మ అను మూఁడు దృక్పథములతో సమన్వయ మొనరింతురు. వాల్మీకి రామాయణమున రాముఁడు సర్వ సద్గుణసంపన్నుఁడగు నుత్తమ మానవుఁడను విషయము నాద్యంతము విస్పష్టముగ నిర్వహింపఁబడినది. "విష్ణువు" అను విషయము కొన్ని ఘట్టము లందు మాత్రమే సూచింపఁబడినది. పరమాత్మ యను విషయ మతి గంభీరముగను, నత్యంత వ్యంగ్య వైభవముగను వ్యక్తముచేయఁబడినది. రామపాత్ర పోషణమున ననువాదకులు రాముని యందు పురుషోత్తమత్వమును విష్ణుత్వమును, పరమాత్మత్వమును గూడ శ్రీరామకథాఽమృతమున నునిపుణముగ నిరూపించినారు.

1) పురుషోత్తమత్వము : వాల్మీకి రామచంద్రుని బాల్య కౌమారాద్యవస్థలతో నారంభించి యాయా ప్రవృత్తి విశేషముల నభివర్ణించుచుఁ గ్రమముగ నుత్తమములగు గుణసంపదలను నిరూపించినాఁడు. ఆ మహర్షి యడుగుజాడల ననుసరించుచు నధ్యాత్మరామాయణము మార్గముననుసంధానించుచు ననువాదకులు రామపాత్ర చిత్రణమున నెన్నియో మెలకువలు ప్రదర్శించినారు.

విష్ణువు చతుర్థాంశమున దాశరథియై యవతరించినాఁడు. అందు రాముని గూర్చి "సర్వలక్షణసంయుతుఁ డగు రామునిఁ గౌసల్య కనె నని" వాల్మీకమున గలదు.

ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్
కౌసల్యాఽజనయద్రామం సర్వలక్షణసంయుతమ్
— బా. కాం.-18 స., 10 శ్లో

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ—

సకలలోకనాథు సర్వనమస్కృతు
నఖిల లక్షణాఢ్యు నిఖిల విష్ణుఁ
బుత్త్రుఁగనియెఁ బరమ పురుషుఁగోసల కన్నె
యమిత సుకృతిచయ ఫలాప్తి వెలయ
— బా. కాం.-3 ఆ., 28 ప.

అని పరమపురుషుఁడుదయ మందినాఁడని వర్ణింపఁబడి యాతని సర్వలక్షణ సంయుతత్వ మిట్లు కీర్తింపఁబడినది.

చేతనత్వముఁగొన్న సింగారమన మేను
లలితభావస్ఫూర్తిఁ జిలుకుచుండ
సంగాంగియైన మోహన విద్యయన మోము
కళల పుట్టిల్లయి కానుపింపఁ
జూడ్కి కట్టిన కీర్తి సొబగునాఁదగు తెల్వి
దిగ్వ్యాపకత్వంబుఁ దెలియఁజేయఁ

చేరవచ్చిన సిరి చెలువునాఁ జనునోజ
మఖిలాతిశాయిత నధిగమింప

లీలఁ బెనుపొంది కల్యాణ జాలమెల్ల
వేలఁ జల్లు దయాదృష్టి వేలఁజెలఁగి
యా లలన కోర్కి పంట నాఁజాలి శౌరి
బాలుఁడయ్యె మెఱసె నో విశాలనయన

— 3 ఆ., 69 ప.

బాలరాముని పాలబుగ్గలహొయలు క్షీరాబ్ధిశయనుఁడీతఁడని చెప్పుచున్నది. ఆ పసిపాపని మెత్తని నెమ్మేను ఫణితల్పమహితుఁ డనుటను వివరించుచున్నది. కలికి కన్నుల సోయగ మాతఁడు కమలాక్షుఁ డని తెలుపుచున్నది. క్రొత్తకాంతి యీతఁడు శ్రీనివాసుఁడే యని యొత్తిపలుకు చున్నది. సర్వాంగవిలసనము సకల సంశయములఁ దీర్పజాలి విశ్వమోహనతఁ జాటుచున్నది. దాచుకొన్నను దాగని భాగ్యచిహ్నమాతని పురుషోత్తమత్వమును బ్రకటించుచున్నది. ఇట్టి విష్ణుభావగర్భిత మగు సౌందర్యవర్ణన మవతారస్ఫూర్తి గల్గునట్లుండుట హృద్యము. వాల్మీకమున నీ బాల్య వర్ణనము లేదు.

క్షీరాబ్ధిశయనుఁడీ చిన్నికూన యటంచుఁ
బాలబుగ్గల హొయల్బయలుపఱిచె
ఫణితల్పమహితుఁడీ పసిపాపఁడంచని
మెత్తని నెమ్మేను మేలుసూపెఁ
గమలాక్షుఁడీ కసుగందు నిక్కంబని
కలికి కన్నుల సోయగంబు దెలిపె
శ్రీనివాసుండె యీ చిఱుతబిడ్డండని
క్రొత్తకాంతి మఱింత యొత్తిపలికె

సకల సంశయములఁ దీర్పజాల దొకొ్క
విశ్వమోహను సర్వాంగ విలసనంబు
చెలఁగు పురుషోత్తముని భాగ్యచిహ్నమెట్లు
దాఁచుకొన్నను దాఁగునే తరలనయన

— బా. కాం.-3 ఆ., 135 ప.

పసిపిల్లలకు పాలబుగ్గలు, మెత్తని మేను, కలికికన్నులు, క్రొత్తకాంతి మొదలగునవి మనోహరములై యాకర్షణీయము లగుట లోకసహజము. ఇట నవి యన్నియు స్వభావోక్తి మధురము లగుట విశేషము.

బాలరాముని వివిధములగు బాల్యక్రీడలను రామాయణ కథాపరములుగా శ్రీ శాస్త్రిగారిట్లు వర్ణించుట యెంతయో మనోహరముగా నున్నది.

కుప్పిగంతులు వైచి క్రోఁతులమంద్రు త
ద్భావానుబంధంబు బయలుపడఁగ
తెక్కలమర్చి బల్ పక్కల మంద్రు త
త్పక్షోపయోగోప పత్తిదోఁప
భీషణాకృతి నిల్చి బిరుదులమంద్రు త
చ్ఛాసనౌత్సుక్య లక్షణము తనర
వల విమానము లెక్కి యమరులమంద్రు త
దర్థావతరణ లీలాప్తి వెలయ

మౌని విరతి గూర్చి మౌనులమంద్రు త
న్మాన్యతావిశేష మహిమ దొలఁక
నక్కుమారవరులహంయు దురాపుల
ట్లాటలాడుపట్ల నగకుమారి
— బా. కాం.-3 ఆ., 179 ప.

అట్లే తాను రాజు, తన తమ్ములు మంత్రులు, తక్కినవారెల్లరుఁ బ్రజలు కాఁగా రాముఁడు ధర్మానూనస్థితి నన్యాయమన్యంబుగానపుడే రాజ్యము బాలించుచున్నట్లు ఆటలాడిరని వర్ణించుట రామునిఁ బ్రజారంజకుఁ డగు ధర్మప్రభువుగా సంభావింపజేయు చున్నది.

తానే లోకములేలువాఁడఁట యమాత్యశ్రీకిఁ దమ్ముల్గదా
మానౌచోటులు స్నిగ్ధులెల్లఁదగరా, మాన్యప్రకృత్యర్థ న

న్మానం బందఁగఁ గొందఱందుఁ బ్రజలై నల్వొందఁబాలించు ధ
ర్మానూనస్థితి మించ రాముఁ డపుడే యన్యాయ మన్యంబుగన్
— బా. కాం.-3 ఆ., 180 ప.

ఇట్టి బాల్యక్రీడా వర్ణనము వాల్మీకమునఁ గన్పట్టదు.

అక్షర తత్త్వము నంది సకాలమునఁ జౌలోపనయనాది సంస్కారములఁ బడసి రాముఁడు "బ్రహ్మచారిత్వ మిమ్మెయి బాలభావమున" చరించెనో యన వెలుంగుచున్నాఁ డనుట హృద్యము. వాల్మీకమున నియ్యెడ "తేషాం జన్మ క్రియాదీని సర్వ కర్మాణ్యకారయత్"[2] అని మాత్రమే సూచింపఁబడినది. అట్లే వేదము, ధనుర్వేదము నభ్యసించి యాతఁడుఁ బ్రాహ్మయుక్తి వెలుంగు క్షాత్ర ముద్దీపద దుర్నిరీక్ష తేజమునఁ బ్రబలినాఁడు.[3] వశిష్ఠునిచేఁ జెప్పఁబడిన విద్యలు శిష్యులగు రాముదుల యందు "శుక్తికలిత వారిబిందుకలనఁ దోఁప చాల మెఱసె" ననుట వారి యోగ్యతా విశేషమును బ్రకటించుచున్నది. గురుశిష్య సంప్రదాయ మిట సుసంపన్నమైనది.

చాల మెఱసె నాగమాలి యచ్చో శుక్తి
కలిత వారిబిందుకలన దోఁప
నిట్టి గురుఁడు గూడునేమొకో శిష్యులు
దొరక రిట్టివారు తోయజాక్షి
—బా. కాం.-3 ఆ., 221 వ.

మఱియు నిఖిల ధర్మశాస్త్రవిషయము లెఱింగి యన్నియెడలను బ్రహ్మ తాదాత్మ్య లక్షణోపనిషదర్థవివృతియు నొప్ప రాముఁడు ముని గోష్ఠి నమరినాఁడు.

ఒకవేళ శబ్దశాస్త్రకలాప్రకాశనం
బొక క్షణంబొక్తికోద్యుక్తిపరత
యొక ముహూర్తమున మౌహూర్తిక ప్రకరణం
బొకగడె సుపదప్రయోగలక్ష్య

---

1) బా. కాం.-3 ఆ., 209 వ. 2) బా. కాం.-18 స., 24 శ్లో.
3) బా. కాం.-3 ఆ., 219 వ.

మొకపూఁట కల్పశికోచితాభాషణం
బొక యరజాము నిరుక్తిగరిమ
యొకయామ మకలంక సకల ధర్మవివక్ష
యొకప్రొద్దు రాజనీత్యూహనిష్ఠ

అన్నియెడలను బ్రహ్మదాతాత్మ్య లక్ష
ణోపనిషదర్థ వివృతియునొప్ప రాముఁ
డమరు మునిగోష్ఠిఁ గమలాకరమున నొగి పె
లుంగు ప్రతిమా ప్రభాకరు భంగి గిరిజ

— బా. కా.-3 ఆ.. 226 ప.

ఇట్లు రాజోచితమగు విద్యలఁ జక్కఁగా నభ్యసించుట వలన రాముఁడు రాజోత్తముఁ డగుటకు దగిన యున్నతార్హత యాతనికి లభించినది. విద్యల ధర్మ మెఱిఁగి "విగ్రహవ ద్ధర్మము"గా మెలఁగినాఁడు. భావి కథకు దగినట్లు ధర్మరక్షణకుఁ గావలసిన శక్తియుక్తులు సంపూర్ణముగ నాతని యందు పరిపుష్టములైనవి. మూల మున నిప్పట్టున దశరథతనయుల గూర్చి "సర్వే వేదవిదః శూరాః సర్వేలోకహితే రతాః"[1] అని చెప్పఁబడినది. శ్రీరామకథామృతమున నిట్టి మూలాధిక మగు వర్ణనము పాత్రచిత్రణమున వారు గైకొనిన ప్రత్యేక శ్రద్ధను బ్రకటించుచున్నది.

ఉదితయౌవనుఁ డగు రాముఁడు శృంగార సర్వస్వ సిద్ధి తీర్థంబుగా, మోదాతిభూమా విముక్తస్థలంబుగా, గల్యాణవృష్టి ప్రకామ్యాశ్రమంబుగా, లక్ష్మీవినోదా మల క్షేత్రంబుగా సంభావింపఁబడినాఁడు.[2] అతని ముఖలక్ష్మి, యమిత తేజము, శౌర్యము, వాగ్గుంభము, సందేహ వివృతుల, విబుధగోష్ఠులఁ గీర్తితములైన విధము మనోజ్ఞము.[3]

విశ్వామిత్రుఁడు యాగసంరక్షణమునకై రాముని౯ బంపుమని యడుగ సంశ యించు దశరథునకు సత్యప్రతిజ్ఞాఫలము నుగ్గడించి వశిష్ఠుఁడు "రామం విసర్జయ"[4] రాముని విశ్వామిత్రునితోఁ బంపుమని చెప్పినట్లు వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథా మృతమున నా రాముని యసాధారణత్వమును నిరూపించుచు—

---

1) బా. కాం.-18 స., 25 శ్లో. 2) శ్రీ.రా.క.-బా. కాం., 3 ఆ., 231 ప.
3) శ్రీ. రా. క.-బా. కాం., 3 ఆ., 235 ప. 4) 21 స., 8 శ్లో.

గొనబుల మేర తేజుగుమి కూర్మలకోన గొనాలపుట్ట మే
ల్నైనరులవంగడంబు బలులిబ్బులపంట జగామగంటుముల్
దనరు కొటారు తాల్మినెటిఁ దాఁటని కూటమి తెల్విదీవి పెం
దనముల ప్రోవు రాముఁ డనఁ దానొక రాజకుమారమాత్రుడే
— 5 ఆ., 96 ప.

అని యాతని రూప తేజోవిభవ పరాక్రమ ప్రక్రమాది సకల సద్గుణంబులు సన్నుతింపఁ బడుట పాత్రచిత్రణమున నపూర్వము, కవి ప్రతిభైక జన్యమునై యలరు చున్నది. కాళిదాసీ విషయమే రఘువంశమున "వయసున బాలుఁడయ్యు రాముఁడు యజ్ఞసంరక్షణార్థమై కౌశికునిచేఁ గోరఁబడినాఁడు. కావునఁ దేజస్సంపన్నులగువారి యెడ వయస్సు లెక్కింపఁబడద"ని వర్ణించినాఁడు.

కౌశికేన సకిల క్షితీశ్వరో రామ మధ్వర విఘాత శాంతయే
కాకపక్షధర మేత్య యాచిత స్తేజసాంహి నవయః సమీక్ష్యతే -11స., 1శ్లో

వాల్మీకిఁ గూడ విశ్వామిత్రుని ముఖమున—

అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్
వశిష్ఠోఽపి మహాతేజా యే చాన్యే తపసి స్థితాః — 19స., 25 శ్లో.

అని గూఢముగాఁ జెప్పించిన విషయము శాస్త్రిగారు శ్రీరామకథాఽమృత మున వశిష్ఠుని నోట బలికించుట హృదయంగమము. అనువాదమునఁ దెలుఁగు వెలుగుల జిగి వెలయుచుండుట మురిపెమును గూర్చుచున్నది.

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతోఁ గూడి యజ్ఞవాటికకుఁ జేరినాడు. జనకుఁడు వారల సంభావించి రాకుమారుల గూర్చి మునినిఁ బ్రశ్నించుచు "దేవతుల్య పరాక్రములు, పద్మపత్రవిశాలాక్షులు, ఖడ్గతూణీర ధనుర్ధరులు నాశ్వినులఁబోలు రూపముల సముపస్థితు లగు యౌవనులు, దేవలోకము నుండి దిగి వచ్చిన సురల వలె పాదచారులై వచ్చుచున్నారు. వీరెవ్వర"ని యడిగినట్లు వాల్మీకమున గలదు.1 శ్రీరామ కథాఽమృతమున వారిని గూర్చి జనకుఁడు ప్రశ్నించుచు—

1) వా. రా.-బా. కాం, 50 స., 17–20 శ్లో॥లు

తాల్తురు మేటి కోదండముల్దండము
 ల్తమకూర్చునవెయౌాట తద్దనెగడ
ఘన పరాక్రమలీల గనుపట్టుదురు పట్టు
 దురు మిత్తి కుత్తుక దొడర నొత్తి
యాశ్వినేయనికార మవధరింతురు ధరిం
 తురు రూపసారముల్తోరములుగఁ
జంద్రసూర్యుల దశల్సవరింతురు వరింతు
 రుచిత నిత్యప్రకాశోన్నతులను
 బోలుదురకాక యొండొరుల్పోల్పనొడ్లు
 గారు వీరల కెవ్వారుఁ గాక పక్ష
 ధారులై యుండి జగదేకవీరు లనఁగ
 వీరు గనుపట్టుచున్నారు వివిధగతుల
వచ్చి రమరు లిచ్చవచ్చి యిట్లిలకన్నఁ
గాళ్ళనడకయేల గలిగె వీరి
కెలయు మర్త్యులన్న నీరూప మీతేజ
మీ ప్రభావగరిమ మెందు గలదు

— బా. కాం.-7 ఆ., 177—78 పలు

అవి యడిగి లోకమున నెన్నిచూడము, ఎన్ని తలఁపము, ఎన్ని పలుకము, ఈ వ్యక్తియుగళము విశేషముగాఁ గనుఁగొనెను. ఎడద దక్కఁగొనెను. పలుకు బాటఁదాటెను అవి పలుకుట రూపతేజః ప్రభావముల వారి లోకోత్తర రమణీయత ను బ్రకటించుచున్నది. చూపఱుల కది సంభ్రమాశ్చర్యములు గల్పించి పారవశ్యమును గూర్చుచున్నది ఇట శబ్దసౌందర్యము మధురము. భావ సౌందర్యము నది యినుమడింపఁజేయుచున్నది.

చూడ మెన్ని కనులఁజొక్కించె నెది, యెన్ని
దలఁప మెద్ది యెడఁద దక్కఁ గొనియె,
బలుక మెద్ది పలుకు బాటఁదాఁటె వి దేది
యయ్యు? తెలుపు మిట్టి వ్యక్తి యుగము

— బా. కాం.-7 ఆ., 16 ప.

అట్టియెడ జనకునితో విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులు దశరథతనయులని చెప్పినట్లు—

న్యవేదయ దమేయాత్మా పుత్రౌ దశరథస్యతౌ

బా. కాం.-50 స., 23 శ్లో.

అని వాల్మీకమున గలదు. శ్రీరామకథాఽమృతము నందీ సందర్భమున సూర్యుని, తద్వంశరాజుల నభివర్ణించుట, అట్టి యుత్తమ వంశము నజన్మించిన దశరథుని తనయులీ రామలక్ష్మణులని వివరించుట, దాశరథుల యాభిజాత్య సంపద నుగ్గడించు చున్నది. వారలలో బెద్దవాఁడు రాముఁడు. గుణముల యందును విద్యల యందును విలాసవైఖరుల యందును ధనుర్విద్యా విశేషముల యందును త్రిభువన మోహనము లగు నవీన కలాంచిత రూపరేఖల యందును రాముఁడు పెద్ద. పెద్దల కెల్ల నాతఁడె పెద్ద. రాముఁడు రాముఁ డన్నిటన్" అని యనన్వయుఁడగు రాముని సకల గుణగరిష్ఠత నుగ్గడించుట హృదయంగమము.

పెద్ద సహోదరావలిఁ బెద్ద గొనంబులఁ బెద్ద విద్దెలన్
బెద్ద విలాసవైఖరులఁ బెద్ద ధనుష్మదుదూఢవిక్రుతిం
బెద్ద త్రిలోక మోహన నవీనక లాంచిత రూప రేఖలం
బెద్దలకెల్ల బెద్ద పృథివీవర! రాముఁడు రాముఁ డన్నిటన్

—బా. కాం.-7 ఆ., 200 ప.

మఱియు నుదాత్తచరితుఁ డగు రాముని కార్యదక్షత జనకునకు వివరించుచు విశ్వామిత్రుఁడు "సిద్ధాశ్రమ నివాసము, రాక్షస సంహారము, మిథిల కేతెంచునెడ విశాలానగర సందర్శనము, అహల్యాశాపమోక్షణము, గౌతమసమాగమము వివరించి నట్లు వాల్మీకమున గలదు.

సిద్ధాశ్రమ నివాసంచ రాక్షసానాం వధం తథా
తచ్చాగమన మవ్యగ్రం విశాలాయాశ్చ దర్శనమ్
అహల్యా దర్శనంచైవ గౌతమేన సమాగమమ్

— బా. కాం.-50 స., 22, 23 శ్లో॥లు.

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ—

జముదుంతనే వ్రచ్చి చవిచూతు నను జంతఁ
గూళఁదాటక నొక్క- కోలఁగూల్చె
మిత్తికోలలు హత్తి మేలమాడు సుబాహు
బూది గాలికిఁ బొల్లివో నొనర్చె
మారినా జడదార్ల మడఁచు మాయలమంద
మారీచు మున్నీట మాటిపైచె
సిద్ధాశ్రమము పొంతఁ జెలఁగు తపోధను
ల్మేలు మేలన మేలి మెచ్చువడసెఁ

గోరినటులె నాదు కోర్కు-లెల్ల ఫలింప
సవన రక్షణంబు జరిపెఁ ద్రోవ
సంఘ్రిరజముచే నహల్య నీపతితైక
పావనుండు మగని పజ్జ కనిచె

— బా. కాం.-7 ఆ., 202 ప.

అవి ప్రశంసించుట రాముని పాత్ర విశిష్టతను వెలార్చుచున్నది. సిద్ధాశ్రమమున యాగరక్షణ విధానము వివరించుట ధర్మమూర్తి రాముఁడు కర్తవ్యమును నిర్వర్తించిన క్రమము దెలుపుచున్నది. విశ్వామిత్రుఁ డద్దానికి ప్రత్యక్షసాక్షి. అహల్యా శాపమోక్షణము గావించిన రాముని "పతితైక పావనుండ"నుట సాభిప్రాయము. రాక్షసుల బలపరాక్రమాదులు నిరూపించి వారల మటుమాయము గావించిన రాముని బల వైభవము బ్రతిపాదించుట యాలంకారిక సౌందర్యము. శైలిమనోహరము.

ధనుఃప్రసంగ సమయమున "లోకవిశ్రుతులగు క్షత్రియులు, దశరథ తనయులు నగు వీరు నీయొద్దనున్న ధనుశ్శ్రేష్ఠమును జూడగోరు చున్నార"ని విశ్వామిత్రుఁడు జనకునితోఁ బలికినట్లు వాల్మీకమునఁ గలదు.

పుత్రౌ దశరథస్యే మౌ క్షత్రియౌ లోకవిశ్రుతౌ
ద్రష్టుకామౌ ధనుఃశ్రేష్ఠం యదేతత్త్వయి తిష్ఠతి॥

— బా. కాం.-66 స., 5 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నిప్పట్టున నా రఘుసింహములు విక్రమక్రమ సంపత్తిఁ బ్రంటించుట స్వభావసిద్ధమని వర్ణించుట మనోజ్ఞము.

తమ నఖశరపాలి దనుజ మత్తగజౌఘ
విదలనోత్సవముల విఱ్ఱవీఁడ,
దమక్ష్వేళల ప్రసక్తి దర్పవద్రిపుమార్గ
దీనస్వర విముక్తి కానయిడఁగఁ
దమ లఘుప్లుతిలీల తతవేగ భటసత్త్వ
కలితోర్ధ్వ దృష్టుల గాసిపఱపఁ
దమ రాజ పదరూఢి తామ్యన్నృపతి జంతు
పాలనా వ్యాపృతి ప్రథ వహింప

వఱలు రఘుసింహములు దిశావళియమెల్ల
విక్రమక్రమ సంపత్తి నాక్రమించి
మించు ప్రఖ్యాతి జగతి రాజించు రహి స్వ
భావసిద్ధము సుమ్ము క్ష్మాపాలతిలక !

— బా. కాం.-9 ఆ., 103 ప.

రాజ, మృగరాజములకుఁ దాద్రూప్యముఁ జక్కఁగా వర్ణింపఁబడినది. రాజసింహుల, రాక్షససంహారము, శత్రునిగ్రహము, శరణాగతరక్షణము, ప్రకృతి రంజనము మొదలగునవి సునిపుణముగా సూచింపఁబడినవి. ఇట్టి యుత్తమ లక్షణములు వారికి మఱియొకరి వలన సిద్ధించినవి కావు. "స్వభావసిద్ధము" అనుట "స్వయమేవ మృగేంద్రతా" యనుటను సమర్థించుచున్నది. మూలమునందలి ఉత్సాహసంపద యను వాదమున వీరరసస్ఫూర్తిగాఁ బ్రకటిత మగు చున్నది. వీరందులకు సమర్థులనియర్థము.

సీతారాముల వివాహమహోత్సవ సందర్భమున సీతామనోభిరాముని, రాముని నయనోత్సవముగాఁ గాంచిన పురంధ్రిజనుల పరస్పరాలాపములు, రామగాథా సుధామధురములు, శ్రుతిసుభగములు, సుందరతరములునై రామ పాత్రచిత్రణమున నౌచిత్య పరసీమఁ దాకుచున్నవి. (బా. కాం.-10 ఆ., 321 ప.)

అందు రాముని "మేల్మి బొలము కోసలు కన్నె పసిఁడిపువ్వుల పూజ పంట పైరు" ఇత్యాదిగా సంభావించుట తెలుఁగుఁదనము సంతరించుకొన్న చక్కని పలుకుబడి.

ఇట్టి సన్నివేశకల్పనము కవి ప్రతిభకు నిదర్శనము. సందర్భమును గల్పించుకొని రామచరితమును బలుమార్లు కీర్తించుట కవి కభీష్టమైన విషయము.

రామపట్టాభిషేకోత్సవ సందర్భమునకు ముందుగా రాముని గుణాభివర్ణన గావించుచు నాతఁడు "వీర్యవంతుఁడు రూపవంతుఁడు నసూయలేనివాఁడు లోకమున వేరొకఁడు పోలికలేనివాఁడు తండ్రియగు దశరథుని బోలినాఁడు."

సహివీర్యోపపన్నశ్చ రూప వా ననసూయకః
భూమావనుపమః సూనుర్గుణైర్దశరథోపమః
— అయో. కాం.-1 అ., 9 శ్లో

అని వాల్మీకమునఁ జెప్పఁబడినది. శ్రీరామకథామృతమున నప్పట్టున—

ఆ రూపు గనుభాగ్య మబ్బుచోఁ గనులకు
　తెప్పలతో వైర ముప్పతిల్లు
నా బీరమున కల్మి నరయుఁచోఁ బగఱకు
　శస్త్రగ్రహణవాంఛ సడలిపోవు
నా యక్కటి కపుఁ బెంపందుచో సంభ్రంబు
　లేఁడు నొక్కండుగా నెయిదఁజూచు
నాయోర్పు తీర్పెంచు టలవడుచోఁ గ్రూర
　సత్త్వమ్ములకుఁ జిత్తశాంతివొడము
నతని కుపమాన మున్నదే యతని కతఁడె
సాటి యనవచ్చుఁగాక ముజ్జగము లందు
దశరథుం డఁట తానె యీ దశరథునకుఁ
దనయుఁడై పుట్టెనఁట సుకృతంబకాదె

అని రామునిలోకోత్తర సౌందర్యము, పరాక్రమము, దయా, క్షమాది గుణములు కీర్తింపఁబడినవి. "రూపవాన్" అను మూలము నందలి విశేషణమును "ఆరూపు గనుభాగ్య మబ్బుచోఁ గనులకు తెప్పలతో వైర ముప్పతిల్లు"నని వివరించుట హృద్యము. పరాక్రమ ప్రసక్తి నాతని "బీరమున కల్మి నరయుతోఁ బగఱకు శస్త్ర గ్రహణవాంఛ సడలిపోవు"ననుట విశేషము. ఇట్టి విశేషమే రావణాదులచేఁ గూడఁ

ప్రశంస లందుకొనినది. ఇందు దయాక్షమాది గుణములు మూలాధికముగా వర్ణింపఁ బడి రాముని మహోన్నత్యమునుఁ బురుషోత్తమత్వమును జాటుచున్నవి. కవులు పాత్రచిత్రణమున బాటించిన విశేషశ్రద్ధ కియ్యది నిదర్శన మనఁజెల్లును. వారు రాముని దర్శించిన తీరుహృద్యము.

పితృసత్యవాక్య పరిపాలమునకై సిద్ధపడి శపథమొనరించిన రాముఁడు "మహారాజు కోరిక నెఱిగింపు మని కైక నడుగుసందర్భమున "రామోద్విర్నాభి భాషతే" యనియుండ ననువాదమున నాతఁడు "ద్విరుక్తికిఁ బోనేర్చునె రాముఁ డెందుఁ బుట్టువు సెడఁగన్" అనినట్లు చెప్పఁబడినది. అసత్య మాడుటవలన జన్మనిరర్థకమగు నని రాముని ముఖమునఁ జెప్పించి యాతని సత్యవ్రత శీలునిగాఁ జిత్రించుట తద్వై శిష్ట్యమును బ్రకటించుచున్నది. ఇటఁ పాత్రచిత్రణ మమోఘము.

రాముని వనవాసమునకు దుఃఖించుఁ బురస్త్రీలు రాముని గుణసంపద గూర్చి తలపోయు సందర్భమున

మూలాధికముగా—

ఆ బిడ్డ యాదయాంబుధి
యాబుద్ధి గురుండు తండ్రి యాతేఁడా వి
ద్యాబోధనుఁడా దేవుఁడు
మా బన్నములరయఁడయ్యె మా కర్మమునన్
— 5 ఆ., 40 ప,

అని పలుపోకల పలుకుబడుల నెఱపుచు, నెమ్మనము లుమ్మలికం బొదల—

కన్నబిడ్డఁ దొంటగతి తావు పెడినట్లు
దోడు నీడ సికికిఁ దొలగినట్టు
లార్తలగుచు నేడ్చి యాజాటపడి"
— 5 ఆ., 41 ప.

రని వర్ణించుట రాముఁడు తలలోని నాల్కయై సద్గుణముతో వారల నెట్లల రించెనో వియోగవేదనం దెరలెడు నాగర కుటుంబినీ రత్నముల వచనములఁ దెలియ నగు చున్నది. వారాతని నమ్యైవిధముల సంభావించి రనుట రాముని పాత్రచిత్రణము నకు వన్నె గూర్చుచున్నది.

చిత్రకూటమున భరతుని సైన్యసంభ్రమమును గాంచిన లక్ష్మణుఁడు రాము నితో "నగ్ని శమింపఁ జేసి సీతను గుహాంతరమునఁ జేర్పుము. కవచమును ధరించి, ధనువు నెక్కిడి శరసంధానము గావింపుమ"ని తొందరించుచుఁ బలికెను.1 అంత పురుష వ్యాఘ్రుఁడగు రాముఁడు లక్ష్మణునితో "అన్న! లక్ష్మణ! చూడుము, ఆ సైన్య మెవ్వరిదిగా భావించుచున్నావు." అని పల్కినట్లు వాల్మీకమున గలదు.

అంగావేక్షస్వ సౌమిత్రే! కస్యేమాం మన్యసే చమూమ్
— 96 స., 15 శ్లో.

శ్రీరామకథాఽమృతమున రాముఁడు—

"…. అన్న లక్ష్మణ! యేమి
వచ్చిపడియె నెట్టివలను గలది
యేరి సైన్యమదియు నెఱిఁగి వచింపుము
సంభ్రమింప ననికిఁ జాలమొక్కొ
— అయో. కాం.-8 ఆ., 81 ప.

అని సమాధానించినట్లు వర్ణించుట యాతని ధీరోదాత్తతను సూచించు గంభీర భాషణముగా నొప్పుచున్నది.

రామ భరత సమాగమ సం
జినధారివై రాజ్యమును వీడి యీ ప్రదే
అని ప్రశ్నించినట్లు వాల్మీకమునఁ గలదు.

యన్నిమిత్తమిమం దే
హిత్వారాజ్యం ప్రవిష్ట
— అయో.

శ్రీరామకథాఽమృతమున సీ
వత్సలతం దలపోసికొంచు భావమ్ము దఁ

1) వా. రా.-అయో. కాం., 96 స., 14 శ్లో.

హితార్థమ్మును నైన పల్కఁబడితో" నాతని బల్కరించి యాగమన కారణం బెన్నుచు
నడలుచున్న భరతు నాశ్వాసించి—

ఏ నెందరిగిన నీదెస
నేనెటి యేమఱనిచూడ్కి నింతకు మెలఁగం
గా నౌదుఁ దలఁకె దేమిర
నీ నా సందున భేద నిర్ణయమున్నే?

అని పలికినట్లు మూలాధికముగా వర్ణింపఁబడినది. ఇట్టి కల్పన రాముని
సోదర స్నేహమును జాటుచున్నది. లోకమర్యాదానుగుణమగు నీ యద్వైతభావన
పరమార్థమునకు వారు విష్ణ్వంశ సంభూతు లగుట నిరూపించుచున్నది. బీజ ప్రాయ
ముగ నుపపాదింపఁబడిన యీ యంశము "భరతుని భక్తి, శ్రీరాముని ప్రసాదమ"ను
పేర నుత్తరకాండమున సాగిన విశిష్టాద్వైతపద్ధతిని జీవాత్మ పరమాత్మల సంబంధ వివ
రణ పరమగు దీర్ఘ వర్ణనమునకు దోహదమగుచున్నది.[1]

పాదుక లిచ్చి భరతు నయోధ్యకుఁ బంపు రాముఁడు "ఇత్యుక్త్వాశ్రు పరీ
తాక్షో భ్రాతరం విససర్జహ"[2] అశ్రుపూరితనేత్రుఁడై భరతుని విడిచి పుచ్చెనని వాల్మీక
మున గలదు. శ్రీరామకథాఽమృతమున నయ్యది—

"…. రాముఁడు
తన కన్నుల నశ్రువితతి తార్కొని యొలయన్
గనలేక కవి యనుజుఁ బొ
మ్మనలేకనెఁ బొమ్మటంచు ననుస్మృతి వెలయన్
— 9 ఆ., 297 ప.

అని వర్ణింపఁబడినది. ఇట భ్రాతృవాత్సల్య పరిపూర్ణమానసుఁడగు రాముని
చిత్తవృత్తి విశేషము సునిపుణముగాఁ జిత్రింపఁబడుట మనోహరము. కన్నీటిపొరల
మాటున నుండి కనలేక కని మనమున నిండిన మధురవేదనతో ననుజుఁ బొమ్మనలేక

---

1) శ్రీ.రా.క.-ఉ. కాం., పూ. భా., 10 ఆ., 268—302 ప.లు
2) అయో. కాం.-112 స., 28 శ్లో.

పొమ్మనినాఁడు. రాముని కరుణాంతరంగ మిట్లు కవి కనులకు రూపుకట్టించినాఁడు. కాళిదాసు, బిడ్డ శకుంతల నత్తవా రింటి కనుపు కణ్వుని నోటఁ దండ్రిహృదయమును పలికించిన విధమీ ఘట్టమున స్ఫురించుచున్నది.

యాస్యత్యద్య శకున్తలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠ స్తమ్భిత బాష్పవృత్తి కలుషః చిన్తాజడం దర్శనమ్ ....
— అ. శా.–4 అం., 6 శ్లో.

భరతుఁడు రామపాదుకలు గొని యయోధ్య కేగుచు భరద్వాజునిచేఁ జిత్రకూటమున జరిగిన విషయములఁ గూర్చి యడుగఁబడినవాఁడై యాతఁడు మునితో "రాముఁడు నాచే, గురునిచే, యాచింపఁబడినవాఁడయ్యుఁ బితృవాక్య పరిపాలనము ననుసరించి పదునాలుగేండ్లు వనవాస మొనరింతును. అయోధ్య కిప్పుడు రానని పలికినాఁడ"ని చెప్పినట్లు వాల్మీకమునఁ గలదు.

సయాచ్యమానో గురుణా మయాచ దృఢవిక్రమః
రాఘవః పరమప్రీతో వశిష్ఠం వాక్యమబ్రవీత్
పితుః ప్రతిజ్ఞాం తామేవ పాలయిష్యామి తత్త్వతః
చతుర్దశహి వర్షాణి యా ప్రతిజ్ఞా పితుర్మమ
— అయో. కాం.-133 స., 9, 10 శ్లో.లు

శ్రీరామకథామృతమున ముని ప్రశ్నకు సమాధానముగా భరతుఁడు—

పలుకు పలుకునఁ దేనియ లొలుకఁజేయు
రాము నాలుక దొలిబల్కు రాణ నెగడు
గాని యొండొక్కఁడైన యక్కలన కెగువ
దేమనఁగ వచ్చునయ్య య య్యాశ్వరేచ్ఛ
— 9 ఆ., 340 ప.

అని చెప్పినట్లు వర్ణింపఁబడినది. తొలిబల్కు లనఁగా వేదములని ప్రసిద్ధార్థము. ఇట "రాము నాలుక దొలిబల్కు రాణనెగడు" ననుట నాతని సత్యసంగరుతగా

నిరూపించుటతోఁబాటు రాముని పల్కులు వేదసమ్మితములు, ధర్మబద్ధములు నగుటఁ బ్రమాణీకరించుచున్నది. "అయ్యాశ్వరేచ్ఛ" యనునదియు నియ్యర్థమునే సమర్థించుచున్నది. కవి ప్రజ్ఞావిలసిత మగు నీ భావప్రకటన విధము సహృదయ హృదయంగమమై రామపాత్రచిత్రణమున నుదాత్తత సంపాదించునదై యున్నది.

శూర్పణఖ రావణునకు రాముని పరాక్రమము వర్ణించి చెప్పుచు "నర్ధాధిక ముహూర్తకాలమునఁ బదాతియై భీమరూపులైన ఖరదూషణాది చతుర్దశ సహస్ర సంఖ్యాయుతులగు రాక్షసుల నిహతులఁ గావించి స్త్రీ వధాశంక నన్నుమాత్ర మావీరుఁడు పరిభవించి విడిచినాఁడు" అని వర్ణించుట వాల్మీకమునఁ గలదు.[1] శ్రీరామకథాఽమృతమున నీ సందర్భమునందు—

"క్రుద్ధుఁడై వైరులఁ దొడరిన యపుఁడా భాషణ మా విక్రమ మా వేషము వేనోళ్ళనను వర్ణింపఁజాల వనియు, వనము నరాక్షసము చేసినాఁ డనుటకు దండకాటవి నింక రక్కసుఁ డడుగుంచునే యటంచు" డిండిమంబు నిడినాడనియు, నిరంకుశ ప్రతాపుఁ డగు రాముని విక్రమ ప్రక్రమములు మూలాధికముగా వివరించుట యాతని సత్యపరాక్రమమును బ్రకటించు చున్నవి.[2] దండకారణ్యమున జరిగిన యుద్ధమునకు శూర్పణఖ ప్రత్యక్ష సాక్షిణి. ఆమె యనుభవ మిట్లు రావణునితోఁ జెప్పించుట మనోజ్ఞము.

పంచవటి యందున్న సీతతో వంచనాశీలుఁ డగు రావణుఁడు తన యభిప్రాయంబుఁ దెలుప నాతని నధిక్షేపించుచు సీత "మహాగిరి వలెఁ జలింపనివాఁడు, మహేంద్రసదృశుఁడు, మహోదధి వలె నక్షోభ్యుఁడు నైన రామునకు నే ననువ్రత" నని చెప్పినట్లు వాల్మీకమున గలదు.

> మహాగిరి మివాకంప్యం మహేంద్రసదృశం పతిం
> మహోదధి మివాక్షోభ్య మహం రామ మనువ్రతా
> — 47 స., 32 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నది—

> మేలి ధైర్యంబున మెఱుగారు తలఁపున
> గొండరాయనిఁ గేలిగొనెడువాఁడు

1) అర. కాం.-34 స., 9-11 శ్లో. లు. 2) అర. కాం.-2 ఆ., 335-6 పద్యాలు

గాంభీర్యమునఁ గల్మిగొంచు నక్షోభ్యత
సరిదీశు నుంకింపఁజాలువాఁడు
హంగారు స్వీయచిత్తాభోగసంపద
కైంద్ర వైభవమెంత యనెడువాఁడు
చూడనేర్చినవారిఁ జొక్కించు సొబగున
నతను సోయగ మెట్టిదనెడువాఁడు
—3 ఆ., 117 వ.

అని వర్ణింపఁబడినది. ఇందు రాముఁడు ధైర్య గాంభీర్య వైభవముల మహాగిరి, మహోదధి, మహేంద్రులను మించినవాఁ డనియు, సౌందర్యమున నతనుని మించి చూడనేర్చినవారిఁ జొక్కించు సొబగుఁడనియుఁ జెప్పుట యాతని సర్వోత్తమత్వమును జాటుచున్నది. పురుషులకు సహితము మోహనరూపుఁడని కీర్తింపఁబడిన రాముని పాత్రచిత్రణమున గవికిఁ గల ప్రత్యేకదృష్టి యిట గోచరించుచున్నది. మూలమునఁ దత్సదృశుఁ డనఁగా నాంధ్రీకరణమున తదధికుఁ డనుట విశేషము.

హనుమంతుఁడు ఋశ్యమూకమును జేరిన రామలక్ష్మణులను సమీపించి సంభాషించుచు వారి లోకోత్తరములైన తేజోరూపయౌవనవిలాస విక్రమ విభవముల బహుధా కీర్తించినట్లు వాల్మీకమునఁ గలదు.[1] శ్రీరామకథాఽమృతమున దద్విలక్షణముగా—

"రామలక్ష్మణుల సంప్రసాదన కలాజ్యోతి మందస్మితంబు వారాత్తకాములనియు, వియమలక్ష్యోల్లసనము వారు సత్యసంకల్పసంశ్రయు లనియు, కారుణ్యరస మొలుకు కన్నుదోయి స్వకజనాభయదాత లనియు, విక్రమస్ఫురితవృత్తి సకల శాసన రమాస్పదులనియు దెలియఁజెప్పుచున్నవని" వర్ణింపబడుట దాశరథుల విశిష్ట చరిత్ర నుగ్గడించుచున్నది.[2]

మఱియు హనుమంతుడు "సుగ్రీవుని పనుపున తాను వచ్చితిననియు నాతఁడు మీతో సఖ్యమును గోరుచున్నాఁ డని"యు చెప్పినట్లు వాల్మీకమునఁ గలదు.

---

1) వా. రా. కి. కాం.-3 వ., 4-19 శ్లో॥లు 2) కి. కాం.-1 ఆ., 52 వ.

ప్రాప్తోఽహం ప్రేషిత స్తేన సుగ్రీవేణ మహాత్మనా
రాజ్ఞా వానరముఖ్యానాం హనుమాన్నామ వానరః
యువాభ్యాం సహధర్మాత్మా సుగ్రీవః సఖ్యమిచ్ఛతి
— కి. కాం.-3 స., 24, 22 శ్లో. లు

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ హనుమంతుఁడు—

మోసముగాదు మీవలని మోహనరూప విలాససంపదల్
భాసుర శౌర్యధుర్యతయు భావన సేసి ప్రభావయోగ ల
క్ష్మీ సుసమేతులం చతఁడు కృత్యవిదుం డనుషంగ దర్శనా
భ్యాస వశంబునం దలఁపు లారసి సఖ్యము గూర్పవచ్చితిన్
కి. కాం.-1 ఆ., 62 వ,

అనినట్లు వర్ణించుట రఘుపుంగవుల మోహనరూపవిలాససంపద, భాసుర శౌర్యధుర్యత, ప్రభావ యోగలక్ష్మీ విభవములు విశేషముగాఁ బ్రకటితము లగుచున్నవి. అమూలకమగు నిట్టి భావన సహృదయ హృదయంగమము.

సుగ్రీవునికడ వాలివధార్థమైన ప్రతిన సలుపనున్న రాముని గూర్చి చెప్పుచు—

ఏవము క్తస్తు తేజస్వీ ధర్మజ్ఞో ధర్మవత్సలః
ప్రత్యభాషత కాకుత్స్థః సుగ్రీవం ప్రహసన్నివ
— కి. కాం.-5 స., 24, 25 శ్లో.లు

అని వాల్మీకమున వర్ణింపఁ బడినది. శ్రీరామకథాఽమృతమున నియ్యెడ రాముని వైశిష్ట్య మిట్లుగ్గడింపఁ బడినది—

తేజున గన్న గారవము తెల్విఁదేటను బ్రస్తుతింప నా
యోజనె ధర్మసంగ్రహ మహోన్నతి వాఙ్మనసత్రయుక్తిమై
రాజిల రాజయోగమున రాణదలిర్చుచు రూపు పెంపు ని
ర్వ్యాజత నైజ మంచన నహర్పతివంశ కిశోర మిట్లనున్
— కి. కాం.-1 ఆ., 121 వ,

వాలివధ యందలి పరమార్థమగు "ధర్మసంగ్రహ" మిట వివరింపఁబడినది. అట్టి ధర్మము వాఙ్మనః క్రియల నాచరింపఁబడుచున్న దనుట హృద్యము. ధర్మజ్ఞత, ధర్మవత్సలతలతోఁబాటు ధర్మసంగ్రహార్థమై యుండవలసిన తెల్వియుఁ దేటయు రూపు పెంపు రాముని యందుఁ బుష్కలముగా నున్నట్లు నట్టి ధర్మ బుద్ధికి నిర్వ్యాజత ముఖ్యమనియు వర్ణించుట రాముని యున్నతినిఁ దెలుపుచున్నవి.

హనుమంతుఁడు రావణునితో రాముని పరాక్రమముఁ జెప్పుచు నేవిధముగాఁ జూచినను నీవాతనితోఁ బోలవనియు నీకంటె నన్నిట నాతఁడు ప్రవీణుఁ డనియు వర్ణించుట తదౌత్కృష్ట్యమును దెలుపుచున్నది. మూలాధికముగా రామ రావణ పరాక్రమములు తులనాత్మకముగా నిట్లు బరిశీలించుట హృద్యము.

కదలింపఁగా జాల వదెకాదె ముక్కంటి
విల్లెక్కువెట్టుచో విఱిచివైచె
నెన్నక నినుఁజెఱఁగొన్న హైహయుఁద్రుంచి
నట్టి భార్గవుఁ బట్టుపట్టి విడిచె
సందిట నిడి చతుస్సాగరంబుల నిన్ను
ముంచి యెత్తిన వాలి మురువడంచె
మునులపాలిఁటి మిత్తియనఁజను ఖరదూష
ణాది నంతకు నింటి కతిథిఁజేసె

మఱచితే నీకు మఱచిన మఱపురాని
వెన్నియో కలవాతని సన్నలింక
సిగ్గుమాలిన నీచెవి చేర్చె దైన
జెప్పవలె నన్న నాకేవి సిగ్గులేదె

— సుం. కాం.-3 ఆ., 232 ప.

ఇందు రాముని శివధనుర్భంగము, పరశురాముని గర్వాపహరణము, వాలి వధ, ఖరదూషణాది రాక్షససంహారము మొదలగున వన్నియుఁ గీర్తింపఁ బడినవి. ఇట్లు పలుమార్లు రాముని వీర్యౌదార్యాది గుణములు ప్రశంసించుట పాత్రచిత్రణమునఁ గవులు పాటించిన ప్రత్యేకశ్రద్ధకు నిదర్శనము.

రావణ వధానంతరము రాముఁడయోధ్యఁ జేరునప్పుడు "పురస్త్రీల ప్రస్తావము" లతని శుభచరిత్రములఁ జాటుచున్నవి.

సుదతి! ఈతఁడచువ్వె శుద్ధాత్మ కోసల
కన్నెగర్భ పయోధి కల్పకంబు
పొలతి! యీతఁడచువ్వె పురుషోత్తముఁడు దశ
రథు జన్మమున మనోరథము పంట
పడఁతి! యీతఁడచువ్వె భద్రాత్ముఁడు తపస్వి
పడసిన మేలి తపఃఫలంబు
మడఁతి! యీతఁడచువ్వె మహిజాత కదనునఁ
బున్నెం బిడిన రత్నభూషణంబు

తాలు నీటదేర్ప జాతినాతి నొనర్పఁ
గ్రోఁతిగముల నేలి కొలఁతదీర్ప
నఖిల రాక్షసాగ్నులార్ప వేల్పులఁగూర్ప
నేర్పుగనిన జాణ నెలఁత! యితఁడె

పరనారీ సోదరుఁడే
పరమ కృపాభరణ కీర్తిభరుఁడే రక్ష
పరుఁడే పరిపంథి జనో
త్కర శిక్షకరుఁడె భూమి కన్యావరుఁడే

— యు.కాం.-ఉ.భా., 2 ఆ., 434, 435 వ॥లు

ఇట్టి "రాము మాన్యచరితములు" గీర్తించు నీఘట్టము కవుల స్వంతంత్ర కల్పనము. "పరనారీ సోదరుఁడు" రాముఁ డనుట యాతని సౌశీల్యమును బ్రకటించుచున్నది.

అట్లే సీతాసమేతముగ నయోధ్యఁ బట్టాభిషిక్తుఁడై యలరు రాముని "నవరసాలంకృతి విశేష నాయకుని"గా సంభావించుట హృద్యము.

జిలుఁగు నవ్వులపంట సిరినేల కన్నియ
తోడి సింగారమ్ము తోడవుగాఁగ

రావణారీ! యంచు రహిఁ బెంచు వందుల
నుడిసంచు బీరమ్ము నొడువుచుండ
మునులపాలిటి లిబ్బి మొగసాల యగు గోష్ఠి
తలఁపులఁ గరుణ నేస్తమ్మెలర్పఁ
జుప్పనాతి యనీతి చొప్పారు నప్పాట
హాస్య బీభత్సమ్ము లడరు చుండ
నబ్ధిశోషణ కథ రౌద్ర మచ్చుపడఁగ
స్వీక యధర్మ భీరుత భయానకముఁజూప
శాంతుఁడు గుణాద్భుతుఁడు రామచంద్రుఁడొప్పె
నవరసాలంకృతి విశేషనాయకుఁడుగ

— ఉ. భా.-1 ఆ., 576 ప.

రామాయణ కథానాయకుని యౌన్నత్యమును వెల్లడించు నీవర్ణనము కవి స్వోపజ్ఞకము.

"మేదిని ప్రజారంజకుఁడు, శుభగుణచారిత్రుఁడు నగు రాముని రాజుగాఁ గోరుచున్నద"ని సభవారనినట్లు వాల్మీకమునఁ గలదు.

తమేవం గుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్
లోక పాలోపమం నాథ మకామయత మేదినీ

— అయో. కాం.-2 స., 48 శ్లో.

శ్రీరామకథాఽమృతమున సురలకు నభినుతింపఁ దరముగాని గుణధాముని రాముని రాజుగా గోరినట్లు చెప్పుచు "నసామాన్య రసభరితమగు రాము చరితంబు" నుగ్గడించుట మనోజ్ఞము.

అతని మేలుము లెన్నియో యభినుతింపఁ
దరమె సురలకు నా గుణధాము రాము
లోకనాథు నాథునిఁ గాఁగ లోలయగుచుఁ
గోరుచున్నది మేదిని కువలయేశ!

కలుగు వృత్తులతోడి కలనకు లోబడ
దేదిరిపల్కాల సన్న కెదురు పడదు
కల్యాణ వృష్టు లేకాలంబు గురియించు
నభయ దానమున కేనవి గడంగు
సజ్జను ల్స్వీయులౌ సంగతి వివరించు
దొడరు రాకాసుల మీడు కడంచు
నాపాలిటిదె జగన్నాట్యమంచు నటించు
విచ్చలు సంతోష విరతిఁదవులు

నేమనందగు నయ్య మహీమహేంద్ర
రాము చరితం బసామాన్య రస భరితము
వేలుపులకెల్ల నోరూరువిధముసూప
నొల్లమాట కొకట నొక్కయూహ గలదె
— అయో. కాం.-1 ఆ., 116, 110 ప॥లు

అమూలకమగు నిట్టి వర్ణనము పురుషోత్తముఁ డగు రాముని యాదర్శ జీవన విధానమును వివరించుచు "రామావతార" ప్రశంసయై నెగడు చున్నది.

రాముని విష్ణుత్వము : వాల్మీకి రామాయణమున రాముఁడు దివ్య జ్ఞాన సంపన్నులగు ఋషి, మునిపుంగవులచే దేవతలచే సాక్షాద్విష్ణువుగా నెన్నఁ బడినట్లు వర్ణింపఁబడినది. పూర్వ రామాయణమున బ్రహ్మ వరములకు భంగము లేకుండ విష్ణువు లోకహితము గోరి మానవరూపమున రాముఁడై యవతరించి రావణాది రాక్షస సంహారము గావించి యుత్తరరామాయణమున మునుల ప్రబోధములఁ గ్రమముగా నాత్మవిష్ణుత్వజ్ఞాన మేర్పడి బ్రహ్మ యభ్యర్థనము ననుసరించి మహాప్రస్థాన మొనరించి స్వస్వరూప సంధానమున వైకుంఠమును జేరినాఁడు. ఇట్లు వాల్మీకి రామాయణమున బహుసుందరముగా కథా సంవిధాన చాతురిఁ బ్రదర్శింపఁ బడినది. శ్రీరామకథాఽమృత మున నొక విధముగా రాముఁడు మొదటినుండియు విష్ణుని యవతారముగానే సంభావింపఁ బడినట్లు వర్ణింపఁ బడినది. ఆ క్రమ మియ్యెడఁ బరిశీలింపఁ బడుచున్నది.

బాలరాముఁడు విదురించు సమయములఁ దన్ను దర్శింప వచ్చు దేవతలతో రావణసంహారమును గూర్చి ముచ్చటలాడుట యాతని విష్ణుత్వమును బ్రకటించు చున్నది.

కుశలమె నీకు బ్రహ్మ! ననుఁగూర్మిదలంతువె యీశ! నీ కహ
ర్నిశము సుఖంబె యింద్ర! భయరీతి దొలంగెనె దివ్యులార! బా
లికుఁ డతఁ డేమి సేయుఁ దృణలీల నడంతు నటంచు నిద్దురన్
విశద మొనర్చు దాశరథి వేల్పులతోఁ బతి దేవతామణీ!

— బా. కాం.—3 ఆ., 154 ప.

త్రిమూర్తులలో బ్రహ్మ మహేశ్వరు లిరువురు నిట బలుకరింపఁబడినారు. అట్లు పలుకరించువాఁడు విష్ణు వగు ననుట స్పష్టము.

రాముఁడు తోడిబాలురతోఁ గూడి క్రీడలాడు సందర్భమునఁ గొందఱు దేవతలుగా మఱికొందఱు రాక్షసులుగా నుండఁ దన తమ్ముల నుత్తమపాత్రలుగా నొడగూర్చి తాను హరియై తన సూత్రధారిత్వమును బ్రకటించు ననుట యాతని యవతార విశేషమును నిరూపించు చున్నది. మూలమున నిట్టి క్రీడాదికములు వర్ణింపఁబడలేదు.

కొందఱు వేల్పులట్లు మఱికొందఱు పూర్వ సుపర్వు లట్టులొ
ప్పం దన తమ్ము లుత్తమఁపుఁబాత్రలుగా నొడఁగూర్చి పేర్చి తా
నందలి సూత్రధారియగు నా హరియై తగి యాటనూపు నే
ర్మిందన మర్మ మెన్నఁగను బ్రేక్షకు లెల్లరు సంతసింపగన్

— బా. కాం.—3 ఆ., 175 ప.

విశ్వామిత్రుఁడు యాగ రక్షణమునకై రాముని బంపుమని వేఁడ దశరథుఁ డందుల కంగీకరింపలేదు. అట్టియెడ వశిష్ఠుఁ డాతనికి రాముఁడు విష్ణువనియు, లక్ష్మణుఁడు శేషుఁ డనియు తక్కిన తమ్ము లబ్జారు లనియుఁ జెప్పుట రాముని విష్ణువుగా బ్రతిపాదించు చున్నది.

నరుడా! రాముఁడు ధీసమాధి విధి యన్నారాయణు న్డారుణీ
భరముం బాపఁగ వేఁడ వల్లెయని మీభాగ్యంబునం బుట్టినాఁ
డరవిందాక్షుఁ డితండు లక్ష్మణుఁడు మున్నా శేషుఁ డబ్జారు లీ
భరతుండీ తని పిన్నతమ్ముఁడని నీభావంబు నన్నిల్పుమీ

— బా. కాం.—5 ఆ., 94 ప.

వాల్మీకమున విశ్వామిత్రుఁడు—

అహంవేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమమ్
వశిష్ఠోఽపి మహాతేజా యేచాన్యే తపసి స్థితాః
— బా. కాం.-19 స., 15 శ్లో.

అని పలుకుటయు, నధ్యాత్మరామాయణమున వశిష్ఠుఁడా విషయము వివరించుటయు సంభవించినది. తత్క్రమ మిందు వర్ణింపఁ బడినది.

విశ్వామిత్రునితోఁ గూడ రామలక్ష్మణులు సిద్ధాశ్రమమున కేగుచు మార్గ మధ్యమున గంగ సమీపించిరి. ఉత్తుంగ తరంగిత యగు నన్నదిఁగని విశ్వామిత్రుఁడు రామునితోఁ "మది నీ బాంధవ్య మెంచి పొంగుచున్నదీ యమ" యనుట విష్ణుపాదోద్భవా గంగా" యను శ్రుత్యర్థ సమీహితమై రాముని విష్ణువుగా సంభావించినట్లు చెప్పఁ బడినది. రాముఁడు భగీరథ వంశమువాఁ డగుట కథాపరమగు నర్థము.

కనుగొంటే రఘురామ నీవలన యిక్కల్యాణి బాంధవ్య సం
జనిత ప్రేమ వికాసమొప్ప శుభలక్ష్మవ్యాప్తి మీఱం దరం
గ వినా దాలపనంబులం బొదలె నాకాశంబు మైఁదాకఁ గ్ర
న్నన కన్నెత్తముఁగన్నవారిఁ గనఁ గన్నం బొంగు టిట్లేకదా!
— బా. కాం.-5 ఆ., 203 ప.

అట్లే రాముఁడు అరణ్యవాసమున కేగు సందర్భమున "గంగం గని వారుల్లాస మెనసిరి. వారల గని పుట్టినింటివారను ముదమున నాయమయు దొరఁపునడి నన్నల మురిసినద"ని వర్ణించుట హృద్యము. అన్నివిధముల రాముఁడు గంగకు బుట్టినింటివాఁడై నాఁడు. కల్పనా చమత్కారము స్వభావోక్తి సుందరము.

వారలరుచు దరిఁజేరఁగ
వారలగని పుట్టినింటివారను ముద మ
వ్వారిగ నాయమయు మురియు
తోరఁపు నడినన్నలపుడు దులకించె నదీ!
—అయో. కాం.-5 ఆ., 96 ప.

సిద్ధాశ్రమమున యాగసంరక్షణానంతరము విశ్వామిత్రుఁడు రాముని గాంచి "నేను కృతార్థుఁడ నైతిని. మహాబాహుఁడవైన నీచే గురువచన మాచరింపఁబడినది" అనినట్లు వాల్మీకమున గలదు.

కృతార్థోఽస్మి మహాబాహో కృతం గురువచస్త్వయా
— బా. కాం.—30 స., 26 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ విశ్వామిత్రుఁ డానందపారవశ్యమున—

అచ్చెఱుత రఘుసింహాల మెచ్చి డాయ
వచ్చి హరిత త్త్వ మని యెదనచ్చి

కౌగిట గ్రుచ్చి సంభావించినాఁడని వర్ణింపఁ బడినది. "అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్" (బా. కాం.,19 స., 15 శ్లో.)— "మహాత్ముఁడు సత్యపరాక్రముఁడు" నైన రాముని నేనెఱుఁగుదు" నన్న యోగివరుఁడు విశ్వామిత్రునిచే రాముని హరిత త్త్వముగాఁ జెప్పించుట యౌచిత్యసుందరము.

జనకుఁడు రాము పాదములఁ గడిగి శిరమునఁ దాల్చి కన్నె నిచ్చునెడ రాముఁడు సాక్షాత్ నారాయణునిగా సంభావింపఁ బడినాఁడు.

ప్రామినుక్కు కొామలు పాపటనుంతు రెద్దాని
కోమలారుణ రజఃకుంకుమంబు
సంతరింతురు దేవి శాపాయుధ శ్రేష్ఠు
లంత రంగంబున ననవరతము
దన పావనత్వంబు దరముమీఱఁగ యన్మ
రందమై పొడమె స్వర్గస్రవంతి
చిన్నారి పొన్నారి చేతల లాలించుఁ
దొడలపై నిడిదేవిఁ గడలికన్నె
యదె యహల్యాఘహారి పాదాబ్జయుగళ
మబ్బెఁ దన కని సహచరీ హస్తదత్త

కనక కలశోదకంబులఁ గడగి తాల్చె
నతఁడు శిరమునఁ దత్తీర్థ మగతనూజ
— బా. కాం.-10 ఆ., 358 ప.

అట్లే లోకమున వధూవరులను లక్ష్మీనారాయణులుగా సంభావించుట వేద ధర్మ సంప్రదాయము. జనకునకు నిజముగా లక్ష్మి హరింగూర్చు మహాభాగ్యము సిద్ధించినది. ఇట్టి సంభావన సీతారాములు లక్ష్మీనారాయణు లనుట విశదమొనర్చు చున్నది.

బహు జన్మార్జిత కర్మ బంధ వివహోప క్రాంతి నర్థించి ల
క్ష్మి హరింగూర్చుటగాఁదలంచి యిల నశ్రీకు గ్గృహాలక్ష్మిన్నెలన్
సహధర్మంచర యంచు వోఢ కిడి సత్సంపత్తిఁ గైకొందు రా
సుహితత్త్వం బిటు గన్న యాన్నృపతి సుశ్లోకత్వ మింతింతయే
— 10 ఆ., 368 ప.

ఇట్లిది యంతయుఁ గవి యుపజ్ఞమై తద్ధర్మాభిరతిని వెల్లడించు చున్నది. మఱియు (నయోధ్యలో) సభవారు రామగుణాభివర్ణన గావించుచు-

" .... ....
కనులఁగట్టినట్లు గానుపించు
రాము తేజ గౌనము రాణ సత్త్వము సిరి
గాంచి హరి యటంచు"

లోకులు దలంతురని యెంచినవిధము రమణీయము.

రామాదు లరణ్యవాసమున కరుగుచు గంగాతీరమున విడిది గావించిన విషయ మెఱింగి గుహుఁడు బంధుమిత్రాదులతో రాముని జేరి, యతిథిగా సంభావించిన తీరు రాముని విరాట్పురుషునిగాఁ జెప్పుట మనోజ్ఞము.

ఒరులకుఁ గలదే యీ భా
గ్యరమాప్తైభవము రామ! కలఁదే నీకున్

సరియగు నతిథి జగంబులఁ
బరమావధి యిదియ కాదె ప్రాణులకెల్లన్

తొలిపుట్టువున సూర్యుఁగొలిచిన కతననే
కనులకు నీమూర్తిఁ గాంచఁగలిగె
నటు సరస్వతి నిచ్చ లర్చించెఁగాబోలు
నిను రామ యని బిల్వనేర్చె నాల్క
యొక్క ప్రొద్దుండెనో యుడురాజుఁ బూజింప
మానసం బరసెఁ ద్వన్మంత్రమహిమ
నాప్రొద్దు శివుసేవ లాచరించెనొ యేమొ
చేతికందెను నీదు శ్రీపదంబు
కోసలుని కన్య ధన్య సంకోచమేల
దశరథుండౌనకాదె యా దశరథుండు
నా కొదవినట్టి భాగ్యమీనాఁట నెంచి
పొగడువారెట్టు లవ్వారిఁ బొగడువారు

అయో. కాం.-5 ఆ,, 110-11 ప. లు.

అతిథి స్వయముగా విష్ణువే యని "అభ్యాగతస్స్వయంవిష్ణుః" ఇత్యాది ప్రసిద్ధవాక్యముల దెలియ వచ్చుచున్నది. అట్టియెడ సాక్షాద్విష్ణువే గుహున కతిథిగా సిద్ధించినాఁడు. ఈ భాగ్యరమావైభవ మొరులకు లేదు. రామునకు సరియగు నతిథి జగంబుల వేఱొకఁడు లేఁడు. అంతేగాదు ప్రాణులకెల్ల నిదియె పరమావధి. విష్ణువగు రాముఁడు సర్వాధిదేవత, తక్కినవా రతనిఁ జేరుటకు సాధనము లగుట నిరూపింపఁ బడినది. ఇట్టి సంభావన యలౌకికమై సహృదయ హృదయంగమ మగుచున్నది. వాల్మీకమున నీఘట్టమున "ఈదృశంహి మహాబాహో కఃప్రాప్స్యత్యతిథిం ప్రియమ్"అని మాత్రమే చెప్పఁబడియుండ శ్రీరామకథాఽమృతమున నిట్టిది యమూలక తత్త్వోద్ఘాటనమై రాముని విశ్వేశ్వరత్వమును నిరూపించుచున్నది.

రామాదులు అత్రిముని యాశ్రమమును జేర నాతఁడు రాముని విష్ణుత్వమును దలంచి వేదవచనముల సంపూజించినాఁడు.

ఆదట యత్రిమౌని మహితాదరమూరఁగ రామతత్త్వమున్
శ్రీదయితుతత్త్వము న్మదినిఁజేర్చి తనర్చెడువాఁడ యౌట సం
వేదితృ భావ మొప్పగ నివేదిత వేద వినోద నాద సం
పాదనముం బొసర్చె గుణభవ్య వచఃకలనం బెలర్పగన్

— అయో. కాం.—10 ఆ., 273 ప.

సీత యనసూయకు స్వీయ స్వయంవర వృత్తాంతమును వినిపించుచు "రాముఁడు లక్ష్మణసహితుఁడై విశ్వామిత్రునితోఁ గూడి జనకుని యజ్ఞవాటికకు జేరె" నని చెప్పినట్లు వాల్మీకమునఁ గలదు.

సుదీర్ఘస్యతుకాలస్య రాఘవోయం మహాద్యుతిః
విశ్వామిత్రేణ సహితోయజ్ఞం ద్రష్టుం సమాగతః
లక్ష్మణేన సహభ్రాత్రా రామః సత్యపరాక్రమః

— అయో. కాం.-118 స., 43, 44 శ్లో॥లు.

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ—

కాంతు లాశాంతపుం గవిసెన లెడలించి
మేల్కొల్పి నెఱిఁగాంచు మేనితోడఁ
బ్రొద్దైజోడనఁ జాలి పొలుచు చందురులీల
తోడిదౌ లక్ష్మణు జాడతోడఁ
గప్పుతాసిరులు మాకన్నవే విశ్వప్ర
పంచమను కాకపక్షముల తోడ
వీరంబు మాడెన విరుదులై కనఁగాంచుఁ
డనెడు విల్లమ్ముల యనువుతోడ

యజ్ఞపురుషుండు యజమాను నర్థమొనఁగ
రూపుఁగొనివచ్చె ననిపించు రూఢితోడ
రాముఁ డరుదెంచె మన్మనోరాముఁ డలమి
తపసి గెలిపింతు ననెడు నిద్దంపు టెలమి - 10 ఆ., 207 ప.

అని వర్ణింపఁబడినది. ఇందు ప్రతిపదము రాముని పాత్రచిత్రణమునఁ గవులు ప్రదర్శించిన ప్రత్యేక శ్రద్ధను జాటుచున్నది. కాఁగా రాముఁడు "యజ్ఞ పురుషుండు యజమాను నర్థమొసఁగ రూపుఁగొనివచ్చె ననిపించు రూఢితోడ" నరుదెంచె ననుట హృద్యము. యజ్ఞపురుషుఁడు విష్ణువు. "యజ్ఞోవై విష్ణుః" అను నారాయణ సూక్త మిందులకుఁ బ్రమాణము. ఇట్లేట రాముఁడు విష్ణు వనుట జక్కఁగాఁ బ్రతిపాదింపఁబడినది.

రామాదులు దండకారణ్యమునఁ బ్రవేశించి తాపసాశ్రమముఁ జేర నచటి వారెల్లరు బ్రీతితో నెదురేగి పూజించిరని వాల్మీకమున గలదు.

దివ్యజ్ఞానోపపన్నాస్తే రామం దృష్ట్వా మహర్షయః
అభిజగ్ముస్తదా ప్రీతా వై దేహించ యశస్వినీమ్
— అర. కాం.-1 స., 10, 11 శ్లో॥లు.

శ్రీరామకథాఽమృతమున "నాంతరజ్ఞాన సంపన్నులా మహాత్ములు "ఆ హరి సమభ్యుదితు విధునట్లు, సీత లక్ష్మిగా" (1 స., 25 ప.) సంభావించిరని వర్ణించుట రాముని విష్ణుత్వమును నిరూపించు చున్నది.

పరబ్రహ్మత్వము : అధ్యాత్మరామాయణమున సీత హనుమంతునకు రామ తత్త్వము నుపదేశించు సందర్భమున—

రామంవిద్ధి పరంబ్రహ్మ సచ్చిదానంద మద్వయమ్
సర్వోపాధి వినిర్ముక్తం సత్తామాత్ర మగోచరమ్
అనందం నిర్మలం శాంతం నిర్వికారం నిరంజనమ్
సర్వవ్యాపిన మాత్మానం స్వప్రకాశ మకల్మషమ్
— బా. కాం.-1 స, 32, 33 శ్లో. లు.

అని రాముఁడు పరబ్రహ్మగాఁ జెప్పఁబడినాఁడు. శ్రీరామకథాఽమృతము "శ్రీ వాల్మీకి సంయమి వరకృతి నాంధ్రీకరించుచు నధ్యాత్మ ఘట్టము లిందుఁ జేర్చుచు" విపులమగు పద్ధతిని వ్రాయఁబడిన గ్రంథ మగుట ననువాదకులు రాముని "పరబ్రహ్మ"గా దర్శించి "రామపరబ్రహ్మతత్త్వము"ను గ్రంథమున బ్రతిపాదించిన విధము పరిశీలింపఁదగియున్నది

దశరథపత్నులు యజ్ఞ పాయసము భుజించి హుతాశనాదిత్య సమానములగు తేజముల గర్భము లందు ధరించిరని వాల్మీకమునఁ గలదు.

తతస్తు తాః ప్రాశ్య తముత్తమస్త్రియో
మహీపతే రుత్తమ పాయసం పృథక్
హుతాశ నాదిత్య సమాన తేజసో
చిరేణ గర్భాన్ ప్రతిపేదిరే తదా
— బా. కాం.-16 స., 31 శ్లో.

శ్రీరామకథాऽమృతమున నాసందర్భమున బ్రహ్మ మాత్రయి గర్భముల వెలుగొందుచున్నట్లు కౌసల్యాదుల గర్భలక్షణములు వర్ణించుట మనోహరము. "రసోవై సః" అను నుపనిషద్వాణి రసము బ్రహ్మమని యుగ్గడించుచున్నది. వేదము లను "త్రయి" యని వ్యవహరించుట వైదిక పరిభాష. వేదములు పరబ్రహ్మమును గూర్చి వివరించుచున్నవి. అనఁగా "త్రయి" గర్భ మందు పరబ్రహ్మ రాజించు చున్నాఁడు. దశరథుని భార్యలు ముగ్గురు "త్రయి" కాఁగా వేదవేద్యుఁ డగు పరమ పురుషుఁడు, పరబ్రహ్మ వారి గర్భము అందు ప్రకాశించినాఁడు. రసబిందుకళలు పైఁ బ్రసరించు తల్లక్షణములై పొసఁగినవి.

రసమన పరబ్రహ్మ మగుటఁ ద
ద్రస మాత్రయి గర్భయుక్తి రాజించుటఁ బైఁ
బ్రసరించు లక్షణములై
పొసఁగెన్ రసబిందుకళలు ఫుల్లాబ్జాక్షీ!
— బా. కాం.-3 ఆ., 6 ప.

గర్భవతులకుఁ జెమట పట్టుట సామాన్య ధర్మముకాఁగా నద్దాని నిట్లు కవి చమత్కరించుట రమణీయము. ఇట్టి వర్ణనమున దశరథ పత్నుల గర్భయుక్తిము క్తాఫల మగు నారాయణుఁడు పరబ్రహ్మగా గీర్తింపఁబడినాఁడు.

విశ్వామిత్రుఁడు యజ్ఞమొనరించిన సిద్ధాశ్రమము నందు యాగ పరిసమాప్త్య నంతరమా విశ్వామిత్రుఁడు మునుల గూడి సభ దీర్చిఁ "రామతత్త్వం బిదియె పరబ్రహ్మ

మనుచు” సప్రమాణముగ సంభావించి సంతృప్తి నెగడినట్లు వర్ణించుట రాముని “పర బ్రహ్మము”గా నిరూపించు చున్నది. ఇట్టి సన్నివేశ నిర్వహణ మమూలకము.

శాబ్దంబు ననుమున్న చవిఁగన్న చెవిగొన్న
పారవశ్యంబున బలువు మెచ్చి
యనుమితికరణమే యనుమాన మఖి దాని
ప్రాథమ్య మొందెడఁబాలవైచి
రూపింపఁ బ్రతిరూప రూపణం బనదంచు
నుపమ ప్రామాణ్యంబు నుజ్జగించి
యఖిల సమ్మతము ప్రత్యక్ష మంచద్దాన
స్వానుభూతి విధావిధాన మరసి
రామతత్త్వం బిదియె పరబ్రహ్మ మనుచుఁ
దపసులునుఁ దానుఁ దత్పర తంత్రులగుచు
నొండువృత్తు లెడలిచొక్కుచుండి రపుడు
నిత్యతృప్తి గడల్కొన నీరజాక్షి

— బా. కాం.-6 ఆ., 6 ప.

అరణ్యవాసమునకుఁ బోవు రామాదులను గంగానది దాటించు ధీవరులు బోధకలనా సుధీవరులై ముముక్షుభావంబున రామగీతము లాలపించుట రాముని పర బ్రహ్మముగా నిరూపించుచున్నది.

రామన్న భావింపఁ దేమన్న మోక్షంబు
రాదన్నలార యీ పాదరయుఁడు
రామన్న సంపదల్ రామన్న సేవింపఁ
బోమన్న యనుచు గారామునూపు
రామన్నఁ బూజింపరా మన్నన ల్గూర్చు
రా మానమేలరా పామరుండ
రామన్న దేవుండు రామన్న కన్నయ్య
రా మమ్ము గన్న యీ రామలక్ష్మి

రా యనుచు రావదేర బిరాన యనుచు
రా పో నర్పంగఁ జెల్లదు రా యటంచు
ధీవరులు బోధకలనా సుధీవరులయి
రా మహోదయ లబ్ధిఁ బద్మాయతాక్షి

—అయో. కాం.-5 ఆ., 217 ప.

భరతుఁడు చిత్రకూటమున సీతతో లక్ష్మణునితోఁ బర్ణశాల ముంగిట శాశ్వత బ్రహ్మతత్త్వము వలె గూర్చుండిన రాముని దర్శించెనని వాల్మీకమున గలదు.

ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణ మివ శాశ్వతమ్
స్థండి లే దర్భ సంస్తీర్ణే సీతయా లక్ష్మణేనచ

— అయో. కాం.-99 స., 28 శ్లో.

శ్రీరామకథాऽమృతమున నయ్యెడ—

శాశ్వత బ్రహ్మతత్త్వమ్ము సరణి నెఱయ
సీతతో లక్ష్మణునితోడఁ జెన్నె లొలయ
నమరు లర్థించు కోర్కుల యదను బొంచి
యుటజమున నున్న రాము నయ్యోగ్యుఁ డరసె

— అయో. కాం.-8 ఆ., 174 ప.

అని వర్ణించి మూలము నందలి భావమునకు భంగము వాటిల్లకుండునట్లు తీర్చిదిద్దఁబడినది. మఱియు బ్రహ్మను బోలి యున్నాఁడనుటకన్న "బ్రహ్మ తత్త్వమ్ము సరణి నెఱయుచున్నాఁ డనుట హృద్యము. అనువాదమున నవతార ప్రయోజనమగు నసురనిష్కాసనము నమరాభ్యుదయము బ్రస్తావింపఁబడుట విశేషము.

అత్రిమహర్షి రాముని స్తుతించుచు—

జగముల నుంచెదుఁ దేల్చెదు
జగజెట్టియ వైన మాయ సాత్త్వికు విన్నే
తగవునను మిగులనేరదు
వగలకు వగలన్ ఘటించు వగకాఁడవురా !

— 10 ఆ., 277 ప.

అనుట మాయాతీతుఁడు సత్త్వగుణ ప్రధానుఁడునైన రాముఁడు పరబ్రహ్మ తత్త్వముగా నిరూపింపఁ బడినాఁడు.

శబరికి గురువులు "సనాతనుఁడు పరమాత్మ యగు రాముఁడు రాక్షసుల జంపి, ఋషుల రక్షింప దాశరథియై పుట్టినాడని చెప్పినట్లు వర్ణించుట రాముని పరబ్రహ్మత్వమును నిరూపించు చున్నది.

> అవ్యయుండు సనాతనుఁ డప్పరాత్ముఁ
> డచ్యుతుఁడు దాశరథి యయి యవతరించెఁ
> జెడుఁగుల నడంపఁ జేకొని శిష్టజనముఁ
> బ్రోవఁ బరమార్థతత్త్వానుభూతి నెఱప
>
> — అర. కాం.-4 ఆ., 307 వ.

ఉత్తరకాండమున సీతారాముల వనవిహార వర్ణన సందర్భమున రాముఁడు "సద్వితీయుఁ డయ్యు నద్వితీయ సుఖంబనుభవించుచున్నా"ఁ డని యోగ విదులగు కవులు తద్విహరణము యోగదృష్టితో దర్శించి వర్ణించినట్లు సన్నివేశమును గల్పించి సీతారాముల పరతత్త్వనిరూపణము గావింపఁ బడినవి.[1] అందొక విహారము నందలి విశేషము లిట్లు వర్ణింపఁబడినవి.

> అనుభావంబుల కిక్కయౌ నిచటఁగాదా! మోద మెవ్వారికిన్
> ముని మూర్ధన్యులు విశ్చల ప్రణిహితాత్మల్గాంచువారల్గా ము
> న్ననిరూప్య ప్రకృతిప్రకార కలనా వ్యాసక్తు నెట్టెట్లొనేఁ
> డనిమేషస్థితి సర్వదృశ్య మగు భాగ్యం బన్య సామాన్యమే
>
> దృశ్యాదృశ్యము కద్దు తద్దిశ లసత్ప్రతంబు దానన్నవి
> ర్దేశ్యశ్రీ సుసఖంప్రసాదమన మాదేవుండు దీపించు సం
> పశ్యల్కాఁనఁగ లేరుచెప్పఁగలరా! వర్ణింపఁగారాని సాం
> కాశ్యాతీత మహోమహః కలిత ముత్కల్యాణ లాలిత్యముల్
>
> — ఉ. కాం., ఉ. భా., 1 ఆ., 161-2 వ॥లు

---

1) శ్రీ. రా. క.-ఉ. కాం., ఉ. భా., 1 ఆ., 125—72 వ॥లు

రాముని చరిత మాబాలగోపాల మాన దసంధాయియై యేకరసత నొంది నది. "రామ" అను వర్ణద్వయములేని పదము, వాక్యము, పదార్థము నట్లావేద్యంబు, నివేద్యము స్వరస భావాలాప సల్లాపములు బరికించినను బరి నెందులేవు. ఎవ్వరేవిధ మున దలపోసిన వారికా రూపమునఁ బ్రత్యక్షమైనట్లు వర్ణించి "పురము జనము రామోత్సవైకభాజనమైనదనుట నన్నిరూపులు దనరూపులై తనరిన" రాముని పర బ్రహ్మత్వమునకు నిదర్శనము.

ఆడుకొనెడు బాలురం దాలికాపరు
లందు దెసలనుండి యరుగుదెంచు
వారలందు నున్నవారల యందును
రాము చరిత మేకరసత నొందె

ఆ వర్ణద్వయిలేనిదౌ పదము వాక్యంబుం బదార్థంబు న
ట్లా వేద్యంబు నివేద్యము స్వరస భావాలాప సల్లాప ల
క్ష్మి విద్యాధిగమంబులుం బొరిఁ బరీక్షింపంగ నైనం బరిన్
లేవాచార్యక మవ్విభూత్సవమె బాళిం గైకొనెన్ బాలికా!

ఆ హంస డాయనిదౌ తమ్మివిరి కొలం
కా కోయిలకుఁ గాని యాకుఁగొమ్మ
యా చిల్క మేల్పలుక లబ్బని యుద్యాన
మా భృంగ మెలయని యలరుఁ దీవె
యా కేకి యాడని దనవైన వనశాఖి
యా వృషభం బెనయని యట్టి క్షేత్ర
మా మత్తగజము విహారమందని కోన
యా హరి పెరయనిదైన గుహయు
నందొకవి చిత్తమేనియు నౌ ననంగఁ
జాలదెబ్బంగి సామగ్రిఁ బొసఁగఁగూర్చి
సృష్టి సౌవరించెనొకదే స్రష్ట పురము
జనము రామోత్సవైకభాజనము గాఁగ

— అయో. కాం.-1 అ., 296—98 పద్యాలు

"తం యథా యథోపాస్తే తథైవ భవతి" అనునది మీమాంసాశాస్త్ర ప్రసిద్ధము. ఏ పుణ్యాత్ముని చిత్తమో తమ్మివిరికొలంకు కాఁగా నాతఁడు హంసయై డాసి తిరుగాడినాఁడు, అదే యామఁగొమ్మ కాఁగా నాతఁడు కోయిలయై వినదించినాఁడు. ఆ హృదయమే యుద్యాన వనముకాఁగా నతఁడొక చిల్కయై మేల్పలుకులు పచరించినాఁడు. అదె యలర్తుఁదీవెకాఁగా నాతఁడు భృంగమై యలరినాఁడు. ఆ మనసు వనరాజి కాఁగా రాముఁడు కేకియై యాడినాఁడు. అదె క్షేత్రమగుచో దాను గజమై విహరించినాఁడు. అదె "గుహ" కాఁగా బురుషోత్తముఁడు హరియై పెరసినాఁడు. అందు రామమయమానసులై యిట్లాతని సంభావింపనివారు లేరు తుదకు "సర్వం ఖల్విదం బ్రహ్మ" మనినట్లు జగమే "రామ"మయమైనది. రాముఁ డయోధ్య నభిషిక్తుఁడై నంత నుత్సవ సంరంభము లతిశయించినవి.

రామగాథల నొడివెడు రాచిలుకల
రవళికి రమారమణులకు రాదు విద్ర
వచ్చెనా? స్వప్నమున రామవై భవములె
రామ మయమయ్యె జగమె విరామయంబు

— ఉ. కాం., పూ. భా., 9 ఆ., 293 ప.

అంతఁ బౌరజన మనము సాధకుని చిత్తము వలె సమాధి చాయఁబరగినది.

తడయ కొనాఁటి కానాఁడు ధన్యుఁడైన
సాధకుని చిత్తము సమాధిచాయఁబాఋ
కరణి తృప్తుల నితర సంకథలమాని
రామ తత్పర మయ్యెఁ బౌరజన మనము

— 10 ఆ., 35 ప.

సీతతోఁ గూడి రాముఁడు కొలువు దీర్పఁగాఁ గనిన సభవారు తృప్తిమై సమాధిస్థితి నందిరి.

ఆ సిరినేలువానిఁగననౌ గనుదోయి మనంబు నందె యు
చ్ఛ్వాసము దోఁపకే విలయసంగతి సంగతమౌటఁ దృప్తిమై

నాసలువాసి కోసల సుతాత్మజ భూతిమయం బయంబుగా
నా సభవారు వొందిన సమాధి వచింపఁదరంబె చిన్మయీ

— ఉ. కాం., పూ. భా., 8 ఆ., 31 ప.

అట్టియెడ నాబాలగోపాలము నానంద మతిశయముగ నంది మిన్నందినది మునులకన్న మున్నుగా వారి చిత్తములు నివాతదీపముల వలె నిష్పందమై నిలచినవి.

వాయు వికృతమ్ము చిత్తమ్ము వార్యచలన
మని యడవులంబడిన మౌను లటులె యుండ
నప్పు డాబాల గోపాల మది నిలిచె ని
వాత దీపం బనంగ నిష్పంద మగుచు

ఇంతయుఁగాలము వైభవ
మింతీఁకాలస్వరూపుఁడే వాఁడుఁ దదై
కాంతికత జగమునకు నే
కాంత సుఖస్ఫురణమొనగఁగా దొరకొనదే

— 9 ఆ., 295–6 పaలు

ఇట్లిదియంతయు కవి స్వోపజ్ఞకమై రాముని "పరబ్రహ్మ"గా నిరూపించుటకు దగియున్నది. అవ్విధి దర్శించిన కవుల ప్రతిభ యనన్యసామాన్యము.

**భరతుఁడు :** భరతుఁడు భక్తిభావము రాశీభూతమై తనరిన పుణ్యమూర్తి. రాముఁడే రాజు కావలెనని యాతని నరణ్యము నుండి యయోధ్యకు దోడి తెచ్చుటకు మహాద్బంధు భృత్యసైన్య ములతోఁ జిత్రకూటమునకుఁ బయనమై భరతుఁడు మార్గమధ్యమున భరద్వాజమహర్షిని దర్శించినాఁడు. భరద్వాజుఁ డాతని మెచ్చి "త్వద్వరయుక్తి కిన్మహాతవర్తనకుం దగినట్టి సత్కృతుల్, సురుచిర వృత్తిమై నెఱపఁజూచెద"[1] నని ప్రశంసించి విందొసగ గూర్చినాఁడు. అట్టి విందు సందర్భమున భరతుఁడు మంత్రులతో గూడి యొక దివ్యభవనమునఁ బ్రవేశించి యట ఛత్రచామరకలిత మగు రాజాసనము

---

1) శ్రీ. రా. క.-అయో. కాం., 7 ఆ., 244 ప.

నొక్కడానిని గాంచి రాముని నిమిత్తముగా ప్రదక్షిణ ప్రణామములు చేసి యుపచరించి సచివులతోఁ గూడి యుచితాసనముల గూర్చుండె నని వాల్మీకమున గలదు. (అయో. కాం.-91 స. 38, 39 శ్లో. లు.)

శ్రీరామకథామృతమున భరతుఁడా యాసనమును "గనుఁగొని శ్రీరాము నందుఁ జేర్చె భావనాబల భవిక సద్భావుఁ డగుచు"[1] అని వర్ణింపఁబడినది. అనఁగా భావనతో రాముని సింహాసనారూఢునిగా సంభావించినాఁడు. అట్టి తలఁపు భరతున కానందము గల్గింప సీతాదయితుఁ డగు రాము నెన్నఁడు పట్టాభిషిక్తునిగాఁ గనుఁగొం దునో యని హృదయమున నుబ్బుచుండెను. ఇట్టి సంకల్పమే యాతనిఁ బూత చరిత్రునిఁ గావించినది.[2] ఇట్టి వర్ణన మాతని రామాగమన కాంక్ష వెల్లడించుచున్నది. కావుననే "నహి కల్యాణచారిత్రః కైకేయానంద వర్ధనః" అని వాల్మీకియే స్వయముగాఁ గీర్తించినాఁడు. భరద్వాజుని విందు భరతుని శీలపరీక్షకు నికషపాషాణము.

చిత్రకూటమున రామునిఁ జేరి పల్కునెడ భరతుఁడు—

చేతులు మోడ్చి తన్మయతఁ జిత్తమున్గదియించి సద్గుణ
శ్రీ తనువొందె నిట్లనఁగఁ జెల్వు మెయిం దనరారి"
— 9 ఆ., 9 ప.

నాఁడనుట భరతుని సద్గుణసంపదను బ్రకటించుచున్నది. ఇట్టి భావన కవి స్వోపజ్ఞము, మనోజ్ఞము.

భరతుఁడు రామపాదుకలు సింహాసనమున నుంచి యభిషేకించి తదధీనుఁడై తానొక రాజప్రతినిధిగా రాజకార్యములు నిర్వహించుచు సర్వము ముందుగా రామపాదు కలకు నివేదించుచుఁ బ్రజాపాలన మాచరించెనని వాల్మీకమున గలదు.

తతస్తు భరతశ్శ్రీమా నభిషిచ్యార్య పాదుకే
తదధీన స్తదారాజ్యం కారయామాస సర్వదా
యథాహి యత్కార్యముపైతి కించిదుపాయనం చోపహృతం మహార్థమ్

1) శ్రీ. రా. క.-అయో. కాం., 7 ఆ., 279 ప.
2) శ్రీ. రా. క.-అయో. కాం , 7 ఆ., 280 ప.

సపాదుకాభ్యాం ప్రథమం నివేద్య చకారపశ్చాద్భరతో యథావత్
— అయో. కాం. 115 స., 26, 27 శ్లో. లు

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ రామభక్తిపరాయణుఁ డగు భరతుఁడు పాదుకాపట్టాభిషేక మొనరించి సర్వము తదధీనముగా నిర్వహించుచు దద్దర్శ నౌత్సుక్యంబు దలకుమిగులఁ బారవశ్యంబు గలుగ విచిత్రచరిత్రుఁడై వనవాసపుఁ దక్కిన దినములు లెక్కించుచు కాలము గడుపుచున్నట్లు వర్ణింపఁబడుట రమణీయార్థబంధురము.

పాదుకల కొనర్చెఁ బట్టాభిషేకంబు
తా నిమిత్తమాత్రతను వహించి
జయము జయమటంచు జయఘోషణలు భౌమ
సౌరవాద్యతతుల చక్కనిగుడ

అభిషేక మొనరించె నా పాదుకల రాజ్య
సింహాసనంబునఁజేర్చి ప్రీతిఁ
బువ్వులఁ బూజించె భూషణమ్ములు పెట్టి
లాలితాకృతిగ నలంకరించి
యాలవట్టంబుల ననువొందఁగూర్చెఁ జే
చేత వీవన వైచు సిరిఁదనర్చి
వెల్లవారలసేవ లెనయించె నాప్రొద్దు
విజ్ఞాపనము లందె వెలయఁజేసి

యేయుపాయనములు వచ్చు నేమిరాజ్య
తంత్రమున మంత్రయోగముల్దార సిల్లు
నవి నివేదించు రాముని కట్లె కట్టు
మెయి బదత్రాణములకు నమ్మిహారకులుఁడు
— 9 ఆ., 403, 404 పాలు

మూలాధికమగు నీ పాదుకాపట్టాభిషేక వర్ణనము భరతుని విశేషభక్తికి నిదర్శనము. కాఁగా భరతుఁడు రామపరాయణత్వమునఁ దదన్యమున్మఱచి రంజిలు విధమిట్లు వర్ణింపఁ బడినది—

కదిసె రాముండు శృంగార ధాముఁ డటంచుఁ
జెలఁగి యొక్కతఱి మేల్సిరిఁదలిర్చు
నవె జానకీజాని యడుగు గెందామర
లనుచు నొకప్పు డాటాడఁజొచ్చు
గలిగె నాథుని కటాక్షము లంచు నొకవేళ
నుబ్బితబ్బిబ్బు చెయ్వుల నొనర్చుఁ
బొనరెను దన్ముఖ స్ఫురణలం చొకమాఱు
దృక్చకోరికల సంతృప్తిఁగూర్చుఁ

జొక్కు నొక్కెడ నొకపరి సోలు మేలి
పాటపాడు నొక్కొకసారి భజన నృత్త
గీతవాదిత్ర ముఖ్యము ల్గిలు కొలుపుఁ
బరవసము దన్నుఁ బొదువ నా భరతవిభుఁడు

— 9 ఆ., 408 ప.

అట్టియెడ భరతుఁడు మహాయోగియైనాఁడు. కవులు మొదటి నుండియు భరతుని యందా గుణముఁ బుష్కలముగాఁ బోషించుచు వచ్చిరి. చిత్రకూటమున నుటజమున నున్న రాముని "శాశ్వత బ్రహ్మాత్మత్వమ్ముసరణి నెఱయు" (8 ఆ., 174 ప.) వానిఁగాఁ జూడఁగల్గిన యున్నత సంస్కార మాతని యందెలయింపఁ జేసిరి.

రామపట్టాభిషేకానంతరము భరతుఁడు రామునిఁ జేరి భక్తిభావమున ప్రసంగించి రాముని ప్రసాదమును గోరి తదనుగ్రహము నందిన ఘట్టమంతయు జీవేశ్వర సంవాద సంబంధమై యథాత్మసుందరముగా నలరుచున్నది. సీతారాముల నొకచోఁజేర్చి దర్శించు భాగ్య మొదవు నయ్యెడ హృదయ మా యలౌకిక సౌందర్యమున లయమగుచున్నదను హృద్యము. భరతునకు సీతారాము లిరువురు రెండునేత్రములతో సమానము

దక్షిణనేత్ర మందెసఁగు తత్పురుషుండవు నీ వ దక్షిణం
బక్షినిఁజెందియున్నది మహాత్మ! భవత్సతి సీత మిమ్ము నే
కక్షితి మేళవించి కనగా నగు యోగికి నందె డెంద మ
ద్దే క్షయమంద బుద్ధికలమే తనుఁగొల్వగనౌ నధీశ్వరా!

— ఉ. కాం., పూ. భా., 10 ఆ., 275 ప.

నేత్రములు రెండును నేకముజేసి భ్రూమధ్యమున నిలిపి యేకదృష్టితోఁ జూడఁగల్గిన యోగికి వృత్తి లయమై యింద్రియాతీత జ్ఞానము లభ్యమగును. ఇయ్యది యోగశాస్త్రవిషయము. భరతుఁ డట్టి యోగపుంగవుఁడుగా నిటఁ దీర్చిదిద్దఁబడినాఁడు.

**లక్ష్మణుఁడు** : ఇతఁడు సుమిత్రాతనయులలోఁ బెద్దవాఁడు లక్ష్మణుఁడు రామునితోను, శత్రుఘ్నుఁడు భరతునితోను గలిసి మెలగుట పాయసాన్న ప్రభావ మని చెప్పఁబడుచున్నది. వాల్మీకమున లక్ష్మీ సంపన్నుఁడగు లక్ష్మణుఁడు రామునకు బహిఃప్రాణముగాఁ గీర్తింపఁబడినాఁడు.

లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః
నచతేన వినానిద్రాం లభతే పురుషోత్తమః
— వా. రా.—బా. కాం., 18 స., 30 శ్లో.

రావణ శక్తి నిహతుఁడై యుద్ధరంగమున పడియున్న లక్ష్మణుని గాంచి రాముఁడు పడిన వేదన యాతని యాత్మీయతకు నిదర్శనము.

దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవః
తంతు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః
— యు, కాం.-101 స., 15 శ్లో.

ఇంద్రజిద్వధాఘట్టమున లక్ష్మణుఁడు శస్త్రాస్త్రముల నెన్నింటినోఁ బ్రయోగించి తుదకు రాముని సత్యపరాక్రమము నిరూపించుచు శపథము గావించి యైంద్రాస్త్రమున నాతని బరిమార్చినాఁడు.

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథి ర్యది
పౌరుషేచా ప్రతిద్వంద్వశ్శరైనం జహి రావణిమ్
— యు. కాం.–90 స., 69 శ్లో.

ఇట్లాతని పలుకులు రాముని సత్య పరాక్రమములకు నిదర్శనముగా నెగడినవి. రాముని యరణ్యవాసమునకు దుఃఖించి యాతని ననుసరించి లక్ష్మణుఁడు భక్తితో సేవించినాఁడు.

పరాభూత యగు శూర్పణఖ రావణునితో రాముని ప్రతాపమును గూర్చి చెప్పుచు లక్ష్మణుని విషయమిట్లు వివరించినట్లు వాల్మీకమున గలదు.

భ్రాతాచాస్య మహాతేజా గుణతస్తుల్యవిక్రమః
అనురక్తశ్చ భక్తశ్చ లక్ష్మణో నామ వీర్యవాన్
అమర్షీ దుర్జయో జేతా విక్రాంతో బుద్ధిమాన్ బలీ
రామస్య దక్షిణోబాహు ర్నిత్యం ప్రాణో బహిశ్చరః
— అర. కాం.-34 స., 13, 14 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమున నయ్యది —

అన్నమాటకుఁ దప్పఁడట్లాతఁడుండ
నన్నమాటకుఁదప్పఁబోఁడతని తమ్ముఁ
డన్నిటను దన్నెపోలెడు నన్నిరంకు
శ ప్రతాపుని గణియింప శక్తిగలదె
లక్ష్మణాఖ్యుఁ డతఁడు లక్షణవంతుండు
దక్షిణంపు భుజము తనకుఁ గాఁగఁ
దొడరకుండునెట్లు దుర్జయుండట వాఁడు
చాలదింక శని నిశాచరులకు
— అర. కాం.-2 ఆ., 328—9 ప॥లు

అని వర్ణింపఁబడి "అన్నమాటకు తప్పని లక్ష్మణుని భక్తి, నిరంకుశప్రతాపము, వానివలన రాక్షసుల కేర్పడిన దురవస్థ విశేషముగా వివరింపఁ బడినవి.

ఋశ్యమూక పర్వతమున వానరులు తెచ్చియిచ్చిన సీత యాభరణములు గుర్తించు సందర్భమున లక్ష్మణుఁడు "కుండలములు కేయూరములు నేనెఱుంగను, నిత్యము పాదాభివందన మాచరించు నభ్యాస వశమున నూపురములు మాత్ర మే నెఱుఁగుదు" నని పలికినట్లు వాల్మీకమున గలదు. లక్ష్మణునకు సీత యెడఁ గల మాతృభావము నిరూపించుట యిందలి పరమార్థము.

నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్
— కి. కాం.-6 స., 22 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నయ్యది——

ఎఱుఁగనయ్య కేయూరమ్ము లెఱుఁగఁ గుండ
లమ్ము లటులాఁతిసౌమ్ముల యమ్ము లెఱుఁగ
నమ్మ నూపురముల మాత్ర మరయఁగాంతు
నిచ్చలుఁ బదాభివందన నిరతిఁజేసి

— కి. కాం.-1 ఆ., 144 ప.

అని యనువదింపఁ బడినది. "ఎఱుఁగనయ్య" అని రాముని సంబోధించుట వలన లక్ష్మణుఁడు రాముని తండ్రిగాను, "అమ్మ నూపురములు మాత్ర మరయఁగాంతు" ననుట వలన సీతను తల్లిగాను సంభావించినతీరు వివరింపఁ బడినది. అరణ్యవాసమునకు బోవు సందర్భమున లక్ష్మణుని తల్లి సుమిత్ర తనయునితో "రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్" (అయో. కాం.-40 స., 9 శ్లో.) అని పలుకుట సర్వాత్మనా గౌరవించి యాచరించినవాఁడు లక్ష్మణుఁ డనుట విదితము.

బ్రహ్మ సందేశమును వినిపింప యముఁడు మునివేషమున రాముని దర్శింప వచ్చినాఁడు. మరణశిక్షయను సమయమొండు కల్పించి యేకాంతమున రామునితో సంప్రదించినాఁడు. అట్టి సమయమున దుర్వాసుఁ డేతెంచి రామునకు దన యాగమనమును దెలుపి తనను బంపు మనినాఁడు. కాదనిన రాముని, రాఘవ వంశమును, పురమ్మును, రాష్ట్రమును నిగ్రహింతు ననినాఁడు. లక్ష్మణుఁడా క్లిష్టసమయమునఁ దద్రక్షణమునకై యాత్మత్యాగము సేయ బూనినాఁడు. అవ్వార్త రామునకు నివేదించినాఁడు. ఇట్టి నిర్ణయ మితరు లెవ్వరుఁ జేయ సమర్థులు కారు.

ఏకస్య మరణం మేఽస్తు మాభూత్సర్వ వినాశనమ్
ఇతి బుద్ధ్యా వినిశ్చిత్య రాఘవాయ న్యవేదయత్

— ఉ. కాం.-105 స., 9 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నయ్యది యిట్లనువదింపఁ బడినది—

" ... మౌనిఁగని శూరుఁడు మానసమందుఁ జింతఁజెం
ది నియతి దుర్నివార యని నిశ్చయమొక్కటి సేసె నీశ్వరీ !

ఎక్కడి దూతుఁడో యెఱుఁగంగ రా దాతఁ
డినునిచే బాస సేయించె నట్టు
లిది యే పరీక్షయో యీ సమయమ్మున
కరుదెంచె గోపనుఁ డత్రిపుత్రుఁ
డిమ్మహాత్ముఁడు వోవ వినవంశ్యుఁ డలివెనా
బ్రహ్మహత్య కాలంబు బాడు సేయు
నట్లని వీడెనా యవుఁగలంకము
చరితంబు నందు నాస్వామి కకట
పోవనీకున్న రేఁగి యిమ్ముని శపించు
శాపమున సర్వనాశంబు సంభవించు
ఇట్టి సంకటమున నాకు నేది దారి
దారి దొంకయులేదు పో దయ్యమునకు
కావున నేనే పోయెద
భూవిభునకు ముందుఁ గర్జము విపేదింపన్
యావదపాయము కన్నన్
జావొకఁ డితఁ డెనపెనేవిఁ జనుఁగాఁకనుచున్
— ఉ. కాం.-ఉ. భా., 9 ఆ., 85—7 ప॥లు

అనువాదమున నిట్టి వివరణము ల
నిష్ఠను, త్యాగ నిరతిని, ధర్మా భిరతిని వెల్ల
మున నిట్లా పుణ్యచరిత్రుని పాత్ర చక్కగా

**దశరథుఁడు :** ఈతఁ డయోధ
పురుషుఁడు. భూమిప్రజల మేలుగోరి c
వీరుఁడు. రాజర్షి. ఈతని తపమునకు మెచ్చి
తలు సహిత మీతని సాయము గోరి రాక్షసబాఁ
తనయులు గూడ లోకకంటకులగు రాక్షసులఁ బరిమార్ప జగద్ధితము గావించిన మహా
త్ముఁడీతఁడు. సత్యవాది, గురుకార్య తుఁడు. ఇట్టి దశరథుని గూర్చి వాల్మీకి
రామాయణమునఁ జక్కగా చెప్పబడినది.[1]

---

1) వా. రా.-బా. కాం., 6 స., 1—5 శ్లో॥లు

శ్రీరామకథాఽమృతమున నయ్యది యథామూలముగాఁ జిత్రింపఁ బడినది.[1]

అనువాదమున విశేషముగా "తన దొరతనము మునులౌనన నెఱపినాఁ" డనుట దశరథుని లోకహితకాంక్ష, పరిపాలనాదక్షత వెల్లడించుచున్నది. కావుననే వశిష్ఠుఁడు తన కులబ్రాహ్మణుఁడు కాగా విశ్వామిత్రుఁడు యాగరక్షణమునకై యాతని సాయ మర్థించినాఁడు. అట్లే చంద్రునితో నాతని కౌపమ్యము గల్పించుట రాజత్వము నకు సార్థకత సిద్ధించు చున్నది. "రాజా ప్రకృతి రంజనాత్" (ర.వం.-4 స.,12 శ్లో.)

మఱియు "కౌసల్య, సుమిత్ర. కైకేయిలతోఁ గూడిన దశరథుడు వృత్తి త్రయితోఁ గూడిన వేదమును, త్రిలోకి భరించు మేరువును, త్రివేణిఁ బెనఁగొను సింధువును బోలియున్నాఁడని" చెప్పుట హృద్యము.

ఆతఁడా త్రయిఁ గూడి మహాసమృద్ధి
వెలసె వృత్తిత్రయిఁ బొసంగు వేదమునఁ ద్రి
లోకి భరియించు మేరువు జోకమైఁ ద్రి
వేణిఁ బెనఁగొను సింధువు వీఁకఁదొడరి

— 1 ఆ., 364 ప.

అట్లే ఆతని మువ్వురు సతులను శ్రుతులు, త్రేతాగ్నులు, త్రిలోకీరమలు, త్రిశక్తిశ్రీలుగా సంభావించి దశరథుని బ్రహ్మగా, త్రిమూర్త్యంశయుతునిగా, నింద్రునిగా, నదీశ్వరుగాఁ బేర్కొనుట బరమోదాత్తత సంతరింపఁబడి పాత్రచిత్రణమున నుత్కృష్టస్థాయి నందుకొనినది.

ఈ మువ్వురును శ్రుతులే యనఁగావచ్చు
నితఁడజాత్మోద్ధత నెసఁగెఁగాన
నీ కాంతలు త్రితాంచితేశాను లనవచ్చు
నితఁడు త్రిమూర్త్యంశ యుతుఁడు గాన
నీ రామలే త్రిలోకీ రమ లనవచ్చు
నితఁ డింద్రు గద్దెపై నెక్కెఁ గాన

1) బా. కాం.–1 ఆ., 333–35 పద్యాలు

నీ శ్రుతాఢ్యలు త్రిశక్తిశ్రీ లనఁగవచ్చు
నితఁడధీశ్వర పదమెనసెఁ గాన

ననుచు బుధులు వొగడ నాత్రయి గూడి త్రి
వర్గ యోగ కలన భాసమానుఁ
డగుచు నవనవహ్నాలంది మిన్నంది త్రి
విక్రమ ప్రకాశ విదితుఁ డయ్యె

— 1 ఆ., 365 ప.

ఇందు దశరథుఁడు క్రమముగా నజతనయుఁడై, సూర్యవంశోద్భవుఁడై, ఇంద్రునిచే సన్మానింపఁ బడినవాఁడై, ఉత్సాహ ప్రభుమంత్ర శక్తులతోఁ గూడి చక్రవర్తియై తనరుటను సూచించుట స్వభావోక్తి మధురము. ఇట్టి భావన విలక్షణమై యమూలక మగుట కవి ప్రతిభకు నిదర్శనము.

సంతానార్థియై వేడ నిజ కులగురుని వశిష్ఠమౌనిశేఖరుని సందర్శించి 'సముపహార విధులం గౌతూహలంబు మునుకొనం బత్నీ సమేతుండై యమ్మనుకుల ప్రదీపకుండు త్రయీ సమాశ్రితంబగు ప్రణవంబు పరమాత్మ ననుసంధించు తెఱంగు నవలంబించి పూజించి' నట్లు చెప్పుట యౌచిత్యసుందరము. ఇటఁ 'త్రయీ సమాశ్రితుఁ డగు ప్రణవస్వరూపుఁడు దశరథుఁడు. గురూపదిష్ట మగు 'ప్రణవసహిత త్రయి' యనఁగా నోంకారముతోఁ గూడిన వేదము పరమాత్మతత్త్వము నెఱుంగుటకు సమర్థమగును. అట్లే దశరథునితోఁ గూడిన రాజ్ఞీత్రయి పరమాత్మ స్వరూప మగు రామాదులఁ బడయఁబోవుచున్న దనుటను వివరించుచున్నది. ఇట్టి వ్యంగ్యవైభవము నకు మూలమైన యీ వర్ణనము దశరథునియు, నాతని సతులయుఁ బాత్రచిత్రణమున విశిష్టతను సంతరించుకొనిన దనుట యత్యుక్తి కాదు. ఇట్టి యుపమానము కవి సంస్కారమును వెల్లడించుచున్నది.

విశ్వామిత్రుఁడు యాగరక్షణమునకై రామునిఁ బంపు మనివేడ 'దశరథుఁడు శోకోపహతుఁడై మూర్ఛ మునిగి యంతలోఁ దెలిసి భయమున దుఃఖితుఁ డాయె' నని వాల్మీకమునఁ గలదు.

శోకేన మహతావిష్టశ్చచాలచ ముమోహచ
లబ్ధసంజ్ఞ స్తథోత్థాయ వ్యషీదత భయాన్వితః
— బా. కాం. - 10 స., 21 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నయ్యెడఁ బుత్రవాత్సల్యమున విహ్వలుఁడైె దశరథుఁడు —

నోచిన నోము లొక్కఁడుఁగ నూఱును వేయును రాముఁడయ్యె నీ
యాచన యేలవచ్చె నను నక్కట కాల్పనె యెల్ల యర్థమా
లోచన సేయ కిత్తునని లోఁబడి పల్కితి నెద్దియేనియుం
దోఁచునె యాపదల్గదిసి త్రోచెడు నయ్యెడ నెట్టివారికిన్
— బా. కాం. - 5 ఆ., 53 ప.

పండువు లుత్సవాదులు శుభక్రియ లంపుడటన్నఁ బిడ్డలం
గొండొక యిండ్ల కంపుదురు క్రూరతమీఱఁగ మేటి రక్కసుల్
పిండుగ నైరివారిపైఁ బెంపఱఁ దోలుమటన్న నేడు నా
గుండియ తాయె యిన్నొ బలు గోరము నెట్లు భరింతునయ్యయో

పెక్కేండ్లు సంతతికినై
యక్కఱపడి జప తపమ్ము లర్పించి తుదిం
దక్కరనుకొనిన యీ సుతు
లిక్కైవడి గాఁగ దైవమెంచెనొ తలపన్
— బా. కాం. - 5 ఆ., 55, 56 పలు

అని యిట్లు లోలోనఁ గుంది మతేమన్న నేమి దోసమో యని పలుకనేరక దైవమును జింతించినట్లు వర్ణింపఁబడినది. ఇట్లు గాఢ స్నిగ్ధ వాత్సల్యముఁ గల తండ్రి తనయుని వియోగమును భరింపఁజాలకుండుట నసహజముఁగఁ జిత్రించి దశరథుని పాత్రకు వన్నె బెట్టిరి. రాముఁడు దశరథునిఁ దాపము దలఁగఁ జేయు నిండు జాబిల్లి. పంకముడివోవఁ జేయు యమునాతరంగ ప్రవాహము. దైన్యము నశింపఁజేయు నీవిమ్రాను. తమ మెడ లించు వరుణమండలి. మనోరథముల పంట, మహోత్సవామృతాంబుధి, మేలు,

మురిపెము, మొలక ముద్దు[1] నగుట నాతఁడరుగ సీతని కేమి సుఖము కలదు? కావున దానింతటి దుఃఖప్లుతిఁదోగినాఁడు. కరుణరస ప్రధానమగు నీ ఘట్టమును మూలాధికముగా వర్ణించి తండ్రిగా దశరథునకు గలిగిన వ్యథను గనుల గట్టినట్లు వివరించుటంఁజేసి పాత్రచిత్రణమున నౌచిత్యము సంపాదింపఁబడినది.

జనకుఁడు రాముని శివధనుర్భంగ వార్తతోఁబాటు సీతారాముల వివాహ శుభలేఖఁ బంపినాఁడు. దశరథుఁ డది గని చిరకాలవాంఛిత సిద్ధి గలుగ నుపాస్య దైవమును దర్శింపఁబోవు నుపాసకుని వలె నానంద తరంగిత హృదయాంతరంగుఁ డైనాఁ డనుట యాతని రాజర్షిత్వమును నిరూపించుచున్నది.[2]

ఉత్తరకాండమున నగస్త్యుఁడు రామునకు రావణాదుల పూర్వచరిత్ర వివరించుచు 'దశరథుని బాల్యచరితము' వర్ణించుట శ్రీరామకథామృతమున కవుల స్వాతంత్ర్యమునుఁ బ్రకటించుచున్నది. అట్టిది వర్ణింపఁబడుటతో దశరథ చరిత్రకు సంపూర్ణత సిద్ధించి యాతని పాత్రచిత్రణమునకు వన్నె చేకూరినది.

ఇంద్రాదులకునైన నిటుకా దటన రాని
గ్రహగతిఁ దన యిచ్చఁ గడిపి పుచ్చెఁ
జతురంత మహినేలెఁ జతురుం డితండంచు
రాజన్య కన్య లాత్రపడి కొలువ
రాజాసనం బెక్కరా కెక్కు వయసున
రాజర్షి వరుఁడన్న రాణఁగాంచె
వేల్పులు మార్తురవెఱఁ దన్ను శరణన్న
నభయమిచ్చి హరించె నసురవరుల
గాన కున్నన్ని దినములు గానకున్నఁ
గనెడు తఱియైన నిన్నుఁ జిద్ఘనునిఁ గనియె
నాడి తప్పనివాఁడన్న పాడికొఱకు
వెఱక వెచ్చించెఁ దన ప్రాణవితతిఁ దుదకు

— ఉ. కాం. - పూ. భా., 8 ఆ., 237 ప.

అని దశరథుని విశిష్టత నగస్త్యుఁడు రామునితోఁ జెప్పుట హృద్యము. ఇంద్రాదులు సహితము కాదనఁజాలని గ్రహగతిఁ దన యిచ్చఁ గడిపినాఁడు. ఎక్కలేక రాజసింహాసనము నతిప్రయత్నమున నెక్కు చిఱుత వయసుననే అనఁగా నాతని పంద్రెండవ యేటనే రాజర్షియై వరలినాఁడు. దేవతలు వేడ రాక్షసులఁ బరిమార్చినాఁడు. నేల నాలుగు చెఱగుల నేలి సుఖభోగముల నందినాఁడు. చిద్ఘనుని రాముని గానక కన్న సంతానముగాఁ బడసినాఁడు. సత్యసంధతఁ బ్రాణములు విడిచినాఁడు. అట్టి దశ రథుని 'ఆ చరిత ప్రచారముల నక్కడనక్కడ వించునుస్కిఁ బైశాచిక సార్వభౌముఁ డతి సాహస మీ విభుఁ బిల్చి వీరఁగా జూచుట కాక వేతొకటి చూతపు' నితలంచి యాతనితో యుద్ధమునకుఁ దలపడలేదనుట యా వీరుని శౌర్యసంపదను వెల్లడించుచున్నది.

**జనకుఁడు** ఇతఁడు రాజర్షి. ఈతని జీవిత మధ్యాత్మసుందరము. భారతీయ తత్త్వశాస్త్రమున జనకునకుఁ బ్రముఖ స్థానము గలదు. వాల్మీకమున సీతని గూర్చి 'జనకస్య మహాత్మనః' (బా. కాం. - 50 స., 2 శ్లో) అని మాత్రమే చెప్పఁ బడినది. శ్రీరామకథాఽమృతమున నాతని మహత్వ మిట్లు నిరూపింపఁబడినది —

పుట్టువిరాగియై పొలుపొందు శుకయోగి
 యెవనిఁ బ్రబోధామృతేచ్ఛఁ జేరె
వెన్నతోఁ బరవిద్యగొన్న యాసులభాఖ్య
 యెవని విస్సంగత కెదఁద మెచ్చె
వొందొండు గవగూడ నొల్లని శ్రీముక్తు
 లెవని దక్షిణత జోడెనసి మెఱసె
నొరుల నంపద్యోగ మొర్వని పెరసాము
 లెవని శ్రేయమున కనీర్ష్యతఁ గని
రట్టి భవ్య యశుఁ డహంకార దూరుండు
చారుమూర్తి జనక చక్రవర్తి

— బా. కాం. - 4 ఆ., 129 ప.

పుట్టు విరోగియై పొలుపొందు శుకయోగికిఁ బ్రబోధామృతము నందించిన యుపదేష్టగాను, పరవిద్య అనఁగా బ్రహ్మవిద్య వెన్నతోఁ గొన్న సులభాఖ్య యెడద మెచ్చుకొను నంతటి నిస్సంగునిగాను, ఏకత్ర నివాసమున కొల్లని శ్రీ, ముక్తులు జోడెనని మెఱయ నేలిన దక్షిణుఁడు గాను, ఒరుల సంపదోద్యోగమును సహింపని పెర సాములు అనఁగా శత్రురాజులు ఈర్ష్యఁ జెందని యట్లు శ్రేయము లందిన చక్రవర్తి గాను, భవ్యయశునిగా, నహంకార విదూరునిగాను గీర్తించుట కవి జనకుని పాత్ర చిత్రణము నెడఁ బ్రదర్శించిన ప్రత్యేక శ్రద్ధను వెల్లడించుచున్నది.

'లోకమున వధూవరులను లక్ష్మీనారాయణులుగా భావించి కన్యాదాన మొనరించుట గృహస్థ ధర్మము నందలి సంప్రదాయము. జనకుఁడు (సీతను) సాక్షా ల్లక్ష్మిని, (రామునకు) సాక్షాన్నారాయణున కిచ్చి వివాహ మొనరించు నదృష్ట విశేష మునకు నోచుకొనినాఁడు'. (బా. కాం. 10 ఆ. 368 ప.) చూ. పాత్రచిత్రణము

'లక్ష్మిఁగన్న తండ్రి సముద్రుఁడు చేఁజేతుల నారాయణున కిచ్చు భాగ్యము నకు నోచుకొనలేదు - అది యాతని జలబుద్ధి (జడబుద్ధి) ఇప్పట్టున యజ్ఞక్షితి ఫలమునాఁదనరు సీత నానందమున రామున కిచ్చి జనకుఁడు కృతార్థుడైనాఁడు'.

(బా. కాం. 10 ఆ. 369 ప.)

జనకుఁడు రామపట్టాభిషేకోత్సవానంతరము బంధువుల వీడ్కొని చను చున్న సమయమున సీతాజనకుల నడుమ ప్రవర్తిల్లిన ప్రసంగంబు 'లంత రర్థంబులు బహిరర్థంబులునాఁదగి జీవాత్మాపరమాత్మల సంబంధార్థబంధురములై పొసఁగుట రమణీయము.[1] ఇవి యన్నియు జనకుని మహాయోగిగా సంభావింపఁజేయుచున్నవి.

ఇట్టిఁడు కావుననే విశ్వామిత్రుడు -

ఆతని గొనములు పొగఁడగ
నాతరమా సురలు మునులు నాకేశుఁడు నా
ధ్యాత మొనరింత్రు తచ్చరి
తాతతమై భవము మహిత మని రఘువీరా !

---

1. శ్రీ. రా. క. - ఉ. కాం., పూ. భా. 10 ఆ., 48-61 ప॥లు

యోగరహస్యజ్ఞుఁడు స
ద్యోగ రసాభిజ్ఞుఁ డంచితోద్యోగ రమా
యోగజ్ఞుఁ డధినమజ్ఞుఁడు
త్యాగజ్ఞుఁడు సర్వసార తత్త్వజ్ఞుండున్

— బా. కాం. - 6 ఆ., 12, 13 ప॥లు

అని జనకుని సౌగుణ్యమును విశేషముగాఁ గీర్తించినాఁడు. మఱియు సిద్ధాశ్రమమున యాగపరిసమాప్త్యనంతరము విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతోఁ గూడి మిథిలకుఁ బోవ నిశ్చయించి జనకుని గుణగణసంపదఁ గీర్తించుచు -

అతిథేయుఁడు విడనాఁడగా నేరఁ డా
శాభంగకారి దోసం బెఱింగి
సత వ్రతుఁడు మాటజాఱఁగాఁ జూడఁబోఁ
డనృతవాదమున వేదనకుఁ దనికి
ధర్మనిష్ఠుఁ డుపేక్షఁ దవిలి వర్తింపలేఁ
డాలస్యమున దుర్నయత్వ మరసి
తత్త్వవేత్త వికారి దశకుఁబాల్పడఁజాలఁ
డవ్యయానందమ్మనందఁ గాంచి

— బా. కాం. - 6 ఆ., 20 ప.

అని యాతని యాతిథేయత, సత్యవ్రతము, ధర్మనిష్ఠ, తత్త్వవేత్తృత్వముఁ బేర్కొనుట హృద్యము. వాల్మీకమున నిప్పట్టున 'మైథిలస్య నరశ్రేష్ఠ జనకస్య భవిష్యతి యజ్ఞః పరమ ధర్మిష్ఠస్తస్య యాస్యా మహే వయం ॥ (బా. కాం. - 31 స., 6 శ్లో.) అని కలదు. మూలమున గల 'ధర్మిష్ఠః' అను విశేషణమునకీ విపుల వ్యాఖ్య జనకుని వ్యక్తిత్వ ప్రదర్శనమున రత్నముకురమై వెలయుచున్నది. 'కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః' / గీత. - 3 అ., 20 శ్లో./ అని గీతాచార్యుఁడీతని కర్మయోగ గరిష్ఠునిఁగా గీర్తించినాఁడు. శ్రీరామకథాఽమృతమున నిది యంతయు వివరింపఁబడినది ఇట్లీ పాత్రచిత్రణ మత్యంత మనోహరము, నధ్యాత్మ సుందరమునగుచున్నది.

**రావణుఁడు** : ఇతఁడు రామాయణ మహాకావ్యమునఁబ్రతినాయకుఁడు. బ్రహ్మవంశమున జన్మించి, వేదశాస్త్రాదుల నభ్యసించి, వర తపోనిష్ఠ బ్రహ్మవరములఁ బడసినాఁడు. ముల్లోకములు జయించి ప్రతాపవిభవముల వెలుగొందినాఁడు. అట్టి విద్యా సంపన్నుఁడు పరాక్రమశాలి పరబలయుతుఁడు తన చేసిన యకృత్యమునకు బంధుమిత్ర పరివార సహితముగా వినాశము నందినాఁడు. ఎంతటివారైనను నధర్మప్రవర్తనులై నచో యధోగతియే సంప్రాప్తించు ననుటకు రావణ పాత్ర లోకమునకుఁ దార్కాణము. 'అపంథానంతు గచ్ఛన్తం సోదరోఽపి విముంచతి' అనునది యాతని చరిత్ర వలనఁ దెలియదగిన సత్యము. లోకకంటకుఁ డగు నీతనిఁ బరిమార్చుటకు విష్ణు విమ్మహి నవతరింపవలసి వచ్చినది.

ఉత్తర కాండమున వేదవతి చరిత్ర వర్ణించుచు రావణుని గూర్చి 'మహా బాహుఁడైన రావణుఁడు భూమిపై సంచరించుచు హిమవత్సానువులఁ జేరె' నని వాల్మీకమునఁ గలదు.

అథరాజన్! మహాబాహుర్విచరన్ స మహీతలే
హిమవత్సానుమాసాద్య పరిచక్రామ రావణః'

— ఉ.కాం. - 17 స., 1 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ నుద్ధతుఁడగు రావణుని సర్వభూత విద్రావణునిగా జిత్రించుట మనోజ్ఞము.

పరమేష్ఠి చిత్త మే వరనిష్ఠ జపశక్తి
కిచ్చావిధేయత్వ మెనయఁగోరెఁ
గలధౌత శైలమే ఘన సత్త్వ కరయుక్తి
నాటాడు విరిబంతియై తనర్చె
నా శాంతపదము లేయదరాత్మ వినియుక్తి
నసి నటీరంగత్వ మందఁబూనె
నేక శూరత్వ మేయిత్థతేజ ప్రసక్తి
ద్రిభువన జయలక్ష్మి దివియఁజొచ్చె
వాఁడు దవ వీతిహోత్రవివర్త నిజ క

ధ్వాప్ర ధూమిత విబుధనాధ ప్రధాన
వీర వరమానసాభిఖ్య విపిన తలుఁడు
రావణుఁడు సర్వభూత విద్రావణుండు

- బా. కాం. - 4 అ., 33 ప

ఇందుఁ గ్రమముగ రావణుని తపశ్శక్తి, ఘనసత్త్వము, శౌర్యముఁ గ్రౌర్యము బహుధా ప్రకటీకృతములైనవి. మూలమున లేని యిట్టి వర్ణనము రామాయణము నందలి ప్రతినాయకుని యాకృతిఁ గనుల గట్టినయట్లున్నది. పాత్ర ప్రవేశ సందర్భమున్ననే తత్స్వరూప స్వభావములుఁ దెలియఁజెప్పుట కావ్య శిల్పమున నొక విశేషము. శ్రీరామకథామృతమున నౌచిత్యదృష్టితో నా వేదవతి చరిత్ర బాల కాండమున వర్ణింపఁబడుట విశేషము. యోగమాయమే సీతగా జన్మించినదను విషయముఁ జెప్పుట ప్రయోజనము.

అరణ్యకాండమున రామలక్ష్మణులు లేని తఱిఁ గపటియై రావణుఁడు ముని వేషమున పర్ణశాలనున్న సీతను సమీపించెనని వాల్మీకమున నిట్లు గలదు —

శ్లక్ష్ణ కాషాయ సంవీతః శిఖీ ఛత్రీ ఉపానహీ
వామేచాంసేఽవ సజ్యాథ శుభే యష్టి కమండలూ
పరివ్రాజకరూపేణ వైదేహీ మన్వవర్తత

— అర. కాం. – 46 స., 3, 4 శ్లో॥లు

శ్రీరామకథామృతమున నయ్యది —

కావిరంగున తీర్పుగల మేటిశాటుల
మాంసలాంసోరువు ల్మఱువుపఱచి
గంగమృత్తిక బొట్టు కాంతిసంగతమున
మొగము బెట్టతనంబు మగుడజేసి
పూసిన నెఱిబూది పూఁత తెల్పున మేన
నెలకొన్న కప్పూడ్చి నిగ్గుదేర్చి
జుట్టు దన్నిదముల కట్టుబాటెడయని
కరక యష్టుల యిచ్చకంబుసూపి

గొడుగు కక్షపాలగౌవితార్చిపాదుక
ట్రొడిగి యల్లనల్ల నడుగులిడుచు
వచ్చి పర్ణశాల వాకిట నిలఁబడె
సీత మొఱఁగు ధ్యానచింత నెఱయ

— అర. కాం. - 3 ఆ., 78 ప.

అని వర్ణింపఁబడినది. అతఁడు దాల్చిన వేష మాతని భీషణాకృతినిఁ గప్పిపుచ్చుటకుఁ జేసిన యత్నమును దెలుపుచున్నది. మూలమున గంగమృత్తిక బొట్టు నెఱిబూదిపూఁతయుఁగానరావు. సాధువర్తన మెన్నడును లేదు సరికదా నేఁడవసరమునకై దాల్చిన తబిసిదమును గాపట్యమును బ్రకటించుచున్నది. ఈ కపటసన్యాసి ధ్యానచింతయు సీత మొఱఁగు పనికే పరిమితమైనది. ఇట్టి వర్ణన రావణుని స్వభావానుగుణ మగుట హృదయంగమ మగుచున్నది.

సుందరకాండమున హనుమంతుఁడు సీత నన్వేషించుచు రావణాంతఃపురముఁ బ్రవేశించి 'జీమూతసంకాశుఁడు, ప్రదీప్తోజ్వల కుండలమండితుఁడు లోహితాక్షుఁడు మహాబాహుఁడు రజితవాససముల ధరించి పరిమళ భరితమగు రక్తచందనము మేన నలది సంధ్యారాగ బంధురమగు నాకాశము వలెను, దివ్యాభరణములతోఁ గూడి తటిల్లతలతోఁ బ్రకాశించు మేఘము వలెను, వృక్షవన గుల్మములతో నిండిన మేరువు వలెను, నిద్రించుచున్న రావణుని గాంచినట్లు వాల్మీకమునఁ గలదు.[1] శ్రీరామకథామృతమున నాతఁ 'డాశయనాగారంబునకా శయ్యాతలమునకు శుభాలంకార ప్రాశస్త్యము దనర' శయనించి యున్నాఁడనుట రావణుని నికామ దివ్యభావ రూపోజ్జ్వలతను వెల్లడించుచున్నది.

గుటివెట్టు నచ్చోటు గూల్పనౌ గుఱుతోడి
కలవరింతల పేరి గర్జ లెసఁగ
నాశాధి పతుల సౌఖ్యముఁ బాప నెడవొచ్చు
నిట్టూర్పులు విమాన నివహమాఁగ
మిత్తియేనియు దర్పమ్ము మెలఁకువఁ గని
బ్రదుకుజీవుఁడ యని దారిఁబట్టి పాఱఁ

1. వా. రా. సుం. కాం. 10 స. 7-10 శ్లో॥లు

గామరూపుఁ డతండు నికామ దివ్య
భావ రూపోజ్వలతఁ గనుపట్టుటయును
సుం. కాం. - 1 ఆ., 273 ప.

అని మూలాధికముగా వర్ణింపఁబడుట నవ్వీరుని పంతము, పరాక్రమము' లోకభీకర తయుఁ బ్రకటితము లగుచున్నవి. ఇట్టి వాని మహోన్నతియే మారుతాత్మజుని యచ్చెరువున ముంచి మెచ్చుకొనగఁ జేసినది. "సిరి, రూపము, సద్వంశము, తరుణ త్వము, విద్య యెలమి దాక్ష్యము శ్రేయము" నిన్నియు నాతని యంద గుదురై నిలచిన" వని చెప్పుట పాత్రచిత్రణమునకు మెఱుగులు దిద్దినట్లగుచున్నది.

అశోకవనమున నున్న సీతను జూడ నధిక తేజోవంతుఁ డగు రావణుఁడు సురూపయౌవన వతులగు స్త్రీలతోఁ బరివృతుఁడై చుక్కలతోఁ గూడిన చంద్రుని వలె వచ్చినాఁ డనియు నట్టి రావణుని హనుమంతుఁడు దర్శించినాఁ డనియు వాల్మీకమునఁ గ ల దు.

వృతః పరమ నారీభి స్తారాభి రివ చంద్రమాః
తం దదర్శ మహాతేజా స్తేజోవంతం మహాకపిః
సుం. కాం. - 18 స., 29 శ్లో.

శ్రీరామకథా౽మృతమున నాతని దర్పము, పౌరుషము, సామ్రాజ్య విభవము, నాభిజాత్యము నిరూపించుచు రావణుని చూచి చూడఁగ రాని సొబగు' నెంచి యెంచఁగరాని యుద్ధతేజము, పోల్చి పోల్పఁగరాని రూపము, నాడి యాడఁగరాని యల ఘుతఁ బేర్కొనఁబడినవి. ఆతనిఁ గాంచి యమితబలుఁడగు కపివీరుఁ డొకింత తలఁకు తలయెత్త నొదిగి యుండె ననుట రావణుని గంభీర ప్రకృతికి దర్పణము బట్టినట్లైనది. మూలము నందలి 'తేజోవంతమ్' అను విశేషణ మాంధ్రీకరణమున ననిరూపణీయ ములగు నిట్టి రూప తేజో బల పరాక్రమ ప్రకటనమున కాలంబము లైనవి. ఇచట మూలాతిశయమగు సౌందర్యవర్ణనము సహృదయ హృదయంగమ మగుట నిజము. (సుం. కాం. 1 ఆ. 19 ప.) ప్రతివీరుఁడైనను రావణునిఁ బాత్ర నింతగాఁ జిత్రించుట కవులు పాత్రచిత్రణమునఁ బాటించిన నిష్పాక్షికత వెల్లడించుచున్నది.

శ్వేతద్వీప వర్ణన సందర్భమున సనత్కుమారునిచే విష్ణుమహిమ విని రాముఁడే విష్ణువని యెఱింగి యాతనితో యుద్ధార్థియై విచారించి జనకజ సీత నెత్తుకొని

పోయి తల్లి వలెఁ గాపాడుచు నయ్యది కారణముగా రాముని వలన మరణముఁ బొందె నని వాల్మీకమున నుత్తర కాండమునఁ గలదు.

వాక్యం సనత్కుమారస్య చింతయానో ముహూర్ముహుః
రావణో ముముదే శ్రీమాన్ యుద్ధార్థీ విచచారహ
— ఉ. కాం. - ప్ర. పా., 8 స., 28 శ్లో.

ఏతదర్థం మహాబాహో రావణేన దురాత్మనా
సుతా జనకరాజస్య హృతా రామ మహామతే
— ఉ. కాం. - ప్ర. పా.' 9 స., 4 శ్లో.

సీతాలక్ష్మీ ర్మహాభాగా సంభూతా వసుధాతలే
త్వదర్థ మియ ముత్పన్నా జనకస్య గృహేశుభా
లంకా మానీయ యత్నేన మాతేవ పరిరక్షితా
— ఉ. కాం. - ప్ర. పా., 10 స., 114-15 శ్లో॥లు

దీనినిఁ బట్టియే లోకమున రావణుఁడు తెలిసిన మూర్ఖుఁ డనుట ప్రచారమునఁ గలదు. కావలెనని భౌతికముగాఁ దన వినాశముఁ దానే కోరి కొనితెచ్చుకొనుట రావణుని తెలిసిన మూర్ఖత యనవచ్చును. శ్రీరామకథామృతమున నగస్త్యుఁడు రాముని చరితమున బహు రహస్యములు గలవని వ్రాక్రుచ్చు సందర్భమున —

తెలిసిన మూర్ఖుఁడయ్యసురదేవుఁ డటంచును లేదె లోకమం
దలఘు జనప్రవాద మది యూఱడిగాదు మహానుభావ ! నీ
కలికి హరించె నాతఁడనఁగా రణ కారణ మయ్యెఁగాదె త
త్ఫలితముఁ జెందె నీదృశ విధంబున ధాతృముఖామరస్తుతా !

భక్తియోగమ్మె నెమ్మదిఁ బాదుకొల్పి
యమ్మ యని కొని చనియె సీతమ్మ నతఁడు
గాకయుండినఁ దన్నంటఁ గాల్పవెట్లు
బ్రహ్మ నలకూబరుల శాప వైభవములు
— ఉ. కాం. — పూ. భా. 9 ఆ. 79, 80 ప॥లు

అని రావణుని నిర్దోషత యుగ్గడింపఁ బడినది. మఱియు నమ్మకువాఁడు భక్తుఁడు. అట్లుగాకున్న 'సీతమ్మ రూక్షమ్మగు నిరీక్షణమే యాతని దహించుననియు, నట్టి పరిశుద్ధాంతరంగుఁడు కానిచో నీ చేతిలో మోక్షమును బడయుట, నాగమశాస్త్రమున రావణమంత్ర మొకండుపాస్యముగ వెలయుటయుఁ బొసఁగెడిగి కావనియు, శివపూజలు సేసి నిన్ను దర్శించు భాగ్యము నంది, యున్నవి లేకున్నవి సృష్టించి తనవారితోఁ గూడ నీయం దాత్మార్పణము గావించి ధన్యుఁడై భవ్య భవదీయ సంగతి భాగ్యమబ్బ, పాపములు పరిహరింపఁబడగా, జగముల పాలికి దుష్టతముఁ డయ్యు నీ కాంతరంగికుఁడై నెగడినాఁడ' నియు నగస్త్యుని ముఖమున జెప్పించుట మూలాధికమై రావణుని పాత్ర వైశిష్ట్యమును వెల్లడించుచున్నది. (ఉ. కాం. ఉ. భా. 9 ఆ. 83-85 పాలు)

ఇంకను రావణుఁడు సీతతో ననిన వచనములు లోనర్థ మొకటి, లోకార్థ మొకటిగా గలవని చెప్పి యెఱుకఁగలవారికవి నుతులగు ననుట యాతని వైదుష్యమును బ్రకటించుచున్నది. 'మాతేవ పరిరక్షితా' అను దాని కిది వివరణ ప్రాయమై యున్నది. వ్యాఖ్యాన కర్తలీ ఘట్టమున నయ్యర్థము జక్కఁగా నుపపాదించుట ప్రసిద్ధము. విభీషణుని వెడల నడచుట వలన నాతఁడు రాము నాశ్రయించి వంశకర్త యగునని రావణుఁడు సంభావించె ననుట రావణుని రాజనీతి విజ్ఞతకు నిదర్శనము.

తా నెన్నియొ నొడివె నుడుల్
లోనర్థం బొంటి యొకటి లోకార్థముగా
నూనిన పని కనుకూలము
గా నుతులవి గాఁగ నెఱుకఁ గలవారలకున్

జానకీజాని ! యీ విభీషణు వెలార్చె
రావణుండవఁ గలదె యర్థ మ్ముచితము
శుద్ధ భావుండు వీఁడతిశూరుఁ డగుట
వంశకర్త యగుత మంచు వదిలెఁగాక

— ఉ. కాం. - పూ. భా. 9 ఆ. 259-60 పాలు

ఇట్లెన్నియో విషయము లగస్త్యుని ముఖమున (జెప్పింపఁ బడుట హృద్యము. ఇట్టిది పాత్ర చిత్రణమునఁ గ్రొత్త యందము సంతరింపఁజేసినది.

**విభీషణుఁడు** : విభీషణుఁడు రాక్షసజన్మ మెత్తినను ధర్మాత్ముఁడై రాముని శరణువేడి శుభములు పొందినాఁడు. విభీషణుని వలన రామాయణమునకు శరణాగతశాస్త్రముగా ఖ్యాతి లభించినవి. "ధర్మోరక్షతి రక్షితః" అనుటకీతఁడు ప్రత్యక్ష నిదర్శనము.

'కైకసి పిన్న కొడుకు, ధర్మాత్ముఁడు నగు విభీషణుని జనన సందర్భమున పుష్పవృష్టి కురిసినది. దేవదుందుభులు మ్రోగినవి. ఆకాశవాణి సాధువచనములు వినిచినది' అని వాల్మీకమునఁ గలదు. (ఉ. కాం. 9 స. 35-6 శ్లో॥లు)

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ "తాపసవర్యులు, మునులు, 'ధర్మవు దోచె నిట్టులని' విభీషణుని పుట్టుకకు సంతసించిరి. దివ్యవాణి రామమయ మానసుఁడీ మహితుండు. నిర్మలభక్తియోగము, వినీతత, శుద్ధసత్త్వము, నేర్మియుఁ గూర్మియు నీతని యందు నిష్ఠఁబరగు" నని పలికినట్లు వర్ణించుట విభీషణ పాత్రచిత్రణమున నౌన్నత్యము సిద్ధింపఁజేయుచున్నది. మూలము నందలి సాధువాదముల కిది వివరణ ప్రాయము. (ఉ. కాం. పూ. భా. 3 ఆ. 71 ప.) అట్లే యాతని వర్తనమును గూర్చి 'ధర్మాత్ముఁడై ధర్మకర్మము లొనరించుచు వేదము లభ్యసించుచు విజితేంద్రియుఁడై యున్న' ట్లు వాల్మీకమునఁ జెప్పఁబడినది.

విభీషణస్తు ధర్మాత్మా నిత్యం ధర్మే వ్యవస్థితః
స్వాధ్యాయ నియతాహార ఉవాస విజితేంద్రియః
— ఉ. కాం. - 9 స. 39 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నాతని మహిత వర్తనమును గూర్చి యగస్త్యుఁడు రామునితో నిట్లు చెప్పినట్లు వర్ణింపఁబడినది.

తన తండ్రిఁ జేరి దద్దయు ధర్మపథ రహ
స్యము లర్థిమని లెస్స యలవరించు
నిచ్చలు స్వాధ్యాయ నిరతిమై నెగడొందు
నర్థావగాహన మనువుపడఁగ
నింద్రియములఁ గెల్చి యెసలారనౌ నిచ్చ
నియమితాహారంబు నేటు సేయు

నెడనెడ నుపవాసహేతువు పుణ్యదినంబు
　　లబ్బినఁగడుబత్తి నత్తమిల్లు
నౌర కైకసి కన్న కాన్పవరమయ్యు
వర మనందగె వెండియు వర్య మయ్యె
శ్రీవరేణ్యము సర్వవరిష్ఠము నన
నైన నెఱి నీయెఱింగిన యదియదేవ !

3 ఆ., 79 ప.

ఇట్టి వర్ణనము కవి విభీషణుని పాత్రచిత్రణమునఁ గైకొన్న ప్రత్యేక శ్రద్ధను దెలుపుచున్నది. 'కైకసి కన్న కాన్పవరమయ్యు వరమనందగి వెండియు వర్యమయ్యె శ్రీవరేణ్యము సర్వవరిష్ఠము ననైన' దని చెప్పుట యాతనిలోఁ గలిగిన ధర్మనిష్ఠయొక్క క్రమపరిణామ వికాస విశేషముల నిరూపించుచున్నది. అట్టిఁడు గావుననే కాలాంతరమున నవమార్గవర్తి యగువాఁడు సోదరుఁడైనను వాని విడిచి ధర్మ స్వరూపుఁడగు రాముని శరణువేఁడి జన్మముఁ గృతార్థత నందించుకొనినాఁడు. అంతటి వాఁడు జననము నుండియు ధర్మాత్ముఁ డగుట చిటఁ జక్కగాఁ జిత్రింపఁబడినది. పూవు పుట్టగనే పరిమళించుట ప్రకృతి గుణమగుట సత్యము.

కొలువుకూటమున విభీషణుఁడు రావణునకు హితముఁ దెలుప న్యాయవాదియగు నాతనిఁ బరుషము లాడి సభ నుండి వెడలగొట్టినాఁడు. 'ఇత్యుక్తః పరుషం వాక్యం న్యాయవాదీ విభీషణః' (ఉ. కాం. - 16 స., 27 శ్లో.) అని వాల్మీకమున గలదు. శ్రీరామకథాఽమృతమున నయ్యెడ —

పాపాత్ముని త్రోఁచిన న
ప్పాపాత్ముని వ్రేటు పరుష భాషణములఁ ద
న్వేప నయవాది యన్వయ
దీపకుఁడు విభీషణుండు తేఁకువ వెలయన్

ఉ. కాం. - పూ. భా. 2 ఆ., 250 ప.

అని వర్ణించి విభీషణుని 'నన్వయదీపకు' నిగాఁ జేర్కొనుట హృద్యము. తన మంత్రులతోఁ గూడి సభ వీడి తల్లి కైకసిఁ జేరి సోదరుని దౌష్ట్యమును జెప్పి రాముని

శరణు వేడఁబోవ ననుమతి గోరినాఁడు. ఆమె తనయుని —

సీదు ధర్మమె నిను మన్చు, నిర్మలుఁడవు
తండ్రి తాతల కీరితిఁ ధద్ద నిలిపి
తనదుగాదీకృతియు నిక్కమరయఁ గురుల
యైన దుష్పథగతుల నెయ్యంబు వలనె

అని బుజ్జగించి 'చిరంజీవివి కమ్మ' ని దీవించి పంపినది. అమూలకమగు నిట్టి కల్పన విభీషణ పాత్రచిత్రణమున కత్యంతము దీప్తి నిచ్చుచున్నది. అట్టియెడ నాతఁడు రామ పదా సంజిత భక్తిసారమగు తత్త్వమున రామబ్రహ్మముఁ గొలుతునని భావించుట 8 పద్యములలో వర్ణింపఁబడినది.[1] ఇట్టి పాత్రచిత్రణ మత్యంత సుందరము.

**గుహుఁడు** గుహుని పాత్ర రామాయణ మందలి పురుష పాత్రలలో నతి విశిష్టమైనది. గుహుఁడు రామునకు బాల్యమిత్రుఁడు. రామునిచే నాతఁడు 'ఆత్మసఖ' అని సంభావింపఁబడినాఁడు. స్నేహధర్మమునకు గుహుఁడు ప్రతీక. రాముని నయోధ్యాధిపతిఁగను దశరథ పుత్రునిగను నున్నప్పుడు గౌరవించుటయేగాక యరణ్యవాసమునకుఁ బోవునప్పుడును బహుమానముతో నెదుర్కొనినాఁడు. వాల్మీకమున నీతఁడు సామంతుఁ డగు నిషాదాధిపతిగాఁ జెప్పఁబడినాఁడు. అనంతర రామాయణ కర్తలు గుహుని పాత్ర యందలి యౌచిత్యమును గుర్తించి యాతనిఁ బరమ భాగవతోత్తమునిగాఁ జిత్రించినారు.

రామాదు లరణ్యవాసమునకుఁ బోవుచు గంగానది సమీపించి విడిది చేయ నది తెలిసి యాత్మసఖుఁ డగు నిషాదాధిపతి గుహుఁడు వృద్ధామాత్య బంధువర్గము లతోఁ గూడి వచ్చి సహోనుఁజుఁడగు రాముని సంభావించినట్లు వాల్మీకమునఁ గలదు. (అయో. కాం. 50 స. 33-7 శ్లో॥లు)

మూలమున గుహుఁడు మిత్రుఁడు, సామంతుఁడుగాఁ జెప్పఁబడినాఁడు. శ్రీరామకథాఽమృతమున నాతఁడు రామభక్తుఁడు నగుట విశేషము. 'నెమ్మన మఖిలము రామమయ మగుచుండ నిషాద నికేతన ధనపతి' యగు గుహుఁడు రాము నుపచరించిన తీరు భక్తి తాత్పర్యములకు బరమావధియై కొహుని యుత్తమ ప్రకృతికి నిదర్శన మగుచున్నది. సమ సుఖదుఃఖితుఁ డగువాఁడే నిజమైన మిత్రుఁ డనుటను గుహుని చరిత్ర చాటుచున్నది. (అయో. కా. 5 ఆ. 110-11 ప॥లు)

---

1. శ్రీ. రా. క. ఉ. కాం. పూ. భా., 2 ఆ., 203-10 ప॥లు

భారతీయ సంస్కృతియందు 'అభ్యాగతస్స్వయంవిష్ణుః' అని యభ్యాగతిని సాక్షాద్విష్ణువుగా సంభావించు నుత్తమ సంప్రదాయ మొకటి గలదు. అయ్యది యిటఁ బాటింపఁబడినది. గుహుని యదృష్ట విశేష మేమియోకాని సాక్షాద్విష్ణువే యతిథి యైనాఁడు. 'రామ ! కలఁడె నీకున్ సరియగు నతిథి జగంబుల' ననుట యీ పరమార్థమునే ప్రతిపాదించుచున్నది. 'ప్రాఖులకెల్ల నదియె పరమావధి' యనుట హృద్యము. అట్టి సంభావనయే గుహునిచే రామ పాదతీర్థము మూర్ధమున ధరింపఁజేసినది.

పాదయుగళిఁ గడిగి పైఁజల్లి వి మ్రొక్కి
పూజ లొనరఁజేసి పుణ్యమూర్తి
జనకజాత ననుజు సత్కారములఁ దేర్చి
వాఁడు సుకృతి యయ్యె వామనయన !

5. ఆ., 160 ప.

ఆపగ దాటించుటకుఁ బ్రతిఫలముగా దన్ను భవాబ్ధి యవ్వలి దరిఁ జేర్ప వేడినాఁడు. ప్రాణులెల్లఁ గోరఁదగినది, చేరదగినది యాతఁ డాశించినాఁడు.

(5 ఆ. 157 ప.)

ఇట్లు గుహుని గొప్ప జ్ఞానిగాఁ జిత్రించుటంజేసి పాత్రచిత్రణమునఁ గవికిఁగల సామర్థ్యము ప్రకటిత మగుచున్నది. మఱియు 'యథారాజా తథాప్రజా' యను సార్వోక్తికిఁ దార్కాణముగా గుహుని కడఁ గల ధీవరులను బోధకలనా సుధీవరులుగాఁ జిత్రించి యనువాదకులు తమ యనుపమ రామభక్తినిఁ బ్రదర్శించినారు.

(5 ఆ. 216-17 పఀలు)

**సుగ్రీవుఁడు :** రామాయణ మందలి పాత్రలలో కపుల పాత్రలత్యంత విశిష్టములైనవి. అందు సుగ్రీవ, హనుమంతుల ప్రాముఖ్యము అనుపమము. ఆ పాత్రలు తిర్యక్కులకు సంబంధించినవే అయినను విలక్షణప్రవృత్తి గలవి, దేవాంశతోఁ గూడినవి, కామరూపాదికమును బ్రదర్శించినవి, కావున వాని విశేషములు గూడఁ బరిశీలనార్హములు.

కపి పాత్ర లన్నింట ప్రథమగణ్యము సుగ్రీవ పాత్ర. రామాయణేతి వృత్తమున సుగ్రీవుఁడు పీఠమర్దు డనఁదగినవాఁడు. ఉపనాయకుఁడని యర్థము.

సుగ్రీవుఁడు రామునిచే సోదరునిగా సంభావింపఁ బడినాఁడు. ఈతని మహచ్చరిత్ర కారణముగా లోకమున 'సుగ్రీవసఖ్యము', 'సుగ్రీవాజ్ఞ' అనునవి ప్రసిద్ధములైనవి. వానరరాజై సీతాన్వేషణమున రామునకుఁ దోడ్పడి ప్రత్యుపకార రూపమగు సుహృద్ధర్మమును నెఱపినాఁడు.

'వీరుఁడు ధర్మాత్ముఁడు వానరయూథపుఁడు నైన సుగ్రీవుఁడు సోదరుఁడగు వాలిచే వెడలఁగొట్టఁబడి దుఃఖితుడై జగమున సంచరించుచున్నాఁడు' అని సుగ్రీవుని గూర్చి హనుమంతుఁడు రామలక్ష్మణులతోఁ జెప్పినట్లు వాల్మీకమునఁ గలదు.

సుగ్రీవోనామ ధర్మాత్మా కశ్చిద్వానరయూథపః
వీరో వినికృతో భ్రాత్రా జగద్భ్రమతి దుఃఖితః॥
- కి.కాం. - 3 స. , 20 శ్లో.

శ్రీరామకథాఽమృతమున కృత్యవిదుండగు సుగ్రీవుని సత్యదర్శునిగా సుజనప్రియునిగా, సత్త్వజవోపేతునిగా, సూనృతప్రసితునిగా సర్వజనీనచరిత్రునిగాఁ జెప్పి చనవు నేస్తంబు నేర్పడ నొడలొనఁగు ననుట హృద్యము. సుగ్రీవుని సుహృద్ధర్మమిట రమ్యముగాఁ గీర్తింపఁబడినది. (కి. కా. 1 ఆ. 63 ప.)

హనుమదాది సజ్జనుల కాతఁడు ప్రియుఁ డగుట నల్వురు మంత్రులాతని యనుసరించిరి. ఈతని సచ్చరిత్ర నెడద మెచ్చియే మతంగముని ఋశ్యమూకమున నిలువఁ దావొసఁగినాడు. బలవంతుఁ డగు శత్రువు సంభవించిన సమయమున నాతని మించినవానితో సఖ్య మొనరించి తద్వార శత్రుభంజనము చేయుట లోకవ్యవహార దక్షతను జాటును. అట్టి నీతి నవలంబించినవాఁడు సుగ్రీవుఁడు. ఈవిషయమున నాతఁడు లోకమున కాదర్శప్రాయుడైనాఁడు. కావున సార్వజనీన చరితుఁ డగు టాతనికి సిద్ధించినది. నిజమరసి నేస్తుఁడగు రామునకుఁ జనవు నొడలు నిచ్చినాఁడు. తనతోఁబాటు తనవారినిఁ దోడితెచ్చి సీతాన్వేషణ, రావణాది రాక్షససంహార కార్యములఁ బాసటయై నిలిచి సత్త్వజవముల వెలయించి సూనృతప్రసితుఁడైనాఁడు రాముని 'పరతత్త్వముగాఁ గీర్తించుటాతనిఁ దత్త్వవేత్తగా నిరూపించుచున్నది.

**హనుమంతుఁడు**: సుగ్రీవుని మంత్రి. ఈతఁ డీశ్వర వరప్రసాదమున జన్మించి రామభక్తిమయ మానసుఁడై చిరంజీవియైనాఁడు. నవవ్యాకరణ పండితుఁడు. ఈతని వాగ్వైచిత్రికి రాముఁ డలరి పలువిధముల మెచ్చుకొనినాఁడు. వానరులలో నెవ్వరికి సాధ్యముకాని శతయోజన విస్తీర్ణమగు సముద్రమును లంఘించి బహు విఘ్నములు గడచి లంకఁ బ్రవేశించి సీతాదేవి దర్శించి, రామునకుఁ బ్రియవార్త నందించినాఁడు. ఇట్టిఁడగుట జీవాత్మఁబరమాత్మ ననుసంధింపఁ జేయు యోగిగా నీతని సంప్రదాయజ్ఞు లభివర్ణించినారు. సుందరుఁ డగు హనుమంతుని చరిత్ర వివరించు నీకథాభాగమునకు వాల్మీకి సుందరకాండ యని పేరిడి రామాయణమున నీతనికిఁ గల ప్రాధాన్యమును గుర్తింపజేసినాఁడు. "సుందరోహనుమాన్ స్మృతః"

ఋశ్యమూకపర్వతమును జేరిన రామలక్ష్మణులను గూర్చి తెలియఁగోరి సుగ్రీవుఁ డనుప హనుమంతుఁడు వానరరూపమును బరిత్యజించి, భిక్షురూపము ను ధరించి వారిని సమీపించినాఁడని వాల్మీకమునఁ గలదు.

> కపిరూపం పరిత్యజ్య హనుమాన్ మారుతాత్మజః
> భిక్షురూపం తతోభేజే
>
> - కి.కాం. - 3 స. , 2 శ్లో.

శ్రీరామకథాऽమృతమున నయ్యెడ -

> .... .... ....
> హనుమ భిక్షురూప మవధరించి
> కార్యసిద్ధి మొనయఁగావచ్చె నేమొకో
> యిట్లటంచు వారలెంచఁ గదిసి
>
> - కి.కాం. - 1 ఆ., 49 ప.

అవి హనుమంతుఁడు రూపుదాల్చిన కార్యసిద్ధిగా సంభావింపఁబడుట నాతని కార్య ధురంధరతయు లక్ష్యసిద్ధియుఁ గీర్తింపఁబడినవి. రాముఁడు హనుమంతుని వచోవిభవమును బ్రశంసించుచు "ఇట్టివాఁడు మంత్రిగానుండ నాతనికి సర్వార్థములు సిద్ధించు" నని పలికినట్లు వాల్మీకమునఁ గలదు.

కి. కాం. 3 స. 34 - 35 శ్లో॥ లు-

శ్రీరామకథాऽమృతమున నయ్యది -

ఇతవింబోలిన సచివుఁడు
పతి కప్పిన నెట్టిదాసఁగు పొల్పడునేనిన్
గతి సెడనీయ కతవిఁ దన
మతిబలమున నొడ్డు సేర్చి మనుపకయున్నే

దూతకృత్య మెనసి దొరసిన యిమ్మేటి
పలుకు కతన నేనెపాయగంటి
ముంచి తేల్చు శోకమోహోర్మికల గార్య
కలనఁ గానిదొండు గలదె యింక

సిద్ధిఁబడయంగ నగు నీ
సిద్ధార్థుని తెలివి బలిమిఁజేసి యన మనం
బద్ధము గానేరదు నీ
బుద్ధి నితని పొందు కలిమి పొలప మరయుమీ

- ఆ., 70-2 పలు

అని రాముఁడనినట్లు చెప్పఁబడినవి. ఇందు హనుమంతుని మతిమంతునిగాఁగీర్తించుట పరమ రమణీయము. సుగ్రీవ మంత్రిగా నాతఁ డతనికి గావించిన మేలు విదితము. ఇఁక నతని మాటల మాధుర్యమునకు 'ముంచితేల్చు శోకమోహోర్మి కలఁగొట్టు లాడు చున్న రాముఁడు దుఃఖమును బాయగంటి ననుట హనుమంతుని పాత్ర ప్రాధాన్య ప్రయోజనముల నుగ్గడించు చున్నది.

సుందరకాండమున హనుమంతుఁడు లంకాపట్టణము నంతయుఁ గలయ గాంచి 'చిక్కలాఖ్య మగు లక్ష్మి, సిరిని విద్యుల్లేఖ వలె నెందు దాపఁబడెనో, యా యమగాంచి భవము నెవ్విధి గడవఁగాంతు నొక్కొ' యని విచారించి, 'లక్ష్యము మది నిడి యయ్యనిలసుతుఁడ శోకవనముఁ బ్రవేశించినాఁడని వర్ణింపఁబడినవి. [1] ఇట్టి వర్ణనము హనుమంతుని యోగిగాఁజిత్రించుచున్నది. మఱియు -

---

1. శ్రీ. రా. క. – సుం. కాం, 1 ఆ., 230–31 పలు

అని ముహూర్తకాల మాధ్యాన మొనరించి
యమ్మతలఁపు లోన నమువు సూప
వాఁడు వప్రగుణము వదలి యాశుగమట్లు
లక్ష్య మవ్వనస్థలమ్ము మొనసె
— కి. కాం. - 1 ఆ., 340 ప.

'లక్ష్యమవ్వనస్థలమ్ము మొనసె' ననుటయు నయ్యర్థమునే సమర్థించు చున్నది. 'లంకా శరీరపరా, విభీషణోబుద్ధిః ఇంద్రజిన్ముఖా రాగద్వేషాదయః' ఇత్యాదిగా వేదాంతార్థము గోవిందరాజీయమున వ్యాఖ్యానింపఁ బడినది. అందు 'అశోకవనము సహస్రారము—సీత శ్రీచక్రేశ్వరి. హనుమంతుఁ డామెను దర్శించిన యోగిపుంగవుఁడు' అని వివరింపఁ బడినది. ఇట్టి వ్యాఖ్యాన రహస్యములు సంవదించునట్లు శ్రీరామకథాఽమృతమున హనుమంతుని పాత్ర చిత్రింపఁబడినది.

అశోకవనమున హనుమంతుఁడు సీతను దర్శించినాఁడని చెప్పుచు '.... దివ్యమూర్తి యతని కృషి సిద్ధివోలె ప్రత్యక్షమయ్యె'[1] ననుట నాతని లక్ష్యసిద్ధినిఁ బ్రకటించు చున్నది.

అగస్త్యుఁడు రామాదుల పూర్వచరిత్రతోఁబాటు హనుమచ్చరిత్రమును వర్ణించు సందర్భమునఁ దన్మాహాత్మ్య మిట్లుగ్గడింపఁ బడినది -

ధైర్యపరాక్రమమ్ములు ప్రతాప సుశీలత లిద్ధబుద్ధి మా
ధుర్య నయానయంబులు పృథు ప్రథనోచిత వీర్యశౌర్యగాం
భీర్య సపారచాతురులు విశ్రుతముల్ వ్యవసాయ సంపదల్
కార్యము సిద్ధి ఈ హనుమఁగాక మఱొక్కని నాశ్రయించునే
— ఉ. కాం. - పూ. భా., 8 ఆ., 176 ప.

హనుమంతుని పాత్రచిత్రణమున నీవర్ణనము సమగ్రము, సుందరము.

**కపిపుంగవులు :** సుగ్రీవు నాజ్ఞఁగపిపుంగవులు కిష్కింధకుఁ దరలి వచ్చుచు గంతులువైచుచు నుబ్బునఁబొదలుచు రామదేవుఁ బొగడుచుఁ

1. శ్రీ. రా. క. - సుం. కాం. 1 ఆ. 371 ప.

దత్కీర్తినిఁ గీర్తించుచు నడచిరి. రామకార్యధురంధరులై సీతాన్వేషణ గావించి పోరిలో నాత్మార్పణ మొనరింప సంసిద్ధులైరి. అట్టి వర్ణన శ్రీరామకథాఽమృతమున స్వతంత్రముగా సాగినవిధము హృదయంగమము. అది వానరుల ప్రభుభక్తి, స్వామిసేవా పరాయణతలకుఁ దార్కాణగా నెన్నఁదగియున్నది.

రవిజుండు మమ్మేలు రాజయ్యెఁ దొలిపుట్టు
పున్నెంబబోయని యెన్నువారు
శ్రీరాము సేవించు సిరి మాకుఁ గలుగ న
య్యసుర యంత లొనర్చె ననెడువారు
నెంత చక్కని దొరలీ యన్నదమ్ములు
నాలుగువారే యంచు నొడువువారు
జాల మింకేల ప్రస్థాన ముహూర్తంబు
నేఁడెకాయని డాయ నెఱయువారు

నగము లగలింతుమో దిక్కులప్పళింతు
మో బయలు మ్రింగుదుమొ యా సముద్రములఁ గ
లంచివైతుమొ యేది మాలావెలింగి
చెప్పఁగలపనియంద్రు విశేషవిమషి !

ఆర్పులు నింగిముట్ట రయమంతకు నంతగ దర్పమొప్పఁ గా
నేర్పులు మీఱ సంతసము నెక్కొన నుత్సహనం బెలర్ప నా
త్మార్పణముం బొనర్చితిమి హాయిగ రామున కింకఁ బోరిలో
నూర్పులు వుత్తురెట్టు లరియోధు లటందురు వారు శ్రీమతీ !

– కి. కాం. - 2 ఆ., 284-5 పద్యాలు

వాల్మీకమున నీఘట్టము 'కుర్వాణా బహుశబ్దాంశ్చ ప్రహృష్టా బాహుశాలినః' (కి. కాం. - 39 స., 41 శ్లో.) అని మాత్రము సూచింపఁబడినది. ఇట్టి వానరవీరులు రావణవధానంతరము శ్రీరామపట్టాభిషేకోత్సవమున కయోధ్య కేతెంచిరి. ఉత్సవ విశేషములు ముగిసినంత కపిపుంగవులు వియోగజాశ్రు పరిపూర్ణ లోచనులై రాముని

వీడ్కొని తమ తమ నెలవులకుఁ బోయిరని వాల్మీకమునఁగలదు. (ఉ. కాం. 40 స., 30 శ్లో॥ ) శ్రీరామకథామృతమున నయ్యది 'యరణ్యముల కేగునాఁడు రాము నరయు పౌరులకుఁ గలిగిన యవస్థయే పురము వీడి చనుమన్న వీరికినేఁడు సంభ వించినద'ని వర్ణించుట మనోహరము. (ఉ. కా. పూ. భా. 10 ఆ. 223 ప॥ ) మఱియు నరణ్యమున కేగి వారచట రాముని యనుభవములు దలపోయుచు నైప రాని రామవియోగమునఁ బొగులుచుఁ బ్రకృతి నుద్దేశించి —

ధరములార! యయోధ్య దరిఁ జాకిబండలౌ
పున్నెంబు లుండినఁ బొడమరాదొ
చందనతరులార! జానకీ ప్రాణేశు
నూరఁగసెందలై యుండరాదొ
గిరినిర్ఝరములార! సరయూనదిం జేరు
ముఱుగుకాలువలుగాఁ బోవరాదొ
శాఖామృగములార! సాకేతపురమునఁ
జీమలు దోమలై చేరరాదొ
జన్మమట్టులైన సార్థకంబగుఁజుండు
సతము రాముపొత్తి సౌఖ్యమబ్బు
మబ్బువోలె నెందొ మలసిన నేమాయె
మాయ దైవమిట్లు మలఁచె మిమ్ము — 10 ఆ., 221 ప॥

అని పలుకుచు "పెన్నిధి చేతికందియు నభాగ్యంబట్టులై యున్న తమ యధన్యత్వంబునకుఁ గించపడుచు నంతలో రామావనీశు నడవడులలోఁ గల యన్ని రసముల ననుభవమునకుఁ దెచ్చుకొని సంతసించుచు 'నెక్కడెక్కడి కరుణంబు నేక మగుచు మముఁజెందె నేఁడంచు' దుఃఖించిరి. హనుమ యుపోద్ధమున కగ్గమై 'యందు గొందఱు పూవులఁ దెచ్చి పూరుషోత్తము బొమ్మఁ బూజింతు మనువారు, వాని చరితము లవ్వారిగా నల్లుదు మనువారు, నన్నిరూపులు తనరూపులే యని సేవలొనర్చువారు, రాముఁడాత్మ రాముఁడైనాఁడని నేత్రములొమ్మగిచి ధ్యానించువారునై మునులకు లేని యేకాంతభక్తిఁదగిలి యాతఁడు కనులఁగట్టినయట్లు కాఁగా నానందబాష్పములు, నవి పోవ

విరహాశ్రువులుఁ గలుగఁ గన్నుల తడియారు గతిలేని దశ నందినారని, యేత దనుగ్రహార్థంబె రాముఁ డిట్లు చేసినాఁడని వర్ణించి శాఖామృగములను రామాను గ్రహము గలిగిన మహాభక్తి యోగివర్యులుగాఁగఁ జిత్రించిన కవి పాత్రచిత్రణమున సిద్ధహస్తుఁ డనుట యతిశయోక్తి కాదు. ఈ ఘట్టము కవి ప్రతిభావిలసనమునకుఁ దార్కాణము.

పువ్వులు గొని తెచ్చి పూరుషోత్తము బొమ్మఁ
బూజింతు మేమని పోవువారు
వాని చరితము లవ్వారిగాఁ గ్రమమున
నల్లెదమను మతినలరువారు
చూచిన పొదవులా శూరురూపులె యని
సేవలొనర్పఁగాఁ జేరువారు
శ్రీరాముఁడయ్యె నాత్మారాముఁ డిదెయంచు
నేత్రముల్మోగిచి ధ్యానించువారు

నగుచు దరిఁజేర నైరి వనాటులపుడు
కలిగె మునులకు లేని యేకాంతభక్తి
రాముఁడేతదనుగ్రహార్థంబ కాదె
యింత లొనరించి పంచె నిట్లింతిఁకొనుము

కనులగట్టిన యట్లిను గాననైన
పచ్చు నానందబాష్పము ల్వెచ్చెర నవి
పోవ విరహాశ్రువులుఁ దోచుఁ బో యెటేనిఁ
గపుల కన్నుల తడియారుగతి కలుగదు

— 10 ఆ., 230-31 పులు

ఇట్లు కపిపుంగవులను భక్తి కర్మ జ్ఞానములకు లక్ష్యములుగాఁ జిత్రించి కవి ప్లవంగవు లాత్మీయత పెలార్చి కృతకృత్యులైరి.

## ఋషి పాత్రలు :

లోకహితము గోరి తపస్సంపద నెగడొందువారు ఋషులు. వారు నివశించు నాశ్రమములు ఋష్యాశ్రమములు. భారతీయ తత్త్వ శాస్త్ర మీ ఋష్యాశ్రమముల యందే యుద్భవించినది. ప్రసన్న గంభీరములగు వారి ప్రకృతి వాల్మీకి మహర్షి రామాయణమునఁ జక్కఁగా నిరూపించినాఁడు. అనువాదకులు నట్టి యధ్యాత్మ సుందర మగు జీవితము ననుసరించినవా రగుట ఋషుల స్వరూప స్వభావాదులు, వారి తపోవిభవము, బ్రహ్మనిష్ఠ, అతిథిపూజ, సద్ధర్మ కర్మాచరణము మొదలగునవి హృదయంగమము లగా వర్ణించి పాత్ర లుదాత్తముగాఁ దీర్చి దిద్దిరి.

**వాల్మీకి :** ఈతఁడు రామాయణ మహాకావ్యప్రణేత. ఈతనితో వైదికఛందస్సు లౌకికఛందస్సుగా నవతరించినది. కవి సమాజమునకు వంద్యుఁడు. పురుషార్థ సాధకమగు కావ్యోపదేశము ద్వార జగతి కారాధ్యుఁడైనాఁడు. ఆత్మ వేత్తయై యధ్యాత్మవిదులకు మార్గదర్శకుఁడైనాఁడు. రామాయణమున నీతఁ డొక పాత్రయై రాఘవవంశకులదీపకులగు సీతాతనయుల 'కుశలవులఁ' గాపాడి పెంచి పెద్దఁ జేసి విద్యాబుద్ధులు గఱపి, రామగాథా సుధామధురిమఁ బ్రసాదించి (కుశీలవుల) గాన ప్రవీణులఁ గావించి రామున కర్పించినాఁడు. తన్నుఁదాను కృతార్థునిగాఁ జేసికొనుటే గాక రామాయణ రచనమున లోకమునుఁ బవిత్ర మొనరించినాఁడు. 'నానృషిః కురుతే కావ్యమ' ను నార్యోక్తి యీతని వలననే పొడమి సార్థకత నందినది.

రాముఁడు లరణ్యవాసమునకుఁ బోవుచు ప్రయాగఁజేరి వాల్మీక్యాశ్రమముఁ బ్రవేశించి మునికి నమస్కరింప ధర్మవేత్తయగు నా ఋషి యానందమున స్వాగతము పలికి రామునిఁ బూజించినాఁడు అని వాల్మీకమునఁ గలదు. (56 స. 26-7 శ్లో॥లు)

శ్రీరామకథాఽమృతమున వాల్మీకి వందనముల నొనరించిన వారందఱ నాశీర్వదించి, 'యౌరా ! మా సుందరమూర్తి, యాశ్రిత మందారము నేఁడు మా కన్నులకున్ గానవచ్చె' నని యలరుచు, నర్ఘ్యలు, నాసనములు సమకూర్చి సకలాత్ముని రామునిం బొదవి యాలింగన మొనరించి ప్రమోదాశ్రుకలితేక్షణుఁడై తన్మయమానసమున భక్తితోఁ బొగడినాఁ డనుట మనోహరము. (5 ఆ. 307-9 ప॥లు)

రాముని పరబ్రహ్మగాఁ గీర్తించి 'భూతభావనాంతరాత్ముఁడగు' నాకలుముల నెలవు' నవితరభావమున సంభావించినాఁడు. ఇట్టి వర్ణన వాల్మీకి మహర్షి సమగ్ర

భావనా స్వరూపము గన్నులకుఁ గట్టినట్లు దర్శింపఁజేయుచున్నది. మఱియు నాతఁడు రామదర్శనమున పంచేంద్రియతృప్తి నానందము ననుభవించుచుంటి న ని పలికినాఁడు. ఇది యాతని యోగీశ్వరత్వమును నిరూపించుచున్నది. (5 ఆ. 358 ప.)

శ్రీరామకథాఽమృతమున మూలమున (వాల్మీకమున) లేని వాల్మీకిముని పూర్వచరిత్రమును వర్ణించుటంబట్టి యాతనిలోఁ గలిగిన క్రమపరిణామవికాసము, రామ నామ మహిమము తేటతెల్లమగుచున్నది. వాల్మీకియే —

రామా నీనామ మహిమ
మేమని వర్ణింపనేర్తు నేవాఁడైనన్
భూమానందమయం బది
సామాన్యమె యొడ్లకగునె చర్చింపంగన్-5
అయో. - కాం. ఆ., 325 ప.

అని పలికినట్లు వర్ణించుట హృదయంగమము. ఆతఁడు రామనామ మహిమముననే మహాత్ముఁడైనాఁ డనుట జగత్ప్రసిద్ధము. ఈ తపమున నాతఁడు నిజముగా చక్షుష్మంతుఁడైనాఁ డనియు దానివలననే రామపరిత్యక్త యగు సీతను గుర్తించి కాపాడెనాఁ డనియు వర్ణింపఁబడుట నాతని తపోవిభవము నుగ్గడించుచుఁ బాత్రచిత్రణమున నుదాత్తత సంపాదింపఁ బడినది.

అక్షులు గలవందఱకుం
జక్షుష్మంతుండు వాఁడె సంపాదించెన్
నక్షుద్రము తపమున నొక
యీక్షణ మెక్కుడుగ దాన నెఱిఁగికొనె గతిన్
— ఉ. కాం. - ఉ. భా., 2 ఆ., 238 ప.

**విశ్వామిత్రుఁడు :** ఇతఁడు సప్తర్షులలో నొకఁడు. తపోమూర్తి. సృష్టికిఁ బ్రతిసృష్టి గావించి త్రిశంకునకు స్వర్గసుఖములు కల్పించినాఁడు. హరిశ్చంద్రుని సత్య స్వరూపమును లోకమునకు నిరూపించినాఁడు. రామకథలోఁ బ్రధానమగు పాత్ర విశ్వామిత్రుఁడు. రావణాదుల సంహరింప నగు శస్త్రాస్త్రసంపద రామలక్ష్మణులకుఁ బ్రసాదించినాఁడు. 'యత్ర దాతా ప్రతి గృహీతాచ స్వయం కుశికనందనః' [1] అని భవభూతి

1. ఉ. రా. చ. - ప్ర. అం., 17 శ్లో.

యన్నట్లు సీతారాముల వివాహమున కీతఁడే యుభయపక్షముల వారికి పెద్దగా నిలిచి నాఁడు. అట్లు ప్రకృతి పురుషుల నైక్యముఁ గావించిన ఘనత యాతనికి దక్కినది. అట్టి విశ్వామిత్రుఁడు యాగరక్షణమునకై రామునిఁ బంపు మని దశరథుని వేడగా నయోధ్యకు వచ్చినట్లు —

అభ్యగచ్ఛన్మహాతేజా విశ్వామిత్రో మహామునిః

— బా. కాం. - 18 స., 38 శ్లో.

అని వాల్మీకమున వర్ణింపఁబడినది. శ్రీరామకథాఽమృతమునం దిప్పట్టున నాతని రూప తేజో విశేషములు కన్నెదుటఁ దోచినట్లు చిత్రింపఁబడినవి.

విద్యుల్లతలగుంపు వెనుద్రొక్క బయలెక్క
నన జడల్తళతళ మని నటింపఁ
బూర్ణచంద్రోదయ స్ఫురణమై నెమ్మోము
చూచువారల మేలు చూచుచుండ
స్ఫటికాక్షమాలికా చాకచక్యము చిత్త
వైశద్యమునఁ గొన్న వన్నె నొడువ
ముజ్జగంబుల నొక్కమొగి మోవఁగల విదె
పందెం బనుచుఁ గక్షపాల పెనఁగఁ

గవియెదఁ బరార్థ మిటులను కలికి హొయలు
దెలుపు చిరునవ్వు నల్దెస ల్దివియఁ గవియఁ
బెద్దకాలంబుఁ దపములఁ బేరుగాంచి
నట్టి రెండవసృష్ట తానరుగుదెంచె

— బా. కాం. - 5 ఆ., 3 ప.

ఇట నపరబ్రహ్మయగు విశ్వామిత్రుని విశ్వమిత్రునిగా నిరూపించిన విధము రమణీయము. సామాన్యముగా నా ముని పేరు వినినంతనే లోకము భయాస్పదముగా రుద్రరూపమును భావించుట పరిపాటి. కాని యిందు లోకకల్యాణార్థమై సంకల్పించిన విశ్వామిత్రుని తేజము, ప్రసన్నతాదృష్టి, చిత్తవైశద్యము, సిద్ధసంకల్పత ప్రస్ఫుటము లగునట్లు స్వరూప వర్ణనతోఁబాటు స్వభావనిరూపణము నలుపుట వైలక్షణ్యమును బ్రకక

టించుచున్నది. నిజమున కస్త్రప్రదానము, సీతారాముల వివాహ నిర్వహణము, రామాయణమున విశ్వామిత్ర పాత్ర ప్రయోజనములు. యాగరక్షణ మనునది యంచుబడు నిమిత్తము. 'కనియెదఁ బరార్థమిటు' లనుటలోఁ గల పరమార్థ మిదియే యని భావింప నగుచున్నది. పాత్రప్రవేశ సందర్భముననే కావ్యమున నా పాత్రకుఁగల ప్రధాన లక్షణములఁ బరిచయము గావించుట యుత్తమ కథకుని స్వభావము. కవి స్వోపజ్ఞమగు నిట్టి స్వరూపనిరూపణము మనోజ్ఞము.

సిద్ధాశ్రమమున యాగపరిసమాప్త్యనంతరము విశ్వామిత్రుఁడు మునుల గోష్ఠి నుండి 'రామతత్త్వం బిదియె పరబ్రహ్మ' మని సంభావించినట్లు చెప్పుట ముని బ్రహ్మ నిష్ఠను బ్రకటించుచున్నది. (బా. కాం. 6 ఆ. 6 ప.)

పరబ్రహ్మమును దర్శించినవారికి నొండువృత్తు లిఁకెక్కడివి. ఆ పారవశ్యమున వారికి నిత్యతృప్తి లభించినది. వృత్తి యనఁగా మనోవ్యాపారము. అనుమానోపమాన ప్రమాణముల నిరూపింప వీలుగాని బ్రహ్మతత్త్వము శబ్ద ప్రత్యక్ష ప్రమాణముల సహకారమున దర్శించి స్వానుభవముతోఁ బోల్చుకొనుట శాస్త్ర సమ్మతము. అట్టియెడ విశ్వామిత్రుఁడు రాము నుద్దేశించి పలికిన యీ పలుకులాతనిఁ 'బరమయోగి' గాఁ జిత్రించుచున్నవి.

ఎదురు చూచెదుఁ దలలెత్తి యీ పులకలు
తనివోకనీదు నేత్రమునఁ దవిలి
తెప్పపాటున మేల్కి మెప్పుగాదేరాలి
భాగ్యమట్టులు దృష్టి పంక్తికిపుడు
ధుర్యమౌ పలుకు మాధుర్యంబునకు శ్రుతి
నాశ్రయించెదు నాల్క యదనెఱింగి
కలిగె సంకల్ప వికల్పకల్పన మిథ్య
గా నేకలక్ష్యంబు కలిమి మదికి

నిన్ను విడుతుమెట్లు నీమేలు మామేలు
గాఁ దలంతు మనదుగాదు ముగ్ధ
మూర్తి ! సర్వలోక మోహన ! యిందిరా
కామ ! ప్రథితహర్షధామ ! రామ !

— బా. కాం. - 6 ఆ., 8 ప.

బ్రహ్మానంద మెట్టిదో యనుభవమున నిట నిరూపింపఁబడినది. విశ్వామిత్రుఁడు దశరథునితో 'అహంవేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం, (19 స. 14 శ్లో.) అని పలికిన దానికిఁ దగినట్లుగా శ్రీరామకథాఽమృతమున విశ్వామిత్ర పాత్ర యోగార్థబంధురముగాఁ జిత్రింపఁబడినది. శతానందుని ముఖమున విశ్వామిత్రుని తపః ప్రకారం బుపన్యసింపఁ బడిన సందర్భమున మూలాధికముగా నాతని జన్మక్రమ ముగ్గడించుట, త్రిశంకు కథతోఁబాటు మునికి నత్యంత సంబంధముగల హరిశ్చంద్రోపాఖ్యానము వర్ణించుట యనునవి విశ్వామిత్ర చరిత్రకు సమగ్రతను గూర్చునవి కాఁగా పాత్రచిత్రణమున మిక్కిలి యౌచిత్యము సంపాదింపఁ బడినది.

**పరశురాముఁడు :** జమదగ్ని తనయుఁ డగు నీతఁడు 'ఇదంబ్రాహ్మ్యమిదం క్షాత్రం' అన్నట్లు తన తపోవిభవమునకుఁ దోడు ఘన రాజవంశాలిఁ గాల్చు చిచ్చుగా లోకమునఁ బ్రసిద్ధి గనినాఁడు. 'రామోరామశ్చ రామశ్చ' ఇత్యాది శ్లోకమున బౌరాణికు లితని నవతార పురుషునిగాఁ గీర్తించిరి. రామాయణమున దశరథ రాముని పాత్ర కుత్కర్ష గల్గించువాఁడు పరశురాముఁడు. ఈతఁడు చిరంజీవి.

తనయుల వివాహానంతరము దశరథుఁడు రామాదులతోఁ గూడి యయోధ్యకు బోవుచు నాతఁడు మార్గమధ్యమున 'జటామండలధారి, భీమసంకాశుఁడు, రాజరాజ విమర్దనుఁడు, కైలాసమువలె దుర్ధర్షుఁడు, కాలాగ్నివలె దుస్సహుఁడు, చూపఱులకు జ్వలించుచున్న తేజము వలె దుర్నిరీక్షుఁడు, మూఁపున పరశువు ధరించినవాఁడు, శర శరాసనములఁ దాల్చి త్రిపురఘ్నుఁడగు శివునివలెఁ బ్రకాశించువాఁడు నైన భార్గవరాముని దర్శించినట్లు వాల్మీకమునఁగలదు. (బా. కాం. 74 స. 18-20 శ్లో॥లు)

శ్రీరామకథాఽమృతమున నింతకంటె విలక్షణముగా సాగిన వర్ణన మాతని రౌద్రత నుట్టిపడునట్లు చేయుచున్నది.

నిట్టనిల్వున నింగి నెఱయుచుఁ గుపిత కే
సరి భావగతి నటాచ్ఛటలు నొడువ
ఘన రాజవంశాలిఁ గాల్చు చిచ్చిదియంచు
నురుకుతారజ్వాల యుగ్గడింప
మూడుకన్నులవాని మొదలి మట్టడిఁబినా
కముఁబోని ధనువు తార్కాణ సేయ

దైత్యారి లీలావతారమ్ము ముచ్చట
నల్లోకమగు తేజమొత్తిపలుక
సంతతైరమ్మదస్ఫురాశంసి దివ్య
శరమొకఁడు కేల బాడబశక్తిఁ దెలుపఁ
దోఁచె నాకస్మికముగ నిర్ధూత బహువి
పక్షదోః ప్రాభవుండగు భార్గవుండు

— బా. కాం. - 10 ఆ., 442 ప.

ఇట మూలము నందలి జటామండల మాంత్రీకరణమున 'నిట్టనిల్వున నెలయుఁ గుపితకేసరి భావగతి నొడువు సటాచ్ఛటలు' గాఁ బరిణమించినవి. ఇది యాతని పౌరుషస్ఫూర్తి నెఱపుచున్నది. దుర్నిరీక్ష్యమై జ్వలించుచున్న యాతని తేజము దైత్యారి లీలావతారమ్ము ముచ్చటలు దెలుపునవిగాఁ జెప్పఁబడినది. 'సంతతైరమ్మద స్ఫురాశంసి దివ్యశరము' బాడబశక్తిఁ దెలుప, 'నిర్ధూత బహువిపక్షదోః ప్రాభవ' మాతని క్షాత్రతేజమును బ్రకటించుచున్నది. ఇట్లు మూలమునగల భావమిందు విస్పష్టముగ వివరింపఁబడుట వలన పాత్ర కు వన్నె చేకూరినది.

**గౌతమమహర్షి :-** జితేంద్రియుఁడు. తపోధనుఁడు. పితృదేవలోకము లీతని తపశ్శక్తికి భీతిల్లినవి. ఈతని చరిత్ర రామాయణమున — 1. బాలకాండమున రాముఁడు విశ్వామిత్రుని వెంట మిథిల కరుగుచు గౌతమాశ్రమమున నహల్యా శాప విముక్తిఁ గూర్చిన సందర్భమునను; 2. ఉత్తరకాండమున బ్రహ్మ రావణునిచే నిర్జింపఁ బడి బంధితుఁడైన యింద్రుని విడిపించుకొనిపోవు సందర్భమునను రెండు పర్యాయ ములు వర్ణింపఁబడినది.

ధర్మాత్ముఁ డగు గౌతమమహాముని యహల్యతోఁ గూడి రమించెను. 'సతయా సహధర్మాత్మా రమతేస్మ మహామునిః' (ఉ.కాం. — 30 స., 30 శ్లో.) అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథామృతమున నాతని ధార్మికత నుగ్గడించుచు నాతని యందుఁ గల 'యనలసత, అతిథిపూజాసక్తి, ఋతుకాల రతి, మొదలగు ధర్మ వర్తనములు వివరించి యుత్తమ గృహస్థునిగా, జితేంద్రియునిగా, ధర్మకర్మానుష్ఠాన పరునిగాఁ దీర్చిదిద్దిన క్రమము హృదయంగమము.

సతి ధర్మమని కూర్చు సాహాయ్యమ్ము నెడమెచ్చు
గాని కాఁడలసుండు కర్మము లెడ
సతిథుల నాప్రొద్దు సర్చించునేకాని
బడలుఁబడఁతియంచు నుడగఁబోఁడు
ఋతుదినమ్ముల యందు రతికిఁజోటిడుఁగాని
కామచారత నెందుఁ గవయనీఁడు
మగపాడి యని పత్నిమతము నడుగుఁగాని
యది యధర్మ్యంబైన నాదరింపఁ
డహహ గౌతముఁబోలు గృహస్థుఁ డెందుఁ
గలుగఁబోఁడంచు నెల్లలోకమ్ము లందు
నల్లిబిల్లిగఁ దత్కీర్తి వల్లి యల్ల
నూర్ధ్వభువనంబు లెల్ల నుఱ్ఱూత లూఁగె

— ఉ.కాం. — పూ. భా., 5 ఆ., 331 ప.

అట్లు శివాత్మభావుఁడై తపోవ్రతశీలుఁడగు నాతని మన్మథుఁ డేవేళఁజలింపఁజేయఁ జాలనివాఁ డయ్యెనట. తఱివేచి లోఁబడనేయుపంచబాణుని ప్రయత్నములు ఫలింపకపోగా నాతని పడతి యనెడు తనదు నారవబాణమును దాఱుమాఱుగాఁగ నతఁడు 'మాంత్రికునకుఁజిక్కు గాలిదయ్యము వలె కైవసమై యట మటించె' ననుట హృదయంగమము. మదనుఁ డనంగుఁ డగుట, గాలిదయ్యముతోఁ బోల్చుట యౌచిత్య సుందరము.

వేకువఁ బేరేట వెసఁదోగు నవ్వేళఁ
గడిమితో లక్ష్యంబు నెడవడకుచు
ఉభయసంధ్యల పీతిహోత్రు వ్రేల్చెడుపట్లఁ
బొంచి యేయఁగరాక పొక్కిపడుచు
'హంసశ్శివస్సోహ' మన విల్చినప్పు డ
త్యుగ్రభావం బెంచి యొల్ల బోవు
చితరమతమ్ముల నెత్తి ఖండించుచో
నలికి యంతంతట నులికిపడుచుఁ

బడచుఁ దనమున నున్న యప్పడతి యనెడు
తనదు నారవ బాణంబు తాలుమాలు
గాఁగ మాంత్రికునకుఁ జిక్కి గాలిదయ్య
మట్లు కై వసమై కాముఁ డటమటించె

- ఉ.కాం. - పూ. భా., 6 ఆ., 332 ప.

'గౌతమ మహర్షి యాతని యాశ్రమమునం దీనుచున్న మొదవును మూడు సార్లు ప్రదక్షిణము సేసి భూప్రదక్షిణంబు వలన గలుగు ఫలము నంది బ్రహ్మ దర్శింపఁబోయినాఁడు. కలహాసనుఁడీ కార్యమునకుఁ బ్రేరణ నిచ్చినాఁడు. అందులకుఁ గారణము గౌతముని బ్రహ్మతేజస్సమృద్ధి. అజుని కన్యఁ బడయు యోగ్యత యాతని కిట్లు సిద్ధించినది. ఇట్టి యమూలకమగు కథాభాగము సందర్భమునఁ గూర్చి వర్ణించుట[1] వలన గౌతముని పాత్రచిత్రణమునకు సమగ్రత సిద్ధించినది. అహల్యను దనకిమ్మని స్వయముగానింద్రుఁ డేతెంచి యర్థించినను బితామహుఁ 'డార్యభూషణంబన జను గౌతమర్షి' కిచ్చినాడు. ఆమెయు 'నను బలు బ్రహ్మచర్యము ధనమ్ముగ నిమ్మని కిచ్చె దండ్రి యీ యనఘుఁడు నాదుభాగ్యమున నయ్యె విభుండ'ని నమ్మి ప్రత్యహంబును మహనీయభావగతిఁ బూజలొనర్చుచు నున్నదని[1] వర్ణించుట గౌతముని విశిష్టత నుగ్గడించుచున్నది. అమోఘ వచస్సంపన్నుఁ డగుట నీతఁడు 'అకర్తవ్య మిదం తస్మా ద్విఫలస్త్వం భవిష్యసి' /వా.రా. - బా.కాం., 48 స., 27 శ్లో./ అని యింద్రుని శపింప నాతనికా క్షణంబుననె యండ యుగిళిన్నంబై పడుటయేగాక యాగఫలము విఫలమై కాలాంతరమున శత్రువుని చేతిలో నోడిపోయి బంధింపఁబడినాడు. బ్రహ్మచేఁ బ్రబోధితుఁడై యింద్రుఁడు వైష్ణవ యాగము గావించి తిరిగి బలసమృద్ధిఁ గనినాఁడు. ఇదియంతయు గౌతముని మహిమమును బ్రకటించు చున్నది.

**ఋష్యశృంగుఁడు** : విభాండకముని కుమారుఁడు ఋష్యశృంగుఁడు. ఈతఁడు నిరంతరాత్మానుభూతి నెక్కొనుచుండుట స్త్రీపురుష భేదభావము నెఱుఁగడు. తండ్రి కడ సమస్త విద్యలు నభ్యసించి యగ్నిహోత్రుని సేవించుచు దపస్సంపదచే మిక్కిలి మహత్త్వముఁ బడసినాఁడు. అతఁడు కాలిడినచోట కఱువు కాటకము లుండవు. సకాలములో వర్షములు పడి భూమి సస్యశాలినియై ప్రజలు సుఖశాంతుల ననుభవింతురు.

---

1. శ్రీ. రా. క. - బా. కాం., 7 ఆ., 21-24 ప॥లు.

రోమపాదుఁడు ఋష్యశృంగునిఁ గొని తేర వారకాంతల నంప, వారు వనమున కేగి మున్యాశ్రమము పొంత ఋష్యశృంగుని గాంచినట్లు 'విభాండక సుత స్తత్ర తా శ్చాపశ్యన్వరాంగనాః' /బా.కాం. - 10 స., 11 శ్లో./ అని వాల్మీకమునఁగలదు. శ్రీరామకథాఽమృతమున నాతఁడు దర్శనమిచ్చిన విధమిట్లు వర్ణింపఁ బడినది. 'జడలతో నొప్పు నాతని నగుమోము పోఁకమ్రాకులలోని పొడుపు చందురునిఁబోలియున్నది. దిశల వ్యాపించి మెఱయు నాతని తేజము బాలభాస్కరునిలీల గేలిసేయు చున్నది. స్ఫటికాక్షమాలాలంకృత మగు నాతని పాణియంచతెక్కల తళుక్కుల నొప్పు కెందమ్మినిఁ బోలియున్నది. వల్కలములధరించు నాతని మేను చిక్కమందిడిన సింగారమున నలరుచున్నది. అట్టి ఋష్యశృంగుని అంగనలు కనుంగొనిరి.

పోఁకమ్రాకులలోని పొడుపుచందురుఁ గూర్చు
మొగి జడల్గల నగుమోము వాని
బాలభాస్కరులీల బయలుపెట్టఁగఁజాలి
దెసలాని మెఱయు బ త్తేజు వాని
నంచతెక్కల తళుక్కలందు కెందమ్మినాఁ
బటికంపు బేరొప్పు పాణివానిఁ
జిక్కమందిడిన మేల్సింగారమున వల్క
లానుబద్ధమగు నెమ్మేనివాని
నంగములఁ బులకలెసంగ నంగనలు క
నంగొని రసంగు రుచి జితానంగు నంగ
ళాంగు నంగీకృత సదేకసంగుఁ జిత్ర
సంగు హతభంగు నాఋష్యశృంగు నచట

- బా.కాం.- 1 ఆ., 445 ప.

ఇందుఁ గ్రమముగ వాని మన్మథుని మించు రూపవిశేషము, మంగళాంగుఁడగు నతని తేజస్ఫూర్తి, తత్త్వజ్ఞత, యవికారత, మహానుభావత మొదలగునవి యుగ్గడింపఁ బడినవి. ఇట్టి నిసర్గరమణీయ మగు వర్ణన ఋషిమహత్వమును బ్రసన్న గంభీర మగునతని ప్రకృతినిఁ బ్రతిపాదించుచున్నది. మునికి జటాపటలము

వల్కలాజినములు పటికంపుఁబేరులు విశేషమగు తపస్తేజము సహజము లగుట నియ్యది స్వభావసుందరము, సహృదయ హృదయంగమమునై యలరుచున్నది. ఇట్టి పాత్రచిత్రణమమూలకమై కవి భావనాబలమునకుఁ బ్రబలనిదర్శన మగుచున్నది.

**భరద్వాజుఁడు :** సప్తర్షులనుపేరఁ బ్రసిద్ధివడసిన మహర్షి పుంగవులలో భరద్వాజుఁ డొకఁడు. రామునకు భరతునకు వారి వారి యాశ్రమస్థితుల కనుగుణముగా నాతిథ్యము నిచ్చి యలరించిన యుచితజ్ఞుఁ డాతఁడు. భరతునకు గావించిన రాజోచిత మగు విందు భూమిపై 'నభూతో న భవిష్యతి'. ఇందు వలననే 'భరద్వాజ విందు' అను నానుడి లోకమున స్థిరపడినది. దివ్యజ్ఞానముచేత క్రాంత దర్శియై భరతునకుఁ దల్లియెడ దుర్భ్రమను దొలగించి యది దైవఘటనగా నిరూ పించినాఁడు.

'భరద్వాజాశ్రమముఁజేరి శిష్యగణపరివృతుఁడు సంశ్రితవ్రతుఁడు ఏకాగ్రతచేఁ దపోదృష్టి నందినవాఁడు నగు భరద్వాజుని సీతతోఁ గూడి సహానుజుఁ డగు రాముఁడు కృతాంజలియై నమస్కరించినాఁడు' అని వాల్మీకమునఁ గలదు. (అయో. కాం. - 54 స. 11, 12 శ్లో॥)

శ్రీరామకథాఽమృతమున నయ్యెడఁ 'తేజము తేజమ్ము మొనయ తెలఁగ గవడఁగా' భరద్వాజుఁడు రాముని సమీపించినాఁడని వర్ణింపఁబడినది.

పూజాద్రవ్యములం గొని
పూజితుఁ బూజింప నత్తపోధన ముఖ్యుం
డోజమెయి నెదురుపడియెను
తేజము తేజమ్ము మొనయ తెలఁగగవడఁగన్
— అయో. కాం. - 5 ఆ., 246 ప.

ధర్మస్వరూపుఁడు రాముఁ డొక తేజము కాఁగా నత్తపోధన ముఖ్యుం డొక తేజముగా సంభావింపఁ బడుట పాత్రచిత్రణమున నౌచిత్యము పరసీమ ముట్టినది. తేజమునకు నిర్వికారత సహజము. అట్లే ధర్మాత్ముఁడగు మునియు రాగద్వేష దోష దూషితుఁడుగాఁడనుట పరమార్థము. బ్రహ్మాత్మభావన నుండుననుట తాత్పర్యము. అట్టివానికిఁ గొఱతలేమి యుండును. అతఁడు వేద దేవతలు సమకూర్చని చెప్పి ?

'భరతుని వరగుణయుక్తికిన్ మహిత వర్తనకున్' మది మెచ్చి సపరివారుఁ డగు భరతునకు విందొసగూర్చినాఁడు. ఇది యాతని గుణగ్రాహిత్వమునకుఁ దార్కాణము. విందు మహాద్భుతముగా సాగినది. అట్టి సత్కృతి నాన్యతోదర్శనీయము. వారట్టి యపూర్వసృష్టికి విస్మయమంది యానందించిరని వాల్మీకమునఁ గలదు.

వ్యస్మయ స్త మనుష్యాస్తే స్వప్రకల్పంత మద్భుతమ్
దృష్ట్వాతిథ్యం కృతం తాదృ గ్భరతస్య మహర్షిణా
– అయో. కాం. - 91 స., 80-1 శ్లో॥లు

శ్రీరామకథామృతమునం దిప్పట్టునఁ ద ద్వైభవముఁ గాంచి విద్యావంతులు సహితము తమలో నిట్లు సంభాషించిరని వర్ణింపఁ బడినది.

మునిజనయుక్తియో భువనమోహిని శక్తియొ స్వప్నరక్తియో
ఘనవిహితైంద్రజాలిక వికాస విభక్తియొ యెన్నఁబోల ది
వ్యనుభవునఁ గండ్లఁ గట్టినటులై కనుపట్టెడుఁ జోద్యమెట్టులో
వనితర వేద్య మియ్యది యనంత విలాస మనంగఁ జెల్లదే

రాము వలని కూర్మి రాజించు మేటి యి
మ్మౌని తలఁచి నది యమాన్యమగునె
యింద్రభోగకళల నీసడింపఁగ జాలు
వైభవోత్సవంబు వలనుపడదె
ఒక్కొకట నొక్కొకఁడు మతి
[illegible] సకలమీ
[illegible]
[illegible] నెఱికిన్
[illegible]
[illegible] సిరులం
[illegible]
[illegible] యోజనగాదే!
— అయో. కాం. - 7 ఆ., 321-4 ప॥లు

ఇట్టి వారి సంభాషణ ముఖమున ముని మహాత్ములు [illegible]
నుగ్గడింపఁబడి పాత్రచిత్రణమున సుదాత్త [illegible]
ధనము తపోధనమునకు నేవిధముగను సరికాదు [illegible]
లోకమున నొక్కొక్క రొక్కొక్క విధముగాఁ గొప్పవారు [illegible] అతఁ
డన్ని విధముల మిన్నయై ప్రశంసనీయుఁడైనాఁడు. [illegible]
సంస్కృతికిఁ దగినట్లు ఋషుల లోకహితాచరణపద్ధతి [illegible]
లౌకికులయ్యు నలౌకిక జీవనమున ధన్యతఁ గడించినారు. [illegible]
యాత్మీయతకు నిదర్శనము.

**అత్రిమహర్షి :** సన్మాని యగు నీతఁడు సప్తర్షులలో నొకఁడు. [illegible]త్రి
నెఱపు వెన్నెలతేఁడు, త్రిమూర్త్యంశావతారుఁ [illegible]
గర్వస్ఫూర్తి శాపోక్తి వనరాశిఁ గలిపిన మహాత్ముఁడు [illegible].
పతివ్రతామతల్లి యనసూయాదేవి యాతని ధర్మపత్ని. [illegible]
ఖని. మౌనిజన వినుతమాని.

వాల్మీకిరామాయణమున రాముఁడు అత్రి[illegible]. రాముఁ
డాతనికి నమస్కరించినాఁడు.

సోఽత్రేరాశ్రమ మాసాద్య తం వవందే మహాయశాః
— అయో. కాం. - 117 స., 5 శ్లో.

అని చెప్పఁబడినది. శ్రీరామకథామృతమున 'అత్రిమహర్షిని మూర్తీభవించిన
బ్రహ్మతేజముగా' సంభావించుటలో నీ యౌచిత్యము [illegible]. పాత్ర
చిత్రణమున నుదాత్తత సంతరింపఁ బడినది.

తపము ధీరము శాంతిఁదక్కొన్న కాంతితో
నెరసి పారమ్యంబు నిర్ణయింపఁ
బందురుఁగన్న యాచక్కని కనుదోయి
కూర్మిమై నెనరులఁ గుమ్మరింప
నగుమోము చెలువొప్ప ననుచు సౌజన్యంబు
పాల్పోసి సత్కాంతిఁ బ్రబలఁజేయ

జరఁదోలి నిజసేవ సలిపెడు వృద్ధత్వ
మఖిల పూజ్యత్వమ్ము ననుగణింప
యమ నియమ ముఖ్యములు మూర్తులందఁగాంచి
శిష్యులట్టులు వరివస్య సేయుచుండఁ
దనరు నా బ్రహ్మతేజంబు తపసిఁజేరి
పేరిరవుఁ జెప్పి రాముండు ప్రీతినెఱగె

- అయో. కాం.– 10 ఆ., 58 ప.

ఇట్టి యపురూప రూపకల్పనాశిల్పము కవి ప్రతిభాజనిత మగుట బ్రశంసార్హము. ఆశ్రమమున శిష్యులు యమ నియమములతో శుశ్రూష సలుపుచున్నా రనుటకు 'యమనియమముఖ్యములు మూర్తులందఁగాంచి శిష్య లట్టులు వరివస్య సేయుచుండిన' వనుట యుక్తివైచిత్రిమై యా యత్రిముని తపఃప్రభావమును బ్రకటించు చున్నది. అధికమగు తపస్సునకు, క్షాంతికి, శాంతికి, నాతఁడు పరమావధి. చంద్రుఁడు చల్లదనమునకుఁ బ్రతీక. అట్టి చంద్రునిఁ గనిన యాతని కనుదోయి కూర్మిమై నెనరులఁ గ్రుమ్మరించుచున్న దనుట సాభిప్రాయము. చక్కని అలంకారము. ముఖము హృదయమునకుఁ బ్రతిబింబము గావున నగుమోము వెన్నెల లాతని సౌజన్యమును బ్రదర్శించుచున్న వనుట హృదయంగమము. లోకమున బెద్దలుఁ పూజార్హు లగుట సంప్రదాయము. అట్లగుట జరఁదోలి నిజసేవ సలిపెడు వృద్ధత్వ మాతని యఖిల పూజ్యత్వము ననుగణించుచున్న దనుట సముచితము, సుందరము.

మఱియు నారేయి మునులు రాముని సేవింప వారచట నుండిరని వాల్మీకమునఁ గలదు.

అర్చితాస్తాపసైః సర్వై రువాస రఘునందనః - 119 స., 16 శ్లో.

శ్రీరామకథాఽమృతమున ముని గోష్ఠి నుండి యచటివారితోఁ గూడి యత్రిమునియు యోగానందము ననుభవించె ననుట యాతని బ్రహ్మజ్ఞాన సంపన్నునిగా నిరూపించుచున్నది.

రాముని జానకీహృదయరాముని విశ్వజనీన చిత్కళా
ధాముని సద్గుణ ప్రసవదాముని గీర్తిత కీర్తిచంద్రికా
ధామునిఁ దైజసోల్లసితధామునిఁ దారకమంత్రయోగవ
న్నామునిఁజేరి యుత్తమము నామునివర్గము వొల్చె నత్తఱిన్

చూడ్కులు మరల్పనేరరు సుందరాంగుఁ
జూచి తత్కలనల నెంచి, చొక్కి పలుక
నెంచరు, ఘటించె నెటిఁగి వాణీశ్వరుండు
వారికా భాగ్య మేనాఁటి వలని దొక్కొ

- అయో. కాం.- 10 ఆ., 270–71 పలు

ఇట్లు నిర్వికల్పజ్ఞానసమాధిచే హృదయమానందకందళితము కాఁగా నొండు మార్గ మరయక కొంతదనుక వారట్లుండిరి. అంత నత్రిమౌని రామతత్త్వమున్ శ్రీదయితత్త్వమున్మదినిఁ జేర్చి శ్రుతిసూక్తులఁ బ్రస్తుతించినాఁడు.

ఆదట నత్రిమౌని మహితాదరమూరఁగ రామతత్త్వమున్
శ్రీదయితత్త్వము న్మదినిఁజేర్చి తనర్చెడువాఁడయౌట సం
వేదితృ భావమొప్పఁగ నివేదిత వేదవినోదవాద సం
పాదనముం బొనర్చె గుణభవ్య వచఃకలనం బెలర్పగన్.

- 10 ఆ., 273 ప.

'ఘటించె నెఱిఁగి వాణీశ్వరుండు వారి కాభాగ్యము' – ఇట వాణీశ్వరుం డనఁగా బ్రహ్మ. కావున నాతఁడీ సన్నివేశమును సృష్టించినాఁడు. అట్లే యీ సన్నివేశము శ్రీరామకథామృత కవిబ్రహ్మ నిర్మితమై సహృదయ హృదయంగమ మగుచున్నది. ఇట్టి కల్పన మత్రిముని పాత్రచిత్రణమునకు విశిష్టత నాపాదించుచున్నది. కవులాత్రేయ సగోత్రులగుట వీరికినట్టి సంస్కారసంపద సిద్ధించినది. ఈ విధముగా జ్ఞానధనులై వారు ధన్యతములైనారు. తపోమహితులై సుప్రసిద్ధినందినారు.

**అగస్త్యమహర్షి :** తపోవిభవమున మహితాత్ముఁడై నవాఁ డగస్త్యుఁడు. దేవకార్యార్థమై యింద్రుఁడు శర శరాసనములు, ఖడ్గము నీయగస్త్యముని చేతనే రామున కిప్పించినాఁడు. సముద్రజలముల నెల్లఁ బుక్కిటఁబట్టి, వింధ్యపర్వత గర్వమడంచి, రక్కసుల ప్రాణమూలంబులఁ బిడుగై, దుష్టులఁ బరిమార్చినాఁడు. ఈతని చరితము పరమాద్భుతసుందరము. సుతీక్ష్ణుఁ డీతని చరితంబుఁ జెప్పుచు శ్రీరామకథామృతమున -

కడలినీరెల్లఁ జుఱికించి విడిచినాఁడు
నడఁకు లేకడరెడు కొండ నడచినాఁడు
మిడియు పొలదిండిపోఁతుల మెక్కినాఁడు
తపసి తపసియె రఘుకులో త్తంసితాత్మ !

అర. కాం.- 1 ఆ., 231 ప.

అని వివరించినట్లు వర్ణింపఁబడినది. ఇందు మూలాధికముగ నగస్త్యమహిమాను వర్ణనములగు వింధ్యవారణ వృత్తాంతము, ముని సముద్రజలములఁ బీల్చి విడుచుట మొదలగునవి చెప్పఁబడినవి. వీనివలన నగస్త్యుని మహత్వముఁ బ్రకటింపఁబడినది. మఱియు మూలమున లేకున్నను సుతీక్ష్ణుఁడు రామాదులతో నగస్త్యాశ్రమమునకు వచ్చి రామాగమన వార్త మునికిఁ దెలిపినట్లు వర్ణింపఁబడినది. అట్టియెడ 'సుద్గు రూత్తంసుఁడు, నితాంత దయాపరీతుఁడు, శుభగుణనిరతుఁడు నగు నగస్త్యుఁ' డిట్లు వర్ణింపఁబడినాఁడు —

తపమునఁ బరకాష్ఠ దనరంగఁ దనరంగ
మంది వేఁడెడు వారి నరసికొనుచు
వరగుణం బాగ్నేయ శరణంబు శరణంబు
గా నున్న శిష్యుల కలిమిఁ గనుచు
వనిచిన సద్భక్తుసపవార లనువారఁ
జెనయు మహోదయస్థితి కలరుచు
రామమంత్రార్థ సారము వించు రమమించు
వేడ్క రసాంచిత వివృతికిడుచు
బ్రహ్మసామ్రాజ్య పదపట్టభద్ర భద్ర
వేషగుణ వేదపదవీ నవీనవిధి వి
శేష తేజోనిధి ముఖ ప్రసిద్ధి సిద్ధి
దొలఁకఁ దులకించు నమ్మహాత్మునకు మ్రొక్కి

- 1ఆ., 265 ప.

ఇందాతని శిష్యవత్సలత, లోకహితవర్తనము, మహిత మంత్రార్థ చింతనము వివరింపఁ బడినవి. సుతీక్ష్ణుఁ డాతని 'బ్రహ్మమూర్తి' యని సంబోధించుట యాతని యలౌకికత వెల్లడించుచున్నది. వాల్మీకమున నియ్యెడ 'రామాదులా యాశ్రమముఁ జేరి ముని శిష్యునితోఁ దమరాక నెఱుక సేయ నాతఁడు యథాన్యాయముగ బ్రవేశపెట్టుఁడని యనుమతించినాఁడు. వారట్లు రామాదుల ముని సన్నిధికి గొంపోయిరి' అని వర్ణింపఁ బడినది.[1] అనువాదమున నిట్టి యన్యథాకరణ మౌచిత్య భరితమై పాత్రచిత్రణమున విశిష్టత సంపాదింపఁ బడినది. కవుల వ్యక్తిత్వము నిటఁ జెప్పబడినది.

అగ్ని పరిచర్యఁ జరిపి యగస్త్యుఁడు రాముని జేరి 'పూజనీయుఁడవు, మాన్యుఁడవు, ప్రియాతిథివి యైన నీవు నేఁడిట్లు వచ్చితివ'ని సంభావించినట్లు వాల్మీకమునఁ గలదు.

పూజనీయశ్చ మాన్యశ్చ భవాన్ ప్రాప్తః ప్రియాతిథిః

- అర. కాం.— 12 స., 31 శ్లో.

శ్రీరామకథామృతమున నాతని యోగ్యతకుఁ దగినట్లు రామాగమనమునఁ దన జన్మ ధన్యతగాంచిన దని తలఁపోసినాఁడు. పుణ్యాత్ముఁడై మించినాఁడు.

' .. .... ....

నీ వతిథిమాత్రుఁడవె జగన్నేత వఖిల
కర్మసాక్షి వదియు భవత్కలనగాదె
ఎంత మంచికాల మేమందు నాభాగ్య
మిట్టి యతిథి యెవరికెన్నఁ డబ్బు
ఫలముఁగంటిఁ గాదె భవము గాంచిననాఁటి
కలిమి కెల్ల నిదియ కలిమి గాఁగ

— అర. కాం.— 1 ఆ., 275-76 పు॥లు

'నిచ్చలు రామమంత్ర రహస్యార్థమరయు' మునికి రాముఁడే ప్రత్యక్ష మగుట కంటె వేరుగాఁ గోరఁదగినదేమున్నది. ఇట్లిట సర్వము సుసంపన్నమైనది.

1. వా. రా.- అర. కాం., 12 స., 1-16 శ్లో॥లు

## స్త్రీ పాత్రలు :

రామాయణ మను నామముతోఁబాటుగా నీ కావ్యమునకు సీతాచరిత్రమను నామము గూడ వాల్మీకియే యుద్దేశించినాఁడని లోకమునఁ బ్రసిద్ధి కలదు. సీత పేరుమీదుగా నా కావ్యమును వాల్మీకి రచించినాఁడని చెప్పుటలో వాల్మీకిమహర్షి భంగ్యంతరముగా స్త్రీ పాత్ర ప్రాముఖ్యమును సూచించినాఁడనవచ్చును. కావున నీరామాయణమును బరిశీలించు నప్పుడు సీత పాత్రతోఁ బాటుగా నితర స్త్రీపాత్రలను గూడ వీరలిం దెట్టి నైపుణ్యముతోఁ జిత్రించినారో సమీక్షించుట యత్యంతావశ్యకము. సర్వ స్త్రీపాత్రలకు సీత పాత్ర ప్రథమగణ్యము.

**సీత :** రామాయణమున నీమె నాయిక. రామాయాః అయనమ్ అను వ్యుత్పత్తినిఁ బట్టి రామాయణము సీత మహచ్చరిత్రమే యని సంభావింపఁబడుచున్నది. వాల్మీకియే రామాయణమును 'సీతాయాశ్చరితమ్ మహత్' అని పేర్కొనుట దెలియఁ దగియున్నది. యోగమాయ జనకనందినియై యజ్ఞభూమిఁ బ్రభవించినది. అధ్యాత్మమమున సీతయే మూలప్రకృతిగా నిరూపింపఁబడినది. వాల్మీకమున లేకున్నను శ్రీరామ కథామృతమున సీత బాల్యమును గూర్చి యిట్లు వర్ణింపఁబడినది. 'వివిధాభరణములను ధరించి కళలకు నిలయమై సీత కన్నవారి తపము ఫలింపఁజేసిన దనుట హృద్యము. అట్టియెడ నామె కలికి చేష్టలు, ముద్దుపలుకులు, సౌందర్యముఁ గని వారు సంతసించిరి. బిడ్డల సౌభాగ్యము గని పెద్దలానంద మందుట సహజముగదా.

(బా. కాం. 4 ఆ. 153. 4 పలు)

అట్లే యామె శైశవమును గూర్చి యిట్లు వర్ణింపఁబడినది -

నిలుచు నొక్కొకచోట నిలువెల్ల బంగారు
తీరుగా రుచి దెస ల్దీవియుచుండ
నడచు నొక్కొకచోట నడుగుకెందమ్మి పు
వ్వుల పూజ యిలపాలి కలిమిదెలుపఁ
బలుకుఁ నొక్కొకచోట భాషాంఘ్రి నూపుర
కింకిణీక్వణన సంకేత మెసఁగ
మురియు నొక్కొకచోట మోముచందురు వెల్గు
లను బంధిజన ఖేదమపనయింపఁ

జూచు నొక్కొకచోట సొబగు వాల్గనుగవ
కూర్మి మానికములఁ గ్రుమ్మరింప
జనకనృపతి సుకృత చయలక్ష్మి యక్కన్నె
శైశవంబు గడుపు సమయమునను

- బా. కాం.— 4 అ., 165 ప.

ఇట్టి వర్ణన సీత యభిరూపసంపదను వెల్లడించుచున్నది.

సీతకు సమయజ్ఞులగు గురువు 'ఓంనమశ్శివాయ' యని తొలుత నక్షరాభ్యాసము గావించిరి. ఆమె వర్ణమాతృక నుపాసించి క్రమక్రమముగ విద్యల, సత్కళల నభ్యసించినది. వేదవేదాంగములెఱింగినది. సుకవితాగాన మాధురుల వెలయించినది. ఇవి యన్నియు నామె విద్యావైదుష్యములను ప్రతిపాదించునట్లు వర్ణింపఁబడుట మనోహరము. (బా. కాం. 4 అ. 174 ప.)

ఇట్టి వర్ణన మామె నున్నతమైన సంస్కారము, నుదాత్తమైన శీలము గల విదుషీమణిగాఁ దీర్చిదిద్దుట కుపకరించు చున్నది. ఆ విద్యారూపిణి 'కవీంద్రధ్యేయ' యవుగాత మని యుపాధ్యాయవర్యులిట్లు కవితఁజెప్పుమని ఆమెను ప్రోత్సహించిరి -

నీతాల్మికీభూమి నేఁదోడనుచు నంచి
తామోద భూమోదయమున మనదె
యీఁడే భవత్కల లెఱిఁగిన సర్వస్వ
మా మురారి కవీంద్రుఁడై యలరుట
నేపట్ల నినువీడ నేనని గిరిజ నీ
చెలువ మీక్షించి తాఁ జిక్కకున్నె
తల్లి! త్వత్సంగీత తాత్పర్యమున దివ్య
మౌని వీణియ పొంగి మహతి గాదె
శ్రీవెలయు ప్రాసముఖ్య సద్భావయుక్తిఁ
బొంకమగు వర్ణతతిఁ బాదములనుఁగూర్చి
కటకిత ఫణీంద్రు నాట్యయోగ్యముగఁ బదముఁ
జెప్పబూనుము కవినామ సిద్ధి వెలయ

— బా. కాం.— 4 అ., 183 ప.

ఇందు ప్రాసాక్షరములు గణింప 'తాడేపల్లి వెంకటప్ప' అను కవి నామ ధేయము వర్ణన మిచ్చుట చమత్కారము. ఉదిత యౌవనవిలాసవర్ణన గావించుచుఁ దారుణ్యార్కుఁడు పొడమినంత నానన ప్రముఖాంగాబ్జములు వికసించి యామె సరసికి రెండవమూర్తి వలెఁ బొల్పుచున్న దనుట రమణీయము. (4 ఆ. 186 ప.) ముఖము, హస్తములు, స్తనములు, పాదములు మొదలగున వన్నియు నబ్జములతోఁ బోల్చుట కవి సంప్రదాయము. ఇట్టి వర్ణన మామె వయో వికాసమును దెలుపుచున్నది.

మఱియు నా సువదన వదనము 'రత్ననిధి' యని సంభావించుట హృద్యము. విధి సుదతి పలువరుసకై మగజాల మొలకలు, మంచి ముత్తెపు రుచులు చూఱపుచ్చినాఁడు. బింబోష్ఠి మోవికై పవడంపుఁ బలుకులు పద్మరాగ ద్యుతులు వెచ్చగించినాడు. అలివేణి కురులకై కప్పు డాకణికలు గారుత్మతశ్రీలు నప్పగించినాడు. సుకపోల యగు నామె చెక్కు లకు పటికంపుఁ బలకలు, వైదూర్య లక్ష్మలు దార్చినాఁడు. కావున నది సువదనము. అట్టిది రత్ననిధిగా నభివర్ణించుట సాభిప్రాయ సుందరము. 'మరుఁడు మెఱుఁగిడఁ దోడ్పడెనో' యనుట యౌవన విలాసమును సూచించుచున్నది. (బా. కా. 4 అ. 211 ప.)

సీత పచ్చని మేనిచాయఁ బొంచి దొంగిలించిన కారణమునఁ గాఁబోలు బంగారము బల్కాఁకపమ్మెటపాట్లు గనుచున్నది. ఆమె మేని తళుక్కులకుఁ జలించి కాఁబోలు మెఱుపుతీగె మబ్బులచాటు చాటున దాగుచున్నది. శరీరలావణ్యమునకు భ్రమించి కాఁబోలు సరస్వతీనది లోపల దాఁగి ప్రవహించుచున్నది. పిస్పున కోహటించి కాఁబోలు సంపెంగపూవు తా నూపిరిలేక ప్రాలినది. లోకమున మేనిచాయ బంగారము తోను, తళుక్కులు మెఱుపుతీగెలతోను, లావణ్యము ప్రవాహముతోను, నాసిక సంపెంగపూవుతోను బోల్చుట కవి సంప్రదాయము. కవివరుల గూర్చునవి యిట్లివ్విధిఁ గొఱగానివికాఁగా మానినీమణి నెమ్మేని మాన్యకళలకు వేరెనయుపమానమొక్కటియు లేదు. అట్టి లోకోత్తర గుణోత్తర సౌందర్యము విధియుఁ గలయ వర్ణింపఁజాలఁ డనుట సీత పాత్రచిత్రణమునకు విశిష్టత గూర్చుచున్నది. విధియుఁబురాణకవి యగుట నాఁడు సముద్భుఁడు గాఁడగుట చమత్కార చారువు.

పొంచినన్నిఁట దొంగిలించి కాఁబోలు బ
    ల్కాఁక సమ్మెటపాట్లుగనెఁ బసిండి
యెంచి తళ్కులకుఁ జలించి కాఁబోలు మ
    బ్బుల చాటుచాటున మలఁగె మించు
మించి శ్రీరఘువెకి భ్రమించి కాఁదోలు లో
    కులఁగి ప్రవహించెఁ బలుకు తేటు
కాంచి విప్పున కోహటించి కాఁబోలు నూ
    పిరిలేక వ్రాలె సంపెంగపూవు
కవివరులు గూర్చునవి గౌలగానివయ్యెఁ
గాన నుపమాన మొక్కండుగానఁబడదు
మానినీమణి నెమ్మేని మాన్యకళలఁ
గలయ వర్ణింప విధికేని గతియులేదు

- బా. కాం.- 4 ఆ., 232 ప.

రాముఁడు మిథిల కరుదెంచినంత 'సంతిపురి జానకీదేవి యాత్మసఖుల వలన విని రాము ప్రతికృతి కలన గాంచి,' యనురాగమున నెమ్మదిఁగోర్కులు దందడింప' నమోఘ విప్రలంభము ననుభవించుచు, చంద్ర,మలయానిలో పాలంభములు గావించి వనవిహార, చైత్యోపచార కల్పనములఁ బ్రవర్తిల్లి చెలులతోఁ దన యవస్థల నుగ్గడించుట సీతకు రాముని యెడఁ గల యనురాగమును దెలుపుచున్నది.[1]

1. శ్రీ. రా. క.— బా. కాం., 8 ఆ., 44-132 పలు

రాముఁడు శివధనుర్భంగముఁ గావింప స్వయంవరమునకై సీత సభా మండపమునకుఁ గొని తేఁబడినది. అట్టియెడ 'మబ్బు విడిచి యధికముగాఁ బ్రకాశించు చంద్రరేఖవోలె నామె పల్లకి దిగి, విశాఖానక్షత్రమునకు నటునిటునున్న చుక్కల వలెఁ జెలు లిర్వురు తన్ను సేవింప వర్షాకాలము నంపలి మెఱుగుల నధిగమింపఁ జాలు మెయిసీవ నిఱుకడ మేలుసూవ, నడచివచ్చు సుందరమగు కీల్బొమ్మవలెఁ జిత్రగతి నొప్పినది. మన్మథుఁడఱఁగుల పొదినుండి బాణమును దీసి వెల్లుఁగుల నూది వింట సంధించి విడువ, మొన రాముని హృదయమునఁ బ్రవేశించు మోహనాస్త్రమో యన్నట్లు సీత యొప్పుచున్న వనుట మనోజ్ఞము. (బా. కాం. 9 ఆ. 199 ప.)

రామునకుఁ బ్రియ సతి సీత నిట్లు సంభావించుట పాత్రచిత్రణమున విశిష్ట స్థాన మాక్రమించుచున్నది. (కవి ఖగోళవిజ్ఞాన మిందు వివరింపఁబడినది.)

అయ్యెడ మారుఁడు సీత సౌభాగ్యమును మాత్ర మాధారముగాఁ గొని జగదేకవీరుని రాముని సాధనాంతర నిరపేక్ష జయించినాఁడనుట హృద్యము.

( 9 ఆ. 205 ప. )

అత్రిముని యాశ్రమమున సీత యనసూయకుఁ దన స్వయంవర వృత్తాంతముఁ దెలుప నామె నానందమునఁ గౌఁగిటఁ బొదివి 'స్త్రీగుణాంభోధి గట్టిదెవో' యని సంభావించి -

నీ యభిజాతమే నెగడు నీదు సువృత్తమె చెల్లు, నీ గుణ
శ్రీ యుచితత్వముంగనియెఁ జిత్రపదాక్షర గుంభనంబులున్
నీ యవినాఁగ నొప్పె, బళె నేర్పితి వొప్పులకుప్ప వీవె కా
కే యదియేని గల్గె నకొ యిట్టి వధూకులభూషణం బిలన్
మధురభాషిణీ! నీ నుడి మధురమయ్యె
నా స్వయంవర వృత్త మనర్ఘ్యమయ్యె
విన్న యీ శ్రుతియుగము ప్రవీణమయ్యె
పలు పలుకులేల తపము సాఫల్యమయ్యె

అని సీత యాభిజాత్య సంపదను, సువృత్తమును, గుణశ్రీయుచితత్వమును, వాగ్గుంభనమును గీర్తించి యామెను 'వధూకులభూషణంబు'గా సమ్మానించి తుదకు దనకా యోగము స్వతతఃఫలముగా సిద్ధించినదని సంతోషించినది. అమూలకమగు నీ సంభావనానరణి పాత్రచిత్రణమున నౌచిత్య పరాకాష్ఠనందినది. అనసూయ ముఖమున నిట్లు పలికించుట సీత వడవడికి పరమ ప్రమాణము.

కపటబుద్ధి యగు రావణుఁడు బలాత్కారముగాఁ గొనిపోవుచుండ విస్సహాయతతో సీత హృదయమున రాముని రూపమును భావించుచు, రామా! రామా! యని రామనామ ముచ్చరించుచు, రాముని రాక నిరీక్షించుచుఁ దద్గతదృష్టియునై యున్నట్లు వర్ణించుట యామె త్రికరణశుద్ధినిఁ బ్రకటించుచున్నది. ఇట్టి వర్ణన పాత్రోచితము.

ఆ మహిళాశిరోమణి ధరాత్మజ శేముషి రామరూప, త
న్నామ మయాత్మజిహ్వ, యవినాకృత తద్గతదృష్టియుం దగన్
భూమరసాధ్యయై తనరుపోఁడిమిఁ గన్గొనియుం దలంప డా
సేమము రక్కసుండు తన చేటున కేమతి సమ్మతింపగన్

- అర. కాం.- 3 ఆ., 255 ప.

ఇట్టి భావము 'అగ్నిప్రవేశ' సందర్భమునను[1] భూదేవి యొడిలో నొదుగు[2] సమయమునను సీత తన పతివ్రతాత్వలక్షణముల కనుగుణముగా ప్రతిజ్ఞ సలిపి నిరూపించుకొనిన వైఖరితో సంవదించుచున్నది. నిర్వికల్పయోగ లక్షణ మిందు సూపపాదితమైనది. సీత తపస్విని యగుట సూచింపఁ బడినది.

సీత యశోకవనమున శత్రుసర్గ మగు రాక్షసీ జనమధ్యమున నుండి 'భయశోకములు నెమ్మది దందడింప పతిదైవము'ను స్మరించుచుండె నవి వాల్మీకమునఁ గలదు.

పతిం స్మరంతీ దయితంచ దైవతం
విచేతనాభూద్భయ శోకపీడితా - అర. కాం.- 56 స., 36 శ్లో.

శ్రీరామకథాऽమృతమున నట సీత 'స్వమతి రామాఖండాద్వైత ప్రసక్తి కలనఁ జెలంగ' నున్నదని చెప్పి మఱియు,

పలుకుఁ రాముఁ బలుకు, భావంబు మున్నె త
న్మయము, కృతికివేఱెనయము కలదె
యొండువృత్తి యనుచునుండ దా యమ దెసఁ
బ్రాణములును రాముపాలి వగుట

అని యామె వ్రతశీలముల విశేషముగా నుగ్గడించుట పాత్రచిత్రణమునకు దీప్తి నొసగుచున్నది. రాము ననువ్రతయై భజించు నామె 'మనము వాక్కును దనువుఁ దన్మయము లగుచునుండు' టను నిరూపించుచున్నది.

1. వా॰ రా.- యు. కాం.- 119 స., 24-7 శ్లో॥లు
2. వా. రా.- ఉ. కాం.- 97 స., 14-7 శ్లో॥లు

అశోకవనమున రావణుఁడు రాక్షసీజనమధ్యమున 'నూరువులచే నుదరమును, బాహువులచే బయోధరములను గప్పుకొని కూర్చుండి దుఃఖించుచున్న సీతను గాంచె' నని వాల్మీకమునఁ గలదు.

ఊరుభ్యా ముదరం ఛాద్య బాహుభ్యాంచ పయోధరౌ
ఉపవిష్టా విశాలాక్షీ రుదతీవరవర్ణినీ
దశగ్రీవ స్తు వైదేహీం రక్షితాం రాక్షసీగణైః
దదర్శ - సుం. కాం.- 19 స., 3, 4 శ్లో॥లు

శ్రీరామకథా మృతమున నయ్యెడ సీత 'చిత్త దుర్గమున నున్న రాముని రక్షణమున ధైర్యము వహించి స్తనోదరోద్దామ నిధిని' దాచికొన్నట్లుగా వర్ణించుట మనోహరము.

రామునిఁ జిత్తదుర్గమున శక్తిమెయిన్బలు కాఁపు సేసి యా
రామమహీజము ల్తనదు రాయిడిఁబాపఁగఁ దోడునీడలుం
గా మహిళాశిరోమణి వికామధృతిశ్రితయై స్తనోదరో
ద్దామనిధి న్భుజోరువృతి దాఁచి వివేచిత తత్త్వసారయై

అని, మఱియు

'రామకథాఽమృత సేవ సి
రామయమై యేకలక్ష్యయౌ వృత్తి మహా
శ్రీమహిత యగుచుఁ దనరఁగ

— సుం. కాం.— 2 ఆ., 23, 24 ప॥లు

నామహిసుత' యున్నదనుటలోఁ నెంతయు నౌచిత్యము సంతరింపఁ బడినది. ఆమె యుత్తమ గృహిణి పతివ్రతలలోఁ బతివ్రత.

వాల్మీక్యాశ్రమమున ముని సీతను గూర్చి తాపసాంగనలతోఁ జెప్పుచు "మీతపమ్ములు సఫలము లైనతలాఁ! చేరఁదెచ్చితినిదిగో తత్సిద్ధిఁ గొనుఁడు" (ఉ. కాం. ఉ. భా. 2 ఆ. 259 ప.) అనినట్లు వర్ణించుటంజేసి పాత్రచిత్రణమునఁ బరమోత్కృష్ట స్థాయి సంపాదింపఁ బడినది.

**లక్ష్మీత్వము** : సీత లక్ష్మిగా రాముఁడు నారాయణుఁడుగా వాల్మీకమున దేవతలచే నిట్లు కీర్తింపఁబడినారు —

> సీతాలక్ష్మీః భవాన్ విష్ణుః దేవః కృష్ణః ప్రజాపతిః
> వధార్థం రావణస్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్
>
> - యు. కాం.- 120 స., 28 శ్లో.

శ్రీరామకథామృతమున నామె లక్ష్మీత్వమును నిరూపించినవిధ మిట్లు వర్ణితమైనది.

విష్ణుని యోగమాయ వేదవతిగా జన్మించి రావణునిచేఁ బరాభూతయై లంక వినాశమునకై యటఁ దామరకొలనులోఁ బాలికారూపమునఁ బొడమినది. అది చూచి రాముఁడు గురుల యనుమతిని నొక మందసములో నామె నిడి సముద్రమున విడిచినాఁడు. సముద్రుఁ డంతఁ దన యూర్మి హస్తములతో నెత్తి లాలించి యామెఁ దన కన్యగాఁ బ్రకటించినాఁడు. ఆ పేటిక యొడ్డు జేరి జనకరాజధాని చెంగట భూమిలో నొదిగి నిలిచినది. అనంతర మామె జనకుని యజ్ఞభూమి నాతని తపఃఫలముగా లభించినది.

> అన్నులమిన్న పెట్టె యిటులంబుధిలోఁబడ నూర్మిహస్తముల్
> గ్రన్నన సాఁచి యాతఁడెద గారవమూరఁగ లేవనెత్తి మై
> మిన్నొరయం బ్రహర్షగతి మేకొన బిట్టుగ్రమోసె నీమె నా
> కన్నియ యంచుఁ దెల్పవహి గ్రచ్ఛల నచ్చపడం దలోదరీ
>
> అబ్ధి పుత్రి యనుచు నటువాటి మిన్నేటి
> తరఁగ లొలసి పేటిదరికిఁ గూర్ప
> దాన జనక రాజధాని చెంగటి రత్న
> గర్భ గర్భరత్న కలనఁ గదిసె
>
> - బా. కాం.— 4 ఆ., 126-7 పఁలు

ఇట్టి వర్ణనము సీత సముద్రరాజ కన్య యగు లక్ష్మిగా నిరూపించుచున్నది.

యౌవనోదయమున సీత 'వాసంత సమయజృంభిత వాసంతిక నాఁగ' మాధవాశ్రయణాసక్త లతాంగియై భాసిల్లి న దనుట మనోజ్ఞము. మాధవుఁడు విష్ణువు. అతని నాశ్రయించునది లక్ష్మి యనుట వ్యంగ్యము. ఇట్టియెడ నామె హరి తదాత్మత పొల్చిన విధము వర్ణించుట యామె లక్ష్మీత్వమును బ్రతిపాదించుచున్నది.

( బా. కాం. 4 ఆ. 190 ప. )

ఇందు విశేషణము లన్నియు శ్లిష్టములై విష్ణుపరముకాఁగా లక్ష్మీ నారాయణులగు సీతారాముల సర్వకాలైకత్వము నిరూపింపఁబడినది. అట్లే —

చెలువు శ్రీపదంబు చెయ్వు లనంతంబు
లచ్యుతంబు భావ మాననంబు
విధుమయంబు చిత్తవిధము సంవిత్ప్రథ
మజితకీర్తి యరయ నబలమూర్తి

- బా. కాం.— 4 ఆ., 273 ప.

అనియు సీతను సంభావించుట హృద్యము.

జనకునితో నారదుఁడు సీతారాముల నిత్యసంబంధమును గూర్చి వాగర్థాను బంధముగాఁ జెప్పుటయు నీవిషయమునే ప్రతిపాదించుచున్నది. పాత్రచిత్రణమునఁ గవుల ప్రత్యేకదృష్టి కిది నిదర్శనము.

ఆమె యెపుడుఁ బాయ దచ్యుతు నచ్యుతుం
డామె నెపుడు బాయఁ డాదరమున
వారి యోగగరిమ వరలు వాగర్థాను
బంధ మెట్టులట్టులె పార్థివేంద్ర! - 4 ఆ., 259 ప.

మఱియు సీతావయవ సౌందర్యసృష్టి విషయమున విధాత నైపుణ్యమును గూర్చి యచ్చరలు, విబుధులు పలువిధములఁ జర్చించిన విధ మామెను లక్ష్మిగా నిరూపించుచున్నది. ( బా. కాం. 4 ఆ: 235, 238 ప॥లు )

సీతారాముల వివాహసందర్భమున కల్యాణమండమున కేగు బొండ్లి కుమారులఁ గాంచు నొయ్యారులు రాముఁబతిగాఁ బడయుచున్న సీత సౌభాగ్యము నెన్నుచు రాముని విష్ణువునవతారముగా, నామెను లక్ష్మి-అవతారముగా సంభావించుట మనోహరము. (బా. కా. 4 ఆ. 315 ప.)

లోకమున వధూవరులను లక్ష్మీనారాయణులుగా సంభావించుట పరిపాటి. జనకుని భాగ్యము నెన్నుచు సాక్షాల్లక్ష్మినే హరికిచ్చు నదృష్టవంతుఁడుగా నాతనిఁ జెప్పుట సీత లక్ష్మిత్వమునే నిరూపించుచున్నది. (బా. కాం. 10 ఆ 368 ప.)

**మూలప్రకృతిత్వము :** రాముఁడు సచ్చిదానంద స్వరూపుఁడు, నవ్యయుఁడు నగు 'పరబ్రహ్మ' కాఁగా సీత సర్వకార్యనిర్వహణ ధురంధర యగు మూలప్రకృతిగా శ్రీరామకథాఽమృతమున నిరూపింపఁబడిన విధ మిటఁ బేర్కొనఁ బడుచున్నది.

జనకుని యజ్ఞభూమి నాగేటిచాలునఁ దొరకిన మందసము నందలి బాలికను గూర్చి చెప్పుచు నామె 'తనయజాండ ప్రసూత్వంబు దాచి కన్నె మిన్నయై దోఁచె' నని వర్ణించుట సీత మూలప్రకృతి యనుటను నిరూపించుచున్నది. (బా. కాం. 4 ఆ. 132 ప.)

సీత బాల్యక్రీడావిశేషములు తదనుగుణముగనే వర్ణితములైనవి -
(బా. కాం. 4 ఆ. 156 ప.)

ఇందు ప్రకృతిపురుషుల కైక్యము గూర్చుట, భువనపాలన, బ్రహ్మాదులను బోషించుట, మాయాస్వరూపిణియై జ్ఞానమణినిఁ గప్పుట, తాను సదాశివరూపిణియై యుండి బ్రహ్మ, విష్ణు, రుద్ర, యీశానులతోఁ, గూడి పంచకృత్యపరాయణ యగుట సూచింపఁబడినది. (చూ. అమూలక తత్త్వోద్ఘాటనము)

**కౌసల్య, సుమిత్ర, కైకేయి పాత్రలు :** వాల్మీకిమహర్షి దశరథుని దేవేరుల పాత్రల నొక్కొక్క విశిష్ట లక్షణము గలవిగాఁ జిత్రించినాఁడు. సాహిత్యలోకముననే గాక వాస్తవిక జగత్తునందుఁ గూడ నా మూడు పాత్రలు బహుళచార ప్రసిద్ధులను బొందినవి. శ్రీరామకథాఽమృత కవులు మూలవిధేయము గనే యీ పాత్రలను దీర్చిదిద్దినారు. దశరథ పాత్రపోషణ నిరూపణ సందర్భమున

యీ మూఁడు పాత్రలను అనువాదకులు పోషించుటలోఁ జూపిన మెలకువలు నిరూపింపఁబడినవి.

**శాంత :** ఈమె రోమపాదుని కుమార్తె. ఋష్యశృంగుని భార్య. రోమపాదుఁ ఋష్యశృంగున కిచ్చి సంతుష్టాంతరంగుఁడైనాఁడని తెలుపు సందర్భమున నీమె వాల్మీకమున నామమాత్రముగాఁ జెప్పఁబడినది.

> అంతఃపురం ప్రవేశ్యాస్మై కన్యాం దత్వా యథావిధి
> శాంతాం శాంతేన మనసా రాజా హర్షమవాపసః
>
> — వా. రా.— బా. కాం., 32/2, 33/1 శ్లో.

శ్రీరామకథామృతమున నన్వర్థసంజ్ఞఁ యగు 'శాంత' ఋషిఁగొల్వనగు నుత్తమ గుణములు గల పరమసాధ్వీమతల్లిగా నిరూపింపఁబడినది. తండ్రి, పుత్రికఁ గూర్చి ఋష్యశృంగునితోఁ జెప్పుచు -

> రాచబిడ్డ నటంచు రాజసం బెనయదు
> మైత్ర్యాది గుణలక్ష్మి మలయుఁగాని
> సుందరీమణినంచుఁ జులకసేయ దొకండ్ల
> సొరిది యోగ్యతకె తాఁజొక్కుఁగాని
> యైశ్వర్య మొదవెనం చటువిటుఁ జూడదు
> గురుల శుశ్రూషింపఁ గోరుఁగాని
> సుకుమారి నంచు నుస్సులుగొట్టఁ దలపెట్ట
> దోపినంత లొనర్చి యొదుఁగుఁగాని
>
> విద్దెల రహస్యమరసియు విఱ్ఱవీఁగ
> దరున మెదవిండ నుల్లాసమందుఁగాని
> శాంతయను సంజ్ఞఁ కర్హ యీసాధ్వి యిదియ
> నీకుఁ దగునయ్య నెయ్యంబు నెరపుమయ్య
>
> — శ్రీ. రా. క.- బా. కాం., 1 ఆ., 501 ప.

అని ప్రార్థించినట్లు వర్ణింపఁబడినది.

మూలమున నామమాత్ర యగు శాంత ప్రకృతి కూపిరిపోసి ప్రత్యక్షముఁ గావించి కవుల నూతనాకృతి సిద్ధింపఁజేయుట వారి యనల్పకల్పనా శిల్పమున కుదా హృతిగా నెన్నదగియున్నది. 'ప్రపంచిత గుణాఢ్య' యగు 'శాంతఁగీర్తి లతానమాక్రాంత దశదిశాంత'గా వన్నెకెక్కి కవిసృష్టిలో శాశ్వతమైనది.

అహల్య : ఈమె గౌతముని భార్య. హల్య యనగా వికారము. ఎట్టి వికారములేనిది గావున యీమె అహల్య యని సార్థకనామధేయ యైనది. ఎందరో దిగధీశులు కోరినను బ్రహ్మ వారి కీయక తపోధనుఁడగు గౌతమున కీమె నిచ్చి సంభావించినాఁడు. స్మరణమాత్రముచేతనే మహాపాతకనాశనముఁ జేయు పంచకన్య లలో నీమె యొకతె శ్రీరామకథామృతమున గౌతముఁడు 'అహల్యను శిలవుగమ్మ'ని శపించినట్లు గలదు. ఈమె శిలయైన విధమింపు మనోజ్ఞముగ వర్ణింపఁబడినది.-

ఇతర కవులనేకులు తమ కావ్యముల నహల్య శిలారూపమును విడిచి చైతన్యమును గైకొనినవిధము వివరించిరిగాని యిట నామె శిలయైనక్రమము వర్ణించుట విశేషము. (బా. కాం. 7 ఆ. 79 ప.)

రాముఁడయ్యరణ్యమునఁ దపస్తేజమున నొప్పుచున్న యహల్యను గాంచి నట్లు 'దదర్శచ మహాభాగాం తతసా ద్యోతితప్రభామ్' అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథామృతము నందు ప్రసంగము వలన తన దుర్దశతలఁగఁ దారకమె (రామనామమె) శరణ్యమని తెలిసి మునితఁ బ్రతీక్షించుచున్నదో యన్నట్లున్న యహల్యను గాంచినట్లు వర్ణింపఁబడినది. అది 'సకలేశ కృపాప్రాపక సమాధి యోగము'. అట్లామె గావించిన ప్రతీక్షణమే యోగమై యంతఃకరణశుద్ధి యేర్పడి రామ ప్రసాదభాజనమైన దనుటంజేసి పాత్రపోషణమున నుదాత్తత, పరిపూర్ణత సిద్ధించినది. (బా. కాం. 7 ఆ. 86 ప.)

అహల్య రామపాదరజము సోక శాపవిముక్తి నంది నిజరూపమును దాల్చి వారికి నగపడవచ్చినట్లు 'శాపస్యాంత ముపాగమ్య తేషాం దర్శనమాగతా' అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథామృతమున రాముని ప్రసాదమున నామె 'ముని తపస్సిద్ధివోలె' మెఱయుచున్నదనుట యౌచిత్య భాసురము. అట్టిసందర్భమున నవయవము లన్నియుఁ దపోనువర్తనములగునట్లు వర్ణించుట విశేషము.

రాజయోగ నిరూఢి రాజిల్లె నెమ్మోము
　　దృక్కలాకలనఁ బెంపెక్కెఁ గనులు
రసనిర్ణయ స్ఫూర్తి రహిమించెఁ గెమ్మోవి
　　చెలఁగె భక్తిత్రయాకలనఁ గంఠ
మచల బోధాస్పదంబై యొప్పెఁ జనుదోయి
　　దృశ్యమిథ్యాత్వంబుఁ దెలిపె నడుము
గురుమహత్త్వాప్తిఁ బేర్కొనె నితంబపదంబు
　　నిరతిశయశ్రీల నెగడె నంఘ్రు
లమితకల్యాణవైభవం బందె మేను
దృష్టిఁగనె శోకబంధంబుఁ ద్రెంచి యాత్మ
ముని తపస్సిద్ధివోలె రాముని ప్రసాద
మున మెఱయు నాసతీరత్నమునకు సాధ్వి

- బా. కాం.- 7 ఆ., 106 ప॰

**అనసూయ :** ఈమె యత్రిమహర్షి సహధర్మచారిణి. త్రిమూర్తుల వర్భకులఁజేసి వినోదించిన పతివ్రతామతల్లి. సీత నౌశీల్యమును బెంపొందించుటకీమె పాత్ర యుపకరించుచున్నది. ఆశ్రమమున 'శిథిలమై ముడుతలు వడిన శరీరముతో నెఱసిన వెంట్రుకలతోఁ బెనుగాలికిఁ జలించు కదళికవలె నున్న వృద్ధురాలు పతివ్రతా శిరోమణి యగు ననసూయను జేరి సీత నమస్కరించి సేవించినద' ని వాల్మీకమునఁ గలదు.

శిథిలాం వలితాం వృద్ధాం జరా పాండుర మూర్ధజామ్
సతతం వేపమానాంగీం ప్రవాతే కదళీయథా
తాంతు సీతామహాభాగా మనసూయాం పతివ్రతామ్
అభ్యవాదయ దవ్యగ్రా స్వనామ సముదాహరత్

- అయో. కాం.— 117 స., 17, 18 శ్లో॥లు

శ్రీరామకథా ఉమృతమున 'ముదిమి వలవనరసిన మూర్ధజము లామె శుద్ధజీవన వృత్తినిఁ జెప్పుచున్నవనియు, శిథిలితావయవ సంశ్లేషమెల్ల జీవితము యొక్క

పరిణామదశను దెల్పుచున్నదనియు, శరీరమున నెల్లడ నేర్పడిన ముడుతలు తపస్తరంగముల నుడువుచున్నవనియుఁ, బెనుగాలికిఁ జలించు కదళి వలెఁ జలించుట పాపభీతత్వ సంపదను వచించుచున్నదనియు 'అనసూయ' సార్థకనామధేయ యనియు భర్తృదేవత యగు ననసూయను వర్ణించుట నిసర్గసుందరము. ఇట్టియెడఁ గవి మూలమునకు మెఱుగిడినాఁ డనుట యత్యుక్తికాదు.

ముదిమిమై నరసిన మూర్ధజమ్ముల యొప్పు
ఋద్ధజీవనవృత్తి చొప్పుఁ జెప్ప
శిథిలితావయవ సంశ్లేషం బశేషంబు
పరిణామమునఁ గాంచు పాటుదెల్ప
వలనెంచి యెల్లడ వలగొన్నవళికలు
కలిత తపస్తరంగముల నొడువఁ
గలుగు ప్రవాతపుం గదలిక కదలిక
పాతభీతత్వసంపద వచింప
నెగడు నిరసూయ విశ్రుత నిర్మలాత్మ
భర్తృదేవత నమ్మహాభాగఁ గాంచి
సీత సువినీత సన్నిధిఁ జేరి మ్రొక్కెఁ
దన మహిత నామధేయ ముదాహరించి
— అయో. కాం. - 10 ఆ., 85 ప.

ఇంతటి మహిమాస్పద కావుననే 'తాపసేపతి తన ప్రసాదమున సాధ్వి మంగళాయ నొనరించి' మమత నించినది. సీత 'సర్వతోవృద్ధ నాయమ సంస్తుతించి' చరణయుగళి కంజలిపుటి సంతరించి' ప్రహృష్టయైనదని చెప్పుచు 'తాను సిరియై యుండి సిరులకు సిరులైన యామె పాదసేవ లొనర్చిన విధమిట్లు వర్ణించుట వలన ననసూయ పాత్రచిత్రణమున మహౌన్నత్యము సంపాదింపఁ బడినది.

తరియించె నఘాబ్ధిని సం
తరించె సామ్రాజ్యపదవిఁదరుణీమణి దా
సిరియైన నేమి నెట్టన
సిరులకు సిరులామె పాదసేవలకావే
— అయో. కాం. - 10 ఆ., 87 ప.

**తృణబిందుని పుత్రి :** స్త్రీ పాత్రలలో తృణబిందుని పుత్రి పాత్ర అనువాదములోఁ బ్రత్యేకదృష్టితోఁ దీర్చిదిద్దఁబడినది. తృణబిందు మహర్షి తనయను వెంట నిడుకొని పులస్త్యునిఁ జేరి కన్యాభిక్ష పరిగ్రహింపు మని వేడుచు నామెను గూర్చి 'గుణాలంకారభూషిత' గాఁ జెప్పినట్లు —

భగవం స్తనయాం మే త్వం గుణై స్స్వైరేవ భూషితామ్
భిక్షాం ప్రతిగృహా ణేమాం మహర్షే స్వయ ముద్యతామ్

అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథామృతమున నామె గుణగణములను వివరించుచు —

పలుకుల వెలదినాఁ బలుకనేర్చునకాని
నెదిరి మార్మాటల నెఱియఁజేయ
దుఃఖమువోకకుఁ బ్రాంత మెనసి విల్చునకాని
బొరుగిల్లు ద్రొక్కఁగా బోవదెపుడు
నతిథి పూజలొనర్ప నలరారుకాని
పరులవంకకుఁ జూడ్కి పరఁగనీదు
దైవకృత్యములకుఁ దలయొగ్గునేకాని
కాని కర్జంబులఁ గడపఁ బోదు

నిత్యనిర్మలహృదయ వినీత సదయ
యబల సుందరమూర్తి నృత్యార్థవేత్రి
యాఢ్యశీలాభిమాన శస్త్రాభిధాన
నీకుఁ దగునయ్య సంప్రీతి నెఱపుమయ్య

— ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 151 ప.

అని వర్ణించి యిట్టి సద్గుణరాశి నీకన్ని విధములఁ దగియున్నదని నుడువుచు బాల భాస్కరుఁడ వగు నిన్నుఁ బడసి యిప్పద్మిని సమసుఖదుఃఖయై నెగడును. తపస్వి

చంద్రుఁడవైన నిన్నవిలి యీరోహిణి కలాభివృద్ధి వన్నెకెక్కును. బ్రహ్మమూర్తి వగు నీదు ప్రాపున నీవాణి విద్యాభిమానభోగముల ననుభవించును. అగ్ని తేజావి నిన్నుఁగూడి యీస్వాహా యిష్టిపుష్టుల సముత్కృష్ట యగును. మునిహరి వగు నీ యెద నిచ్ఛలనుసరించి యీలక్ష్మి కల్యాణనియతవృష్టి నెఱపును. సంయమీశ్వరుఁ డవగు నీతోడి సంయమమున నీయార్య త్రిభువనవంద్యయై వఱలు ననుట హృద్యము. ఈమె సర్వవిధముల ననపాయినియై పతి ననుసరించు ననుట పరమార్థము. ఇట్టి దేవతాత్మ భావనచేఁ బవిత్రత మాన్యత వెల్లడియగుచున్నవి. (ఉ. కాం. పూ. భా. 1. ఆ., 153 ప.)

ఇట్టి యపూర్వ పాత్రచిత్రణము మూలాతిశాయి యగు సౌందర్యమును సంతరించుకొనినది. పులస్త్యుని సంభావించినతీరు మనోజ్ఞము. అట్టిది పాత్ర కుత్కృష్టతను గల్పించు విశిష్టపద్ధతి. మఱియు 'నామె స్వీయగుణములఁ బతిని సేవించి సంతోషమెనయఁ జేసినది. ఆతఁ డామె శీలవృత్తముల సంతుష్టుఁడైనాఁడు అని వాల్మీకమునఁ గలదు.

సాఽపి తత్రావస త్కన్యా తోషయ న్తీ పతిం గుణైః
తస్యాస్తు శీలవృత్తాభ్యాం తుతోష మునిపుంగవః
— వా. రా. - ఉ. కాం., 2 స., 30 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నామె పతిసేవ సలిపిన విధము, నందుల కాతఁ డానందించి యాదరించిన క్రమముఁ దెలుపుట వలన సమగ్రతతోఁబాటు సముదాత్తత సంపాదింపఁ బడినది.

పతిపాదములఁజూడ్కిఁ బరగించుఁ బ్రొద్దు వో
ద్దున నద్దునట్లు లోచనయుగమున
నప్పుడె శుచియై గృహార్థంబు లొనగూర్చి
కూర్చు తపోవస్తుకోటు లొకట
నవలఁ బూజావిధి కలరార్చు నన్నియు
నిష్ట మృష్టాన్నంబు లెనయఁజేయుఁ

బరిషేచనమొనర్చి భర్తయు నతిథులు
భుజయింప వీవన ల్పొనరవీచు

గడగి కరములు చరణము ల్గడిగి వార్చి
యటునిటుఁ బరిక్రమించెడు నంతలోనె
వేగ సాపడి శుశ్రూష నాగమించు
మించుబోడి మును ల్మేలు మేలనంగ

శయనమొనరఁగూర్చు జాడ తపంబున
కొ తెలంగు సుశ్రుతాదరంబు
నోగిరంబు వెట్టు నోజ మేనలయ నీ
కరయుటయును దలఁచి యమి వరుండు

తన తపస్సిద్ధియే యిట్లు తనరనోపు
ననుచు మది మెచ్చి హర్షాత్ముఁడైపొనర్చి
యాదరము దళుకొత్తంగ నబలఁగాంచి
యేకతమ్మున విట్లనె నినకులేంద్ర

— ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 159-61 పాలు

భర్తృశుశ్రూష, యతిథిసపర్య మొదలుగాఁగల నుత్తమ గృహిణీధర్మమిట సునిపుణముగాఁ బ్రతిపాదింపఁబడి పాత్రౌన్నత్య ముగ్గడింపఁ బడినది. అట్టి సతి సేవలకు మురియని పతి లోకమున నెవ్వఁడుండును ? 'తన తపస్సిద్ధియే యిట్లు తనరనోపు ననుచు'ఁ దలపోయుటయే విశేషము. సర్వులకు నిది సాధ్యము కాదు.

ఈ విధముగ ననువాదకులు రామాయణము నుండి ప్రధానముగఁ బాత్రలను గ్రహించి యపూర్వ శిల్పముతోఁ దీర్చిదిద్దినారు. ఇట్టి పాత్రచిత్రణ విధానము కావ్యసౌందర్యము నినుమడింపఁజేయుచు నీ కవుల ప్రతిభాసంపదను వెల్లడించుటకు సమర్థమగుచున్నది.

---

కవిః కరోతి కావ్యం, రసం జానాతి పండితః
తరుః సృజతి పుష్పాణి, మరుద్వహతి సౌరభమ్ ॥

## రసపోషణము:

'రస్యతే ఆస్వాద్యతేఽయం రసః,'[1] 'రసనాద్రసః'[2] మొదలుగాఁ గల యాలంకారికుల లక్షణము ననుసరించి కావ్యప్రతిపాదితార్థము ననుభవమునకుఁ దెచ్చునది రసము. అట్టి రసము కావ్యమునకు మిక్కిలి ప్రధానమైనది. వస్త్వలంకార రసధ్వనులలో రసధ్వని గొప్పదని సాహిత్యవేత్త లందఱు నంగీకరించి యున్నారు. అట్టికావ్యమే ఉత్తమమైనదని కీర్తింపఁబడుచున్నది. 'వాక్యం రసాత్మకం కావ్యమ్'[3] అనుటయు నీవిషయమునే సమర్థించుచున్నది. కావ్యమున బ్రహ్మానంద సబ్రహ్మచారి యగు రసానందము సర్వులకు ననుభవయోగ్య మగుట ప్రసిద్ధము. అవికల్పక మగు బ్రహ్మానందము కంటె సవికల్పకమై తన్నుదాఁ దెలిసి యనుభవించు కావ్యానందమే గొప్పదని యాలంకారికు లంగీకరించినట్లు శ్రీ వేంకటప్పయ్య శాస్త్రి గారు తమ పీఠికలో 'బ్రహ్మానందాదప్యతిరిచ్యతే కావ్యరసః' అని యుదహరించిరి. 'వేదశాస్త్రాధ్యయన యోగాభ్యాసముల యందలసులైన సుకుమారబుద్ధులకు కావ్యము ముక్తిహేతు వగు న'ని భరతుని నాట్యశాస్త్రము బోధించు చున్నది.[4]

'రసోవై సః'[5] అను ఉపనిషద్వాణిని 'భగ్నావరణ చిద్విశిష్టమగురసము'[6] గా నాలంకారికులు నిర్వచించిరి.

తిక్కన భారతమున 'నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వ'[7] మిత్యాదిగా రసప్రశంసఁ గావించినాఁడు. మఱెందరో 'ఘనరస పాత్రశోభితము'గాఁ దమ కావ్యముల నలంకరించిరి. 'నవకథాఽద్యుతివి మించి రసము వేయిరెట్లు గొప్పది'[8] అని ప్రాచీనార్వాచీన ప్రాచ్య పాశ్చాత్యకవు లభిప్రాయపడినట్లు విశ్వనాథ వారు వాకొనుట

---

1. కావ్యాలంకారః - రుద్రటః
2. శృంగారప్రకాశః - భోజః
3. సాహిత్యదర్పణము - ప్రథమ పరి., 3 శ్లో.
4. నాట్యశాస్త్రమ్ - భరతః
5. తైత్తిరీయోపనిషత్ - సప్తమానువాకము, 6 వ వాక్యము
6. ర. గం.- ప్ర. ఆ., 96 పు.
7. ఆం. మ. భా., వి. ప., 1 ఆ., 7 ప.
8. రా. కల్ప.- బా. కాం.,

గమనార్హము. ఇట్టి రసము పెక్కు రాలంకారికులచే నవవిధములుగా నంగీకరింపఁ బడినది.

శృంగారః కరుణః శాంతః రౌద్రో వీరోఽద్భుత స్తథా
హాస్యో భయానక శ్చైవ బీభత్సశ్చేతి తే నవ - ర. గం., పు. 131

శృంగార హాస్య కరుణా రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యే రసా స్మృతాః
- నా. శా.- 6 అ., 15 శ్లో.

వాల్మీకి రామాయణము మహాకావ్య మగుట నందన్నిరసములు సుసంపన్నములై నవి.

రసైః శృంగార కరుణ హాస్య రౌద్ర భయానకైః
రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్య మేత దగాయతామ్
— వా. రా. - బా. కాం., 4 స., 9 శ్లో.

శ్రీరామకథాఽమృత కవులుఁ దమ కావ్యమునఁ దత్తద్రసములఁ జక్కగాఁ బరిపుష్ట మొనరించిరి. వసంతఋతు వర్ణన సందర్భమున -

అప్పటి కప్పుడు సౌఖ్యం
బుప్పతిలుంగాక కొఱతలుండునె యదియే
చిప్పిలు రసవైభవమన
నొప్పగు మఱి భాగ్యవంతు లొనరికఁగనరే
- బా. కాం.- 2 ఆ., 71 ప.

అవి రసవైభవమును గూర్చి ప్రశంసించుచు నది 'సద్యః పరనిర్వృతి' కి హేతుభూత మగుట నిరూపించిరి. ఇయ్యది తమ కావ్యప్రశంశయునగుట సంస్తుత్యము. బహుభావ శబలితము, వివిధ రససంభరితము నగు శ్రీరాముని చరిత ముత్తమకావ్య మగుట వీరును తమ కావ్యమున రాముని 'నవరసాలంకృతి విశేషనాయకుని' గాఁ గీర్తించిరి. ఏ యే ఘట్టముల నే యే రసములు పోషింపఁబడినవో, తాము సంభావించినవిధము వివరించుచు పట్టాభిరాముని -

జిలుఁగు నవ్వులపంట సిరి నేలకన్నియ
తోడి సింగారమ్ము తొడవుగాఁగ
రావణారీ! యంచు రహిఁబెంచు వందుల
నుడినంచు వీరమ్ము నొడువుచుండ
మునులపాలిటి లిబ్బి మొగసాల యగు గోష్ఠి
తలఁపులఁగరుణ నేస్తమ్మెలర్పఁ
జుప్పనాతి యనీతిచొప్పారు నప్పాట
హాస్య భీభత్సమ్ము లడరుచుండ
నబ్ధిశోషణ కథ రౌద్రమచ్చుపడఁగ
స్వీక యధర్మ భీరుత భయానకముఁజూప
శాంతుఁడు గుణాద్భుతుఁడు రామచంద్రుఁ డొప్పె
నవరసాలంకృతి విశేషనాయకుఁడుగ

- యు. కాం.— ఉ. భా., 2 ఆ., 576 ప.

అని వర్ణించుట రమణీయము. అట్లే పట్టాభిషేకోత్సవానంతరము రాముని వీడ్కొని తమ తమ నెలవులకేగు వానరులు రామావనీశు చరితము నందన్నిరసములుఁ గలవని తలపోసినట్లు వర్ణింపఁబడినది. ఇయ్యవి కవి స్వీయములగుట సంభావనీయములగుచు నాత్మీయతఁ బ్రకటించుచున్నవి.

అన్ని రసములు గలవు రామావనీశు
నడవడులలో నటంచు గోన మెకము లటు
లనుభవంబులకుం జొచ్చి యరసి యరసి
సంతసింపఁ దొడంగిరి సారసాక్షి

సీతాసమేతుఁడౌ శ్రీరామచంద్రుని
సింగారమేమనఁజెల్లు ననుచు
సాగరాంతరితుఁడౌ శాత్రవు గోరాడ
ఖైనుఁబడఁడెంతటి వీరమన్నుచు

దన బాణమునఁ గోణమునకు లక్ష్యంబైన
యంబుధిపై రౌద్రమడరె ననుచు
నల రావణుని తల లటునిటు జూడక
త్రుంచిపోయు బె మహాద్భుతమటంచు

హాస్యమా చుప్పనాతి యాన్యమున భయము
వింట భీభత్సమని నేల వెలయు ననుచు
నెక్కడెక్కడి కరుణంబు నేకమగుచు
వచ్చి మముఁజెందె నేడంచు వారు వదిరి

— ఉ. కాం.- పూ. భా., 10 అ., 228-29 ప॥లు

**శృంగారము** స్త్రీపురుషుల యన్యోన్యాలంబన మగు ప్రేమాఖ్య చిత్తవృత్తి విశేషమైన రతి స్థాయిభావముగాఁ గలది శృంగారము. 'స్త్రీపుంసయోరన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తి విశేషోరతిః స్థాయిభావః'[1] అనునది యాలంకారిక లక్షణము. ఇట్టి శృంగారము సంభోగము, విప్రలంభము అను భేదములతో రెండువిధములఁ జెప్పఁబడుచున్నది. స్త్రీపురుషుల సమాగమమునకుఁ బూర్వమందున్న రాగము 'అభిలాష శృంగారము'గా నెన్నఁబడుచున్నది. సంభోగానంతరము నాయికానాయకులకుఁ గలిగిన యెడబాటు విప్రలంభము. విప్రలంభమున నీర్ష్యాసూయ, ప్రవాస, శాపాది కారణములచేఁ బెక్కు అవాంతరభేదములు వర్ణితములైనవి. పరప్రహ్లాదన సమర్థమగు నీ శృంగారము మధుర మనుట సత్యము. సృష్టి సమస్తమునకు శృంగారము మూల మగుట దాని ప్రాధాన్యముఁ దెలియవచ్చుచున్నది.

రామకథ యందు సీతారాములు ప్రధాన నాయికా నాయకులు. వారి నడుమ నడచిన యితివృత్తము శృంగార రస బంధురము. సీతారాములు లోకమునఁ బవిత్ర మగు నాదర్శదంపతు లగుట ప్రసిద్ధము. శ్రీరామకథాఽమృతమున నట్టి శృంగారముఁ జక్కగా వర్ణింపబడి పరిపుష్టమైనది.

**అభిలాష శృంగారము :** విశ్వామిత్రుని వెంట మిథిలకు వచ్చిన రామ లక్ష్మణులలో రామునిఁ గూర్చి యాత్మసఖుల వలన వినిన సీత రామ ప్రతికృతికల

---

1. ర. గం.- ప్ర. అ., పు. 141

నయుఁ గాంచి హరి నవీనావతారముగా నిశ్చయించి నెమ్మదిఁ గోర్కెలు దండడింప వివిధ భంగులఁ దలపోయుచు రాముని యందు గల యనురాగమున మనసిజ దశల ననుభవించినది. (బా. కాం. 8 ఆ 57-8 పగులు)

తన్ననునయించుచు వేడుకొను చెలులకు నదే యభిప్రాయము దెలియఁ జేసినది.[1] అంత నామె తన్ను బాధించుచున్న చంద్ర, మన్మథ, మలయానిలముల ను పాలంభము గావించినది. చెలులు శైత్యోపచారములు సలిపి సేదదీర్చినారు.[2] రాముఁడును లక్ష్మణునితో ముచ్చటించుచు ధనుర్మింషబున సీతావిషయకానురాగంబు వెల్లడించినాఁడు.[3]

ఇట్లు సీతారాముల పూర్వరాగము స్వతంత్రముగా శ్రీరామకథామృతమున వర్ణితమైనది. అట్టియెడ నిరువురకు శుభశకునములు దోచినవి.

> దక్షిణాక్షి భుజోరువుల్దా శరధికి
> నెట్టు లటు వామములె స్పంద మెనసె సీత
> కఖిల భావిఫల ప్రకారైక లక్ష
> కములు శకునము లవి సూచకములు గావె
>
> బా. కాం. 8 ఆ., 197 ప.

రాముని శివధనుర్భంగ సమయమున సభలో సీతాప్రవేశంబు నిరీక్షించు రామున కామె సౌందర్యము 'తలఁపులోనఁ దవిలియుంట నెద్ది యెదుటఁ బొనఁగనేనియు నది యకా' నాతనికుండె ననుట హృద్యము.[4] సీతను జెలికత్తెలు సభామండపమునఁ బ్రవేశపెట్టిరి. అట్టియెడ సీత 'మదనుఁడలుఁగుల 'పొది నుండి మఱువెడల్చి వింట సంధించి వెలుఁగుల వెలయనూఁది విడవ రాము నెదఁ గాడి వెలిఁదలిర్చు మోహనాస్త్రముగా'[5] నున్నదనుట మనోహరము. ఆమె సిగ్గుచే నతి ప్రయత్నమున రామునిఁ గాంచినది. ఆ సమయమున మదనుఁడు విజృంభించి సీతాసౌందర్య విభవ మాధార

---

1. బా. కాం. 8 ఆ., 63 ప.
2. బా. కాం. 8 ఆ., 43 - 143 పగులు.
3. బా. కాం. 8 ఆ., 172 ప.
4. ,, 9 ఆ., 168 ప.
5. ,, 9 ఆ., 199 ప.

ముగా గొని జగదేకవీరుఁడగు రాముని సాధనాంతర నిరపేక్ష జయించె నని వర్ణించుట హృదయంగమము. చెలి గేలినాఁగఁగూర్చిన భ్రుకుటి మదనుని మధ్యేధనుర్ముష్టి కాఁగా నామె మోముదమ్మిఁ గదల్ప మొరయుతేంట్లొగిఁదన నారి ఝూంకృతిమీఱు తీరుఁ దెలిపినది. ఆమె విప్పు కన్గవ వెల్లివిరియు చూడ్కులు తన యంపవాన నిగుడ్చు తెంపు వొడువుచున్నవి. నెరయు భూషణమణీ నిక్వాణములు దన భటజయేత్యాది కార్భటి గడించుచున్నవి. సీతయెడఁ గనుపట్టు చెలువ మంతయు తనదు దర్పోద్ధతిగ మాఱినది. ఇట్లాతఁడు రాముని జయించినాఁడు. ఇట శృంగారమునకు వీర మంగము నలంకారమునై యొప్పుచున్నది. (బా. కాం. 9 ఆ. 202 ప.)

మఱియు వివాహమంటపమున సీత సిగ్గుచే రామునిఁ జూచిన విధముఁ జెప్పుచు 'గన్నియల కన్గవల తొలికాన్పు చూపు తేటిపిల్లల దాటుటతోఁ బోల్చుట రమణీయము. సీతారాముల యనురాగ వీక్షణములు నేత్రావధాన కేళిగా వర్ణించుట యభిలాష శృంగారవర్ణనమునకుఁ బరకాష్ఠ.

తన యంఘ్రులకు సాధ్వి తనుపార మ్రొక్కిన
శిరమున నప్పాట సేనలిడుచు
నుచిత సంవాహనయుక్తిఁ బ్రేముడి సూప
ముఖచంద్రలక్ష్మి పై మోహపడుచు
నెదవ్రాలి నీదాన నేనంచు రుచిఁబెంప
నాసానఁ గౌగిట నలుముకొనుచుఁ
దఱివేచి మోము నేత్రమున కక్కఱపడ
గిలుకుటందెల నడి కలుకుగనుచు

నొలపు మెయిఁ గ్రిందుమీదుగా నొండొకండ్ల
కలికి చూపుల వ్యాపార గరిమమీఱఁ
దత్పరత గూర నేత్రావధానకేళి
సలిపె జానకితో రామచంద్రుఁ డపుడు
బా. కాం. 10 ఆ., 389 ప.

కనులు మనోభావమును బ్రకటించు మూగబాసలగుట లోకవిదితము. అట్టి కనులతో సీతారాము లవధాన కేళి సలిపిరి. చూపులతోడనే యెదుటవారి చూపులలోఁ గల భావము నెఱుంగుట నేత్రావధానము. నూతన వధూవరులగు సీతారాము లిరువు రొకరినొకరు కనులఁ బ్రియమారఁగఁ బలుకరించు కొనినట్లువర్ణించు టౌచిత్యసుందరము. సీత రాముని యంఘ్రులకుఁ దనుపారఁ జూపులతో నమస్కరించినది. పతి పదభక్తి తాత్పర్య మామె సాధ్వీత్వమును జాటుచున్నది. తనకు నమస్కరించిన సీత శిరమున రాముఁడు ప్రేమాభిషేక మొనరించినాఁడు. చూపులే యాశీర్వాదము లందించినవి; సీత సంవాహన యుక్తిఁ బ్రేముడి సూపఁగా రాముఁ డామె ముఖచంద్ర లక్ష్మిపై మోహ పడినాఁడు. సీత రాము నెదబ్రాలి నీదాననను భావముఁ బ్రకటింప రాముఁ డామెను జూపుల నాశతోఁ గౌగిట నలముకొనినాఁడు. అంత నిరువురు మోము నేస్తమును గోరుకొను సందర్భమున గిలుకుటందెల సవ్వడులు వారి కలుకుఁ గూర్చినవి. ఇట్లు వారు పరస్పరానురాగ సూచకములగు దృష్టులఁ గ్రిందుమీదుగా నొకరి నొకరు జూచుకొనుచు నేత్రావధానకేళి సలిపిరి. ఇది యంతయుఁ గవి స్వీయకల్పనాశిల్ప మగుట మధురము. ఇట్టిదివాల్మీకమున లేదు. సీతారామకల్యాణ ఘట్టమొక కావ్యకళాఖండముగా సంతరించుట ప్రశంస్యము.

**సంభోగశృంగారము :** నాయికానాయకులు ప్రీతితోఁ గలిసి యొక్క యెడ సుఖముగా నుండుట సంభోగశృంగార మందురు. రామాదుల వివాహానంతర మయోధ్య కేగి కొత్తకోడండ్రు తమ తమ భర్తలతోఁ గూడి సుఖించిరని వాల్మీకమునఁ జెప్పఁబడినది.

> రేమిరో ముదితాః సర్వే భర్తృభిః సహితా రహః
>
> - బా. కాం.- 77 స., 25 శ్లో.

శ్రీరామకథామృతమున నయ్యెడ సీతారాముల సంభోగశృంగారము మధురముగ వర్ణింపఁబడినది.

సీతాసరోజినీ శ్రీరాజహంసంబు
జానకీ వదనాబ్జ షట్పదంబు
పృథ్వీ సుతాధరబింబికాఫల శుకం
బవనిజా లతికాశ్రయ ద్రుమంబు
మైథిలీ మల్లికాస్మయ తపాగమము పై
దేహీ వయస్సరిద్దృప్తగజము
నిమి వంశవర్ధనీ నియమఫలము దేవ
యజన భూతానందనామృతంబు

రాముఁ డటు సహధర్మిణీ రాగవాహి
నీ మహోర్మి రసార్ణవం బామరాప్త
కామతా శ్రీముఖము హితకామ్య కౌము
దీ మహామునా నెగడె శైలదేవతనయ

\- బా. కాం.- 10 ఆ., 519 ప.

ఇట ప్రసిద్ధములగు కవిసమయములు పాటింపఁబడినవి. అన్నియు నిత్య సంబంధమున నలరునవి. ఇట్టి వర్ణనము పవిత్రాత్ములగు సీతారాముల యమలిన శృంగారమును, వారి యాదర్శ దాంపత్యమహిమమును జాటుచున్నది. ఇది కవుల సంయమనమును బ్రకటించు చక్కటి ఘట్టము. సహధర్మచారిణి యగు సీత ఛాయ వలెఁ దనతో నరణ్యవాసమునకు రాఁగాఁ బిత్రాజ్ఞ నెఱపుచు రాముఁ డడవి నయోధ్య కంటె వేయి మడుంగులు సుఖమనుభవించెను.[1]

**వియోగశృంగారము :** ఏదేని కారణముచే నాయికానాయకులకు వియోగము సంభవింప వారనుభవించు విప్రలంభమును వియోగశృంగార మందురు. కపటాత్ముఁ డగు రావణుఁడు సీత నెత్తుకొనిపోయినాఁడు. సీతారాములకు వియోగము సిద్ధించినది. లంక నశోకవనము నందు రాక్షసీ మధ్యమున నుండి సీత తన దుస్థితిఁ దలపోయుచు రాముని రాకఁగోరి 'నా జీవనాశంబు, నాథాంఘ్రిరాజీవమీ జన్మమునఁ

---

1\. అయో. కాం.— 8 ఆ., 44–9 పలు

గొల్చు టిరవుపడునె, సురశాఖి శాఖికల్సుందరాంగుని దండ లండగా మనునాటి యనువు గలదె' అని తలపోసి విలపించినది. అట్లే -

మొలక ముద్దులమూట నెమ్మొగము పిన్న
నగవుతోడివయగు ప్రాణనాథు మేటి
కమ్మని మృదూక్తులింక నా దిమ్మరిల్లు
చెనటిఁ చెవిదోయి వినఁగల్గు సిరియుఁగలదె

- శ్రీ. రా. క.- బా. కాం. 2 ఆ., 137 ప.

అని భావించినట్లు లామె వియోగావస్థ వర్ణింపఁబడినది. అట్లే రాముఁడు సీతందలపోసి పరిపరివిధముల దుఃఖించినాఁడు. సుగ్రీవసఖ్యముగావించి, హనుమంతుని వలన సీత వార్తఁ దెలిసి, వారధి బంధించి, రావణుని సంహరించి, సీతఁ బరిగ్రహించి, యయోధ్యఁ బట్టాభిషిక్తుఁడైనాఁడు. ఇట్లు సీతారాముల పునస్సమాగమములో సమగ్రత సిద్ధించి శృంగారరసము పరిపుష్టమైనది. ఇట 'నవినా విప్రలంభేన శృంగారః పుష్టి మశ్నుతే' అను నాలంకారిక లక్షణముఁ జక్కగా సమన్వయము గావింపఁబడినది.

కవి దీనినే 'సీతాసమేతుఁడౌ శ్రీరామచంద్రుని సింగారమేమనఁ జెల్లుననుచు' సంభావించినాఁడు.

**హాస్యము :** వాగంగాది వికారదర్శనమునఁ జూపటకు గల్గు చిత్త వికాసమను హాసము స్థాయిభావముగాఁ గలది హాస్యము.

వాగంగాది వికారదర్శన జన్మా వికాసాఖ్యోః హాసః (ప్రి. ఆ. 145 పు.) అనునది రసగంగాధర లక్షణము.

శ్రీరామకథాఽమృతమున సీతారాముల వివాహమహోత్సవ సమయమునఁ బెండిలి బువ్వంబు నందు వేడ్కలగు 'చాటూక్తులు, హాస్యకల్పనలు, లీలాలాలనోల్లాసములు, లలిత ప్రస్తుతు, లర్థపూరణము, లాలాపప్రచారంబు. లుజ్జ్వలవక్రోక్తి విభావనలు, రసపరీవాహంబులై యొప్పినవి. [1] అందుఁ గొన్ని కీలుబొమ్మ లమర్పఁ బడియున్నవి. జాణలు కొందఱా బొమ్మలను సరసముగఁ బలికించిరి. అప్పలుక్కలేర్పఱింపక ప్రతివాక్య మిడెడి వారిఁ గాంచి యచటివా రోరమోముల కళలు వెలయ నవ్వుకొనిరి. మఱియు నొక్క లావణ్యసీమ భూషోజ్వలాంగియై మేలిరసాయన

మనుచుఁ బంక్తిలోఁ గోరిన వారికి రిత్తకుంభ మొలికించి జిగిజాలుకొనఁగ, ధార చేఁ జిక్కకుండ నెదిరి సిగ్గుపడఁజేసినది. [2]ఇట్టి వర్ణన మమూలకము. స్వతంత్ర సన్నివేశ కల్పనము, హాస్యరస నిర్వహణమున నిది కవి ప్రతిభకు నిదర్శనముగా నెన్నదగి యున్నది. హర్షనైషధము నందలి నలదమయంతుల వివాహఘట్ట మిందు స్ఫురణకు వచ్చుచున్నది.

రామాదు లరణ్యవాసము చేయుచుండగా దండకారణ్యమున నున్న శూర్పణఖ సుందరుఁడగు రాముని గాంచి మోహించి దరిఁజేరి తన్ను వరింపుమని వేడినది. రాముఁ డందులకుఁ బరిహాసపురస్సరముగా 'నన్ను వ్రత నిరతు నెన్నికొనఁగ నీకుఁ దగునె' యని లక్ష్మణునిఁ జూపి 'వాని నర్థించిన నీ కార్యముఁ గొనుఁ బొమ్మనినాఁడు' అట్లే యనుచు నా యనార్య యచటి కరిగినది. లక్ష్మణుఁడా విషయమును విని 'దాని యభిప్రేతర మెల్లఁ దానరసి' సస్మితుఁడై నీవు రాముని కడ కేగు మాతఁడే నీ విషయ మరయఁగలఁ డనినాఁడు. మాయావిని శూర్పణఖ అమ్మాటలు నమ్మి నగుబాటగు ననియుఁ దలంపక కమ్మవిలుతు చేతి కందుకమ్మగు మతితో నాతనిఁ జేరినది.

> పొమ్మనవుఁడు నమ్మాటలు
> నమ్మి యదియ నెమ్మియనుచు నగుబాటగు నా
> కమ్మాయావిని చనె నా
> కమ్మవిలుతు చేతికందుకమ్మగు మతితోన్
>
> — అర. కాం. - 2 ఆ., 47 ప.

తుదకాతని ప్రేయసి సీతఁ జంపిన గాని రాముఁడు తనకు వశము గాఁడని మ్రింగ యత్నించినది. అంత రామాజ్ఞచే లక్ష్మణుఁడు మదవతి శూర్పణఖ ముక్కు చెవులు గోసినాఁడు. అందులకు విలపించుచు నా రాక్షసి వెడలిపోయినది. శృంగారా భాస మగు నిది యంతయు హాస్యాస్పదముగాఁ బరిణమించినది. దీనినే కవి 'హాస్యమా చుప్పనాతి యాస్యముననె' యని ప్రవచించినాఁడు.

రావణుఁడు యుద్ధోన్మాదమున లోకమున సంచరించుచు వాలిఁ గపటోపాయ మున బంధింప యత్నించి విఫలుఁడైనాఁడు. విశేషించి యాతని చేతనే రావణుఁడు బంధింపఁబడి కిష్కింధ నంగదుని యుయ్యాల తొట్టెను 'నాటబొమ్మ' గా వ్రేలఁగట్టఁ బడినాఁడు. అట్టియెడ నతఁడు 'పది తలలిరువది చేతులు పదములతోఁ జిలుక పందిలి

లీల' నలరినాఁడనుట యాపాత రమణీయము. అమూలకమగు నిట్టి సన్నివేశ కల్పనమున హాస్యరసముఁ బోషించుట శాస్త్రిగారి స్వోపజ్ఞమై సహృదయుల నలరించు చున్నది. (ఉ. కాం. - పూ. భా. 7 అ., 27 ప.)

రావణుఁడు యుద్ధార్థియై శ్వేతద్వీపమునకుఁ బోవ నచటి స్త్రీలు రావణుని వింత పురువుఁగా బరిగణించి పరిహసించుట హాస్యరస ప్రధానముగ వర్ణింపఁబడినది.

పది తల లిరువది సేతులు
మృదితాంజన సప్రభంబు మేనుగలిగి యొ
ప్పదె కీటంబియ్యది యని
సుదతులు గైకొని యరసిరి చోద్యంబనుచున్

ఆడువారికిఁ గుతుకంబు లగ్గలంబు
లదియు వింతపుర్వని కొనియాడఁజొచ్చి
రొకతె కరమున నుండనీ దొకతె లాగు
కొనును నలుగుడువడియె నక్కోణప పతి

— ఉ. కాం. - పూ. భా., 9 అ., 145-6 పలు

అట్టి పెనుగులాటలో రాక్షసేశ్వరుఁ డదభ్రభ్రామ్యమాణాంగుఁడై తెలివి తెచ్చుకొని రోషమతి నొకతె కరాంచలముఁ గొఱికినాఁడు. ఆమె చేవిదుర్చుచు నేలపై బడవేసినది. మఱియొక తె యెక్కడనుండి వచ్చెనో యీపాడు పుర్వు మా యక్క చేయిఁ గఱచినదని చేతఁబట్టుకొని పైకెగసినది. అతఁడు గోరులతో గట్టిగా గీఱుటకు యత్నించినాఁడు. అందుల కామె కినిసి 'వెఱ్ఱిపురువ' చచ్చెద విదె పొమ్మని యంబుధి మధ్యమునఁ బాఱవైచినది. ఇట్లా బలవంతుఁ డగు రాక్షసుఁ డబలల చేతిలోఁ జికాకు పడుట హాస్యరసస్ఫూర్తిఁ జిత్రముగా వర్ణింప బడినది.

కరుణము : పుత్రాది వియోగ మరణాదుల వలన నేర్పడిన వైక్లబ్య మను చిత్తవృత్తి విశేషము శోకము. అట్టి శోకము స్థాయిభావముగాఁ గలది కరుణము. ఆది పదముచే స్నేహబంధుత్వాదులు చెప్పఁబడుచున్నవి. 'పుత్రాది వియోగ మరణాది జన్మా వైక్లబ్యాఖ్యచిత్తవృత్తి విశేషః శోకః' అనునది యాలంకారిక లక్షణము (ర. గం. ప్ర. ఆ., 141 పు.)

'క్రౌంచద్వంద్వ వియోగోత్థ శ్శోకః శ్లోకత్వమాగతః' — ధ్వ. లో. - ప్ర. ఆ.

క్రౌంచద్వంద్వ వియోగజనితమగు శోకమే శ్లోకమై శ్రీమద్రామాయణ మహాకావ్యావిర్భావమునకు హేతువగుటయుఁ, బ్రధాన నాయికానాయకులగు సీతారాముల వియోగావస్థ వర్ణింపఁబడుటయు నా కావ్యము కరుణరస సంభరిత మను నంతటి యూహకు హేతువై యొప్పుచున్నది.

సీతాలక్ష్మణులతోఁ గూడి రాముఁ డరణ్యములకుఁ బోవునప్పుడు దశరథునకు నాతని యంతఃపుర స్త్రీలకే గాక యయోధ్యావాసులందఱకును శోక ముప్పొంగినది. మూర్ఛ మునుకొనినది. 'అంతిపురి వెలువడి దీనాంగనాజన పరివృతుండై మేదినీ పరివృఢుండు నా ప్రియపుత్రునిం జూపరే యనుచుం దెరలుచుఁ బొరలుచు యంత్ర విబద్ధంబగు కుంజరంబు చాడ్పునం బొడగట్టఁగ రేణుకాంగణం బట్టు లరిణంబైన సైరిణంబు రొదలు చదలు ముట్టందోడన పఱతేర తిఱని యాపద పదనెఱింగి పద పదమని సవిగ్రహాగ్రహంబు నూప గ్రహోపప్లుతుండగు పూర్ణశంశాకునిం బెరయుచు, నరయుచు హా పుత్ర! యని యఱచుచు వెఱచుచు నన్నుండయ్యు నాసన్నుండై' వచ్చుచున్నట్లు వర్ణించుట దశరథుని పుత్రవియోజనితమగు శోకమును గనులఁ గట్టినట్లు చిత్రింపఁబడినది. నాఁడు పౌరజనులతోఁబాటు ప్రకృతియు వైముఖ్యమును వహించిన దవి మూలాధికముగా వర్ణించుట హృదయంగమము.

> పవనుఁడు వీవఁడెందు నెలఛాసిలఁబోదు వెలుంగు చూపఁడా
> రవి దెసలం బ్రసాదమనరా దెడలెం గ్రహతారక ల్సమ
> భ్యవహితమయ్యె జీకటి సమకూలమయ్యె జనంబు నాఁడు రా
> ఘుఁవుఁ డఖిలైకపూజ్యుఁ డటు గానకు నేగెడు నన్నవార్తకున్
>
> — అయో. కాం. - 4 ఆ., 217 ప.

అట్టి సందర్భమున

> అందఱు శోకపరాయణు
> లందఱుఁ బర్యాకులాక్షు లతిదైన్యగతుల్
> మందులు నన్నై రయ్యెడ
> నం దొకఁడునులేఁడు హృష్టుఁడని మందునకున్
>
> — 4 ఆ., 220 ప.

ఇట్టి వారి దైన్యస్థితి కరుణమునకుఁ బరకాష్ఠగా నెన్నదగియున్నది.

దశరథుఁడు కౌసల్యకాత్మకృత యజ్ఞదత్తవధ వృత్తాంతం బెఱింగించు టొక కరుణరసాత్మక ఘట్టము. [1]

అరణ్యకాండమున రావణునితోఁ బోరి ఖడ్గనిహతుఁడై పడియున్న జటాయువు వృత్తాంత మెఱింగి 'అడలుచు నిలుదూఁపు స్నేహము పైచి, యాతని గన్నారఁ గని పొదివిపట్టి గద్గద వాడమన్' దన వలె నార్తిఁ బొరలు నసుజుని గనుఁగొని మున్నె యావరలకు 'మొదలు దుదియులేక యుంటి మిప్పుడీ మిత్రుఁ డిట్లు అయ్యెనీ వ్యసనవాగురాబంధ మేవిధిఁ ద్రెంతు నీ పితృవయస్సు చెలిమి నేనెట్లు మఱతు' నని పలికి యాతని గ్రుచ్చి 'అన్న మదర్థ మిట్లు పడితె' యని, బిట్టు ఘోషిల్లినాఁడు. వెండియుఁ దమ్ముని గని —

అండజమండఁబాసి చనసయ్యెడు విక్లబమయ్యెఁ జూపు నో
రెండెడుఁ బ్రాణముల్నిలక యుట్టుడుమాఁగెడు మత్కృతంబునన్
గండడరెం గదాపులుఁగు గండరగండఁడటంచుఁ దొక్కుచున్
'పక్కితేని మేను పరుపార నిమిరె' అన్న! యని సంబోధించి పేరుదీప్ప

యత్నించినట్లు కరుణ ముట్టిపడ వర్ణించుట [2] మనోజ్ఞము.

యుద్ధరంగమున శక్తినిర్భిన్నహృదయుఁడై పడియున్న లక్ష్మణునిఁ గని రాముఁడు 'ఇట్టి భక్తు నెన్నియేని జన్మములఁ జనుమఁజాలను. నాకితఁడె ప్రాపు, దాపు. ఈతఁడు లేనియెడ నింక నెట్టులైననేమి? ఉసురులేల సౌఖ్యములేల?

సిగ్గుంగాంచెడు బీర మొల్లగిలుచుం జేనున్న విల్లమ్ములన్
మొగ్గంబోయెడు దృష్టి బాష్పవశఁగా మున్నాడి గాత్రవ్రజం
బుగ్గంబట్టిన యట్టిడయ్యెడు సుషుప్త్యన్మార్గ మంచెన్నఁనై
వగ్గం జూపెడుఁ జింత మూర్ఛగొలుపం బ్రాగల్భ్య మూహించుచున్

— యు. కాం. - పూ. భా., 9 ఆ., 726 ప.

---

1. అయో. కాం. - 6 ఆ., 155-247 ప॥లు

2. అర. కాం. - 4 ఆ., 164-5 ప॥లు

అని యార్తిమునింగి విషాదమూర్తియై 'నాకు యుద్ధమేల? తుదకు జీవితము, సీతయు నేల? రాజ్యవిషయమున నభిలాష యెన్నడును లేదు. సుజన రక్షణమునకై దుష్టుల శిక్షింపఁబూనితిని. నా బహిఃప్రాణము లక్ష్మణుఁ డవసినాఁడు. కళత్రము లెల్ల బాంధవులు నేయెడనైనఁ బొందవచ్చును. భ్రాత, సహోదరుఁడు నైనవాఁ డెందును లభింపఁడ' ని ధరావేష్టనకలితుఁడు సనిశ్వాసుఁడునై దుఃఖించెను. ఇట్టియెడ రాముని కరుణము రూపు కట్టినట్లైనది. మూలమున కన్యూనాతిరిక్తముగా నిర్వహించిన యీఘట్టమునను కవి స్వీయ ముద్రఁ బ్రదర్శింపఁగలుగుట ప్రశంసార్హము.

పట్టాభిషేకోత్సవానంతరము రాముని వీడ్కొని తమ తమ గృహములకేగు 'కపుల నిర్వేదము' వర్ణించుట[1] కవి స్వకపోల కల్పితము. ఇట్టి సృష్టి రసదృష్టికి నికషోపలము. రామ కింకరులగు వానరులా యాయి వనతుల విలోకించుచు రాముని యవస్థాభేదములను, చేష్టావిశేషములను సంభావించుచు రామవిరహ భరము ననుభవించును గిరినిర్ఝరములఁ దిరిగిరి.[2] మఱియు నాఁడడవికేగు రామునరయు పౌరులకు నెట్టి వగ ఘటిల్లెనో పురము సొచ్చి తమ తమ నెలవులకుఁ బొమ్మన్న వానరుల కట్టి దశయే నేఁడు వాటిల్లినది. ఆర్తి ప్రభువు తమ్మాదరించిన విధము పరిపరివిధములఁ దలపోయుచు 'అన్నన్నాకమ్మని తేనెఁ బాసితిమి లేదా యట్టి భాగ్యమ్మికన్' అని చింతించి -

> ఔరా పెన్నిధిచేతికందియు నభాగ్యంబట్టులైయుంట చే
> దూరంబౌనెడ కిట్లు జాఱిచనె మందల్ క్రోఁతులే యట్టివి
> శ్వారాధ్యమ్మవు మేలిసొమ్మఱుపుకోనౌ వారు పొమ్మంచు

- 10 ఆ., 226, 227 పాలు

వారు శోకించిరి. మఱియు 'రామావనీశు నడవడులలో నన్నిరసములు' గలవని యనుభవములకుఁ జొచ్చి యరసి 'ఎక్కడెక్కడి కరుణంబు నేకమగుచు వచ్చి మముఁ జెందెనేఁడంచు వారు వడిరి'.[3] ఏకాంతభక్తిని ధ్యానించు కపులకు రాముఁడగు పడినట్లగుట నానందబాష్పములు, నవి పోవ విరహాశ్రువులుఁ దోచి వారి కన్నులు

---

1. ఉ. కాం.- పూ. భా., 10 ఆ., 209-16 పాలు
2. ,, ,, 10 ఆ., 220 ప.
3. ,, ,, 10 ఆ., 228-29 పాలు

తడియాఱుగతి కలుగదని వర్ణించుట హృదయంగమము.   ( 10 ఆ. 231. ప. )

సీతాపరిత్యాగ ఘట్టమొక కరుణరసాత్మక మగు సన్నివేశముగ నిర్వహించి రసపోషణమున కవులు తమ ప్రత్యేకతను నిరూపించుకొనినారు.[1]

**రౌద్రము :** గురు బంధు వధాది పరమాపరాధ జనిత మగు ప్రజ్వలనమను క్రోధము స్థాయిభావముగాఁ గలది రౌద్రము.

'గురుబంధువధాది పరమాపరాధ జన్మా ప్రజ్వలనాఖ్యః క్రోధః'

అనునది యాలంకారిక లక్షణము.   ( ర. గం. ప్ర. ఆ. 142 పు. )

రాముని యరణ్యావాస వృత్తాంతమును విన్న లక్ష్మణుఁడు క్రోధాతిరేకమున రామునితోఁ బరపక్షమును నిరసించుచు లోకమెల్ల నలోకంబొనరింపఁ జాలుదునని పలుకుట రౌద్రము.   ( అయో. కాం. 3 ఆ. 218-20 పద్యాలు )

ఇట్టి వర్ణన మూలమునకంటె విలక్షణమై రసనిర్వహణమున శాస్త్రి గారికిఁ గల నేర్పు వెల్లడించుచున్నది.

దండకారణ్యమున రాముఁ డొక్కఁడే ఖరదూషణాదులగు పదునాలుగువేల రాక్షసులతో యుద్ధమొనరింప సన్నద్ధుఁడైనాఁడు. అట్టియెడఁ గ్రుద్ధుఁడై కోదండపాణి యైన రాముఁడు పినాకపాణి యైన రుద్రుని వలెఁ గోచరించినాఁడు. ఆ రూప మాకోప మాదీప్త తేజముఁ జూచి భూతములెల్ల వడంకినవి.[2] మఱియు నయ్యెడ 'రాముఁడు రవిప్రభతో ఘనబృంద మట్లు నిర్భగ్న మహామహోజ్వలతఁ' దామ యుగాంతవహ్నివోలె భాసిలినాఁడు. దక్షక్రతు సంహారమున నీశ్వరుని గాంచిన వేల్పులు విపక్షులతోఁ బోరు రాముని ప్రద్యోత మెంతమాత్రము వీక్షింపఁజాలరైరి. అట్టిసమయమున నాయుధకలా విష్టాతుఁడైన రాముఁడవ్వాహినిం దఱియంజొచ్చి తూపుల విదుర్పం దొడరినాఁడు. ఆ రూప మత్తఱి దుష్ప్రేక్ష్యము కాఁగాఁ గోవముద్ధృతమై తత్కల్పాంబన ల్పనంబుగాఁదనరినది.[3] 'ఆనెఱి పున్నెంబునఁ గల్గెనంచు సురలున్నిద్రాక్షులై' గాంచిరి.

1. ఉ. కాం.- ఉ. భా., 2 ఆ., 157-225 పద్యాలు
2. అర. కాం.- 2 ఆ., 134-5 పద్యాలు
3. అర. కాం.- 2 ఆ., 142-44 పద్యాలు

'కస్యబిభ్యతిదేవాశ్చ జాతరోషస్య సంయుగే' అన్న వాల్మీకి రామగుణాభివర్ణన మియ్యెడస్ఫురణకు వచ్చుచున్నది. రసపోషణమున నీఘట్టము మూలాతిశయ సౌందర్యమును సంతరించుకొనినది.

రాముఁడు రావణునిపై దండెత్తి పోవుచు వానరసైన్యముతో దక్షిణ సముద్రతీరమున విడిది గావించినాఁడు. సముద్రు నుద్దేశించి నియమితుఁడై మూడు రాత్రులు దర్భాస్తరణమున శయనించి, వ్రతనిష్ఠఁ బూజించి వేడినాఁడు. సముద్రుఁడు దర్శన మిచ్చి పలుకఁ డాయెను. రాముఁ డంత క్రోధమున రక్తాంతేక్షణుఁడై పరాక్రమము ప్రదర్శింప నిశ్చయించి -

చాపమందిమ్ము లక్ష్మణ ! శరవరమ్ము,
లట్లు లాశీవిషమ్ములే యనఁగఁజెల్లు
నవియుఁగూర్చుము నవయు నియ్యబ్ధినింకఁ
గాళ్ళ నడకలతోఁ గప్లుల్గడచువారు

యు. కాం. - పూ. భా., 3 ఆ., 237 ప.

అని శరముల ఝళిపు నొనర్చి సముద్రుని జీర్ణింపఁగాఁజేయు సంకల్పమున ధనుష్పాణి యగు రాముఁడు జ్వలితాస్త్రుఁడైనాఁడు. (3. ఆ. 240-1 ప. లు)

అట్టియెడ 'రామాస్త్ర పరంపరాఖ్య మగు నౌర్వంబబ్ధి మాయించుచో యుగాంత వేళను మహాప్రస్థాన మూహింపఁ జొప్పడినది. మఱియు -

ఉదక ముడుకుచుండ నూర్మి మాలికలతోఁ
బూర మెగువ నబ్ధి బూరటిల్ల
ధూమమట్లు పైపైఁదోఁప వింతజంతు
పాక మచటఁ గానఁబడియె నపుడు - 3 ఆ., 244 ప.

ఇంద్రాస్త్రముఁ బ్రయోగింపఁ బర్వతములు తాలుముక్కలుఁ గాఁగ రాలినవి. శోషణాస్త్రోరువిస్ఫూర్తి వీగుడఁ గాకి చిప్పలు గాన నైనవి, అగ్నేయ బాణాగ్ని లంటఁగదియ ధూమకేతువుల వలె ధూమకేతువు లొప్పినవి.

వాయువ్యాస్త్రవేగమున నూర్మిమాలికలు, సతోర్వ్యర్మిమాలికలు నాడినవి. సముద్రమే ఘూర్ణమానమైనది. [1] సర్వజగములు సమస్తభూతములు, ప్రాణులు చలించినవి. రామబాణాగ్నిశిఖల కగ్గమై సముద్రుఁడు వణకుచుఁ బ్రత్యక్షమై వరము ప్రసాదించినాఁడు. ఈ ఘట్టమున మూలాధికమగు సౌందర్యము సంతరింపఁబడినది. కవి-

తన బాణమునఁ గోణమునకు లక్ష్యంబైన
యంబుధిపయి రౌద్రమడరె ననుచు'

రామావనీశుని సంభావించుట మనోహరము.

భూమాత పావని సీతం గొనిపోవ రాముఁడు సీతాత్యంత వియోగదుఃఖితుఁడగుచు 'రోస మింతయొాదల యెత్తంగ భూమిని జంతు సంతతులతో భూభృద్వన శ్రేణితో రోషవిషాగ్నికీలల వినుంగాల్తుం జుమీ' యని క్రోధ సమాకులచిత్తుఁడై' పలుకుట రౌద్రరసమునకుఁ బరాకాష్ఠగా నెన్నఁదగియున్నది. [2]

వీ ర ము : పరపరాక్రమ దానాది స్మృతి విశేషముల వలనఁ గలిగిన యౌన్నత్య మను నుత్సాహము స్థాయిభావముగాఁ గలది వీరము

పర పరాక్రమ దానాది స్మృతిజన్మా ఔన్నత్యాఖ్య ఉత్సాహః
— ర. గం. - ప్ర. ఆ, 144 పు.

అనునది యాలంకారిక లక్షణము.

సత్యపరాక్రముఁ డగు రాముఁడు దుష్టశిక్షణ శిష్టరక్షణ గావించి లోకమును నిష్కంటక మొనరింప నవతరించి, విశ్వామిత్రుని యాగసంరక్షణము గావింపఁ బయలువెడిలి, దివ్యాస్త్రముల నుపదేశమంది, దుష్టనిశాటయైన తాటక సంహరించి, సుబాహు నాగ్నేయాస్త్రమున భస్మ మొనరించి, మారీచుని వాయువ్యాస్త్రమున సాగరమున ముంచి, జనకుని యజ్ఞమును సందర్శింపఁబోయి గురు నాజ్ఞ శివధనువు నెత్తి, సీతం బెండ్లియాడి, భార్గవు గర్వ మపనయించి, పితృసత్యవాక్య పరిపాలనతత్పరుఁడై యరణ్యముల కేగి, విరాధుని సంహరించి, యగస్త్యుని వలన దివ్యమగు ఖడ్గము,

1. యు. కాం. ఉ. భా. 3 ఆ.. 246 ప.

2. ఉ. కాం. - ఉ. భా., 8 ఆ., 104-111 పద్యములు

ధనుర్బాణములను బడసి, ఖరదూషణాది పదునాలుగువేల రాక్షసుల నర్ధముహూర్త కాలమున నవలీలఁగాఁ బరిమార్చి, మారీచుని ప్రాణము లెడలించి, కపటియై రావణుఁడు సీత నెత్తుకొని పోఁగా నామెను వెదకుచు కబంధుని వధించి, శాత్రవ నిర్మూలమునకై కడంగి, ఋశ్యమూకమున సుగ్రీవునితో మైత్రిఁ బాటించి, వాలిం గూల్చి, భౌతిక మగు వానరబలమును గూర్చుకొని, సాగరాంతరితుఁడౌ రావణుని లంకఁ జేర సేతువు నిర్మించి, సబాంధవుఁ డగు రాక్షసుని సైన్యసపరివారముగ సంహరించి లోకస్తుత్యుఁడైనాఁడు. ఇది యంతయు రాముని వీరోచితవృత్తిగా నెన్నఁదగియున్నది. విశేషించి రామావతారము రావణవధకై యుద్దేశింపఁబడినది. కావున తక్కనవి దానికి నంగములుగాఁ బరిగణింపఁబడుచున్నవి. శ్రీరామకథాఽమృతమున కవులు –

> 'రావణారీ! యంచు రహిఁబెంచు వందుల
>
> నుడి నంచు బీరమ్ము నొడువుచుండ' అనియు
>
> 'సాగరాంతరితుఁడౌ శాత్రవుఁ గోరాడ
>
> వెనుబడ దెంతటి బీర మనుచు'

అనియు రాముని సంభావించినారు. బీరమనఁగ వీరమనియే యర్ధము.

హనుమంతుఁడు సీత నన్వేషించి రామునిఁ జేరి శుభవర్తమానముఁదెల్పి, లంకామార్గమును వివరించినాఁడు. రాముఁ డది విని రావణునిపై దండెత్త నిశ్చయించి సుగ్రీవు నుద్దేశించి -

> నేను దాని నిపుడె నేలకుం గూలకు
>
> దెత్తు భీమబలుని దితిజుఁ గెడపి
>
> – యు. కాం. - పూ. భా., 1 ఆ., 77 ప.

అని పలికి జయప్రదమ్మగు విజయాఖ్య సుముహూర్తమున యానమొనరింప సంకల్పించి 'తొడరెడు నాసనంబు దొలఁ దూకుఁడునం బడలింతు' నని యుత్సహించి శత్రుభంజనం బొనర్చి సీతదెత్తునని ప్రతిజ్ఞ సలిపినాఁడు. (1 ఆ. 81 ప.)

ఇట్టి రాముని యుత్సాహపూరిత మగు సంభాషణక్రమము వీర రసోచితము. అట్లే సుగ్రీవాజ్ఞచే సీతాన్వేషణపరులై కడంగిన కపులు తమ యుత్సాహమును బదర్శించినతీరు వీరరసోచితమై పరగుచున్నది.

సీత నిప్పుడె కొంచు సిరిగొంతు మనువార
　　　　　　లసురబీరమదెంత యనెడువారు
నే నెక్కటియ చాలనే వాని కనువారు
　　　　　　భూమిబ్రచ్చు తలంపుఁ బూనువారు
నింగి గెంటుదమంచు నెఱయఁజూచెడువారుఁ
　　　　　　దరులు గిరుల్గొల్చి దరలువారు
తొలుదొల్త నబ్ధిఁబూడ్తుమ కాక యనువారు
　　　　　　నొ లంకఁగాల్పంగ ననెడువారు

క్ష్వేళ లొనరించువారు హసించువారుఁ
గుప్పిగంతులు వైవ మేకొనెడువారు
యోజనాయత దూర మీయోజఁ గడతు
మని యెగయఁబోవువారు నైరి (కి.కాం - 2 ఆ., 369 ప॰)

అట్టి సందర్భమును గూర్చి శివుఁడు పార్వతితోఁ జెప్పుచు -

స్రుక్కెడువా డని నెఱికిం
దక్కెడువాఁడనియు నట్టి తరుచరవరులం
దొక్కఁడునేనియు మందున
కక్కడ నెమకంగదోఁపఁ డబలామణిరో !

వెల్లివిరిసె నిట్టి వెరవున నరుసంబు
సంభ్రమనఁగఁదనరఁజాలి వనచ
రాలి యోలిఁదరలె మేలి యోలిమి సిరిఁ
గాల్రి సొరయువతి పాలి వినుత!

— కి. కాం.— 2 ఆ., 370-71 ప॥లు

అవి వారి యుత్సాహసంపద వివరించినట్లు పన్నించుట హృద్యము. మూలాధికమగు
వీ ప్రకృతి వ్యాఖ్యానము శాస్త్రి గారి స్వోపజ్ఞము.

మఱియు వీరరసావతారుఁ డగు హనుమంతుఁడు సముద్రమును లంఘించి లంకకేగ నుత్సహించుట వీరరస ప్రధానముగా వర్ణింపఁబడుట మనోజ్ఞము. 'నియతి రామగీతులోలిఁబాడుచుఁ గీర్తించుచు నర్తించుచు గర్జమబ్బెననుచు ననము వెనుచుచు నాతఁడు —

> ఆనందంబు హృదంతరాళమున నిండారంగఁ బొంగారి ప్ర
> స్థానావేశమున న్నిజాంగముల భాస్వద్బాష్పరోమాంచ ము
> ఖ్యానద్ధ స్వరసోదయంబగుచు నొయ్యం దోఁప నింద్రధ్వజ
> శ్రీ నల్వొందెడు వాలమెత్తి జయలక్ష్మి ప్రార్థితాశంసియై
>
> – సుం. కాం.– 1 ఆ., 5 ప.

త్రివిక్రముని వలెఁ దద్దయు నాహరి కీర్తిఁ బెనుత ననుచుఁ బెరిగె ననుట మూలాధికము. అంత నాతఁడు తన వారితో 'రామాస్త్రము వలెఁ దాను లంక కేగి సీతవార్తఁ గొనితెత్తు' నని పలుక వారు సంతసమున జయజయ ధ్వానములు సలిపిరి. అత్తఱిఁ దేజము, సత్త్వము, వీర్యము, ధృతి, సమున్నతత్త్వము నతని యందంతకంత కధికము కాఁగా వానరవీరు లాతనిపై దృష్టి నిలిపి చూచుచుండిరి.[1] ఇట్టివర్ణనము వీర రస పోషణమున నౌచిత్యపరసీమ నందుచున్నది.

మఱియు సుగ్రీవాజ్ఞ ననుసరించి సీతాన్వేషణమునకై కిష్కింధఁ జేరు వానరవీరు లమితోత్సాహమున నఖండ రభసం బెనంగ నొండొరుల గెంటుచు, దనజుఁ డెదిరించినం గండడతుమింక నని పలుకుచు, జానకిఁ గనుట పండువుగాఁ దలంచి యధిపుఁ జేర్పఁ గృతనిశ్చయులై ప్రస్థానాభినివేశమున 'అగము లగలింతుమో దిక్కులప్పళింతుమో బయలు మ్రింగుదుమొ యా సముద్రములఁ గలంచివైతుమొ యేదిమాలావెఱింగి చెప్పఁగలయది' యనుచు సంతసమున రామకార్యార్థమై, యాత్మార్పణము గావించితి మింకఁబోరిలో నరియోధులార్పులు వుత్తురెట్టులవి పల్కినట్లు వర్ణించుట హృద్యము. (కి. కాం.– 2 ఆ., 285 ప.(

---

1. సుం. కాం. 1 ఆ., 24-6 పలు

'కుర్వాణా బహుశబ్దాంశ్చ ప్రకృష్టా బాహుశాలినః'[1] అను మూలము నందలి భావమును గ్రహించి యపూర్వముగ వానరుల శౌర్యప్రతాపములు వెల్లడియగు నట్లు వారి యౌత్సుక్యమును వర్ణించుటలో వీరరసముట్టిపడునట్లు చిత్రించిరి. శాస్త్రి గారి రసపోషణ సామర్థ్యమున కిది నిదర్శనము.

**భయానకము :** వ్యాఘ్రదర్శనాదుల వలన నేర్పడిన పరమానర్థ విషయక మగు వైక్లబ్యమను భయము స్థాయిభావముగాఁ గలది భయానకము.

వ్యాఘ్రదర్శనాది జన్మా పరమానర్థ విషయకో వైక్లబ్యాఖ్యః సభయమ్

\- ర. గం.- ప్ర. ఆ., 145 పు.

**అనునది ఆలంకారిక లక్షణము.**

బాలకాండమున పుత్రుల వివాహమహోత్సవా నంతరము సపరివారుఁడై దశరథుఁ డయోధ్యకుఁ బోవుచుండ మార్గమధ్యమున శివధనుర్భంగ వార్తవినినవాఁడై నిర్ధూత బహువిపక్షదోః ప్రాభవుం డగు భార్గవుం డాకస్మికముగ దోఁచినాఁడు. 'అమ్మహామహుఁ గాంచి యలవశిష్ఠ ప్రముఖులు యతాత్ములై మానసశక్తి జపహోమములు జరిపినారు'[2] అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథాఽమృతమున నయ్యెడ 'మునులట్లు సలుప నితరులు చేయునదిలేక యొకప్రక్క కొయ్యన నొదిగి యుండి రనియు' -

అందఱు జేరి తదీయా
స్కంద మీక్షించి రూక్షగతికిఁ దలఁకి సం
స్పందమొక యింత యాఁగుచు
సంధానిత చిత్తవృత్తి సంయములగుచున్

బా. కాం.- 10 ఆ., 444 ప.

వారుఁ బరగిరనియు మూలాధికముగా వర్ణింపఁబడినది. భీతిచే నూపిరి బిగపట్టుట సహజము. అట్లు వాయునిరోధము సేయుట యోగిజన లక్షణము నై యొప్పు చున్నది. అట్టియెడ వారు 'సంస్పంద మొకయింత యాఁగుచు సందానిత చిత్తవృత్తి

1\. సుం. కాం. 39 స., 41 శ్లో.
2\. బా. కాం. 74 స., 20 శ్లో.

సంయము లగుచు' నున్నారనుట చమత్కార సుందరము, రసోచితము నగుట హృద్యము. ఇట్టి సంభావన సంస్కారయుతమగు కవి దృష్టినిఁ బట్టియిచ్చు చున్నది. మఱియు భార్గవునిఁ గూర్చి మూలమున నిట్లు చెప్పఁబడినది —

కచ్చిత్ పితృవధామర్షీ క్షత్రం నోత్సాదయిష్యతి
పూర్వం క్షత్రవధం కృత్వా గతమన్యు ర్గతజ్వరః
క్షత్రస్యోత్సాదనం భూయో నఖల్వస్య చికీర్షితమ్
— 74 స., 21, 22 శ్లో॥లు

శ్రీరామకథామృతమున భీమదర్శనుఁ డగు నాతని యుగ్రతేజము, దుర్నిరీక్ష విశేషముగాఁ గీర్తింపఁబడినవి.[1] రసపోషణ మియ్యెడ నౌచితీపారము ముట్టినది.

మారీచుఁడు దుష్టరాక్షస వినాశకరుఁ డగు రాముని గూర్చి రావణునకుఁ జెప్పుచు 'జగమంతట శరచాపములు దాల్చిన రామరూపమె యముని వలెఁ దనకుఁ గోచరించుచున్నదనియు, రాదిమైన పదమెట్టిదైనను చెవిసోక రామవిభ్రాంతి గదుర నది దన యంతరంగ విద్రావణముగా నగు' ననియు బలుకుట మారీచునకు రాముని వలన గలుగు భీతిని వెల్లడించుచున్నది.[2]

కోదండపాణి యగు రామునిఁ జూచిన దుష్టులగు వారికి భయము గదురుట సహజము. అది యాతని సత్యపరాక్రమమునకు నిదర్శనము. కవి దీనినే 'వింట భయము' అని వివరించినాఁడు.

ఇంకను సీతాన్వేషణపరులై దక్షిణపు దిక్కున కేగిన కపివరులు సముద్ర మును గాంచి విచారపడుచుఁ బ్రాయోపవేశంబుఁ జేయ నిశ్చయించుకొని యుండిరి. ఆ సమయమున సంపాతి చిరకాల మనశనుండై యుండి నేటికి భక్ష్యంబులైనవారిఁ జూచి యిందొక్కొక్కరి ప్రాణములు దీసి మెక్కుచుఁ దృప్తితో మిక్కిలి కాలము గడిపెద నని ప్రమోదమునఁ జేరవచ్చుచుండెను. అది చూచి కపులు భయభ్రాంతులై యార్తిం బొగిలిరి. ఇదియు భయానకమున కుదాహరణము.

---

1. బా. కాం. 10 ఆ., 445 ప.
2. అర. కాం. - 2 ఆ., 417-18 ప॥లు

అని యుల్లాసము మీఱఁ దారసిలనొ నాపక్షి వీక్షించి యొ
ప్పని యుద్దేశము నెంచి యక్క పివరుల్పాపాత్ముఁ డీగ్రద్దయై
చనుదెంచెన్జము డిందఱం బొదవ నాసల్దిజె నింకేమి యం
చని ఘోషించిరి, వారి ఘోషణల నాజ్యాభృత్తు ఘూర్ణిల్లగన్
— కి. కాం. - 3 ఆ., 171 ప.

అట్లే సుందరకాండమున హనుమంతుఁడు లంకను దహింప నచటివారెల్ల భయభ్రాంతహృదయులై హాహాకారములు చేయుచుఁ దమలోఁ దాము చర్చించుకొనుచు నిందావాక్యములఁ బలుకుచుఁ జంటిబిడ్డ లక్కన గదియంగఁ జిక్కఁబట్టికొనుచుఁ జీకాకుపడి కాకకోర్వ కసుర యువతులు నేలఁగూలిరి. అటునిటు బరువు లిడుచు హనుమని గాంచి యులికిపడుచు వారు దహింపఁబడుచున్న యన్నగరుఁ బరిరక్షింప జాలరైరి. (సుం కాం. - 3 ఆ. 301-4 పll)

శ్రీరామకథాఽమృతమున నీ మూలాధికమగు వర్ణనమంతయు హృద్యమై రసనిర్వహణమునఁ గవికిఁ గల సామర్థ్యమును బ్రకటించుచున్నది. సంభాషణాక్రమము స్వభావోక్తి సుందరము. (చూ. అనువాదవిధానము.)

దేవాసుర సంగ్రామమున నిర్జరవరులు నానా ప్రహరణకరులై తఱుముటకు వెన్నంటినంత 'నా యాతుధాన పుంగవులు దిక్కుసెడి కడలం బోయిరి, కొందఱాయుధ ముల చేత నాహతులై మహీతలమునఁ బొర్లాడిరి. మఱి కొందఱు మూర్ఛిల్లి వాహన ములనుండి పడి రణభూమిఁ దిరుగాడుచుండిరి. కొందఱు రథ నాగ హయ ఖరోష్ట్ర ములఁ గౌగిలించి విష్టబ్ధులై తలలెత్తి సాగచుండిరి. ఇంకను గొందఱు దేవతావిద్ధులై తెగిపడి, తొడిబడి రూపమె కనరానివారైరి. ఇట్లు వెరవుమెయి వికావికలై యార్తు లైన రాక్షసభటవర్యుల రణసంప్లవంబు చిత్రమున వ్రాసిపెట్టినట్లు చూడ నొప్పారి నది'.[1] ఈ ఘట్టము మూలమున కంటె విలక్షణమై భయానక రసపోషణమున నుపక రించుచున్నది.

**బీభత్సము :** కదర్య వస్తువిలోకనము వలన నేర్పడిన విచికిత్సమను

---

1. ఉ. కాం. - పూ. భా., 6 ఆ., 204-5 పll

చిత్తవృత్తి విశేషము జుగుప్స. అది స్థాయిభావముగా గలదిఁ బీభత్సము.

కదర్య వస్తువిలోకనజన్మా విచికిత్సాఖ్య శ్చిత్తవృత్తి విశేషో జుగుప్సా
— ర. గం. - ప్ర. ఆ., 146 పు.

అనునది యాలంకారిక లక్షణము.

దండకారణ్యమున ఖరదూషణాది రాక్షసులు రామునిపై దండెత్తిరాఁగా నస్త్రవిద్యామర్మజ్ఞుఁ డగు రాముఁడు కాలపాశదండాభములు, నతి దుర్విషహములు, నధిక దుర్వారములు నైన శరములఁ బ్రయోగించి యసుర జీవముల హరించినాఁడు. అయ్యెడ రామవిసృష్టంబులైన యా శరము లసుర తనువులఁ జించి చెండాడి రక్త సిక్తంబులై యంబరమున దిరువుచు నగ్ని శిఖలట్లు మెఱసినవి. భీమరణ రామబాణ వినిర్భేదనమున భిద్యమానులై కోణపులెల్ల పెనుపుదక్కి యార్తనినదంబు లెలయించిరి. మఱియు రాముఁడు దుష్కర్ములగు వారి వర్మములు సించి, తత్తను మర్మములఁ గలంచి రక్కసుల యమగృహాతిథ్య మెనయజేసినాఁడు. అంత వారు పవన గరుఁడ వినిహతములైన తరువుల విధముఁదోప విచ్ఛిన్నులై ధరణిఁ బడిరి. తదవశిష్టులు చెదరి బెదరి దరిగననేరక నాయకు శరణువేడఁ జనిరి.[1] తిరిగి తమ నాయకునితో వచ్చిన రాక్షససేన రాముని తీవ్రక్రోధమునకు గుఱియైనది. అట్టియెడ రణరంగమున-

ఒకమొగి వ్రాలెడు వారటు
లొకటఁ బతితులై నవార లొకట హతులుగాఁ
గకవికపడువారును గా
వికీర్ణులై వసుధ వింతవిధమునఁ దనరెన్
— 2 ఆ., 174 ప.

'మఱియు నా ప్రధన ప్రదేశంబు వెల్లి విరిసిన రక్తపూరంబున భిన్న భిన్న విదారితంబులై పడిన రాక్షస కళేబరంబులచేతను సోష్ణీషంబులగు నుత్తమాంగంబుల చేతను సాంగదంబులగు బాహుదండంబులచేతను, సవిభూషణ విశేషంబగు నూరు జానుచరణాదులచేతను, నానావిధాభరణ సంవిధానములతో వింధ్వస్తంబులై

1. అర. కాం. - 2 ఆ., 157-65 పఙ్క్తులు

యశ్వహ స్తిరథాదులచేతను, విశీర్ణంబులైన ఛత్రచామరవ్యజన పతాకాది బిరుదంబుల చేతను, ఖండీకృత భిండివాల శూల పట్టిస ప్రాస చంద్రహాస పరశ్వధ బాణ తూణాది సాధనంబులచేతను, శకలిత చూర్ణితంబులగు గండోపలంబులచేతను, సముపలక్షితం బగుచు వికీర్ణ వివిధ యాదోవర్గ నిరర్గళ వైతరణీ ప్రవాహ దుర్గమంబగు యమ మార్గంబు పగిది సార్గళంబు నతి భయంకరంబునై యుండె' [1] ననుట భీభత్సము. మూలమునలేని యలంకారము నిజముగా నీఘట్టమున కలంకారమై రసోచితముగా వెలయుచున్నది. మూలమున రాక్షసవీరుల యమసదనమున కంపినట్లు చెప్పఁబడినది. యనువాదమున మార్గము నిరూపింపఁబడినది.

యుద్ధకాండమున రాముఁడు రావణు మూలబలంబుల నుఱుమాడు సందర్భమున ప్రభంజనుఁడు వనము నగలించి, పెకలించి, చలనమందఁజేయు విధమున రాక్షస సమూహమును భంజించి ఛిన్నా భిన్న మొనరించినాఁడు. అట్టి యెడఁ గనులు మిఱుమిట్లు గొన రాము విక్రమముఁ గాంచు నసురులు 'ఇదె తోఁచె రాఘవుఁ డంచు' భీతాత్ములై విభ్రమముఁ గనిరి. రాముఁ డొక్కఁడే వారికి సహస్రరూపముల దర్శన మిచ్చినాడు.

ఇదె కూల్చె గజానీకం
బిది గో మహారథము లగలనేసెఁ బదనులన్
బొదలు శరమ్ముల వాజులఁ
బదాతులం ద్రెంచె ననుచుఁ బలుకుదు రసురుల్

— పూ. భా., 9 ఆ., 483 ప.

అట్లు రాముఁడు నిమేషమాత్రమున 'నరి తతిఁగాలచక్రమననై హరియించి' నాఁడు. అంత రథ గజ తురగ పదాతి దళములు రామ శరవహ్నిలో శలభాయితములై నష్టంబైనవి. అయ్యెడ రణాంగణము ఛిన్నగహనోపమమై యెసఁగినట్లు వర్ణింపబడినది.[1]

ఉత్తర కాండమున దేవాసుర సంగ్రామ సందర్భమున రణరంగము 'శోణితోదకముతో మహాస్థిబృందతటములతో, మేదఃపంకసంకీర్ణయై, గృధ్రకులాలోల

---

1. 2 ఆ., 175 ప.

సరత్సరిద్వరము సహస్రస్రోతయై మకరన్మార్గణవర్గయై' యొప్పినదని వర్ణించుట హృద్యమై భీభత్సమును సృజించుచున్నది. రసములఁ గూర్చి ప్రస్తావించుచు దీనినే కవి 'భీభత్స మనినేల' యని యభివర్ణించినాఁడు. అనినేల = యుద్ధభూమి

> వికటోన్మత్తులు రాక్షసప్రవరు లుర్విన్ వ్రాలుడున్ శోణితో
> దక నిష్యంద మహాస్థిబృందతట మేదః పంకసంకీర్ణ గృ
> ధ్ర కులాలోల సరత్సరిద్వర సహస్రస్రోతయై వెల్వడెన్
> మకరన్మార్గణవర్గయై కడువడి న్సంగ్రామరంగంబునన్
>
> \- ఉ. కాం.- పూ. భా., 6 ఆ., 206 ప.

> శోణితోదక నిష్యందా కాకగృధ్ర సమాకులా
> ప్రవృత్తా సంయుగముఖే శస్త్రగ్రాహవతీనదీ
>
> \- వా. రా.- ఉ. కాం., 28 స, 43 శ్లో.

అను మూలశ్లోకము నందలి భావమునకు సమగ్రతను సంపాదింపఁజేసి హృదయంగమముగా నిట్లు వర్ణించినవిధము రసపోషణమున కుచితమై తిక్కన యుద్ధరంగ వర్ణనలను దలపించుచున్నది.

**అద్భుతము :** అలౌకిక వస్తు దర్శనాదుల వలనఁ బొడమిన వికాస మను విస్మయము స్థాయిభావముగాఁ గలది యద్భుతరసము.

> అలౌకిక వస్తుదర్శనాది జన్మా వికాసాఖ్యో విస్మయః
>
> \- ర. గం.- ప్ర. ఆ., 144 పు.

అనునది యాలంకారిక లక్షణము.

రామునిఁ దోడ్తేర సపరివారుఁ డగు భరతుఁడు చిత్రకూటమున కేగుచుండ నాతని సద్భావమునకు మెచ్చి ప్రీతి ఘటింప భరద్వాజుఁ డొసంగిన విందు నిట్లని మాటల వర్ణింప వీలుపడదు. అట్టిది 'నభూతో న భవిష్యతి'. అది యలౌకికము. జగదాశ్చర్యకరమునై తపశ్శక్తికి నిదర్శనముగా వరలుచున్నది. భరతుని సద్గుణములకు సంతసించి తపోధనముఖ్యుఁడగు భరద్వాజుఁడు అగ్నిహోత్రశాలఁ బ్రవేశించి యాచమన మొనర్చి, పరిమార్జన మాచరించి 'రాజోచిత మగు నొక విందు వేయ

సంకల్పించితి నందులకై వలయు సమస్త వస్తుసంపదయుఁ దత్తదధిపతులగు దేవతలు సమకూర్పవలయు' నని ప్రార్థించినాఁడు. దేవత లాతని తపోవిభవమునకు సంప్రీతులై యాతఁడు కోరినట్లే సమస్తము సంసిద్ధముఁ గావించిరి. అట్టియెడఁ దద్వైభవమును జూచి తలపోసి భరతుఁడు, తదితరులు విస్మయ మందినారు. [1] అద్భుతావహమగు నీవర్ణన రసపోషణకుదాత్తత సమకూర్చుచున్నది. అట్టి వింతఁగని విద్యావంతులును విభ్రాంతతఁ బరిపరివిధముల వితర్కించిరి. ( 7 ఆ. 321 ప. ) ఇట్టి యోజన కవి స్వీయమగుట నిట నాత్మీయత వ్యక్తమగుచున్నది.

( చూ. పాత్రచిత్రణము )

అట్లే రామప్రభృతులు వనవాసమున శరభంగమహాముని యాశ్రమముఁ జేరబోవునంతలోఁ 'గనరాని వికాసమొకఁడు గనుపట్టినది'. క్రమముగా నది యింద్రుని పుష్పకంబని గుర్తించి వారు యాశ్చర్యమగ్నులైరి. 'వింత యనుచుఁ దమ్ముఁడు దన కొంతయుఁ గన రామవిభుఁడు' వారి కావిషయము వివరించినాఁడు. [2] దేవేంద్రుని వర్ణన మీఘట్టమున మూలమున కంటె విలక్షణమై కవి స్వాతంత్ర్యమును బ్రకటించుచున్నది. రసానుగుణమగు నిట్టి రచన మిక్కిలి మనోహరము, నద్భుత రసనిర్భరము నగుచున్నది.

కిష్కింధాకాండమున సుగ్రీవుని యాన వానరవీరులు సీత నన్వేషింప వెడలిరి. అందు దక్షిణదిక్కున కేగిన హనుమదాదు లొక గుహాప్రదేశమును జేరిరి. ఆ గుహలో మణికాంచన సంచితమగు వనమును, సమలంకృతమగు పురమును గాంచి నయనాంచలములు వికసింప రోమాంచితగాత్రులైరి. నెమ్మది విచారము తొలంగి చంచలభావవృత్తి నశించినది. అందలి విశేషములు గాంచి వారు విస్మయానందముల నందిరి. ఇప్పట్టున వర్ణనము మూలమున కంటె విలక్షణమై రసనిర్వహణమున మహితమగుచున్నది. ( కి. కాం. 3 ఆ. 66–7 పాలు )

అచటి ద్రుమాఁకులు సువర్ణశాఖాప్రతాన సంస్థాన ఘృణుల నీనుచున్నవి. తీవెలు వైద్యుతద్యుతిలతా వైభవముల వెలార్చుచున్నవి. పండ్లు రసపూర్ణ హేమ కుంభీజృంభితేష్టరుచులఁ బచరించుచున్నవి. పూవులు సౌరకానన సార సౌరభముల వెదజల్లుచున్నవి. తేనసోనలు అమృతసింధుయుగ సమాగములై తనరుచున్నవి.

---

1. అయో. కాం.- ఆ., 262-76 పాలు
2. అర. కాం. 1 ఆ. 93 ప,

పుష్పొడుల తిన్నెలు కనకగిరివేడబములై యలరుచున్నవి. పద్మములు రత్నప్రభలఁ దోఁచుచున్నవి. తాదృశ జలజంతు హంసతతులతోఁగూడిన యచటి సరసుల సారస్యము మనోజ్ఞము.[1] మఱియు నన్నగరు 'ముప్పొలమ్మల నగరుల మురిపెములను ననుచు' నది కాఁగా వనచరు 'లచ్చోటు గాంచి మేలనిరి. ఱిచ్చపడిరి, పెరసిరి' అని వర్ణించుట యద్భుతరసపోషణమునకుఁ బరాకాష్ఠగా నెన్నదగియున్నది.[2] అట్లే హనుమంతుడు లంకాపుర సౌందర్యము వీక్షించివర్ణించిన విధము నద్భుత రసనిలయము.

సుం. కాం. 1 అ. 179-81 వ॥లు.

రాముని చరితమున నలౌకికములగు సన్నివేశము లన్నియు నద్భుతోదాహరణములు కాఁగా నద్భుతములలో నద్భుతము రాముఁడు రావణుని పదితలలు ద్రుంచి వోయుట యనఁదగును. శ్రీమంతుఁడు భుజబలవంతుఁడు నగు రాముఁడు దివ్యశర మొకదానినిఁ గొని శరాసనమునఁ గూర్చి సమంత్రకముగాఁ బ్రయోగించినాఁడు. ముల్లోకములవారుఁ జూచుచుండ నా రావణుని శిరము రణక్షోణిఁబడినదయ్యె కందక, వసివాడక, సిరివీడక యథాస్థానము నలంకరించినది. రాముని బాణమా శిరమును మఱలఁ ద్రుంచినది. తెగిపడిన శిరము స్థానమున మఱొండు శిరము చెలువ మొప్ప నమరుచున్నది. రాముఁడు దానినిఁ గూడఁ దునుమాడినాఁడు. ఒక శిరమట్లు గోయఁ బదితల, లిరువది బాహువులు వెలయ రావణుఁ డుదిలపాటులేక నిలిచినాఁడు. రాముఁడా పదితలలు బలుశరముల ఖండించినాఁడు. తాళఫలము లట్లు భువి వ్రాలి యవి మఱల రావణునిఁ జేరినవి. రాముఁ డావిధమున నూటొక్కమాఱులు రావణుని తలలు నఱికినాఁడు. ఎప్పటియట్లు నవి యొప్పుచునే యున్నవి. రావణుని జీవితమున కవధి యెద్దియో తెలియరాదు. ఆతని యందొకింతయు నులికిపాటుఁ గనరాదు. అలమట నెఱుంగకావీరుఁడు రామునిపై నహంకృతి నెఱపుచుండెను. అట్టియెడ నావీరోత్తమాంగ కలనల తీరు వీక్షింప మిక్కిలి వింత గన్పట్టినది. (10 అ. 271 వ.)

ఇట్టి పద్ధతి చూపఱులకే గాదు రఘువీరునకు విస్మయముఁ గూర్చినది. లోకైకవీరుఁడగు రాముని శరజాలము రావణుని యెడ నిరర్థకము లగుట దేవదానవు లెల్లరు విస్మయోత్ఫుల్లలోచనులై దివిని - 'యింతవట్టు తెఱవు గాంచుచు నుండిరి'. (10 అ. 384 వ.)

---

1. కి. కాం.- 3 అ., 68-9 వ॥లు
2. కి. కాం. 3 అ., 70 వ.

అంత బ్రహ్మాస్త్రి ప్రయోగమున రాముఁడు రావణసంహార మొనరించి విజయమందుట సంభవించినది. లోకములకు శుభము సిద్ధించినది. దీనినే కవి -

"అల రావణుని తల లటునిటుఁ జూడక

త్రుంచిపోయెఁబెె మహాద్భుతమటంచు"

సంభావించినాఁడు. ఉత్తరకాండమున సీతారాముల వనవిహారఘట్ట మలౌకిక విషయ మగు యోగవిద్యారహస్య వివరణమై యద్భుతావహ మగుచున్నది.[1]

( ఉ. భా. 1 ఆ. 125-170 పుటలు )

ఈ ఘట్టము శాస్త్రి గారి రసనిర్వహణ సామర్థ్యమునకు స్వతంత్రకల్పనా శిల్ప నిర్మాణ చాతుర్యమునకు నాటపట్టుగఁ బరిగణింపఁదగియున్నది.

**శాంతము :** నిత్యానిత్య వస్తువిచారము వలన సిద్ధించిన విషయవిరాగ మను నిర్వేదము స్థాయిభావముగాఁ గలది శాంతరసము.

నిత్యానిత్య వస్తువిచారజన్మా విషయవిరాగాఖ్యో నిర్వేదః

- ర. గం-ప్ర. ఆ., 143 పు.

అనునది యాలంకారిక లక్షణము.

సిద్ధాశ్రమమున విశ్వామిత్ర యాగ పరిసమాప్త్యనంతరము మునులు గోష్ఠి సలిపి ప్రమాణపురస్సరముగా 'రామతత్త్వమే పరబ్రహ్మము'గా సంభావించి యానంద కందళిత హృదయారవిందులైరని వర్ణించుట శాంతరస ప్రధానము. ఇందు రాముఁడాలంబన విభావము కాఁగా మునులు చిత్తైకాగ్రత నొందువృత్తు లెడలి సుఖించిరి'. ఇట్టిది మనోజ్ఞమగు కవి స్వీయకల్పనము. ఇందు సన్నివేశ నిర్వహణ సామర్థ్య మనల్పము.

రామతత్త్వంబిదియె పరబ్రహ్మమనుచు
దపసులును దామఁ దత్పరతంత్రు లగుచు
నొందు వృత్తులెడలి చొక్కుచుండిరపుడు
విత్యతృప్తిగడల్కొ.న నీరజాక్షి

- బా. కాం.- 6 ఆ., 6 ప.

వృత్తి యనగా మనోవ్యాపారము. తత్పరతంత్రులై పరబ్రహ్మమును జేరి భజించువారికి నొండు వృత్తులింకెక్కడివి. అట్టియెడ నిత్యతృప్తి ఘటిల్లుట సహజము. ఇట మునులకు నిత్యానిత్య వస్తువిచారము వలన 'సంకల్పవికల్పకల్పన మిధ్యగాఁదోఁచి మనస్సున కేకలక్ష్యము సిద్ధించినది. (6 ఆ. 8 వ.)

నందిగ్రామమున భరతుఁడు రామపాదుకలకుఁ బట్టాభిషేక మొనరించి, తద వ్యమును విడిచి రామపరాయణత్వమున రంజిలుచున్ భక్తితాత్పర్యములుఁ దొలుకాడ భజించుచు విచిత్రచరిత్రుఁడై చెలంగుచుండె నని వర్ణించుటయుఁ బరవశమున దన్మయ మానసుడై చొక్కుచున్నాఁ డనుటయు శాంతరసమునకు లక్ష్యము. (అయో. కాం. - కాం. 9 ఆ., 407-8 పుఅు) కవి స్వీయ ప్రతిభావిలసితమగు నీ ఘట్టము మనోహరము. ( చూ. పాత్రచిత్రణము )

ఆశ్రమమున యమ నియమములు రూపములు దాల్చి శిష్యులై సేవించు చుండ నత్రిమహర్షి మూర్తీభవించినఁ బ్రహ్మతేజంబునా నెగడొందుచున్నాఁ డనుట మనోజ్ఞము, శాంతరస నిలయము నై వరలుచున్నది. (అయో. కాం. 10 ఆ. 586వ.) అత్రి యనసూయను గూర్చి చెప్పుచు నామె స్వరూప మామె స్వభావమును బ్రకటించు చున్నట్లు వర్ణించుట మనోహరము. మూలమునఁ గల స్వరూపవర్ణనమునకుఁ దోడు శ్రీరామకథాఽమృతమునఁ గల స్వభావ వర్ణనము బంగారమునకుఁ దావి యబ్బినయట్టు లైనది. 'ముదిమిపై నరసిన మూర్ధజమ్ముల యొప్పు ఆమె శుద్ధజీవనవృత్తి చొప్పుఁ జెప్పుచున్నది. శిథిలితావయవ సంశ్లేషం బశేషంబు పరిణామమునఁ గాంచు పాటుఁ దెల్పుచున్నది. కలుగు ప్రవాతపుం గదలిక కదలిక పాపభీతిత్వ సంపద వచించుచున్నది. 'అఘార్తినిఁ దరియించి మోక్షసామ్రాజ్యపదవి సంతరించిన' 'యనిందితాత్మ, సర్వతో వృద్ధ' యగు నామె జీవితము శాంతసుందరము. (అయో. కాం. 10 ఆ. 804-7 పుఅు) (చూ. పాత్రచిత్రణము)

రామపట్టాభిషేకోత్సవానంతర మయోధ్య వీడి చనిన కపివరులు రామ వియోగభరమున నన్యమును నిరసించి రామాజ్ఞన కైంకర్య సంపద నెగడి మునులకు లేని యేకాంతభక్తిఁ గలిగి శ్రీరాముఁ డాత్మారాముఁడు కాఁగా దదనుగ్రహంబు బడసిరని వర్ణించుట శాంతరసప్రధానము. (ఉ. కాం. పూ. భా. 10 ఆ. 214 30 పుఅు)

అమూలక మగు నిట్టి సన్నివేశ నిర్వహణము శాంతరసపోషణమునకు దోహదము గావించుచున్నది.

మఱియు సీతారాముల వనవిహార ఘట్టమున గుణాద్భుతుఁడు శాంతచిత్తుఁడు నయిన రాముఁడు రాజయోగమున నలరుచున్నాఁడని వర్ణించుచు శాంభవీముద్రాంకితునిగాఁ జెప్పుట శాంతరస నిర్వహణమునఁ గవి కృతార్థతను దెల్పుచున్నది.

చూచుం జూడఁ డటు ల్వీను న్వినఁడు మెచ్చున్ మెచ్చఁడానంద మ
గ్నాత్మై చెన్నొంగ రాజయోగమునవో నావృత్తికిం బ్రీతయై
సాచివ్యమ్మునఁ జిత్తమెత్తిన మహీజ న్మెచ్చగా వచ్చుఁ ద
త్ప్రాచుర్యం బభయంకరం బనుభవ ప్రాప్యంబచూ శాంభవీ !

— ఉ. కాం. - ఉ. భా., 1 ఆ., 17 ప.

అట్లే రాముఁడు 'సద్వితీయుఁడయ్యు నద్వితీయ సుఖంబనుభవించిన' వన విహార వర్ణన మంతయు యోగవిశేష మగుట శాంతమునకుఁ దగి యున్నది. [1]

ఈ విధముగ నవరసములు శ్రీరామకథాఽమృతమున సందర్భోచితముగఁ బోషింపఁబడి యమందానంద సందోహ సంధాయకము లగుచున్నవి.

## వర్ణనావైచిత్రి :

'లోకోత్తర వర్ణనానిపుణః కవిః' — కా. ప్ర., ప్ర. ఉ.

'దర్శనాద్వర్ణ నాచ్చాధరూఢాలోకే కవి శ్రుతిః' — కా. కౌ. - భ. తౌ.

అనునవి యాలంకారికోక్తులు. ఒకఁడు తాను దర్శించినదానినిఁ జక్కఁగా వర్ణించుట ద్వార లోకమున 'కవి' గా నెన్నఁబడుచున్నాఁడు. దష్ట్రియగు వాల్మీకి రామాయణ కథావర్ణనము వలన కవిగాఁ బ్రసిద్ధుఁడైనాఁడు.పద్యవిద్యకు నాతఁ డాద్యుఁడు.

కావ్యమున వర్ణనలు కథాంశమునకు భిత్తికల వంటివి. కవి వర్ణనల నాధారముగాఁ గొని యపూర్వములు నద్భుతములు నగు వస్తుజాతమును బ్రదర్శించుటయందు సమర్థుఁడగును. కవి ప్రతిభకు వర్ణనలు నికషోపలములు. వర్ణనల వలనఁ గావ్యమునకు వింతశోభ సిద్ధించును. అట్టి వర్ణనలు ప్రకృత కథోపయోగములై యున్నచోఁ గథకుఁ బుష్టిని, బాఠకునకుఁ దుష్టినిఁ జేకూర్పఁగలవు. కాకున్నచో నవి తీర్థమునకుఁ దీర్థముఁ బ్రసాదమునకుఁ బ్రసాదమ్మునై వస్త్వైక్యభంజకములై కావ్యమున దోషములుగాఁ బరిగణింపఁబడును.

---

1. ఉ. కాం. ఉ. భా. 1 ఆ., 125-71 ప॥లు

కావ్యమున నష్టాదశ వర్ణనము లుండవలయు నని యాలంకారికు లెల్లరుఁ జెప్పియున్నారు. అందు విద్యానాథుఁడు —

నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనం
ఉద్యానసలిలక్రీడా మధుపాన రతోత్సవాః
విప్రలంభో వివాహాశ్చ కుమారోదయ వర్ణనం
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయాఅపి
ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్య ముచ్యతే
— ప్ర. రు. కా. ప్ర. - 69-71 శ్లో॥లు

అనియు, సాహిత్యదర్పణకారుఁడు —

సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోషధ్వాంత వాసరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వనసాగరాః
సంభోగ విప్రలంభేచ మునిస్స్వర్గ పురాధ్వరాః
రణ ప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః
వర్ణనీయాః యథాయోగం సాంగోపాంగా అమీఇహ
— సా. ద. - అవ., 322-24 శ్లో॥లు

అనియు వర్ణనలఁ గూర్చి చెప్పియున్నారు.

తెనుఁగున నన్నెచోడుఁడు —

వన జలకేళీ రవి శశి
తనయోదయ మంత్రగతి రత క్షితిపరణాం
బునిధి మధు ఋతుపురోద్వా
హ నగవిరహ దూత్యవర్ణనాష్టాదశమున్—కు. సం.- 1 ఆ.

అనియు, నప్పకవి —

పురమును ఋతుషట్కమును బ్రయాణంబును
శైలంబు వేఁటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుతరణంబు

విజయంబు మద్యపానజ వికారంబును
వనవిహారంబును వారికేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోదితంబు

పద్మమిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస
— అ. క. - 1 ఆ., 28 ప.

అనియుఁ గావ్యమున వర్ణ్యము లగువానిని గూర్చి చెప్పియున్నారు. ఇందులోఁ గొన్ని వర్ణింపఁబడకపోయినను గావ్యత్వమున కెట్టి కొదువయు సిద్ధింపదు. సందర్భమునుబట్టి మఱికొన్ని విశేషాంశములఁ జోటుచేసికొనుటయుఁ బరిపాటి. కావుననే సంఖ్యావిషయమున పలువురు పలు యభిప్రాయములు వెల్లడించిరి. వాల్మీకమున నీవర్ణన లన్నియు సుమధురములు, సుస్నిగ్ధసుందరములుగాఁ జేయఁబడియున్నవి.

శ్రీరామకథాఽమృతమున మూలము నందలి వర్ణనాంశములతోఁబాటు స్వతంత్రభావములు కొన్ని వెల్లివిరిసినవి. అవి యన్నియు సర్వాంగసుందరములై కావ్యమునకు దీప్తి నిచ్చునవై యున్నవి. కథా తత్త్వముల వాల్మీకి - అధ్యాత్మములఁ జోడించుచు 'ననుబంధివర్ణనాంశముల స్వతంత్రించితి' మని పీఠికలో శ్రీ వేంకటప్పయ్యశాస్త్రి గారు తమ రచనాప్రకాశికఁ జేర్కొనుట గమనింపఁదగిన విషయము. ఆంధ్రీకరణమున మూలము నందలి వర్ణనలు యథాతథముగా సాగుట కవి సామర్థ్యమును బ్రకటించునవైనను, స్వతంత్రములు కవి వ్యక్తిత్వమును బ్రదర్శించును. అట్టి కేవల స్వతంత్రవర్ణనములు మాత్రమే యిట సంగృహీతములైనవి. అన్నింటను బ్రసిద్ధ కవిసమయములు పాటింపఁ బడినవి. ఇందు వారి బహుముఖప్రజ్ఞ లోకజ్ఞత, అనుపమ మగు కల్పనాసామర్థ్యము వ్యక్తమగుచున్నవి. అలంకార ప్రయోగదక్షత బహుధా ప్రశంసనీయము.

**పుర వర్ణన :** రామాయణము నందలి పురవర్ణనములలోఁ బ్రధానముగ గ్రహింపఁదగినవి యయోధ్యా, మిథిల, లంకా కిష్కింధానగరములు. అందు రాముఁ డవతరించి, రామాయణ గాథ ప్రవర్తిల్లిన పట్టణ మయోధ్య. వాల్మీకమున నయోధ్యా పట్టణమున ధ్వజములతోఁగూడిన యున్నతములగు నట్టాలకములు గలవని వర్ణింపఁ బడినది. 'ఉచ్చాట్టాలధ్వజవతీం'.[1] శ్రీరామకథామృతమునందు 'మేలి గర్జలనిపించు మృదంగనినాదములతోఁ గూడిన కులగిరి నిభములగు హర్మ్య కూటములు, విద్యుత్తు లను దలపించు విహారద్వధూ తనుద్యుతుల నెసఁగు నంబరచుంబి సౌధాగ్రతలములు, ఇంద్రాయుధములఁ బోలి దిగంతముల వఱకుఁ గట్టబడిన తోరణస్థములగు రత్నప్రభలు, ఆకాశగంగాతరంగము లనఁ దగిన తారకాపథవ్యాప్తములగు వైజయంతీ కళలుఁ గలవని వర్ణింపఁబడినది. ఇందు మృదంగనినాదములు మేలిగర్జ లనిపించుట, విహారద్వధూతనుద్యుతులు విద్యుత్తు లనిపించుట, తోరణస్థ రత్నప్రభలు ఇంద్రాయుధము లనిపించుట, తారకాపథవ్యాపకములగు వైజయంతీ కళలు ఆకాశగంగాతరంగము లనిపించుట భ్రాంతి. ఇన్నెన్నియో భ్రాంతులకు మూలమై యట్టి తలపోతలకు ముక్తిలేనిదాని మునులు ముక్తిపురవర మనుటలోఁ గల దేవరహస్యముఁ దెలియ రాదనుట చమత్కారసుందరమై కవుల వర్ణనావైచిత్రిని వెలార్చు చున్నది.

కులగిరినిభ హర్మ్యకూటస్థలీ మృదం
  గ వినాదములు మేలిగర్జ లనుచు
నంబరచుంబి సౌధాగ్ర భూవిహారద్వ
  ధూతనుద్యుతులు విద్యుత్తు లనుచు
నాశావలయ సముద్యత్తోరణస్థ ర
  త్నప్రభ లింద్రాయుధము లటంచు
నా తారకా పథ వ్యాపక వైజయం
  తీ కల ల్వినువాకతెర లటంచు
భ్రాంత లెన్నెన్నియో యిట్లు పరఁగుచుండుఁ
గాని యేనాఁడును విముక్తి ఘటనలేదు
ముక్తి పురవరమందురు మునులెఱింగి
దీని దేవరహస్యంబుఁ దెలియ టరిది

1 బా. కాం. 5. స. 11 శ్లో.

'దేవానాం పూ రయోధ్యా' యనునది శ్రుతివాక్యము. మోక్షదాయకములలో నయోధ్యాపట్టణ మొకటి యని ప్రసిద్ధము.

అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ హ్యవంతికా
పూరీ ద్వారావతీ చైవ సప్తైతా మోక్షదాయకాః ॥

అచటి గృహములు కళానిలయములై, స్త్రీలు సౌందర్యపరమావధులు కాఁగా, రత్నతోరణలఁగట్టు సంపదలతోఁ దులదూగుచు, నాకాశము నంటు జయపతాకాల నలరారి రనుటలోఁ బౌరుల విభవము విలాసము కళాసక్తి స్వాతంత్ర్య సుఖసంపదలు నిట సూచింపఁబడినవి.

అట్లే యా పట్టణమున సు విభక్తాంతర విపణివీథులు కలవని 'సువిభక్తాంతరాపణాం' [1] అనియు, సహకార వృక్షములతోఁ గూడిన యుద్యానవనము లున్నవని 'ఉద్యానామ్రవణోపేతాం' [2] అనియు వాల్మీకమున వర్ణింపఁబడినది. శ్రీరామకథామృతము నందా యుద్యానవనములు 'బీజ పల్లవ పుష్ప ఫలభరితములై శాద్వలములతోఁ గూడి క్రమముగా కెంపులు ప్రవాలములు పసిఁడిముద్దలు గరుడపచ్చలు మఱియు నెన్నియో విశిష్ట మణిగణములతో నిండిన విపణివీథులను బోలియున్నవని వర్ణింపఁబడినవి. ఒరులకు రెండును నేకవిధమున గోచరించుచున్నవి. వీటఁగడిసినగాని యా వివర మెఱుఁగరాదు' అనుట హృదయంగమము. ఉద్యాన వనములే ముందుగా విపణివీథుల వలె గోచరించుచున్నవి. చూపఱులొరులు పట్టణములోనికిఁ జని విపణి వీథులను జూచినప్పుడుగాని తాము మున్ను గాంచినవి యుద్యానవనములని తెలియలేరు. భ్రాంతి మదలంకార మిటఁ జక్కఁగా నిర్వహింపఁబడినది. పట్టణ విభవము నిందుఁ గీర్తింపఁ బడినది -

కీర ముఖ త్రుటితోరు దాడిమ బీజ
ములఁగాంచి మేలి కెంపులను గాంచి
నవనవోల్లసిత పల్లవ నికురంబమ్ము
లనుఁగాంచి సత్ప్రవాలములఁ గాంచి

---

1. బా. కాం.- 5 స., 10 శ్లో.

2. 5 స., 12 శ్లో.

పరిపక్వ సహకార భవ్యఫలోత్కర
మ్ములఁ గాంచి పసిఁడిముద్దలనుఁ గాంచి
యని శైకకలనా సమంచిత శాద్వల
మ్ములఁ గాంచి గరుడపచ్చలనుఁగాంచి
వికచ వివిధ పుష్పవితతులఁ గాంచి వి
శిష్ట మణిగణముల సిరులఁ గాంచి
కానరోరులు వీటఁగదియక యుద్యాన
భూములనుచు విపణిసీమ లనుచు

— బా. కాం.- 1 ఆ., 288 వ.

మఱియు నాపట్టణమున చాతుర్వర్ణ్య వ్యవస్థ, చతురంగబలాదిక వర్ణనము మున్నగునవి ప్రబంధోచితముగా నిర్వహింపఁబడినవి. [1] ఇవి యన్నియు సమూలకములై కావ్యమునకు వినూతన శోభ వెలయించుచున్నవి. ఇంకను నందు వరనారీమణు లుండిరని చెప్పినట్లుఁ 'వరనారీ గుణైర్యుతాం' [2] అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథాఽమృతమున నందు 'బతిహిత మతిఁ బార్వతియు, విద్యా కలనల భారతియు, సురుచిరత రతియు, సంపద్గతి శ్రీసతియు సాటియనందగిన పతివ్రత లుందురనియు' [3] అట్టి యుత్తమ గృహిణీ గణము సత్త్వవర్తనఁగలిగి స్త్రీ లోకమునకే యొజ్జబంతిగా నెన్నఁదగు స్థితి నెగడుచున్నదనియు వర్ణించుట రమణీయము.

ప్రొద్దు ప్రొద్దున మున్నె నిద్దుర మేల్కాంచి
ధవుని యంఘ్రులకు వందన మొనర్చి
యిష్టదైవత మెదనెంచి నెయ్యముఁ దోఁప
శ్వశురుల సేవ లాసక్తి నెఱపి

1. బా. కాం. - 1 ఆ., 293-307 పఙలు
2. వా. రా. 5 స., 26 శ్లో.
3. బాం. కాం. 1 ఆ., 308 వ,

యట బను లచ్చొత్తినటులె నొవ్వక దీర్చి
పిల్లలఁ గనరక ప్రీతిఁ గొసరి
సరస మృష్టాన్నము ల్సరగునఁ బొసగించి
తమవారి నతిథులఁ దనియఁజేసి

తొడవులకును మేలి తొడవు నానయ కాఁగఁ
బలుకు జంటితేనె నెలవుగాఁగ
గొనములెల్లఁ దాల్మిగొమరొంద శుభలీల
నెగడు నల కుటుంబినీగణంబు

— బా. కాం.- I ఆ., 309 ప.

మూలము నందలి 'వరనారీగుణము' లిట్లు ప్రవచించిన విధము ప్రశంసార్హము. స్త్రీ యిట్లుండవలయునని భావించిన కవి యాత్మీయత యిందుఁ గోచరించు చున్నది. ఇంకను నప్పురము సుపర్వవిలాసముగాఁ గీర్తింపఁబడుట హృదయంగమము. సుపర్వవిలాస మనఁగా నభ్యుదయపరంపరఁ గూర్చునట్టి పండుగలకు నెలవనియు, దేవతానిలయ మనియు నర్థద్వయముఁ జెప్పఁబడుట విశేషము.

మంగళదేవతాస్పదము మాన్యగుణాచ్యుత మాత్తభారతీ
సంగము బ్రహ్మవైభవ విచక్షణ మంచిత సర్వమంగళా
సంగజిదాఢ్య సజ్జనమహార్పతిభాసముచంద్రమఃకలా
ప్రాంగణ మప్పురంబెటు సుపర్వవిలాసము గాదనందగున్

— బా. కాం. - 1 ఆ., 325 ప.

ఇట విశేషణము లన్నియు శ్లిష్టములు. ఇందు మంగళదేవత యనఁగా లక్ష్మి, అచ్యుతుఁ డనఁగా విష్ణువు, భారతి యనఁగా సరస్వతి, బ్రహ్మ యనఁగా చతుర్ముఖుఁడు, సర్వమంగళ యనఁగాఁ బార్వతి, 'అనంగజిత్' అనఁగా శివుఁడు, అహర్పతి యనఁగా సూర్యుఁడు, చంద్రమస్ అనఁగా చంద్రుఁడు నని యర్థము గావున నది సుపర్వవిలాస మగుట చమత్కారసుందరము,

**మిథిలాపురము :** సీత పుట్టి పెరిగినదీ పట్టణము. విదేహాధిపతి జనకున కిది రాజధాని. జనకుని యాహ్వానమును బురస్కరించుకొని దశరథుఁడు సీతారాముల వివాహమునకై మిథిలఁ జేరెనని వాల్మీకమునఁ గలదు.

గత్వా చతురహం మార్గం విదేహా నభ్యుపేయివాన్

— బా. కాం. - 69 స., 7 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నప్పట్టున మిథిల 'అతను సామ్రాజ్యవైభవమంది మెఱసె' నని వర్ణించుట మనోహరము.[1] పురము నందలి పచ్చలతోరణములు వసంతపుష్పశోభగాను, మణిదీపికల కాంతి సంతతి చంద్రమండలాంచిత కళామహిమగాను, గానవిద్యాస్థానములు నటద్భృంగ లీలానూన విలసనముగాను, వందిమాగధ సూక్తిబంధములు శుకపికాద్యాలాపసంపదగాను జెప్పఁబడినవి. ఇందలి వసంత చంద్రులు భృంగ శుకపికాదులు మన్మథపరివారములోనివారగుట నది 'యతను సామ్రాజ్య వైభవము నందినద' నుట మిక్కిలి యౌచిత్యసుందరము. ఇట్టి కల్పన సందర్భశుద్ధి కలిగి సీతారాముల యనురాగసంపదకు దోహదముఁ గూర్చుచున్నది. మఱియు నన్నగరు మానవనాథ మానసాధ్యము, కవివర హృద్దేశమునన నవ నవోన్మేష మంది ప్రకాశించుచున్న దనుట మనోజ్ఞము.

వివరింతు సంగ్రహమ్ముగ
నవనవమున్మేష మంది నగరమ్మయి మా
నవనాథ మానసాధ్యము
కవివర హృద్దేశమనఁగఁ గనుఁగొన నొప్పెన్

— బా. కాం. - 9 ఆ., 287 ప.

రాముఁడు శివధనుర్భంగ మొనరించినాఁడు. అట్టియెడఁ దన తనయ సీతకు చక్కని వరుఁడు లభించె ననియు, దశరథు నంతవానితో వియ్యమందఁగల్గితి ననియు సంతోషించు జనకమహారాజు మానసము వలెను, లోకము నందలి సౌందర్యము నంతటిని భావమునఁ జేర్చి యొకచో దర్శింప, ప్రదర్శింపఁగల కవివరుని హృదయము

1. బా. కాం. - 9 ఆ., 282 ప.

వలెను నగరు నవనవోన్మేష మొందుచున్నది. ప్రకృతోపయోగమగు నిట్టి వర్ణన కవి ప్రతిభకు నిదర్శనమై కావ్యమునకు శోభనిచ్చుచున్నది. 'ప్రజ్ఞా నవనవోన్మేష శాలినీ ప్రతిభామతా' అను నాలంకారికోక్తి ప్రసిద్ధము.

**అర్ణవ వర్ణనము** సీతాదర్శన కాంక్ష హనుమదాది వానరవీరులు దక్షిణ సముద్రమును జేరిరి. అచట వారు 'క్రీడించుచున్న వివిధములగు జలజంతువుల తోను, వ్యాత్తాస్యములు సుమహాకాయములు, పర్వతోపమానములు నగు సత్త్వముల తోను గూడి, యొక దిక్కున ప్రసుప్తమయ్యు మఱియొక దిక్కున నూర్మికలతో నాడునదియు, బాతాళవాసులగు దానవేంద్రులకు గల యధిక సత్వప్రభావములు బ్రకటించునదియుఁ జూచువారల మేనులు గగుర్పొడుపఁ జేయుచు నానంద మొదవించు నదియు నగు సముద్రమును గాంచిరి' [1] అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథామృతమున మూలాధికముగా సముద్రప్రకృతి హృదయంగమమగురీతి వర్ణింపఁబడినది. (కి. కాం.- 3 ఆ., 254-6 ప॥లు) ఆంధ్రీకరణమున సముద్రుఁడు 'స్వకుటుంబినులతోడి సల్లాపమున నింపు జలపక్షిరుతముల కలిమి నొడువుట' నురువులు గట్టు తెన్నున నువ్వొంగు తరఁగల వీఁక యట్టహాసమ్ము నయమ్ము సూపుట, పర్వతంబుల కెగఁ బ్రాకిఁ జాఱు జలౌఘ మాటలాడెడు నెఱనీటు దెలుపుట, విశేషముగ వర్ణింపఁబడి 'లోతుపాతరయనీని సంద్రంబు ఆకసంబువలె దుష్పార' మనుటను బోధించుచున్నదని చెప్పుట కవి భావనాపటిమను వర్ణనా సామర్థ్యమును వెల్లడించుచున్నది.

వర్ణనలలో నదీవర్ణనమును ఆలంకారికులు పేర్కొనకున్నను కొందఱు మహాకవులు ప్రత్యేకదృష్టితో సమయోచితముగ నదీవర్ణనమును గూడఁ నిర్వహించి నారు. అర్ణవ వర్ణనానంతరము నదీవర్ణనము గూడఁ బరిశీలించుట సమంజసము.

**గంగానది వర్ణనము :** రామలక్ష్మణులు యాగరక్షణమునకై విశ్వామిత్రుని వెంట నరుగుచు గంగానదీతీరమును జేరినట్లు 'నద్యాస్తీరముపాగతౌ' [2] అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథామృతమున నయ్యెడ మూలాధికముగా 30 పద్యములలో గంగానదీ వర్ణన మనోహరముగా సాగినది. [3] అట్టి వర్ణన గంగయెడ

---

1. కి. కాం. 64 స., 5-7 శ్లో॥లు
2. బా. కాం.- 24 స., 1 శ్లో.
3. శ్రీ. రా. క. బా. కాం.- 5 ఆ., 187-216 ప॥లు

శాస్త్రి గారికిఁ గల యభిమానమును, గౌరవభావమును బ్రకటించుచున్నది. అందు విష్ణు పాదోద్భవయగు గంగ శివజటాజూటవాసిని యగుట, హిమవన్నగమునఁ బొడమి జగములఁ బావన మొనర్చుట, తన మేలిగుణములచేఁ బతికిసముద్రునకు ప్రేమాస్పదయగు ప్రియురాలుగా నెగడుట ఇత్యాదిగాఁగల విభవ మిట్లు హృద్యముగా నభివర్ణింపఁబడినది.

ఇది పాల్కడలికన్నె నెలమినేలెడు దొర
యడుగు గెందమ్ముల యలరుఁదేనె
ఇది గట్టు విలుపట్టు యెకిమీని సికఁజుట్టు
ననలారనీని చందనపుఁదేట
ఇది మంచుమలమేన నొదవి ముజ్జగముల
నెలకొనఁజాలు పున్నెములచాలు
ఇది తోయనిధికిఁ బెంపిడు మేలిగొనముల
వన్నెకెక్కిన గారవంపు టాలు

ఇది సగరు వంగడముఁ బంక మెల్లఁ గెడపి
పరమ సుఖమందఁజేసిన భాగ్యమహిమ
ఇది సురర్షులఁ బెతరుల నిన్నిజీవు
లను మనుచు తల్లి సురభి కల్పద్రువల్లి

- బా. కాం.- 5 ఆ., 195 ప.

అట్లే రామలక్ష్మణులు విశ్వామిత్రునితోఁ గూడి మిథిల కేగుచు 'ముని సేవితమై నదులలో శ్రేష్ఠమైనదియు, పుణ్యసలిలములతోఁ గూడి హంస సారస సేవితము నైన జాహ్నవిని సందర్శించిర' ని వాల్మీకమునఁ గలదు.

జాహ్నవీం సరితాంశ్రేష్ఠాం దదృశు ర్మునిసేవితామ్
తాం దృష్ట్వా పుణ్యసలిలాం హంససారస సేవితామ్

— బా. కాం.- 35 స., 7, 8 శ్లో॥లు

శ్రీరామకథామృతమున నయ్యది -

తపసుల పాలవెల్లి భవతాప నివారిణి పుణ్యరాశి భ,
ద్రపద యశోవిశాల సరితాంపతి కూరిమిరాణివాస మ
చ్చ(పు మణిమాల భూసతికి సారస హంస విహారసీమ యో
గ(పు ఫలితంబు సారమగుగంగ కనుంగవ కింపుగూర్ప(గన్

— బా. కాం.- 6 ఆ., 105 ప.

వారు దర్శించిరని మనోజ్ఞముగా వర్ణిం(బడినది. 'సరితాంపతికూరిమిరాణివాసము గంగ భూసతికి నచ్చపు మణిమాల' యనుట హృదయంగమము.

మఱియు రామాదు లరణ్యావాసమున కేగుచు గంగ సమీపించి 'ఊర్మికలతో( గూడిన యావర్తములు గలదాని( గంగ( గనుంగొనిర' ని వాల్మీకమున గలదు.

తా మూర్మికలితావర్తా మన్వవేక్ష్య మహారథః

— బా. కాం. - 50 స., 26 శ్లో.

శ్రీరామకథాఽమృతమున గంగ రామాదుల( గని తన పుట్టినింటివారను ముద మవ్వారిగ మురియుచు నుత్తంగతరంగితయై బిట్టుమ్రోయుచున్నదని వర్ణించుట మనోజ్ఞము.[1] రామాదులు భగీరథుని వంశమువా రగుట వారు గంగకు( బుట్టినింటి వారైనారు. స్త్రీ తన పుట్టినింటివారిని( గని యానందమున( బొంగుట స్వభావోక్తి. మఱికొంతదూర మాలోచించిన విష్ణుపాదోద్భవ యగు గంగకు రాము(డు బుట్టినింటి వా(డగుటయు సహజమేయగుచున్నది. ఇట్టి గంభీరార్థ గుంభనమగు నీవర్ణన మ్మధురము.

**ప్రయాగవర్ణనము :** శ్రీమద్రామాయణమున నదీవర్ణనమే గాక మూ(డు నదులు కలిసిన ప్రయాగక్షేత్ర ప్రసక్తియు( గలదు. శ్రీరామప్రభృతులు ప్రయాగ( జేరినట్లు చెప్పుచు —

యత్ర భాగీరథీ గంగా యమునాభి ప్రవర్తతే
జగ్ము స్తందేశ ముద్దిశ్య .... .... .... ....

— అయో. కాం. - 54 స., 2 శ్లో.

---

1. అయో. కాం. - 5 ఆ., 96 ప.

అని వాల్మీకమునఁ గలదు.

శ్రీరామకథామృతమున నయ్యెడ నా క్షేత్ర వైభవ మిట్లు వర్ణింపఁబడినది—

గంగ యమునతోఁ బ్రసంగం బెనసె నెందు
నెది తపస్విజనుల కేడుగడయొ
బ్రహ్మ యజన యోగభాసితం బా ప్రయా
గ స్థలంబు సేరఁగా దలంచి

— అయో. కాం. - 5 ఆ., 238 ప.

అని ప్రయాగక్షేత్ర విశేషము వర్ణింపఁబడినది. బ్రహ్మ యాగ మొనరించిన ప్రదేశము గావున నది 'ప్రయాగ' యనియు, నది తపస్విజనుల కేడుగడ యనియు మూలాధికముగా నాంధ్రీకరణమున వర్ణించుటఁజేసి తత్ప్రాధమ్య ముగ్గడింపఁబడినది. మఱియు నటఁ గల యంతర్వాహిని యగు సరస్వతీనది నభివర్ణించుచు —

సారస్వత ప్రవాహము
సార తరం బాంతర ప్రసక్తి నెగడు నీ
తీర మెనయువారికి మది
నారయఁ గొనరాని భాగ్యమని యొకఁడున్నే

— 5 ఆ., 241 ప.

అని యద్దానివి సర్వాభీష్టప్రదాత్రిగాఁ జెప్పుట మూలాధికము. ఇందు 'సరస్వత్యాః ఇదమ్ సారస్వతమ్' అను వ్యుత్పత్తి ననుసరించి సారస్వత ప్రవాహము అనఁగా కావ్యమనియు, నీతీర మెనయువారికిఁ గొనరాని భాగ్యమేదియు లేదనియు, మది నరయు వారికిది సుపద సంపద వెలయించుననియుఁ గావ్యార్థపరముగా వన్వయము లభించుచున్నది. ఇయ్యది తమ కావ్యవైశిష్ట్యము నుగ్గడించు 'కవి యాత్మీయత' యనియుఁ జెప్పవచ్చును.

**శైలవర్ణనము :** సముద్రమును లఘించు హనుమంతున కతిథి సత్కారముఁ గావింప మైనాకుఁ డబ్ధి వెలువడి నిలిచినాఁడు. అంత 'నా పర్వతము యొక్క బంగారు మయమ్ములైన శృంగములతో నీలాకాశము కాంచనప్రభలఁ బ్రకాశించు

చున్నది. మఱియుఁ బసిఁడి కొమ్ములు గల యా గిరిశ్రేష్ఠుఁడు స్వయంప్రభలతో విరాజిల్లుచు నాదిత్య శత సంకాశుఁడై యొప్పినాఁడు [1] అని వాల్మీకమునఁ గలదు.

శ్రీరామకథాఽమృతమున 'రత్ననిధి' యగు నాతఁడు తన 'హిరణ్యనాభ సంజ్ఞ' యన్వర్థము కాఁగా వెలుగు లాకసమున నిండఁ బొడసూపినాఁడని వర్ణించుట హృదయంగమము. పర్వతసానువులఁ బసిఁడి, పవడములు, పచ్చలు, మగఱాలు (వజ్రములు) మొదలగు రత్నములు లభించుట ప్రకృతి సిద్ధము. ఆ ధర్మమిట స్వభావోక్తి సుందరముగా వర్ణింపఁబడినది.

చొక్కంపుఁబసిఁడి రశ్ములు దిక్కులంబ్రాకి
విద్యుల్లతల సొంపువెల్ల డింపఁ
బవడంపు దీవెలు బయలఁగ్రిక్కిఱిసి బ
ల్సాంధ్యరాగశ్రీల సంతరింపఁ
బచ్చల మొలకలు బాఱుతళ్కులు మేఘ
మండలిఁ బచ్చిక ల్మెండు కొలుప
మగఱాల దీప్తులు మలసి రోదసి నింప
భానుకోటి స్ఫురత్ప్రస్తరింపఁ

బరిపరి పరశ్శతంబులై పరఁగు శిఖర
కటక పాదములెల్ల జగమ్ము లొడియఁ
జాలఁగ హిరణ్యనాభ సంజ్ఞందనర్చు
నతఁడు హనుమని కెదుట ప్రత్యక్షమయ్యె

— సుం. కాం. - 1 ఆ., 47 ప.

మఱియు హనుమకు విందొనరించుటకుఁ దగిన 'ఫలభారనమ్రములగు తరువులు, బూఁబొదలు అమృతసార పూర్ణములగు సరస్సులు, దివ్యౌషధములుఁ గలిగి యళిముఖనాదములతో నగ్గిరి యొప్పినదని చెప్పుట మూలాధికమగు సౌందర్యమును సంపాదించి పెట్టినది.

1. సుం. కాం. - 1 స. 105-6 శ్లో॥లు

ఫలభారనమ్రములు తరు
వులుఁ బూఁబొద లమృతసార పూర్ణములు సర
స్సులు దివ్యౌషధులును స్ఫుర
దళి ముఖనాదములతోడ నగ్గిరి నొప్పెన్

సుం. కాం. – 1 ఆ., 48 ప.

సందర్భోచితమగు నిట్టి కల్పన కావ్యశిల్పమున కత్యంత శోభఁ గూర్చుచున్న దనుట యతిశయోక్తి కాదు.

**ఋతువర్ణనము** : ప్రకృతిలోఁ గలుగు మార్పుల నాధారముగ సంవత్సరకాలము నారువిధములుగ ఋతువులను పేర విభజింపఁబడినది. కవులు తమ కావ్య జగత్తునుఁ దీర్చిదిద్దుటలో సమయోచితముగ ఋతుసౌభాగ్యమును మనోహరముగాఁ జిత్రించుచుందురు. ఋతువర్ణనము కవి ప్రతిభానిరూపకముగా నుండును.

**వసంతఋతువు** : "చైత్రవైశాఖ మాసములు వసంత ఋతువు. అంత మనోహరమగు వసంతము సంప్రాప్తింపగా దశరథుఁ డశ్వమేధయాగముఁ జేయ సంకల్పించినాఁ" డని చెప్పుచు వాల్మీకమున 'వసంతే సమనుప్రాప్తే' [1] అను వసంత ఋతు ప్రస్తావన గావింపఁబడినది. శ్రీరామకథామృతమున స్వతంత్రముగా నీ వసంతఋతు వర్ణనము సుమారు 40 పద్యములలో మధురమయఫణితి విపులముగా సాగినది. [2] అయ్యెడ మధుఁడు రాఁగా నతని ననుసరించి యహమహమికతోఁ జంద్ర మలయానిలాది తత్పరివారమంతయు వచ్చి చేరినదని యిట్లు వర్ణింపఁబడినది.

పవన స్నిగ్ధత, చంద్రవిర్మలత, దిగ్వైశద్య, మంభోజ బృం
దవికాసంబు, సరశ్శుచిత్వ, మలిగానశ్రీ, పికాభాష, క్రొం
జివురు, ల్మంజరు, లేమి నేమునని వచ్చె న్వాని వెన్నాని యా
నవరత్నంబు లొక్కొక్కచోట నను నా న్యాయం బుపేయంబుగాన్

బా. కాం.– 2 ఆ., 40 ప.

---

1. బా. కాం. - 12 స., 1 శ్లో.
2. బా. కాం. - 2 ఆ., 36-75 పద్యములు

చంద్రమలయానిలాదులైన వసంతుని యనుయాయి వర్గము సంఖ్య తొమ్మిది. 'రత్నాలన్నీ యొకచోట నత్తగుల్లలన్నీ యొకచోట' అన్న లోకోక్తిలోఁ బూర్వభాగ మిటఁ బ్రకరణోచితముగాఁ జెప్పఁబడినది. మఱియు 'మాధవసమాగమ విశేష మహిమ నట్టియెడ నారామలక్ష్మి పువ్వుల సొమ్ములు దాల్చి పుప్పొడి మైపూత నలది, యంఘ్రిలాక్షారక్తిఁ దనరి, పూగుత్తుల చీరె ధరించి చిలుక పలుకుల స్వారస్య ముట్టిపడ నవ్యరమ్యశుభలీల మెఱసిన దనుట మనోహరము.[1] ఇటఁ బుంలింగ స్త్రీలింగ స్వారస్యమునుబట్టి మాధవారామలక్ష్మలఁ బ్రణయతత్త్వము వర్ణింపఁబడుట రమణీయము, రసబంధురము. ఆట్లే వివిధ గతుల నెగడుచున్న వసంతము మన్మథుని ఫలసాయముగా నిరూపింపఁబడినది.

> ఒక్కట పూవుగుత్తు లటులుజ్వలఁపుం జివుఌ ల్మఱొక్కచోఁ
> జక్కని పూపపిందె లొకచక్కి నిఁకొక్కెడఁదోరగాయ లొం
> డొక్కెడ మేలు మేలిమియు నుంకువపెట్టెడు పండ్లుగూర్చు నా
> చెక్కఅనింటివాని ఫలసాయమ యామని యేమనందగున్
>
> బా. కాం.— 2 ఆ., 54 ప.

మఱియు నాసమయమునఁ దుమ్మెదలు తేనెసోనలను ద్రావి తృప్తితోఁ బాటలు పాడినవి. కోయిల లిగుళ్లు భుజించి కమ్మని రావము లాలపించినవి. చిలుకలు పరిపక్వఫలములఁ దిని సంతోషతరంగిత స్వాంతముల సభలఁ బలుకుచున్నవి. తామర కొలఁకులలోని జలపక్షులు పదక్రమవిహారము లొనర్చుచున్నవి. మధురాడ్వినోదము లౌనె యిట్లు సభలు, సమావేశములు, పాటలు, ప్రసంగములు ప్రవర్తిల్లినవి. ఇట వసంతుని ఋతురాజుఁగా వర్ణించుట మనోహరము. ఆ రాజసభల నివి విలసిల్లిన వనుట లోకజ్ఞత.

> తేనియసోనలందనియు తేటులపాటలు, లేఁజివుళ్ళపా
> లావి కిలార్చు కోయిలల యార్చటులు, న్ఫలసారతృప్తి సం
> దానిత కీరవాక్సభలుఁ, దామరసాకర భూశుచి ద్విజా
> త్యానతి కృత్పద క్రమవిహారములు న్మధురా డ్వినోదముల్
>
> బా. కాం.- 2 ఆ., 55 ప.

---

1. బా. కాం. - 2 ఆ., 51 ప.

ఇందలి ద్విజశబ్దము నందలి శ్లేష నాధారముగాఁ గొని వేదవిదులగు విప్రులచేఁ బఠింపఁబడిన వేదసంబంధమైన పద క్రమవిభాగములు సూచితము లగుట మనోజ్ఞము.

రాముఁడు పంపాసరోవరముఁ గాంచి దాని సౌభాగ్యమును వర్ణించుపట్ల 'బరిమళయుక్తమగు మధుమాసము పుష్పఫలద్రుమ సంపదతో నొప్పుచున్నద' ని వాల్మీకమున నిట్లు జెప్పఁబడినది –

గంధవాన్ సురభి ర్మాసో జాతపుష్ప ఫలద్రుమః
– కి. కాం.-1 స., 10 శ్లో.

అట్టిది శ్రీరామకథాऽమృతమున 'మధుఁడయ్యెడ విజృంభించినాఁడనియు, దేశకాలమ్ము లొకడైన తీరెఱింగి మరుఁడు వహ్నికి మారుగా మండుచున్నాఁడ' నుట హృద్యము.[1] మఱియు సర్వసమర్థుఁ డగు మాధవుఁడు మంత్రియై యా మన్మథుని మనోరథసామ్రాజ్య మేలించుచున్నాఁ డనుట మిక్కిలి మనోహరము.

చివురుల్ కోయిలబంట్లకున్, శుకహయశ్రేణు ల్భుజింపంగఁ దీ
పవుపండ్ల, న్మధుపాను జీవులకు దివ్యత్సూనగుచ్ఛంబులున్
వివరంబొప్పఁగఁగూర్చి శాతశరము ల్విఖ్యాతము ల్తద్విశే
ష విధిందార్చెడు వీడలంతియె మరు న్సామ్రాజ్య మేలించుచోన్
కి. కాం. 1 ఆ. 12 ప.

భటులు, హయశ్రేణులు, భృత్యులు, శాతశరములు, సామ్రాజ్యపాలనమున కపేక్షణీయములగు సాధనములు. మధుమాసము నందలి కోయిలలు, శుకములు, తుమ్మెదలు, పూవులు, మన్మథసామ్రాజ్యమున భటభృత్యాదివర్గమై యలరుచున్నదని వర్ణించుట యౌచిత్యసుందరము. ఇట్టి స్వతంత్రభావన కవివర్ణనా సామర్థ్యమును బ్రకటించుచున్నది.

ఉత్తరకాండమున శ్రీరామపట్టాభిషేకానంతరము ఋతుసమాజము సీతారాముల సేవించినట్లు చెప్పుచు వసంతుఁడు 'కర్మఠుల సోమయాజులఁగాఁ బొనర్చి యోగులకుఁ గూర్చు పండువు లొగి నమర్చి నొత్తిగిలువారి హత్తించి నురకతేర్చి భోగములఁదార్చి యందఱకుఁ గావలసినవాడైనాఁ డనుటలో వసంత ర్తు ప్రాధాన్య

---

1. కి. కాం.– 1 ఆ., 11 ప.

ముగ్గడింపఁబడినది. [1] మఱియు సామరస్యమున భావింప వసంతుఁడే తేఁడనుట నిట్లు సమర్థింపఁబడినది.

మధునామంబు వహించినాఁడు జనసమ్మాన్యత్వముం జెందినాఁ
డు ధరాచక్రము నాక్రమింపఁగనినాఁడున్ తేఁడనన్వాఁడె-1ఆ., 182 ప.

ఇట్టి వర్ణన కేవలము స్వతంత్రమై యాపాత రమణీయ మగుచున్నది.

గ్రీష్మర్తువు : జేష్ఠ ఆషాఢమాసములు గ్రీష్మఋతువు. శ్రీరాముని పట్టాభిషేకోత్సవానంతరము ఋతుసమాజము సీతారాములను సేవించినదని చెప్పుచు శ్రీరామకథామృతమున గ్రీష్మము స్వతంత్రముగా నిట్లు వర్ణింపఁబడినది 'గ్రీష్మమూష్మమగుచు రుద్రాంశ కలదై తన ప్రతాపము లోకమున వెలయించి లోకబాంధవునకు 'తపన' నామంబు ఘటింపఁజేసెనది. ఘర్మజలంబులు కాయంబులందెల్ల సంఘటించి సర్వసామ్యమును బ్రకటించినవి. స్వేద మధికముగాఁగూర్చి చిత్రించినట్లు చేతి కోక్కడుగాఁగ వీవనలు సమకూర్చినది. సతి పతుల కప్పట్టున బహువిధములగు నేత్రావధానంపు నేర్పు లలవరింపఁజేసినది. ఇట్లది నేలకు నింగికి నేకమై పొలిచినవి. [2] మఱియు గ్రీష్మమున జలాశయము లింకినవి. గాడ్పులధికముగ వీచినవి. శరీరమునఁ జెమటలుపొక్కులు పొడసూపినవి. వృక్షములు మోడులై నిలిచినవి. అగ్నిప్రమాదములు సంభవించినవి. ఇట్టివి గ్రీష్మమున సహజములయ్యు నిందు రామకథతో నన్వయించి వర్ణించుట మనోహరములై వెలయుచున్నవి.

రాముఁడిట్లంబుధి రాపొనర్చె నటన్న
వగ జలాశయముల నిగురఁబెట్టె
రావణుపై నిట్టి తీవరముం జూపె
నని గాలిఁగేలిగా నతకరించె
మగలు మల్లాడగ మగువ లిట్లైరని
చెమటలు పొక్కులుఁ జేర్చెనెందు
కపుల కోట్లల కిట్టిగతిఁ జిక్కిరరులని
ద్రుమములఁజూపె మొద్దులుగఁజేసె

---

1. ఉ. కాం .ఉ. భా.— 1 ఆ., 180 ప.
2. ఉ. కాం. ఉ. భా. - 1 ఆ., 187 ప.

చెలసి హనుమని పని ప్రదర్శింపఁబూని
యక్కడక్కడఁ గొంపల నగ్గిగొల్పెఁ
గాని యేలకో? యాగినాఁడానిదాఘుఁ
డాప్రకరణమ్ముననందుఁ దదభినయమ్ము

- ఉ. కాం.- ఉ. భా., 1 ఆ., 188 ప.

**వర్షర్తువు** : శ్రావణ భాద్రపదమాసములు వర్షర్తువు. మాల్యవంతమున నున్న రాముఁడు లక్ష్మణునితో వర్షర్తు సౌందర్యమును జెప్పుచు 'గిరిసన్నిభములగు మేఘములతో నాకాశమావరించియున్నద' నినట్లు వాల్మీకమునఁ గలదు.

సంపశ్య త్వం నభో మేఘైః సంవృతం గిరిసన్నిభైః

- కి. కాం.- 28 స., 2 శ్లో.

శ్రీరామకథాఽమృతమున 'వర్షపాతమున లోకము నాక్రమించిన వర్షాభ్ర విభుఁడు ఘనుఁడై కృషీవలాంగనల యాదరమునకు మేలికూర్మిచూడ్కులకుఁ బాత్రుఁడైనాఁడు. చాతకము లార్తిసీడి తృప్తినందినవి. నెమళులు పురివిప్పి యాడినవి. శరధారలచే నుప్పొంగిన కుంభిని పులకాంకురమ్ముల పొలుపుఁదెలిపినది. అట్టియెడ నితరులు తనకు సరిరారని యాతఁడుత్సాహమున గర్జించినాఁడు' అని వర్షర్తుశోభ స్వభావోక్తి సుందరముగా వర్ణింపఁబడినది.[1] మఱియుఁ బరరాజహంస వితతులను స్వస్థానభ్రష్టులఁ గావించియు, నిలయములఁజేర్చి పాంథనికాయమునకు సుఖముఁ బ్రసాదించియు, లోకమునకు జీవనసంపద నిచ్చియు, నబ్దాధీశుఁడు సమర్థుఁ డగు రాజుగా సన్నుతింపఁబడినాఁడు. కవిరాజనీతిజ్ఞత యిందు సునిరూపితము.

తన రాక నృరరాజహంసతతి స్వస్థానంబులంబాసి చ
య్యన నమ్మానస భూమికై తరల, సంస్త్యాయంబులంబొంది పాం
థనికాయంబు సుఖింప, జీవనరమోద్యద్దాత యీతండెపో
యని యెవ్వారును సన్నుతుల్సేయఁ నబ్దాధీశుఁడొప్పెంగడున్

— కి. కాం. – 2 ఆ., 7 ప.

---

1. కి. కాం. - 2 ఆ., 6 ప.

'ఘననిధాటికిఁ దమవారు కదిలి చనఁగఁ గమలినులుగాసిఁ జెందినను గువలయక్షేమ మిరువంకలఁ గుదురుకొనినది. ఆ సమయమునఁ గడిమలు జాజులు గొడిసెలు నాగకేసరములు మొదలగు వివిధ పుష్పవితతులు విలసిల్లి 'ధరావార్వంగికి న్భూషలై' యొప్పినవి. [1] ఇట్టి వర్ణన మమూలకమై కవిప్రతిభకు దర్పణముఁ బట్టు చున్నది.

అట్లే గ్రీష్మమునఁ గల్గిన దోసములఁ బోఁద్రోచి జగతి కీశఁడు శుభములఁ బ్రసాదించినాఁడని యిట్లు వర్ణించుట హృదయంగమము.

ఘన సాంగత్యము గల్గువారల యనర్ఘంబైన మార్గంబిదే
యనన్వైఁ బ్రేలు డడంచె స్వేదమొడిచెన్ హాయిం గనం జేసె ను
న్నన శైత్యంబు నమర్చె మేల సుఖసంతాన ప్రమోదంబులం
గను డంచ న్లైసకొల్పె దంపతుల దత్కాలంబు కాలేశ్వరీ !

— ఉ. కాం. - ఉ. భా., 1 ఆ., 192 ప.

ఘన శబ్దమునకు మేఘము, పెద్ద అను నర్థద్వయంబు లభించుటంబట్టి వర్షాకాలమునఁ గలుగు సుఖసంపదతోఁ బాటుగా నిట సత్సాంగత్యఫలంబు నుగ్గడింపఁ బడినది. పెద్దలతోఁ బరిచయ మేర్పడి యించుక బోధశాలియైనంత నాతనికి ముందున్న గర్వము నశించి 'ప్రేలుఁడు' అనఁగా వాచాలత తొలఁగిపోవును. ఇట్టి భావన కవిని భావుకలోకపట్టభద్రునిఁ జేయుచున్న దనుట యత్యుక్తి కాదు. మేను + ల అను బహువచనమున 'మేల' అను రూపముఁ బ్రయోగించుట కవి నిరంకుశతను వెల్లడించు చున్నది. వర్షర్తువు గర్భధారణకు విశేషించి యనుకూలమగు కాలముగాఁ జెప్పుట లోకజ్ఞతను నిరూపించుచున్నది. 'అన్నియుం గల్గువారి కవని హాయిఁగూర్చు సమయ మొండొక్కటి లేదు. ఇందు పైరులు పచ్చికలు ప్రజలు పశువులు తృప్తి ననుభ వింతురు. [2] మెఱుపుతోఁగూడిన మేఘునకు సీతతోఁ గూడిన రామునకు నభేదాధ్యవ సాయముఁ గల్పించి వర్ణించుట కవి కల్పనా శిల్పమునకు వింత సౌందర్యము సంత రించుచు శాస్త్రపాండిత్యమునకు నిదర్శన మగుచున్నది. ఇట్టి విశిష్టాద్వైత సిద్ధాంత

---

1. — కి - కాం - 2 ఆ. 8, 9 ప॥లు
2. — ఉ. కాం. ఉ భా. 1 ఆ - 195 ప.

ప్రతిపాదనముచే నద్వైతభావనముండు కవుల సమదృష్టి, సహిష్ణుత వెల్లడి యగుచున్నవి. మఱియునిట శివుఁడు పార్వతికి రామకథఁ జెప్పుచు కాలేశ్వరీ ! అని సంబోధించుట సాభిప్రాయ విశేషణము. ఋతువర్ణన సందర్భమున నీ విశేషణమౌచిత్య సుందరము.

సీతఁబోలు సౌదామని సేకరించి
తాను రాముని రంగైన తనవుఁదాల్చి
జగము తృప్తి దయాప్రవర్షములఁదార్చె
ఘనుఁడు తద్విశిష్టాద్వైత కలన లలన - 1 ఆ., 196 ప.

**శరదృతు వర్ణనము :** ఆశ్వయుజ కార్తీకమాసములు శరదృతువు. వర్షర్తువు గడచినంత శరదృతువు ప్రవేశించినది. సీతా విరహతప్తుఁడగు రాముఁడు వైరిపై దండెత్త సంకల్పించినాఁడు. అట్టి సమయమున వాల్మీకమున శరదృతుశోభ యిట్లు వర్ణింపఁబడినది - 'జలములు ప్రసన్నములైనవి. కుముదములు ప్రహసించినవి. క్రౌంచ నిస్వనములు వినవచ్చినవి. శాలివనములు పరిపక్వములైనవి. మృదువాయువులు వీచినవి. చంద్రుఁడు ప్రకాశించినాఁడు. నదీవధువుల గమనము మందగించినది. రాజు లన్యోన్య వైరముల సాధించుటకై దండయాత్ర వెడలుచున్నారు.[1] ఇవి యన్నియు వర్షర్తువుదాటి శరదృతువు వచ్చుటను దెలుపుచున్నవి.

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ మనోజ్ఞముగా నిట్లు వర్ణింపఁబడినది - 'సితాంభోజములు వికసించినవి. హంసలు మానసమువీడి వసుధకు విచ్చేసినవి. మొగిళులు విచ్చి చనినవి. శశికి, గ్రహములకు, ఋక్షంబులకు ద్యుతి హెచ్చినది.[2] మఱియు రాజులు దండయాత్రకై వాజి నీరాజనావిధులు వెలయించిరి. భృంగగీతి ప్రచారము లధికమయ్యెను. అగస్త్యనక్షత్రోదయముతో లోకమున నచ్ఛత వ్యాపించి దిక్కులు ప్రకాశించినవి. అంతటివఱకు క్షీరసాగరమున శేషశయనుఁడై నిద్రించిన హరి మేల్కాంచినాఁడు.[3] అవి మూలాధికముగా వర్ణించుటవలన ప్రసిద్ధములగు

---

1. కి. కాం. - 30 స., 54, 62 శ్లో॥లు
2. కి. కాం. - 1 ఆ., 99 ప.
3. కి. కాం. 2 ఆ., 103 ప.

కవి సమయములను బాటించుట యందును, సంప్రదాయమును వివరించుట యందును గవికిఁగల యభినివేశము వ్యక్తమగుచున్నది.

వర్షర్తువుతోఁ బోల్చినప్పుడు శరదృతువు మహాగుణనిధి యని చెప్పుచు వది యింటనున్న గింజలు మంటఁగలిపించి పైరుపచ్చఁ జూప నిది సస్యముల ఫలాధిక్యముం జూపి యలరఁజేయు ననుట హృదయంగమము. ఇట్టిది కవి ప్రకృతి పరిశీలనాదక్షతను వెల్లడించుచున్నది. మన్నునకు ఔపవిభక్తికరూపము మంట. భూమి యందని యర్థము.

ఇంటనున్న గింజలే మంటఁగలిపించి
పైరుపచ్చఁజూపువారిదర్తు
వట్టి సస్యముల ఫలాధిక్యముం జూపి
యలరఁజేయు నిది మహాగుణనిధి

— ఉ. కాం – ఉ. భా., 1 ఆ., 206 ప.

**హేమంతఋతువర్ణనము :** మార్గశీర్ష పుష్యమాసములు హేమంతఋతువు. అరణ్యకాండమున రామాదులు పంచవటిఁ జేరి నివాస మొనరించు సందర్భమున వాల్మీకము నందు హేమంతఋతు ప్రకృతి యిట్లు వర్ణింపఁబడినది. 'మంచు కురిసెడికాలము. ఈ కాలమున భూములు పండి ఫలవంతము లగును. నీరు మిక్కిలి చల్లగా నుండి యుపయోగించుటకు వీలుగా కుండును. హవ్యవాహనుఁడు సుభగుడై యుండును. జనపదులు ప్రాజ్యకాములైనారు. గోరసప్రచారము సంపూర్ణమైనది. మహీపాలులు విజిగీషువులై దండయాత్రకై వెడలుచున్నారు. [1]

శ్రీరామకథామృతమున మూలాధికముగాఁ దద్విశిష్టత యిట్లు వర్ణింపఁబడినది —

1. 16 స., 5, 7 శ్లో॥లు

అరయ నేలోపమును లేనిదని యొకండు
గలదె గుణవృద్ధి గని దానిఁ గప్పివుత్తు
రెల్ల సంపదలకు నిది హేతుభూత
మౌటగాదె శ్రుతి ప్రశంసార్హమయ్యె

– అర. కాం. – 1 ఆ., 367 ప.

లోకమున నేలోపములేనిది యొక్కటియు లేదు. కావునఁ గొన్ని లోపము లున్నను గుణవృద్ధిఁగని దీని సమ్మానింతురు. 'ఎల్ల సంపదలకు నిది హేతుభూత మౌట' శ్రుతిప్రశంసార్హమైనది. గీతాచార్యుఁడు విభూతి యోగమున 'మాసానాం మార్గశీర్షోహం' అనుట హేమంతము యొక్క ప్రాశస్త్యము నుగ్గడించుచున్నది. ఇట్టి సంభావన ఋతువర్ణనమునఁ బరమసుందరము.

**శిశిరఋతువు** : మాఘ ఫాల్గునములు శిశిరఋతువు. 'హేమంత లక్షణములే కలిగి యుండుటచే కాఁబోలు ఆంధ్రకవీశ్వరులు హేమంత వర్ణనముతో శిశిరము కిట్టించినారు'. [1] వాల్మీకమునను 'శిశిరోభోగదప్పదా' [2] అని శిశిరర్తువు సూచనాప్రాయముగాఁ జెప్పఁబడినది. శ్రీరామకథా౽మృతమున శిశిరుఁడు 'ప్రణయం బెడలంగ నీని బాధపరీరంభణ సౌఖ్యము'ఁ గలిగించి స్త్రీపురుషుల సమాగమము గూర్చువాఁడు. సృష్టిక్రమముఁ బ్రోత్సహించు మన్మథుని పరివారము లోనివాఁడు, లోకమును మంచుచే ముంచువాఁడుగాఁ జెప్పఁబడినాఁడు. [3] అగ్ని యాతనిఁ జూచి వెలవెలవాఱును. పాంథు లాతని పద్యన మెలగుదురు.

ద్వివిదునకు లంచములువెట్టి వెడలినాడొ ?
యగ్గి వెలవెలవాఱెఁడు నతనిఁ జూచి
యట్టులేచినవాని పద్యన మెలఁగని
పాంథులే లేరు లోకసంవాద మందు

ఉ. కాం. - ఉ. భా. , 1 ఆ. , 178 ప.

---

1. ఋతుసూక్తము - శిశిరవిలాసము, 143 పు.
2. ఉ. కాం. - 43 స., 25 శ్లో.
3. ఉ. కాం. - ఉ. భా., 1 ఆ., 175-77 పద్యాలు

ద్వివిదుడనువాఁడు వానరుఁడు. అతని కగ్ని స్తంభనవిద్య తెలియును. ఆతని యనుగ్రహముఁ బడసి వచ్చినవాఁడు శిశిరుఁడు గావున నగ్ని యాతనిఁగాంచి నీఱగును. నిప్పు నివురుఁ గప్పుట యనుభవసిద్ధము. వెలవెలఁవాఱుట యనఁ దెల్లగాపాలిపోవుట. నివురు తెల్లగా నుండును. ఇట్లు మూలాధికమగు నీ ఋతువర్ణనము సహజసుందరమై కవి వర్ణనా నిపుణతను వెలయించుచున్నది. నీఱు = బూడిద -

చంద్రోదయ వర్ణనము : చంద్రుడు తేరాజు. అతని యభ్యుదయము లోకమున కానందహేతువు. బాలకాండమునశతానందుఁడు విశ్వామిత్రచరిత్ర వివరించు సందర్భమున సూర్యాస్తమయమును సూచించుచు –

కర్మకాలో మునిశ్రేష్ఠ ! లంబతే రవి మండలమ్

– బా. కాం.- 65స. , 36 శ్లో.

అని చెప్పినట్లు వాల్మీకమున వర్ణింపఁబడినది. శ్రీరామకథాఽమృతమునందా సందర్భమున సూర్యాస్తమయ, చంద్రోదయాది వర్ణనము స్వతంత్రముగా నిర్వహింపఁబడినది. ప్రదోషకాలమున చంద్రుఁడుదయించినాఁడు. ఆకసమున చుక్కలు పొఁచినవి. అయ్యెడ దేవతలు మైథిలీపరిణయమునకు బాణసంచు సిద్ధపఱిచి ముందుగా మాదిరికిఁ గాల్చిన మతాబా యన్నట్లు చంద్రుడు వెలుగొందుచున్నాఁడు. తొలుదొత్తి రక్తుఁడై రాను రాను వెల్లగుణములతోఁ బ్రకాశించు చంద్రుడు మతాబాతోను, చుక్కలను వెన్నముద్దలతోను బోల్చుట హృదయంగమము.

ప్రకృతి పరిశీలనాశీలుఁడగు కవి సూక్ష్మదర్శనమున కిది నిదర్శనము. కవి సమాజమును వీడి బ్రతుకజాలఁ డనుట సత్యదూరముకాదు. చంద్రుని మతాబాతోఁ బోల్చుట యత్యాధునిక మగు నౌపమ్యము. ఇట్టి వర్ణన భావికథార్థసూచకమై కవి కథాకథన దక్షతను నిరూపించుచున్నది.

ఆయిదె మైథిలీ పరిణయంబని వేల్పులు బాణసంచు గ
ట్టాయితముం బొనర్చి విభుఁడౌననమాద్రికిఁ గొన్ని గ్రాలఁగా
జేయఁగ దొత్తిఁగెంపునటఁ జెల్వగు వెల్లయు మించు మేల్మతా
బాయనఁ జంద్రుఁ డింపెనసె భాసిలెఁ జుక్కలు వెన్నముద్దలై

– బా. కాం.- 8 ఆ., 26 ప.

చంద్రుఁ డుదయించినంత చక్రవాకములకు వియోగ మేర్పడినది. పద్మములు ముకుళించినవి. కలువలు వికసించినవి. అట్టియెడ కోకి విరహమునఁ బొగులుటఁ గాంచి పద్మిని వెతఁగుందినది. కలువతీవియ గర్వమున నవ్వినది. లోకమున విప్రతిపన్నులఁ గాంచి మంచి చేడియ లంగలార్తురు. ముక్కిడు లెక్క-సెక్కెము లాడుదురని వర్ణించుట మనోహరము.

ప్రియు నెడఁబాసి కోకి తన పెంపు సెడం బొగులంగ నట్లె తా
నయి మగఁ డొక్కచో నొదుగ హాయని పద్మినిగుందెఁ, గల్వతీ
వియ స్మయమొప్ప నవ్వె, భువి విప్రతిపన్నులఁగాంచి మంచిచే
డియ లటులంగలార్తురు, గడింతురు ముక్కిడు లెక్కసక్కెముల్
బా. కాం. - 8 ఆ., 32 ప.

ఇటఁ బద్మిని సాటివారి కష్టములకు సానుభూతిఁ బ్రకటించు సజ్జనులకుఁ బ్రతినిధి. కల్వతీవియ విప్రతిపన్నులఁ గాంచి పరిహసించు దుర్జనవర్గమునకుఁ బ్రతీక. ఇట్టి మధురోహ కవి వర్ణనాపై చిత్రికిఁ దార్కాణగా నెన్నఁదగియున్నది. మఱియు నీసందర్భమున రాముఁడు లక్ష్మణునితోఁ జంద్రుని గూర్చి ముచ్చటించుచు 'ఈ చంద్ర మండలము పాలసంద్రమున పొంగెసఁగఁబై దోఁచి రుచు లొనఁగు జున్ను గడ్డ, విధి దేవతల కేర్పఱచిన పేయరసాయన ఘటి, యొక్క ప్రొద్దుల నిగిరెడు చకోరపక్షులఁ దనియించు పుట్టతేనె, నీట సూర్యుని యెదుట గృశించి కలువచెలిగూర్చు సమాధికి ఫలము' అని సంభావించుట మనోహరము.[1] 'ప్రథమాం పిబతేవహ్నిః ద్వితీయాం పిబతే రవిః' ఇత్యాదిగాఁగల శ్రుతి చంద్రుని కళలు క్రమముగా దేవతల కాహారమగుటను వివరించుచున్నది. ఇట్టి శ్రుత్యర్థమే చంద్రుఁడు 'విధి దేవతలకేర్పఱిచిన పేయ రసాయన ఘటి' యనుటలోఁ జక్కగాఁ జెప్పఁబడినది. ఇంకను జంద్రునకు త్రిమూర్తు లగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులతో వేర్వేరఁ బోలికఁ జెప్పుట యపూర్వమై హృదయంగమ మగుచున్నది.[2] చంద్రుని నికుంజముతోఁ బోల్చి గతిలీల మొనయ కున్నచో 'చంద్రబింబమొ, యిది దోస్థహారుకుంజమో' తెలియరాదనుట యాపాత రమణీయము.[3] ఇట్టి వర్ణనములు కవి ప్రతిభకు నికషోపలము లగుచున్నవి.

1. బా. కాం - 8 ఆ. 145 ప.
2. బా. కాం. 8 ఆ. 145-151 ప.
3. బా. కాం. 8 ఆ. 154 ప.

అత్రిమహర్షి యాశ్రమమున ననసూయ సీతతో సంధ్యాసమయమైనదని చెప్పుచుఁ జంద్రోదయము సూచించినట్లు వాల్మీకమునఁ గలదు.

సంప్రవృత్తా నిశా సీతే నక్షత్రసమలంకృతా
జ్యోత్స్నాప్రావరణ శ్చంద్రో దృశ్యతేఽభ్యుదితోంబరే
— అయో. కాం. - 119 స., 9 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నా నెల స్వరాజ్యము తీర్పులొడ్లకు మార్గదర్శకముగా నేర్పిన విధము వర్ణించుట ప్రశంసార్హము.

కలువల నిద్రలేపి, శశికాంతములన్ హిమవారిపూరముల్
వెలయఁగఁజేసి, జక్కవలవీడుమర ల్నెలకొల్పి, యచ్చకో
రుల నెఱకోరు - లుల్లసిలు రూఢిన చెల్వులతోడఁగూర్చి వె
న్నెల లొలయించి, మించి, నెలనేర్పె స్వరాజ్యము తీర్పులొడ్లకున్
— అయో. కాం. - 10 ఆ., 248 ప.

నెల యనఁగా చంద్రుఁడు - చంద్రుఁడు రాజు. తన వారిని వెన్నుదట్టి జాగృతిపఱచుట, వారికి శుభములు గల్పించుట, కూడియున్న పెరవారికి విభేద మేర్పఱిచి స్వరాజ్యము నిష్కంటకముగా నేలుట రాజధర్మము. అట్టి ధర్మము నెలరాజు పాటించినట్లు వర్ణించుట హృద్యము. మూలాధిక మగు నీ ప్రకృతి వర్ణన మనోజ్ఞము.

**చంద్రాస్తమయ వర్ణనము**: మిథిల యందు ప్రభాతమున విశ్వామిత్రుఁడు రాముని మేల్కొలుపుచు చంద్రాస్తమయమును సూచించినవిధము రమణీయము. చంద్రుఁడు రాముని ముఖలక్ష్మి సంపద ముందు నిలువఁజాలక సిగ్గుతోఁగొండచఱి బాటం జాఱినాఁడు. పద్మినీసతి శత్రుపరాభవమును గని యనుమోదించుట యరవిచ్చిన ముఖపద్మముతోఁ దెలిపినది. శాస్త్రిగారియ్యది నిత్యము పఠించెడి వారట.

కనుమీ నీ నగుమోము మేల్సిరికి లక్ష్యంబౌటకున్ లజ్జ నె
ట్టన మున్మున్న మునింగి కొండచఱి బాటం జాఱె రేఱేఁడటం
చనుమోదించుటఁబద్మినీసతి నిజాస్య స్మేర దృష్టి ప్రసా
ర నవోల్లాసిత ప్రీణయై తెలిపెడిన్ రామా ! జగన్మోహనా !
— బా. కాం. - 9 ఆ., 52 ప.

పద్మిని, పద్మినిజాతి స్త్రీ. అనఁగా నాభిజాత్యముఁ గల వనితామణి. ఆమె పరవారికిఁ గలుగు పరాభవము ననుమోదించుట గూడ నవోల్లాసిత హ్రీణయై చిరునగవులోఁ దెలుపుచున్నదనుట యౌచిత్యసుందరము. పకపక విరగఁబడి నవ్వుట యేసందర్భమునందైనను స్త్రీకిఁ దగదనుట యుపదేశము. స్వకపోలకల్పితమగు నీ వర్ణన మనోహరము. శాస్త్రిగారి యాత్మీయత యిందుఁ దోచుచున్నది.

**సూర్యోదయవర్ణనము :** సూర్యుడు జగచ్చక్షువు. కర్మసాక్షి. బాలకాండమున శివధనుర్భంగముఁ గావింపఁబడిననాఁ డుదయమున మిథిలాధిపతి జనకనృపతి కృతకర్ముఁడై సరాఘవుఁ డగు విశ్వామిత్రుని సభామండపమున కాహ్వానించెనని చెప్పుచు సూర్యోదయమును గూర్చి వాల్మీకమున 'తతః ప్రభాతే విమలే' (బా. కాం. 66 స., 1., శ్లో.) అని సూచింపఁబడినది. శ్రీరామకథామృతమున నట్టియెడ 'చెలినాఁగఁ దెలివితేట లెసంగఁ బ్రాణులఁ దమ తమ పనులు సేయఁ బ్రేరణ నిచ్చువాఁడు, తండ్రివలె శ్రేయంబుఁ గూర్చు సత్క్రియకు మేల్కొల్పువాఁడు, తల్లి వలె వాత్సల్యమున నారోగ్య మెడలించి సుఖపుష్టి నొసంగువాఁడు, గురువు వలెఁ దమము మాన్పనీయక ప్రబోధకలనఁ దీర్పఁబూనువాఁడు. ఆత్మతత్త్వము వలె స్వయంప్రకాశమద్వయమఖండమానంద మవ్యయంబునై నిగమలక్ష్యమగు రూపమున వెలయువాఁడునైన వెలుఁగుల ఱేఁడు నాఁడుదయమందినాఁడు' [1] అని వర్ణించుట కవి భావనాబలమును, వర్ణనాంశముల నాతఁడు స్వతంత్రించిన వైఖరిని నిరూపించుచున్నది. సూర్యునకు మిత్రుఁడను నామము కలదు. మిత్రుఁడు హితము బోధించి కర్తవ్యోన్ముఖుని గావించును.

యోదేవ స్సవితాస్మాకం ధీయోధర్మాది గోచరాః
ప్రేరయే త్తస్య య ద్భర్గః తద్వరేణ్య ముపాస్మహే

అని సవితృఁడు సత్కర్మలకు మేల్కొలుపువాఁడుగాఁ గీర్తింపఁబడినాఁడు. 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అను ప్రసిద్ధమగు నార్యోక్తి భాస్కరుని యారోగ్యముఁ బ్రసాదించువానివిగాఁ బ్రశంసించుచున్నది. తమోవారణమునను, ప్రబోధసరణి నాతడు గురువుగాఁ జెప్పబడుట హృద్యము. ఆత్మతత్త్వ మనియుఁ ద్రయీమూర్తియనియు నిగమము లితనిఁ బ్రస్తుతించుచున్నవి. ఇట్టి గంభీరార్థ ప్రతిపాదనక్షమమగు నీవర్ణన శాస్త్రిగారి పాండిత్య సంపదను వెల్లడించుచున్నది. మఱియు సూర్యుడు లోక

1. బా. కాం. - 9 ఆ., 31 ప.

బాంధవుఁ డనుటయుఁ జక్కఁగా నిరూపింపఁబడినది.

> దొంగలఁదోలి, జారధృతిఁదోఁచి, యిరుల్వెడలించి, గోరముల్
> ద్రుంగఁగఁజేసి, పాపముల ద్రుంచి, యివంబుఁ దొలంచి తెల్విఁదే
> టం గలిగించి రాత్రి చరడంబరముల్దొలగించి, బ్రోచు మే
> ల్సంగతి లోకబాంధవతఁ జాటదె యీ యినువంకలెంకగన్
>
> -బా. కాం. - 9 అ., 50 ప.

ఇనుఁ డనఁగా రాజనియు నర్థాంతరము గావున నాతఁడు లోకబాంధవుఁ డైనచోఁ బాలన మిట్లుండు ననుట హృదయంగమము.

యుద్ధకాండమున రావణుని శక్తిపాతమున లక్ష్మణుఁడు మూర్ఛిల్లి మారుతి సమానీతమగు సంజీవన్యౌషధమహిమఁ దెలివినందినాఁడు. అప్పటికి సూర్యోదయ మైనది. రాముఁ డాసందర్భమున 'నేఁడు సూర్యాస్తమయ మగునంతలో దుష్టుఁడగు రావణుని సంహరింతునని' ప్రతిజ్ఞ సలిపినాఁడు. [1] అవ్విధమున సూర్యోదయము వాల్మీకమున సూచింపఁబడినది. శ్రీరామకథాఽమృతమున నయ్యెడ సూర్యోదయ వర్ణనము విశిష్టము, విలక్షణముగా సాగినది. 'వానరవీరుల ముఖములట్లు వారిజములు వికసించినవి. నిశాటమనముల వలెఁ గుముదములు ముకుళించినవి. సూర్యుఁడు తిమిరోద్యద్గజ రక్తసిక్తతను రక్తింబొల్చు సింహంబు వలెఁ బూర్వాద్రి యందుఁ బొడసూపినాఁడు. మఱియుఁ బ్రాక్కాంతా లలామంబు హస్తమునఁ గొన్న ప్రవాళ గుచ్ఛమో యన్నట్లు భాస్వతుఁడాసమయమునఁ బ్రకాశించినాఁడు. అట్లే యరుణుఁడు రామ మనోరథపరిపక్వఫలము వలెఁ దూర్పుదిక్కునఁ దోచినాఁడు. [2] ఇట్టి వర్ణన మమూలకమై రామవిజయసూచకముగా వరలుచుండుట మనోహరము.

ఉత్తరకాండమున హనుమచ్చరిత్ర వర్ణించు ఘట్టమున 'జపాపుష్ప సమూహము వోలె నున్న యుదయించు సూర్యుని హనుమ దర్శించినాఁడ' ని వాల్మీకమున వర్ణింపఁబడినది.

---

1. యు. కాం. 102 స., 46 శ్లో.
2. యు. కాం.- పూ. భా., 9 అ., 984-86 ప॥లు

తదోద్యంతం వివస్వంతం జపాపుష్పోత్కరమ్
దదర్శ .... .... - 35 స., 23 శ్లో.

శ్రీరామకథాఽమృతమున 'నేడ్చుచున్న హనుమకు భావిబంధ మెంచి భాస్కరుఁడు పొడసూపి యాతని నూరడించినాఁడ' ని ప్రకృత కథోపయోగిగా సూర్యోదయ వర్ణన సలుపుట హృద్యము. ఇందు ప్రతిపదము మనోహారి సంభావ్యమై, మంజులత వెలయించుచున్నది.

పుల్ల జపాకుసుమోల్ల సన్మూర్తియై
చిలుకల పందిరి చెలువు దాల్చె
నేడ్వకు మాయన్న ! యిటు సూడుమని తన
వేయి సేతులు నొడల్వెరయ నివిరె
నేకాకితకు భయమెనయకు మన్నట్లు
తోడుసూపెను తనతోడి జగము
వచ్చుచుంటిని లేర వత్స యూఱడు మని
యొక్కొక్క యడుగెడ నూచిపైచె
నట్టులుండి యుండి యా బిడ్డఁదన నెత్తి
కెత్తుకొనెనా యనఁగ నినునిసరణి
బాలతరణి సరణి భాసిల్లె నొక్కఁడై
మెఱుపు నిలిచి మెఱయు మెఱుఁగు నెఱయ

- ఉ. కాం.- పూ. భా., 8 ఆ., 25 ప.

మఱియుఁ బ్రభాతమున వైతాళికులు రాముని మేల్కొల్పుచు సూర్యోదయము సూచించునెడ నాటి సామాజిక దురన్యాయమగు కన్యాశుల్కమును గూర్చి ప్రస్తావించుట మనోజ్ఞము. సూర్యునకుఁ బద్మినికి నాయకానాయిక సంబంధము కవి సమయప్రసిద్ధము. దక్షాధ్వర సందర్భమున వీరభద్రుచరణాహతి డుల్లిన బోసి నోటివాఁడు సూర్యుఁడు. పండ్లులేనట్టి యా తాతకు నప్పుడే వికసించిన తామర విరికన్య నిచ్చి పెండ్లిసేయ యత్నించు జలాశయములు సాంధ్యరాగపుఁ దెరబట్టించి స్వీయ

ద్విజారావములఁ బ్రవర్తింపఁజేయుచు నానందమున నుత్తుంగ తరంగితము లగుచున్నవి. అవి 'జలసంఘాతము' లగుట నట్టి జడభావమునఁ బ్రవర్తించినవి వానికి బాంధవ్య జనిత మగు ప్రేమ లేదు. యాతని కడఁ గల 'రశ్మిలు' అనఁగా ధనము వారి నా విధమునఁ బ్రలోభ పెట్టినది. ఇట్టి కవి కల్పన మాతనికిఁ గల సామాజికస్పృహను, సంస్కరణాభిలాషను బ్రకటించుచున్నది.

అకటా న్యాయ్యము కానిదియ్యదియె దేవా ! పంక్తులేనట్టి తా
తకు రశ్మల్గని పద్మినిం గొమిరె ముగ్ధం బెండ్లి సేయించు పూ
వికఁ బట్టించెను సాంధ్యరాగపుఁ దెర న్వీవ్యయ ద్విజారావ భం
గ కరోత్తాడన భంగులొప్ప జలసంఘాతం బసద్బంధుతన్

- ఉ. కాం.- పూ. భా., 10 ఆ., 13 ప.

**సూర్యాస్తమయ వర్ణనము :** శతానందుఁడు విశ్వామిత్రచరిత్రఁ జెప్పి 'సూర్యుఁ డస్తాద్రి నెనయుచున్నాఁ డిది కర్మకాలమ' ని సూర్యాస్తమయమును సూచించినట్లు వాల్మీకమునఁ గలదు.

కర్మకాలో మునిశ్రేష్ఠ లంబతే రవిమండలం

- బా. కాం.- 65 స., 36 శ్లో.

శ్రీరామకథాऽమృతమున నయ్యెడ "సూర్యుఁడు హస్తాద్రిఁ జేర వారుణి 'వాసవసజ్జిక' యయ్యెను. పద్మిని 'ప్రోషితపతిక' యైనది. కోకి 'విరహోత్కంఠ' నధిగమించెను. గగనలక్ష్మి 'కలహాంతరిత' యయ్యెను. పశ్చిమదిక్కున నున్న కమలిని 'ఖండిత' గా నలరెను. సంజ సూర్యుని ననుసరించి 'యభిసారికా' త్వమునందెను. చాయ 'స్వాధీనపతిక' గా నెగడినది. తూర్పుదిక్కాంత 'విప్రలబ్ధా' త్వంబుఁబెరసెను" అని వర్ణింపఁబడినది. [1] ఇట్లు సవితృని నాయకునిగాను, ప్రకృతి నష్టవిధనాయికలుగను సంభావించిన విధము పరమ రమణీయతను వెలార్చుచున్నది. అట్లే యా లోక బాంధవుఁ డస్తగిరి వెనుక కరుగ విరులదొంగ యింక నఖిలమునకు నేనకాకొకండు రాజు గలఁడే యని దర్పమెనసినాఁ డనుట యాతని యౌద్ధత్యమును బ్రకటించుచున్నది. మఱియు, కూడి మెలంగియున్ మగని కూర్మి యెఱింగియు సంజఁగాంచి వెన్కాడఁ

1. బా. కాం.- 8 ఆ., 11 ప.,

దొడంగు చాయఁ గని సపత్ని వైరముగా నభివర్ణించి విహ్వాలుఁ డగు వేటి వెలుంగు వల్కొమల సంగమమెల్ల కుడంచుఁ జాటుచు నెటో చనియె ననుట హృద్యము,[1] సందేశాత్మకము నగుచు సహృదయుల నలరించుచున్నది.

హనుమంతుఁడు సముద్రమును దాటి లంకఁ బ్రవేశింప రాత్రి యగునంతకు వేచియుండెను. అప్పట్టున సూర్యాస్తమయమును సూచించుచు 'సూర్యేచాస్తంగతే'[2] అని వాల్మీకమునఁ జెప్పఁబడినది. శ్రీరామకథామృతమునఁ 'దన వంశమునకు మేలు గూర్చు పనిఁబూని సమయమునకు వేచియున్న శిష్యునిఁ గని యిఁక నిట మసలంజన దని సూర్యుఁ డస్తమించిదాఁడ' ని వర్ణించుట ప్రకృతోపయోగియై సహృదయ హృదయంగమ మగుచున్నది.[3]

రాముఁడు హనుమంతుని వలన సీత జాడఁ దెలిసి రావణుని సాధింప లంకపై దండెత్తి పోవుచు వానరసేన సముద్రతీరమున విడియింపఁజేసినాఁడు. 'ప్రియా విరహదుఃఖితుఁడై రాముఁడు విలపించుచుండ దినాంతమున భాస్కరుఁడు మంద రుచియై యస్తమించినాఁడ'ని వాల్మీకమునఁ జెప్పఁబడినది.

దినక్షయా న్మందరుచి ర్భాస్కరోఽస్త ముపాగమత్

- యు. కాం. - 5 స., 22 శ్లో.

శ్రీరామకథామృతమున నప్పట్టున మూలాధికముగా 'దేశముఁ గాలముం గడువరానివని చెప్పి సూర్యుఁడు తా నస్తంగతుఁ డయ్యు నుదయమునంద నున్నానని తెల్పి దుఃఖాబ్ధిఁ దెరలు మార్గమిట్టిదే యని రామునకు సందేశమిచ్చెననియుఁ బక్షులు భానుఁ డస్త మించినాఁడని యఱచుచు గూండ్లకుఁ జనెననియు, జక్కవకవలు ప్రలాపించిననియుఁ బద్మములు మొగిడిననియు రామునియంతరంగమున సీత వలపు లోకటఁజొరబాఱఁ దిమిరము జగమెల్ల నలము కొనినదనియు' వర్ణింపఁ బడినది.[4] ఇట్టివర్ణన కవి లోకజ్ఞతను, వర్ణనాప్రియత్వమును బ్రదర్శించుచున్నది. ఆ వర్ణన ప్రకృతోపయోగి యగుట ప్రశంసార్హము.

---

1. బా. కాం. 8 ఆ., 7 ప.
2. సుం. కాం.- 2 స., 59 శ్లో.
3. సుం. కాం.- 1 ఆ., 151 ప.
4. యు. కాం. 1 ఆ.

**సంధ్యా వర్ణనము :** సూర్యాస్తమయ చంద్రోదయములకు నడుమ నున్న కాలము సంధ్యాకాలము. వాల్మీకమున శతానందుఁడు విశ్వామిత్ర చరిత్రఁ జెప్పిన సందర్భమున సూర్యాస్తమయమును గూర్చి ప్రస్తావింపఁబడినది. శ్రీరామకథా మృతమున సూర్యాస్తమయ వర్ణనతోఁబాటు సంధ్యాసమయముఁ గూడ వర్ణింపఁ డినది. అందు 'నొక్క యినుఁడు నన మఱొక్కండు రాజుఁ రాఁజిక్కియున్న నడిమి యిక్కటమునఁ' గొందఱకు దైన్యము, మఱికొందఱకుఁ దేజము సిద్ధించినదని వర్ణించిన విధము హృద్యము.[1] ఇనుఁడనఁగా సూర్యుఁడు, రాజనఁగాఁ జంద్రుఁడు గావున సూర్యుఁడు డస్తమించి, చంద్రుఁడు డుదయించు నంతలో జరిగిన యవకతవకలు, నేర్పడిన యస్తవ్యస్త పరిస్థితులు నిట్లు మనోజ్ఞముగా వర్ణింపబడినవి. 'తమ్మిపూ దీవియ దైన్యంబున మునుంగ, గలువదీఁగె విరి జిగిఁ దొరయసాగినది. జక్కవలు వియోగవ్యథచే దుఃఖింపఁజకోరాలి చంద్రోదయమున గలుగు నుల్లాసమునఁ బొంగినవి. దారిదోపిడిగాండ్రకుఁ దెలివి యేర్పడినది. కాకి పిండువు గన్ను కావరాకొమఁగ, గూబ లక్కజపుఁ జూడ్కులఁ బొసగినవి. చక్కవలకు జారులిదె తఱి యని తిరుగాఁడగా దక్కిన జనులకు వింట నొదుగుట సంభవించినది' ఇట్టి వర్ణన కవి స్వతంత్రతను, ప్రకృతి పరిశీలనా సామర్థ్యమును బట్టి యిచ్చుచున్నది. మఱియు నీ సంధ్యాసమయమునఁ దమము వ్యాపించి 'తాళ్లను బాములు గాను, స్థాణువులను దొంగలు గాను, జూపి యెత్తు పల్లముల నేకము జేసి, కన్నుమిన్ను గానని గతిఁ దొనర్చి సంస్కృతి వలె సర్వము నాక్రమించి మించిన దనుట హృద్యము, తత్త్వార్థ సంభృతమునగు చున్నది.

తాళ్లఁబాముల నొనరించెఁ దవిలి స్థాణు
వులనె దొంగలుగాఁజూపెఁ గలుఁగు మిట్టు
గన్ను మిన్నునుఁగానని గతిఁ బొనర్చె
సంస్కృతియకాఁదమోవ్యాప్తి జనులకెల్ల

— బా. కాం.8 ఆ., 14 ప.

సంస్కృతి యనఁగా సంసారము. సంసారమున కజ్ఞానజనిత మగు భ్రాంతియే మూలము. అట్లే చీకటి లోకమును భ్రమింప జేసినది. మఱియు సుందర

1. బా. కాం. - 8 ఆ., 19 ప,

కాండమున హనుమ లంకఁ బ్రవేశింపఁ దఱివేచియున్న సమయమున 'సూర్యేచాస్తం గతే'[1] అని సూర్యాస్తమయము సూచింపఁబడినది. అట్టియెడ శ్రీరామకథాఽమృతమున స్వతంత్రముగాఁ జేయఁబడిన సంధ్యావర్ణన మత్యంత సుందరము. ఇట్టి ప్రకృతి సూక్ష్మపరిశీలన మీ కవి ప్రత్యేకతగా నెన్నదగియున్నది.

పతిఁబాసి యొంటిమై బడలు సాధ్వులమోము
అట్లు తామరపూవు లందమెడలె
వెడఁగు నేత్రముల కువ్విళ్లూరు నువిదల
కనులట్లు తొవలు వికాసమెనసెఁ
గైసేసి మగనిరాకకు వేచు నెలనాగ
అట్లు తారలు బయలంది మెఱసె
గడన చొప్పడ నింటికై మరలొ్కనుగేస్తు
అట్లు పుల్గులు గూండ్ల కరుగుదెంచె
సందుగని యొడ్లఁగాఱింప సంభ్రమించు
దొంగలట్టులు తొలుదొత్తుఁ దోఁచి నిలిచె
క్రమ్మెఁగడలెల్లఁ గటికిచీఁకటులు కడగి
సవిత్రుఁ డొండెడ కేగిన సమయమునను
— సుం. కాం. - 1 ఆ., 152 ప.

అప్పట్టున 'మేలిరంగు, కప్పు, నను భేదములేక లోకమొకటిగాఁ గాన నగుచున్న దనుట మనోహరము.

**ఉద్యానవన వర్ణనము :** సీతారాములు చిత్రకూటమున నున్న సమయమున రాముఁ డాగిరిప్రాంతమున నున్న వనవిశేషమును వర్ణించుచు -

ఆమ్రజంబ్వసనైః లోధ్రైః ప్రియాళైః పనసైర్ధవైః
అంకోలైర్భవ్య తినిశై ర్బిల్వ తిన్దుకవేణుభిః
— అయో. కాం. - 94 స., 8 శ్లో.

---

1. సుం. కాం. 2 స., 59 శ్లో.

అని యాయా వృక్షములఁ బేర్కొనినట్లు వాల్మీకమునఁగలదు. శ్రీరామకథామృతమున విశేషముగా నయ్యెడఁగల వనసౌందర్యము శృంగారరసబంధురముగా మధురఫణితినిట్లు వర్ణింపఁబడినది -

మాకందమిడనేర్చు మాకందములఁగూర్చు
చెలువున మాధవీ చేష్టితములు
పున్నాగముల గేరు పున్నాగములఁజేరు
గణికాళికల్పోప కల్పనములు
ఫలపూర పృథురస ఫలపూర సమరసా
భ్యాహిత ద్రాక్షోపగూహనములు
శ్రీఫలాశ్రయ కలాశ్రీ ఫలావాప్తికై
కేల్చాపు మాలతీఖేలనములు

పనస ఖర్జూర రంభాది పరిధవములు
దనదు బలఁగంబులోనిపై దనరుచుండఁ
బొనరు పడిన దివ్వనితోడ భూధరంబు
నామనం బాఁకవడి శ్రీసనాథమగుచు

— అయో. కాం. - 8 ఆ., 18 ప.

మఱియు నవ్వనమున 'పుష్పఫలభరితములు, ఛాయా సమన్వితములు మనోరంజకములు నగు వృక్షములు శోభల వెలయించుచున్నవని వాల్మీకమునఁ గలదు.[1] ఆంధ్రీకరణమున నచ్చట 'లతాకుడుంగములతోఁ గూడిన యా తరూత్తమములు పుణ్యము ల్సేయు మేలిగృహస్థుల' వలె నున్నవని సంభావింపఁబడుట రమణీయము.[2] ఇట్టి వర్ణన కవి సంస్కారమును బ్రకటించుటకు సమర్థమగుచున్నది.

1. అయో. కాం. 94 స., 10 శ్లో.
2. అయో. కాం. 8 ఆ., 17 ప.

అరణ్యవాస సందర్భమున తమ నివాసమున కుచితమగు ప్రదేశము నిర్దేశింపుమని యడుగ భరద్వాజుఁడు రామునితోఁ 'చిత్రకూటము సుఖప్రదమ' ని తెలిపినట్లు వాల్మీకమునఁ గలదు.

ప్రవివిక్త మహం మన్యే తం వాసం భవతః సుఖమ్
- అయో. కాం.- 54 స., 32 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నందలి రమణీయ సుఖ సంపదలు మూలాధికముగా నిట్లు వర్ణింపఁబడినవి -

పుణ్యప్రస్రవణంబు ల
గణ్యంబులు మధుర పృథుల కందఫలాదుల్
పణ్యాచితము లొవర్చు న
రణ్యంబులు దానిచోట్లు రమణీయంబుల్

కోకిల పంచమశ్రుతు లకుంఠిత చంద్రకిలాస్యకృత్యవ
త్కేకలపాకసంపదలు కీచక సంభృతవాంశికత్వముల్
నీకును నీసతీమణికి నిచ్చలుఁబొచ్చెములేని మెచ్చులం
గైకొని కూర్చుచుండు మదిఁ గావనవాస విశేషసౌఖ్యమున్
– 5 ఆ., 259-60 వ.

అది యొక రమ్యోద్యానవాటికగా, రామాదులకు వాసయోగ్యముగాఁ జెప్పఁబడినది. ఇట్టి వర్ణనము చిత్రకూటముయొక్క ప్రాముఖ్యము నుగ్గడించుచున్నది. ఇప్పట్టున నట్లు స్వాతంత్ర్యము వహించుట శాస్త్రి గారి వర్ణనాప్రియత్వమును బ్రకటించుచున్నది.

లంకలో హనుమంతుఁడు చూచిన యశోకవనము' ఫలపుష్పభరితములగు నానావిధ వృక్షములతోఁ జుట్టఁబడి, మదించిన కోయిలతోను, దుమ్మెదలతోను నిత్య నిషేవితమై యున్నదని, వాల్మీకమునఁ గలదు. [1]

---

1. సుం. కాం. - 14 స., 7 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నది 'సర్వార్థ సంభృతమై గార్హస్థ్యధర్మమ్మొ హొలమకాఁగా, నఖిల పురుషార్థములకుఁ దాననఁగఁజాలి వెలయు' చున్నదని చెప్పుట హృద్యము [1] ఇట్టి కల్పనమనల్పము, సంస్కృతీసంపన్నమునై యొప్పుచున్నది.

అయోధ్యఁ బట్టాభిషేకానంతరము సీతారాములు వనవిహారమున కేగఁ జిలుక వనవిశేషములు మనవిసేయుచు "భూదేవి విశ్వనారీ స్వరూప మావిష్కరింపఁ బూనినట్లు 'లీ వనము నవీనమై సౌందర్యమును వెలార్చు" చున్నదనుట మనోజ్ఞము. [2] ఈ వర్ణన మమూలకము. కవి స్వోపజ్ఞము. మఱియు సీతారాముల సంలాపముల సందర్భమున సీత రామునితో శ్రావ్యమగు శుకపిక శారికాది పక్షి రుతములతో సమాప్త జ్యోతిషంబైనచో నీవనము సాంగమై వేదమువలె నొప్పుచున్న దనుట పరమోదారమై విలక్షణమగు కవి దృష్టిని బట్టియిచ్చుచున్నది. ప్రకృతి వేదవేద్యుఁడగు పరమేశ్వరుని స్వరూపముగా సంభావించుట కవి తాత్త్వికజ్ఞానమునకు నిదర్శనము.

> శిక్షాపాటవ ముల్లసిల్లనగువాసిం దన్నవవ్యాకృతి
> ప్రేక్షావత్సమితిం జయత్వ కలనాస్ఫీత స్వనచ్ఛందమై
> యక్షుద్రంబు నిరుక్తవైభవ మనన్యాప్యంబెనానొప్పు నీ
> పక్షివ్యాహృత మిందు సాంగమె సమాప్త జ్యోతిషంబైనచోన్
>
> ఉ. కాం. - ఉ. భా., 1 ఆ., 52 ప.

ఇందు 'శిక్ష, వ్యాకృతి, ఛందము, నిరుక్తము, పక్షివ్యాహృతము' అనగా కణాదుఁడు రచించిన వైశేషికము, జ్యోతిషము, అను వేదాంగములు ప్రస్తావింపఁబడి సందర్భోచితముగాఁ బొందుపఱుపఁబడినవి. ఆ వనము 'సుమగంధము, ఫలరసము, సమంచితమగు రూపు,నీడ, చల్లదనము, నందము చందముఁ గల పులుఁగుల సుమహిత గీతార్థమర్థిసుఖ మమృతమిఁడున్' అనుటచే నిందు పంచభూతముల గుణము లెన్నఁ బడినవి. కావుననే లోకమున నొక్కొకటి యొక్కొక్క యింద్రియమునకుఁ దృప్తిఁ బ్రసాదింప నిది 'సర్వేంద్రియసుఖము నిచ్చి యమృత ప్రథితాఖ్య' వహించుచున్నది.[3]

---

1. సుం. కాం. - 1 ఆ., 342 ప.
2. ఉ. కాం. - ఉ. భా., 1 ఆ., 25 ప.
1. ఉ. కాం. - ఉ. భా., 1 ఆ, 54, 55 పలు.

సు + మహితగీతార్థము - సుమ + హితగీతార్థము నని విభజించుట సంభావ్యము. ఇట్లు వనము బ్రహ్మవిద్యాప్రపంచంబుగా దర్శింపఁగల కవి యుత్తమ సంస్కారమిటఁ బ్రదర్శింపఁబడినది. రామకథ యోగార్థబంధురముగాఁ జెప్పఁబూనిన వారికిట్టి యోజన పసిడికి పరిమళమబ్బిన వైనమును దెలుపుచున్నది.

**సలిలక్రీడ** వసంతము రాఁగా దశరథుఁడు అశ్వమేధయాగము సేయ సంకల్పించినాఁడు. 'వసంతే సమనుప్రాప్తే రాజ్ఞో యష్టుం మనోఽభవత్' [1] అని వాల్మీకమునఁ గలదు. శ్రీరామకథాఽమృతమున నయ్యెడ విపులమగు ఋతువర్ణనతోఁ బాటు స్వతంత్రముగాఁ బుష్పాపచయ, జలక్రీడాదు లభివర్ణింపఁబడినవి. అందు జలకేళి సలుపు వింతులు జలాశయము నందలి జలజాదులు తత్తదవయవసామ్యము నందఁ జాలవవి, యిట్టి వీనికి సారస్య మేల యని విసువుతో నిరసించిరని వర్ణించుట హృదయంగమము. [2] ముఖము పద్మముతోను, కనులు కలువరేకులతోను, పాలిండ్లు నెత్తమ్మి మొగ్గలతోను, కచభారమును శైవలముతోను, కులుకులు హంసనడకలతోను నౌపమ్యముఁ జెప్పుట ప్రసిద్ధ కవి సమయము. అవి యన్నియు నిటఁ బాటింపఁబడినవి. మఱియు లోకమున నుత్సవ సమయంబు లందుతులాభారముఁ దూగుట, తలఁబ్రాలోయుట, అవభృథ స్నానముతో దీక్ష సమాప్తము గావించుట, వినోదమునకై రంగస్థల నాటక ప్రదర్శనము, రసప్రసంగములు సలుపుట సంభవించును. అట్లే జలజనేత్రలా జలవిహారమహోత్సవమునఁ గ్రమముగ 'బద్మరాగద్యుతులఁ దులాభారంబు దూగునటు లీదులాడిరి. ముత్తియమ్ములఁ దలఁబ్రాలోయు మురువుదోఁపఁ జల్లు పోరాటము నెఱపిరి. మాధవదీక్షాంత నంపదవెలయింప నోలలాడిరి. మేలి స్మార రంగస్థల నాటక పాత్రవిన్యాస మొలయ జలక్రీడ లాడిరి. సుధర్మాతతాప్సరః ప్రసంగోచిత రసానురణన మొప్ప గీతములు పాడిరి' [3] అని చెప్పుట మనోహరము.

పులస్త్యాశ్రమమున దేవ పన్నగ రాజర్షి తనయులు, నప్సరసలు, విలాసముగాఁ బాడుచు, నాడుచు శబ్దములు సేయుచు విహరించిరని వాల్మీకమునఁ గలదు.

---

1. బా. కాం. - 12 స., 1 శ్లో.
2. బా. కాం. - 2 ఆ., 88 ప.
3. బా. కాం. - 2 ఆ., 95 ప.

గాయన్త్యో వాదయన్త్యశ్చ లాసయన్త్య స్తథైవచ
— ఉ. కాం. - 2 స., 11 శ్లో.

అట్టియెడ శ్రీరామకథాఽమృతమున వారు పూలుగోయుట, విరివమ్మి కొలఁకుల విహరించుట, తూగుటుయ్యెల లూగుట, పొదరుటిండ్ల దాగుడుమూత లాడుట, గానగోష్ఠి ప్రసంగంబులఁ బ్రవర్తిల్లుట విపులముగా వర్ణింపఁబడినవి. అందా కన్యకల జలక్రీడా విశేషములఁ గూర్చి చెప్పుచు 'గొమలు జలకేళికై సరసుఁ జొర బాల సరసులైర' వి వర్ణించుట చమత్కారసుందరము.[1] పదములు తాఁబేటులు, అంజలులు వికసించిన పొందామరలు, జంఘలు పుత్తడి మొసళులు, పెందొడ లేనుఁగు తొండములు, పొక్కిళులు సుడులు, వళులు తెరలు, పాలిండ్లు జక్కవ కవలు, మొగములు పద్మములు, కన్నులు తొవలు, కురులు శైవలములు ననుట కవి సమయములు. అవి యన్నియు నిటఁ జక్కగాఁ బాటింపఁబడి సరసుల నలరించు చున్నవి. ఇట్టి వీరు కొలకులఁ బ్రవేశించునప్పు డందలి జలజాదులు కలవర మందిన వనుట మనోహరము.[2] అట్టియెడఁ జెలుల పరస్పరాలాప ప్రచారములు విన వింపుగాఁ గన సొంపుగా నలరినవి. ఇట్టి స్వతంత్ర వర్ణన సహృదయ హృదయావర్జకమై నెగడుచున్నది.

ఆకట్ట నొరయ నీ కాకట్టెదను విన్నుఁ
బందెమ్ము పెట్టు మోపడఁతి యనుచుఁ
జేపట్టి విడనాడఁ జెల్లునే నీకిట్టు
లిది చెల్మి తెలఁగు గాదింతి యనుచు
నా రామకడచె బో యబ్జాకరంబెల్లఁ
బంతంబు కడముట్టఁ బాజె ననుచు
ముంతునా తేల్తునా మొగకొంటి నాచేతి
లోని దానివ యెటులేని ననుచు
పలుకు పలుకున రసపుష్టి పరిఢవిల్లఁ
బలుకులాడుచుఁ దమిమీఱఁ గులుకులాంధ్రు

1. ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 79 ప.
2. ,, 1 ఆ., 81 ప.

చెలువ మొప్పార జలకేళిసిరి ఘటింత్రు
ముని కొలనివట్టైనసి జగన్మోహనముగ
— ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 84 ప.

**మధుపానవర్ణనము :** 'మధురాక్షసుఁడు రావణునిఁ బూజించి వేడ రావణుఁ డాతేయి మధుని యింటనుండి మరునాఁడు స్వర్గముపైఁబోవ ప్రయాణమున కై సమకట్టినాఁడు'అని వాల్మీకమునఁ గలదు.

ప్రాప్యపూజాం దశగ్రీవో మధువేశ్మని వీర్యవాన్
తత్రచైకాం నిశాముష్య గమనాయోపచక్రమే
— ఉ. కాం. - 25 స., 51 శ్లో.

శ్రీరామకథామృతమున నప్పట్టున మధుఁడు రావణునకు విందొనర్చిన విధము మనోహరముగా వర్ణింపఁబడినది. అందు మధుపాన ప్రసక్తిఁ గలదు. కవి సన్నివేశనిర్వహణమునఁ బాటించిన స్వతంత్రత కిది తార్కాణము.

మైరేయమ్ములు మాంసఖండములు సంపాదించి సంపూర్తిగా
ప్రారంభించిన వంటకమ్ముల వసల్ ఘూణాగ్రబంధూ భవ
త్సారస్యంబున బిల్వఁ, బిల్వకయ మున్సన్నద్ధులై రెల్ల వా
రేరీ ? యన్యులు వీరిలో ననుచు నెంతే వేడ్క నంతంతటన్
ఉ. కాం. - పూ. భా., 5 ఆ., 258 ప.

మధుఁడు నాతని సతి కుంభీనసి స్వయముగా వడ్డనలు సేసి రావణాదుల యాదరముతో నలరించిరి. కుంభీనసి రావణుని చెల్లెలు.

మధుర మధురసా మధురస మధురిమములు
మధు సమధుర మాధవ మథితములును
మధుర మధురామ్లరసధునీ మాధురులును
మాధవులఁజేసె వారల మధుకృతములు - 5 ఆ. 261 ప.

అయ్యెడ మధుహితులగువారు మాధవులైరి. 'మధోరయం మాధవః' అను వ్యుత్పత్తి ననుసరించియు మధునకు సంబంధించినవా రగుట వారు మాధవులైరి. 'ఇపుడు మధుమాధవుల చేతిదీ జగమ్ము' అనుట తద్వికారమును వర్ణించుచున్నది.

**రతోత్సవము :** పెండ్లి పీటలపైఁ గూర్చున్న సీతారాములు, పరస్పరానురాగ సంభరితములైన కలికి చూపుల నేత్రావధానకేళి నెఱపిరి. కనులకుఁ దెలిసిన మూగభాష మాటల వర్ణింప నలవికాదు. (బా. కాం. 10 ఆ 389 ప.) కవి వాని నిట్లు రూపుకట్టించిన విధము మధురము. (చూ. రసపోషణము)

ఇట్టి స్వతంత్ర వర్ణనము దంపతుల ప్రీత్యతిశయమును స్వభావోక్తి సుందరముగా ప్రకటించుచున్నది. వివాహానంతరము దశరథుని పరివార మయోధ్యఁ జేరినది. అట్టియెడఁ గొత్తకోడండ్రు తమ తమ భర్తలతోఁ గూడి సుఖించిరని వాల్మీక మునఁ జెప్పఁబడినది. 'రేమిరే ముదితాః సర్వేభర్తృభిః సహితారహః' [1] శ్రీరామకథామృతమున సీతారాముల సంభోగశృంగార వర్ణన మౌచిత్యపరిపూర్ణముగా నెగడినది.

సీతాసరోజినీ శ్రీరాజహంసంబు
జానకీ వదనాబ్జ షట్పదంబు
పృధ్వీసుతాధర బింబికాఫలశుకం
బవనిజా లతికాశ్రయద్రుమంబు
మైథిలీ మల్లికాస్మయ తపాగమము వై
దేహీవయ స్సరిద్దృప్తగజము
నిమివంశవర్ధనీ నియమఫలము దేవ
యజన భూతానందనామృతంబు

రాముఁడటు సహధర్మిణీరాగవాహి
నీమహోర్మి ర సార్ణవంబామరా ప్త
కామతా శ్రీముఖము హితకామ్యకాము
దీ మహామునా నెగడె శైలదేవతనయ
— బా. కాం. - 10 ఆ, 519 ప.

1. బా. కాం. - 77 స., 25 శ్లో.

సీత సరోజినీ సంపద కాఁగా రాముఁడు రాజహంసయై వరలినాఁడు. జానకి వదనమబ్జముకాఁగా నాతఁడు తుమ్మెదయై తనరినాఁడు. పృథ్వీసుతాధర బింబికా ఫలమునకు రాముఁడు శుకమై వెలసినాఁడు. అవనిజా లతికకు రాముఁ డాశ్రయద్రుమమై నిలచినాఁడు. వైదేహీ వయస్సరస్సున నాతఁడు దృప్తగజమై విహరించినాఁడు. నిమివంశవర్ధనియగు సీత నియమమునకు రాముఁడు ఫలమై పొనరినాఁడు. సహధర్మిణి యగు జానకీ రాగవాహినికి రాముఁడు మహోర్మి రసార్ణవమై యలరినాఁడు. సీతారాముల దాంపత్య మాదర్శవంతమైన దగుట పవిత్రతకు భంగము వాటిల్లకుండు నట్లు వర్ణించుట కవి సంయమనమునకుఁ దార్కాణముగా నెన్నవచ్చును. నిత్యసంబంధములగు ప్రసిద్ధోపమానములు వారి యవినాభావ సంపదను వెల్లడించుచు వర్ణనా వైచిత్రి నౌచిత్యపరసీమ నందుకొనిన వనుట యత్యుక్తి కాదు.

**విప్రలంభవర్ణనము :** స్త్రీ పురుషుల వియోగమును విప్రలంభ మందురు. రావణునిచే నపహృతమైన సీత లంక నశోకవనమున రాక్షసీమధ్యమున బంధింపఁబడి దుఃఖించుచు మహావీరుఁడైన రాముఁడు తన జాడ తెలియుటలో నేల తామసించెనో యని శంకించుచు తన యునికి నెఱుంగలేకుండుటో లేక యాతనికి గల్గిన యాపదయో, తాత్త్వికవైరాగ్యమో, ప్రవాసదోషము వలన తన యందుఁ బ్రేమ నశించుటో, తన యవగుణమో, దురదృష్టమో అని చింతించినట్లు వాల్మీకమునఁ జెప్పఁబడినది. [1] శ్రీరామకథాఽమృతమున నయ్యెడ సీత 'తప్పఁబలుకుదాన దయిత ! లోకము పాడిగాఁగఁ బోల్పఁబడుదె నీవు'

> నీదు చరిత్ర శుద్ధి స్తవనీయ గుణోన్నతి దర్శనీయ రూ
> పోదయ మర్హణీయ మహిమోల్లసితంబు ప్రసన్నభావ మ
> త్యాదరవృత్తి శౌర్యము నయంబు ప్రబోధవిశేష మిద్దరన్
> లేదొకఁడేని నొక్కయెడ లెక్కకు నేనియు జీవితేశ్వరా !
>
> సుం. కాం. - 2 ఆ., 102 ప.

అని రాముని గుణసంపదఁ గీర్తించి మూలాధికముగా —

> కన్నులు చల్లగాఁ గమనీయ నీలమే
> ఘశ్యామలాంగు వినాంతు నొక్కొ

1. సుం. కాం. - 36 స., 39-45 శ్లో॥ లు

వీనులు దవియఁగా విశ్వజనీనము
　　లీనుదుపల్కులు వినవే ర్తునొకో
యుల్లము నొప్పింగఁగా యుష్మదీయ శరాగ్ని
　　యింతలింతలన నాలింతునొక్కొ
పరవశంబొప్పఁగాఁ బఱతెంచి నీయంక
　　పదమంది పగతురఁ బఱుతునొక్కొ
లంకచేరుడఁ గొమఁ లేర్వ లాఁతు లెడలఁ
దగిన నేత విచ్చోటునఁ దనరఁజేసి
యచిరకాలంబున నయోధ్య కరిగి యెల్ల
కోర్కులు భవత్ప్రసక్తిఁ జేకొందునొక్కొ
అనునడియాసల వింతకు
మనఁగలిగితిఁ బ్రాణనాథ మార్పడె సుకృతం
బనదవలె వింక బిట్టిడు
మనుబడి యిల విలువఁజాల మన్నింపఁగదే
　　— సుం. కాం. - 2 ఆ., 165-66 ప॥లు

అని పలికి రాముని దుఃఖమును దలపోసి 'మనకు ఋణానుబంధమ్ము తెగియె' నని కుందుచు నాతని ప్రతాప మెంచి, మాయదారి మృగము తమకు నెడబాటు గూర్చినదని తన యభాగ్యతకు శోకించినట్లు వర్ణించుట విప్రలంభమునకు పతాకయై కవి స్వతంత్ర తను జాటుచున్నది. [1] అట్లే 'తగిన నేత నిచ్చోటునఁ దనరఁ జేసి యచిర కాలంబున నయోధ్యకరుగ'ఁ దలచుట భావికథార్థసూచకమై కథాకథన సామర్థ్యమును నిరూపించు చున్నది. సీత జీవితేశ్వరుఁడైన రాముని సంభావించిన తీరు పాత్ర చిత్రణమునఁ బరమోత్కృష్టస్థానము నాక్రమించుచున్నది.

సీత వార్తఁదెలిసి రాముఁడు లంకపై దండెత్తి పోవుచు దక్షిణసముద్ర తీరమున సేనల విడియించినాఁడు. అయ్యెడ సీత గూర్చి లక్ష్మణునితోఁ జెప్పి

1. సుం. కాం. 2 ఆ., 167-69 ప॥లు

రాముఁడు విరహదుఃఖమునఁ బొగులుచు పలికిన పలుకులు విప్రలంభమున కుదాహరణములై రామునకు సీత యెడఁగల యనురాగ విశేష సంపదను నిరూపించుచున్నవి.
(యు. కాం., పూ. భా. 1 ఆ. 189 ప.)

**వివాహ వర్ణనము :** మహాద్భుత సుందరదృశ మగు సీతారాముల వివాహఘట్టము నభివర్ణించుచు వాల్మీకమున సర్వాభరణభూషిత యగు సీతను గొని తెచ్చి యగ్నిసమక్షమున రాఘవాభిముఖముగ నిలిపి జనకుఁడు రాము నుద్దేశించి 'యీ యది సీత, నా సుత, నీకు సహధర్మచారిణియై చాయ వలె విన్ననుగ మించును. పతివ్రత, మహాభాగ, యైన యీమెను బాణింబాణిగ్రహింపుము నీకు శుభమగు' నని మంత్రపూతమగు జలము ధారవోసినాఁడు' అని చెప్పఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నీఘట్ట మిట్లు మూలాధికముగా వర్ణింపఁ బడినది. 'మొదటగా జనకుఁడు సహచరీహస్తదత్త కనకకలశోదకంబుల రాముని పాదాబ్జ యుగలంబుఁ గడిగి తత్తీర్థము శిరమునఁ దాల్చినాఁడు. స్వాత్మ కృతకృత్యతకు సంతసించి సంకల్ప సిద్ధుఁడగు నతఁడు మహాసంకల్ప మొనరించి సత్ప్రసవ హిరణ్యాంకితశయుఁడై యవ్యక్తప్రభవుండు బ్రహ్మయని కీర్తించి యష్టే యర్కువిం బ్రశంసించి, యుభయ వంశముల వారి సంభావించి, యానందము వెల్లివిరియ నాసుత నీ సీతను ద్వత్సహధర్మ చర్యకై పరిగ్రహింపు మని యగ్ని సన్నిధిని సీత కరము రాముని కరమున నుంచి 'త ఇమాం దాస్యామి' యని యాదృతిమీఱఁ బలికి కన్య ధారవోసినాఁడు. రాముఁడంత సహధర్మాచరణ సత్ప్రతిజ్ఞ సలిపినాఁడు'.[2] బహు జన్మల కర్మబంధముఁ బోఁగొట్టు కన్యాదానము పుణ్యఫలపరిపాకముగా నెంచుట భారతీయ సంస్కృతి. ఇందు వధువును లక్ష్మిగాను వరుని నారాయణుని గాను సంభావించుట యుత్తమ సంస్కారము. ఇప్పట్టున జనకునకు నిజముగ లక్ష్మీస్వరూప మగు సీతను, నారాయణ స్వరూపుఁడగు రామునకుఁ జేచేతుల నిచ్చు భాగ్యము సిద్ధించినది. జలబుద్ధి యగు నబ్ధికీ యోగ్యత కలుగలేదు. కావున సీతఁడు సుకృతి యనుట హృదయంగమము.[3]

---

1. బా. కాం. - 73 స., 25-28 శ్లో॥లు
2. బా. కాం. - 10 ఆ., 358-64 ప॥లు
3. ,, 10 ఆ., 368-69 ప॥లు

ఇట్టి వర్ణనము కవికి గల వైదికనిష్ఠను, సముదాచారము నెడఁగల ప్రీతిని వెల్లడించు చున్నది. మఱియు నా వివాహమహోత్సవవేళ వివిధభంగుల వేడుకలు వెల్లివిరిసిన వని వర్ణించుటయు మూలాధికము.

కలిత స్వస్త్యయనోక్తు లై దువల సత్కళ్యాణ కాశాస్యరీ
తులు వైతాళిక సంస్తుతు ల్కవివచస్సోష్ఠూయ్యమానేతివృ
త్త లసన్మంగళ గీతవాద్యయుత నృత్తప్రక్రియారంభ గుం
భ లహర్యుత్సవ రంగభంగులుఁ దగె న్భావప్రభావోన్నతిన్

\- బా. కాం. 10 ఆ., 375 ప.

ఇవి యన్నియు వేర్వేర హృద్యముగ 12 పద్యములలో వర్ణింపఁ బడినవి. [1] అది కవిభావ ప్రభావోన్నతి యగుట ప్రశంస్యము. అమ్మహోత్సవం బున్నటు గన్నవారి కన్నులె కన్నులు, వారల జన్మమె యుత్తమ జన్మమని చెప్పుట యత్యంత మనోహరము.

కన్నులు గల్గిన న్ఫలము గల్గదు దేశము కాలమొక్కఁడై
మున్నొడఁగూడు నా సుకృతము న్ఫలవంతముఁజేయ మేలిమే
ల్గన్నదె కాన్పుగాఁగ యెది గన్ననుఁ గానుపె యమ్మహోత్సవం
బున్నటు గన్నవారలదె యుత్తమ జన్మ మనుత్తమ క్రమా

— బా. కాం. 10 ఆ., 291 ప.

**కుమారోదయ వర్ణనము:** శ్రీరాముని జననమును గూర్చి చెప్పుచు 'సర్వలోక నమస్కృతుఁడు జగన్నాథుఁడు సర్వలక్షణ సంయుతుఁడు నైన రామునిఁ గౌసల్య కనె' నని వాల్మీకమునఁగలదు.

ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్
కౌసల్యాఽజనయ ద్రామం సర్వలక్షణ సంయుతమ్

\- బా. కాం. - 18 స., 10 శ్లో.

---

1\. బా. కాం. 10 ఆ., 392-403 ప॥లు

శ్రీరామకథాఽమృతమున మూలాధికముగాఁ గోసలు కన్నె 'యమిత సుకృతచయఫలాప్తి వెలయ' నా పరమపురుష నఖిలనిష్ఠు' బుత్రునిగాఁ బడసిన దనియు, నయ్యెడ నభము జయము పలుకుట, జలధు లుప్పొంగుట, దిక్కులు తేజమునఁ బ్రకాశించుట, మేలి తెమ్మెరలు మెల్లన వీచుట సంభవించినదని వర్ణింపఁ బడినది. జగదీశుఁ డగు వాని యవతారమున కిట్లు ప్రకృతి పులకించిన దనుట మనోజ్ఞము.

సకలలోకనాథు సర్వనమస్కృతు
నఖిల లక్షణాఢ్యు నిఖిల నిష్ఠుఁ
బుత్రుఁగనియెఁ బరమపురుషుఁ గోసలు కన్నె
యమిత సుకృతచయ ఫలాప్తి వెలయ

జయము పలికె నభము జలధు లుప్పొంగెఁ బ్ర
సాదకలనఁ దనరె సకల దిశలు
మెల్ల మెల్లన వీచె మేలితెమ్మెర లీశుఁ
డవనిఁ బొడము నెడ నవాబ్జగంధి

— బా. కాం. - 3 ఆ., 28, 32 ప॥లు

'హరి యవతరించె నిఁక మన కరుల వలని భయమువాసె' నని సురలు పలికిరో యన్నట్లు దేవదుందుభులు మ్రోగినవి. అమరులు సామృత సూనరాశు లెల్ల భువనముల నింపిరి. [1] 'శ్రీరామకథాఽమృతము భువి నరప్రతతికింక ప్రేమ మమృతత్వ మిడునని నారదుఁడు వీణానువృత్తి నుబ్బుచుఁబలికినాఁడు'. [2] అపూర్వ మగు నిట్టి వర్ణన హృదయంగమము. ఇందు కావ్య పరమార్థము ప్రతిపాదింపఁ బడిన విధము రమణీయము.

**మంత్రము :** రహస్యసమాలోచనము మంత్రము. విభీషణశరణాగతి సందర్భమున రాముఁడు ముందుగా సుగ్రీవ హనుమమదాదులతో సమాలోచనము

---

1. బా. కాం. - 3 ఆ., 33, 34 ప॥లు
2. ,, 2 ఆ., 35 ప.

గావించినాఁడు. అందు సుగ్రీవుఁడు యుక్తియుక్తముగా విభీషణునిఁ జేకొన వలదని చెప్పినాఁడు. 'రాముఁ డంత హనుమదాదులగు వానర ప్రముఖులను గాంచి సుగ్రీవుఁ డనినది యుక్తమె యైనను సుహృదుల కార్యసంకటము లందు శ్రేయోర్థులు, బుద్ధి మంతులు నగువారుపదేశింపఁ దగియున్నది. కావున మీ యభిప్రాయముఁ దెల్పుఁడని యడుగ వారు వివరించిరని వాల్మీకమునఁ గలదు.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యెడ రాముఁడు —

> రక్కసు తమ్ముఁగూర్చి కపిరాజు వచించినదెల్ల వింటిరే
> అక్కఱగూర్చు పల్కయది యంతయు నర్థ్యమె హేతుయుక్తమే
> యిక్కమె యైనఁ గర్జమున నిర్ణయమును బొనరించుపట్లగా
> దొక్కని పైని భారమిడి యొల్లోకఁడాడక మిన్నకుంటయున్
>
> యు. కాం. - పూ. భా., 3 ఆ., 29 ప.

ఇత్యాదిగా పలికినట్లు వర్ణింపఁబడినది. ఇట మూలాధికముగా 'గార్య నిర్ణయముపట్ల నొక్కని యభిప్రాయముగాక పలువురి యభిప్రాయము మన్నించుట యుక్తమని భావించినట్లు వర్ణించుట విశేషము. అట్లే వారల యభిప్రాయములను విని తన నిర్ణయముఁ దెలుపుచు రాముఁడు 'దోషమున్నను మిత్రభావమునఁ జేరిన వారిని త్యజింపరాదు. అట్లు గ్రహించుట నిందింపఁదగినదియుఁ గాదు' అని పలికినట్లు వాల్మీకమునఁ గలదు.

> మిత్రభావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన
> దోషో యద్యపి తస్యస్యాత్ సతమేత దగర్హితమ్
>
> యు. కాం. - 18 స., 3 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ శరణాగతరక్షణము శ్రుతినిర్ణయం బనియుఁ, దనువనిత్యంబని తలచియు నభ్యాగతునిఁ ద్రోవఁ బున్నెంబు దొరయఁ దనియుఁ, బరిగ్రహించుటె పరమధర్మంబనియుఁ జెప్పఁబడుట మూలాధికము. ఇట్టి వర్ణనమున మంత్రము శ్రుతిహితము, ధర్మబద్ధమునై యుండవలయునను విషయము సూచింపఁబడినది. (యు. కాం.-పూ. భా. 3 ఆ. 59ప.) ఈ సందర్భమున రాముఁడు

---

1. యు. కాం. - 17 స., 31-4 శ్లో.

భార్యాపహర్త యయ్యు నార్తుఁడై యున్న కిరాతకునకుఁ గపోత మొక్కఁడు స్వీయ మాంసము నిచ్చి యర్చించె నని చెప్పినట్లు వాల్మీకమునఁ గలదు.[1] అనువాదమున దానికిఁదోడుగా 'వానర మొక్కఁడు వ్యాఘ్రభీతుని నరునిఁ దన్నుఁద్రోచి నయముఁ బాఁచినట్టివానిఁ గాచి తనదగు పలుకు నెఱపుకొన్న విధము స్వతంత్రముగా వర్ణింపఁ బడినది.[2] ఇట్టి వర్ణనము వలన శరణాగతరక్షణము నందలి మహిమ, తదావశ్యకమును జక్కగా నిరూపింపఁబడినవి.

ప్రయాణవర్ణనము : ( దండయాత్ర ) : 'రాముడు వారణ సన్నిభములగు శతసహస్రనియుతాయుత కోటి సంఖ్యాయుత మగు హరిసేన తోడు రాఁగా దక్షిణదిక్కునకుఁ జనినాఁడు. సుగ్రీవరక్షితమై యాతని ననుసరించు నా సేన నందఱు హృష్టులు ప్రముదితులునై యుండి' రని వాల్మీకమున వర్ణింపఁబడినది.[3] శ్రీరామకథామృతమున నయ్యెడ మూలాధికముగా –

> ఆ హరి నాహరివాహిని
> యూహ మెయిం గొలుచుచు న్మహేచ్ఛతఁ జను స
> న్నాహ మరసి యమరులు సం
> దేహంబుడివోవ మేలిధృతిఁ బెరసి రుమా !
>
> - యు. కాం.- పూ. భా., 1 ఆ., 103 ప॥

అని వర్ణించుట వారి బలగంపు విభవమును విక్రమమును బ్రకటించుచున్నది. దేవతలకు సందేహం బుడివోవ మేలిధృతిఁ గలిగినదనుట యా హరివాహిని విశిష్టత వెల్లడించు చున్నది. ఇట్టి భావన మనోజ్ఞము. అట్లే వారి యుత్సాహమును గూర్చి చెప్పుచు 'సర్వరాక్షసపరివృతుఁ డగు రావణుఁడు మాచే నిహతుఁడు గాదగినవాఁడని గర్జించుచు రాముని సన్నిధి నా హరివీరులు పలికిర' ని వాల్మీకమునఁ గలదు.

> రావణో నో నిహన్తవ్యః సర్వేచ రజనీచరాః
> ఇతిగర్జంతి హరయో రాఘవస్య సమీపతః
>
> - యు. కాం. - 4 స., 30 శ్లో.

---

1. యు. కాం. 18 స., 24-5 శ్లో॥లు
2. యు. కాం. 3 ఆ., 88 ప.
3. యు. కాం. - 4 స., 24-6 శ్లో॥ లు

శ్రీరామకథామృతమున నయ్యెడ 'వానరవీరులు రామునిచెంతజేరి రావణుని నేఁద్రుంతు నేన, నేనె యనుచు వింగిమట్ట విన్నపములు సలుపుచుండిరి. ఇతరులు తమ వంతని వీరతఁదక్కినవారును సంభాషించుచుండిరి. అట్టియెడ నా హరివాహిని 'నడిచెఁ బెండ్లి కట్లు ననుచు వేడ్క' నని వర్ణించుట హృదయంగమము.[1] మఱియు 'నవ్వానరవరు లెల్లరు సీతామోక్షణ తత్పరులు, రణాభినందన పరులునై త్వరితగతి నరిగిర' నుట స్వతంత్రమై సేనాసమూహము యొక్క యానందోత్సాహ శక్తులను బ్రకటించుచున్నది.[2]

**యుద్ధవర్ణనము :** దండకారణ్యమున రాముఁడు ఖరదూషణాది రాక్షసులతో యుద్ధ మొనరించు సందర్భమున 'రాముఁడు క్రుద్ధుఁడై మండలీకృత కార్ముకమున శతసహస్రములగు నిశితబాణముల వారిపైఁ బ్రయోగించినాఁడు' అని వాల్మీకమునఁ గలదు.

తతో రామః సుసంక్రుద్ధో మండలీకృత కార్ముకః
స సర్జ నిశితాన్ బాణాన్ శతశోऽథ సహస్రశః
- అర. కాం.- 25 స., 16 శ్లో.

శ్రీరామకథామృతమున నప్పట్టున -

పిలిచె బొట్టిడి తన్నుఁ బేరటంబున కంచు
బొమముడి మిష నల్కపొలుపు సూపఁ
జక్రాయుధ కలానుసంధానమున కల్కి
మండలీకృతము కోదండమనఁగ
నాగడంబిఁకఁజెల్లు ననరాదు లెండని
నారితీవె మహాస్వనంబు నెఱప

---

1. యు. కాం.- పూ. భా., 1 ఆ., 108-9 ప॥లు
2. యు. కాం. పూ. భా. 1 ఆ., 147 ప.

సృష్టికర్తనుగన్న సిరికెంత పనియంచుఁ
వింత నంచు సృజించు వెరవునొడువ
దరలె .... ....
శరము లసురజీవ హరము లగుచు

— అర. కాం.- 2 ఆ., 257 ప.

అని వర్ణింపఁబడినది. ఇట మూలము నందలి 'సంక్రుద్ధః' అనునది 'పిలిచె బొట్టిడి తమ్ముఁ బేరటంబునకంచు బొమముడి మిష నల్కఁబొలుపు సూపె' ననియు, 'మండలీకృత కార్ముకః' అనునది మండలీకృతమగు కోదండమున చక్రాయుధ కలాసంధానమున కల్మిఁ బ్రకటించుచున్న' దనియు వివరింపఁబడినది. మూలమునలేని నారితీవె మహాస్వన మిందుఁ జోటుచేసికొని రక్కసులకు 'నాగడంబిఁకజెల్లు ననరాదు లెండని' చెప్పినది. మఱియు నట్టి వింత నంచు సృజించు వెరవాతని సృష్టికర్తను గన్న (విష్ణువు)సిరిగానొడువు చున్నదనుట యత్యంత మనోహరము. అట్లే 'రాక్షసు లన్నిదిక్కుల నుండి చుట్టిముట్టి రామునిపై శరవర్షములఁ గురియించిరి. రాముఁ డంత భైరవనాద మొనరించుచు పరమ భాస్వరమగు గాంధర్వాస్త్రమును బ్రయోగించినాఁడు. శరాంధకార మక్కు నాక్ర మించినది. రాముఁడు శరమోక్షణముఁ గావింప నందఱు నొక్కసారిగా నేలవ్రాలి హతులగుచున్నారు. విహతులగువారిచే భూమి కప్పఁబడినది. అమ్ములపొది నుండి బాణమును గ్రహించుట, ధనువున సంధించుట, విడుచుట యను క్రమ మెఱుఁగఁబడ కున్నను దశదిశల నాక్రమించు శరములచే రాక్షసులు కొట్టఁబడుచున్నారు' అని వాల్మీకమున విపులముగ 7 శ్లోకములలో వర్ణింపఁబడినది.[1] శ్రీరామకథామృతమున నా వర్ణనము మనోజ్ఞముగా సాగినది. అందు రాక్షసబలము మంచు మూగినకరణి సామర్థమున రఘునాథ దిననాథుని గప్ప నాత డస్త్రతేజోవిశేషమున వెలుగొందినాఁ డనుట సాభిప్రాయ సుందరము. రాక్షసబలమును మంచుతోను, రాముని సూర్యునితోను బోల్చుట వలన రాముని విజయము సూచితమైనది. ఎంత దట్టముగా వ్యాపించినను మంచు విరియుట, సూర్యుఁడు ప్రకాశము నందుట యనుభవ సిద్ధమగు విషయము. ఇట నలంకారప్రయోగము వలన మూలాధికమగు సౌందర్యము నంతరింపఁబడినది.

---

1. అర. కాం.- 25 స., 36-42 శ్లో॥లు

మంచుమూఁగిన కరణి సామర్షమగుచుఁ
గప్పె రఘునాథ దిననాథు క్షణములోన
రాక్షసబలంబు శరవర్ష రూక్షమగుచుఁ
గదిసి పైఁబడి వికచ చంపకదళాక్షి !

- అర. కాం.— 2 ఆ., 170 ప.

మఱియు 'శరాంధకారము భానునాక్రమించినదేగాని స్వీయతేజమతిశయించినది. ధనుశ్చాలన మగపడకున్నను విశిఖపంక్తి విశ్వరూపముఁ దాల్చి యంతటను నిండినది. బాణసంధానముఁ, బ్రయోగముఁ దెలియకున్నను లక్ష్యపాత మాతని లాఘవమును దెలుపుచున్నది. జ్యా శింఖినినదప్రసక్తి కలిగినంతనే యెదిరి హాహా రవము లధిక మాయెను. శాంబరీప్రభావ లబ్ధి నిట్లు దేవతలు మెచ్చుకొన రాముఁడు రాక్షస సంహార మొనర్చినాఁడు. పతితులు నిహతులు నగు వారిచేఁ గప్పఁబడి వసుధ వింత విధమునఁ దనరినది' అని విశేషముగా వర్ణించుట రాముని యోధాగ్రేసరత్వమును నిరూపించుచున్నది. [1]

'రామ రావణుల కేర్పడిన యుద్ధ మద్భుతమై రోమహర్షణ మగుచున్నద'ని వాల్మీకమునఁ గలదు.

తత్ బభౌ చాద్భుతం యుద్ధం ద్వైరథం రోమహర్షణమ్
రామస్యచ మహాబాహో రావణస్యచ రక్షసః

- యు. కాం. 102 స., 18 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నయ్యెడఁ గోదండరాముని తేజముఁ గాంచిన కన్నులె కన్నులని యభివర్ణించి, వారిరువురి నడుమ 'దారతమ్య ప్రచారంబు తవులు విడవులేని దగుడుఁ దదాఖ్యానలీలలొలసి' న వని చెప్పుట హృదయంగమము. [2] అట్లే 'రాముని జయసూచకములై యంతట శివములు సౌమ్యములు నైన నిమిత్తము

---

1. అర. కాం. 2 ఆ., 173—4 పాలు
2. యు. కాం.— పూ. భా., 10 ఆ., 169—70 పాలు

లెన్నియో పొడమిన వని వాల్మీకమునఁ గలదు.[1] శ్రీరామకథామృతమున జయశంసనములగు నానిమిత్తము లిట్లు మనోజ్ఞముగా వివరింపఁబడినవి.

పూవులు చల్లకంబు పరిపోషణముం బొనరించు వంక నె
త్తావులు నెక్కొనన్ సులలితంబులు భృంగ రవానుషంగముల్
శ్రీవిలస ద్వనోప వనసీమ విహారము లొప్పఁ బయ్యెరల్
పావనమూర్తి రాము జయపద్ధతిఁ బేర్కొన నయ్యె నయ్యెడన్

పరఁగె భౌమములు నభౌమమ్ములును సాత్త్వి
కమ్ము లాంగికములుఁ గలసి మెలసి
తెలివితేట లెనయ దిక్కులతోఁ గూడి
రాము మేలుసూపు రాణవొలయ

- యు. కాం. - పూ. భా. 10 ఆ., 308-9 పలు

మఱియు 'రథాధిరోహణులగు రామ రావణులకు జరిగిన ఘోరయుద్ధము లోకభయావహమై వెగడినది' వి వాల్మీకమునఁ జెప్పఁబడినది.

తతః ప్రవృత్తం సుక్రూరం రామరావణయోస్తదా
సుమహత్ ద్వైరథం యుద్ధం సర్వలోక భయావహమ్ – 109 స., 1 శ్లో.

శ్రీరామకథామృతమున నది —

ఆవల రామరావణుల కయ్యె దురంబు సమస్తజీవ భీ
త్యావహ మత్యుదార మహిమాస్పద మాద్యమహాస్త్రమంత్రవి
ద్యా విలస త్ప్రయోగ మతిదారుణ మశ్రుత దృష్టపూర్వ ము
ద్భావిత సర్వలోకచయ పాలన శీల నయాంచితేక్షణా !

యు. కాం. పూ. భా. – 10 ఆ., 313 ప.

---

1. యు. కాం.- 108 స., 34 శ్లో.

అని వర్ణింపఁబడినది. ఉదారము, మహిమాస్పదము, అద్భుతమహాస్త్ర మంత్రవిద్యా విలసత్ప్రయోగము, అతి దారుణము నైన రామరావణ యుద్ధము అశ్రుత దృష్టపూర్వ మనుట హృదయంగమము. కవి వారి యుద్ధవైశారద్యమును భావించిన తీరు సార భూతము, చారుతరము నై వెలయుచున్నది. గగనము గగనముతోను, సాగరము సాగరముతోను వలె రామరావణ యుద్ధము రామరావణయుద్ధముతోనే పోల్పఁదగినదని దాని యనన్వయత్వమును నిరూపించిన వాల్మీకి ముని భావవివరణ మీఘట్టమని యెన్నఁ దగియున్నది.

**నాయకాభ్యుదయము** : నాయకుని విజయముఁ, బ్రతిజ్ఞాపాలనము, నిస్తారలబ్ధి మొదలగునవి వర్ణించుట నాయకాభ్యుదయము.

రాముఁడు రావణసంహార మొనరించి సీతతో వానర వీరులతోఁ గూడి యయోధ్యఁ జేరునప్పుడు భరతుఁడు సామాత్య పురోహిత బంధుభృత్యనాగరిక జనులతో నెదుర్కొని సేవ లొలయఁజేసినాఁడు. పురముఁ బ్రవేశించునపు డాకాశమున ఋషిసంఘములు, దేవతలు, మరుద్గణము రాముని స్తుతించిరి. ఆ మధురధ్వనులు రామునకు వినవచ్చినవి' అని వాల్మీకమునఁ గలదు.

ఋషిసంఘై స్తదాఽకాశే దైవేశ్చ సమరుద్గణైః
స్తూయమానస్య రామస్య సుశ్రువే మధురోధ్వనిః
— యు. కాం. - 128 స., 30 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నా ఘట్టమున వారు 'రాము పూర్వచరిత్ర మెల్ల మధురస్వనము లుల్లసిల్ల' నముచితముగఁ బొగడినారని వర్ణింపఁబడినది. (యు. కాం. ఉ. భా. 2 ఆ., 413-14 పః॥లు) శ్రీరాముని వీరౌదార్యాది విశేష గుణములిందు కీర్తింపఁబడినవి.

ఇట్టి స్వతంత్ర వర్ణనము మనోజ్ఞము. మఱియు స్వతంత్రముగా రాము మాన్యచరితములు 'పురస్త్రీల ప్రస్తావముల వర్ణించి పూర్వతపఃఫలమైన యాపండువు తమకు గల్గినందుకు వారు సంతసించిన విధము హృద్యముగాఁ జెప్పఁబడినది.[1] అట్లే పట్టాభిషిక్తుఁడై ప్రజలఁ గన్నబిడ్డల వలెఁ గాపాడు రాముని గని వేల్పులు 'ధర్మ

1. యు. కాం.- ఉ. భా., 2 ఆ., 434 —35 పః॥లు

మొకఁడె విశ్వరూప మొలసెఁ’ బోయని యలరి యలరుల వానలలరఁజేసిరి’ [1] అట్టి యెడ రాముఁడు ‘నవరసాలంకృతి నాయకుఁడుగా సంభావింపఁబడినాఁడు. [2] ఇది యంతయు నమూలకముగా వర్ణించి నాయకాభ్యుదయమును సూచించుట మనోహరము.

**కన్యాంగ సౌందర్యవర్ణనము** : శ్రీరామకథాஉమృతమున సీత యాభిజాత్య సంపదఁ బ్రకటించుటకై బాలకాండమున వేదవతి చరిత్ర చెప్పఁబడినది. అందు వేదవతిని సరసిగా సంభావించిన తీ రత్యంత రమణీయము. ఇందు ప్రసిద్ధము లగు కవి సమయములు చక్కఁగాఁ బాటింపఁబడినవి.

ఉరులావణ్యపయః ప్రవాహ కుచచక్రోల్లాస భూయిష్ట భా
స్వర నేత్రానన పాణిపాదనలగ్రీవాశంఖ కైశ్యాలి బం
ధుర బాహాబిసలక్ష్య దృగ్ఝష నవద్యోతాఢ్యయై పొల్చు నీ
సరసిన్ స్వచ్ఛతమించు వల్కల జటాశైవాలముం ద్రోచినన్
- బా. కాం.- 4 ఆ., 50 ప.

లోకమునఁ గ్రొక్కారు మెఱుములు విలకడలేని వగుట, రాకాశశాంకుఁ డంతకంతకుఁ గార్శ్యమందుట, మృగీచయంబడవి నుండుట, భుజంగములు పుట్టఁ జొచ్చుట, జక్కవకవలు పవలు కలిసియుండి రాత్రి విరహము ననుభవించుట, ప్రసిద్ధము. అవి వాని సహజ ప్రకృతులయ్యు నతివ యవయవముల సామ్యమును బొందఁజాలక లజ్జ మునింగి యవ్విధి నున్నవని సంభావించుట చమత్కారచారువై యొప్పుచున్నది. [3] ఇట్టి యమూలకములగు వర్ణనలు కవి ప్రతిభకు నిదర్శనములగు చున్నవి.

కథాసమగ్రతకు శ్రీ వేంకటప్పయ్య శాస్త్రిగారు వేదవతిచరిత్ర బాల కాండమున వర్ణింపగాఁ నుత్తర కాండమున శ్రీరాఘవనారాయణశాస్త్రిగారు కథా క్రమముననుసరించి ‘వేదవతీ వృత్తాంతము’ నభివర్ణించిరి. అందు వ్రతనిష్ఠితయగు వేదవతిని వర్ణించిన తీరు స్వతంత్రము మనోహరమునై యొప్పుచున్నది. (ఉ. కాం.- ఉ. భా. 4 ఆ. 238 ప.) అట్లే తృణబిందుని తనయను వర్ణించిన విధము మనో హరము, స్వీయకల్పనమునై సరసుల నలరించుచున్నది.

---

1, 2. ఉ. కాం. ఉ. భా. 2 ఆ. 575-6 ప॥లు

3. బా. కాం. 4 ఆ. 51 ప.

మొలకనవ్వులతోడి ముద్దుపల్కులబాట
　　నెగడు నచ్చోట వెన్నెలలు గాయ
గతివేచి వెనుకొన్న కామాంధకారమ్ము
　　వడువున వేనలి వలనుమీఱ
నెదిరి వస్తువులపై నెగయుచూడ్కులపేరి
　　మరునారి తేంట్ల సమ్మర్దమొదవ
నంచతేజీ దొరయన్ను మిన్నకు మెచ్చు
　　దెచ్చుయానము వింతతెఱఁగు సూప

నడగడుగునం బొడము నరుణాబ్జ కాంతు
లవని కెందమ్మి పూజలై యందగింపఁ
జెలియుఁ దానును నక్కన్నెసీమనించు
విహరణం బొనరించు నవ్వేళయందు

— ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 115 ప.

మఱియు జనకనృపతి సుకృతచయలక్ష్మియగు నక్కన్నె (సీతను) నభి వర్ణించిన తీరు హృద్యము. (బా. కాం. 4 ఆ. 165 ప.)

**దౌహృదము :** గర్భిణీ స్త్రీలకుఁగల్గు కార్శ్యాదులు దౌహృదమందురు. 'కౌసల్యాదులు గర్భవతులు కాఁగా జూచి దశరథుఁడు సంకల్పసిద్ధుడై' యానందించెనని వాల్మీకమునఁ గలదు.

తతస్తు రాజా ప్రసమోక్ష్యతాః స్త్రియః
ప్రరూఢగర్భా ప్రతిలబ్ధమానస ః

— బా. కాం. - 16 స., 31 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నీవర్ణన విపులముగను స్వతంత్రముగను నిర్వహింపఁ బడినది. 'దశరథపత్నులు హరిని గర్భముల ధరించునంత మేనులఁ గృశత, భోజ్య విషేధము, నూత్నపదార్థకాంక్ష, మతిమఱపు, నావలింతలు నధిక మైనవి. అవి క్రమముగా విమతవాదముల కార్శ్యమును, నేతినేతి నిరాసమును, సత్యాన్వేషణమును, అంతర్ముఖతను, తత్త్వజ్ఞతను సూచించుచున్న వనుట యౌచిత్య సుందరము.[1] ఇంతుల యంగకము లెంత కృశించెనో మేనికాంతు లంతంతకు నంతగాఁ

1. బా. కాం - 3 ఆ., 4 ప.

బ్రబలుట హృదయేశ్వరుపైఁ గల ప్రేమబంధమును బ్రకటించుచున్నవి.[1] రసమన పరబ్రహ్మ మగుట, నా రస మాత్రయి గర్భయుక్తి రాణించుటఁ బైఁబ్రసరించు లక్షణములై రసబిందు కళలు పొసగివవి.[2] తలోదరులగు వారి యుదరము లొంది హరి తానణువు కన్న నణువునని తెల్పినాఁడు. అట్లే వారి పేద నడుములకుఁ బ్రవృద్ధి గూర్చి తనదు మహిమ కానవాలిడినాఁడు.[3] అప్పట్టున వారు సరసులనఁ బొల్చినా రనుట మనోజ్ఞము. 'లావణ్యము రసపూరముకాఁగా మోములు పుండరీకములుగా, చిమ్మచెమ్మటబొట్లు పూఁదేనె కణములుగా, కుచంబుల మొనల్ నైల్యాప్తి నళులు కాఁగా నవనవ వికాసమొదవ, రవికులీన రాజహంస మనస్కార రమ పొసంగి వారు సరసులైరి.[4]

తృణబిందుని పుత్రి పులస్త్యుని తపోవనముఁ బ్రవేశించి ముని శాపమున చూలు ధరించినది. 'అభవత్ పాండుదేహా సా సువ్యంజిత శరీరజా' అని వాల్మీక మునఁ జెప్పఁబడినది.[5] శ్రీరామకథాఽమృతమున నది సమగ్రసుందరముగా నిట్లు వర్ణింపఁబడినది.

> చంద్రసామ్యాత్యంత సంయోగమునట్లు
> చెక్కులు తెలిడాలు సిరివహించెఁ
> గుచపయోధర సంజ్ఞకుంభోలె సాక్షియై
> చూచుకంబుల నల్పుచూడనొప్పె
> నాకసంబు మహత్త్వ మక్షిగోచరమయ్యె
> నో నాఁ గృశోదరమొందె బలుపు
> నాభిసరోవరస్నాతకుండలివి నా
> నూగారు పైపయి నూలుకొనియె

---

1. బా. కాం. - 3 ఆ., 5 ప.
2. ,, 3 ఆ., 6 ప.
3. ,, 3 ఆ., 14 ప.
4. ,, 3 ఆ., 17 ప.
5. ఉ. కాం. - 2 స., 17 శ్లో.

జడ నడరె నించువేడ్కలు సన్నగిల్లె
నావులింతలు తఱుచయ్యెఁ నలఁత వోచె
నోకిలింతలు నెడనెడ నొదివి సడలె
వింతచూ లమ్మగుద రెమ్మివిధమ్మునందు
— ఉ. కాం - పూ. భా., 1 ఆ, 122 ప.

**యజ్ఞవాటం :** 'అంత రాముఁడు లక్ష్మణునితోఁ గూడి విశ్వామిత్ర పురస్కృతముగా జనకుని యజ్ఞవాటికను సమీపించె' నని వాల్మీకమునఁ గలదు. 'యజ్ఞవాట ముపాగమత్'[1] శ్రీరామకథాఽమృతమున నా యజ్ఞవిభవ మిట్లు కీర్తింపఁబడినది-'యజ్ఞము, వేదములు నాలుగు సంపూర్ణముగా వినియోగింప బడి తద్వైభము వెల్లడించు ఘట్టము గావున నిది విబుధసూక్తి విలాస విస్తరణమునకు నెలవు. అది సంయమి ప్రకరము గావించిన నిష్ఠకుఁ బ్రసాదోదయస్థానము. మఱియు నాహుతుల ద్వార దేవతల కందఱకు నామోదము గూర్చునదీ క్రతువు. ఇందు దానములు విరివిగా నలుపుట వలన నిది యాచకుల కోర్కెలు తీరు సమయము. బంధువు లొకచోఁజేరు సందర్భము. సకల కళలకు నిలయము. సోమలత లుపయోగపడు తావు. కర్మాచరణము వలన జ్ఞానముదయించుటకుఁ దగినచోటు. నిర్విశేష పరానందప్రాప్తికి హేతువు. ధర్మమేఘమునయినదీ యధ్వరము'. అట్టి జనకుని యధ్వరవాటిక వారు దర్శించిరని చెప్పఁబడినది.

ప్రాబల్కు పడతుక ల్పడయు సౌభాగ్యంబు
విబుధసూక్తి విలాసవిస్తరంబు
సంయమి ప్రకర నిష్ఠాప్రసాదోదయం
బెల్ల వేల్పుల పాలవెల్లి పెల్లు
యాచకాలి రసస్పృహావసంతాగమం
బెలయు చుట్టరికంబు పొలము పంట
సకల కళాస్థాన సామ్రాజ్యయోగంబు
విభృతామృత స్యందినీఫలంబు

1. బా. కాం. - 50 స., 1 శ్లో.

ప్రాంచిత జ్ఞానవల్లిక పట్టుకొమ్మ
నిర్విశేష పరానంద నిర్వహణము
ధర్మమేఘము జనకు నధ్వరము గాంచె
నాత్రయి జగత్త్రియావన వ్యగ్రమగుచు
— బా. కాం. - 7 ఆ., 150 ప.

'అత్రయి జగత్త్రియావన వ్యగ్రమగుచు' నందుఁ జేరినదనుటలో వారల లోకరక్షాదీక్ష, జగత్కల్యాణ హేతువగు సీతారాముల కల్యాణము, సూచితమ్ములైనవి. 'త్రయి' అనగా వేదము. కావున వేదము లోకహితార్థసంపద నెగడు ననుటయు నిట స్ఫురించుచున్నది. ఇట్టి భావన వారి పాత్రపోషణమునకు దోహదమిచ్చు చున్నది

**మునివర్ణనము :** 'రాముఁడు సీతతో లక్ష్మణునితోఁ గూడి యత్రి మున్యాశ్రమమున కేగి యాతనికి నమస్కరించినాఁడు'అని వాల్మీకమునఁగలదు'సోఽత్రే రాశ్రమమాసాద్య తం వవందే మహాయశమ్'.[1] శ్రీరామకథామృతమున నత్రి ముని వర్ణన మాతని స్వరూపస్వభావ మహిమాదులను నిరూపించునదిగా నుండుట మనోహరము. (అయో. కాం. 10 ఆ. 58 ప.) చూ. పాత్రచిత్రణము.

ఇందు 'కూర్మిమై నెనరులఁ గ్రుమ్మరించు నాచక్కని కనుదోయి చందురుఁ గన్నదగుట' సాభిప్రాయము, సమర్థము నగుచున్నది. అట్లే యమనియమములతో శిష్యులు సేవలు సలుపుచున్నా రనుటకు యమనియమముఖ్యములు మూర్తులందగాంచి శిష్యులట్టులు పరివశ్య సేయుచున్నవ' నుట వర్ణనావైచిత్రి. తపస్సు వలన సిద్ధించు నది తేజము. అట్లే పరమప్రాప్యమగునది బ్రహ్మము. ఈతఁడు 'బ్రహ్మతేజంబు తపసి' యనుట పరమావధి. సిద్ధించిన ఆ ముని తపస్సంపద యిట్లు వెల్లడింపఁబడుచున్నది. ఇట్టి సంభావన మాపాతరమణీయమై కవి సంస్కార విశేషమును దెలుపుచున్నది.

బ్రహ్మ మానసపుత్రుఁడగు పులస్త్యునిఁ గూర్చి చెప్పుచు 'ఇష్టః సర్వస్య లోకస్య గుణైశ్శుభైః'[2] అని వాల్మీకమున వర్ణింపఁబడినది. శ్రీరామకథా

---

1. అయో. కాం. - 117 స.. 5 శ్లో.
2. ఉ. కాం., 2 స., 6 శ్లో.

మృతమున మూలాధికముగా నాతని గుణాది కీర్తన మిట్లు గావింపఁబడుట మనోజ్ఞము.

పొగడ నేరము వాని పొలుపారు గొనముల
నేర ముద్భావించు నెఱియుఁ గలదె
తలఁపజాలము వాని ధర్మంబు మర్మంబు
జాల ముల్లేఖించు సరణియున్నె
యెంచబోలము వాని యించుశీలము లీలఁ
బోల ముల్లోకంబుఁ బొరయనౌనె
కాంచనోపమువాని కలితోరుతేజమ్ము
నోపముం డితఁడన్న యోజ నిడదె
యాప్రజానాథు పుత్రుని దౌప్రసంగ
మేమనఁగవచ్చుఁ బావనమే మనోజ్ఞ
మే శ్రవణపేయమే మంగళాశ్రయంబె
శ్రీమహితనామ!కల్యాణధామ! రామ!

— ఉ. కాం. - పూ. భా., 1 ఆ, 57 ప.

ఇందు పావనములగు నాతని గుణసంపద, మనోజ్ఞమగు నాతని ధర్మమర్మము. శ్రవణపేయమగు నాతని శీలము, మంగళాశ్రయంబగు నాతని మహిత తేజముఁ గీర్తింపఁబడుట పరమ రమణీయము. అట్లే పులస్త్యసంయమి తనయుని వర్ణించిన విధము మునివర్ణనమున విశిష్టతను సంపాదించుకొనినది. తపోమహత్వమున తాత తండ్రులకన్న మిన్నయగు నా సుతునిఁ గన్నతల్లి యాతనిఁ బొగడు ఘనుల మాటలు విని నిజమగు పుత్రోత్సాహమునఁ బొంగినదనుట మనోహరము – సుగుణము లన్నియు నాతని యందుఁ గుదురుగా నిలచినవి. ఇట్టి పవిత్ర భావన మునిజన సంస్తవనీయమగుట సత్యము శివము సుందరము. ఇయ్యది కవి స్వతంత్రకల్పనము.

శమధను ల్మెకొన శాంతిదాంత్యాదుల
నలవివేకము గొల్వ నలవరించి

భక్తియోగముగన్న ప్రాభవమ్మున మున్న
యోగోప సర్గౌఘ మురువడంచి
సరగ బ్రహ్మాత్మైక్య సంధానమున కల్మి
బుద్ధివృత్తికి మేల్మి పొనరుచెంచి
సమరస సామ్రాజ్య సంపత్తి నెక్కొన
నిరతిశయానందనిష్ఠ మించి

తాతతండ్రులకన్న నిత్తపసిమిన్న
యన్నఁదప్పేమియని ఘను లన్నమాట
లన్నివిని కన్నతల్లి కృతార్థనైతి
ననఁగ నెగడెఁ బులస్త్య సంయమి సుతుండు

అసమును ధర్మమున్ శ్రుతము నాసమదృష్టి వ్రతంబు శీలమున్
బొసఁగెడు సంప్రదాయమున పోఁడిమియున్ ఘనసత్య శౌచయో
గ సృతిపరత్వము న్నెగడుఁ గంజభవాత్మజు పుత్రునందె యం
చ సదృశ ఖ్యాతి ముజ్జగములంది కడింది సిరిం దలిర్పగన్

నిత్య స్వాధ్యాయరతు, న్నిత్యవ్రతశీల ధర్మనిరతు ముని సుతుం
బ్రత్యక్ష బ్రహ్మంబని, ప్రత్యయమున నెంచె మునిభరద్వాజుఁడెదన్

— ఉ. కాం. పూ. భా. 1 ఆ., 173-75 ప॥లు

**తాపసాశ్రమవర్ణనము** : అరణ్యకాండమున 'రామప్రభృతులు నార చీరలతో నలంకరింపఁబడి, బహు పుష్పఫలభరితములగు ద్రుమ సంతతులతోఁ గూడిన సుతీక్ష్ణాశ్రమమును దర్శించిర' ని వాల్మీకమునఁ జెప్పఁబడినది.

ప్రవిష్టస్తు వనం ఘోరం బహుపుష్ప ఫలద్రుమం
దదర్శాశ్రమ మేకాంతే చీరమాలా పరిష్కృతమ్
— 7 స., 4 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నది స్వోపజ్ఞముగా నిట్లు వర్ణించుట మూలాధికము.

ఆశ్రమమున శారికలు రామనామార్థమును ప్రశ్నింప, శుకరాజి సూనృతములు వెలయ శ్రుతి ప్రమాణపూర్వకముగా వివరించి చెప్పుచున్నవి. పికాళి పంచమస్థాయి ప్రపంచితములు మనుపవిష్ణుఁడె కాక మఱిలేఁడనుటను నిరూపించుచున్నవి. లేళ్ళు సత్యముగ హరియరుదెంచునని యుల్లాసమునఁ బల్కుచు నానందమందుచున్నవి. తేంట్లు గేయ ప్రబంధావళి యబ్బె మాకంచు మధుర గీతములు పాడఁజొచ్చినవి. ఇవి యన్నియు నది వాచంయమాశ్రమమని యడుగకయ మున్నె చెప్పుచున్నవి. వల్కలాజినము లావిషయమును సమర్థించుచున్నవి. ఎల్ల ఋతువు లేకకాలమునఁ గలిసి మెలఁగ నయ్యది ప్రథితఫలపుష్పసంతాన భరితమై యొప్పుచున్నది. రామాదులట్టి పున్నెపుం బొలమైన మున్యాశ్రమముఁ దఱియఁ జొచ్చిరి.

రామనామార్థమ్మ్మ రహిఁ శారికలు వేఁడ
 శ్రుతిగూర్చు శుకరాజి సూనృతములు
మనుపవిష్ణుఁడెకాక మఱిలేఁడను పికాళి
 పంచమస్థాయి ప్రపంచితమ్మ
లరగాదు పొండిదె యరుదెంచు హరియంచు
 నుబ్బియాడెడు లేళ్ళ యుల్లసితము
లబ్బె గేయ ప్రబంధావళి మాకంచుఁ
 బాడఁజొచ్చెడు తేంట్లపన్నుగడలు

నడుగకయమున్నె వాచం యమమాశ్రమమ్మె
యదియును సుతీక్ష్ణముని చంద్రునిదె యటంచు
జెప్పకయ చెప్పె వారల్లఁజేర నరుగ
వల్కలాజినములును నవ్వలనుసూపె

ఎల్లఋతువులు నద్దాన నెనసి మెలఁగ
ప్రథితఫలపుష్ప సంతానభరితమగుచు
నొప్పు నప్పున్నెపుం బొల మోజనెఱయఁ
దఱియఁ జొచ్చిరి వారు కాంతాలలామ!

— అర. కాం. - 1 ఆ., 175-6 ప॥లు

ఇట్టి మనోజ్ఞమగు వర్ణన మునిప్రభావమును ప్రకటించుచున్నది. అట్లు ప్రకృతియెల్ల రామమయమానసయై వరలుచుండుటం జేసి యది 'పున్నెపుం బొలమై' యొప్పినదనుట స్వభావోక్తిసుందరము. ఇట్టి వర్ణనము నన్నయ భారతమునఁ గావించిన కణ్వాశ్రమ వర్ణనమును దలపించుచున్నది. గేయప్రబంధములు = రామకథా విశేషములు

**అప్సరసవర్ణనము :** రంభ నలకూబరునిఁ జేరఁబోవునెడ స్వర్గము పైదండెత్తిపోవుచు కైలాసగిరియందు విడిసిన రావణుఁ డామెను జూచినాఁడు. అట్టియెడ నపూర్వమగు రంభా సౌందర్య వర్ణనమతి మనోజ్ఞము. కవి ప్రతిభా ప్రకటన సమర్థమునగుచున్నది.

ఆకాశరామణీయకము వడియఁగట్టి
　　నేర్పుమై దించిన నిగ్గనంగ
నానేలకామనీయక మెల్లఁజిలికి లె
　　స్సగఁ బైకి నెత్తిన సారమనఁగ
నుభయసౌభాగ్యంబు లొకగట్టిఁ గరగి శ్యా
　　మిక ద్రోచి తార్చిన మేల్మియనఁగ
నరయంగ నరయంగ నతిమనోహరముగాఁ
　　బ్రవహించు ప్రకృతి సంపద యనంగ

పుడమి యాకసముంగాని పొలమునందు
నందముల మందసం బొకం డవతరించి
మించువేడుకఁగాంచు నక్తంచరేంద్రు
కనుల గముల కట్టెదుటన కానిపించె

— ఉ. కాం. పూ. భా. 5 ఆ., 307 ప.

ఈ విధముగ శ్రీరామకథాఽమృతమున నచుంబితములగు భావములు, నపూర్వములగు కల్పనావిశేషములు వర్ణితములగుట మనోహరము. ఇందు ప్రతి విషయమునను కవుల వర్ణనా నిపుణత్వము, భావనావైదగ్ధ్యముఁ బ్రస్ఫుటమగుట రమణీయత వెలార్చుచున్నది. గ్రంథవిస్తరభీతిచే నన్నియు వివరించుట సాధ్యము కాఁజాలకున్నది.

## శైలి :

'యాపదానాం పరాఽన్యోన్యమైత్రీ శయ్యేతికథ్యతే'
— ప్ర. రు. కా. ప్ర., 55 పు.

అను నాలంకారిక లక్షణము ననుసరించి పదముల యన్యోన్యమైత్రి శయ్యగా నెన్నఁబడుచున్నది. అందు పదముల వినిమయాసహిష్ణుత్వము విశేషగుణముగాఁ జెప్పఁబడుచున్నది. అట్లే 'విశిష్టాపదరచనారీతిః రీతిరాత్మాకావ్యస్య'[1] ఇత్యాద్యాలంకారిక వచనములు విశిష్టపదరచన రీతి యని, యా రీతియే కావ్యాత్మ యని నిరూపించుచున్నవి. ప్రాచీనులు నిర్వచించిన శయ్యా, రీతి యనువాని కలయిక వలన నేర్పడిన దీశైలి. పాశ్చాత్యులు పేర్కొనిన 'స్టైల్' అను పదమునకు 'శైలి' కిని దగ్గఱ సంబంధము కలదని చెప్పవచ్చును. తెనుఁగున నాదికవి నన్నయ తన కవితా గుణములలో 'నక్షరరమ్యత'నొక విశిష్టలక్షణముగాఁ బరిగణించుట గణనీయమగు విషయము.

శీలధాతువు నుండి యుద్భవించిన 'శైలి' కవి రచనాపద్ధతినిఁ దెలుపునదిగాఁ బేర్కొనవచ్చును. ప్రతి కవికిని తనదగు నొకానొక శైలి యుండుట సామాన్యము. ఒక కవియే సన్నివేశమునుబట్టి శైలీభేదమును పాటించుటయు పరిపాటి. 1 రసానుగుణమగు పదప్రయోగము; 2. అక్షరయోజన; 3. పాత్రౌచిత్యమునకు దగిన సంభాషణ; 4. సంస్కృతాంధ్ర పదప్రయోగ కుశలత; 5. వృత్తౌచిత్యము మొదలగునవి స్థూలముగా నీశైలికి లక్షణములని చెప్పవచ్చును. ప్రసిద్ధ కవిపద్యము లొండు రెండు వినినంతనే యీ పద్యము 'ఫలానా' కవిదని గుర్తెఱుంగుట యనుభవసిద్ధము. అది వారి శైలినిబట్టియే సాధ్యమగును.

శ్రీరామకథాఽమృత కవులు సంస్కృతాంధ్ర సాహిత్య ప్రపంచము నాకళించుకొని తమదైన ప్రత్యేకత నిలుపుకొన 'స్వీయముద్ర' ప్రస్ఫుటమగునట్లు రచనఁగావించిరి. బాలకాండ శైలి ప్రబంధఫక్కిఁ ప్రౌఢమై పండితైకవేద్యమగునట్లు సాగినది. సన్నిహితులగు కొందఱి యభ్యర్థనముఁ బురస్కరించుకొని తక్కిన కాండలలో శైలియందుఁ గొంత సౌలభ్యమును బాటించినట్లు వెనువెంటనే రచించిన సుందరకాండమున హనుమంతుని ముఖమున నిట్లు ప్రకటించిరి.

---

1. కా. సూ. - 1 అధి., 1 అధ్యా., 6,7 సూ॥లు

నేటి పడినపాట్లు పాటఁజిపోకుండ
నందఱకును దెలియనైనఁబాసఁ
గిలెటింగి రామకీర్తనం బొనరింతు
నవసరంబు సుకృతమందఁజేయ — 2 ఆ., 223 ప.

ఈ గ్రంథమంతయు నందులకు నిదర్శనమై యున్నను నిటఁగొన్ని యుదహరింపఁబడుచున్నవి.

**రసానుగుణమైనపదరచన :** ఆయా రసముల కుచితమైన పదప్రయోగముఁ జేయుటద్వార తత్తద్భావ వ్యక్తీకరణఁ గావించుట సుకవి సంప్రదాయము. ఆ సంప్రదాయము నాలంకారికులు రీతులు, వృత్తులు, అను పేర శబ్దార్థ రచనా సౌందర్యము నిర్వచించిరి. అందతికోమలములగు శృంగార కరుణభావములు వర్ణించు సందర్భమునఁ గైశికీవృత్తి నిర్దేశింపఁబడినది.

అత్యర్థ సుకుమారార్థ సందర్భా కైశికీమతా
అత్యంత సుకుమారౌ ద్వౌ శృంగార కరుణౌమతౌ — ప్ర.రు.కా.ప్ర. 15,17 శ్లో॥లు

ఇప్పట్టుననే 'గుణాశ్లిష్ట పదసంఘటనా రూపమగు రీతియుఁ జెప్పఁబడినది. అందు బంధపారుష్యము, శబ్దకాఠిన్యము లేక నాతిదీర్ఘసమాసయుతము నైనది 'వైదర్భీ' రీతి యని కీర్తింపఁబడినది.

బంధపారుష్యరహితా శబ్దకాఠిన్యవర్జితా
నాతిదీర్ఘ సమాసాచ వైదర్భీ రీతిరుచ్యతే — కా. ప్ర., 27 శ్లో.

శ్రీరామకథాఽమృతమున బాలకాండయందు సీతారాముల వివాహసందర్భమునఁ 'గన్నియల కన్గవల తొలికొన్నచూపులను గూర్చియు, సీతతో రాముఁడు సలిపిన నేత్రావధానకేళి విశేషమును గూర్చియు శృంగార రసానుగుణముగా సాగిన వర్ణన మతిమృదులబంధయుతము, కోమలార్థ రచనా సంపన్నమునై సంభావ్యమగుచున్నది.

చరణాబ్జముల వ్రాలి సంభ్రమంబున రస
మానలే కట్టుసిట్టు నాపవెఁగు

బైఁబ్రాకు వెట్టంగ భావించి తడబడి
మొదలికందువ సేరి ముడుఁగబాఱు
నూనూగు గఱులట్టె నూల్కొల్పి దెసల కై
యుంకించి యొకక్రేవ నొత్తిగిల్లుఁ
దెగియెట్టకేలకుఁ దివిరిపైకొనఁబోయి
యెదిరితాఁకున గాంచు నుదిలపాటు
సొరిది గొండొకఁ తావందఁ జొక్కి నిలుచుఁ
దనియు నొక్కింత దార్ఢ్యంబు పనుపడంగఁ
గన్నియల కన్గవల తొలికాన్పుచూపు
తేఁటి పిల్లలదాటు వెంబాటు గదుర

— బా. కాం. 10 ఆ., 386 ప. (389 ప.)

విశ్వామిత్రుఁడు దశరథ తనయుల రాక్షస సంహారమునకై సిద్ధాశ్రమమునకు బంపుమని వేఁడ బుత్రస్నేహమునఁ బంపఁజాలక దుఃఖితుఁడై దశరథుఁడు చింతించిన విధము కరుణరసానుగుణముగా వర్ణితమగుట హృద్యము.

(బా. కాం. 5 ఆ. 55, 56 పఃలు) చూ. పాత్ర చిత్రణము.

అట్లే హనుమ లంకాపట్టణము దహింప నచటిజనులు వికలులై విహ్వలతఁ జెందిరని వర్ణించిన ఘట్టము కరుణరసాత్మకమై యలతి యలతి పదముల సునంఘటితమై యలరించుచున్నది.

కపిరూపుగొనివచ్చెఁగాని యగ్గియ యీతఁ
డనుచు నిట్టలముగ నఱచువారు
తోఁక చిచ్చఁట వీని తోఁకఁజిచ్చిడి వీడు
టిదియేమి వెరవంచు నేడ్చువారు
సీతఁ దెచ్చిననాఁడె చెడె లంక గాకేమి
శోకింప ఫలమంచు సొగియువారు
ఖరదూషణాదుల గడెలో నగల్చి నా
తని ధూత కిదియెంతయనెడువారు

నగుచుఁ జంటిబిడ్డలక్కున గదియంగఁ
జిక్కఁబట్టికొనుచుఁ జెలువ మెడల
నెఱులు జీరుకాడ నేలగూలిరి కాక
కోర్వ కసుర యువతు లవిద వింతె

— సుం. కాం. - 3 ఆ., 301 ప.

అత్యుద్ధతార్థ సందర్భము గలది యారభటీవృత్తి. రౌద్ర భీభత్సము లుద్ధత రసములు. అప్పట్టున 'నోజఃకాంతి గుణములు గల గౌడిరీతి వరలునని' యాలంకారికుల మతము. [1] శ్రీరామకథామృతమున నరణ్యకాండ యందు ఖరదూషణాది రాక్షసులతో యుద్ధ మొనరించు సందర్భమున రాముఁడు యుగాంతాగ్ని వలె నొప్పెనోఁ డని వర్ణించు విధము పరుష బంధయు, దీర్ఘ సమాసరచనయుఁ గలిగి రౌద్ర ముట్టి పడునట్లు సాగినది. (అర. కాం. 2 ఆ. 142 ప.)

అట్లే ఖరుని వర్ణించు ఘట్టము రూక్షబంధయు, ఖరసమాసముగా రౌద్ర మొప్పుచున్నది.

గిరిశృంగాభము రోమహర్షణమయః కీలాన్వితం బన్యగో
పుర విస్ఫోటక మాత్త శాత్రవ సమాపూర్ణ స్ఫురాజాల మా
సుర సంతోషము స్వర్ణ పట్టమహిపస్తోమం బమోఘంబు నౌ
పరిఘం బొక్కఁడు దాల్చి రాముదెస దీవ్రక్రోధసంరంభుఁడై

మఱియు హనుమంతుఁడు లంక దహింప హాహారవముల్సెలంగ రక్కసులుక్కుఁ దక్కిరి. హనుమని తేజోగ్నికిఁ బురముఁ గప్పురమైనది. అట్టి భీభత్స స్థితినిట్లు వర్ణించుట హృద్యము,

హతవీరాళి నిరస్త సద్భట విదగ్ధానేకప స్యందనా
శ్వతతాస్త్రాయుధ భర్మ హర్మ్యచయనష్ట ప్రాజ్య యంత్రౌఘ వి
గ్గత నానార్థ సమృద్ధియయ్యెఁ బురి' — 3 ఆ., 313 ప.

అట్లే దేవాసుర సంగ్రామమున రాక్షససైన్యముఁ జీకాకుపడి కకావికలైన తఱి యుద్ధరంగమున నేర్పడిన భీభత్స వాతావరణమిట్లు వర్ణింపఁబడినది.

---

1. ప్ర. రు. కా. ప్ర., 15, 17 శ్లో॥లు.

వికటోన్మత్తులు రాక్షసప్రవరులుర్విన్ వ్రాలుడున్ శోణితో
దక విష్యంద మహాస్థిబృందతట మేదఃపంక సంకీర్ణ గృ
ధ్రకులాలోల సరత్సరిద్వర సహస్రస్రోతయై వెల్వడెన్
మకరన్మార్గణవర్గయై కడువడిన్సంగ్రామ రంగంబునన్

— ఉ. కాం. - పూ. భా., 6 ఆ., 206 ప.

నాతి సుకుమారమగు పదసంఘటనము భారతీవృత్తి. హాస్య శాంతా ద్భుతములందీవృత్తి ప్రయుక్తమగుట యాలంకారిక సమ్మతము. ఇవ్విట్టున వైదర్భీ, గౌడీరీతులు రెండును గూడిన పాంచాలీరీతి గానగును.[1]

ఉత్తరకాండమున హనుమని చిన్ననాటి 'యల్లరిపనులు' వర్ణించు ఘట్టము హాస్యరసోద్దీపితముగాఁ జిత్రింపఁబడి తదుచితమగు పదసంఘటన రమణీయమై భారతీ వృత్తిగా నెగడుచున్నది.

ఒక కొండశిఖరంబు నొక కొండకు నమర్చు
నద్దాని శృంగంబు నంఘ్రిఁదన్ని
మలయమహీధరశాఖము లొక్కనితెచ్చి
మేరుసానువుల బెంపార నాటు
శార్దూలములను గేసరిపై విసరివైచు
మెదలిన నద్దాని మదమడంచు
నాకసంబునఁ బాఱు నమర విమానముల్
ప్రార్థింపఁ బ్రార్థింపఁ బట్టి విడుచుఁ

.... .... ....

ఆఱసఱచి పిశాచమ్ములఁ
జఱజఱ నీడ్చుకొనివచ్చి సంయమి శిశువుల్
వెఱ బూచి బూచి యని పెం
పఱ నఱవఁగ నార్చు గుండెలవియఁగఁదానున్

— పూ. భా., 8 ఆ., 123-24 ప॥లు

1. ప్ర. రు. కా. ప్ర., 16, 18 శ్లో॥లు

శ్రీరామకథామృతమునం దరణ్య కాండమున శ్రీరాముఁడు ఖరదూషణాది రాక్షసులతో యుద్ధమొనర్చిన ఘట్ట మద్భుతమును గొల్పుచున్నది.

అంధకారంబుర్కు నాక్రమించెనె కాని
యాత్మభానుస్ఫూర్తి యావహల్లె
జాలనం బనరాక చాపమొప్పెనెకాని
విశ్వరూపముదాల్చె విశిఖపంక్తి
తివియుట విడుచుట తెలియదయ్యెనెకాని
లక్ష్యపాతముదెల్పె లాఘవంబు
జ్యాశంఖనినదప్రసక్తి దోఁచెనెకాని
యెదిరి యాహారవ మెడలుగ్రమ్మె

నా జగన్మోహనుం డిట్టి దనఁగరాని
శాంబరీ డంబరమున సంగ్రహించి
వేలుపులు మెచ్చుకొన నిరూపించినట్టి
మేటి రాక్షససంహార నాటనమున

- అర. కాం. - 2 ఆ., 173 ప.

అట్లే కిష్కింధాకాండమున సీతాన్వేషణపరులై హనుమదాది వానరులు దక్షిణదిక్కునకు వెడలి యందొకఁ గుహలోఁ బ్రవేశించి యచ్చటి వింతల కచ్చెరువువడు ఘట్టము విచ్చట బేర్కొనఁదగి యున్నది. [1]

నాతిప్రౌఢ సందర్భనిర్భమగు రచన సాత్వతీవృత్తిగాఁ జెప్పఁబడుచున్నది. వీర భయానకము లిందు వర్ణించుట పరిపాటి. ఇదియుఁ బాంచాలీరీతిగనే పరిగణింపఁ బడుచున్నది. [2] శ్రీరామకథామృతము నందు బాలకాండమున జనకుని సభలో విశ్వామిత్రుఁడు రఘుసింహముల పరాక్రమప్రక్రములను వర్ణించుట వీరరసాను గుణమైన పదసంఘటనతో నొప్పుచున్నది.

---

1. కి. కాం. 3 ఆ., 64-70 ప॥లు

2. ప్ర. రు. కా. ప్ర., 16, 18 శ్లో॥లు

తమ నఖ శరపాలిదనుజ మత్తగజౌఘ
విదల నోత్సవముల విజ్ఞపీడఁ
దమ క్ష్వేళల ప్రసక్తి దర్పవద్రిపుమార్గ
దీనస్వరవిముక్తి కానయిడఁగఁ
దమ లఘుప్లుతిలీల తతవేగ భటసత్త్వ
కలితోర్ధ్వదృష్టుల గాసిపఱుపఁ
దమ రాజపదరూఢితామ్యన్నృపతి జంతు
పాలనా వ్యాపృతి ప్రథవహింప

వఱలు రఘుసింహములు దిశావలయమెల్ల
విక్రమక్రమ సంపత్తి నాక్రమించి
మించు ప్రఖ్యాతి జగతి రాజించు రహి స్వ
భావసిద్ధము సుమ్ము క్ష్మాపాలతిలక - 9 ఆ., 103 ప.

రఘుసింహములనుచో సింహశబ్ద స్వారస్యము సాభిప్రాయమై యాద్యంతముఁ దదర్థము నిర్వహింపఁబడినతీరు రమ్యము. వర్ణ్యస్వభావాను గుణమగు పద్యగతి హృద్యము.

**2. అక్షరయోజన :** మాలాకారుఁడు పూవులను సంపాదించి యే యే వర్ణము లగు పూవుల వెంట నేయే బూవుల గూర్చిన మనోహరాకృతి సిద్ధించునో యోజించి మాలా నిర్మాణము గావించునో యట్లే కవి రమ్యాక్షర పదజాలముల నేర్చి కూర్చుట 'యక్షరయోజన' మందురు. పద్యము మొదటినుండి తుదిదాక యొకేపద్ధతి సమతూకముగ నడుపుట పద్యరచనాశిల్పము. అట్టి కళ శ్రీరామకథామృతము నందుఁ బుష్కలముగాఁ బోషింపఁబడినది.

జనకుఁడు రాజపుత్రులగు రామలక్ష్మణులం గూర్చి విశ్వామిత్రునిఁ బ్రశ్నించుట( - బా. కాం. 7 ఆ. 177 ప. ) చూ. పాత్రచిత్రణము.

ముని సమాధానించుట (7 ఆ. 202 ప.) వర్ణించినవిధము హృద్యమై యప్రయత్నతరసిద్ధమగు శబ్దసౌందర్యసంపదను, కవుల సిద్ధహస్తతను నిరూపించు చున్నది. అట్లే సిద్ధాశ్రమమున ఋషులు ప్రమాణపురస్సరముగా 'రామతత్త్వమే పర

బ్రహ్మమని' సంభావించి, యానంద మనుభవించిరని (బా. కాం. 6 ఆ. 6 ప.) వర్ణించుట రమణీయము. (చూ. పాత్రచిత్రణము) ఇట్టిపట్టుల శబ్దపాక మను నొక విశిష్టగుణము ప్రతిభాసించుట విశేషము. సహజసిద్ధమగు శబ్దాలంకారశోభ 'శబ్దపాక' మనఁ బరగునని కావ్యధర్మ మర్మజ్ఞులగు వారి యభిప్రాయము. అట్లే రామజనన సందర్భమున వశిష్ఠుఁడు దశరథుని యదృష్టము నెన్నుచు —

> నాయననే కన్ననాయన్న నేఁడు నీ
>
> నాయనయై పుట్టు నట్టువేఁడ
>
> మాపాలి సుఖపాలి మాపాలి భాగ్యంబు
>
> నీపాలి పంటయై నియతిఁగూడ
>
> ద్యోపారి రూపారి యాపారిజాతంబు
>
> వ్యాపారియై యిందువఱలఁజూడ
>
> నేదారి నో దారి నాదార్ల మనుచు త
>
> మోదారి కనుదోయి మ్రోలనాడ
>
> గంటిగలదయ్య! యింక వేగంటి దొరయుఁ
>
> గంటి ననరాని విభవంబు గంటివయ్య
>
> కంటి మీనాటికల్ల ముక్కంటి వాలు
>
> గంటి జపయోగ మీ తమ్మికంటి చనవు
>
> - బా. కాం.- 3 ఆ., 118 ప.

అని సాక్షాద్విష్ణువు నీతనయుఁడై వర్తించుట స్వారాజ్యసుఖమున కంటె నధికమని యభినందించిన సరణి సరసమై కవికి శబ్దముపైఁ గల యధికారమును వెల్లడించుచున్నది.

**3. పాత్రోచిత సంభాషణము:** పాత్రకుఁ దగిన సభాషణ కావ్యములం బ్రయోగించుట ప్రాచీనకవుల సంప్రదాయము. సంస్కృత కావ్యములలో నుత్తమ పాత్రలకు సంస్కృతము, స్త్రీపాత్రలకును బరిచారికాది పాత్రలకును బ్రాకృతము బ్రయోగించు టిందులకు నిదర్శనము. తెనుఁగు కావ్యము లందును

గ్రామ్యము యొక్క వినియోగమును గూర్చి చెప్పుచు 'గ్రామ్యం తత్తద్విధౌ సాధు'[1] అని యథర్వణుఁడు నిర్దేశించియున్నాఁడు. 'ప్రతాపరుద్రీయ, కన్యాశుల్కాది ఆధునిక కావ్యము లందది ప్రచురముగాఁ బ్రయోగింపఁబడి కావ్యశోభాహేతువుగాఁ బరిణమించు చున్నది'. శ్రీరామకథాఽమృతమున నట్టి పాత్రోచితమగు భాషా భావములఁ బ్రయోగించుట వలనను, వర్ణ్య, వస్తు సందర్భ విశేషములనుబట్టియు నౌచిత్యము సంపాదింపఁ బడినది. అట్టి ప్రసిద్ధౌచిత్యబంధము రసాస్వాదన హేతువగుట ప్రయోజనము.[2]

బాలకాండమున జనకుని సభలో రాముఁడు శివధనుర్భంగ మొనరింప దిక్కులొక్కమొగి పిక్కటిల్లినవి. సదస్యుల హృదయములు సంతోషతరంగితములైనవి. దేవతలు పుష్పవృష్టి గురిసిరి. అట్టియెడ దేవదుందుభులు 'సురేంద్ర మానసోల్లాస కలనానుమాపకములై' మ్రోసినవి. (9 ఆ. 152 ప.) చూ. అధ్యాత్మ రామాయణానువాదము.

సురేంద్రు నుద్దేశించి పలికిన పలుకు లగుట నవి గీర్వాణవాణి నాశ్రయించుట యౌచిత్యసుందరము. దేవతలు గీర్వాణు లగుట ప్రసిద్ధము. పద్యము నడక దుంధుభి నిస్వనము ననుసరించుచున్నట్లుండుట హృద్యము. మఱియు సీతారాముల వివాహ మహోత్సవవేళ రామాదులు కల్యాణమంటపమున కేతెంచినంత శుభముహూర్తమాసన్నమగుట మునులు 'అయం ముహూర్తస్సుముహూర్తోఽస్తని' రని వర్ణించుట[3] మహితమై సందర్భోచితముగా భాసించుచున్నది. అట్టిది స్మార్త సంప్రదాయము.

రాము నయోధ్యకుఁ దోడ్తెచ్చుటకై భరతుఁడు సపరివారుఁడై పోవుచు మార్గమధ్యమున గురువగు వశిష్ఠునిఁబురస్కరించుకొని భరద్వాజాశ్రమముఁ బ్రవేశించినాఁడు. ఆ మునీంద్రుడు 'మహాత్ముఁడుఁదపసి చందురుఁడు నగు వశిష్ఠుని గాంచి' యాసనము డిగ్గి యర్చనమునకు సంసిద్ధుఁడై 'అర్ఘ్యమాసన మావయ యనుచుఁ జీరె శిష్యజనము'[4] అని వర్ణించుట పాత్రౌచిత్యమైన ప్రకృష్ట సంభాషణముగా నెన్నఁదగియున్నది.

---

1. వి. వే. - సంజ్ఞా. పరి.
2. ధ్వ. లో., 4 ఉ.
3. 10 ఆ., 350 ప.
4. అయో. కాం. - 7 ఆ., 220 ప.

సూర్యోదయమున జనులు సూర్యునకు మ్రొక్కి అర్పించుచున్నట్లు చెప్పుచు -

మిత్రాయ జగదేక మిత్రాయ తే నమ

స్తే నమో రవయే నమో నమోస్తు

సూర్యాయ నమ దఖిలార్యాయ తే నమ

స్తే నమో భావవే తే నమోస్తు

ఖగపదాయాపవర్గపదాయ తే నమ

స్తే నమః పూష్ణే నమో నమోస్తు

గర్భితాండ హిరణ్యగర్భాయ తే నమ

స్తే నమోస్తు మరీచయే నమోస్తు

మా మవాదిత్య సవిత ర్మమ వ్యపనయ

పాపచయ మర్క భాస్కర పాహి పాహి

యనుచు మ్రొక్కల నామ్రొక్కలయ్యె కెలమి

దొనఁక నర్పింతు రపుడు సజ్జనులు భక్తి

— బా. కాం. - 9 ఆ., 40 ప.

అని వర్ణింపఁబడినది. ఇందు ద్వాదశాత్ముఁడగు సూర్యుని స్తుతించినవిధము హృద్యము. కవులు సంప్రదాయానుగుణముగా సందర్భోచితరీతి మంత్రప్రాయమగు నీ రచన సంస్కృతభాషలోనే వర్ణించిరని భావింపనగును.

కబంధుఁడు రామలక్ష్మణులచే నిహతుఁడై దహింపఁబడి గాంధర్వమగు తన పూర్వరూపమును ధరించి 'సోఽహమటంచు, రామ సుకృతోఽస్మి యటంచు' నుతులు వినతులుఁగూర్చి నాఁడనుట హృద్యము.

దేవతాంగనలు పులస్త్యాశ్రమమున విహరింప వచ్చి పుష్పాపచయ జలక్రీడాదులఁగావించి మన్మథునిఁ బూజించిరని చెప్పుచు —

కామరాజా యాహి కాంక్షితం మమదేహి

యనుచు నావాహనం బమరఁగూర్చి

ఉపవిశ రత్నపీఠోపరి దేవ ! యం

చొగి మహార్ఘ్యా సనం బొలయఁదార్చి

శోభన మూర్తయే సురుచి రార్ఘ్యాదిక
మిదమిదం తే యని యెలమిఁజేర్చి
అభ్యంగన స్నానమాచర శుద్ధోద
కైః స్నాహి యని జలకంబులార్చి

వసన భూషణ చందన కుసుమ మాల్య
ధారణం కురుమదన ! సంస్కార ధూప
దీపముఖ్యం గృహాణ దేదీప్యమాన
యనుచు నుపచారవిధికృతు లందఁజేసి

— ఉ. కాం. పూ. భా., 1 ఆ., 92 ప.

అని షోడశోపచారవిధుల నర్పించినట్లు సంస్కృతోక్తులతో వర్ణించుట యౌచితీ సంపాదనమున పరాంకోటి నందుకొనినది. ఇంకను నమూలకములగు శ్రుతి స్మృతులు శాస్త్రసంప్రదాయ విశేషపదములు జాతీయములు మొదలగునవి సందర్భోచితముగా నిందుఁబొందుపఱచుట వీరి విశిష్టశైలికి నిదర్శనముగా నెన్నఁదగి యున్నది.

## 4. సంస్కృతాంధ్ర పదప్రయోగ కుశలత :

కావ్యమునఁ దెనుఁగు పదములు, సంస్కృత పదములు ముత్యములు ప్రవాళముల వలెఁ గూర్చి సమంజసమగు శైలిఁబాటించుట పండితామోదయోగ్య మగుచున్నది.

అచ్చతెనుంగు శబ్దములు నచ్చటనచ్చట దత్సమంబులున్
వచ్చుచు నున్నయట్లు నుడువంబడి ముత్యములుం బ్రవాళముల్
గ్రుచ్చిన పేరు తీరుగను గూర్చి సమంజసశైలితోడ వా
క్రుచ్చిన కైత మంచిదనుకొంచును మెచ్చుచునుంద్రుకోవిదుల్ [1]

1. శ్రీమదాంధ్ర చంపూరామాయణము ( భోజునికృతి కాంధ్రీకరణము ), 1 ఆ., అవతారిక

అందును గొందఱకుఁ దెనుఁగు, మఱికొందఱకు సంస్కృతము ఇంకను, గొందఱకు రెండును బ్రియములగుచుండును. పోతన తన కృతిలో నిట్టివారి నందఱ నయ్యెయెడల మెప్పింతునని ప్రతిజ్ఞ సలిపినాఁడు.[1]

శ్రీ వేంకటప్పయ్యశాస్త్రి గారు 'రెండు భాసలందు గండడై రామకథాఽమృతమ్ముఁ గూర్చినట్టి ఘనుఁడ'[2] గుటయు వారి కుమారులు, శేషపూరణ కర్తయు నగు శ్రీ రాఘవ నారాయణశాస్త్రి గారుఁబాండితి నట్టివారే యగుట కావ్యమున సంస్కృతాంధ్రపదములాయా ఘట్టము లందుఁ బ్రచురముగఁ బ్రయోగింపఁబడి, యా భాషలలోఁ గృతపరిశ్రములగు వారికిఁగల చొరవను, అధికారమును నిరూపించుచున్నవి. సంస్కృత కావ్యమైనచో నొక్క సంస్కృతమున బరిశ్రమమున్నఁ జాలును. తెలుఁగగుచో రెండింటను గృషి మెండుగా నుండవలయునన్న చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి వాక్కు సర్వథా సత్యము.

తెలుఁగు తెలుఁగని యద్దాన దిగుబెకాదు
సంస్కృతంబున కన్న కష్టమ్ము హెచ్చు
ఒక్కదాన పరిశ్రమమున్నచాలు
దానికి, ద్దానికో రెంటఁదగులవలయు

అట్టిదానికి కావ్యమంతయుఁ బ్రమాణమయిన నిట నొండురెండు యుదాహరణము లొసంగఁబడుచున్నవి.

**ఆంధ్రపదములు :** తనయుని విశ్వామిత్రుని వెంటనంపుటకు సంశయించుచున్న దశరథునితో వశిష్ఠుఁడు రాముని గుణముఁల నెన్నుచు 'రాముఁ డొక రాజకుమార మాత్రుఁడు' కాఁడనియు —

గొనబులమేర, తేజుగుమి, కూర్మలకోన, గొనాలపుట్ట మే
ల్నెనరుల వంగడంబు, బలులిబ్బుల పంట, జగాముగంటుముల్
దనరు కొటారు, తాల్మి నెఱిదాఁటని కూటమి, తెల్విదీవి, పెం
దనముల ప్రోవు .... .... ....

— బా. కాం.- 5 ఆ., 96 ప.

---

1. శ్రీమదాంధ్ర మహాభాగవతము- ప్రథమస్కంధము
2. భద్రాయురుపాఖ్యానము ( నాటకము ), 1 అం. నాంది

అని వర్ణించుటయు, విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకు గంగానదీ మహాత్త్వమును దెలుపుచు -

ఇది పాల్కడలి కన్నె నెలమి నేలెడు దొర
యడుగు గెందమ్ముల యలరుఁదేనె
ఇది గట్టువిలుపట్టు యెకిమీని సిగఁజుట్టు
ననలారనీని చందనఁపు దేట
ఇది మంచుమల మేన నొదవి ముజ్జగముల
నెలకొనఁజాలు పున్నెముల చాలు
ఇది తోయనిధికిఁ బెంపిడు మేలిగొనముల
వన్నెకెక్కిన గారవంపుటాలు .... 5 ఆ., 195 ప.

అని వర్ణించుటయు, సూర్యాస్తమయ సందర్భమునఁ బ్రకృతి యస్తవ్యస్తత గూర్చి చెప్పుచు –

'తమ్మిపూదీవియ దైన్యంబున మునుంగఁ
దొగదీఁగె విరిజిగి దొరయసాగె
జక్కవ లుస్సురంచుక్కు వో సడలంగ
లలిఁజకోరాలి కుల్లాస మెసఁగెఁ
దెరవరులకు గుండె దిగ్గు దిగ్గురనంగఁ
దెక్కలికాంద్రకుఁ దెలివి వొడమెఁ
గాకిపిండువు గన్ను గానరాకొదుగంగ
గూబ లక్కజఁపుఁజూడ్కులఁ బొసంగె

నిక్కవలకు జారు లిదె తఱి యనితారఁ
దక్కవారికింటఁ దాఁగనయ్యె
నొక్కయినుఁడునన మఱొక్కండు రాజురాఁ
జిక్కియున్న నడిమి యిక్కటమున

- బా. కాం.- 8 ఆ., 19 ప.

అని వర్ణించుటయు నిటఁ గవుల తెనుఁగు పదముల ప్రచురప్రయోగమున కుదాహరణ ముగా గ్రహింపఁదగియున్నది.

సంస్కృతపదములు: పట్టాభిషేకోత్సవ వార్త విన్నంత సమలంకృతయైన యయోధ్యాపట్టణమును -

సిక్త సమ్మార్జిత చిత్రిత సుమమాల్య
 సంవిధాన విధానుషంజితంబు
రమణీయతర గోపుర ద్వార తోరణ
 వ్యాకీర్ణ మణిమాలికాంచితంబు
సవిధ పతాకాప్రచారణగ్రహణాఢ్య
 సువితాన మౌక్తిక శోభితంబు
చందనాగరుసార చర్చాసమర్చిత
 ప్రతిధూపితాలయప్రాంగణంబు
హృష్టపుష్టజనశ్రీసమేత మతిస
మృద్ధవిపణాపణాకీర్ణ మీడితోత్స
వ ప్రధాన కథానోన్యన్య వర్ధితోత్క
భావ మప్పుర మరసెఁ దపస్వివరుఁడు

— అయో. కాం. - 2 ఆ., 427 ప.

అని వర్ణించుటయు, రామవియోగజనిత మగు దశరథుని దుఃఖమును గూర్చి చెప్పుట [1] అట్లే రావణుఁ డశ్మనగరమునఁ గనిన యపూర్వశోభానము పేతమగు గృహ రాజమును గూర్చి వర్ణించుట [2] సీతారాముల వనవిహార సందర్భమున వారు వేయి రేకులవిరివలె సంస్కృతమ్మగు నొకదివ్యవిహారమునఁ బ్రవేశించిరని వర్ణించుటయు[3] వారి సంస్కృతసమ పద ప్రచుర ప్రయోగమునకు నిదర్శనము.

---

1. అయో. కాం. 6 ఆ., 90 ప.
2. ఉ. కాం. పూ. భా. 4 ఆ. 526 ప.
3. ఉ. కాం. ఉ. భా. 1 ఆ. 159 ప.

అట్లే సంస్కృతాంధ్ర పదములను సమములుగాఁ బ్రయోగించిన ఘట్టము లిందు మనోహరములై వరలుచున్నవి. శ్రీరామగుణాభివర్ణన సందర్భమునను,

( అయో. కాం. 1 ఆ. 33 ప. ) చూ. పాత్ర చిత్రణము

ఇంద్రుఁడు శరభంగాశ్రమముఁ జేరఁబోవుటను జెప్పునప్పుడును

కడలెల్లఁ గడకొత్తి గడవ మేకొనువృత్తిఁ
దొలుదొల్త నొకతేజుదోఁచి నెఱయ
వెలుఁగులో వెలుఁగన్న వెరవొప్పఁ దన్మధ్య
మండలంబగుచు వేఱొండు వెలయఁ
బుష్పకంబని యెన్నఁబోవంగ నంతలో
బూరుషాకృతి యందు వొడమి మెఱయ
దివ్యుఁడంచు నొకింత తేటిచూచెడునంత
ఛత్రచామర శశిచ్ఛాయ లొలయ
.... .... ....

- అర. కాం.- 1 ఆ., 92 ప.

ఇత్యాదిగా వర్ణించుటయు శాస్త్రి గారి సమ సంస్కృతాంధ్ర పదప్రయోగ మున కుదాహరణములుగా నెన్నఁదగియున్నవి.

**వృత్తౌచిత్యము** : వర్ణ్యముయొక్క స్వభావమునుబట్టి తదుచితమగు వృత్తము పాటించుట వృత్తౌచిత్యముగా భావింపఁబడును.

జగదద్భుతములగు వస్తువులను, నూత్నవిషయములను బరిచయము చేయునప్పుడును, సందర్భము మాఱినప్పుడును, వృత్తము మార్పుఁజెందుట ప్రాచీన కావ్యములఁ గాననగును. శ్రీరామకథామృతమున నట్టి సంప్రదాయము బహుధా పాటింపఁబడినది.

రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట సిద్ధాశ్రమమునకుఁ బోవుచు గంగా నదిని సమీపించిరి. అట్టియెడ గంగానదీవర్ణనము 'లయగ్రాహి' వృత్తమున సాగుట రంగత్తుంగ తరంగితయగు నదీస్వభావ ప్రకటనమున సమర్థమై యుత్సాహ జనకమగుచున్నది.

అంగనలో వారలెదురం గనిరి దివ్యముని
　　పుంగవ మనోవికస నాంగణ యశశ్శ్రీ
సంగ సముపాత్తజయ మంగళకళాభ్యుదయ
　　రంగ దమలాంగహృదయంగమ విలాసో
త్తుంగ కరుణామృత తరంగ కలితోల్లస ద
　　పాంగ రసతా నటన రంగసుఖలక్ష్మీ
సంగమన సర్వభయ భంగకృతి హేతుదృగ
　　భంగ గుణసంపదనుషంగ నల గంగన్

- బా. కాం.– 5 ఆ., 186 ప.

అట్లే శివధనుర్భంగజనిత మగు ధ్వని దిక్కులం బిక్కటిల్లఁ బిడుగు లురలినట్లును, బృధ్వీధరేంద్రములు బ్రద్దలైనట్లును, భూకంపమొదవినట్లును, భయం బొదవఁ జేసినట్లును 'లయగ్రాహి' వృత్తమున వర్ణించుట జగతి నేర్పడిన భావోద్విగ్నతను వెల్లడించుచున్నది. [1] మఱియు సుగ్రీవాజ్ఞ ననుసరించి దిశల నుండి యేతెంచిన వానరపుంగవులు 'గంతులువైచుచు, నుబ్బునఁ బొదలుచు రామదేవుఁ బొగడుచు నుత్సాహంబున సీతాన్వేషణతత్పరులై' యొక్కుచోఁ జేరని వీరరసోచితముగా వర్ణించిన సందర్భమునను 'లయగ్రాహి' వృత్తము నిర్వహింపఁబడుట మనోహరము. [2] అనఁగా నొకప్పు డొకేవృత్తము రసానుగుణముగా గతిభేదమున నడుపుటయు విశేషము. అట్టిది కవి సామర్థ్యమును బ్రకటించుచుండుట హృద్యము.

పుష్పాపచయ వర్ణన సందర్భమున రగడ, వృషభగతి రగడ లుపయుక్తములైనవి.[3]

రామబాణనిహత యగు తాటక శాపవిముక్తి నంది వేల్పుకన్నెయై 'మంజుభాషిణీ' వృత్తముల స్తుతించినట్లు వర్ణించుట హృదయంగమము. [4] అంత రాముఁ డామెను 'మంజుభాషిణీ! నీస్తుతి మంజిమంబు, హాళివిబుధాళి కర్ణ రసాయనంబు' అని గారవించుట సాభిప్రాయసుందరము. లజ్జావతులగు నవవధువులను సైతము భర్తృసంస్పృష్టలకై వక్షస్థలి నెలకొనఁ ద్వరవెట్టుచున్న చంద్రాతపము నందలి

---

1. బా. కాం., 9 ఆ., 144 ప. 2. కి. కాం.- 2 ఆ., 282 ప.
3. బా. కాం.- 2 ఆ., 78, 8 ఆ. 109 ప., ఉ. కాం.- పూ. భా., 1 ఆ., 67 ప.
4. బా. కాం.- 5 ఆ., 287-95 పద్యలు

తీక్ష్ణతను [1] ఖరదూషణాదులు పదునాల్గువేల రక్కసులతో రామునిపై దాడి వెడలు సందర్భమున వారి సంరంభమును [2] మహాస్రగ్ధరా వృత్తమున వర్ణింపఁబడినవి. అరణ్యకాండమున నిప్పట్టుననే 'లయవిభాతి' వృత్తమును బ్రయోగింపఁబడినది. [3]

సీతకై శోరక వర్ణనము 'మత్తకోకిల' వృత్తముల వర్ణితమైనది. వయో దశను సూచించుట ప్రయోజనముగా భావింపవచ్చును. [4] వసంతఋతు వర్ణనము నట్లే 'మత్తకోకిలవృత్తము' న సాగుట స్వభావోక్తిమధురము. [5]

వేదవతి, రావణునకు లోకవిలక్షణమగు దన వృత్తాంతమును వినుచు సందర్భమున పృథ్వి, తోటకవృత్తములను,[6] రావణుఁ డామెతోఁ దన మనోవికారమును దెల్పునప్పుడు దోధక, వనమయూర, పంచచామర వృత్తములును వినియోగములైనవి.[7]

రోమపాదుఁడు ఋష్యశృంగునకుఁ దనకూతునిచ్చి వివాహంబొనరింప వేడు సందర్భముననను,[8] భరతుఁడు చిత్రకూటమునందున్న రామునిగాంచి యుప్పొంగెనవి[9] చెప్పుటయు 'పంచచామర' వృత్తముల వర్ణితములైనవి. వారి యుత్కంఠ యిందుఁ బ్రకటితమగుట హృద్యము. పంచవటి యొక్క విశిష్టతను జెప్పుచు 'మత్తకోకిల' 'పృథ్వీ' వృత్తముల నాశ్రయించుట విశేషము [10]

హనుమంతుఁ డశోకవని యందు రాక్షసులతో యుద్ధమొనరించుచు సింహ పరాక్రమమున విజృంభించినవిధము 'తోటక' వృత్తమున నిట్లు రమణీయముగా వర్ణింపఁ బడినది.

> సెలకొత్తల కొత్తల సింగమునా
> నలవోక హరీంద్రుఁ డజాండము శ్వే
> ళల ఘూర్ణిలఁజేయుచు లాఁతులు బె
> గ్గిల మిన్ను గ్రమించెను గేళి మెయిన్
>
> \- సుం. కాం.- 3 ఆ., 125 ప.

---

1. బా. కాం., 8 ఆ., 36 ప.
2. అర. కాం.- 2 ఆ., 98 ప.
3. అర. కాం. 2 ఆ., 99 ప.
4. బా. కాం.- 4 ఆ., 154-55 ప॥లు
5. కి. కాం.- 1 ఆ., 22 ప.
6. బా. కాం.- 4 ఆ., 77, 78 ప॥లు
7. బా.కాం.4 ఆ., 81,83,84ప॥లు
8. బా. కాం.— 1 ఆ., 500 ప.
9. అయో. కాం.- 8 ఆ., 173 ప.
10. అర. కాం.- 2 ఆ., 97, 98 ప॥లు

రాముఁడు వానరసేనతో లంక ముట్టడిసేయు సందర్భమున 'శాలిని' వృత్తము వారి యుత్సాహస్ఫోరకముగా వర్ణింపఁబడినది.

సన్నాహం బాసన్న నొప్పారఁ గాల్యం
బౌన్నత్యంబుద్యజ్జయశ్రీఁ దలిర్పన్
మున్నై యోధు ల్ముఖ్యు లుప్పొంగ జేజే
లెన్నందర్లె న్వేల శత్రు న్మడంపన్

- యు. కాం.- పూ. భా., 5 ఆ., 126 ప.

'హనుమన్మాహాత్మ్యము' ను వర్ణించుచు సుదీర్ఘము, నోజోగుణప్రధానము నగు 'దండకము' నాగమోక్తవిధానమున రచించుట శాస్త్రిగారి భక్తితాత్పర్యములకు సమయోచిత వృత్తనిర్వహణ సామర్థ్యమునకు నిదర్శనము. [1] శాస్త్రిగారి ఆగమ విద్యాప్రావీణ్యమిటఁ జక్కఁగా నిరూపింపఁబడినది. శ్రద్ధాళులగు వారికిది నిత్య పారాయణార్హమగు ఘట్టము.

బ్రహ్మాదులు క్షీరసాగరమున కేగి విష్ణుని బ్రార్థింప నాతఁడు ప్రత్యక్షమై నట్లు వర్ణించు సందర్భమున 'వసంతతిలక' వృత్తము వర్ణితమగుట జరుగబోవు శుభోదర్కమును సూచించుచున్నది. [2] వాల్మీకి కుశలవులఁ గుశీలవుల గావించి యయోధ్య యందు రామాయణము గానమొనరింపుఁ డని యుపదేశించు సందర్భమున 'లయగ్రాహి' వృత్తముఁ జిత్తమునకు హత్తుకొనునట్లు వర్ణించుటంజేసి వృత్తౌచిత్యము పాటింపఁబడినట్లైనది. ( 3 ఉ. కాం. - ఉ. భా. 84. 13 ప. )

కావ్యమంతటను ప్రసిద్ధములగు చంపకోత్పల మత్తేభ శార్దూల వృత్తములు, జాత్యుపజాతులగు కందము, సీసము, ఆటవెలది, తేటగీతులు మొదలగు నవియు నుప యుక్తములైనవి. సుదీర్ఘ వర్ణన లన్నియు సీసపద్యములలో వర్ణితము లగుట రమణీయత సంతరింపఁబడినది. అన్ని పద్యములు ననర్గళమగు వారి కవితా ధారాప్రవాహము నిరూపించు ధోరణి కలవియై తనరుచున్నవి. తమ తండ్రి గారు -

వచనమ్మునకుఁ గ్రొత్తరచనల సమకూర్చి
సీసమ్ము బంగారు సిరికిఁ దార్చి
శార్దూల మత్తేభ సమరసత్వము దెల్పి
చంపకోత్పల గతికింపుఁగొల్పి

---

1. ఉ. కాం.- పూ. భా., 8 ఆ., 182 ప. 2. బా. కాం.- 1 ఆ., 233 ప.

కందమ్ము కలిమికి నందమ్ముఁ గల్పించి
యాటవెలఁది గీతి తేటలుంచి
యతికిఁ బ్రాసమ్ము నియతికి సంపదలిచ్చి
శయ్యానుగుణరీతి జాతిగుర్చి - (స్మారక సంచిక)

శ్రీ రామకథామృతమ్ము రచించి బుధవరుల నలరించిరని శ్రీ రాఘవ నారాయణ శాస్త్రిగారు సంభావించినారు.

ఆశ్వాసాంత పద్యములలో 'స్రగ్విణి', 'మాలిని'. 'మందాక్రాంత' 'శిఖరిణి', 'స్రగ్ధర', 'ఉపేంద్రవజ్ర, మేఘవిస్ఫూర్జితము, భుజంగప్రయాతము, కవిరాజవిరాజితము, రథోద్ధత, వనమయూరము, ప్రమితాక్షర, మత్తమయూరము, ఉత్సాహ, వసంతతిలక, ఇంద్రవజ్ర, చంచరీకావళి, స్వాగత, ద్రుతవిలంబిత, పుష్పితాగ్ర, మంగళమహాశ్రీ' అను విశేషవృత్తములు వర్ణింపఁ బడినవి. ఇందు 'మాలిని' ప్రచురముగఁ బ్రయోగింపఁ బడినది. ఇవియన్నియు వేదాంతార్థబంధురములై వారి ఛందశ్శాస్త్ర పరిచయముతోఁబాటు వేదాంత శాస్త్ర పాండిత్యమును, భక్తియోగపారమ్యములను బ్రకటించుచున్నవి.

అట్లే శ్రీరామకథామృతమున నాలంకారికులు 'వృత్తగ్రంథి, చూర్ణము ఉత్కలికాప్రాయము' అను భేదములతో నిర్వచించిన గద్యము. సర్వథా నిర్వహింపఁ బడినది. 'అనుచు నయ్యెలనాగ లయ్యగురుఁబోఁడి నియ్యకొలిపి నేర్పున నొయ్య నొయ్యనం దోడ్కొని చని నిరంతర వసంత విభ్రమజరీజృంభమాణ మాకంద కుసుమ మంజరీ సందానితామంద మరంద నిష్యంద సమాస్వాదన తుందిల సానంద మిళిందబృంద మిధున తంతన్యమాన గాన ప్రబంధాను బంధంబును ....' [2] ఇత్యాది గాఁగల వచన రచన మందుల కుదాహరణ మగుచు సంస్కృతమున బాణునిఁ బాణినిఁ దలపించు చున్నది.

1. కా. సూ. ప్ర. అధి. తృ. అ., 22-25 సూ॥
2. బా. కాం. - 8 అ., 106 ప.

# వేదశాస్త్ర సంప్రదాయపాలనము

సనాతన భారతీయసంస్కృతికి వేదములు, శాస్త్రములు, స్మృతులు, పురాణేతిహాసములు, పట్టుగొమ్మలు. అవి ధర్మమూలములై వరలుచున్నవి. ఆర్షకవి యగు వాల్మీకి వేదమును శ్రీమద్రామాయణముగాఁ బరిణమింపఁజేసి తానందు వాస్తు జ్యోతిషశిల్ప శాకునిక ఆయుర్వేద ధనుర్వేద మంత్ర సాముద్రిక వ్యాకరణాదిశాస్త్రముల నెన్నింటినో పెక్కుఘట్టము లందు వివరించినాఁడు. ఆ విషయమే శేషేంద్రశర్మగారు 'రామాయణము విప్పినచో ఇదే బాధ. అందులో కవిత్వము కేవలము రోగి కిచ్చు మందు నందలి అనుపానమువంటిదే. అసలు పరమార్థము శాస్త్రజుష్టము' [1] అని పేర్కొనియున్నారు. భాసకాళిదాస శ్రీహర్షాది సంస్కృత మహాకవులీ మార్గముననే పయనించి శాస్త్రవిషయము లనేకములు తమ కావ్యములఁ బ్రతిపాదించిరి. 'చేతస్యాసక్తికయా' [2] ఇత్యాది శ్లోకమున మురారి శాస్త్రార్థ ప్రతిపాదనముఁ గూర్చి ప్రస్తావించినాఁడు. 'ఇదం కవిభ్యః పూర్వేభ్యః నమోవాకం ప్రశాస్మహే, వందే మహిచ తాం వాణీ మమృతామాత్మనః కలామ్' [3] అని భవభూతియునట్టి కవివరులకు నమస్కరించి కీర్తించినాఁడు. భట్టి తన కావ్యమును వ్యాకరణ ప్రయోగనిరూపణమునకే రూపొందించినాఁడు. ప్రాచీనాంధ్ర కవి పుంగవులు తమ తమ కావ్యములలో సందర్భోచితముగా నాయాశాస్త్ర విషయములు ప్రపంచించి, మహితమగు కవితలెలయించినారు.

'శాస్త్రవేత్త' లగు శ్రీరామకథామృత కవులు 'నైక విద్యారహస్యముల్ స్వీకరించి' [4] తమ కావ్యమును జక్కఁగాఁ దీర్చిదిద్దిరి. కావుననే వీరిని 'శ్రుతులన్ శాస్త్రములన్ బురాణములు సొమ్ముల్ రసాశ్లిష్ట వాక్చతురత్వం బుపమింపరానిది' ఇత్యాదిగా కవితా వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రశంసించినారు.

'వేదముల యందు, బురాణముల యందుఁ బ్రతిష్ఠితమైన ధర్మమే కావ్యము లందును సునిరూపితమై కర్తవ్యోన్ముఖుల గావించుచున్నద'ను [5] నాలంకారికుల మతము బుధసమ్మత మగుట ప్రసిద్ధము. కావున వేదార్థమును వివరించు షడంగము

---

1. షోడశి, 88 పు.
2. అనర్ఘరాఘవమ్, 1 అం., 5 శ్లో.
3. ఉత్తర రామచరితమ్., 1 అం. - 1 శ్లో॥
4. రా. క. ఉ. కాం. ఉ. భా. 10 ఆ. 54 ప.
5. ప్ర. రు. (విద్యానాథుఁడు) - ఉపోద్ఘాతము, 8 శ్లో.

లగు శాస్త్రవిషయములు కావ్యమునఁ బ్రస్తావించుట కావ్యత్వమునకు భంగకరములని చెప్పిన 'శాస్త్రేణ హన్యతే కావ్యమ్' ఇత్యాది వచనము లనాదరణీయము లనుట నిర్వివాదాంశము. విద్వత ఉ కవయః కవయః, కేవల కవయస్తుకేవలం కపయః" అను వారోక్తియు నియ్యెడ స్మరింపఁ దగియున్నది. పైరునకు నీరు గాలి వలె బుద్ధి వికాసమునకు కావ్యశాస్త్రములు దోహదము లగుచున్నవని భాష్యమున శంకరుఁ డిట్లు వివరించియున్నాడు 'సత్కావ్య శాస్త్రాద్యవగాహనంచ సమీర సేకాదివదీరయన్తి.'

కావ్యములు రసభరితములు గావున శాస్త్రార్థము లందు రసస్పర్శతో సులభముగా బోధించుటకు శక్యము లగుచున్నవి. శ్రీరామకథా ఉమృత కవులట్టి ప్రయత్నమే తమ కృతి యందుఁగావించి కృతకృత్యులైనారు.

వేదప్రామాణ్యము : వేదమే వాల్మీకి రామాయణముగాఁ బరిణమించినది. కావున నందు వేదవాక్యముల వేరుగా నెన్నవసరము లేదు. అనువాదమునఁ గూడ నాస్థాయి నిలుపుటకు సర్వథా ప్రయత్నము చేయఁబడినది. ఎడనెడ మూలాధికముగాఁ గొన్ని శ్రుతివిషయములు నిందు ప్రస్తావించిన ఘట్టములుకలవు. ఆ విశేషము లిందుఁ బరిశీలింపఁబడుచున్నవి.

రామలక్ష్మణులు విశ్వామిత్రునితోఁ గూడి సిద్ధాశ్రమమున కేగుచు గంగ సమీపించిరి. ఉత్తుంగ తరంగిత యగు నా నదిని గూర్చి చెప్పుచు విశ్వామిత్రుఁడు 'రామా! నీయెడఁ గల బాంధవ్యమున కలరి నిన్ను గాంచినంతనే యుల్లాసమునఁ బొదలుచుఁ దరంగ నినాదములు వెలయ పలుచున్నద' ను సందర్భమున 'కన్నినఁ గన్నెత్తము గన్నవారిఁ గనఁ గన్నం బొంగు టిట్లేగదా!' [1] యని పల్కుట రామాదులు భగీరథవంశము వారను పూర్వకథా స్మరణముతోఁబాటు 'విష్ణు పాదోద్భవా గంగా' అను శ్రుత్యర్థము సుందరముగాఁ బ్రతిపాదింపఁబడినది. అట్లే రామాదులరణ్యవాసమున కేగుచు గంగఁదరిఁ జేరునప్పుడు నదిని వర్ణించినతీరు నిట్టి యర్థమునే సంభావింపఁజేయుచున్నది. ఇయ్యది యమూలకము.

వా రలరుచు దరిఁజేరఁగ
వారలఁగని పుట్టినింటివారను ముద మ
వ్వారిగ నా యమయు మురియు
తోరపు నడినన్నలపుడు దులకించె సఖీ!

— అయో. కాం.-5 ఆ., 96 ప.

---

1. బా. కాం. 5 ఆ. 203 ప.

సిద్ధాశ్రమమున రాముఁడు సుబాహుని యాగ్నేయాస్త్రమున సంహరింప '.... .... నమ్మకము జనించె, నగ్నిముఖులు దివిజు లగుట నిక్కంబిది యనుచుఁ బుడమిజనుల కబ్జవదన' [1] అని శివుఁడు వర్ణించినట్లు చెప్పఁబడినది. లోకమునఁ బ్రజలు యజ్ఞయాగాదులు సలుపునెడ నింద్రవరుణాది దేవతలకు మంత్రపూత మగు హవ్యము నిచ్చుచు నగ్నిముఖమున వ్రేల్చుట, వీతిహోత్రుఁడది వారలకుఁ దేజోరూప మునఁ జేర్చుట, దేవత లందులకు సంతృప్తులై సువృష్టిఁగూర్చి వారి కభీష్టము లొసంగుట యనునది వైదిక సంప్రదాయము. 'అగ్నిముఖా వై దేవాః' అను శ్రుతి వాక్యమీ యర్థము ను వివరించుచున్నది. 'అగ్నిదేవతాకమగు శర మసురమైఁగాల్ప' 'నగ్నిముఖులు దివిజులగుట' నిరూపించుచున్నదని చెప్పుచు శ్రుత్యర్థము నిట్లు సమన్వ యముఁ గావించిరి. శ్రీ వేంకటప్పయ్య శాస్త్రిగారు తమ కావ్యమును సహితము యజ్ఞార్థకర్మగా భావించి పరమేశ్వరార్పణము గావించిరి. ఇందును శాస్త్రిగారి వైదికనిష్ఠ వెల్లడి యగుచున్నది.

ఏవిభు సత్కృపాగరిమ నీకృతి యాకృతిఁగాంచె నాయెడన్
భావము పొంగ నాభువన పావనమూర్తికి దీని నిచ్చెదన్
దైవత వల్లభాదులకుఁ దత్పరిపాలిత సస్య హేతుకం
బై విలసిల్లు హవ్య మెటు లయ్యజమానుఁ దొసంగునట్లుగాన్

- బా.కాం.- 1 ఆ., 38 ప.

సృష్ట్యాది యందు బ్రహ్మ ప్రజలను, యజ్ఞములను సృజించినాఁడు. ప్రజలు యజ్ఞకర్మల ద్వార దేవతలను యజింప, వారు ప్రజల కోర్కెలీడేర్ప నియ మించినాఁడు. ఇట్లు పరస్పరము సహాయము నంది శ్రేయస్సుల ననుభవించుచున్నారని గీతావాక్య మిట్లు చెప్పుచున్నది -

---

1. బా. కాం. - 5 ఆ., 441 ప.

సహాయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేషవో_స్త్విష్ట కామధుక్
దేవా న్భావయ తానేన తేదేవా భావయన్తు వః
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ

— గీత.- 3 అ., 10,11 శ్లో॥లు

ఆ గీతార్థసారమిందు సునిపుణముగా నిరూపింపఁ బడి, యీసత్కృవిచేఁ బాటింపఁ బడినది. విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతో యజ్ఞ సందర్శనమునకుఁ బోవ జనకుఁడువారి నర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి ముని యాగమనమున కానందించిఁ దేవతలీరూపమునఁ దనకు శుభముఁ బ్రసాదించిరని పల్కుచు -

నాచేయు క్రతువు మహితం
బై చేతనఁగాంచె నమరు లలరిరి తృప్తిన్
నీచేయు పూరణంబున
శ్రీచేతోహరుని కరుణ సేకురుటరుదే!

-బా.కాం.- 7అ., 173 ప.

అని సంభావించినాఁడు. 'యజ్ఞో వై విష్ణుః' అను శ్రుతివాక్యము (నారాయణ సూక్తము) యజ్ఞపురుషుడు విష్ణువే యని నిరూపించుచున్నది. శ్రీచేతోహరుఁ డగు విష్ణువు కరుణ సేకురుట యనఁగా యజ్ఞఫలము లభించుట. మునిచేయు పూరణమున నది (యజ్ఞఫలము) సిద్ధించినది. మునితో వచ్చిన రాముఁడు విష్ణువే యగుట నిరూపితమై యా క్రతువర్థ్య మిట చక్కగాఁ బ్రతిపాదింపఁ బడినది. అట్లే సీత యనసూయతోఁ దనస్వయంవర వృత్తాంతముఁ దెలుపు సందర్భమున -

యజ్ఞపురుషుండు యజమాను నర్థమొసఁగ
రూపుఁగొనివచ్చె ననిపించు రూఢితోడ
రాముఁడరుదెంచె మన్మనోరాముఁ డలమి
తపసి గెలిపింత ననెడు విద్దంపు బెలమి

అయో. కాం.- 10 అ., 207 ప

అనుటయు నియ్యర్థమునే స్పష్టపరచుచున్నది.

సీత విరహజ్వరార్తయై చంద్రోపాలంభము గావించుచు —

గురుఁడిల్సేర్చినఁ దగ్ధహస్త విధికిం గోల్పోక గావించి సో
దరి కొంప న్మలుకంప వెట్టి ఖగమోదధ్వంసముంజేయు వి
న్నారుఁ దేమంచికి శీర్ష మెక్కుమనె భిక్షార్థిత్వముంగోరి యో
స్మరమై త్రిం బరికించియో గరల బాష్పశ్రాంతికో యో శశీ!

- బా.కాం.- 8 ఆ., 76 ప.

అని యాక్షేపించినట్లు వర్ణింపఁబడినది. శివుఁడు చంద్రుని నెత్తిపై కెక్కించుకొనిన కారణము లెన్నుచు 'భిక్షార్థిత్వముం గోరియో' యనుటలో రాకాచంద్రుని కళలు దేవతలొక్కొక్కరు దినమున కొక్క టొక్కటివంతున నాహారముగా స్వీకరింతురను' 'ప్రథమాం పిబతే వహ్ని ర్ద్వితీయాం పిబతే రవిః' ఇత్యాదిగాఁ గల శ్రుత్యర్థ మిందు సమయోచితముగా వివరింపఁబడినది. అందు రుద్రున కొక కళ యాహార మగుట దానందులకు మోమోటపడియెనా ? యనుట చమత్కారము. కాళిదాసు 'పర్యాయ పీతస్య సురై ర్హిమాంశోః కళాక్షయః శ్లాఘ్యతరోహి వృద్ధ్యై' [1] అని యీ విషయమే యభివర్ణించినాఁడు.

వేదమున 'సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాత్' ఇత్యాదిగా విరాట్పురుషుని వర్ణించుచు నాతని నేత్రమున సూర్యుఁడును, మనస్సున చంద్రుఁడును బొడమినట్లు 'చంద్రమా మనసోజాతః చక్షోస్సూర్యోఽ జాయత' అని చెప్పఁబడినది. ఇట్టి వేదవచనమును బట్టి విరాడ్రూపుని యంశలగు ప్రాణుల నేత్రావయవములకు సూర్యుఁడు, మనస్సునకుఁ జంద్రుఁడు, వాక్కునకు సరస్వతియు నధిదేవతలని తత్త్వశాస్త్రముల నిరూపింపఁబడియున్నది. శివుని సేవ విష్ణుపదప్రాప్తికి హేతు వగు ననుట యద్వైతసిద్ధాంతము. కావున గుహుఁడు 'తొలిపుట్టువున సూర్యుఁ గొలిచిన కారణముగాఁ గనులకు రాముని మూర్తిఁ గాంచనయ్యె ననియు, సరస్వతి నర్చించిన ఫలముగ నాల్క రామనామ మొనరించు భాగ్యమునకు నోచుకొనిన దనియు, నుపవాసవ్రతములతోఁ జంద్రుని యనుగ్రహముఁ బడసినందు వలననే మానసము

1. రఘువంశం., 5 స. 16 శ్లో.

రామమంత్రమహిమ మరయఁగల్గిన దనియు, నిత్యశివపూజా తాత్పర్యమున రామపద సేవాభాగ్యము లభించినదనియు'[1] సంభావించినట్లు చెప్పఁబడినది. ఇట్లు శ్రుత్యర్థము సమన్వయించి చెప్పుట హృదయంగమము.

హనుమంతుఁడు లంకఁ బ్రవేశించి పరిశీలించి, పరిశోధించి సీతం గానక నిర్వేదపడుచు —

చిత్కళాఖ్యలక్ష్మి సిరిని విద్యుల్లేఖ

భాతి నెందు దాపఁ బడెనొ కాల

మహిమ రాముదేవి మహిత యాయమఁ బొడ

గాంచి భవము గడవఁగాంతు నొక్కొ

సుం. కాం.- 1 ఆ., 230 ప.

అని తలపోసినాఁడు. సాధకుఁ డగువాఁడు బ్రహ్మతత్త్వముఁ గనుఁగొనుట కనుభవించుఁ నుత్కంఠ యిందు వర్ణింపఁబడినది. 'చిత్కళాఖ్య' అనుటచే నానంద రూపమనియు, లక్ష్మి యనఁగా 'హిరణ్యవర్ణ' యనియు. 'రాముదేవి, యనుటచే బ్రహ్మాభిన్నశక్తి యనియు, అట్టి దేవతనుపాసించి తదనుగ్రహమున ననఁగా నామె తత్త్వమెఱింగి బ్రహ్మ సాక్షాత్కార మంది, భవబంధము లెల్లఁ గడచి మోక్షమును బొందుదురనునది యందలి యాంతర్యము. 'విద్యుల్లేఖభాతి' యనుట వలన 'నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా' ఇత్యాది శ్రుతి వాక్య మిందు గతార్థ మగుచున్నది. 'దాపఁబడెనొ యనునది 'యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్'[2] 'గూఢాఽఽత్మా న ప్రకాశతే'[3] మొదలగు నుపనిషద్వాక్యములను స్మరింపఁజేయుచున్నది. ఇట్లు 'సుందర కాండ కుండలినీ యోగమే' అన్న సంప్రదాయజ్ఞుల భావ మిట నిరూపింపఁబడినది. 'అని లక్ష్యము మదినిడి యయ్యనిలసుతుడు సొచ్చె'[4] ననుట యిందుల కుపబలక మగుచున్నది.

రావణునకు బ్రహ్మ శివోపాసనావిధిఁ దెలుపు ఘట్టమున మూలాధికముగా -

---

1. అయో. కాం.- 5 ఆ., 111 ప.
2. తైత్తిరీయోపనిషత్ - ద్వితీయ ప్రశ్న, 1 అ.
3. తైత్తిరీయోపనిషత్ — తృతీయవల్లి, 12 శ్లో.
4. సుం. కాం. - 1 ఆ., 231 ప.

సూక్ష్మమునకన్న సూక్ష్మమై సురుచిరమయి
వ్యాపకంబయి చైతన్యమనఁగ బరఁగు
సన్మహము బహిరంతర సంస్థితమ్ము
బ్రహ్మపరము శివాఖ్యమ్ముఁ బ్రస్తుతింతు - ఉ. కాం.- పూ. భా.5 ఆ.

అని శివతత్త్వమును నిరూపించినట్లు వర్ణింపఁబడినది. ఇయ్యది 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః' ఇత్యాది నారాయణ సూక్తము నందలి యర్థము తోఁబాటు 'అణోరణీయాన్ మహతోమహీయాన్ ఆత్మాస్యజంతో ర్నిహితోగుహాయామ్' [1] ఇత్యాద్యుపనిషద్వాణితోను, సంవదించుచుఁ బ్రామాణికతను సంతరించుకొనినది. శ్రీరామకథాఽ మృతమున నింకను మూలమునలేని శ్రుతి వాక్యములు కొన్ని యథాతథముగాఁ బొందుపరుపఁబడినవి. కౌసల్య బాల రాముని స్తుతించు ఘట్టమున -

యములు 'తమేవం విద్వా
నమృత ఇహభవతి' ముఖాఖి లామ్నాయ సృతిన్
నెమకెద రెద్దాని మహో
ద్యమ నీవది యనుచుఁ దత్త్వమరసితి జూమ్మీ

అనియు, రావణ యుద్ధానంతరము దశరథుఁడు ప్రత్యక్షమై రాముని యభినందించి యాతని గూర్చి లక్ష్మణునితోఁ జెప్పుచు '.... తదితమేవావ్యక్త తత్త్వమక్షరపరబ్రహ్మ' మంచను శ్రుతిఁ బరఁగినాఁడు. [2] పరమపురుషుఁడగు విష్ణువే యిట్లు పొడమినాఁడని నిరూపించినట్లువర్ణించుటయు నిందులకుఁ బ్రమాణము.

గాయిత్రీమంత్రమున 'ణ్యం' అనునది 'ణి, య' అని పదవిభాగము చేసి వేర్వేరుగాఁ బరిగణింపఁదగియున్న దనుట వైదికసంప్రదాయము. అప్పుడే గాయత్రీమంత్రమున '24' అక్షరము లుండును. 'తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహీ ధియోయోనః ప్రచోదయాత్' అనఁగా యకారముతోఁ గూడిన పదము వేదమున విశ్లే గ్రహింపవలె ననునది తాత్పర్యము. త్ర్యంబక, త్రియంబక పదము లిట్టివే.

---

1. కఠోపనిషత్., ద్వితీయవల్లి, 20 శ్లో.
2. యు. కాం. – ఉ, భా., 1 ఆ., 369 ప,

వేయి పద్యములకొక్క టి చొప్పున గాయత్రీ బీజాక్షరములు పొందు పరచు శ్రీరామకథామృత రచనమున నయ్యెడ 'ద్వ్యంతము', 'యంత్రణ' ఇత్యాదిగాఁ గల వేర్వేరుఁ పద్యములు రచించుట వలన నా రహస్య మిట వివరింపఁ బడినది.

వేదాంతవాక్య ప్రామాణ్యము : శ్రీరామకథామృతమున కౌసల్యాదుల గర్భలక్షణములను వర్ణించుచు వారుముఖమున రసబిందుకళలు ధరించినట్లు

రసమన బ్రహ్మమగుట ద
ద్రస మాత్రయి గర్భయుక్తి రాణించుట బైఁ
బ్రసరించు లక్షణములై
పొసగెన్ రసబిందుకళలు పుల్లాబ్జముఖీ !

— బా. కాం.- 3 ఆ., 6 ప.

అని మూలాధికముగాఁ జెప్పఁబడినది. 'త్రయి' అనఁగా దశరథుని ముప్వురు భార్యలు, మూఁడు వేదము లనియు నర్థద్వయము సిద్ధించుచున్నది. దశరథపత్నుల గర్భము లందు పరబ్రహ్మ యగు విష్ణువుతేజము వర్ధిల్లుచున్నది. వేదములందును బరబ్రహ్మయే కీర్తింపఁబడుచున్నాఁడు. 'రసోవై సః'[1] ఇత్యాద్యుపనిషద్వచన మీయర్థమునే విరూపించుచున్నది. ఇట్టి గంభీరార్థ ప్రతిపాదనమునఁ బుట్టఁబోవువాఁడు జగద్రక్షకుఁ డగు విష్ణువను నర్థము సూచింపఁబడినది. మఱియు నీ ఘట్టమున —

అణువుకన్న నణువు నని తెల్పె హరి యత్త
లోదరుల యుదరము లొందినపుడె
యటులె తనదు మహిమ కానవాలిడె వారి
పేద నడుములకుఁ బ్రవృద్ధిఁ గూర్చి

- బా. కాం.- 3 ఆ., 14 ప.

---

1. తైత్తరీయోపనిషత్ - ద్వితీయ ప్రశ్న., 7 అనువాకము, 6 వాక్యము

అని వర్ణించుటయు 'అణోరణీయాన్ మహతో మహీయాన్ ఆత్మాస్యజం తోర్నిహితో గుహాయాం' ఇత్యాద్యుపనిష దర్థమును బ్రతిపాదించుచున్నది. ఇట్లు మొదటినుండియు నిందు రాముని( బరబ్రహ్మగా సంస్తుతించుట హృద్యము.

రాము(డు విద్యాభ్యాస మొనరించు సమయమున -

"అన్ని యెడలను బ్రహ్మ తాదాత్మ్య లక్ష
ణోపనిష దర్థవివృతియు నొప్ప రాము(
డమరు ముని గోష్ఠి( గమలాకరమున నొగి వె
లుంగు ప్రతిమా ప్రభాకరు భంగి గిరిజ

- బా. కాం.- 3 అ., 226 ప.

అని వర్ణింప(బడినది. ఇందు 'సర్వేషాం వేదాంత వాక్యానా మద్వితీయే పరబ్రహ్మణి తాత్పర్యావధారణం శ్రవణమ్' [1] అనుభాష్యార్థము, 'తత్రశ్రవణంనామ వేదాంతానా మద్వితీయే బ్రహ్మణి తాత్పర్యావధారణాను కూలమానసీ క్రియా' [2] అను సోపానత్రయము నందలి శ్రవణలక్షణమును వివరింప(బడినవి. మఱియు నయ్యెడ షడంగ ప్రసంగములు సేయు మునుల గోష్ఠి కమలాకరము వలె నున్నది. వేద వేదాంగములచే( బ్రతిపాద్యు( డగు పరబ్రహ్మ 'కమలాకరమున నొగి వెలుంగు ప్రతిమాప్రభాకరు భంగి' దశరథాత్మజు( డగు రామునిగా జన్మించి విద్య లభ్యసించుచున్నా(డు. ఇట స్వయంప్రకాశమాను( డగు సూర్యునితో నుపమానము( జెప్పుట హృద్యము. ఇయ్యది సాంఖ్యసిద్ధాంత సమ్మతము. 'తత్సన్ని ధానాత్ అధిష్ఠాతృత్వం మణివత్' [3] ఇందు బింబప్రతిబింబ భావము సూచితము. 'అగ్నిర్యథైకో భువన ప్రవిష్ట రూపం ప్రతి రూపోభభూవ' [4] అను ఛాందోగ్య మీవిషయమునే సమర్థించుచున్నది.

---

1. బ్రహ్మసూత్రభాష్యము - 1-1 1
2. వేదాంతపరిభాష, 9 పరిచ్ఛేదమ్, 22 పంక్తి, 160 పు.
3. సాంఖ్యసూత్రములు - 1 అ., 66 శ్లో.
4. ఛాందోగ్యోపనిషత్ - 1 అ., 4 ఖండ.

సీతతోఁ గూడి రాముఁడయోధ్యఁ బట్టాభిషిక్తుఁడై యుండ ఋతువు లారును సేవించినవి. వర్షర్తువునందు మేఘుఁడు తాను రాముని రంగైన తనువుఁదాల్చి సీతఁ బోలు సౌదామని సేకరించి, జగము తృప్తి దయాప్రవర్షములఁ దార్చి, తద్విశిష్టా ద్వైతి కలన నలరినాఁడనుట వేదాంతార్థబంధురమై యొప్పుచున్నది. ( ఉ. కా. ఉ. భా. 1 ఆ., 196 ప., ) అమూలకమగు నిట్టి సంభావన కవుల తత్త్వదృష్టికి నిదర్శనము.

తమ కావ్యమును బరమేశ్వరార్పితము గావించిన వేంకటప్పయ్యశాస్త్రి గారు పరతత్త్వమును "ఎత్తావు వలనుండి యెద గూడి వాక్కులుమలయలే కూఁక మరలివచ్చు" ఇత్యాదిగా సంభావించుట "యతోవాచో నివర్తన్తే అప్రాప్యమనసా సహ" అను వేదాంతవాక్యములతో సంవదించుచున్నది. బా. కాం. 1 ఆ. 40 ప.

యోగశాస్త్రము : సీత కాంచనాంగి. ఆమె ముఖమున నలంకరింపఁ బడిన మృగమదరేఖ, కప్రముల నడుమ శరీరచ్ఛాయతోఁ గూడిన యాప్రదేశము త్రివేణీసంగమమువలెను, ఇడ, పింగళ, సుషుమ్నానాడులు కూడిన దివ్యప్రదేశము వలెను బ్రకాశించుచున్నదని వర్ణింపఁబడినది.

> మృగమదరేఖ కప్రము సమీపగతిం ద్యుతిపూర్తి కీర్తి జో
> కఁ గొఱలఁ గాంచనాంగి యలిక స్థలి నిల్వఁబొసంగె రెండు దృ
> ష్టిగ నిడ పేరి గంగజతఁ బింగలనాఁ జను భానుకన్య లో
> నెగయు సుషుమ్న యన్నలుకు పేతెఁసగం జిగిమించు చాడ్పునన్
>
> — బా. కాం.— 4 ఆ., 197 ప.

మృగమదము నీలవర్ణము కలది. కప్పురము తెల్లని రంగు కలది. వీని నడుమ కాంచనాంగి యగు సీత శరీరము పసుపుపచ్చని చాయఁ బ్రకాశించుచుఁ దెల్లని యిడానాడి, నల్లని పింగళనాడి, పచ్చని సుషుమ్నానాడితోఁ గూడిన ప్రదేశమువలె నొప్పుచున్నది. అట్లే తెల్లని గంగ, నల్లని యమున, పచ్చని సరస్వతితోఁ గూడిన సంగమస్థానమువలెను వెలుగొందుచున్న దనియు నిరూపింపఁబడినది. ఇందు సరస్వతీ నది యంతర్వాహిని యగుట కానరాకున్నను నీవిషయము పురాణ ప్రసిద్ధము. ఇడ, పింగళ, సుషుమ్నలు యోగశాస్త్రమునఁ బ్రస్తావింపఁబడినవి. ఆ వివరమిట్లు చెప్పఁబడు చున్నది.

ఇడాతిష్ఠతి వామేన పిఙ్గళా దక్షిణేన తు
తయోర్మధ్యే పరంస్థానం య _స్త ద్వేద సవేదవిత్

యోగశిఖోపనిషత్, 6 అ., 5 శ్లో.

అమూడునాడులు కలిసెడి చోట నుదుట తిలకము, కుంకుమ ధరించుట పరిపాటి. భారతీయ సంస్కృతిలో నలంకారము (కట్టు, బొట్టు, జుట్టు మొ॥) లన్నియు పరమేశ్వర వరి వశ్యాతాత్పర్య బోధకములగుట మాననీయములగు చున్నవి.

భగీరథుని తపస్సు వర్ణించు సందర్భమున మూలాధికముగా —

.... .... ....

కుండలినికి మేలుకోలు నెక్కొనజేసి
హంసత త్త్వవికాస మరసి మోచి

- బా. కాం.- 6 అ, 233 ప.

అని చెప్పుట యోగలక్షణమును విశదముగ వివరించుచున్నది. 'నాభే _స్తిర్యగధోర్ధ్వం కుండలినీస్థానమ్, అష్టప్రకృతి రూపాష్టథా కుండలీకృతా కుండలినీ శ క్తిర్భవతి, యథా వద్వాయు సంచారం జలాన్నాదీవి పరితస్కంధపార్శ్వేషు విరుధ్యైనం ముఖేనైవ సమావిశ్య బ్రహ్మరంధ్రం యోగకాలే చానేనాగ్నినాచ స్ఫురతి హృదయాకాశే మహోజ్వలాజ్ఞానరూపాభవతి' [1] ఇత్యాది శాండిల్యో పనిషద్వచనములీ విశేషమును వివరించుచున్నవి. 'శతంచైకాచహృదయస్య నాఢ్య _స్తాసాం మూర్ధాన మభి నిస్సృతైకా' అను కఠోపనిషద్వాణియు నీవిషయమును బ్రమాణీకరించు చున్నది. రేచక పూరక కుంభకముల ద్వార కుండలినీశ క్తి నుద్బోధించి యోగమును సలుపుట యోగి లక్షణము. అది యిటఁ జెప్పఁబడినది.

విశ్వామిత్రుని తపోనిష్ఠను గూర్చి మూలాధికముగా నిట్లు చెప్పఁబడినది.

ప్రాణవృ త్తి బిగించి పరఁగ దశేంద్రియ
వ్యాపారములు మాన్చి యంతఁబోక
మనమున వాక్కు నమ్మనము విజ్ఞాన మం
దదియ మహ త త్త్వమందుఁ జేర్చి

1. కఠోపనిషత్, 2 అధ్యా., 16 వల్లీ., 16 శ్లో.

శాంతాత్మ నద్దాని సరగలీన మొనర్చి
యధ్యాత్మ లక్ష్యైక్య మలవరించి
ప్రణవంబు సావిత్రి బ్రహ్మరూపంబున
కనురూపముగ యోగ మవధరించి

బాహ్యవృత్తుల మఱచి యబాహ్యశక్తి
కలిమి నుచ్ఛ్వాస నిశ్వాసములు నిలుప
నిలిచె నటు వేయి వత్సరంబులు మహాత్ముఁ
డాతఁడు తపఃప్రతిష్ఠా సమంచితముగ

– బా. కాం. - 7 ఆ., 513 ప.

ఇందు దశేంద్రియ వ్యాపారములు మాన్చి, వాక్కు మనమున, మనస్సు విజ్ఞానమున, విజ్ఞానము మహత్తత్త్వము నందుఁ జేర్చి బ్రహ్మభావనతో బాహ్యవృత్తుల మఱచి తపఃప్రతిష్ఠ నాతఁడు నిలిచె నని మూలమున లేని యధ్యాత్మ లక్ష్యము నిరూపింపఁబడినది. కావ్యప్రయోజనమగు పరనిర్వృతి పాత్రల వర్ణన సందర్భమున నిట్లు సంతరింపఁబడినది. ఇట్టి తపోవిధానము 'యచ్ఛేద్వాఙ్మనసి ప్రాజ్ఞ స్తద్యచ్ఛేజ్ఞాన ఆత్మని, జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛేత్తచ్ఛేచ్ఛాన్త ఆత్మని'[1] ఇత్యాదిగాఁ గల కఠోపనిషద్వాణితో సంవదించుచున్నది.

దశరథుఁడు పెండ్లి కుమారులతోఁ గల్యాణమండపముఁ జేరఁబోవు నప్పుడు పురజను లెల్లరు నహమహమికతో వారలఁ జూచుచుండిరి. అట్టియెడ నొకతె రామునిఁ గాంచి యాతని సుందరవిగ్రహము హృదయమునఁ బదిల పఱచుకొని యతఁ డచ్చట నుండి ముందునకు సాగిపోయినను నామె యట్లే చూచుచు నిలుపంబడినది.

త్రిప్పని చూడ్కిమై నొకతె తేఁకువ రామునిఁ గాంచి కాంచి తా
నప్పటి యట్ల యుండె నత డచ్చటువాసి చరించెనేనియున్
జెప్పె గురూపదేశమునఁ జెల్వగు యోగనిరూఢి లక్ష్యముం
దప్పని చిత్తవృత్తి యవధానపు సంపద నాపెయొద్ద కున్

– బా. కాం. - 10 ఆ., 317 ప.

---

1. కఠోపనిషత్, ప్ర. అ., తృ. వ., 13 శ్లో.

గుర్తు చెప్పినవాఁడు గురువు. ఆ గుర్తు విడువక యందే మనస్సు నిలుపువాఁడు సాధకుఁ డగు శిష్యుఁడు. రాముని రూపమామె హృదయమున నిండి యున్నది. హృదయమున నున్న సుఖదుఃఖములే మనము బాహ్యమునఁ జూచు చున్నాము. అనుభవించుచున్నాము. అట్లే యామె హృదయమున నిండిన రామునిఁ గనుల యెదుటఁ గాంచుచున్నది. ఇట్టి యోగము చిత్తవృత్తి నిరోధము వలనసిద్ధించు చున్నదని పాతంజలి యోగసూత్ర మిట్లు చెప్పుచున్నది. 'యోగః చిత్తవృత్తి నిరోధః'[1] శ్వేతాశ్వతరోపనిషత్తు నందీ విషయ మిట్లుచెప్పఁబడినది -

నసందృశ్యతే తిష్ఠతిరూపమస్య నచక్షుషా పశ్యతి కశ్చనైనమ్
హృదాహృదిస్థం మనసాయఏన మేవం విదు రమృతాస్తే భవంతి
— 4 అ., 20 శ్లో.

ఇట్లు రాముని పరబ్రహ్మత్వము నిరూపింపఁబడినది. అట్లే శ్రీరాముని వర్ణించుచు 'జిగివెన్నెలలు చిల్కు నగుమోము నెల తెవ్వికంబుజంబులు వికాసం బెనయుట' ఇత్యాది పద్యమునఁ (బా. కాం. 7 అ. 145 ప. 'గమకించు నీలమేఘ చ్ఛాయగనినహం సావళులకులుకు లనువుపడుట' అని చెప్పుటలో నాలంకారిక సౌందర్యముతోఁబాటు యోగమున హంసలు, అనగా శ్వాసలు మూలాధార, స్వాధిష్ఠానములు గడచి మణిపూరమును జేరునంత నింద్రనీల మణికాంతులతో నొప్పు నా సుందర ప్రదేశమునుండి హృదయస్థానమున నున్న అనాహతము వఱకు సుఖముగాఁ బయనించుట యోగిజనానుభవ గమ్యమగు విషయము. ఇందయ్యది వివరింపఁబడినది.

రాముఁ డైంద్రబాణమున నింద్రతనయుఁ డగు వాలినిఁగూలనేసె నని చెప్పుచు -

రాముఁడైంద్రబాణరాజంబునన యైంద్రిఁ
బడమిఁ ద్రోచి యింత బోధసేసెఁ
గారణంబుఁ గడిసి కాని యడంగదు
కార్యవస్తు వనుచుఁ గంజనేత్ర
- కి. కాం.- 1 అ., 313 ప.

---

1. 1 అ., 2 సూ.

లోకమున నేపదార్థము దేని నుండి పుట్టెనో యా పదార్థము దానియందే లీనమగుట సిద్ధాంతము. వాలి యింద్రజుఁడు. రాముఁ డాతని యైంద్రబాణమున సంహరించి 'కారణమును గదిసి కాని కార్యవస్తు వడంగదను' సత్యము నెఱుకపఱచి నట్లు చెప్పఁబడినది. 'యతోవా ఇమాని భూతాని జాయన్తే యేనజాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభి సంవిశన్తి' [1] యను తైత్తరీయోపనిషద్వాక్యములీ విషయమును ప్రమాణీకరించుచున్నవి,

వేదవతి విష్ణువును గూర్చి తపంబొనరించు సందర్భమును వర్ణించుచు –

తావులఁ గొన్నిటి న్వరుసదప్పక దాఁటి హిరణ్మయాఖ్య బిం<br>బావసితాత్మ మూర్తిఁగలయం బరికించి మనోవికారముల్<br>బోవెడలించి నిత్య పరిపూర్ణ సుఖామృతవార్ధిదేలి య<br>ద్దేవి పొసంగె విష్ణుదెస తీపి ఫలంబిదె చూవె భామినీ

– బా. కాం. - 4 ఆ., 30 ప.

అని తపోవిశేషమగు యోగవిధానమును వివరించిరి. 'కుండలినీశక్తి నుద్దీపింపఁ జేసి క్రమముగా నచటి తావులు కొన్ని దాఁటి యనఁగా యోగమార్గమునఁ గల మూలాధారాది చక్రములు దాటి సహస్రారకమలమును జేరి హిరణ్మయాఖ్య బింబమును దర్శించి నిత్యపరిపూర్ణ సుఖామృత వార్ధిఁదేలి బ్రహ్మానందము ననుభవించె' నని వర్ణించుట 'యోగకుండల్యుపనిషదర్థ' మును చక్కఁగా బోధించుచున్నది. [2] అట్టి పరమోత్తమస్థితి నందినవారికి మనోవికారములు కలుగవమట సత్యము. విష్ణుదెస తీపిఫలంబిదెచూవె' యనుట ఈ పరమార్థమును దెలియఁజెప్పుచున్నది.

రావణునిచే గొంపోవఁబడు సీత 'మనోవాక్కాయకర్మ' లను త్రికరణముల చేతను రామైకతత్పరయై యున్నదని యిట్లు వర్ణింపఁబడినది.

---

1. తైత్తరీయోపనిషత్, భృగువల్లి, తృతీయోధ్యాయః ప్రథమోనువాకః
2. యోగకుండల్యుపనిషత్, ప్రథ. అ.

ఆ మహిళాశిరోమణి ధరాత్మజ శేముషి రామరూప, త
న్నామ మయాత్మ జిహ్వ, యవినాకృత తద్గతదృష్టియుం దగన్
భూమరసాఢ్యయై తనరు పోడిమిఁ గన్గొనియుం దలంఁడా
సేమము రక్కసుండు తన చేటునకే మతి సమ్మతింపగన్

— అర. కాం. - 2 అ., 339 ప,

సీత పతియగు రాముని మనమున నిలుపుకొని రామా! రామా! యని పల్కుచు నాతఁడు వచ్చుదారి నీక్షించుచున్నది. అట్టి పతితత్పరతయే యామెను 'మహిళాశిరోమణి' గాఁ జేసినది. అట్టియెడ నామె భూమరసాఢ్యయై తనరిన దనుట 'యోవై భూమా తదమృతమ్' అను శ్రుత్యర్థమును బోధించుచున్నది. భూమ మనఁగా నన్యమెఱుంగకుండుట. 'యత్ర నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా'[1] అని ఛాందోగ్యోపనిషత్తు దానిని వివరించుచున్నది. అట్లే యసురుఁ డగు రావణునకు అమృతస్వరూపిణి సీత దక్కదను నర్థము వ్యంగముగా నిరూపింపఁబడినది. మఱియు నిది 'హృదామనీషా మనసాభిక్లృప్తో యఏతద్విదురమృతాస్తేభవన్తి'[2] అనెడి యుపనిష ద్వాణితో సంవదించుచున్నది. ఇట్టి గంభీరార్థమిట మనోహరముగాఁ బ్రతిపాదింపఁ బడినది. రాముఁ డఖండ సచ్చిదానందస్వరూపుఁ డని నిరూపించుట యను కవి యభిమత మిట సంపూర్ణముగా సిద్ధించినది.

సీతతోఁ గూడి రాముఁడు కొలువుదీరి యుండఁ జూచిన సభ వారి కానందము సిద్ధించినదట.

ఆ సిరినేలువానిఁ గననౌ గనుదోయి మనంబునందె యు
చ్వాసముదోఁపకేవిలయనంగతి సంగతమౌటఁ దృప్తిమై
నాసలువాసి కోసల సుతాత్మజ భూతిమయం బయంబుగా
నాసభవారు వొందిన సమాధి వచింపఁ దరంబె చిన్మయీ!

— ఉ. కాం.- పూ. భా., 10 అ., 31 ప.

మనోవృత్తులు లయమై యానందానుభూతి నందుట సమాధి. 'వృత్తి నిరోధాత్తత్ సిద్ధిః'[3] అను సాంఖ్యసూత్రము, 'లయయోగశ్చిత్తలయః కోటిశః

1. ఛాందోగ్యము 7-32
2. కఠోపనిషత్ - ద్వి. అ., 6 వల్లి, 9 శ్లో.
3. సాం. సూ.- తృ. అ., 31 సూ.

పరికీర్తితః' అను యోగతత్త్వోపనిషద్వాక్యమును సమాధివిషయమును వివరించు చున్నవి. కనుదోయి మనంబున న్మనుఁగ నుచ్ఛ్వాస నిచ్ఛ్వాసములు లేమి కోరికలు విడచి తత్పరులై సభవారు సమాధి ననుభవించిరని చెప్పుచు నా యోగరహస్య మిట వివరించిరి. అట్టియెడ సీతారాములఁ గాంచి సేవించిన భరతుఁడు 'మిమ్ము నిరుపుర నేకక్షితి మేళవించి కనఁగానగు యోగికి మనమ్ము లయమై యానందము లభించునని కీర్తించినాఁడు. భరతుని రాజయోగిత్వమిందు సునిరూపితము. లోకమున నెడమ, కుడి నేత్రములు స్త్రీపురుష లక్షణక్షితములై యుండుట శాస్త్రవిహితము. ఆ తత్త్వమెఱింగిన వారికి సీతారాము లక్షిగోచరులగుట సిద్ధించును.

దక్షిణనేత్రమం దెనఁగు తత్పురుషుండవు నీ వదక్షిణం
బక్షిఁ జెందియున్నది మహాత్మ ! భవత్సతి సీత మిమ్ము నే
కక్షితి మేళవించి కనఁగానగు యోగికి నందె డెంద మ
ప్డే క్షయ మంద బుద్ధికలయే తమఁగొల్వఁగనౌ నధీశ్వరా !

– పూ. భా.- 10 ఆ., 275 ప.

ఇందు యోగమునఁ జెప్పఁబడిన ఖేచరీముద్ర వివరింపఁబడినది.[1] నేత్రములు రెండు భ్రూమధ్యమున నిలిపి కనఁగానగు యోగికి మనోవృత్తి లయమై యింద్రియాతీత జ్ఞానము లభించును.

జాగ్రన్నేత్రద్వయోర్మధ్యే హంస ఏవ ప్రకాశతే
సకారః ఖేచరీప్రోక్త స్త్వం పదం చేతి నిశ్చితమ్
హకారః పరమేశ స్స్యా త్తత్పదం చేతినిశ్చితమ్

అను యోగచూడామణ్యుపనిషద్వాక్యములీ సమాధిస్థితినిఁ దెలుపుచున్నవి.

యోగానుభవము గల కవులు సీతారాములేకాంతమున గావించిన వనవిహార విశేషములను యోగదృష్టితో దర్శించి యభివర్ణించిరి. వారంచలం గట్టిన విమాన మందుఁ జేరి యాత్మకు వలె నందున్న యాఱు విహారస్థానము లందు విహరించిరి. అయ్యదిషట్చక్ర విహరణముగా సంభావింపఁదగియున్నది. వారా విహారములఁ

1. హఠయోగ ప్రదీపికా - చతుర్థోపదేశము, 43-55 శ్లో॥లు

దత్తద్రూపముల నందిరి. అందు రాముఁడు 'సద్వితీయుఁ డయ్యు నద్వితీయ సుఖ మనుభవించినాఁడు. అట్టి సుఖస్థానమును శ్రుతి భిన్నత్వమును, స్మృతి భిన్నత్వమును బురస్కరించుకొని పలువురు పలువిధముల సంభావించినారు.

కామేశ్వరీ మహాకామేశ్వరాద్వైత
సౌఖ్య సంపత్ప్రకాశమిదె యొక్కొ ?
లక్ష్మీ హృషీకేశ లక్ష్య విశేషితా
ద్వైత విద్యాప్రమేయ మిదెయొక్కొ ?
బ్రాహ్మణీ బ్రహ్మ ప్రభావ సంపాదిత
ద్వైతైతిహాసికార్థ మిదె యొక్కొ ?
పౌలోమకన్యా దివస్పతి ప్రస్ఫుర
ద్వైత సాద్వైత బంధ మిదె యొక్కొ ?

యెడసినట్టులుండి యేకత్వ మెనసిన
సర్వ వేదముల రసమిదె యొక్కొ ?
వివిధ హోత లేకవిధగతి కయ్యేడు
తఱికిఁ దోచనగు పదమిదె యొక్కొ ?

– ఉ. కాం.– ఉ. భా., 1 ఆ., 160 ప.

ఇట ద్వైత- అద్వైత - ద్వైతాద్వైత - విశిష్టాద్వైత సిద్ధాంత పద్ధతులు వివరింపఁబడి యన్నియు నొక్కటిగా నిరూపింపఁబడినవి. 'ఏకం సద్విప్రా బహుధా వదన్తి' అనెడి యుపనిషద్వాణి యియ్యర్థమునే ప్రతిపాదించుచున్నది. 'తస్యా శ్శిఖా యామధ్యే పరమాత్మావ్యవస్థితః ! సబ్రహ్మా సశివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్' ఇత్యాది శ్రుతియు నిందులకుఁ బ్రమాణము. అనుభావంబుల కిక్కయౌ నాగుహాలో రహస్యము సుధీ ధీగతి కందఁబోవదు సరిగదా స్త్రీపురుష లింగభేదమే కానఁబడదు. అందు స్త్రీకిఁ బ్రాధాన్య మొసఁగిన శాక్తేయ మతము, పురుష ప్రాధమ్యమున శైవ వైష్ణవాది మతము లనేకములు, తల్లింగభేదం బపగతమైన నఖిల సమ్మతమైన

యద్వైతమతముగాఁ జెప్పఁబడినది. [1] "సర్వేవేదాః యత్రైకం భవంతి, సర్వేహోతారో యత్రైకం భవంతి, సమానసీనా ఆత్మాజనానాం అంతః ప్రవిష్టశ్శాస్తా జనానాగుం సర్వాత్మా సర్వాః ప్రజాయత్రైకం భవంతి" అను శ్రుతివాక్యము లిట్టి వర్ణనకు మూలములై పొసఁగుచున్నవి.

ఇందు భేదమునకు మూల ముపాధియే గాని, వస్తుస్థితి యందుకాదు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ. తజ్జలాని శాంత ఉపాసీత' [2] అని ఛాందోగ్యము దీనినే నిర్వచించుచున్నది. ఇద్దాని ననుసరించియే 'మమైవాంశో జీవలోకే' [3] అని గీత ప్రవచించుచున్నది. ఇట్లు జీవతత్త్వ మంతయు బ్రహ్మాత్మకముగా నిరూపింపఁ బడినది. ఇఁక భేదమున కుపాధియేకారణము. కావుననే యాత్మతత్త్వమునకు స్త్రీపురుష భేదము లేదు. ఈ యుపనిషదర్థమునే శాస్త్రిగారు సీతారాముల యద్వైతభావనతో వ్యాఖ్యానించిరి. సీత పరబ్రహ్మశక్తి. కావున బరబ్రహ్మమైన రాముఁడు తన శక్తితోఁ గూడి సంపూర్ణతను బొందినాడు. అది తత్త్వైక్యము నందే సిద్ధించును. ఉపాధి యందు సీత స్త్రీ, రాముఁడు పురుషుఁడు. ఆత్మానుభవమున నుపాధి భాసింపదు. 'అహం బ్రహ్మాస్మి' అను శ్రుతి ననుసరించి కలుగుబ్రహ్మాను భూతియే బ్రహ్మాద్వైతము. ఈ యద్వైతమే సీతారాములలోఁ బ్రతిబింబించి నట్లిందు వర్ణింపఁబడినది.

యాగపరిసమాప్త్యనంతరము సిద్ధాశ్రమమున మునుల గోష్ఠి సలిపి ప్రమాణ చతుష్కము ననుసరించి రామతత్త్వమే పరబ్రహ్మమని నిరూపించిరని వర్ణింపఁ బడినది. [4]

ప్రత్యక్షానుమానోపమాన శబ్దాః ప్రమాణాని [5]

ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము అనఁగా వేదము. ఇవి నాలుగు ప్రమాణచతుష్కమని చెప్పఁబడుచున్నవి. ఈ ప్రమాణము లన్నింటికి నేకైక

1. ఉ. కాం.- ఉ. భా., 1 ఆ., 161-65 ప॥లు
2. ఛాందోగ్యోపనిషత్- 3 ప్రపాఠక., 14 ఖండః
3. భగవద్గీత
4. బా. కాం. - 6 ఆ., 6 ప.
5. గౌతమన్యాయదర్శనము — 1-1-3 సూ.

లక్ష్యమైన 'ప్రమేయము' 'పరబ్రహ్మమే' యని శంకరభగవత్పాదులు హార్దికముగా భాష్యమున నిరూపించియున్నారు.[1] అట్టి శంకరుని యాశయమే యిటఁ బ్రతిపాదింపఁబడినది. అవతారములు అనుమేయములు కొన్ని, శాబ్దికములు కొన్నియుఁ గలవు. ఉపమాన మిందుఁ బ్రతీపముగా మారినది. 'సదేవ సోమ్య ఇద అగ్రఆసీత్' ఇత్యాది వాక్యములు శబ్దప్రామాణ్యములు. ఈ శబ్దప్రతిపాద్యమైన విషయమునే తత్త్వశాస్త్రము అనుమాన ప్రమాణముతోఁ బ్రతిపాదించినవి. బ్రహ్మపదార్థము తనకుఁ దానే యుపమానమై తనకుఁదానే యుపమేయమునై యుండుట, ఉపమాన ప్రతిపాద్య మవిద్యాదశ యందుపమేయముగను సత్యదృష్టి యందు బ్రహ్మముగను నగును. 'యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జిత మేవవా'[2] అనెడి విభూతియోగము నందలి గీతాసూక్తమునుబట్టి విభవావతారములు, నర్చామూర్తులు నన్నియుఁ ప్రత్యక్ష ప్రమాణగమ్యములు. ఇట్లీ ప్రమాణచతుష్కము చేతఁ బ్రతిపాదింపఁబడిన ప్రమేయము 'ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ' అనెడి యుపనిషదర్థమే యగుచున్నది. అదియే ఈ పద్యమునఁ బ్రతిపాదింపఁబడినది.

శాబ్దంబునను మున్న చవిగన్న చెవిగొన్న
  పారవశ్యంబున బలువు మెచ్చి
యనుమతి కరణమే యనుమానమని దాని
  ప్రాధమ్య మొందెడఁ బాఱవైచి
రూపింపఁ బ్రతిరూప రూపణం బనదంచు
  నుపమ ప్రామాణ్యంబు నుజ్జగించి
యఖిల సమ్మతము ప్రత్యక్ష మం చద్దాన
  స్వానుభూతి విధా విధాన మరసి

---

1. బ్రహ్మసూత్రభాష్యము – 1-1-1 సూ.
2. భగవద్గీత, 10 అ., 41 శ్లో.

రామతత్త్వం బిదియె పరబ్రహ్మ మనుచుఁ
దపసులును దానుఁ దత్పరతంత్రు లగుచు
నొండు వృత్తు లెడలి చొక్కుచుండి రపుడు
నిత్యతృప్తి గడల్కొన నీరజాక్షి - బా. కాం.- 6 ఆ., 6 ప

రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ వరంతపః
రామ ఏవ పరం తత్త్వమ్ శ్రీరామో బ్రహ్మతారకమ్
— 1 ఆ. 6 శ్లో.

అను రామ రహస్యోపనిషద్వాక్యములీ సత్యమునే ప్రతిష్ఠించుచున్నవి. అనుమాన ప్రమాణము సత్యనిరూపణమున సర్వథాసమర్థము కాదు. బ్రహ్మమునుండి ప్రభవించిన జగంబున బ్రహ్మముతోఁ బోల్పఁదగిన దేదియును లేదు. కావున నుపమాప్రామాణ్యము పొసఁగకున్నది. ఇంకఁ బ్రత్యక్షము ననుభవముతోఁ బోల్చుకొని శబ్దప్రమాణము నాధారముఁ జేసికొని తత్త్వమును నిర్ణయింపవలయును. మునులట్లేచేసి సంకల్పసిద్ధి నంది బ్రహ్మనంద మనుభవించిరి.

సూర్యాస్తమయానంతర మంధకార మలముకొన్న తఱిఁ దమోవ్యాప్తి సంసృతియకాఁ బోల్చెననుట హృద్యము.

తాళ్లఁబాముల నొనరించె దవిలి స్థాణు
వులనె దొంగలుగాఁ జూపె గలుఁగు మిఱ్ఱు
గన్ను మిన్నును గానని గతిఁ బొనర్చె
సంసృతియకాఁ దమోవ్యాప్తి జనులకెల్ల
— బా. కాం. - 8 ఆ., 14 ప.

సంసృతి యనఁగా నజ్ఞానము. అజ్ఞానము వలన వస్తుస్థితి భిన్నముగా గోచరించును. ఇట్టి యజ్ఞానము వలన బ్రహ్మమే ప్రపంచముగా గోచరించుచున్నది. అది భౌతిక దృష్టి. అట్లే యంధకారము వలన తాళ్లు పాములుగను, స్థాణువులు దొంగలుగను గోచరించు చున్నారని వర్ణించుట యిందు సంభవించినది. ఇట శంకర భగవత్పాదులచేఁ బ్రతిపాదింపఁబడిన 'అధ్యాస' వివరింపఁబడినది. 'అధ్యాసో హి

నామ అతస్మిన్ తద్బుద్ధిః ఇత్యవోచామ' [1] అనునది తల్లక్షణము. కానిది యగు నట్లుగాఁ దోఁచుట యని భావము. ఇట్టి గంభీరమగు వేదాంతార్థము సుగమ మగురీతి నిట్లు వర్ణింపఁబడినది.

కార్తవీర్యార్జుననిచే నిర్జితుఁడై బంధితుఁడైన రావణుని గూర్చి చెప్పుచు 'నక్కటా కొండలనె బంతులాడునంతటివాని కీకట్లు త్రెంపరాని వగుట చిత్రము' 'కార్తవీర్యుఁడు దత్తగురుఁడు సేర్చిన మనువుల మంత్రించి కట్టెనేమొ' యని భావించి యంతలో -

> కాదు కాదు మున్న కట్టుఁగర్మమ్మెల్ల
> వారి నొరులు గట్టువారు లేరు
> తన్నిమిత్త భూతతయుఁ దత్కృతంబను
> వేదవాది మతము విజ్ఞనుతము
>
> — ఉ. కాం. - పూ. భా., 7 ఆ., 184 ప.

అని సంభావించుటయు, నితఁడు వాలిచే బంధింపఁబడిన సందర్భమున 'ఎవ్వ డొనర్చిన కర్మంబు నెవఁడు గుడుచు' [2] అనుటయు నమూలక తత్త్వోద్ఘాటనము. జీవిత మందలి కష్ట సుఖము లెవ్వరికైనను జన్మాంతరీయ కర్మము వలననే సిద్ధించు ననుట వైదికమతాశయము. ఆ యాశయమునే 'పంచాగ్నివిద్య' వివరించుచున్నది. [3] మఱియు 'తదంతర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యాం' [4] అను బ్రహ్మ సూత్రమీ విషయము స్పష్టమొనరించుచున్నది. వ్యాసభగవానుఁడీ విషయమును భారతమున నిట్లుపదేశించి యున్నాఁడు -

> యేన యేన యథాయత్తత్ పురాకర్మ సమీహితం
> తత్తదేకతరో భుంక్తే నిత్యం విహిత మాత్మనా
>
> — శాం. ప. - 181 ఆ., 10 శ్లో.

---

1. బ్రహ్మసూత్ర భాష్యము, 1-1-1-1 సూ.
2. 7 ఆ., 248 ప.
3. ఛాందోగ్యము - 5-10 ఖండ :
4. 3-1-1

'నాభుక్తం క్షీయతే కర్మ,' 'అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్' ఇత్యాది సూక్తుల సార మిద్దియే యని సంభావింపఁదగియున్నది.

రావణుఁడు కపిలదేవునిఁ గాంచి తద్రూపము హృదయమున హత్తుకొని బహిరంతరముల బ్రహ్మమును గాంచు రాజయోగి వలె నద్వైతసిద్ధి నందినాఁడని వర్ణింపఁబడినది.

బయలగాంచిన వాని లోపల తలంచు
లోఁదలంచిన ఘను బయలునఁగనుఁగొను
రాజయోగికిఁబోలె నా రావణునకు
భాగ్యవశమున నయ్యె నద్వైతసిద్ధి
— ఉ. కాం. - పూ. భా., 5 అ., 59 ప.

జీవేశ్వరుల కైక్యము సిద్ధించుట యద్వైతము. అట్టి యోగి బ్రహ్మమును, బ్రహ్మమయ మగు జగమును నొకటిగా దర్శించుచున్నాఁడు. 'దర్శనోపనిషత్' ఈ విషయము నిట్లు ప్రవచించుచున్నది.

యదా సర్వాణిభూతాని స్వాత్మన్యేవ హి పశ్యతి
సర్వభూతేషు చాత్మానం బ్రహ్మ సంపద్యతే తదా
— దశమః ఖండః

ఇయ్యుపనిషదర్థము నియ్యెడఁ జక్కఁగా సంపదించునట్లు వర్ణించుట తత్త్వవేత్తయగు కవి ప్రతిభకు, పాండిత్య విశేషమునకు నిదర్శనము. నర్మదానదీతీరమున శివపూజ సలిపి రాముఁడు శివాత్మభావన నున్నాఁడనుటయు నాతని రాజయోగిత్వమును నిరూపించుచున్నది. ఇయ్యది సర్వోపనిషత్సార మగుట సంభావింపఁదగియున్నది. "నా రుద్రో రుద్ర మర్చయేత్" ఇత్యాది శ్రుతివాక్య తాత్పర్య మిందులకుఁ బ్రమాణము.

ప్రత్యగాత్మా శివోఽహ మన్పలుకు పలికి
యతఁడు హంసశ్శివస్సోఽహ మనుచు నుండె
లోన బయలున శివుఁడైన తానె కాని
కానిదొక్కటియును లేని ధ్యానమొప్ప
— ఉ. కాం. - పూ. భా., 7 అ., 72 ష.

బాలకాండమున వసంతఋతు వర్ణన సందర్భమున 'సూర్యుఁడు మంచుఁ దొలగించి దివసముఖములకు స్వచ్ఛతఁ గల్పింప జగము ప్రకాశించిన' దని ప్రకృతి యిట్లు వర్ణింపఁబడినది -

లోకబంధుఁ డివము లూనం బొనర్చి య
హర్ముఖముల కాచ్ఛ్య మందఁజేయు
నపుడె మెఱసె జగము హంస ప్రకాశంబు
వడయు నంత జడత వాయుటెంత

— బా. కాం. - 2ఆ., 43 ప.

ఇట హంస శబ్దము ద్వంద్వార్థకము - 1. హంసః - సూర్యుడు. 'హగ్ం సహ శుచిష ద్వసు రంతరిక్ష సత్' ఇత్యాది శ్రుతి సూర్యుని హంసగాఁ జెప్పుచున్నది. కాణ్వ సంహిత యందు హంస విధానమని సూర్యమంత్రోపాసనముఁ గూర్చిచెప్పఁ బడినది. కావున హంస యనఁగా సూర్యుఁడని తెలియుచున్నది. ఆ పక్షమున సూర్యుఁ డుదయింప జడత నశించి చైతన్యము వెల్లివిరియు చున్నది. 2. హంస యనఁగా యోగమని రెండవ యర్థము. యోగశిఖోపనిషత్తునందీ విషయ మిట్లు వివరింపఁబడినది -

హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్పునః
హంస హంసేతి మన్త్రోఽయం సర్వజీవైశ్చ జప్యతే
గురువాక్యాత్సుషుమ్నాయాం విపరీతో భవేజ్జపః
సోఽహం సోఽహమితి ప్రోక్తో మన్త్రయోగ ఉదాహృతః — 1 అ.

మఱియు నదటనే యోగము జాడ్యమును నశింపఁజేయునని యిట్లు చెప్పఁ బడినది-

హకారేణ తు సూర్యస్స్యాత్సకారేణేన్దురుచ్యతే
సూర్యాచంద్రమసోరైక్యం హఠ ఇత్యభిధీయతే
హఠేన గ్రస్యతే జాడ్యం సర్వదోష సముద్భవమ్ 1 అ.

దీనినే కవి 'హంస ప్రకాశంబు వడయునంత జడత వాయుటెంత' అని చెప్పినాఁడు. ఈవిధమున నవశ్యాచరణ మగు యోగము, తత్ప్రయోజనము వివరింపఁ

బడి 'విశ్వశ్రేయః కావ్యమ్' [1] అనుట యిందు నిరూపింపఁ బడినది. ఆధునిక వైద్య విజ్ఞాన మీవిషయమునే సమర్థించుచున్నది.

**వ్యాకరణశాస్త్ర సంప్రదాయపాలనము :** పితృ సత్య వాక్య పరిపాలనమునకై రాముఁ డడవి కేగుచుండఁ దాను వత్తునని సీత రామునితో నిట్లు పలికినది –

> నీకు గురులిడ్డ యానతి నేర్మినరయ
> నన్వయింపదు నాకెట్లు లర్థమూర్తి
> కిలసహాప్తి నివృత్తుల వెలయుచుండు
> సన్నియోగవిశిష్టులౌ జనుల కనఁగ
>
> – అయో. కాం.– 3 ఆ., 428 ప.

భార్య పురుషునం దర్ధమగుట వారు సన్నియోగ విశిష్ట లగుదురు. కావున గురులిడ్డ యానతి రామునకు సీతకును నన్వయించును. అందువలననే సీత రామునితోఁ బయనమైనది. ఇందు వ్యాకరణశాస్త్రము నందలి 'ఏకయోగ నిర్దిష్టానాం సహ వా ప్రవృత్తిః సహ వా నివృత్తిః [2] అను పరిభాష ననుసరించి చెప్పఁబడిన 'సన్నియోగ విశిష్టానాం సహవా ప్రవృత్తిః సహవా నివృత్తిః' అను న్యాయము వివరింపఁబడినది. భారతీయ సంస్కృతి భార్యను భర్తయం దర్ధమూర్తిగా సంభావించినతీరు స్త్రీకొసంగిన విశిష్టస్థానమును దెలియ జేయుచున్నది. ఆదిదంపతుల యర్ధనారీశ్వర తత్త్వ మిందుల కాదర్శము.

బాల్యమున వరబలసహితుఁడగు హనుమంతుని యల్లరి భరింపఁజాలక మునులు లోకమునకు మేలు గూర్చు పనులేర్పడునెడ నితరులు నీకీర్తిఁబొగడు నంతకు బలవిస్మృతిఁ బొందుమని శపించిరి. అట్టి శాపము సావకాశ మగు నజు వరములకు నపవాదశాస్త్రమై బరగినది.

---

1. ఆంధ్రశబ్ద చింతామణి 1 శ్లో.
2. పరిభాషేందు శేఖరమ్, పరిభాష 17

... ఆ బ్రహ్మ దండంబు
సావకాశములగు నజు వరముల
నతిశయించి చెల్లె నపవాదశాస్త్రమై
బాధకంబు గామి బహువిధిజ్ఞ!

- ఉ. కాం.- పూ. భా., 8 ఆ., 14 ప.

మూలాధికముగా నిందు 'నిరవకాశా హి విధయః సావకాశాన్ విధీన్ బాధన్తే' అను న్యాయముతోఁ బాటు ఉత్సర్గ-అపవాద శాస్త్రములు ప్రస్తావింపఁబడినవి. ఉత్సర్గ యనఁగా సామాన్యశాస్త్రము. అపవాద శాస్త్రము దానికి విశేషము గూర్చుచున్నది. "ప్రకల్ప్యవా అపవాద విషయం తత ఉత్సర్గోఽభినివిశతే' [1] అనునది పరిభాష. 'యేన నాప్రాప్తే యో విధి రారభ్యతే స తస్యాఽపవాదః' [2] అనునది యపవాద లక్షణము. ఇందు బ్రహ్మ వరముల కంటె మునుల శాపమునకే ప్రాబల్యమున్నదని యెఱుంగఁదగియున్నది. జగద్ధితమగు సందర్భ మేర్పడినప్పుడు వరములు ఫలించి యమేయబలుఁడగు హనుమంతునకు విజయము సిద్ధించునని యాశయము. ఇట్టి వ్యాకరణశాస్త్ర సంప్రదాయ మిందుఁ బ్రతిపాదింపఁబడినది.

రామాజ్ఞ ననుసరించి సీత నడవి దించి వచ్చుటకు వెడలు లక్ష్మణుని దుఃఖమును గాంచి యామె యది రామవియోగమున గల్గిన సంతాపముగా భావించి యాతని నోదార్చుచు -

నీయన్నకు నీకునుఁ గల
దే యెడబాటెన్నఁడేని నేఁ గనఁబో నా
తోయము నడవడి నేఁ
డీ యోగ-భాగమునకె యేడువనేలా!

- ఉ. కాం.- ఉ. భా., 2 ఆ., 151 ప.

---

1. పరిభాషేందుశేఖరమ్, 63 పరిభాష
2. బాలమనోరమావ్యాఖ్య, 35 పు.

అని పలికినట్లు వర్ణింపఁబడినది. వ్యాకరణమున నిష్టసిద్ధికై యోగవిభాగమును పాటించుట సంప్రదాయము. 'యోగవిభాగాదిష్టసిద్ధిః'[1] అనునదా నియమము. ఒకే సూత్రమును రూపాంతరసిద్ధికై పదవిభాగము చేయుట శాస్త్రమునఁగలదు. 'సుపిస్థః'[2] అను పాణిని సూత్రమును సుపి, స్థః అను విధమున యోగవిభాగము సేయుట జరిగినది. ఇందువలన సమస్థః, విషమస్థః అను రూపములతోఁబాటు 'ద్విపః' అనియు సిద్ధించుట ప్రయోజనము. అట్లే లక్ష్మణుఁడు రామునకు బహిఃప్రాణము. ఇరువురు నేకాంశము లగుట విదితము. కార్యార్థమై లక్ష్మణుఁ డిట్లు వచ్చినను నాతఁడు తద్భిన్నుఁడుకాఁడనుట ప్రతిపాద్యము. వేదాంతదృష్టి నాతఁడు బ్రహ్మాభిన్నుఁడగుట సత్యము.

రాముఁడు లక్ష్మణునకు శ్రుత్యుపపాదిత మగు జ్ఞానమునుపదేశించు సందర్భమ్మున కర్మ, కర్మ సన్న్యాసయోగముల విశిష్టత నుగ్గడించుచు కర్మసన్న్యాస యోగము, కర్మయోగమున నంతర్భవించునని చెప్పినాఁడు.

ఫలపార్థక్య గృహీతకారక బహుత్వవ్యాపృతిప్రాయ సం
కలనంబౌ క్రతు తంత్రమైంద్రియకమైకాత్మ్యానుసంధాన వి
శ్చలసంవిత్సమవేతధీనిలయ నాశ్చర్యప్రమోదావహో
జ్జ్వలమౌ జ్ఞానమతీంద్రియంబగునెః ద్వంద్వంబేకశేషంబిటన్

- ఉ. కాం.- ఉ. భా., 3 ఆ. 370 ప.

ఇందు ద్వంద్వసమాస మేకశేషగా నగు వ్యాకరణ సంప్రదాయము విశదింపఁ బడినది. సమానరూపములైన పదములకు 'ఏకశేష' సిద్ధించునని పాణినియు, పదములు సమర్థములగునప్పుడు విరూపములైనను 'ఏకశేష' సిద్ధించునని వార్తికకారుఁడును ఇట్లు చెప్పియున్నారు. 'సరూపాణాం ఏకశేష ఏకవిభక్తిః[3] 'విరూపాణామపి సమర్థానామ్'[4] ఇట విరూపములగు కర్మయోగ సన్న్యాసయోగములకు

---

1. పరిభాషేందు శేఖరమ్, 1?2 పరిభాష
2. అష్టాధ్యాయి, 3-2-4 సూ.
3. అష్టాధ్యాయి, 1-2-64 సూ.
4. పరిభాషేందుశేఖరమ్, 747

ఏకశేష సిద్ధించి కర్మయోగముగా రూపొందినదని చెప్పఁ దగియున్నది. లోకమున మాతాచ పితాచ పితరౌ ఇత్యాదులు తదుదాహరణములు.

**న్యాయశాస్త్ర సంప్రదాయ పాలనము :** సీత విరహమున నిట్లు మలయానిలోపాలంభము గావించినది.

> విషము బీల్తు వగ్గివెలుఁగుఁ దోకొందువు
> నిన్ను మ్రింగి పాము లెన్నరాని
> యురు విషానలార్చు లుమియుఁ గారణ గుణ
> మెక్కుఁ గార్యకోటి కెపుడు శ్వసన ;
>
> — బా. కాం. - 8 ఆ., 102 ప.

'ఓ శ్వసన ! నీవు విషము బీల్తువు. అనఁగా జలము బీల్తువు. వెలుఁగు దోకొందువు. అనఁగా నగ్నికి సాయపడుదువు'. సర్పములు వాయువుఁ దిని జీవించు చున్నవి. ఈ వాయువు విషముఁబీల్చి యగ్గి వెలుఁగు దోకొనుట దగుట వాయుభక్షణఁ జేసిన పాములు విషానలార్చు లుమియుచున్నవి. ఇందు 'కారణగుణాః కార్యే సంక్రామన్తి' అను న్యాయము 'కారణగుణ మెక్కుఁ గార్యకోటికెపుడు' అని వివరింపఁ బడినది. ఈ విషయమే శ్రీహర్షుఁడు హంస వాక్యములలో 'కార్యం నిదానాద్ధి గుణానధీతే' [1] అని తన నైషధమునఁ బ్రతిపాదించియున్నాఁడు.

రామాదు లరణ్యవాసమునకుఁ బోవుచు బ్రయాగఁజేర నరిగిరి. అందు భరద్వాజాశ్రమమును వెదకుచు ముందర గాననగు ధూమమునుఁ జూచి యగ్నిని యనుమాన ప్రమాణమున నిర్ధారించి యది మహర్షి యాశ్రమమని తలంచినట్లు వర్ణింపఁబడినది.

> మునిమండల మండను పద
> మున మొనసి దారి దారి మొనకొనె నదిగో
> యనలుని భగవంతునిఁ గా
> నను మితికిం గూర్చు ధూమమగుపడెడు బలే
>
> — అయో. కాం. - 5 ఆ., 242 ప.

---

1. నైషధము, 3 స., 17 శ్లో.

ప్రత్యక్షానుమానోపమాన శబ్దప్రమాణములలో ననుమాన ప్రమాణమొకటి 'అనుమితికరణ మనుమానమ్'[1] అనునది తల్లక్షణము. 'యత్ర యత్ర ధూమః తత్ర తత్రాగ్నిః, యన్నైవం తన్నైవం' అను నన్వయ వ్యతిరేకముల ననుసరించి ధూమ మగుపడుటనుబట్టి యగ్నిభగవానుని యనుమానించి భరద్వాజాశ్రమముగా నెఱింగిరవి చెప్పుట తర్కసహమై శాస్త్రప్రమాణమును సంతరించుకొనినది.

శాంబరీవిద్యావిశారదుఁ డగు మేఘనాధుఁడు బాణప్రయోగమున మాయా తమము నావిర్భవింపఁజేసిన సందర్భమున -

తమ మన్న నొక పదార్థమ్ము కాదది తేజు
లేకపోవుటె యని రేకకు లిట
నాయుధజ్వాలలు నాదిత్యముఖ్యలు
భూషణమణిరుచు ల్వోలయుచుండ
నా యుక్తికుదర దియ్యదియుక్తమే
ప్రతిబంధమునం దేజఖాతమనిన
నదియేని గన్పట్టదైశ్వర్య వరమున
నది దోఁచె ననుమాట ననుసరించి

భవుని వరమె తేజః ప్రతిబంధకమనఁ
దర్కమున కంత మేది ? వేదాంతి మతమె
సమ్మతము సాన్వయమ్మాట సకలముండు
నున్నదనునాఁడు లేదు లేదన్ననాఁడు

— ఉ. కాం. - పూ. భా., 6 ఆ., 176 ప.

అని తద్విశేషము వర్ణింపఁబడినది. 'పృథివ్యాపస్తేజోవాయురాకాశం కాలోదిగాత్మామనః ఇతి ద్రవ్యాణి'[2] అని ద్రవ్యములు తొమ్మిదిగా శాస్త్ర మంగీకరించు

---

1. వేదాంత పరిభాష, 52 పు., 1 పంక్తి
2. వైశేషిక దర్శనము. 1-1-5 సూ.

చున్నది. ఇందు తమస్సులేదు. తేజో భావమే తమ మని తెలియఁదగియున్నది. తర్కసంగ్రహదీపికా వ్యాఖ్యానమున శంకరమిశ్రులీ విషయమునే 'అంధకార స్యాధికత్వేనాశంక్యమానస్య అభావస్యోత్పాదనాత్' అని వివరించుచు సూత్రము నందలి 'ఇతి' శబ్ద స్వారస్యముచేఁ దమస్సు తేజోభావముగా నిరాకృతమని చెప్పినారు. అట్లయిన యుద్ధరంగమున భూషణకాంతులు, ఆయుధజ్వాలలు, ఆదిత్యరశ్మలు వేలయుటెట్లు సంభవించినది ? అని ప్రశ్న. అనఁగా తమస్సునకు ద్రవ్యత్వమే లేనిచో నస్తిత్వమే యుండదు గదా ! అట్టియెడ 'తమోభావమే తేజస్సు' ఏల కాఁగూడదు ? అనునది ప్రతిబంది. శాస్త్రిగారీ ప్రతిబందీ పరిష్కారము నిట్లు చేసిరి - ఇందలి తమశ్శబ్దము ద్వంద్వార్థకము. ఒకటి తేజోఽభావము. దీనికి తర్కమున ఆనంత్య మేర్పడుచున్నది. రెండవది మిథ్య. ఇయ్యది యవిద్యా శబ్దప్రతిపాద్యమై 'మమ మాయా దురత్యయా' [1] యనెడి గీతాసూక్తి ప్రతిపాద్య మగు నీశ్వరమాయ. ఇది వ్యావహారికదశ యందు మాత్రమే యుండును. పారమార్థిక దశ య దుండదు. ఈ యంశము 'నతత్రరథాః న రథయోగా నపన్థానోభవంతి' [2] ఇత్యాదిగాఁగల వేదాంత వాక్యములు నిరూపించుచున్నవి. సుషుప్తియందీ వ్యావహారిక ప్రపంచ మంతరించి పారమార్థికస్థితి కలుగును. అట్లే యీ పద్యమందలి తమస్సుఁ గూడ ఈశ్వరసంకల్ప జాత మగుటచే వ్యావహారికదశ యందది యున్నదనియు, తాత్త్వికదశ యందు వివర్తించుననియు సాన్వయమ్ముగా వేదాంతి మతమునఁ దెలియఁదగి యున్నది. ఈ దృష్టితో తమస్సు కలదు. ఈ యంశమునే కవి యీ శబ్దమున గుంభించినాఁడు ఇట్లు న్యాయశాస్త్ర విషయము లిందు ప్రస్తావింపఁబడినవి.

విశ్రవో బ్రహ్మనుగూర్చి చెప్పుచు నాతఁడన్ని విధముల తండ్రికిఁ దగిన తనయు డగుట మునిజనులు సంస్తుతించిరని వర్ణించు సందర్భమున జన్యజనకభావ ముభయులయందు సార్థకమైనదని వివరించుట సమయోచితమగుచు, న్యాయశాస్త్ర సంప్రదాయమై పొసఁగుచున్నది. "ధర్మనిరతులు జగదేక పూజ్యులగుట" సత్యముగదా. ఇట్టి సంభావన మాతవి పాత్ర చిత్రణమున విశిష్టత సంపాదింపఁ జేయుచున్నది.

---

1. భగవద్గీత
2. బృహదారణ్యకోపనిషత్ - 6 అధ్యా., 3 బ్రాహ్మణం, 10 వా.

తగు పుత్త్రి(డిత(డు బ్రహ్మకు(
దగు సీతని కామహితు(డు దండ్రియగుటకుం
దగె జన్యజనక భావము
దగదొరుల కటంచు స్తోత్రతతులొప్పారెన్

- ఉ. కా. పూ. భా. 1 ఆ., 58 ప.

అట్లే శ్రీరాముని పట్టాభిషేక సందర్భమున సమస్త ప్రకృతియు( బులకించినదని చెప్పుచు "శబ్దగుణకమాకాశ" మను న్యాయశాస్త్ర విషయము బ్రస్తావించుట కవుల శాస్త్రపాండిత్యమునకు నిదర్శనము.

ఎందునేని శ్రుతులకింపగు సుస్వరస్వరములొప్ప ద్వివిధ శబ్దసమితి
పరగ నాకసంబుపరిఢవిల్లెను శబ్దగుణక మనెడు న్యాయగణనదనర

యు. కా. ఉ. భా. 2 ఆ. 508 ప.

## జ్యోతిశ్శాస్త్రి సంప్రదాయ పాలనము:

రావణు(డు శూర్పణఖ రాముని పరాక్రమం బెఱింగించు సందర్భమున మూలాధికముగా 'చాలదింక శని నిశాచరులకు'[1] అని చెప్పినట్లు వర్ణించుట గ్రహగతిఫలవిశేషమును బ్రకటించు జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయము. లోకమున వానికి శని చాలలేదు అన(గా వా(డు కష్టదశ యందున్నా(డు అనుట వ్యవహారమున( గలదు. కావున 'చాలదింక శని నిశాచరులకు' అనుటలో రక్కసులకు విపత్కరపరిస్థితి యేర్పడిన దను భావము దో(చుచున్నది. ఇందు శాస్త్రవిషయము నలవోకగా( బ్రస్తావించి రాక్షస వినాశనము తప్పదని సూచించుట(జరిగినది. శని లగ్నమునకు 4-8-12 స్థానములలో నున్న( బ్రతికూల ఫలము నిచ్చునని శాస్త్రము.

దేవాసుర సంగ్రామము నందు రావణుని వారించు యత్నమున నింద్రునితో( గూడి దేవత లెల్లరు( గదనరంగమునకు( గదలినట్లు వర్ణించుచు నందు శనైశ్చరుని గూర్చి యిట్లు చెప్ప(బడినది,

---

1. అర. కాం. - 2 ఆ., 339 ప.

సజయులగువారి కేకాదశంబు నోడు
వారలకు ద్వాదశంబైన వలనునకయి
మాలకాకి జండాగల మావునెక్కి
నడచె నెడ గలుగంగ శనైశ్చరుండు

— ఉ, కాం. - పూ. భా., 6 ఆ., 122 ప.

శని లగ్నమున కేకాదశంబున నున్న జయమనియు, ద్వాదశ స్థానంబున నున్న నపజయ మనియుఁ జెప్పు జ్యోతిశ్శాస్త్ర విషయ మిటఁ బ్రస్తావింపఁ బడినది, శని ఏకాదశంబునందున్న లాభము. ద్వాదశమునందున్న సర్వసౌఖ్యములు లోపించునని జాతకాభరణమున నుగ్గడింపఁబడినది. [1]

రాముఁడు లక్ష్మణునకు నిమివశిష్ఠుల చరిత్రముఁ జెప్పు సందర్భమున 'ఇక్ష్వాకువంశజుఁడగు నిమి ప్రభువు స్వర్గపురినిఁ దలపించు పట్టణము నిర్మించి తావందు సుఖముగాఁ బ్రజలఁ బాలించుచుండెనని వర్ణింపఁబడినది.

దానికి వైజయంతమని తానొక పేరిడి దానినుండి భూ
జాని నిమీశ్వరుం డటు ప్రజాపరిపాలన మాచరించె నెం
దేనిఁ గొఱంత లేదు విధుఁడే జలరాశికి వచ్చెనేనియున్
వానవొసంగ సస్యములు పండఁగ బండుగగా ధరిత్రికిన్

— ఉ. కాం.— ఉ. భా., 3 ఆ., 166 ప.

విధుఁ డనఁగా చంద్రుఁడు. చంద్రుఁడు జలరాశికిఁ జేరునంత వానలు కురిసి పంటలు పండునని శాస్త్రము. మూలమునలేని యీ జ్యోతిశ్శాస్త్ర విషయ మిటఁ బ్రస్తావింపఁబడినది. అందులకుఁ బ్రమాణముగ 'వనమాల' గ్రంథమున నిట్లు వివరింపఁబడినది.

జల చరర్క్షముపేత్య సమాగతో యదితనుం సుతనుః క్షణదాపతిః
భవతివా కంటకగోబలీ ప్రచుర మంబుచయం సృజతిక్షణాత్ ॥

— 1 అ., 8 శ్లో.

---

1. జాతకాభరణము - రవ్యాది గ్రహభావ ఫలాధ్యాయము, 11, 12 శ్లో॥లు, 112 పు.

**ఛందశ్శాస్త్ర సంప్రదాయపాలనము :** రంభను గాంచిన రావణుఁడు కవివరుఁడైనాఁడని సంభావించినతీరిట్లు వర్ణింపఁబడినది.

అంతం గాంతారత్నము
కాంతాత్వము రాక్షసప్రకాండుని దీవ్య
త్స్వాంతము దివిచికొను నయ
సాకంతముగా నాతఁడొక్క కవివరుఁడయ్యెన్

రతభజనసమయ గల సం
గత వృత్తావయవకలిత కమనీయకలా
కృతిఁగొని ఛందము నెఱిగవి
యతిఁగూర్చినవాని భాగ్యమన్యాదృశమే ?

- ఉ. కాం., పూ. భా., 6 ఆ., 9, 10 ప.

ఛందము = అభిప్రాయమము. ఇందు రతిపరమగు నర్థమేఁగాక ఛందశ్శాస్త్ర మిట్లు ప్రతిపాదింపఁబడినది. ర, త, భ, జ, న,స,మ,య, గల మొదలగు నవి గణములు. వానితోఁ గూడినవి వృత్తములు. ఇట్టివి ఛందః ప్రస్తారమునఁ బొడముచున్నవి. వీనికి యతి ముఖ్యలక్షణము. అర్ధాంతరమున ఛందము = వేదము. తదర్థమే కావ్యములందు ప్రతిపాదింపఁ బడి కాంతాసమ్మితమై యుపదేశవిషయమున సౌలభ్యము సంపాదింపఁబడు చున్నదనుట సాహిత్యవేత్త లంగీకరించిన సత్యము. మఱియు,

విద్యలలోపల నుత్తమ
విద్య కవిత్వంబు మఱి కవిత్వము ఛందో
వేద్యము .... .... [1]

అని ప్రశంసించిన యనంతుని భావ మిట నాదరింపఁబడినది. అట్లే ఉత్తర కాండమునఁ బులస్త్యోత్పత్తిని గూర్చి చెప్పుచుఁ బూర్వము 'కృత' మను యుగము ప్రవర్తిల్లినట్లు వాల్మీకమున "పురాకృతయుగో" ( 2 స. 4 శ్లో॥ ) అని సూచింపఁ

1. అనంతుని ఛందము, 1 ఆ., 3 ప.

బడినది. శ్రీరామకథాऽమృతమున నాయుగవైశిష్ట్యము నెన్నుచు నందు ధర్మము నాలుగు పాదములతో నొప్పుచు దోషరహితమై సత్కవి కృతంబగు పద్యమువలె గరిమమున నలరుచున్నదని వర్ణించుటలోఁ బద్య విద్య ప్రస్తావింపఁబడినది. ధర్మముతోఁ బోల్చుటచే దాని శాశ్వతత్వము నిరూపింపఁబడినది.

ధర్మువు నాల్గుపాదములఁదద్దయు నొప్పెసలారనిల్వ స
త్కర్మము మేల్తపంబుసిరి దార్కొని తేర్కొని విస్తరిల్లఁద
ద్ధర్మ విదుల్లస త్సుకవి కృతంబగు పద్యమురీతి దుష్టమౌ
మర్మము వంకఁబోని గరిమం గృతమన్న యుగంబెసంగఁగన్

ఉ. కా., పూ. భా. 1 ఆ. 55 ప

**అలంకారశాస్త్ర సంప్రదాయ పాలనము :** భరద్వాజుని విందు సందర్భము నందలి విశేషములఁ బ్రశంసించుచు భరతుఁడు -

అరిది యాసమేర కబ్బుటే యిది యను
ప్రాసమయ్యె .... ....

- అయో. కాం.- 7 ఆ., 335 ప.

అనినట్లు వర్ణింపఁబడినది. లోకమున నాశమేరకు లభించుటే యరిది. అయ్యెడ ముని గావించిన విందు రాచవారికి ననుప్రాసమై యెసగినది. అనఁగా లభించిన వస్తువే తృప్తిగా మఱల లభించినది. అట్టి విందు నభూతో నభవిష్యతి. 'అనుప్రాస' యనునది శబ్దాలంకారములలో నొకటి. తల్లక్షణ మిట్లు చెప్పబఁడినది.

శ్లోకస్యార్థే తదర్థేవా వర్ణావృత్తిర్యది ధృవా
తదామతా మతిమతాం స్ఫుటానుప్రాసతా సతాం

- చంద్రాలోకము, 5 ఆననము, 5 శ్లో.

ఇట్లిట నలంకారశాస్త్ర విషయము మనోజ్ఞముగాఁ బ్రస్తావింపఁబడినది. శ్రీరామకథాऽమృత కావ్యమునం దెల్లయెడల నట్టియాలంకారిక శోభ వెల్లి విరియుట ముదావహము.

**ఆగమశాస్త్ర సంప్రదాయ పాలనము :** ఆగమ మనఁగా దేవపూజా సంబంధమగు విధివిధానమును వివరించు విద్యావిశేషము. శ్రీరామకథాऽమృతమున నా సంప్రదాయ మెట్లు పాలింపఁబడినదో యీ ప్రకరణమునఁ బరిశీలింపఁబడుచున్నది.

రాముఁడు శివధనుర్భంగ మొనరించినప్పుడు పెద్ద ధ్వని పుట్టినది. ఆ ధ్వనికి దిక్కులు పిక్కటిల్లినవి. గిరికందరములు మాఱుమోగినవి. పిడుగులు పడినట్లును, పర్వతములు బ్రద్దలైనట్లును, భూకంపమొదవినట్లును కాఁగా భూప్రజలెల్లరు విస్మయ భయచకితులైరి. అట్టి ధ్వనినిగూర్చి మరియు నిట్లు వర్ణింపఁబడినది-

అదియ సురకబంద కాగమార్థంబయ్యె
నపగమార్థమయ్యె నసురతతికిఁ
గాన విధివిశేషకలిత ఘంటానాద
మనఁగనొప్పె వికసితాబ్జవదన!

— బా. కాం. - 9 ఆ., 136 ప.

అమరాభ్యుదయము. నసుర నిష్కాసనము రామావతార ప్రయోజనములు ఆట్టి ప్రయోజనము సూచించుచు విధిగావించిన ఘంటానాదమా శివధనుర్భంగ జనితమగు ధ్వని యని సంభావించుట హృద్యము. ఇందు దేవతార్చన సమయములందు పఠించు -

ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం
కురు ఘంటారవం తత్రదేవతాహ్వాన లాంఛనమ్‌

అను ప్రసిద్ధ శ్లోకార్థముఁ బ్రతిపాదింపఁబడినది.

అయోధ్యాపుర వర్ణన సందర్భమున నందలియుద్యానవనశోభ వెలయించుచు

అకలంకస్థితిఁ దత్పురోపవనసీమాంచ న్మహానారికే
ల కుటస్తోమము విష్ణుపాదగతిఁ గ్రాలం జిత్రమే తత్ఫల
ప్రకరం బొక్కట దివ్యసంయమి శివార్చాపూర్తిఁగావించి తర్యిం
బక సారూప్యముఁ జేకొనెన్ భువన గర్భత్వంబు వాటిల్ల గాన్

— బా. కాం. - 1 ఆ.,

అని వర్ణింపబడినది. విష్ణుపాదమనఁగా నాకాశమని యర్థాంతరము. ఆ యుద్యానవనమునఁ గల నారికేల వృక్షము లత్యున్నతములై యాకాశము నంటుచున్న వను నర్థముతోఁబాటుగా నచటి ప్రకృతి యంతయు విష్ణుచరణ శరణాగతి ప్రవణమై తనరుచున్నదను విషయము వెల్లడి యగుచున్నది. శరణాగతి విధానము భక్తి పద్ధతులలో

నుత్తమము. శ్రీ మద్రామాయణము శరణాగతిశాస్త్రమని సంప్రదాయజ్ఞుల యభిప్రాయము. విభీషణుని పాత్ర యందులకుఁ బ్రబలోదాహరణము. ఇంకఁ దత్పలి ప్రకరము దివ్యసంయమియగు శివునర్చించి శివసారూప్యము నందినది. మూడుకన్నులు గలిగి భువన గర్భత్వము సిద్ధించుట యందులకు నిదర్శనము. 'యాందేవతాముపాస్తే సతద్రూపోభవతి,' అను నాగమశాస్త్ర ప్రసిద్ధమగు సంప్రదాయము నిందుఁ జక్కగాఁ బ్రతిపాదింపఁబడినది. ఇట్టి ప్రకృతి వర్ణన సర్వోత్తమమై సహృదయులచే సంభావింపఁదగియున్నది.

అగస్త్యుఁడు రామునితో 'వర్ణనాతీతంబగు నిక్కపిసారు సారబుద్ధి వైభవంబు సంగ్రహించి, వర్ణించెద వినుమని 'హనుమని మాహాత్మ్యము' దండకముతోఁగూడ నభివర్ణించి, [1] 'అని యాగమోక్త విధానంబు ననుసరించి వినుతించువారికి నియ్యంజనా తనూజుఁడు కల్పపాదపంబ జుమీ' అని చెప్పుటలో నాగమమంత్రరహస్య వివరణము గావింపఁబడినది. మూలమునలేని యీ దండకము సర్వమంత్రార్థ సారముగా నెన్నఁదగియున్నది. నిత్యపారాయణార్హమగుట సంభావ్యము.

రాముని చరితమునఁ గల బహు రహస్యముల నగస్త్యుని ముఖమునఁ జెప్పించుచు 'రాముఁడు సీతను మాతృభావముతోఁ గొల్చినాఁడనియుఁ గాకున్న రూక్షమగు తన్నిరీక్షణముననే దహింపఁబడెడివాఁడనియు, లేనిచో నాతఁడు మోక్షము నందుటగాని 'యాగమశాస్త్రమునఁ దానొక వేల్పుగా నగుట గాని సంభవించెడిదికాదనియుఁ జేర్కొనినట్లు వర్ణింపఁబడినది.

అమ్మకువాఁడు భక్తుఁడు రహస్యము సుమ్మిది కాకయున్న రూ
క్షమ్మగు తన్నిరీక్షణమె కాల్పదొ? నీ కరలాఘవమ్ముతో
నిమ్మగు మోక్షమార్గమున నేగతి నేగఁగలాఁడొ? యాగమాం
గమ్మగు వేల్పు దానగు రకమ్మొనఁగూడునొ? యట్టిపాపికిన్

- ఉ. కాం. - పూ. భా., 9 ఆ., 83 ప.

---

1. ఉ. కాం. - పూ. భా., 8 ఆ., 178-82 ప॥లు

**మంత్రశాస్త్ర సంప్రదాయపాలనము :** సీత విద్యాభ్యాస సందర్భమున 'గురులోం నమశ్శివాయ' యని తొలుతఁ గఱపివర్ణ మాతృకల నామెకుఁ దేటతెల్లమగునట్టు లుపదేశించిరని వర్ణింపఁబడినది. [1] అక్షర స్వీకార సందర్భమునఁ 'ఓం నమశ్శివాయ' యని తొలుత వ్రాయించుట దేశీయ సంప్రదాయము. ఇయ్యెడ పంచాక్షరీమంత్రము 'ఓం' బీజముతోఁ గూడి 'శివషడక్షరి' గాఁ జెప్పఁబడుచున్నది. మఱియు నిట వర్ణమాతృకోపాసన గూర్చి చెప్పఁబడినది. వర్ణము లన్నింటికి నధిదేవతలు కలరు. అకారాది వర్ణముల మృతాదిశక్తు లు కాఁగా వాని కరుణాది దేవతలు నిర్దేశింపఁబడియున్నారు. ఈ వర్ణము లన్నియు శరీరమున యోగమార్గమునఁ గల షట్చక్రముల యందు సూచింప బడినవి. వాని గుఱ్ఱెఱింగి విధిపూర్వకముగా నర్చించు వారు వశ్యవాక్కు గలవారగుదురు. అట్టివారు తిట్టినను దీవించినను జరుగుట తథ్యము, ననుభవసిద్ధము నగుచున్నది. చక్రములు, వాని వివరణమునిట్లు గావింపఁ బడినది. [2]

| | |
|---|---|
| 1. మూలాధారము - వ, శ, ష, స | 4 |
| 2. స్వాధిష్ఠానము - బ, భ, మ, య, ర, ల | 6 |
| 3. మణిపూరకము - డ ఢ ణ త థ ద ధ న ప ఫ | 10 |
| 4. అనాహతము - క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ | 12 |
| 5. విశుద్ధము - అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అః | 16 |
| 6. ఆజ్ఞాచక్రము - హం, క్షం. | 2 |
| | 50 |

---

1. బా. కాం.- 4 ఆ., 167-68 పు॥లు.
2. సీతారామాంజనేయ సంవాదము, 1 ఆ., 181 గ.

సంస్కృతంబునకు వర్ణంబు లేబది - బా. వ్యా., సంజ్ఞా., 1 సూ

ప్రాణుల శరీరములు 1 వ్యావహారికము 2 పారమార్థికమునని రెండు విధములుగా పరిగణింపఁబడుచున్నవి. అందు వ్యావహారికశరీరము లోకానుభవములకుఁ దగియుండును. పరమార్థిక శరీరము యోగమున నతీంద్రియ సుఖానుభూతులకు అర్హమైయుండును. పైన చెప్పఁబడిన మూలాధారాది చక్రములు పారమార్థిక శరమున మాత్రమే గోచరమగుచుండును. వ్యవహారిక శరమునఁగానరావు. "శరీరే పారమార్థికే" అని ఆచార్యశంకరులు సూతసంహిత వ్యాఖ్యానములో నిరూపించినారు. వ్యాస భట్టారకుఁడును (పురాణములలో) నీచక్రములు పారమార్థిక శరీరముననే కలవని చెప్పినాఁడు. యోగమున వాయువు కుంభకదశలో సుషుమా నాడియందు ప్రవేశించి అగ్నిరూపమునఁ బ్రకాశించుచుఁ జక్రసంచారమున వేగముగా ముందునకు సాగును. విద్యారణ్యుల వారీక్రమమంతయుఁ జక్కగాఁ దమభాష్యమున వివరించిరి. శస్త్ర చికిత్సలోఁ గనుఁగొనరానిదీయోగ రహస్యమని తెలియఁదగియున్నది. వెన్నెముకలో సుషుమ్నా నాడియందు గోచరమగుట యోగిజనానుభవ గమ్యమగు సత్యము. శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు సీతారాముల యశోకవన విహారఘట్టమున నీ విషయమెల్ల లోకానుగ్రహ బుద్ధితో వివరించి తన్మార్గాను యాయులకెల్ల దర్శనా చార్యులై విబుధజన సంస్తుత్యత నెగడినారు. ( చూ. అమూలక తత్త్వోద్ఘాటనము )

ఇందు వర్ణమాతృకలు విప్రాదిభేదముల నాల్గువిధములుగా విభజించిరి. 1) అ-ణ వఱకు 2) త-మ, ర, వ 3) య, ల, శ, ష, స, హ 4) ఎ, ఒ, చా, జా అ, శ.. ఇట్లని అప్పకవితన గ్రంధమున నుదాహరించినాఁడు. క్రమముగా నవి శ్వేత, రక్త, పీత, నీల వర్ణముల సంభావింపఁబడుచున్నవి. శరన్నవ రాత్రుల యందు మూలానక్షత్రముతో నాహ్వానించి శ్రవణానక్షత్రము వఱకు సేయు సరస్వతీపూజల లో నిది భాగముగా నాచరింపఁబడుచున్నది. ఆ సంప్రదాయమిట వరించిరి.

దశరథుని జ్యేష్ఠపుత్రునకు వశిష్ఠుఁడు 'రామ' యని నామకరణము సేయు సందర్భమున శివుఁడు పార్వతితో రామనామ మహిమమును దెల్పుచు—

నాయనాయేతి శక్తిపాలౌనాదేని
యగ్ర్యవర్ణంబులేక యష్టాక్షరంబు
యత్పరాక్షర విరతిఁ బంచాక్షరంబు
నటులె నశివాయ యనఁగ నపార్థమిడునొ

ఆ మంత్రరాజమే యిది .... - బా. కాం.- 3 అ., 113, 114, ప. అవి వర్ణించినట్లు చెప్పఁబడినది. 'ఓం నమో నారాయణాయ' ఇది నారాయణాష్టాక్షరీ మంత్రము. 'నారాయణాయ' లో రెండవ యక్షరము 'రా' తీసివేసిన 'నాయనాయ' యని యగును. అయన మనఁగా మంగళ మని యర్థము గావున నది కానిది యను నపార్థము సిద్ధించుచున్నది. అట్లే 'నమశ్శివాయ' పంచాక్షరీ మంత్రము. ఇందులో విసర్గతో కూడిన రెండవ యక్షరము 'మ' తీసివేసిన నదియు 'నశివాయ' యని యపార్థము నిచ్చుచున్నది. ఆ రెండు వర్ణములు కలిపిన 'రామ' యని యగుచున్నది. ఇవ్విధముగా నీ మంత్ర ప్రాముఖ్య మిందుగ్గడింపఁబడినది. ఇందులకుఁ బ్రామాణ్యముగాఁ 'త్యాగరాజకృతి' నెన్నవచ్చును.

'శివమంత్రమునకు 'మా' బీజము
మాధవ మంత్రమునకు 'రా' బీజము
ఈ వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెద ...

జనకుఁడు దశరథునకు సీతారాముల వివాహరూపమగు శుభవర్తమానము, లగ్నపత్రికయుఁబంప నది విని దశరథుఁడు సంతసమున -

కందునో యేనాఁడు గనుల పండువుగ నా
కల్యాణమూర్తి సింగార మనుచు
విందునో యేనాఁడు వీనులు దనియ నా
విద్యావినోది వాగ్విభవ మనుచుఁ
గొందునో యేనాఁడు గోర్కులు దీర నా
చంద్రాస్యు స్మేరప్రసాద మనుచు
నందునో యేనాఁడు హాయలు నెక్కొనగ నా
కరుణాబ్ధి దృక్కలాకలన మనుచు
నరయ నది త్ర్యక్షరియొ షడక్షరియొ కాని
పాయకున్నది నామదిఁ బాదుకుదుర
నేఁటి కమ్మంత్రము ఫలించె నియతి నతనిఁ
గాంచి ముదమందుటే దీనఁగల ఫలంబు

— బా. కాం. - 10 అ., 42 ప.

అని సంభావించినాఁడని వర్ణింపఁబడినది. పద్యమున కందునో విందునో ఇత్యాదులు త్ర్యక్షరి గను, 'కందునో యేనాఁడు, విందునో యేనాఁడు' ఇత్యాదులు షడక్షరిగను, జెప్పఁదగియున్నవి. మంత్రశాస్త్రమున రామమంత్రము 'శ్రీరామ' త్ర్యక్షరిగను, 'రాం రామాయ నమః' షడక్షరిగను ప్రసిద్ధము. ఆ శాస్త్ర విషయ మిట హృద్యముగా సంతరింపఁబడినది.

అహల్య తనకు శాపాంతమును బ్రసాదించిన రాముని సంభావించుచు 'ఓపినంత లిడుదు 'నోం నమో నారాయణాయ' యనుచు నీకుఁ బ్రణతులు భక్తి[1] అని పలికినట్లు వర్ణించుట 'అష్టాక్షరీ' మంత్రమును బ్రతిపాదించు చున్నది.

దేవదానవుల యుద్ధసందర్భమున రుద్రుఁడు రక్కసులపై పాశుపతాస్త్రముఁబ్రయోగించి రని వర్ణింపఁబడినది.[2] అంతా యస్త్రమును గూర్చి 'ప్రణవ శిలీముఖ పశు హుంకృతులఁ గూర్చి యుచ్చాటన మొనర్ప నొనరునెద్ది' యని చెప్పఁబడినది. ఇందు ప్రణవము ఓంకారము, శిలీముఖ మనఁగా 'శ్లీం' ఆదిగా గలది. పశుహుంకృతులతోఁ గూడిన యుచ్చాటన మనఁగా 'పశుహుం ఫట్ స్వాహా' యని తెలియదగియున్నది. వెరసి 'ఓం శ్లీం పశుహుం ఫట్ స్వాహా' అని యైనది. ఇయ్యది పాశుపత మంత్రస్వరూపము. ఆ మంత్ర రహస్య మిట్లీవిధమున వివరింపఁబడినది —

కార్తవీర్యార్జునుని వర్ణించుచు —

అతఁడు మహాభుజపరిపా
లిత సప్త ద్వీపుఁడు విగలిత నిజమాయుం
డతులితుఁడు దత్తముని శి
ష్యతాసముపహిత విభవుఁడు వభిరామయశా!

— ఉ. కాం. – పూ. భా., 7 ఆ., 15 ప.

అని చెప్పఁబడినది. ఇందు 'ఓం నమో భగవతే కార్తవీర్యార్జునాయ మహాభుజ పరిపాలిత సప్తద్వీపాయ' ఇత్యాది మహామంత్రార్థము పొందుపఱుపఁబడినది.[3] అతఁడు

1. బా. కాం.– 7 ఆ., 128 ప.
2. ఉ. కాం.– పూ. భా., 4 ఆ., 677 ప.
3. మంత్రరత్న మంజూష (సంకలన గ్రంథము,) త్రివిక్రమభట్టు

రావణుని బంధించినాఁడని వర్ణించుచు 'అక్కటా కొండలనె బంతులాడునంత వానికి కట్లు తెగింపఁగారానివగుట, చిత్రమా దత్త గురుఁడు సేర్చిన మనువులఁ గార్త వీర్యుండు మంత్రించి కట్టెనేమొ' అని సంభావించుచుఁ గార్త వీర్యుని 'దత్తముని శిష్య తాపము సహిత విభవము' గీర్తించుట వలనఁ దత్సంప్రదాయము వివరింపఁబడినది.[1] కార్త వీర్యార్జున మంత్రమునకు 'దత్తాత్రేయ ఋషి, అనుష్టుప్ ఛందః' అని చెప్పఁబడినది.

రావణుఁడు నర్మదానదీతీరమున శివపూజ గావించు సందర్భమున మహాన్యాసములేనిదే లింగార్చనము సేయరాదను నియమము వివరింపఁబడినది.[2] 'మహాన్యాసాను సంధాన మానసమయం బందొనరించెఁ గానియెడఁ బూజల్సేయరా దీశ్వరున్'.[3] మఱియు నాతఁడు –

నానారత్న విభూషితుం బొనరిచెన్ నందిధ్వజున్ భక్తిమై
నానాసూనములన్ యజించె నొగిఁ దన్మంత్ర ప్రభేదమ్ములన్
నానారత్న పథానుసారముగ సంధానించె నోమంత మం
త్రానూన ప్రజప ప్రవాహమున విధ్యానించె విధ్యంచితా

ఉ. కాం.- పూ. భా -- 7 ఆ., 70 ప.

అని వర్ణింపఁబడినది. ఇందు ఆగమశాస్త్రపూజావిధానము సూచింపఁబడినది. ముఖ్యముగా బీజము మంత్రము నుచ్చరించి తుదిబీజము నుచ్చరింపవలయునను మంత్ర రహస్యముఁ జెప్పఁబడినది. 'బీజం మన్త్రం సముచ్చార్య మన్త్రాన్తే బీజముచ్చరేత్' అనునది బోధాయనుని వాక్యము.

ప్రత్యగాత్మా శివోఽహ మన్నలుకు వలికి
యతఁడు హంసశ్శివస్సోఽహ మనుచు నుండె

– 7 ఆ., 72 ప.

---

1. దత్తభాగవతము, 5, 6, 7 గుచ్ఛములు
2. బోధాయనోక్త మహాన్యాసఖణ్డః
3. ఉ. కాం.- పూ. భా., 7 ఆ., 63 ప.

ననుట 'నారుద్రో రుద్రమర్చయేత్' అను విధినిఁ దెల్పుచున్నది. అతఁడు 'ప్రాసాదాత్మకము మూలపంచాక్షరమున్' ఆసాస [1] నుచ్చరించినాఁడు. ఇట్టిది 'హ్సౌం నమశ్శివాయ' [2] అను ప్రాసాద పంచాక్షరీమంత్రమును సూచించుచున్నది. ఆ మంత్ర జపము వలన మనః ప్రసాదము లభించునని 'ప్రపంచ సారతన్త్రము'న నిట్లు చెప్పఁబడినది— 'ప్రసాదనత్వాన్మనసో యతానవత్, ప్రాసాద సంజ్ఞాస్యమనోః ప్రతిష్ఠా'. [3] కృత్యాది యందు కవి —

'. సర్వంబుఁదానయై తత్త్వయుక్తి
చే న తద్భిన్న యగుచు నిఃశ్రేయ సాత్మ
నమరు భువనేశ్వరీదేవి ననుదినంబు
బ్రస్తుతించెద భవపాశ బంధ మెడల'

— బా. కాం. - 1 ఆ., 2 ప.

అని సంభావించుట భువనేశ్వరీమంత్ర విశేషమును బ్రతిపాదించుచున్నది [4]

**స్మార్త సంప్రదాయ పాలనము :** దశరథుఁడు గర్భవతు లగు కౌసల్యాదులకుఁ 'బుంసవనాదుల్పచరించి యుండె' [5] నని శ్రీరామకథాఽమృతమున వర్ణింపఁబడినది. మూలమున నిట్టిదిలేదు. భారతీయులకు గృహ్యాధానమునుండి యంత్యేష్టి వఱకుఁ గల షోడశకర్మ లవశ్యము నాచరింపవలసినదిగా గృహ్యసూత్రములందెన్నఁ బడుచున్నవి. అందు పుంసవన, సీమంతాదులు గర్భరక్షణక్రియలుగా వర్ణింపఁబడినవి. పుంసవనంబు గర్భస్థశిశువు పురుషలక్షణములతో నుద్భవింపజేయు సంస్కారవిశేషమని

---

1. ఉ. కాం. - పూ. భా., 7 ఆ. 71 ప.
2. శ్రీమన్మంత్రరత్నాకరము - శివమన్త్రపటలము
3. ,, ,, 27 పటలమ్, 2 శ్లో.
4. శ్రీ రుద్రయామళమ్ - దేవీశ్వర సంవాదము
5. బా. కాం. - 3 ఆ., 19 ప.

చెప్పఁబడుచున్నది. 'పుగ్సువనం వ్యక్తే గర్భేతిష్యేణ' 'పుమాన్ సంజనయతి' [1] ఇత్యాదులావిషయమును బోధించుచున్నవి. ఆంధ్రీకరణమున కవులు 'సుతోదయ శ్రవణ పారమ్యంబుతో మీఱగన్' అని సూత్రోక్త విషయమును జక్కఁగా నిర్దేశించిరి.

పెండ్లి కుమారులగు రామాదులు మంగళాయతనము సేర మలయునప్పుడు 'అయంముహూర్త స్సుముహూర్తో స్త'నుచు సమయజ్ఞులగు మునులు మహితసూనృత కలనల దీవించిరని [2] వర్ణించి స్మార్త కర్మ సంప్రదాయమును బాటించిరి. ఇయ్యది శాస్త్రిగారి సమయజ్ఞతకు నిదర్శనము. మఱియు నా కల్యాణమంటపమున నగ్ని సన్నిధిని సీతకరము, రాముని కరమున నునిచి జనకుఁడు 'త్వత్సహధర్మ చర్యకుం బాయక విల్చు సాధ్వి 'దీనిఁ బరిగ్రహింపుమనుచు, రాముఁడు సహధర్మాచరణ సత్ప్రతిజ్ఞ సలుప 'తఇమాం దాస్యామి' యని ధారవోసినాఁడు. సభ్యుల సాధువచనములు, దేవతల కుసుమవృష్టి యతిశయింప వివాహవిధి యిట్లు వైభవముగా నిర్వర్తింపఁబడినది. అట్టియెడ జనకుని యదృష్టమీవిధముగఁ గీర్తింపఁబడినది -

> బహుజన్మార్జిత కర్మబంధనివహాపక్రాంతి నర్థించి ల
> క్ష్మి హరిం గూర్చుటగాఁదలంచి యిల సశ్రీకు ల్గృహ ల్కన్నెలన్
> సహధర్మంచర యంచు వోధ కిడి సత్సంపత్తిఁ గైకొందు ర్గా
> సుహితత్త్వంబిటుగన్న యాన్నృపతి సుశ్లోకత్వ మింతింతయే
>
> — బా. కాం. - 10 ఆ., 368 ప.

భారతీయ సంస్కృతిలో వివాహసంస్కారమొక ముఖ్యఘట్టముగా నెన్నఁబడుచున్నది. కన్యాదాత తనతోఁబాటుగా దనవారినిఁ దరింపఁజేయుటకీ కన్యాదాన మొక సాధనముగా భావించి అట్టి తనయదృష్టమున కానందించు చున్నాఁడు. 'మయాసహ దశపూర్వేషాం దశాపరేషాం మద్వంశానాం పితౄణాం నరకాదుత్తీర్ణ శాశ్వత బ్రహ్మలోక నివాససిద్ధ్యర్థం స్వగృహోక్త ప్రకారేణ సాలంకృత స హిరణ్యోదక కన్యాదానమహం కరిష్యే' [1] అని సంకల్పించుట స్మార్త సంప్రదాయము. మఱియు

---

1. ఆపస్తంభ గృహ్యసూత్రములు - 6 పటలం, 9, 12 సూ॥లు
2. బా. కాం.- 10 ఆ., 350 ప.
3. యాజుషపూర్వ ప్రయోగచంద్రిక, 198 పు. (వావిళ్ల వారి ప్రతి)

వివాహవిధి యందు వధువును సాక్షాల్లక్ష్మిగను, వరుని సాక్షాన్నారాయణునిగాను సంభావించుట గలదు. జనకున కట్టి భాగ్యము నిజముగా సిద్ధించినది.

> కన్యాం కనక సంపన్నాం కనకాభరణై ర్యుతాం
> దాస్యామి విష్ణవేతుభ్యం బ్రహ్మలోకే జిగీషయా
> కన్యే మమాగ్రతోభూయాః కన్యేమేదేవి పార్శ్వయోః
> కన్యేమే సర్వతోభూయా త్త్వద్దానా న్మోక్ష మాప్నుయామ్

— యాజుషపూర్వ ప్రయోగచంద్రిక, 180 పు.

వివాహప్రకరణమున వరుఁడు 'ధర్మేచార్థేచ కామేచ నాతిచరామి, నాతి చరితవ్యా' ఇత్యాదిగా 'సహధర్మాచరణ' స్వప్రతిజ్ఞ సలుపుట ఆపస్తంభాదిగృహ్య సూత్రములయందు విధింపఁబడినది. ఇట్లు సీతారాముల వివాహ ఘట్టమున 'స్మార్తసంప్రదాయము' మూలాధికముగా వివరింప బడినది.

సీతతో ననుజుఁడగు లక్ష్మణునితో రాముఁడు చిత్రకూటమును వీడి దండకారణ్యమునకుఁ బోవుచు నత్రిమహర్షి యాశ్రమమునకుఁ జని మునికి నమస్కరించె నని వాల్మీకమునఁ గలదు.

> సోఽత్రే రాశ్రమ మాసాద్య తం వవందే మహాయశాః

— అయో. కాం. - 117 స., 5 శ్లో.

శ్రీరామకథాఽమృతమున నయ్యెడ —

.... .... .... ....

> యమనియమముఖ్యములు మూర్తులందఁగాంచి
> శిష్యులట్టులు పరివశ్య సేయుచుండ
> దనరు నా బ్రహ్మతేజంబు తపసిఁజేరి
> పేరిరవుఁజెప్పి రాముండు ప్రీతినెఱఁగె

— అయో. కాం. - 10 ఆ., 58 ప.

అని వర్ణింపఁబడినది. ఇట నుపనయన సంస్కార సందర్భమునఁ జెప్పఁబడిన

గోత్రప్రవరపూర్వకముగా నభివాద మొనరించు విధి వివరింపఁబడుట సంప్రదాయపాలన మునకు నిదర్శనము. 'గోత్రప్రవరపూర్వకమ్ .... అభివాదయేత్' [1] అని తద్విధి యుగ్గడింపఁబడినది.

ఇంకను శ్రీరామకథాఽమృతమున నమూలకములగు స్మృతి వాక్యము లుగ్గడింపఁబడిన సందర్భములు కలవు.

సీత విరహమున చంద్రోపాలంభము గావించునెడ -

అరరె బ్రాహ్మణం నహన్యాన్నచాత్రేయ
మ్మనెడు స్మృతి ప్రసక్తి నడఁచెఁగాక
పాలుపంచి తినియు బ్రదికింతు రఱుగ ని
న్జేయలేరె సురలు సితమయూఖ !

— బా. కాం. - 8 ఆ., 71 ప.

అనియు, దేవాసుర సంగ్రామ వర్ణన సందర్భమున నింద్రుఁడు 'బ్రహ్మ బాంధవంబు పాటిగొనక' రావణునిపై బాణవర్షంబు గురిపించుటను సమర్థించుచు —

వేదాన్తవేత్త యని చా
మోఁదఁగఁబయికుఱుకువానిఁ బూరుషు విడువం
గాఁదగదు మున్నె యడవం
గాఁదగు నను శ్రుతియు స్మృతియుఁ గాదనవశమే

— ఉ. కాం. - పూ. భా., 6 ఆ., 211 ప.

అనియు నస్మృత్య విశేషము లుగ్గడింపఁబడినవి. అట్లే యిందమూలకములగు మఱికొన్ని స్మృతి ధర్మములు ప్రసంగవశమున నుపన్యసింపఁబడినవి.

పరశురామాగమన సందర్భమున దశరథుఁడు 'పరమధర్మ మహింస యన్నాడివెలయ' [2] సుతుని రక్షింపుమని వేడుటయు, స్వర్గముపై దండెత్తు రావణుఁడు

---

1. తైత్తరీయ సంధ్యా భాష్యము, 117, 118 పుటలు (వావిళ్లవారి ప్రతి)
2. బా. కాం. - 10 ఆ., 453 ప.

తన సైన్యమును కైలాసపర్వతమున విడియించి వెన్నెలఁబయల ప్రకృతి గాంచి పులకించి కామపరవశమున -

కాముదుండగ మెఱిఁగి ఘనులు మునులు
వాయకుండంగ వలె నెప్పు బడఁతి ననిరి
ప్రకృతిసిద్ధమకాదె యప్పరమధర్మ
మద్ది నెమ్మదిఁ జేర్పమినైతి నిట్లు

— ఉ. కాం. - పూ. భా., 5 ఆ., 302 ప.

అని తలపోయుటయు వర్ణించుట యందులకు నిదర్శనము. మఱియు రంభ రావణునితో నేను నీకోడలు నని పలుకు సందర్భమున —

అన్నదమ్ములలో నొకఁడాత్మజుఁ గన
నందఱును బుత్రవంతులే యనియె మనువు

— ఉ. కాం. - పూ. భా., 6 ఆ., 30 ప.

అనినట్లు వర్ణించుట :

భ్రాతృణా మేకజాతానా మేకశ్చేత్పుత్రవాన్భవేత్
సర్వాంస్తాంస్తేన పుత్రేణ పుత్రిణో మనురబ్రవీత్

— మనుస్మృతి, 9 అ., 182 శ్లో.

అను మనువు వాక్యమును సందర్భసుందరముగాఁ బ్రతిపాదించుటను దెలుపుచున్నది అట్లే కుక్కను గొట్టిన భిక్షువు రాముని యెదుటఁ దన నేరము నొప్పుకొని తనకు శిక్ష విధింపుమని వేడు సందర్భమున 'నృపాల శిక్షితుం డాటును బోటు నందఁడు యమాలయమం దమరేంద్ర వందితా !' [1] అనుట ;

రాజభిః కృతదండాస్తు కృత్వా పాపాని మానవాః
నిర్మాలాః స్వర్గమాయాన్తి సన్తః సుకృతినోయథా

— మనుస్మృతి, 8 అ., 319 శ్లో.

---

1. ఉ. కాం. - ఉ. భా., 8 అ., 319 ప.

యను మనుధర్మశాస్త్ర విషయమును బ్రతిపాదించుచున్నది. రాముఁడు 'ఉపస్పృశించి పశ్చిమాభిముఖుఁడై విపశ్చిన్మానసేయ సమ్యుత్తరసంధ్య నుపాసించి'[1] అని వర్ణించుట !

> అనుష్ఠాభిరఫేనాభి రద్భి స్తీర్థేన ధర్మవిత్
> శౌచేప్సుః సర్వదాచామే దేకాన్తే ప్రాగుదఙ్ముఖః
>
> — మనుస్మృతి, 2 అ., 61 శ్లో.

అను నియమమును నిరూపించుచున్నది. మూలమున సంధ్యోపాసన గావించెనని మాత్రమే యుండగా నిందు సాయంసమయమున సూర్యుఁడు పశ్చిమమున నుండుట వలననర్ఘ్యమా దిక్కునకుఁ దిరిగి యిచ్చినను, నుత్తరాభిముఖంబుగా సంధ్య నుపాసింపఁ దగియున్నదను విషయము సూచింపఁబడినది.

మఱియు సీతాకృత భూప్రవేశఘట్టమును వర్ణించు సందర్భమున సూర్యాస్తమయము సూచింపబడినది. అందు ప్రదోషకాలమునవితరము లగుపను లెవ్వియుఁ జేయకున్నను నుపాసకుల కదియపదోషమేయను విషయముఁ జెప్పి సంప్రదాయ వివరణము గావించుట తెలియఁ దగియున్నది. అది వారి లోకానుగ్రహబుద్ధి యగుట యభినంద నీయము. "జీవలోకంబునకిఁ కేదిచిత్రప్పసారః మంధకారంబు కన్నుల నంతరముల నాముకొనె, నట్టిద ప్రదోషమను సమయ, ముపాసకులకది యపదోషమౌ సమయమె" (ఉ. కాం. ఉ. భా. 8 ఆ. 99 ప.)

**సంగీతశాస్త్రి సంప్రదాయ పాలనము:** సీతారాముల వివాహసందర్భమున గాయకులు బహురాగములలో 'సంప్రదాయ విశేషప్రవర్తులగాను గతిగమక గీతు లాలపించిర'ని వర్ణించుట హృద్యము -

> క్షీరసాగరశయనా ! రామ! యనుచును
> దేవగాంధారి నిర్దేశ మొప్ప
> నన్ను బాలింపంగ నడచివచ్చితివో ధ
> రణి కంచు మోహనఫణితి దనర

---

1. ఉ. కాం. - ఉ. భా., 6 ఆ., 315 ప.

ధన్యులెందఱొ యిందు దాశరథీ యంచు
మలయమారుతలీల లొలయుచుండ
నిటుగొనియాడు నాయెడ దయ యనుచుఁ బుం
స్కోకిలధ్వనిపై వి కొసరుసూప

— బా. కా. - 10 ఆ., 402 ప.

ఇవి యున్నియు త్యాగరాజకృతు లగుట యేయేరాగముల నవి యాలపింప వలయునో యిట్లు నిర్దేశింపఁబడినవి. ఇయ్యది శాస్త్రిగారి సంగీతశాస్త్ర పరిచయమునకు నిదర్శనముగా నెన్నవచ్చును. వారు మిక్కిలి సంగీతప్రియులని వారి జీవితచరిత్రమునఁ దెలియుచున్నది.

సూర్యోదయ సమయమున సంగీతపాఠకులు 'విశిష్టసాధనంబుల, గళ పరిశ్రమ మెసంగ'ఁ బాడ దొడంగిరని వర్ణించుట శాస్త్రసంప్రదాయముల వివరించు చున్నది. [1] పులస్త్యాశ్రమమున దేవకన్యలు గానగోష్ఠిప్రసక్తలై 'రాగరసవృత్తు లెల్లెడ రాణఁ దనర ఘన రసాయనపాకమ్ము గడలుకొనఁగఁ బాడుదురు మోటు లొక్కటఁ బల్లవింప' [2] నని వర్ణించుట మూలాధికమై యాయా సంగీతశాస్త్ర విషయములను బ్రస్తావించుచున్నది.

**ఆయుర్వేదశాస్త్ర సంప్రదాయము** : హనుమని చిన్ననాఁటి యల్లరి భరింపఁ జాలక మునులు శపించిరని చెప్పుచు -

అనిల తనయాగ్ని మునుల శాపాగ్నిఁ బెరసి
యుష్ణ ముష్ణేన సీతమన్ యోగమెనసె

— ఉ. కాం. - పూ. భా., 8 ఆ., 147 ప.

అని వర్ణించి 'ఉష్ణముష్ణేన శీతల' మ్మనెడి యాయుర్వేదశాస్త్ర విషయము వివరించిరి.

సీతారాముల వనవిహార సందర్భమున వనవైభవమును వర్ణించునెడ వృక్షశాస్త్ర విషయము లెన్నియో ప్రస్తావింపఁబడి యందు మర్లమాతంగి, వనమయూరశిఖి మొదలగు నోషధి విశేషములఁ గూర్చి చెప్పుట జరిగినది. [3]

---

1. బా. కాం. - 9 ఆ., 24 ప.
2. ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 99, 100 ప.
3. ఉ. కాం. - ఉ. భా., 1 ఆ., 89. 90 పద్యములు

నైకవిద్యారహస్యముల వివరణము : సీత యుపదేశమాత్ర మననే సమస్తవిద్యల నభ్యసించి విబుధుల మన్ననల నందినదని చెప్పుచు శివుఁడు పార్వతితో -

సతి హృద్వీథిని సూత్రధారకుఁడు ప్రాక్సంస్కార సంజ్ఞుండు స
మ్మతి నారిం జతగొంచుఁ జేరి రస సంపుగ్నుల్వరుల్గాగ ధీ
ప్రతి సీరన్ వెలయించె విద్దియల పేరన్మించు మేల్బొమ్మలన్
స్మృతిదీపాలి వెలుంగఁజేసి విబుధు ల్మెచ్చం బయోజాననా !

— బా. కాం. - 4 అ., 171 ప.

అని చెప్పినట్లు వర్ణింపఁబడినది. ఇందు పూర్వకాల మందలి 'తోలుబొమ్మలాట' సంప్రదాయము వివరింపఁబడినది. వీథి యందుఁ దెఱ నిర్మించి, దీపముల వెలిగించిఁ సూత్రధారకుఁడు స్త్రీసహాయమునఁ బ్రజలానందింప బొమ్మలఁ బ్రదర్శించుట వారసున రించు పద్ధతి. అట్టి పద్ధతి మనమునం దుంచుకొని శాస్త్రిగారు సీత హృదయమను వీథి యందు ధీప్రతిసీర వెలయించి, ప్రాక్సంసారమను సంజ్ఞ గల్గిన సూత్రధారకుఁడు సమ్మతి యను నారితోఁగూడి స్మృతి యను దీపములు వెలుంగఁజేసి విద్యలను మేల్బొమ్మలను విబుధులు మెచ్చ వెలయింపఁ జేసినాఁడని వర్ణించుట హృద్యము. ఆధునిక యుగమున సాంకేతిక సాధనము లధికముగా లభించుచున్న యీరోజులలోఁ బూర్తిగా లుప్తమై నామమాత్రావశిష్టముగా నున్న యీ సంప్రదాయమునకుఁ గావ్యగౌరవము కల్పించి శాశ్వతత్వముఁగూర్చిరి.

సీత కైశోరక వర్ణనసందర్భమున, రసానంద మొల్కనామె చెలులతోఁ గూడి 'పచ్చీసు' ఆడుచున్నదని చెప్పుచుఁ 'పంచీకరణ' విద్య వివరించుట మనోహరము. ఇట నర్థాంతరమున 'రసోవై సః' అను వేదాంతవాణి ననుసరించి బ్రహ్మభావముఁబయల్పడ నాడుచున్నదనియుఁ దెలియుచున్నది. జీవేశ్వరుల సంభాషణ మిందు సాగిన విధము తత్త్వార్థ సంభృతమై యొప్పుచున్నది.

కాయలెక్కను బావుగల పందెల్నావి
నీ కాయఁ గొట్టితి నీరజాక్షి
మూటమున్నెదు కూడమట్టనీతరమౌనె
నాల్గింట గడి గట్టినాను గనవా

యైదాఱుగీల్లడ్డమవ్వల నాకాయ
యిదిపండుకాయ సుమ్మీందువదన
దసుత్రీసులేటికే తరుణి యిచ్చోటికి
ముదితనీపందెమ్ము ముఱీగెనిదిగో

చెక్కవడెఁ బంటగడి యిక్కకెక్కెదెట్లు
చేరె నాకాయలివె పుట్టుచింత మీకుఁ
గనరో పచ్చీసు తెలఁగంచుఁ గలికిమిన్న
యాడె రసమొల్క సఖులతో నబ్జవదన

- బా. కాం. - 4 ఆ. 160 ప.

ఇందు 'మూటముగ్గెదు' అనఁగా రజస్తత్త్వ తమోగుణము లనియు దారేషణ, పుత్రేషణ, ధనేషణ అను నీషణత్రయమనియు నర్థము. కావున జీవి ఈ మూడింట మున్గుచున్నాఁడు. 'కూడ ముట్టనీతరమౌనె' అనుట శుద్ధతత్త్వమైన పరతత్త్వము ననుసరించుట మాయావృతుఁడుగు జీవికి సాధ్యముకానిదని తెలియు చున్నది. 'నాల్గింట గడిగట్టినాను గనవో' అనఁగా నాజీవి ధర్మార్థ కామమోక్షములను పురుషార్థములచేఁ బంధింపఁబడినాఁడని యర్థము. ఇందు మోక్షాసక్తియు నొక కోరికయే గదా ! ఇంక, నైదాఱు గీల్లడ్డమవ్వల నాకాయ' యనఁగాఁదాను షట్చక్రోపరిసంస్థిత యగు పరదేవత ననియు 'యిదిపండుకాయ సుమ్మ' అనఁగా తనది నిత్యపరిపూర్ణ సుఖస్థితియనియు, 'దసు త్రీసు లేటికే తరుణియిచ్చోటికి' అనఁగా నట్టియనుత్తమ స్థితిలోఁబడి, ముప్పదియనెడు తత్త్వములతోఁబని లేదనియుఁ, నీ పందెమ్ము ముఱీగె ననఁగా నహంకార పూరితమగు పురుషకారము వ్యర్థమైనదని యర్థము. మఱియు 'చెక్కవడె' ననఁగా మాయావరణము జీవి నావరించిన దనియు, 'బంటగడి యిక్క కెక్కెదెట్లు' అనఁగా నట్టివానికి ముక్తిస్థానము లభింపఁదనియు, 'చేరెనాకాయలివె' యనఁగానన్నాశ్రయించిన వారికి 'మాయ' తొలగి ముక్తి లభించుననియుభావము. 'పుట్టు చింతమీకు' అనఁగా తదితరులకు జననమరణాత్మకమగు సంసారదుఃఖము సంభవించు ననియుఁజెప్పి పరమేశ్వరు నాశ్రయించుట కర్తవ్యమని యుపదేశించి తరుణోపాయము నెఱీఁగించుట 'పచ్చీసు' ఆటయందలి పరమార్థముగాఁ దెలియఁజెప్పుచున్నదని

వర్ణించుట హృదయంగమము. ఇట్లు పచ్చిసు - పరమార్థము విశదముగా వివరింపఁ బడుట మనోజ్ఞము.

విరహమున సీత చెలికత్తెలతోఁ దన యవస్థల నుగ్గడించుచు –

కలయును గాష్ఠయు న్మొదలుగాఁగల కాలముఁగూర్చి కాలవే
త్తలు కలకాల మేకగతి దత్పరులై వచియింతురేలకో
తలఁపఁగఁబోలదీ రజని తారసిలె న్దనపాల నేమనం
గలదిది కల్పమో యుగమొ కాదననొక్కఁడు హేతువుండునే

- బా. కాం. - 8 ఆ., 119 ప.

అని వాపోయినట్లు వర్ణింపఁబడినది. 'కాలవేత్తలగువారు కల, కాష్ఠ యను కాలవాచక శబ్దము లెల్లప్పుడును సమముగా నుండునని చెప్పుదురు. మఱి యీరేయి నాయెడ యుగముగాఁ గల్పముగాఁ గోచరించుచున్నది. సుప్రభాత మెప్పుడో తెలియకున్నది'. ఇది యామె వేదన. విరహిణులకట్లు దోచుట యుక్తమే. కాని కాలము మాత్రము మారదు. కష్ఠా - పదునెనిమిది రెప్పపాట్ల కాలము. కలా- ముప్పది కాష్ఠల కాలము. 'అష్టాదశనిమేషాస్తు కాష్ఠా, త్రింశత్తుతాః కలా' [1] అని యమరకోశమున నివి వివరింపఁబడినవి.

పెండ్లిపీటలపై నున్న సీతారాముల కలికిచూపుల వ్యాపారగతిమ 'నేత్రావధానకేళి' గా సంభావింపఁబడుట హృద్యము. [2] ఇందు వధాన విద్యాసంప్రదాయ విశేషము ప్రస్తావింపఁబడినది.

రాగరసమగ్నులగు సీతారాములకు, వామదక్షిణ— అక్షిభుజోరువు' 'లఖిల భావిఫలప్రకారై కలక్షకములై స్పంద మెనసిన' వని వర్ణించుట శాకునికశాస్త్ర సంప్రదాయము. [3]

---

1. ప్ర. కా. కా. వ., 118 శ్లో.
2. బా. కాం.- 10 ఆ., 389 ప.
3. బా. కాం.- 8 ఆ., 197 ప.

సీతారాముల వివాహసందర్భమున మిథిలా 'పుర మలంకార రమణు గాపురమకాఁగ' నయ్యెడ నతఃపుర మలంకరించిన తీరెన్నుచు చిత్రకళా రహస్య విశేషములు వివరింపఁబడినవి.

పూపవన్నియతేట చూపట్టునప్పోట, జిగిమెఱుంగొక యింతచేర్చి చేర్చి
ముదురురంగు బెడంగు మొక్కలంబగునెడ, దూదిపింజె నొకింతఁ దుడిచి తుడిచి
యొండు డాలందమం చూహించుపట్టునఁ దీర్చుచొప్పునఁగొంత మార్చి మార్చి
మిఱ్ఱుపల్లమ్ముల యెమ్మెలుదార్చు నెలవుల,ఁదళుకు నీట మఱింత మెలఁచి మెలఁచి

జీవకళ లెల్ల తావుల సిద్ధపఱచి
నవవికాసాను భావ సన్నాహమొప్పఁ
బూర్వరాజ కథాంశముల్పొసఁగఁగూర్తు
ర త్తఱిఁ జి త్తరువులు సౌధాంతరముల

బా. కాం. 9 ఆ. 271 ప.

రావణుఁడు వాలిచేతిలో నోడిపోయి సంధిఁ గావించుకొనినాఁడు. వారు సమస్తభోగములు, సమ విభక్తములుగా నిరువురము ననుభవింపఁగలవారమని నిర్ణయించుకొనినారు. అట్టియెడ రావణుఁడు -

కొండ విను నండఁగొని బ్ర
హ్మాండమునందేను నవ్యయత్వ మెనయుదుం
జండక్రమ! యౌపాసన
కాండముఁ గలుపుకొను కర్మకాండమువోలెన్

ఉ. కాం.- పూ. భా., 7 ఆ., 284 ప.

అని వాలితోఁ బలికినట్లు వర్ణింపఁబడినది. వేదము 'కర్మకాండ' యని, 'జ్ఞానకాండ' యని రెండు కాండలుగా విభజింపఁబడినది. కర్మకాండలోని చివరి భాగము ఉపాసనాకాండ. కర్మ లనఁగా సంధ్యావందనము, అగ్న్యుపాసన మొదలగునవి. క్రతువ్రతాదులతో నిత్యనైమిత్తికములని యని రెండువిధములుగాఁ జెప్పఁబడినవి.

కర్మకాండ శ్రద్ధగా నాచరింప దేవతానుగ్రహము గలిగి యమ నియమాదులు సిద్ధించును. అంత నంతర్ముఖుఁడై యుపాసింప సమాధి యేర్పడి యవ్యయత్వ మెనయును. అనఁగా సగుణముద్వార నిర్గుణము నుపాసించుట యగుచున్నది. [1] ఇట వాలి యౌపాసనాకాండము కాఁగా రావణుఁడు కర్మకాండగా నెన్నఁబడుచున్నాఁడు. అట్టిచో నాతనికి క్షతిలేదని భావించినాఁడు. ఇట్టి మహార్థ మిట గంభీరముగాఁ బ్రతిపాదింపఁబడినది.

లక్ష్మణుఁడు రాముని యశ్వమేధమును గావింపుమని ప్రేరేపించు సందర్భమున పూర్వమిట్లే యింద్రుఁడు వృత్రాసురునిఁజంపి బ్రహ్మ హత్యానేరముఁ బోగొట్టుకొనినాఁడని పలుక, రాముఁడాకథ సంపూర్ణముగ వివరింపుమని యడిగినాఁడు అట్టియెడ నావృత్రాసుర వృత్తాంతము మొదలుపెట్టి పూర్తిగాఁ జదువకుండ నరుగరాదను పౌరాణిక సంప్రదాయము వివరింపఁబడెనది. అది వారి లోకహితనిష్ఠకుఁ దారాృణము-

ఎఱుఁగఁడే రామదేవుండు వృత్రుచరిత
మది మొదలు పెట్టి పూర్తిగాఁ జదువకుండ
నరుగరాదను సంప్రదాయంబు లోక
విదిత మొనరింప నడిగెఁగాక దమసుగమ !

ఉ. కాం. ఉ. భా. 7 ఆ. 30 ప.

ఈవిధముగ శ్రీరామకథామృతమున జగద్ధితముఁగోరి వేదములకు శాస్త్రము లకు సంబంధించిన బహువిధ సంప్రదాయములు సమయోచితముగ వివరింపఁబడినవి. గ్రంథవిస్తర భీతిచే నన్నియు వివరింప జాలనైతిని.

---

1. వేదాంతపంచదశి

ధర్మాదర్థ ప్రభవతి, ధర్మాత్ప్రవతే సుఖమ్
ధర్మేణ లభతే సర్వం, ధర్మసారమిదం జగత్ ॥ – శ్రీమద్రామాయణము.

## పూర్వకవి పద్యానుసరణము :

సామాన్యముగ ప్రతి కవియుఁ దనకుఁ బూర్వులైన మహాకవుల సాహిత్య మందలి యత్యంత విశిష్టములగు కొన్ని భావములను పదబంధములను దన కావ్యమున సందర్భసముచితముగఁ బ్రయోగించు చుండును. పూర్వకవుల నుండి గ్రహింపఁబడినవే యైనను ప్రతిభాశాలి యగుకవి రచన నవి క్రొత్త సొగసులను సంతరించుకొనునే గాని యా కవికిఁ గాని యాతని రచనమునకుఁగాని న్యూనత్వము నాపాదింపవు. కావుననే యాలంకారిక శిరోమణి యగు నానందవర్ధనాచార్యుల వారు 'నాన్యసామ్యం త్యజేత్కవిః'[1] అని ధ్వన్యాలోకమున రచనాసంవాదమును సమర్థించినారు.

కాళిదాస భవభూత్యాదుల రచనలలో వాల్మీకి రచనా విన్యాసములు, నన్నయాదుల రచనమున కాళిదాసాదుల కవితావిశేషములు, శ్రీనాథాదుల కావ్యము లందు నన్నయాదుల రచనా విశేషములు, ప్రస్ఫుటము లగుచుండును. సాహిత్య లోకమున ననుస్యూతముగ ననుసృతమగు నీ సంప్రదాయము శ్రీరామకథాఽమృతమునను బాటింపఁ బడినది.

శ్రీరామకథాఽమృత కావ్యకర్తలు సంస్కృతాంధ్ర సాహిత్య పయః పారావారములను మథించినవా రగుటచే వారేకవుల కవితాచమత్కృతులకు మురిసి వారేయే ఘట్టము లందెట్లెట్లు తద్విశేషముల ప్రదర్శించినారో పరిశీలించుట యత్యంత సమంజసము. అది వారికి పూర్వకవులయెడఁ గల గౌరవాదరములను బ్రకటించు చున్నది.

**సంస్కృత రచనానుసరణము :** సత్యమును, ప్రియమును బలుకవలెను. అట్లని యప్రియ మగు సత్యమును, ప్రియదాయక మని యసత్యమును బలుకరాదు. ఇయ్యది సనాతనమైన ధర్మము. ఈ యర్థము నిచ్చు శ్లోకము మనుస్మృతి యందిట్లు కలదు -

---

1. 4, ఉద్యోతము 13 శ్లో.

సత్యం బ్రూయా త్ప్రియం బ్రూయాత్ నబ్రూయా త్సత్య మప్రియమ్
ప్రియం చ నానృతం బ్రూయాత్ ఏష ధర్మ స్సనాతనః

- 4 అ., 138 శ్లో.

శ్రీరామకథాఽమృతము నందు రామగుణాభివర్ణన సందర్భమున మూలాధికముగా -

పలుకనేర్చియుఁ బ్రియములే పలుకుగాని
యనృత మెప్పాట నేనాట నంటనీడు
సత్యమని యప్రియంబగు జాడఁ బోడు
తనప ఖవి వచ్చెనేనియు దనుకఁ డతఁడు

- అయో. కాం.- 1 అ., 38 ప.

అని వర్ణించుట మనువు శ్లోకార్థ మగుట స్పష్టము. పాత్రచిత్రణమున నౌన్నత్యముఁ గల్పించి తద్వార లోకమునకు నీతి బోధించుట కావ్యమున నాశింపదగిన ప్రయోజనము. ఇట నట్టిది సిద్ధించిన దననగును.

శ్రీరామకథాఽమృతమున హేమంత ర్తు వర్ణనముఁ గావించుచు మూలాధికముగా —

అరయ నేలోపమును లేదని యొకండు
గలదె గుణవృద్ధి గని దాని గప్పిపుత్తు
రెల్ల సంపదలకు నిది హేతుభూత
మౌటగాదె శ్రుతిప్రశంసార్హమయ్యె

అర. కాం. — 1 అ., 367 ప.

అని చెప్పఁబడినది. 'హేమన్తేన ర్తునా దేవాః దురతస్త్రిణవే స్తుతం బలేన శక్వరీ స్సహః హవిరింద్రే వయోదధుః' [1] అను శ్రుతి క్రతుకర్మను నిర్దేశించు చున్నది. ఈ ఋతువునందే ఆగ్రహాయణిక మను క్రతువు నిర్వహింపఁబడుచుండుట ప్రసిద్ధము.

---

1. తై. బ్రాహ్మణభాగము, 2 కాం., 6 ప్రశ్నము

ఇందు శ్రుతి ప్రమాణముతోఁబాటు లోకమున నిర్దుష్టమై సర్వజన మనోరంజకమగు వస్తువేదియు లేదనెడి 'నాస్త్యేవ తజ్జగతి సర్వమనోహరం యత్' [1] అను వ్యక్తి వివేకము నందలి వాక్యార్థము, అనేక గుణముల మధ్య నొకానొక దోషము గణనీయము కాదనెడి 'ఏకో హి దోషో గుణసన్నిపాతే, నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః' [2] అను కుమారసంభవము నందలి శ్లోకార్థము పై భావమునకు స్ఫూర్తి నిచ్చి యుండు ననుట కవకాశముఁ గలదు.

శ్రీమద్రామాయణ ప్రశంసాపరమగు —

చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్

అనునది ప్రసిద్ధ శ్లోకము. శ్రీరామకథామృతమున 'నగస్త్యుడు రాముని చరితమున బహు రహస్యములు గలవని చెప్పుచు ముందుగా రామమహత్త్వమును గూర్చి —

శతకోటి విస్తరము రఘుపతి నీచరిత్రమ్మనందు వర్ణంబొం డొం
డతి దురితహరము బొమ్మని రతిమతు లెందే రహస్యమారసి రాకొ్క్క

— ఉ. కాం. - పూ. భా., 9 ఆ., 20 ప.

అని వర్ణించుటలోనది మనోహరముగా ననువదింపఁబడినది. 'ఎందే రహస్యమారసి రాకొ్క్క' యనునది యనువాదమునఁ జక్కని పూరణము. ఇట్టిది సముచితము, సందర్భ బంధురముగా నెగడుచున్నది.

లోకమున నద్వైత గురుపరంపరను దెలుపు నీశ్లోక మొకటి ప్రచారమునఁ గలదు —

నారాయణం పద్మభువం వశిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం గోవిందయోగీంద్ర మథాస్య శిష్యమ్
శ్రీ శంకరాచార్య మథాస్య పద్మ పాదంచ హస్తామలకంచ శిష్యమ్
తం తోటకం వార్తికకార మన్యా నస్మద్గురూన్ సంతత మానతోఽస్మి

— శ్రీ సద్గురు పూజాకల్పము, 5 పు., 2 శ్లో.

---

1. ప్ర. వి., 2 శ్లో.
2. 1 స., 3 శ్లో

శ్రీ రామకథాఽమృతమున నయ్యది హృద్యముగా ననుసరింపఁబడినది. ఇది వారి యనువాద వైఖరికిఁ జక్కని యుదాహరణము.

అఖిలరక్షణ పరాయణుని నారాయణుఁ
 బ్రథితలోకోద్భవుఁ బద్మభవునిఁ
బ్రియ తపోనిష్ఠాగరిష్ఠుని వశిష్ఠుని
 సన్నివిష్టాధ్యాత్మశక్తి
స్వగత సంహృత పరాశరు నప్పరాశరు
 లాలిత విద్యావిలాసు వ్యాసు
నమలామృత ఫలరస్వాదశుకు శుకుఁ
 గలిత నిత్యామోదు గౌడపాదు

విమల విజ్ఞాన భోగి గోవింద యోగి
శ్రిత శుభంకరు శంకర శ్రీయతివరు
భవ్యసంధాని శ్రీపద్మ పాదమౌని
లబ్ధపరమేశు హస్తామలక యమీశు
పర మతాటవీ విపాటకుఁ దోటకు
మండితాఖిలార్య్య మాధవార్య్య
మఱియు నన్యులైన మద్గురువర్యుల
బూజసేయుదు నెదఁ బొదలు భక్తి

బా. కాం. - 1 అ., 12, 13 ప॥లు

ఆంధ్రీకరణమున మూలమునలేని విశేషణ విశిష్టములైన పదములఁ జేర్చుట కవికి వారి యెడఁ గల గౌరవాభిమానముల వెల్లడించుచున్నవి.

పార్వతి తపోవిధానమును గూర్చి వర్ణించు సందర్భమున కుమార సంభవము నందిట్లు గలదు -

స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధ నిపాతచూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోద బిందవః - స., 24 శ్లో

శ్రీరామకథాఽమృతమున సీతాసౌందర్య విభవమును గీర్తించు నయ్యెడ నీ కాళిదాసకవి భావ మనుసరింపఁ బడినది.-

చేర్చెఁ దలనజుండు శృంగార సారాంశ
మదియు నుఁకట బొమల నక్షియుగిఁ గు
చాగ్రములఁ దొలంకి యటఁ జింది జాలొంది
నాభిసరసిఁ జొచ్చు నాతికెపుడు

- బా. కాం. - 4 ఆ., 219 ప.

కుమారసంభవమున 'చంద్రుని కిరణము లందు మచ్చవలె గుణసము దాయమున నొక్కదోషము గణనీయము కాద'ని కలదు.

ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః - 1 స., 3 శ్లో.

శ్రీరామకథాఽమృతమున సీతారాముల పూర్వరాగమును వర్ణించు సందర్భమున సీత చంద్రు నుపాలంభము సేసెనతీరుఁ జెప్పుచు -

కొన్ని మంచిగుణములున్నఁ గొన్ని చెడు గొ
నములు క్రమ్మందు నందందు రానాఁ డు మొదలు
నేఁటికిని చెట్ట మచ్చలేనాటు కొనియె
జదివితివి యున్న తెలివియుఁజన శశాంక

- బా. కాం. - 8 ఆ., 80 ప.

అనినట్లు వర్ణించుటకు కాళిదాసు శ్లోకము స్ఫూర్తినిచ్చి యుండవచ్చును. అనువాదమున నీ సందర్భమునఁ జదివితివి యున్న తెలివియుఁ జన' ననుచోట 'చదవేస్తే ఉన్న మతి పోయిందనే'డి సామెత సుందరముగాఁ బొదుగఁబడినది. చంద్రమండలమున నైల్యము చెట్టమచ్చుగాఁ బేర్కొనఁ బడుట ప్రసిద్ధము.

కాళిదాస మహాకవి రఘువంశ కావ్య ప్రారంభమున పార్వతీ పరమేశ్వర స్తుతి పూర్వకముగ రచించిన -

వాగర్థావివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతఃపితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ 1 స., 1 శ్లో.

అను శ్లోకము గలదు శ్రీరామకథామృతమున బాలకాండ యందు నారదుఁడు జనకునితో సీతారాముల సర్వకాలైకత్వమును నిరూపించి చెప్పుచు నిట్లు పలికినాఁడు -

ఆమె యెపుడు బాయ దచ్యుతు నచ్యుతుం
డామె నెపుడు బాయఁ డాదరమున
వారి యోగగరిమ వరలు వాగర్థాను
బంధ మెట్టు లటులె పార్థివేంద్ర

- 4 ఆ., 259 ప.

కాళిదాసు భావమిట ప్రస్ఫుట మగునట్లు వివరింపఁ బడినది. ఇట్టిది వాల్మీకమున లేదు.

లోకమున పుష్పోద్గమముకంటె ఫలోదయమున నాసక్తి యతిశయించినట్లు ప్రజలు గుణాధిక్యముచే దిలీపునికంటె రఘు మహారాజు నెడఁ బ్రీతిఁ బ్రకటించిరని వర్ణించుచు కాళిదాసు -

మందోత్కంఠాః కృతాస్తేన గుణాధికతయా గురౌ
ఫలేన సహకారస్య పుష్పోద్గమ ఇవ ప్రజాః - 4 స., 9 శ్లో

అని రఘువంశమునఁ జెప్పియున్నాఁడు.

శ్రీరామకథాఽమృతమున బాలకాండయం దరుణోదయ వర్ణన సందర్భమున

స్వీయమనుకుల సురతరుశ్రీ విశేష
మిది ఫలంబిడు ముద మబ్బు నింకఁ దన క
టంచు గాంచెడు ధృతి నిట్టు లరుణుఁడౌర
చెట్టు ముద్దును మరిపించుఁ జివురు ముద్దు

అని వర్ణింపఁబడినది. పై శ్లోకభావ మిట్టి వర్ణనకు స్ఫూర్తినిచ్చినదనవచ్చును. రఘువంశ శ్లోకమున పుష్పఫలములకు నంతరముఁ జెప్పఁబడగా శ్రీరామకథాఽమృతమున నది చెట్టునకుఁ జివురునకుఁ గల యంతరముగా సముపవర్ణిత మగుట విశేషము.

'దిలీపుఁడు వశిష్ఠాశ్రమమునకుఁ బోవుచుండ మార్గమధ్యమున జానపదు లాతనికి హైయంగవీనముఁగొనివచ్చి యిచ్చిర'ని రఘువంశమున వర్ణింపబఁడినది - హైయంగవీనము = అప్పటికప్పుడు వెన్నతీసికాచిన నేయి.

హైయంగవీన మాదాయ ఘోషవృద్ధా నుపస్థితాన్
నామధేయాని పృచ్ఛన్తౌ వన్యానాం మార్గశాఖినామ్

- 1 స., 45 శ్లో

శ్రీరామకథాఽమృతమున పుత్రుల వివాహమునకై మిథిలకుఁ బోవు సందర్భమున దశరథునకు జానపదులు పాలు నేయి పెరుగు పానకము మొదలగు వస్తు విశేషములను గొనివచ్చి వేడ్కతో నిచ్చిరని వర్ణింపఁ బడినది.

చిక్కని పాలు మీగడలు చేర్చిననాడె కరంపవాసనల్
గ్రక్కెదలం దలిర్చు నవకంబు ఘృతంబులు మేలిపెర్వులుం
జొక్కెడు పానకంబులు విశుద్ధ పరిమళ వస్తుపంక్తులన్
జక్కగ నేర్చి తెత్తురట జానపదు ల్విభుగాంచు వేడుకన్

- బా. కాం. - 10 ఆ., 104 ప.

శ్రీరామకథాఽమృతమున 'హైయంగవీన' మనుటను మీగడలు చేర్చిన నాడె కరంపవాసనల్ గ్రక్కదలం దలిర్చు నవకంబు ఘృతంబుగా' వివరించుట మనోహరము. అమూలకమగు నిట్టి కల్పన పౌరుల సంపత్సమృద్ధిని, రాజభక్తినిఁ దెలియఁజేయు చున్నది.

గురుదక్షిణార్థమై తన కడ కేతెంచిన వరతంతు మహర్షి శిష్యుఁడు కౌత్సు నుద్దేశించి రఘుమహారాజు 'కుశాగ్రబుద్ధీ ! మంత్రద్రష్టలలో నగ్రగామియైన నీ గురువు కుశలమేనా ? లోకము సూర్యుని నుండి చైతన్యమును గ్రహించినట్లు నీవా మహా గురువు నుండియే కదా సమస్త జ్ఞానమును సంపాదించితివి. మనోవాక్కాయ కర్మలచే దేవేంద్రునకుఁ గూడ ధైర్యమును లోపింపఁజేయు మీ గురువుగారి తపస్సు నిర్విఘ్న ముగా కొనసాగుచున్నదా?' ఇత్యాదిగాఁ బ్రశ్నించినట్లు కాళిదాసు రఘువంశమునఁ గలదు. ( 5 స. 6, 7 శ్లో. )

శ్రీరామకథాఽమృతము బాలకాండమున యాగరక్షణార్థమై రామునిఁ బంపు మని యడుగ వచ్చిన విశ్వామిత్రుని దశరథుఁడు కుశలప్రశ్నాదికముల సంభావించుట రఘువంశమున పైఘట్టము నందలి భావమును స్ఫురింపఁజేయు చున్నది. ఇయ్యది యమూలకము.

కుశలమె సంయమీంద్ర తనకుం దనవారికి నెల్ల నా సమి
త్కుశఫలపుష్పతోయములు కొల్లలుగాఁగలవే వనంబులన్,
వశములె ఘోర సత్వములు, వారక పండునె వన్య సస్యముల్
ప్రశమధనుల్ భవాదృశులు పాటిలుచోట్లఁగొఱంత లుండునే. 5ఆ 16 ప.

ఇందుమతీ స్వయంవర ఘట్టమున 'రాజు లెల్లరు నజుని యదృష్టమును గాంచి యసూయాగ్రహగ్రస్త హృదయులై యంతర్నిహిత నక్రములై బహిః ప్రసన్నము లగు మడుగుల వలె సంతోష చిహ్నములతోఁ దమ వికారములను గప్పిపుచ్చుకొని కానుకలతోఁ బూజించిరని రఘువంశమున వర్ణింపఁ బడినది.

హ్రదాః ప్రసన్నా ఇవ గూఢ నక్రాః – 7 స., 30 శ్లో.

శ్రీరామకథాఽమృతమున ఋశ్యమూక పర్వత ప్రాంతమును జేరిన రామలక్ష్మణులను గాంచి సుగ్రీవుడు వారిని వాలికి సంబంధించిన వారని శంకించి హనుమని విచారింపఁ బంపు సందర్భమున రాజ సమూహము యొక్క స్వభావము

గూర్చి చెప్పుట రఘువంశ శ్లోక ప్రభావముగా నెన్నఁదగియున్నది.

లోన మొసళు లుండ లుప్తకాలుష్యమౌ
సరసుమాడ్కిఁ దాఁ బ్రసన్నమయ్యెఁ
జొచ్చువారి ద్రింగఁజూచుచునే యుండు
రాజకమ్మ్మ నమ్మరాని దెపుడు - కి. కాం.- 1 ఆ., 45 ప.

కాదంబరి పత్రలేఖ ద్వారా చంద్రాపీఁడునకు సందేశమును బంపుచు - 'అతి ప్రియో సీతి పౌనరుక్త్యం, తవాహం ప్రియాత్మేతి జడప్రశ్నః, త్వయి గరీయా ననురాగ ఇతి వేశ్యాలాపః, త్వయావినా నజీవా మీత్యనుభవ విరోధః, పరిభవతి మా మనంగ ఇత్యాత్మదోషోపాలంభః మనోభవేనాఽహం భవతే దత్తేత్యుపసర్ప ణోపాయః ....' ఇత్యాదిగాఁ బలికినట్లు భట్ట బాణుని 'కాదంబరి' గ్రంథమునఁగలదు. శ్రీరామకథాఽమృతమున జనకుఁడు దశరథునకు సీతారాములవివాహమహోత్స వాహ్వాన శుభలేఖ వ్రాసి పంపిన విధము కాదంబరి శైలి ననుకరించుచున్నది.

'అట్లుం గావున నేనింపుఁ గార్యకర్త నందునేని నసంభావ్య భావనయునుఁ బ్రయోజయితనందునేని వృథాభిమానంబును, హితోపదేష్టనందునేని ధార్ష్ట్యంబు, నుదా సీనుండ నందునేని ననాదరంబును, నిజాదేశ ప్రార్థయిత నందునేని నోత్ర్పాసంబును, మున్నుగాఁదోచు నా యపరాధశతంబుల మన్నించి సకుంటుంబ సపరివారంబుగ ....'[1]

సహసా విదధీత నక్రియా
మవివేకః పరమాపదాం పదమ్
వృణుతేహి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః - 2 స., 30 శ్లో.

శ్రీరామకథాఽమృతమున రాముని శివధనుర్భంగ ఘట్టమున శుద్ధాంత కాంతలు సీత నలంకరించుచు -

---

1. బా. కాం - 10 ఆ. 18 గద్య.

జాగు వలదంచు గొందఱు, వేగిరంబు
గూడ దేకర్జమునకంచు గొంద అందు
రింతకు, విమృశ్యకారిత్వమే శుభంబు
లందజేయు నటంచు సిద్ధాంత మయ్యె
- బా. కాం. - 9 ఆ., 117 ప.

అని తమలోఁదాము సంభావించినట్లు రచింపఁబడిన పద్యముగా రూపొందినది. ఇది భారవి సిద్ధాంత వచనము నందలి భావమున కనుసరణము. 'విమృశ్యకారిత్వ' మనునది యనువాదమున శబ్దానుసరణమునకు నుదాహరణ మగుచున్నది.

కిరాతార్జునీయమునం దర్జున భీతితో నటు నిటు చెల్లాచెదరై పలాయనము పఠించు ప్రమథ గణంబులను గాంచి వారి కుత్సాహము గలిగించు కుమారస్వామి పలుకు లిట్లు వర్ణింపఁ బడినవి -

స్యందనా నోచతురగాః సురేభాః వావిపత్తయః
స్యందనానోచతురగాః సురేభాః వావిపత్తయః - 15 స., 16 శ్లో.

ఇందు రెండు పాదము లొకేతీరున నుండి యర్థభేదమును బ్రసాదించుచున్నవి.

శ్రీరామకథాఽమృతమున హనుమంతుఁడు లంకయందశోకవనముఁబెకలించి బీభత్సము సృష్టించిన సమయమున వర్ణిత మగు నీ పద్యము పూర్వోత్తర భాగము లొకేతీరున నుండి చమత్కారార్థ సంభావ్య మగుచున్నది. ఇట్టి రచనకు భారవి శ్లోకము స్ఫూర్తి నిచ్చిన దని భావింప వచ్చును.

తామున్నశోకలతికా రామతఁబ్రమదావనాభిరామం బయ్యెన్
దామున్నశోకలతికా రామతఁ బ్రమదావనాభిరామంబయ్యెన్
— సుం. కాం. - 3 స., 25 ప.

సౌందర్యలహరి యందు శంకరభగవత్పాదులు శ్రీచక్రేశ్వరిని స్తుతించుచు స్వకీయము లగు జలములతో సముద్రునకుఁ దృప్తి ఘటింపఁజేసినట్లు తల్లీ ! నీమాట లతో నిన్నుఁ గీర్తించుచున్నానని సంభావించినాఁడు.

స్వకీయై రమ్భోభి స్సలిల నిధి సౌహిత్యకరణమ్
త్వదీయాభి ర్వాగ్భి స్తవ జనని వాచాం స్తుతిరియమ్ - 100 శ్లో.

శ్రీరామకథాఽమృతమున సీతకు విద్యాభ్యాసముఁగావించు సందర్భమున వర్ణ మాతృకాత్మిక యగు నామెకు వర్ణము లుపదేశించిరని చెప్పుచు నాదిశంకరుల సముద్ర జలౌపమ్య మిట్లు అనుసరింపఁ బడినది -

వర్ణమాతృక లప్పు డవ్వర్ణ మాతృ
కాత్మికకుఁ దేటతెల్ల మౌనట్లు లబ్ధ
వర్ణు లుపదేశ మొనరించి రర్ణవంబుఁ
దజ్జలౌఘార్ఘ్య రచనమైఁదనుపు సరణి - బా. కాం. - 4 ఆ., 168 ప.

మాఘమున బలరామకృష్ణులతోఁ గూడి యుద్ధవుఁడు సభావేదిక నలంకరించిన సందర్భమున 'జగచ్ఛాన్తికాముకులై సభావేదిక యందు బ్రకాశించు నరులు త్రేతాగ్నులవలె వెలుగొందుచున్నార'ని వర్ణింపఁ బడినది -

జాజ్వల్యమానా జగతః శాంతయే సముపేయుషీ
వ్యద్యోతిష్ట సభావేద్యా మసౌ నరశిఖిత్రయీ - 2 స., 3 శ్లో.

శ్రీరామకథాఽమృతమున వనవాసమునకుఁ బోవు రామలక్ష్మణులు సీతా పురస్కృతులై రథారూఢులై యుండ నా రథ మిద్ధశిఖిత్రయితో నొప్పు యజ్ఞవేదిక వలెఁ దనరినదని వర్ణించుట రమణీయము. ఇట్టిది మాఘుని భావమున కనుసరణము.

తోడనె యన్నదమ్ము లభితోషణ భూషణులై సదీక్షులై
యోడని చిత్తము ల్వెలయ నూర్జితులై రథమెక్కి రథ్వర
శ్రీడిత వేదినాఁ దనరె విద్ధశిఖిత్రయి తత్త్రియాస్థితిన్
గూడిన చొప్పమైనది వికుంఠవిలాస విశేషవైదుషీ
- అయో. కాం. - 4 ఆ., 200 ప.

ఇందు 'శిఖిత్రయి' యను శబ్దానుసరణముఁగూడ దర్శన మిచ్చుచున్నది. మాఘుని శ్లోకమున ముప్పురు పురుషులే. శ్రీరామకథాఽమృతమున సీతా రామలక్ష్మణు లట్లు సంభావింపఁ బడుట విశేషము. అగ్నిశిఖోపమముచే వారి సౌశీల్యములుఁ జెప్పఁబడుచున్నవి.

నారదాగమనమును గూర్చి చెప్పుచు 'తొలుత నొక కాంతిపుంజమై దోఁచి యంతలో నది యొక శరీరముగాఁ గోచరించి చూచుచున్నంత, మఱికొంత సేపటికి బూరుషాకృతిగ దర్శన మిచ్చి కడకతఁడు నారదుఁడుగాఁ గనుగొనఁ బడినాఁడని మాఘమున వర్ణింపఁ బడినది.

చయ స్త్విషామిత్యవధారితం పురా
తతశ్శరీరీతి విభావితాకృతిమ్
విభు ర్విభ క్తావయవం పుమానితి
క్రమాదముం నారద ఇత్యబోధి సః — 1 స., 3 శ్లో.

శ్రీరామకథామృతము నందు రామాదులు శరభంగమున్యాశ్రమముఁ బ్రవేశించు సందర్భమున నింద్రుని వర్ణించినతీరు పై శ్లోకార్థమున కనుసరణముగా వెన్నఁదగియున్నది.

కడలెల్లఁ గడకొత్తి గడవ మేకొనువృత్తిఁ
దొలుదొల్త నొకతేజ మోఁచి వెలయ
వెలుఁగులో వెలుఁగన్న వరవొప్పఁ దన్మధ్య
మండలం బగుచు వేఱొండు వెలయఁ

బుష్పకం బని యెన్నఁబో వంగ నంతలోఁ
బూరుషాకృతి యందుఁ బొడమి మెఱయ
దివ్యుఁ డంచు నొకింత తేఱిచూచెడు నంత
ఛత్రచామర శశిచ్ఛాయ లొలయ

ఘనుఁడెయౌనాఁగ సురసిద్ధమునులు బలివి
కొలుచు నమ్మేటి విభవమ్ము క్రొత్త వేయ
నింద్రుఁడే యనసై త్రిదశేంద్రుఁ డమ్మ
హామునీంద్రుని చేరంగ నరుగుటయును

— అర. కాం. — 1 ఆ., 92 ప.

నైషధమున దమయన్తి సౌందర్య వర్ణన సందర్భమున శ్రీహర్షునిచే —

> స్మితేన గౌరీ హరిణీదృశేయం
> వీణావతీ సుస్వర కంఠభాసా
> హేమైవ కాయప్రభయాంగ శేషైః
> తన్వీం మతి క్రామతి మేనకాపి — 10 స., 133 శ్లో.

అని శ్లేషోక్తిమూలకముగా నప్సరస లెవరు నామెతో సాటిరారనియు, నొక్కొక్కరి యందొక్కొక్కగుణ విశేషమున్నను సర్వగుణ విశిష్టయగు దమయంతి యప్సరః కాంతలకన్న సర్వోత్తమురాలుగా నిరూపింపఁ బడినది. అందు 'మేనకా' యనునది యప్సరస నామముగానేగాక మే-న-కా అనియు విభజింపఁ బడినది. శ్రీరామ కథామృతమున నట్టి చమత్కారమిట్లు హృద్యయముగాఁ బాటింపఁ బడినది —

> అప్పురి వారకాంతల యొయారములంగని దేవవేశ్య లె
> ల్లప్పుడు వీరిఁ గొల్వమన కన్నిట మేలగునంచు వచ్చుచో
> నప్పవిధారి యడ్డుపడి యౌవతభోఃఖలు మేనకా యనం
> దెప్పున నొక్కతె వ్విడువ దీపిత తత్పదయయ్యె నాతియున్.
> — బా. కాం. — 1 ఆ., 315 ప

దేవవేశ్య లయోధ్యా పట్టణము నందలి వారకాంతలఁ గొల్వ మేలగునని వచ్చుచో నింద్రుఁడు నాకెవ్వరును లేరాః (మే-న-కా-?) అని ప్రశ్నించినాఁడు. అందులో నొకతెను విడిచి తక్కినవారు చనిరి. ఆమె మేనకా యను నామమునఁ బ్రసిద్ధమైనది. ఇంద్రుని వచనములు గీర్వాణవాణి నాశ్రయించి చెప్పుట యౌచిత్యసుందరము.

భవభూతి ఉత్తరరామచరితమున చిత్రపట దర్శన సందర్భమున రాముని వియోగావస్థను స్మరించుచు లక్ష్మణుఁడు 'రాముని కరుణగాథను వినిన పాషాణమునకుఁ గూడ దుఃఖము వచ్చును, వజ్రముయొక్క హృదయముఁగూడ భగ్న మగునని' 'అపిగ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్' [1] ఇత్యాదిగాఁ దలపోసినట్లు వర్ణింప

---

1. 1 అం., 28 శ్లో

బడినది. శ్రీ రామకథాఽమృతమున నుత్తరకాండయందు సీతాపరిత్యాగానంతరము విలపించుచున్న లక్ష్మణునకు సుమంత్రుఁడు వశిష్ఠాశ్రమమున దుర్వాసుఁడు చెప్పిన రామాదుల జాతక విశేషములను వివరించుచు రాముని చరితము కరుణరస ప్రధాన మనియు —

రాముచరితామృతంబెత్తరాకమాన
వశ్రుజల లవములు గన్నులార నెందు
మానవునకేనిఁ బులికేని మ్రానికేని
నెండిపోయిన మ్రోడునకేని నిజము

— ఉ. కాం. - ఉ. భా., 3 ఆ, 24 ప

అని వర్ణించుట భవభూతి శ్లోకభాగమున కనుసరణము.

శంబూక వధా ఘట్టమున రాముఁడు తన హస్తము నుద్దేశించి పల్కిన ప్రసిద్ధమగు —

రేహస్త దక్షిణ!మృతస్య శిశోర్ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్
రామస్య గాత్రమసి దుర్భర గర్భఖిన్న
సీతావివాసనపటో ః కరుణా కుత స్తే - 2 అం., 10 శ్లో

అను శ్లోకము శ్రీరామకథాఽమృతమున నీ సందర్భముననే -

ప్రాణములేని నీకును గృపాలవమేటికిఁ బో కృపాణమా
మౌని శిరంబు సూటిగరమా! రఘురాముని యంగమైతి వా
మానిని గర్భిణిన్ సతి విమానితజేసి త్యజింపనేర్చు నీ
కా నెన రంపనంపుమను నంతకు నంతయు నయ్యెఁదొయ్యలీ

ఉ. కాం. - ఉ. భా., 6 ఆ., 201 ప.

అని యనువదింపఁ బడినది. సంస్కృత శ్లోకమున నున్నట్లు హస్తము నుద్దేశించి పలుకుటతోఁబాటు శ్రీరామకథాఽమృతమున 'ప్రాణములేని కృపాణమును గూడ

సంబోధించుట రసపోషణకు దోహదముఁగూర్చుచు, సహృదయ హృదయాను రంజక మగుట ప్రశంసార్హము.

ఋషుల వాఙ్మహిమమును గీర్తించుచు నుత్తర రామచరితమున 'లోకమునందలి సజ్జనులకుఁ జరుగఁబోవు విషయమునకుఁ దగిన విధముగా వాక్కు వెడలును. గాని ఆద్యులైన ఋషులకు వారి వాక్కు ననుసరించియే సంఘటనలు జరుగును' అని వర్ణింపఁ బడినది.

లౌకికానాంహి సాధూనా మర్థం వాగనువర్తతే
ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోఽనుధావతి

1 అం 10 శ్లో

శ్రీరామకథాఽమృతమున నుత్తర కాండ యందు తృణబిందుమహర్షి తన తనయును బులస్త్యున కిచ్చు సందర్భమునఁ బులస్త్యునుద్దేశించి —

నీదు చాయనెగడె నిర్మలమౌ గర్భ
మన్నె మెఱుగ నట్టి కన్నె కిట్టు
లెపుడు మిమ్ముబోంట్ల యెలయు వాక్కులన మ
హార్థ మనుసరించు టబ్బురంబె?

ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 150 ప.

అని పలికినట్లు వర్ణించుట భవభూతి మహాకవి శ్లోకభావమున కనుసరణము.

శ్రీరామ పట్టాభిషేకోత్సవానంతరము మిథిల కరుగు జనకుని ప్రయాణావసరము నిరూపించుచు 'నిత్యానుష్ఠానము వలన స్వాతంత్ర్యము తగ్గుచుండును. అహితాగ్నులకు విహితకర్మల నాచరింపకపోవుట వలన ప్రత్యవాయము కలుగుచుండును. కావున గృహస్థవిధి కష్టసాధ్యము'.

కిన్త్వనుష్ఠాన నిత్యత్వం స్వాతంత్ర్యమపకర్షతి
సంకటాహ్యాహితాగ్నీనాం ప్రత్యవాయై ర్గృహస్థతా

1 అం: 8 శ్లో.

అని పలికినట్టు ఉత్తర రామచరితమున వర్ణింపఁబడినది. శ్రీరామకథాఽమృతమున నీసందర్భముననే రాముఁడు మిథిల కేగు జనకునితో —

మిము విడనాడ మానసము మేకొనఁ బోదది కారణంబుగా
మముఁ గొని విల్వ్వడియ్యెడ సుమాళమునన్ మఱికొన్నినాళ్ళనన్
దమకటనెన్నియో పనులు దక్కినవన్నియు నుండగా గృహా
శ్రమవిధి ప్రత్యవాయములఁ జాలదురుద్ధర మాహితాగ్నికిన్

ఉ. కాం. - ఉ. భా., 10 ఆ., 43 ప

అనినట్లు వర్ణించుట భవభూతి పైశ్లోకభావమున కనుసరణము

రామునకు ప్రజాపాలనము నందుఁ గల యనురక్తిని బ్రకటించుచు —

స్నేహం దయాంచ సౌఖ్యంచ యదివా జానకీమపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా - 1 అం., 12 శ్లో.

అని అందే వర్ణింపఁబడినది.

శ్రీరామకథాఽమృతమున రాముని జనరంజకతను నిరూపించుట తదను సరణ మనవచ్చును.

రామున కింపు నింపు జనరంజన మొక్కఁడె యంత కెక్కుఁడా
రామములేవి భూసుఖపరంపరలే నను జన్మలేని స్నే
హామరలోకశౌచ కరుణాదికమేని మహీజయేనిఁ గా
వామెయిఁ, బ్రీతిసేయవలె ! ప్రాణము, లన్నెము లెన్ననేటికిన్

- ఉ కాం. - ఉ. భా.. 1 ఆ., 221 ప.

ఒండొరుల తపఃఫలముగా నొండొరులఁ గూడినవారు ప్రపంచమునకుఁ దల్లి దండ్రులు, పురాణదంపతులు నగువారు పార్వతీపరమేశ్వరులు.

పరస్పర తపస్సంప త్ఫలాయిత పరస్పరౌ
ప్రపంచమాతా పితరౌ ప్రాంచౌ జాయాపతీస్తుమః

అనునది చంద్రాలోకమునఁ బ్రార్థనాశ్లోకము. శ్రీరామకథాఽమృతమునఁ గృత్యాదిని దేవతాప్రార్థన సలుపుచు శాస్త్రిగారు —

ఒకరొకరి మేలితపముల కొక్కరొకరు
ఫలములై లోకజనకులై పరగి యాత్మ
గురువులై ప్రోచు తొల్లింటి గొనబు వేల్పు
టాలుమగలఁదలంతు నత్యంతభక్తి

అని శివపార్వతులకు భక్తితో వాచికార్చన లొనర్చిరి. శ్రీరామకథాఽమృతమున శివపార్వతులు-ఆత్మగురువులుగా సంభావింపఁబడుట విశేషము. పరస్పర తప స్సంప త్ఫలాయిత పరస్పరౌ' అనుదానికి 'ఒకరొకరి మేలి తపముల కొక్కరొకరు ఫలముల'నుట సులభసుందర మగు ననువాదవైఖరి. తొల్లింటి గొనబు వేల్పు టాలుమగలు' అనునది చక్కని యచ్చతెనుఁగు సమాసము.

నాయకుని పరోక్షమున నాతనిఁజూడవలె నను నాకాంక్ష, నాయకునిఁ గాంచినప్పుడు విరహము కలుగు ననెడి బాధ. కావున నాయికకు నాయకునిఁ బ్రత్యక్షమునను బరోక్షమునను సుఖములేదని వగఁజెందినదని కావ్యప్రకాశికలో —

అదృష్టే దర్శనోత్కంఠా దృష్టే విచ్ఛేద భీరుతా
నాదృష్టేన నదృష్టేన భవతా లభ్యతే సుఖమ్

అను శ్లోక ముదాహరింపఁ బడినది.

శ్రీరామకథాఽమృతమున 'కపిపుంగవు లేకాంతభక్తితో రాముని దర్శించినపు డానందాశ్రువులతోను, అతఁడు మఱుగైన విరహాశ్రువులతోనుగూడి వారి కన్నులు తడియారకున్నవ'ని వర్ణించుట పై భావమును దలపించుచున్నది,

కనులఁగట్టిన యట్లను గానవైన వచ్చు
నానందబాష్పము లెసచ్చెర నవి
పోవ విరహాశ్రువులు దోఁచుఁబో యెటేనిఁ
గపుల కన్నుల తడియాఱు గతి గలుగదు

ఉ. కాం. - పూ. భా,. 10 ఆ, 213 ప.

కృష్ణుని వెదకెడు గోపిక లాతనిఁజూచు వేడుక 'నియ్యడనే ముకుందుఁడు కూర్చుండెను. ఇదిగో ఇక్కడనే రమాపతి తిరుగాడెను. అనంతుఁ డిచటనే భోజనము చేసెను. అని సంభావించినట్లు సిద్ధాంతకౌముదిలో క్రింది శ్లోకముదహరింపఁ బడినది -

ముకుందస్యాసిత మిదం ఇదం యాతం రమాపతేః
భుక్త మేత దనన్త స్యే త్యూచు ర్గోప్యో దిదృక్షవః
- 3-4-76 సూత్రవ్యాఖ్యానము

శ్రీరామకథాఽమృతమున రామపట్టాభిషేకోత్సవ విశేషములు ముగిసినంత కపివీరులు రామాజ్ఞ ననుసరించి తమ తమ నెలవులకుఁ జని రామవిరహమును సైపఁజాలక వారరణ్యమున నా యాప్రదేశములఁ జూచి రామసంభాషణాదుల స్మరించుచు నాలపించిన విధము పై శ్లోకభావమున కనుసరణము.

స్నానంబొనర్చెనీ సరసి నాదేవుండు
సందియవార్చె నీజాడ నాఁడు
జప్యంబుల జపించె జానకీజాని యిం
దుని ధ్యానించె నాంతరంబు
నియ్యెడ గూర్చుండె నిచ్చట మాటాడె
నిగ్గెడఁ బరగె దానిక్కడ నగె
నిచ్చోట బన్నుండె నిచ్ఛాయ నటునిటు
దిరిగె నీనేల నొత్తిగిలె నార్యుఁ

డనుచు దిరిగిరి గిరి నిర్ఝరావనీజ
చారుతలములనెల్ల నా చారుహాసు
సంచరణముల నెంచుచు సైపరాని
రామవిరహంబున న్మహారాజ్ఞి వింటె

- ఉ. కాం. - పూ. భా., 10 ఆ., 220 ప.

బాలకృష్ణుఁడు నిద్రలో దేవతలతో సంభాషించినట్లు శ్రీకృష్ణ కర్ణామృతమున నిట్లు వర్ణింపఁ బడినది. -

> శంభో! స్వాగత మాస్యతా మిత ఇతో వామేన పద్మాసన
> క్రౌఞ్చారే కుశలం సుఖం సురపతే విత్తేశ నోదృశ్య సే
> ఇత్థం స్వప్నగతస్య కైటభ జిత శ్శృత్వా యశోదా గిరః
> కిం కిం బాలక జల్పసీతి రచితం ధూధూకృతం పాతునః
>
> - 2 ఆ., 59 శ్లో.

శ్రీరామకథాఽమృతమున రాముని బాల్యమును వర్ణించు ఘట్టమున లీలాశుకుని శ్లోకభావ మిట్టు లనుసరింపఁ బడినది. ఇందు వర్ణన ప్రకృతోపయోగి యగుట హృద్యము.

> కుశలమె నీకు బ్రహ్మ ననుఁ గూర్మి దలంతువె యీశ నీ కహా
> ర్నిశము సుఖంబె యింద్ర! భయరీతి దొలంగెనె దివ్యులార! బా
> లిశుఁ డతఁ డేమిసేయుఁ దృణలీల నడంతు నటంచు నిద్దురన్
> విశదమొనర్చు దాశరథి వేల్పులతోఁ బతి దేవతామణీ?
>
> - బా. కాం. - 3 ఆ., 154 ప.

శ్రీరామకథాఽమృతమున రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట సిద్ధాశ్రమమునకుఁ బోవు సమయమున 'కామాశ్రమవృత్తాంత కథన' ఘట్టమునం దీశ్వరుని విభూతిఁ గూర్చి బ్రహ్మ దేవతలతోఁ జెప్పినట్లు -

> 'ఏదేవు నిజమూర్తు లెనిమిది భూతంబులైదు చంద్రార్కులు యజ్వయు
> నన నేమేటి కే నగ్ని యల శౌరి శ్రుతు లబ్ధి సురగిరి యన్నాద్రి పరికరములు

అని వచింపఁబడిన పద్యము కాళిదాసు శాకుంతల మందలి నాందీశ్లోకమగు -

> యాసృష్టిః స్రష్టు రాద్యావహతి విధిహుతం యా హవి ర్యాచహోత్రీ ....
>
> 1 - అం., 1 శ్లో.

ఇత్యాది శ్లోకమున కనుసరణప్రాయముగా నున్నది. అట్లే శకుంతలా సౌందర్యమును కాళిదాసు -

అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహైః
అనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదితం రసమ్
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూప మనఘమ్
న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః. 2 - అం., 10 శ్లో.

అని శాకుంతలమున వర్ణించినాఁడు. శ్రీరామకథాऽమృతమున బాలకాండమునందు వేదవతి చరిత్రమునుఁ జెప్పు సందర్భమున రావణుఁడు వేదవతినిఁ గూర్చి -

తేఁటి యొరయనియరవిరి, తేఁటిగాలి
సూటిబారని నునుదీవె గోటు దీని
నీటు దలపించె నౌర యిట్టోటి మదను
మేటి సామ్రాజ్యమే నృకిరీటి కగునొ
- బా. కాం. - 4 ఆ., 44 ప.

అని తలపోసినట్లు వర్ణింపఁబడిన పద్యము పై శ్లోకమున కనుసరణ మనఁదగును. 'న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః' అనునది 'ఇట్టోటి మదను మేటి సామ్రాజ్య మేన్నృకిరీటి కగునొ' అనునట్లు వివరించుట మనోజ్ఞము.

ఊర్వశీ సౌందర్యము నభివర్ణించు పట్ల -

అస్యాః సర్గవిధౌ ప్రజాపతిరభూ చ్చంద్రో ను కాంతిప్రదః
శృంగారైకరసః స్వయంను మదనః మాసోను పుష్పాకరః
వేదాభ్యాస జడః కథం స విషయవ్యావృత్త కౌతూహలః
నిర్మాతుం ప్రభవే న్మనోహరమిదం రూపం పురాణోమునిః
- 1 అం., 16 శ్లో

అను కాళిదాసుని ప్రసిద్ధికెక్కిన విక్రమోర్వశీయ శ్లోకభావము శ్రీరామకథాऽమృతమున వేదవతి యొయ్యారమును గాంచి రావణుఁ డెట్లు ముగ్ధుడైనాఁడో వర్ణింపఁబడిన పద్యమున కాధారముగాఁ దోచుచున్నది.

ఔనే చక్కదనంబు మేలి మురిపెం బయ్యారె యొయ్యార మౌ
నౌ నాహ్లాదన మద్దిరా బిగితనం బా చాకచక్యంబు తీ
రా నిర్మించెనె దీనివిల్లు ముదుకండౌ తాతగా రొక్కడన్
దానేపూని పొనర్చెఁగా కుఁడిదెపో తథ్యంబు నారీమణిన్

\- బా. కాం. - 4 ఆ., 46 ప.

ఆ సౌందర్యసంపద యెట్టిదో సంభావించుట యనువాదమున విశేషము.

**ఆంధ్ర రచనానుసరణము :** భారతమున నన్నయ కణ్వాశ్రమ విభవమును గూర్చి -

శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువు దగిలి....

\- ఆది. ప., 4 ఆ., 23 ప.

ఇత్యాదిగా వర్ణించుట శ్రీరామకథాఒమృతము నందలి మున్యాశ్రమ వర్ణనమునకు స్ఫూర్తి నొసంగినదని చెప్పనగును.

ఆశ్రావయ ముఖోక్త్యలఖ్యాన మొనరించి
పలుకు శుకాదుల పలుకుబడులు

\- అర. కాం. - 1 ఆ., 18 ప.

దమయంతి నలు నన్వేషించుచు నరణ్యమునఁ గల వృక్షముల నుద్దేశించి -

సహకార మత్ప్రియ సహకారు పున్నాగ
పున్నాగు తిలక భూభువన తిలకు
చందన బుధహారిచందను పుష్పితా
శోక సుహృజ్జనశోకదమను

.... .... .... .... ....

నలు బ్రీతితోడ కానరే - అర. ప., 2 ఆ., 95 ప.

ఇత్యాదిగా నడిగినట్లు నన్నయ భారతమున వర్ణింపఁబడినది శ్రీరామకథామృతమున రాముఁడు పర్ణశాల యందు సీతం గానక దుఃఖించుచు నచటి తరువులను జూచి—

తిలకమా ! కాంచితే తిలకాంచితాలక
గాంచనమా ! కంటె కాంచనాంగి

- అర. కాం - 4 ఆ., 46 ప.

ఇత్యాదిగాఁ బ్రశ్నించినట్లు వర్ణించుటకు నన్నయ పద్య మాదర్శమని యెన్నఁదగును.

నలచరిత్రలో బాహుకుఁడు రథము నడుపునప్పుడు రథ వేగమును నిరూపించుచు –

'ఎదురను దవ్వులఁ జూచిన పొడవులెల్లఁ దత్క్షణమ
కదియఁగా నవ్వి యెంతయును దవ్వయి కనబడఁ బెఱుఁద' ...

ఇత్యాదిగా నన్నడు వర్ణించినతీరు హృద్యము. శ్రీరామకథామృతమున రామ విసృష్టమై సీత గాంగతటాశ్రమములకుఁ బోవునప్పుడు సుమంత్రుఁడు రథము శీఘ్రగతి దోలుటను జెప్పుచు దూరమున నున్న వృక్షములు దగ్గఱకు వచ్చి దూరమునఁ బడి పోవుచున్నవని వర్ణించుట నన్నయ పద్యభావానుసరణముగా భావింపవచ్చును.

దూరమున ముందుఁ గననగు ద్రుమములెల్ల
నిట్టె చూచుచు నుండంగ నెనసి వెనుక
దూరమున బడిపోవంగఁ దేరువోలె

- ఉ. కాం.- ఉ. భా., 2 ఆ., 140 ప.

తిక్కన కీచకవధ ఘట్టమున సూర్యోదయమును గూర్చి -

నీరజాకరములు నిష్టమై జేసిన
భవ్యతపంబుల ఫల మనంగ .... వి. ప. 2 ఆ. 241 ప.

ఇత్యాదిగా వర్ణించినాఁడు.

శ్రీరామకథామృతమున 'నౌషసరాగంబు' నుల్లేఖించిన క్రమ మీపద్యమును దలపించుచున్నది.

సౌరమంత్రజపంబు సలిపి చక్రతతి వే
ల్వ వెలుంగు పావకజ్వాల యనఁగ . . . బా. కాం. 9ఆ. 18 ప.

తిక్కన సూర్యాస్తమయానంతరము గావించిన తమోవర్ణన మిట్లుసాగినది -

పెనుమిట్టిది పల్లంబిది
యనకుండగ నోలమును బయలు నొక్కటిగాఁ
గనువిచ్చుటయును మోడ్చుట
యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్

- వి. ప.- 2 ఆ., 321 ప.

శ్రీరామకథాఽమృతమున నంధకార వర్ణనమీ పద్యమును బోలియున్నది -

మిట్టుపల్లమ్ము నెనరాక మేలిరంగు
కప్పు నెనుఖిదలేక యొకండుగాఁగ
భ్రాంతులకుఁ బుట్టినిల్లయి పరగు నంధ
కార మమ్మెయిఁ బెనుచు నకాలమునను

- సుం. కాం.- 1 ఆ., 153 ప.

హనుమంతుఁడు రావణునితో రాముని ప్రభావంబుఁ జెప్పుచు -

చరణాగ్రమున నీ భుజాదర్ప మడఁచిన
ధూర్జటి విలు లీలఁ ద్రుంచివైచె
వాలపాశంబున వడి నిన్నుఁ గట్టిన
వాలి నొక్కమ్మునఁ గూలనేసె
నని నిన్నుఁ జెఱగొన్న యర్జునుఁ బొరిగొన్న
పరశురాముని నాజి భంగపఱిచెఁ
గడిమిమై నొక్కఁడ ఖరదూషణాదులఁ
బదునాల్గువేవుర బారినమరె ....

- సుం. కాం.- 3 ఆ., 443 ప.

ఇత్యాదిగా వివరించినట్లు భాస్కరరామాయణమున మల్లికార్జున భట్టుచే వర్ణింపఁబడినది. శ్రీరామకథాఽమృతము నందీ ఘట్టమున మూలాధికముగా రాముని విక్రమును వర్ణించినతీరు భాస్కరరామాయణాను సరణముగాఁ దెలియనగు చున్నది.

కదిలింపఁగాఁజాల వదె కాదె ముక్కంటి
　　విల్లె క్కువెట్టుచో విఱిచిపై చె
నెన్నక వినుఁ జెఱఁగొన్న హైహయుఁ ద్రుంచి
　　నట్టి భార్గవుఁ బుట్టుపట్టి విడిచె
నందిటనిడి చతుస్సాగరంబుల విన్ను
　　ముంచియెత్తిన వాలి మురువడంచె
మునులపాలిఁటి మిత్తి యనఁ జను ఖర దూష
　　ణాది నంతకు వింటికతిథిఁ జేసె ....

- సుం. కాం.- 3 ఆ., 235 ప.

వర్షర్తువును గూర్చి చెప్పుచు మల్లికార్జునభట్టు భాస్కరరామాయణమున 'నల్లని మేఘము లాకసమునఁ గ్రమ్మినంత లోకమెల్ల నైల్యము వ్యాపించినద' ని యిట్లు వర్ణించినాఁడు.

యమునద్గంగము కృష్ణభూమదిల నజ్జాక్షన్మనుష్యంబు నీ
ల మహీధ్రవ్నిఖిలాచలావలి తమాలద్భూజ మిందీవర
త్కుముదశ్రేణి పికద్విహంగముఁ దమస్తోమద్గ్రిహార్క ప్రభా
నముదాయం బగుచుండె లోక మలఘు శ్యామాభ్రముల్ పర్వినన్

- కి. కాం.– 384 ప.

శ్రీరామకథాఽమృతమున సూర్యాస్తమయానంతరము లోకమునఁ జీఁకటి ప్రబలి యన్నియుఁ దమోమయములైనట్లు మూలాధికముగా నిరూపించుట మల్లికార్జున భట్టు పద్యమున కనుసరణముగా నెన్నఁదగియున్నది.

అన్నియు నీలవుం గిరులె యన్నియుఁ గృష్ణమృగ వ్రజంబులే
యన్నియుఁ గప్పుమ్రాకులె వడన్నియుఁ గాటుకపిట్ట గుంపులే
యన్నియు భానుభానుదులె యా జనులెల్లరు శౌరి మూర్తులే
యన్నిటఁ దానవయ్యె గిరులో నెటు కాలమహత్వ మెన్నగన్

- బా. కాం.- 8 అ, 15 ప.

ఎఱ్ఱన భారతారణ్యపర్వ భాగమున రామకథ వర్ణించుచుఁ బంపాసరోవర మతిథిజన సత్కారసంపద నెగడుచున్నట్లు వర్ణించినతీరు హృద్యము.

కమనీయ కమలినీ కహ్లారదళ కేస
రాన్విత జలముల నర్ఘ్యవిధియుఁ
దరళ తరంగ హస్తములఁ బాద్యంబును
న్మదచక్రసారస మధుప హంస
రుతులఁ బ్రియోక్తులు రుచిరవానీర ని
వేశనచ్ఛాయల విశ్రమంబు
మందసంచారిత మారుతంబుల నురు
తాప నోదనమును దగిలి యెప్పుడు

నాచరించుచును సముంచితాతిథిజన
సేవనమునఁ దనదు జీవనంబు
ఫలము నొందెనొప్పు బంపాసరోవరం
బెడఁగాంచి కన్నులెంచె మునులు

- అర. ప.- 6 అ., 364 ప.

శ్రీరామకథామృతమున సరోవరము గార్హస్థ్య ధర్మమునకునెలవై వెలసినదని వర్ణించుట ఎఱ్ఱన వర్ణనలోనే కనుపడుచున్నది.

మితిమీఱు వొలుపున మించు పుష్పిత లతా
శతములు తరువుల సంగడమున
నెగడ నర్థులు గ్రమ్మునెటిఁ దుమ్మెదలు సేరఁ
బాటి గీతమ్ములు పాడి మెచ్చు
నెలకొనఁజేయంగఁ గలిమి పెంపున నిడ్డ
రసమునఁ దృప్తిమై రాణఁదనర
మేలిబందుగులట్లు మేకొని శుకపిక
శారికాదులు నిచ్చ సంచరింపఁ

బొసఁగు గార్హస్థ్య ధర్మమ్ము పొలుపుగాఁగ
నఖిల పురుషార్థములకుఁ దా నవఁగఁజాలి
వెలయు నయ్యుపవనము నవీనపుగుచు
వానిదృష్టుల నలరించె వామనయన!

– సుం. కాం.– 1 ఆ., 342 ప.

వేల్పులను వరింపుమని కోరు నలునితో దమయంతి భవద్వ్యతిరిక్త కథలచే నాకాంక్ష తీరదని యిట్లు చెప్పినదని శ్రీనాథుని శృంగారనైషధమున వర్ణింపఁబడినది.

దప్పిఁగొన్నట్టి వారికా దప్పిదీఱ
సలిలపూరంబు హితవొ యాజ్యంబు హితవొ

— 4 ఆ., 52 ప.

శ్రీరామకథా ఽమృతమున హరి చతుర్భుజుఁడై జన్మింపఁ గౌసల్య యాతని స్తుతించి పుత్రలీలార్థినైన నాకు నీ మేలిక్రైశోరకముఁ దక్క యొండు ఫలదనుచు .

అన్న మొక్కింతగాక షుధార్తులకు ర
చించునే రత్నఖని రుచు లెన్నిలఁగుచున్న

- బా. కాం.- 3 ఆ., 58 ప.

అని పలికినట్లు వర్ణించుట శ్రీనాథుని పద్యభావానుసరణముగా నెన్నవచ్చును.

అగస్త్యుఁడు కాశినిఁబాసి యచటి దేవతలను సంభావించి వీడ్కొని చను సందర్భమున నిట్లు వర్ణింపఁబడినది -

పరమకల్యాణి యో భాగీరథీ గంగ !
వార్ధి భామిని పోయివత్తునమ్మ
యమరేంద్రులార ! లోలార్క కేశవులార
వనజసంభవ పోయివత్తునయ్య

.... ....

పోయివచ్చెద మీ కాశిపురము విడచి

కా. ఖం, 2 ఆ. 139 ప.

శ్రీరామకథాఽమృతమున యాగ పరిసమాప్త్యనంతరము విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులతోఁ గూడి మిథిల కరుగుచు సిద్ధాశ్రమ ప్రకృతిని వనదేవతల నుద్దేశించి పలికిన విధము శ్రీనాథుని శైలి ననుకరించుచున్నది.

పోయివచ్చెద మింకఁ బుణ్యవృక్షములార!
నెయ్యంబు మాయెడ నిలుపుఁ డెపుడు

.... .... .... .... ....

- బా. కాం. - 6 ఆ., 35 ప.

వింధ్యపర్వతము జ్ఞాతి విరోధమునఁ దనలో నిట్లు తలపోసినట్లు కాశీఖండమున వర్ణింపఁబడినది.

కంటికి నిద్రవచ్చునె, సుఖంబగునే రతికేళి, జిహ్వకున్
వటంక మించునే? యితర వైభవముల్ పదివేలుమాన నం
బంటునె? .... .... .... ....

- 1 ఆ., 108 ప.

శ్రీరామకథాఽమృతమున రాముఁడు సీతావిరహ దుఃఖమునఁ జింతించునెడ -

కూరుకువచ్చునే కనులకుం దరిత్రోవయుఁ గానవౌనె యా
హార విహారము ల్గలవె యన్య మనన్య మనంగఁ జెల్లునే

- అర. కాం. - 4 ఆ., 106 ప.

అని భావించినట్లు వర్ణించుట శ్రీనాథుని పద్యమున కనుసరణము. శ్రీనాథుని పద్యము వీరరసము కాఁగా నీపద్యము కరుణరస ప్రధాన మగుట గమనార్హము.

శంకరుఁడు కిరాతవేషంబుఁదాల్చి యర్జునుని తపోభూమిఁ జేర వచ్చిన సందర్భమున హరవిలాసమున శ్రీనాథుఁ డిట్లు వర్ణించినాఁడు.

వికటపాటల జటామకుటికాభారంబు
కబుకైన జుంజుఱు నెఱు ఁగాఁగఁ
జారు సుధాధామ శకలావతంసంబు
పెడకొప్పుపైనుండు పీఁకి గాఁగ
ఘన లలాటంబునఁ గనుపట్టు కనుచిచ్చు
గైరిక ద్రవ తిలకంబుగాఁగ
భుజమధ్యమునఁ గ్రాలు భుజగహారంబులు ....

- 7 ఆ., 41 ప.

శ్రీరామకథాఽమృతమున రావణుఁడు భిక్షురూపమును ధరించి పర్ణశాల సమీపించినాఁడని వర్ణించుట శ్రీనాథుని పద్యమును స్ఫురింపఁజేయుచున్నది.

కావిరంగున తీర్పుఁగల మేటి శాటుల
　　మాంసలాంసోరువుల్మఱువు పరచి
గంగ మృత్తికబొట్టు కాంతి సంగతమున
　　మొగము బెట్ట తనంబు మగుడఁజేసి
పూసిన నెఱిబూది పూఁత తెల్పున మేన
　　నెలకొన్న కప్పుపిడ్చి నిగ్గుదేర్చి ....

- అర. కాం. - 3 ఆ., 78 ప.

భీమేశ్వర పురాణమునఁ గలశభవుఁడు పారాశర్యు నకు దాక్షారామ మహిమంబుఁదెలుపు సందర్భమునఁ దత్పురోద్యాన సంపద యిట్లు వర్ణింపఁబడినది -

పంచాక్షరీమంత్ర పారాయణంబుల
　　జపియించు శారికా సముదయములు
నీలకంఠస్తోత్ర కోలాహల ప్రౌఢిఁ
　　జూపు నున్మత్త పుంస్కోకిలములు
శతరుద్ర సచ్ఛ్రుతి స్వాధ్యాయపాఠంబుఁ
　　బరిఢవించుఁ గిశోరబంభరములు
ప్రణవాక్షరాఖ్యాన పరిపాటిఁ బాటించు
　　నానావిధంబుల నమలిపిండు ....

- 3 ఆ., 28 ప.

శ్రీరామకథాఽమృతమున సుతీక్ష్ణాశ్రమమును వర్ణించునప్పుడు శ్రీనాథుని పద్యభావానుసరణము స్ఫుటముగాఁ గోచరించు చున్నది -

రామనామార్థమ్ము రహి శారికలు వేడ
　　శ్రుతిగూర్చు శుకరాజి సూనృతములు
మనుప విష్ణుఁడెకాక మఱిలేఁడను పికాళి
　　పంచమస్థాయి ప్రపంచితమ్ము

అరగాదు పొందిదె యరుదెంచు హరి యంచు
నుబ్బియాడెడువేళ్ళ యుల్లసితము
లబ్బెగేయ ప్రబంధావళి మాకంచుఁ
బాడఁ జొచ్చెడు తేంట్ల పన్నుగడలు ....
- అర. కాం. - 1 ఆ., 175 ప.

ద్వారక నుండి తిరిగి వచ్చి కృష్ణనిర్యాణమును దెలుపు సందర్భమున ధర్మరాజుతో నర్జునుఁ డిట్లు చెప్పినాఁడని భాగవతమునఁ గలదు -

మన సారథి మన సచివుఁడు
మన వియ్యము మన సఖుండు మన బాంధవుఁడున్
మన విభుఁడు గురుఁడు దేవర
మనలను విడనాడి చనియె మనుజాధీశా !
- 1 స్కం., 356 ప.

శ్రీరామకథాఽమృతమున రాముడు అరణ్యములకుఁ బోవునప్పుడు వారితోఁ గొంతదూర మరిగి, తిరిగి వచ్చిన గేస్తులఁ జూచి యాడువాండ్రు రాముని వియోగమును భరింపఁజాలక బాధపడిన విధము పోతన పద్యమున కనుసరణ మనఁదగియున్నది.

ఆ బిడ్డ యా దయాంబుధి
యా బుద్ధి గురుండు తండ్రి యాజేఁడా వి
ద్యాబోధనుఁ డాదేవుఁడు
మా బన్నము లరయఁడయ్యె మాకర్మమునన్
- అయో. కాం, - 5 ఆ., 40 ప.

పోతన, రుక్మిణి బాల్యక్రీడలను మనోహరముగా నిట్లు వర్ణించినాఁడు -

వేర్వేర బొమ్మల పెండిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబు లందు
గుజ్జనగూళ్ళను గొమరొప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱయ
- 10 స్కం., 1687 ప.

శ్రీరామకథామృతమున సీత బాల్యక్రీడలను వర్ణించుట కిట్టి రచన మొరవడిఁ గూర్చు చున్నది. అధ్యాత్మభావన మిందు హృదయంగమము.

కూర్చు బొమ్మలపెండ్లి కూటమ్ము లొండొంట్లఁ
గూర్తు విమ్మెయి నన్ను గుర్తు దెలియ
నాడు నచ్చనగాయ లఖిల గోళంబు లి
ట్లాడింతు నను భావ మచ్చుపడఁగ
నడుపు బువ్వముబంతి నలువ మున్నుగ నన్ను
మిడుదు నేనను నన్నగడలు కొనఁగ
నెన్ను వెన్నెలకుప్పలేఁ గప్పు మణిగన్న
వారెవో! ఘనులన్న వలను మెఱయ ....
- బా. కాం. - 4 ఆ., 156 ప.

భాగవతమున మధురాపురజనులు కృష్ణునిఁగూర్చి యిట్లు సంభావించినట్లు వర్ణింపఁ బడినది. ఇందు కృష్ణలీల లుగ్గడింపఁ బడినవి.

వీఁడఁటే రక్కసి విగతజీవగఁ జన్నుఁ
బాలు ద్రావిన మేటి బాలకుండు
వీఁడఁటే నందుని వెలఁదికి జగమెల్ల
ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు ....
- 10 స్కం., 1248 ప.

శ్రీరామకథాఽమృతము నందు రావణవధానంతర మయోధ్యఁ జేరు రామునిఁ జూచి పురస్త్రీలు సంభావించినతీరు పోతన పద్యమును దలపింపఁజేయుచున్నది. ఇందు రాముని మాన్యచరితములు ప్రస్తావింపఁబడినవి -

సుదతి! యీతఁడ చువ్వే శుద్ధాత్మకోసలు
కన్నె గర్భపయోధి కల్పకంబు
పొలతి! యీతఁడచువ్వే పురుషోత్తముఁడు దశ
రథు జన్మమున మనోరథము పంట
పడఁతి! యీతఁడచువ్వే భద్రాత్ముఁడు తపస్వి
పడసిన మేలి తపఃఫలంబు....

- యు. కాం. - ఉ. భా., 2 ఆ., 434 ప.

ఇంకను -

సరసిజ కిసలయ లక్ష్మీ
హరణాదరములు మహోర్మి కాంచద్రత్నా
కరములు నఖరుచి జిత స
ద్వరములు సుందరతరములు పడతుక కరముల్

- బా. కాం. - 4 ఆ., 216 ప.

ఉన్నారము పెద్దలదయ
మన్నారము నే టివలకు మానిత లక్ష్మిం
గొన్నారము భవదంఘ్రులఁ
గన్నారంగాంచు కలిమిఁ గాననసీమన్

- అయో. కాం. - 10 ఆ., 230 ప.

మొదలగునవి పోతన సాధారణ శైలి ననుకరించినందులకుదాహరణములుగా నెన్నదగియున్నవి. మఱియు దశమస్కంధమున కృష్ణుని బాల్యక్రీడలు కథా పరమార్థమును దెలియజెప్పునవిగా వర్ణించుటలోఁగల సౌందర్యమునుగాంచి

బాలకాండమున వీరును రామాదుల బాల్య క్రీడాదికముల నభివర్ణించిన విధము సుందరతరము. అరుణాస్పద పట్టణ వర్ణన సందర్భమున మనుచరిత్రము నందు -

'పురమొప్పున్ మహి కంఠహార తరళస్ఫూర్తిన్' - 1 ఆ., 1 ప.

అనిన పెద్దన భావము శ్రీరామకథామృతమున నయోధ్యాపుర వర్ణనము నందు గోచరించు చున్నది.

పుడమి చేడియ యురమునఁ బొసఁగు కోస
లాఖ్యమౌక్తికహారాలి కంద మొసఁగు
వేల్పుటాపతకమొనాగ వెలయు జగతిఁ
బున్నెముల కిమ్ము సాకేత పురవరమ్ము
- బా. కాం. - 1 ఆ., 275 ప.

అట్లే పెద్దన గావించిన గార్హస్థ్య ధర్మ ప్రశంస శ్రీరామకథామృతమున ఋష్యశృంగచరిత్ర ఘట్టమున శాస్త్రిగారమూలకముగాఁ గావించిన గార్హస్థ్య విభవ వర్ణనమున కాదర్శప్రాయ మనదగి యున్నది. ఇట భావానుసరణముఁ గాంచనగును.

కెలఁకులనున్న తంగెటి జున్ను గృహమేధి
యజమానుఁ డంకస్థితార్థ పేటి .... ....
- మ. చ. - 1 ఆ., 66 ప.

కలయాత్రమము లోలిఁగాచు మేల్పంట కాఁ
పర్థులపాలి కల్పాగమంబు . . . .
- శ్రీ. రా. క. - బా. కాం., 1 ఆ., 488 ప.

కృష్ణుని సమీపించు నారదునిఁ బారిజాతాపహరణమున ముక్కు తిమ్మన వర్ణించినతీరు హృద్యము -

సరిగమపదనిస సంజ్ఞ స్వరముల
మహతి నఖోపాయువిహతి మొరయు .... 1 ఆ. 44 ప.

శ్రీరామకథాऽమృతమున జనక నృపతినిఁ జూడ వచ్చిన నారదునిఁగూర్చిన వర్ణన తిమ్మన పద్యభావముతో సంవదించు చున్నది. -

"ప్రణవారవము చాలబడి ధీరతను సార
మయి యోర మహతిక సైక్య మొసఁగఁ .... ....

బా. కాం. 4 ఆ., 240 ప.

రాఘవపాండవీయమునఁ బింగళి సూరన -

"బుడమి నెల్లెడ వాహ్యాళి వెడలు మదను మదపు శ్రేణుఁగువోలె నామని దనెర్చె" - 2 ఆ., 5 ప.

అని వర్ణించినాఁడు. శ్రీరామకథాऽమృతమున గతిశీల మొనయుకున్నఁ జంద్ర బింబమును 'ద్యోస్థవారుకుంజమో'! యని సంభావించుట సూరన ప్రభావముగా నెన్నఁదగును. ( బా. కాం. 8 ఆ. 154 ప. )

నిగమశర్మ అక్క తమ్మునితో -

నీబావయున్ నీరాకల్ మది గోరుచుండు నెపుడున్ నీరాకరంబున్ బలెన్
- 3 ఆ., 33 ప.

అని పలికినట్లు తెనాలి రామకృష్ణుఁడు పాండురంగ మహాత్మ్యమున వర్ణించినాఁడు. శ్రీరామకథాऽమృతమునఁ బట్టాభిషేకమునకై రాముని వ్రతదీక్షితునిఁగావింప వచ్చిన వశిష్ఠుఁడు -

నీరాకన్ శశిరాక నట్ల నిచితిన్ నీరాకరంబున్ వలెన్
- అయో. కాం. - 1 ఆ., 239 ప.

అనుట రామకృష్ణుని భావానుసరణముగా నెన్నదగిఁయున్నది.

గిరిక యిష్టసఖులతోఁ గూడి వనవిహార పుష్పాపచయాదులు నిర్వర్తించి జలక్రీడ సలిపినదని వసుచరిత్రమున వర్ణితము - (3 ఆ.)

ఓలంబాలక యోల యోల యన నోలోలంచు మేలంబునన్ .... ....

శ్రీరామకథాऽమృతమున వసంత ర్తు వర్ణనము నందు -

ఆలోలేక్షణ లోల యోల యనుచు న్వ్యాసంగ వశ్యాత్మలై, యోలా కంచన
కోల లాడుదురు. .... .... .... - బా. కాం. - 2 ఆ., 87 వ.

అని వర్ణించుట భట్టుమూర్తి పద్యానుసరణముగాఁ దలపోయఁదగియున్నది. అట్లే గిరికతోఁ గూడి సఖు లెల్లరు మన్మథపూజఁగావించిరని చెప్పుచు -

ధ్యానంబు హృదయవాస్తవ్య కుటుంబికి
నావాహనము జగద్వ్యాపకునకు .... ....
- వ. సు. చ. - 3 ఆ., 170-71 ప॥లు

ఇత్యాదిగా భట్టుమూర్తి గావించిన వర్ణనము శ్రీరామ కథామృతమునఁ బులస్త్యాశ్రమము నందు దేవకన్యలు మన్మథునిఁబూజించినతీరు వర్ణించుట కొరవడిఁగూర్చియున్నదనుట కవకాశము గలదు.

కామరాజా యాహి కాంక్షితం మమదేహి
యనుచు నావాహనం బమరగూర్చి .... ....
- ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 92, 93 ప॥ లు

రఘునాథుఁడు రామాయణ సత్కథామహిమమును రాముఁడే యిట్లు చెప్పినట్లు వర్ణించినాఁడు -

శ్రీయొసగు న్యశోగరిమచేకుఱుఁ బుణ్యఫలంబు లబ్బు దీ
ర్ఘాయువు గల్గు సంతత జయాభ్యుదయంబులు మించు సంపదం
బాయక పుత్రపౌత్ర పరిపాటి ఘటిల్లుచునుండు నెప్డు రా
మాయణ సత్కథామహిమ .... .... - ర. నా. రా. - 1 ఆ.. 24 ప.

శ్రీరామకథామృతమున వేంకటప్పయ్యశాస్త్రిగారు రామచరిత్రముయొక్క విశిష్టత శివుని ముఖమునఁ జెప్పించుట రఘునాథుని పద్యభావముతో సంవదించుచున్నది.

ఆయీ రామచరిత్ర సంవలితమౌ నాఖ్యాన మత్యర్థ సు
శ్రేయోదాయక మీప్సితావహము సంసిద్ధర్షిముఖ్యావళి
ధ్యేయంబే వివరింతు నెల్ల నిరియర్థిన్ శ్రద్ధధాను ల్గను
గ్గేయంబుం బొనరించి కాంత్రు జయలక్ష్మీ కీర్తి విద్యాధృతుల్

బా.- కాం.- 1 ఆ., 272 ప.

తృణబిందుమహర్షి పులస్త్యునకుఁ దన కొమరిత సమర్పింప వచ్చి నీకీ కన్య తగునని పలుకుట కంకటి పాపరాజు ఉత్తర రామాయణమున నిట్లు గలదు -

మునిచంద్ర! సద్గుణంబున మించు నీకన్య
హస్తాభియుక్తి నీకగు వహింపు
వ్రతి మహేశ్వర! సతీత్వముగన్నదీ శ్యామ
మహిభృత్కుమారిఁ బ్రేమమున నేలు
జటిలభాస్కర! చారుసంజ్ఞ యీ పద్మిని
ఛాయానుసారిణి సమ్మతింపు
మపరాత్మభవ! నిర్మలాంగి యీ మృదువాణి
విద్యావతి దయార్ద్రి వీక్షఁజూడు....1 ఆ., 144 ప.

శ్రీరామకథాఽమృతమున నాసందర్భమున నావద్య మిట్లు మసరింపఁబడినది. ఉభయత్ర సంబోధనలు సాభిప్రాయ విశిష్టము లగుట మనోహరము.

బాలభాస్కర! నిన్నుఁ బడసి యిప్పద్మిని
సమసుఖ దుఃఖయౌ జాడ నెగడుఁ
దపసిచందురుఁడ! నిన్దవిలి యీరోహిణి
వన్నెకెక్కుఁ గలాభి వర్ధనమున
బ్రహ్మమూర్తీ! నీదుప్రాపున నీవాణి
విద్యాభిమాన నిర్వేశ మెనయు
నగ్నితేజా! భవదాప్తిమై నీ స్వాహ
యిష్టి పుష్టుల సముత్కృష్ట యగును ....

— ఉ. కాం. — పూ. భా., 1 ఆ., 153 ప.

రాముఁడు మహాప్రస్థాన మొనరించి విష్ణువై వెలసిన విధముఁ జెప్పుచు -

శతకోటి భాస్కరద్యుతుల మిటారెంచు
ఘన కిరీటము మౌళి గానిపించె ....

- ఉ. రా. – 8 ఆ., 278 ప.

ఇత్యాదిగా వర్ణించిన పాపరాజు పద్యమునకు శ్రీరామకథామృతము నందు విష్ణువు క్షీరసాగరమున దేవతలకు దర్శన మిచ్చు సందర్భమున వర్ణింపఁబడిన పద్యమను సరణముగాఁ దోఁచుచున్నది.

శతకోటి భాస్కరద్యుతుల మిటారించు
ఘన కిరీటము మస్తకమున వెలయ ....

— బా. కాం.- 1 ఆ., 234 ప.

జనాపవాదభీతి, రామపరిత్యక్తయై తన యాశ్రమమున నున్న సీతను గాంచి వాల్మీకి వాపోవుటను కంకటి పాపరాజు -

రంగారు బంగారు చెంగావులు ధరించు
శృంగారవతి నారచీర లూనె

- ఉ. రా.- 6 ఆ., 320 ప.

ఇత్యాదిగా వర్ణించిన పద్యమునకు శ్రీరామకథామృతమునఁ జిత్రకూటమున నున్న రాముని గాంచి భరతుఁడు దుఃఖించుటను వర్ణించు పద్య మనుసరణముగా నెన్న వచ్చును.

వెలలేని జిలుగు దువ్వలువఁదాల్చెడు వాఁడు
కటుకు వల్కలములు గట్టినాఁడు ...

- అయో. కాం.- 8 ఆ., 179 ప.

కంచెర్ల గోపన్న గారి -

రాముఁడు ఘోర పాతక విరాముఁడు సద్గుణ కల్పవల్లి కా
రాముఁడు షడ్వికార జయరాముఁడు సాధుజనావన వ్రతో
ద్దాముఁడు రాముఁడే పరమదైవము మాకని . . - 24 ప.

అను దాశరథీశతక పద్యమునకు శ్రీరామకథాఽమృతమునఁ ద్రిజట రామ మహత్త్వమును బ్రకటించునెడ వర్ణింపఁబడిన పద్యము దగ్గఱగాఁ దోఁచుచున్నది.

రాముఁడు దుష్టరాక్షస విరాముఁడు స్వాశ్రిత భక్తకల్పకా
రాముఁడు యోగి సంవిదభిరామ సుధాంబుధిసోముఁ డిందిరా
కాముఁడజయ్యుఁ డంచు .... ....

— సుం. కాం.— 2 ఆ., 190 ప.

ఈవిధముగ నిరంతర కావ్యాధ్యయ నాధ్యాపనములఁ బొద్దుపుచ్చు శ్రీరామ కథాఽమృత రచయితలు తమకుఁ బూర్వులగు సంస్కృతాంధ్ర కవివతంసుల రమ్యములగు భావములను రచనాచమత్కృతులను సమయోచితముగా ననుసరించుచు శ్రీరామకథాఽమృతము నత్యంతమనోజ్ఞము,సారస్వతసారసర్వస్వముగానంతరించినారు.

## లోకోక్తులు :

భాషా స్వభావమునుబట్టి తనదని చెప్పుకొనఁదగిన యొకానొక విలక్షణ మగు పలుకుబడి సిద్ధించుట ప్రతి భాష యందును సహజము. ఆ భాష మాట్లాడు ప్రజల సాంఘిక మత రాజకీయ పరిస్థితుల వలనను, ఆచార వ్యవహారముల వలనను, మఱియు నెన్నియో యితర కారణముల వలనను భాష కట్టి ప్రత్యేకత యేర్పడును. అట్టి పలుకుబడిని జాతీయము లనియు, నానుడులనియు, సామెత లనియు వ్యవహరించుట గలదు. అర్థము ననుసరించి యివి యన్నియు నేఁడు పర్యాయపదములుగాఁ జెప్పఁ బడుచున్నవి. సంస్కృత మందలి సూక్తులు, నిట్టివే. వీని వలనఁ గావ్యమున కొక విశిష్టశోభ చేకూరును.

శ్రీరామకథాఽమృతమున నట్టివి బహుసందర్భము లందు ప్రయోగింపఁ బడినవి. అవియెల్ల గ్రంథకర్తల బహుముఖ లోకజ్ఞతాసూచకములై వరలుచున్నవి.

## 1. సంస్కృతములు :

రామార్పణమ్ — యు. కాం. — పూ. భా., 2 అ., 233 ప.
యథారాజా తథాప్రజా - ఉ. కాం. — ఉ. భా., 1 అ., 42 ప.
మహాప్రభుర్జయతు నిత్యమ్ - ,, ,, 18 ప.

## 2. సంస్కృతానువాదములు :

అమృతమౌ విషమన్నది సిద్ధమయ్యెడిన్ - బా. కాం.- 4 అ., 54 ప.
(అలస్యాదమృతం విషమ్)
రూపమెందును గుణసూచకంబనెడు త్రోవ - బా. కాం.- 7 అ., 24 ప.
(యత్రాకృతి స్తత్రగుణాః)
క్రియయే యుత్తరమగు - సుం. కాం.- 3 అ., 357 ప.
(క్రియా కేవల ముత్తరమ్)
సిద్ధాన్నము పరిత్యజించి భైక్షవృత్తి కాసింతురే- సుం. కాం.- 2 అ., 108 ప.
(సిద్ధమన్నం పరిత్యజ్య భిక్షామటతి దుర్మతిః)
మౌనము సర్వార్థకము - ఉ. కాం.- పూ. భా., 7 అ., 186 ప.
(మౌనం సర్వార్థసాధకమ్)
ప్రాహుణికు హస్తమున ఘోరాహిం జంపింపనెంచు గృహి వోలెన్
(ప్రాహుణికేన సర్పమారయేత్) — ఉ. కాం.— ఉ. భా., 2 అ., 280 ప.
(అనునది సంస్కృత న్యాయము)

## 3. ఆంధ్రములు :

కుడుమిడునంతఁ బండువనుకొంచు - బా. కాం.- 1 అ., 4 ప.
కుత్తుకబంటి కోరికల్ - ,, , 34 ప.
చదివితివి యున్నతెలివియు జన - ,, 8 అ., 80 ప.
చెట్టు ముద్దును మరపించు చివురు ముద్దు ,, 9 అ., 60 ప.
నేలవిడిచి సాము - అయో. కాం.- 9 అ., 5 ప.

ఇంటిదొంగలఁ బట్టంగ నెవ్వఁడోపు — ,, 8 ఆ., 25 ప.
కన్నవారికి గాదెట్టు కడుపుకుట్టు - ,, 10 ఆ., 288 ప.
పూతపూసిన కత్తి యప్పురుషవృత్తి - ,, 2 ఆ., 44 ప.
తొలి గలివోసి యవలఁబెరుఁగు వోయువారె ,, , 102 ప.
తాఁజెడ్డక్రోతివనము సెఱచి కూలినట్లు ,, 289 ప.
అది కప్ప యెలుఁగు పాము - అర. కాం.- 2 ఆ., 64 ప.
కోటికి నొక్కఁడె చాలు - ,, 4 ఆ., 299 ప.
తలపట్లు పట్టుకొనుట - కి. కాం.- 1 ఆ., 33 ప.
నమస్కారమెచాలు దాసు దెస
గల్గిన తప్పెడలించు నయ్యెడన్ - ,, 2 ఆ., 247 ప.
ఓడలం బండ్లు బండ్లపై నోడలెత్తనైన విధి - ,, 1 ఆ., 91 ప.
నల్లేరుం దీవియపైన బండి - సుం. కాం.- 2 ఆ., 71 ప.
అటుకులుదిను కుట్టుగంటులు - - 3 ఆ., 304 ప.
ఎండయు వానయు నొక్కట గండు మిగిలె - ఆ., 330 ప.
ఇల్లలికినంతఁబండువదెట్టులయ్యె - యు. కాం.— పూ. భా., 5 ఆ., 46 ప.
ఉట్టిచేర్లన్నియుం దెగె నుదిలపడుచు — 4 ఆ., 329 ప.
పుట్టనిబిడ్డల కిట్టులనుచుఁబేర్లువెట్టెడువారు 4 ఆ., 333 ప.
బావమఱిది బ్రతుకఁగోరు — ఉ. కాం., పూ. భా., 4 ఆ., 448 ప.
తనముద్దే ముద్దు , 486 ప.
నాదు కోడి కొకఁడే పదము 5 ఆ., 203 ప.
కలదె యెందైన నొడలెఱుంగని సివమ్ము , 152 ప.
బ్రతుకు జీవుఁడ 6 ఆ., 80 ప.
చలిచీమపుట్టునే పులికడుపున 7 ఆ., 204 ప.
పుట్టువులెత్తుమనిన బూర్వముల నెత్తు , 300 ప.
బొర చూచుచుండ నా యయ్యవారు క్రోతిదొరయయ్యె , 308 ప.
తాడినెక్కి నిక్కెడువాని తలలుదన్నువార లుందురు , 216 ప.

వెక్కి-వెక్కి యేడ్వ వెఱవ వెవ్వారి బిడ్డవుర నీవు 8 ఆ., 24 ప.
మోకాళ్ల చేటు , 228 ప.
గోటనివృత్తమౌ పనికి గొడ్డళులేల ? - ఉ. కాం.- ఉ. భా., 4 ఆ., 74 ప.

## పదప్రయోగ దక్షత :

కవులు తమ విజ్ఞానము ననుసరించి కావ్యమునఁ గొన్ని విశేషపదములు మక్కువతోఁ బ్రయోగించుట పరిపాటి. అవి వారి వ్యక్తిత్వమును, బహుముఖీనమైన పాండిత్యమును గుర్తించుట కుపకరించు చున్నవి. శ్రీరామకథామృత కవులు పితాపుత్రు లిరువురు శాస్త్రవీథులలో విహరించిన బుధీశ్వరులు గావున వారి కవితలో శబ్ద ప్రయోగ సామర్థ్యసూచకములు, శాస్త్రవేద్యములు నగు పదములు గోచరించుచున్నవి. అట్టివానిలోఁ గొన్ని పదములీ ప్రకరణమున నుదాహరింపఁబడుచున్నవి.

1. నమి వ్యాపారము (బా. కాం.- 1 ఆ., 184 ప.) ధాతువు నుదాహరించి తద్వ్యాపారమును జెప్పుటద్వారా క్రియను సూచించుట సంస్కృత మర్యాద. 'ణము ప్రహ్వత్వే' అనునది ధాతువు. దాని వ్యాపారము నమస్కారము. ఇట్టిదే 'ఘటిక్రియ'

(ఉ. కాం.- పూ. భా., 4 ఆ., 481 ప.)

2. యియక్ష (బా. కాం.- 2 ఆ., 115 ప.) 'యజదేవపూజా సంగతికరణ దానేషు' (3-1-7) అను ధాతువు 'ధాతోః కర్మణః సమానకర్తృకాత్ ఇచ్ఛాయాంవా' అను సూత్రముచే సన్నంతమై 'యియక్ష' అను రూపము నందినది. యష్టుమిచ్ఛా యియక్ష — అనఁగా యాగముచేయవలె నను కోరిక.

3. సాన్నాయ్యము (బా. కాం.- 2 ఆ., 163 ప.) 'పాయసాన్నాయ్య నికాయ్యధాయ్యాః మానహవిర్నివాససామిధేనీషు' (3-1-126) అను సూత్రముచే హవిరర్థము నందు 'సాన్నాయ్యమ' ను పదము నిపతింపఁబడినది.

4. జరీజృంభిత (బా. కాం.- 2 ఆ., 313 ప.) 'జృభిగాత్ర వినామే' అను ధాతువు నకు 'యఙోచిచ' (2-4-74) అను సూత్రముచే యఙ్లుక్ రాఁగా 'ఋతశ్చ' (7-4-92) అను సూత్రముచే రీగాగమ మేర్పడి జరీజృంభ్ అయినది. దానికి క్తాంతరూపము 'జరీజృంభిత' అని యగును. అధికముగా విజృంభించినది యని యర్థము.

5. బ్రహ్మభూయము (బా. కాం.- 6 ఆ., 298ప.) 'భువో భావే' (3-1-107) అను సూత్రముచే క్యప్ ప్రత్యయము రాఁగా 'బ్రహ్మణః భావమ్ బ్రహ్మభూయమ్' అని యగును.

6. ఔషసరాగము (బా. కాం.- 9 ఆ., 18 ప.) 'కాలాఠఞ్' అను సూత్రముచే ఠఞ్ వచ్చి 'ఔషసిక' అని కావలసి యుండఁగా కవి 'ఔషసరాగము' అని ప్రయోగించుట నిరంకుశత్వము. 'అనుదితౌషసరాగా' అను భారవి ప్రయోగ మిందులకు ప్రమాణముగా భావింపవచ్చును. ఇంకను బాలకాండమున 'సామానాధికరణ్యము' (1 ఆ., 237 ప.:) సౌస్నిగ్ధ్యము (3 ఆ., 57 ప.) ఇక్ష్వాకుతిలకుఁడు (7 ఆ., 191 ప.,) భావినీ (9 ఆ., 79 ప.) సౌఖశాయనికత్వము (9 ఆ., 43 ప.) మొదలగునవిందెన్నఁదగి యున్నవి.

7. మనీషితము (1 అయో. కాం.- 1 ఆ., 82 ప.) 'మనసః ఇషితమ్' అను నర్థమున 'శకంధ్వాదిషు పరరూపమ్ వాచ్యం' (3632) అను వార్త్తికముచే పరరూప మేర్పడి 'మనీషిత' మైనది. మనమున కత్యంత ప్రియమైనదని యర్థము.

8. శాయితము (అయో. కాం.- 1 ఆ., 178 ప.) 'శీఙ్ స్వప్నే' అను ధాతువు నకు 'హేతుమతిచ' (3-1-26) అను సూత్రముచే ణ్యంతమురాఁగా 'తయోరే వకృత్య క్తఖలర్థాః' (3-4-70) అను సూత్రముచే నధ్యర్థి క్తాంతమై 'శాయితము' అయినది.

9. దీప్రము (అయో. కాం.— 2 ఆ., 69 ప.) దీప శబ్దము కంటె 'నమి కంపిస్మ్యజసకమ హింసదీపోరః' (3-2-167) అను సూత్రముచే రేఫము వచ్చి 'దీప్రము' అయినది. మిక్కిలి ప్రకాశించుట యనునది యర్థము.

10. దుస్సాధుఁడు (అయో. కాం.- 2 ఆ., 124 ప.) 'ఈషద్దుస్సుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషుచఖల్' (3-3-126) అను సూత్రముచే దుస్ అను ఉపసర్గ కంటె పరీభూతమైన సాధ్ అను ధాతువునకు ఖల్ ప్రత్యయము రాఁగా దుస్సాధః అని యగును. అతికష్టముచేఁ గూడ సాధింప వీలులేనివాఁడు అని యర్థము.

11. ద్వైధము (అయో. కాం.- 3 ఆ., 287 ప.) ద్వి అను శబ్దమునకు 'సంఖ్యాయాః ద్విధార్థేధా' (5-3-42) అను సూత్రముచే ధా ప్రత్యయము రాఁగా 'ద్విధా' అగును. ఇట్లు వచ్చిన ధా ప్రత్యయమునకు 'ద్విత్రోశ్చధముఞ్' (5-3-42) అను సూత్రముచే ధముఞ్ ప్రత్యయమురాగా ద్వైధమ్ అని యగును.

12. రామణీయకము (అయో. కాం.- 5 ఆ., 297 ప.) రమణీయమే రామణీయకము మనోజ్ఞాదిగణపఠితము గావున 'యోపధాత్ గురూపోత్త మాత్ వుఞ్' (5-2-132) అను సూత్రముచే వుఞ్ ప్రత్యయము వచ్చి రామణీయకమైనది.

13. సంతమసము (అయో. కాం.- 6 ఆ., 420 ప.) సంపూర్వకమైన తమ శ్శబ్దమునకు 'అవసమంధేభ్యః తమసః' (5-4-79) అను సూత్రముచే సమాసాంత మున అచ్ ప్రత్యయము చేరి 'సంతమసము' అయినది.

14. వశంవదము (2 ఆ., 276 ప.) వశ శబ్దమునకు పరముగా నున్న వద్ ధాతువునకు 'ప్రియవశేవదఃఖచ్' (3-2-38) అను సూత్రముచే ఖచ్ ప్రత్యయము వచ్చి 'వశవదము' అనుచో 'అరుద్విషదజంతస్యముమ్' అను సూత్రముచే ముగాగమ మేర్పడి 'వశంవదము' అని యగును.

15. క్షోణీజాని (అయో. కాం.- 2 ఆ., 331 ప.) క్షోణియే జాయగాఁ గలవాఁ డను నర్థమున 'జాయాయాః నిఙ్' (5-4-134) అను సూత్రముచే నిఙ్ ఆదేశము రాఁగా 'క్షోణీజాని' అయినది.

16. సంపశ్యత (అయో. కాం.- 4 ఆ., 36 ప.) 'ప్రాఘ్రాధ్మాధేట్ దృశఃశః' (3-1-136) అను సూత్రముచే దృశ్ ధాతువునకు శప్రత్యయము రాఁగా 'సంపశ్యః' అగును. వాని భావము సంపశ్యత.

17. మాతరపితృ (అయో. కాం.- 3 ఆ., 342 ప.) 'మాతరపితరౌ ఉదీచాం' (6-3-32) అను సూత్రముచే విది నిపతింపఁ బడినది.

18. అసూర్యంపశ్య (అయో. కాం.- 4 ఆ., 7 ప.) 'అసూర్యలలాటయోః దృశితపోః' (3-2-36) ఇది అసమర్థ సమాసము. సూత్రకారుని వాక్యమే యిందులకు ప్రమాణము. 'సూర్యం న పశ్యతీతి అసూర్యంపశ్యా' అని యగును.

19. శుష్కము (అయో. కాం.- 9 ఆ., 44 ప.) శుష్ ధాతువునకు క్త ప్రత్యయము రాఁగా నందలి తకారమునకు 'శుషఃకః' (8-2-51) అను సూత్రముచే కకారము విధింపఁబడినది.

20. ప్రేష్ఠుఁడు- ప్రియ శబ్దమునకు ఇష్ఠన్ ప్రత్యయము విధింపఁగా ప్రియస్థిర ....' ఇత్యాది (6-4-157) సూత్రముచే ప్రియశబ్దమునకు 'ప్ర' అను నాదేశమేర్పడి ప్రేష్ఠః- ప్రేష్ఠుఁడు అను రూపము సిద్ధించినది.

ఇంకను నిందు ఆదిష్టము (6-1-89,) వర్ధిష్ణుత (2-391,) అన్యాదృశ (2-399) మొదలగు వైయాకరణ మనోజ్ఞములగు పదములు ప్రయోగింపఁబడినవి.

అర. కాం.

21. మేదురము (2 ఆ., 126 ప.) భంజభాసమిదోఘురచ్ (3-1-161) సూత్రముచే (మిద్+ఘురచ్) ఘురచ్ ప్రత్యయము రాఁగా 'మేదురము' అగును.

22. తృణీకరించు (3 ఆ., 227 ప.) 'కృభ్వస్తియోగే సంపద్యకర్తరిచ్విః' (5-4-50) అను సూత్రముచేతను, 'అభూత తద్భావఇతి వక్తవ్యం' (3340) అను వార్తికము చేతను అతృణం తృణమివ సంపద్యతే తథాకరోతి తృణీకరోతి. ఇత్యాది తెనుఁగున తృణీకరించి అని ప్రయోగింపఁబడినది.

23. జనత (4 ఆ., 88 ప.) 'గ్రామజనబంధుసహాయేభ్యస్తల్' (4-2-43) అను సూత్రముచే జనసమూహమను నర్థమున 'జనత' అయినది.

24. ఆచార్యాని (1 ఆ., 242 ప.) 'ఇంద్రవరుణభవశర్వ రుద్రహిమారణ్య యవయవన మాతులాచార్యాణామానుక్' (4-1-49) అను సూత్రముచే 'ఆనుక్' ఆగమము, ఆపై జీష్- ఆచార్యానీ- ఇట 'ఆచార్యాదణత్వంచ' (2477) అను వార్తికముచే ణత్వము రాలేదు. ఆచార్యస్యస్త్రీ ఆచార్యాని.

25. అమృతాయితములు (3 ఆ., 137 ప.) 'లోహితాది డాజ్భ్యః క్యష్' (3-1-13) అను సూత్రముచే అమృతశబ్దము కంటె క్యష్ ప్రత్యయము వచ్చి అమృత+య అని కాఁగా క్తప్రత్యయము సిద్ధించి 'అమృతయిత' మగును. అమృతములు కానివి అమృతములుగా నగుట 'అమృతాయితములు' అనఁబడును.

ఇందింకను హాస్తిపకులు (1-160,) ఔపయికము (2-378,) అనణీయము (3-3-2) మొదలగునవి వైయాకరణైకవేద్యము లగు ప్రయోగములు గలవు.

కి. కాం.

26. విశ్వజనీనము (1 ఆ., 92 ప.) 'ఆత్మన్విశ్వజనభోగోత్తర పదాత్ ఖః' (5-1-9) అను సూత్రముచే ఖ ప్రత్యయము. దానికి 'ఈన' ఆదేశము రాఁగా విశ్వజనీనము అయినది. విశ్వజనాయహితం విశ్వజనీనమ్.

27. ఉదరంభరి (2 ఆ., 178 ప.) ఫలేగ్రహిరాత్మంభరిశ్చ 3-2-26) 'చాత్కుక్షింభరిః' చాంద్రాస్తు ఆత్మోదరకుక్షిషు ఇతిపేఠుః భాష్యేతున -

మురారి అనర్ఘరాఘవమున 'జ్యోత్స్నాకరంభ ముదరంభరయః చకోరాః' అని ప్రయోగించినాఁడు. ఆ ప్రయోగ మిందులకు ప్రమాణము కానోపును.

28. సంస్తాయంబు (2 ఆ., 7 ప.) 'ఋహలోర్ణ్యత్' (3-1-124) అను సూత్రముచే నీరూపము సిద్ధించినది.

సుం. కాం.

29. ప్రియంభావుక (2 ఆ., 493 ప.) అనాఢ్యః అఢ్యోభవతీతి చ్వ్యర్థము (3-2-56) నందు 'ఆఢ్యసుభగస్థూలపలిత నగ్నాంధప్రియేషు చ్వ్యర్థేష్వచ్వౌకృఞః కరణేఖ్యున్' అను సూత్రోక్త మగు ప్రియ శబ్దము కంటె పరమైన భూ ధాతువునకు 'కర్తరిభువః ఖిష్ణుచ్ ఖుకఞ్' (3-2-57) అను సూత్రముచే ఖుకఞ్ రాగా ప్రియంభావుక అను రూప మేర్పడినది.

30. అపాంపతి(1 ఆ., 190 గద్య)అపాంపతిః' అప్పతిః' అని మాత్రమే యగును. కాని కవి ప్రయోగములలో 'అపాంపతిః' అని అలుక్ సమాసముగాఁ బ్రయోగము గానవచ్చు చున్నది. ఇది కవి స్వాతంత్ర్యమునుఁ బ్రకటించుచున్నది.

సోంప్రపిపాంసుః అపాం పిత్తం ఇంధానః శర్వరీంనయేత్

- ధర్మశాస్త్రము

ఉ. కాం.- పూ. భా.

31. జల్పాకః – "జల్పభిక్షకుట్టలుంటవృజఃషాకన్, ( 3-2–155 ) అను సూత్రముచే షాకన్ ప్రత్యయ మేర్పడి "జల్పాకః" అయినది.

32. వైధసంబు (7 ఆ., 356 ప.) వేధసః ఇదమ్ వైధసమ్- విధి సంబంధ మైన అని యర్థము. 'తస్యేదం' (4-3-120) సూత్రముచే అణ్, ణిత్వాదాదివృద్ధి వచ్చివైధసమ్- వైధసము అయినది.

33. నేదిష్టము (9 ఆ., 109 ప.) 'అపిశాయనే తమ చిష్టనౌ' (5-3-55) 'అంతికబాఢయోః నేదసాధౌ' (5-3-66) అను సూత్రములచే నీరూపము సాధింపఁ బడినది.

34. భాభ్రాజమాన (4 ఆ., 623) 'ధాతోః ఏకాచోహలాదేః క్రియా సమభిహారేయఙ్' (3-1-22) 'లటః శతృశానచా వప్రథమా సమానాధికరణే (3-2-124) అను సూత్రములీ రూపసిద్ధినిఁ జెప్పుచున్నవి.

35. ప్రఘాణము (5 ఆ., 177 ప.) 'అగారైకదేశే ప్రఘణః ప్రఘాణశ్చ' (3-3-76) 'పాదైః ప్రకర్షేణ హన్యతే ఇతి ప్రఘాణః 'ఇట భావార్థము నందు 'అప్' సిద్ధించినది. ఇయ్యది నిపాతసూత్రము.

36. వ్యభీచారము (10 ఆ. 298 ప.) 'ఉపసర్గస్యఘఞ్మనుష్యే బహులమ్' (6-3-122) అను సూత్రముచే వ్యభిచారము అనియేకాక వ్యభీచారము అను రూపమును సిద్ధించుచున్నది. పరిమళము మొదలగునవిట్టివే యనవచ్చును.

37. న్యాయ్యము ( 10 ఆ., 13 ప. ) 'ధర్మపథ్యర్థ న్యాయాదనపేతే' (4-4-92) న్యాయాదనపేతం న్యాయ్యమ్.

38. నఃఖండన (4 ఆ., 163 ప.) నాసికాయాఃఖండనమ్' అను నర్థమున నాసికా శబ్దమునకు 'నస్ నాసికాయాః' అను సూత్రముచే 'నస్' అను నాదేశము వచ్చి 'నస్+ఖండన' యని యుండగా రుత్వవిసర్గలు వచ్చి 'నఃఖండన' యని యైనది. గాయత్రీ బీజాక్షరములలో గల 'నః' అనునది నఃఖండన ఇత్యాదిగాఁ బ్రయోగించుట వైయాకరణ మనోరంజక మగుట ప్రశంసార్హము.

ఉ. కాం.— ఉ. భా.

39. శాద్వలము (1 ఆ., 195 ప.) 'నడశాదాడ్వలచ్' (4-2-88) అను సూత్రముచే వలచ్ ప్రత్యయము రాఁగా 'శాద్వలము' అను రూప మేర్పడినది.

40. ఘటోఘ్ని (3 ఆ., 115 ప.) 'ఊధసోఽనఙ్' (5-4-134) 'బహు వ్రీహేః ఊధసోఙీష్' (4-1-25) సూత్రములచే నీరూపము సిద్ధించినది.

41. రాజన్వతి (4 ఆ., 122 ప.) 'రాజన్వాన్సౌరాజ్యే' (8-2-14)

42. ప్రాజ్ఞుఁడు- ప్రజ్ఞాదిభ్యశ్చ (5-4-38)

43. లేలిహ్యమాన (1 ఆ., 88 ప.) ధాతోరేకాచోహలాదేః క్రియా సమభిహారేయఙ్ (3-1-22)

44. సౌదామని (1 ఆ., 195 ప.) సుదామన్ శబ్దముకంటె 'తేనైకదిక్' (4-3-112) అను సూత్రముచే అణ్ ప్రత్యయము నాపై ఙీష్ చేరఁగా సౌదామనీ అని యగును. మెఱుగు అని యర్థము దీనిని లోకమున సోదామిని అని వ్యవహరించుట ప్రమాదభరితము. శబ్దస్వరూప స్వభావములఁ జక్కగా గుర్తించినవారు తక్క నన్యులు 'సౌదామని' అని ప్రయోగింపఁజాలరనుట సత్యము.

45. త్రిభువని (పూ. భా., 8 ఆ., 202 ప.) "త్రయాణాం భువనానాం సమాహారః త్రిభువనమ్' అని యగును. కాని యిట "త్రిభువని" యని పార్వతీ పరముగ సంబోధనగావింపఁ బడినది. 'త్రిస్రూణాం భువాం సమాహారః యను నర్థమున నపుంసక ప్రాతిపదికమై 'త్రిభు యని కాఁగా 'త్రిభ్వేవ వనం యస్యాఃసా అను నర్థమున ఙీష్ వచ్చి 'త్రిభువనీ, అయినది. తెనుగుఁన హ్రస్వము సిద్ధించి 'త్రిభువని, అని ప్రయోగింపఁ బడినది. ముల్లోకములు పర్యటించునది యని యర్థము. ఇట్టి సమన్వయము కవి వ్యాకరణపారదృశ్వతను తెలియఁజేయు చున్నది.

ఈ విధముగ వైయాకరణైకవేద్యములైన ప్రయోగములను బ్రదర్శించి శ్రీరామకథాఽమృత కవులు తమ శాస్త్రీవైదుష్యమును వెల్లడించుకొనినారు.

పాండిత్యస్ఫోరకములగు ప్రయోగములు ప్రదర్శించుటయే గాక సంబోధనలను సాభిప్రాయముగను సందర్భానుకూలముగను బ్రయోగించుటయు శ్రీరామకథాఽమృత కవుల ప్రత్యేకతగాఁ బేర్కొనఁదగియున్నది.

## సాభిప్రాయ విశేషణ విశిష్టములగు సంబోధనలు :

'శ్రీరామకథాఽమృతము' పార్వతీపరమేశ్వరుల నడుమ సంభాషణాత్మకముగా సాగినది. ఇందు శివుఁడు పార్వతిని సంబోధించిన పదములు సాభిప్రాయ విశేషణములై కథా భాగమున కన్వయించుచు సహృదయ హృదయంగమములై కవుల ప్రయోగదక్షతను నిరూపించుచున్నవి. ఇవి వారికి మహేశ్వరి యెడఁగల భక్తిని, నామ పారాయణాసక్తినిఁ బ్రకటించుచు నైకసహస్రములుగా వెలయుచున్నవి. అట్టి విశేష మిందు స్థాలీపులాకన్యాయముగాఁ బరిశీలింపఁబడుచున్నది.

బాలకాండమున బాలురగు రామాదుల నామకరణ సందర్భమున 'భవ్య నామధేయ' [1] అనియు, సీత తోడిబాలికలతోఁ గూడి యాటలాడుచున్నదను నెడ 'బాల' [2] అనియు, శివధనుర్భంగ ఘట్టమును జెప్పుచు 'వికసితాబ్జవదన' [3] అనియు, దేవదుందుభులు మ్రోగినవని నుడువుచు 'దివిజ వినుత' [4] అనియు, రసపాకంబులాదిగాఁగల వస్తుసామగ్రి భావించునెడ 'భావినీ' [5] అనియు "రసోల్లాసినీ" [6] అనియు,

అయోధ్యాకాండమున గౌసల్య రామునిఁ బ్రీతితోఁ బరామర్శించు సమయమున "స్కందజనని" [7] అనియు, రాముఁ డరణ్యములకుఁ బోవ రాజు శోకమున మూర్ఛ మునిగినాఁ డనునప్పుడు "అబలా" [8] అనియు, సీత యమునానదికి మ్రొక్కినదని వర్ణించుచు "సద్గుణశీలా" [9] అనియు,

అరణ్యకాండమున రాముఁడు మునులు వేఁడ రాక్షస సంహారమునకై ప్రతిజ్ఞ సలిపినాఁ డనునెడ "దాక్షిణ్యనిధి" [10] అనియు, రాముఁడు ఖరదూషణాది రాక్షసులతో యుద్ధ మొనరించు సందర్భమున "జితారి" [11] అనియు, "క్రవ్యాద సంహారిణీ" [12]

---

1. 3 ఆ., 109 ప. 2. 4 ఆ., 156 ప.
3. 9 ఆ., 146 ప. 4. 9 ఆ., 152 ప.
3. 10 ఆ., 423 ప. 4. 10 ఆ., 522 ప.
5. 3 ఆ., 185 ప. 6. 4 ఆ., 224 ప.
7. 5 ఆ., 280 ప. 8. 1 ఆ., 135 ప.
9. 2 ఆ., 140 ప. 10. 2 ఆ., 205 ప.

అనియు'

కిష్కింధాకాండమున రామాదులు కిష్కింధ కేగుచు సప్తఋష్యాశ్రమము దర్శించునప్పుడు "సంప్రతీతవికాసా" [1] అనియు, రామశాసన మెఱిగించు లక్ష్మణుని గూర్చి చెప్పుచు "అసదృశవిభవా" [2] అనియు, వానర సేనల యుత్సాహము, ధైర్యము వర్ణించునెడ "అచలవంశాభరణా" [3] అనియు, "హరిచరితంబావేళ నతివేల రుచులకుఁబాలై యుప్పొంగె" నని ప్రశంసించుచు, "ప్రథితభావరసజ్ఞా" [4] అనియు వానరులు స్వయంప్రభ నివసించు గుహావిశేషములుగాంచి యచ్చెరువు నందిరని తెలుపుచు "సంఫుల్ల వారిజాక్షీ"[5] అనియుఁ దద్వైభవమును జెప్పుచు "భావలలిత" [6] అనియు,

సుందరకాండమున హనుమని లంకాపురప్రవేశ సందర్భమున "శ్రీకరీ" [7] అనియు, నాతఁడు పట్టణము నందలి విశేష శోభ తిలకించునెడ "విద్యారహస్యమూర్తి" [8] అనియు, సంగీతశాలలు దర్శించెనను సందర్భమున "గానప్రియా" [9] అనియు, అశోకవనసౌందర్యము మనోరంజక మనుచు "మనస్విని" [10] యనియు, హనుమ రావణ సైన్యమును, అక్షుని సంహరించినాఁ డనునెడ "చండికా"[11] అనియు, హనుమ రావణుని దర్శించి, లంకఁ గాల్చి రాముఁ జేరఁబోవు సందర్భమున "యశస్వినీ" [12] అనియు,

యుద్ధకాండము పూర్వభాగమున రాముని విజయయాత్ర సమయమున వానరవీరులు ప్రకృతి సౌందర్యము గాంచుచుఁ జనిరను సందర్భమున "లావణ్య

---

1. 1 ఆ., 276 ప.
2. 2 ఆ., 226 ప.
3. 2 ఆ., 283 ప.
4. 2 ఆ., 372 ప.
5. 3 ఆ., 67 ప.
6. 3 ఆ., 70 ప.
7. 1 ఆ., 177 ప.
8. 1 ఆ., 179 ప.
9. 1 ఆ., 209 ప.
10. 1 ఆ., 355 ప.
11. 3 ఆ., 138 ప.
12. 3 ఆ., 391 ప.

విధీ"[1] అనియు, ఇంకను సందర్భమునుబట్టి "లీలాభాషితోల్లాసినీ"[2] అనియు, "చిన్మయీ"[3] అనియు, "సంయమివంద్యా"[4] అనియు, "లాస్యోల్లాసా"[5] అనియు, "విధిప్రపూజ్య"[6] అనియు, "కలాసమగ్ర"[7] అనియు, "దేవతారాధ్య పదా"[8] అనియు;

ఉత్తరకాండమున పూర్వభాగము నందు హనుమచ్చరిత్ర వర్ణించు సందర్భమున 'విరవకాశములగు మునుల శాపవచనములు సావకాశములగు నజువరములను బాధించిన వనుచో' 'బహువిధిజ్ఞ' అనియు, (8 ఆ - 14 ప.) సీతారాములు కొలువుదీరి యుండఁ గనుఁగొను యోగ మందిన సభవారు సమాధి నిష్ఠులైనారను సందర్భమున "ఉపాసక సుముఖీ"[9] అనియు, ఇంకను నుత్తరభాగమున "శాంభవీ"[10] అనియు, కవులు యోగమునఁ గాంచి సీతారాముల వనవిహారమును వర్ణించిరను సందర్భమున "గుహాస్థితక్రమా"[11] అనియు నిత్యాదిగాఁ బ్రయోగించుట సాభిప్రాయసుందరము.

ఇట్లు పదప్రయోగవిషయమున ఈ రామాయణానువాదకుల సామర్థ్యము వెల్లడి యగుచున్నది.

## అలంకారములు :

'అలంక్రియతే అనేక ఇత్యలంకారః' అని అలంకారశబ్ద నిర్వచనము. అనఁగా వలంకరించునది యలంకార మని భావము. ఈ యలంకారపదము యోగరూఢపదమై కటకముకుటాదులను, యమకోపమాదులను సూచించుచున్నదని గోపేంద్రత్రిపుర హరుడు వ్రాసిచ్చినాఁడు.[12] అలంకారము కావ్యేందిర కలంకారములని భట్టుమూర్తి

---

1. 1 ఆ., 117 ప.
2. 4 ఆ., 123 ప.
3. 4 ఆ., 182 ప.
4. 5 ఆ., 286 ప.
5. 5 ఆ., 306 ప.
6. 8 ఆ., 42 ప.
7. 8 ఆ., 230 ప.
8. 9 ఆ., 146 ప.
9. 10 ఆ., 32 ప.
10. 1 ఆ., 17 ప.
11. 1 ఆ., 113 ప.
12. కావ్యాలంకార సూత్రాణి, 2 సూ., కామధేను వ్యాఖ్య, 7 పు., 17 ఫ.

కీర్తించినాఁడు.[1] విషయము చక్కఁగా విశద మగుట, చమత్కారమును కలిగించుట యలంకారముల ప్రయోజనముగా నెన్నఁదగియున్నది. గుణముల వలన కలుగు శోభను ద్విగుణీకృతము జేయుట యలంకారముల లక్షణముగా వామనుఁడు జెప్పినాఁడు. 'కావ్య శోభాయాః కర్తారోధర్మాగుణాః తదతిశయ హేతవ స్త్వలంకారాః'[2] దండియు 'కావ్యశోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే' అని చెప్పినాఁడు. ప్రాచీనులేగాక యర్వాచీనులును నీ యలంకారములను బహుధా ఆదరించుచున్నారు. భారతీయ సాహిత్యములోనే గాక పాశ్చాత్యుల సాహిత్యమునందీ యలంకారముల ప్రాచుర్యము కాననగును. 'సిమిలీ, మెటాఫర్, పెర్సానిఫికేషన్, ఎపోస్ట్రోఫ్, హైపర్‌బోల్, పన్, మొదలగు నలంకారము లాంగ్లమున గణనీయములు.

సర్వకావ్య సామాన్యములగు శబ్దార్థాలంకారములను శ్రీరామకథాఽమృత కవులు యథోచితముగ పెక్కు సందర్భము లందుఁ బ్రయోగించిన విధము మిక్కిలి ప్రశంస్యము.

## శబ్దాలంకారములు :

స్వరవైషమ్యయుక్తము లయ్యును శబ్దసామ్యము గల పదములను పలుమారు ప్రయోగించిన నది యనుప్రాస మగును.

అనుప్రాసశ్శబ్దసామ్యం వైషమ్యేఽపి స్వరస్యయత్

- సా. ద., 10 ప., 3 కా.

రాముఁ డరణ్యములకుఁ బోవ విషాదమున దశరథుఁడు -

ఎక్కడున్నవాఁడొ కద ....

చక్కదనాలతోఁట నెఱజాణతనమ్ములపేట మక్కువన్

నెక్కొనుకోట మేల్పెనరు నించిన బాట వరాలమూట

అని విలపించినాఁడు. ఇందుతోఁట పేట కోట బాట మూట మొదలగునవి అంత్యశబ్ద సామ్యము నంది యనుప్రాసగా నెన్నదగియున్నది. అలంకారికులు పేర్కొనిన

1. కావ్యాలంకార సంగ్రహము, 2 ఆ., 53 ప.
2. కా. సూ., 3 అధ్యా., 12 సూ.

1. ఛేకానుప్రాసము. 2. లాటానుప్రాసము, 3. వృత్త్యనుప్రాసము, 4. శ్రుత్యనుప్రాస 5. అంత్యానుప్రాస మను అనుప్రాస భేదము లన్నియు శ్రీరామకథామృతమున చక్కగాఁ బాటింపఁబడినవి.

యమకము : స్వరవ్యంజనముల సముదాయము పృథగర్థమున వరుసఁగా ప్రయోగింపఁబడుట యమకము.

సత్యర్థే పృథగర్థాయాః స్వరవ్యంజన సంహతేః
క్రమేణ తేనై వావృత్తిః యమకం వినిగద్యతే

— సా. ద. - 10 ప., 8 కా.

నీ తనయుల నడిగె నీత నయుల — బా. కాం. - 5 ఆ., 109 ప.

సిరులెసఁగ తారకాద్యా శరతతి శరతతినడంచె — బా. కాం. - 6 ఆ., 154 ప.

మనుమనిఁ గని చిరకాలము మనుమని — బా. కాం. - 6 ఆ., 292 ప.

దాశరథుల్కా రథు ల్గ ధీరతన్ — అర. కాం. - 2 ఆ., 61 ప.

## అర్థాలంకారములు :

ఉపమ : ఉపమానోపమేయములకు సాదృశ్యము చెప్పుట యుపమాలంకారము.

ఉపమాయత్ర సాదృశ్యలక్ష్మీ రుల్లసతిద్వయోః — చం. లో., 6 కా.

కవి కృత్యాదిని శంకర స్తుతినిఁ గావించు శరదృతువుతో బోల్చుట హృదయంగమము.

సరసులఁ దేర్చి హంసప్రకాశముఁ గూర్చి
పంకౌఘమెల్లెడఁ గ్రుంకనార్చి

— బా. కాం. - 1 ఆ., 14 ప.

ఇత్యాది విశేషణముల నుభయపక్ష సాధారణముగాఁ బ్రయోగించి శంకర సద్గురువరుని పేరి శరదృతు విభుం డనుట శ్లేషానుప్రాణితమైన యుపమాలంకారముగాఁ జెప్పఁదగియున్నది. భారద్వాజాశ్రమమును జేరు రాముని, ముని పూజాద్రవ్యముఁ గొని యెదుర్కొనినప్పుడు 'తేజము తేజమ్ము మొనయు తెఱఁగగపడ' నున్నదనుటయు నుపమాలంకారమే.

అనన్వయము : ఉపమానోపమేయత్వములు రెండు నొకే వస్తువునకు సంభవించినచో నది యనన్వయము.

ఉపమానోపమేయత్వం యదైకస్యైవ వస్తునః — చం. లో., 10 కా.

రాముని( గూర్చి జనకునితో( జెప్పుచు విశ్వామిత్రుడు -

పెద్దలకెల్ల( బెద్ద పృథివీవర ! రాము(డు రాము(డన్నిటన్

— బా. కాం., 7 ఆ., 200 ప.

అని చెప్పుట యనన్వయము. అట్లే శ్రీరామ గుణాభివర్ణన సందర్భమున "నతని కుపమాన మున్నదే యతనికత(డె సాటి యనవచ్చు(గాక ముజ్జగములందు" అనుటయు ననన్వయాలంకార లక్షితమగుచున్నది.

రూపకము : విషయి విషయముల కభేద తాద్రూప్యము( జెప్ప(బడినచో నది రూపకాలంకారము. న్యూనత్వాధికత్వానుభయోక్తి మూలకముగా నిది మూడువిధముల( జెప్ప(బడుచున్నది.

విషయ్యభేదతాద్రూప్యరంజనం విషయస్యయత్ రూపకమ్

— చం. లో , 17 కా.

సీత విద్యాభ్యాసమును గూర్చి ఇట్లు వర్ణింప(బడినది —

సతిహృద్వీధిని సూత్రధారకు'డు ప్రాంక్సంస్కారసంజ్ఞుండు స

మ్మతి నారిం జతగొంచు( జేరి రససంమగ్నుల్పరుల్గా(గ ధీ

ప్రతిసీరన్ వెలయించె విద్దియలపేరన్మించు మేల్బొమ్మలన్

స్మృతి దీపాలి వెలుంగ(జేసి విబుధుల్మెచ్చం బయోజాననా

— బా. కాం. - 4 ఆ., 171 ప.

సీత హృదయ మను వీథి యందు( బ్రాక్సంస్కార మను సూత్రధారకు(డు సమ్మతి యను నారీసహాయమున స్మృతి యను దీపాలి వెలిగించి ధీయను తెఱపై విద్యలను బొమ్మలను బ్రదర్శించినా(డు. రూపకము హృద్యము. ఇట్లే -

దత్త్వాపుణ్యమిమాం వీర సౌమ్యామభయదక్షిణాం

దిష్ట్యా వర్ధసి కాకుత్స్థ ! జయేనాఽమిత్రకర్శన !

— ఉ. కాం. - 1 స., 32 శ్లో.

అను శ్లోకమున కనువాదరూప మగు -

ఇమ్మహాక్రతు వొనరించి తెడరుహా(పి
తసుర పశువుల బాణాగ్నియందు వ్రేల్చి
తభయ దక్షిణ నొస(గితి వంపలకును
వెలయు(గాకింక జన్నము ల్వేనవేలు

— ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 41 ప.

అను పద్యమునను రూపకము హృద్యమై వెలయుచున్నది.

సందేహము : సందేహము సమానకోటికమై యాహ్లాదమును గూర్చుచున్నచో నది సందేహాలంకారము.

స్యాత్స్మృతి భ్రాంతి సందేహై స్తదంకాలంకృతి త్రయమ్

— చం. లో., 23 కాం.

భరద్వాజుని విందు వైభవమును ప్రశంసించు -

ముని జపయుక్తియో భువన మోహనశక్తియొ స్వప్నరక్తియో
ఘనవిహితై ంద్రజాలిక వికాసవిభక్తియొ యెన్న(బోల ది
య్యనువున( గండ్ల(గట్టినటులై కనుపట్టెడు( జోద్యమెట్టులో
ననితరవేద్య మియ్యది యనంత విలాసమనంగ( జెల్ల దే

— అయో. కాం. - 7 ఆ., 321 2ప.

అనుట సందేహాలంకారము.

ఉత్ప్రేక్ష : విషయమును విషయిగా సంభావించుట ఉత్ప్రేక్షాలంకారము. వస్తుహేతు ఫలాత్మకముగా నియ్యది మూడువిధములు.

సంభావనాస్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా

— చం. లో., 31 కా.

రావణు(డు వేదవతి చక్కదనంబు వర్ణించుచు నమూలకముగా -

కాలుద్రొక్కకపోవఁ గడఁగెఁగా చెలిమేని
కాంతి యన్నంతఁ గ్రొక్కారు మెఱుము

యిత్యాదిగా సంభావించినాఁడు. మెఱుపునకు చాంచల్యము సహజము. అట్టి సహజ ధర్మమునకు నహేతువును హేతువుగాఁ బ్రదర్శించుటచే నిది హేతూత్ప్రేక్ష.

అతిశయోక్తి : విషయము చెప్పఁబడక విషయి మాత్రమే చెప్పఁబడి విషయము విషయిగా నధ్యవసాయమును జెందుట యతిశయోక్త్యలంకారము.

రూపకాతిశయోక్తి స్స్యా న్నిగీర్యాధ్యవసానతః

— చ. లో., 35 కా.

ఆహంసడాయనిదొ తమ్మి విరికొలం
కా కోయిలకుఁ గాని యాకుఁగొమ్మ ....

— అయో. కాం. - 1 ఆ., 293 ప.

ఇందు రాముని( జెప్పకయే హంసాది పదముల నిర్దేశించుట హృద్యము.

వ్యతిరేకము : ఉపమానోపమేయములలో నొకదానికి విశేషము జెప్పఁబడినచో నది వ్యతిరేకాలంకార మనఁబడును.

వ్యతిరేకో విశేష శ్చే దుపమానోపమేయయోః

— చం. లో., 56 కా.

సీతాసౌందర్యవిభవమును బ్రకటించుచు బాహువులఁ గూర్చి ఇట్లు చెప్పఁబడినది -

వాడని పూసరుల్ మురువువాయని మేలి మృణాళముల్ ....

— బా. కాం. - 4 ఆ., 215 ప.

ఇట బాహువులు పూవులమాలతోఁ బోల్చఁబడినవి. బాహువులయందు వాడకుండుట యను విశేషము నిరూపింపఁబడుటచే వ్యతిరేకాలంకార మగుచున్నది.

పరికరము : సాభిప్రాయ విశేషణములు గలది పరికరాలంకారము.

అలంకారః పరికరః సాభిప్రాయే విశేషణే

— చం. లో., 61 కా.

భరతుఁడు రాముని భక్తిభావముతో సంభావించుచు -

నాకౌకస్తతిసంస్తుతి నీ కథలం బ్రథితులుండనీ, నామనమే
యేకముగఁ జాటిచెప్పెడు నో కమలాక్ష ! నిను బురుషోత్తముఁడనుచున్

— ఉ. కాం. - పూ. భా., 10 అ., 300 ప.

అనినట్లు వర్ణింపఁబడినది. ఇందు కమలాక్ష, పురుషోత్తమ పదములు రాముని విష్ణుత్వ నిరూపణమున సాభిప్రాయములై యలరుచున్నవి.

శ్లేష : శబ్దము బహ్వర్థములను సంశ్రయించినచో నది శ్లేష.

నానార్థ సంశ్రయః శ్లేషః — చం. లో., 63 కా.

అయోధ్యా పట్టణమును వర్ణించుచు బురమును సుపర్వవిలాసముగాఁ జెప్పుట శ్లేష.

మంగళదేవతాస్పదము మాన్యగుణాచ్యుత మాప్తభారతీ
సంగము బ్రహ్మవై భవ విలక్షణ మంచిత సర్వమంగళా
సంగవిదాఢ్య సజ్జన మహర్పతిభాసము చంద్రమఃకలా
ప్రాంగణ ముప్పురంబెటు సుపర్వవిలాసముగాదనందగున్

— బా. కాం. - 1 అ., 325 ప.

సుపర్వ విలాస మనగా దేవతల నివాస మనియు, పండుగలకు నెలవనియు నర్థద్వయము గావునఁ బద్య మంతయు నట్లే సమన్వయింపఁ దగును.

అప్రస్తుత ప్రశంస : ప్రస్తుతము నాశ్రయించినట్టి యప్రస్తుత వృత్తాంత వర్ణన మప్రస్తుత ప్రశంసాలంకార మగును.

అప్రస్తుత ప్రసంసా స్యాత్సాయత్ర ప్రస్తుతాశ్రయా

— చ. లో., 65 కా.

సీత రావణుని దూఱుచు -

క్షుధితకేసరినోటఁ జొనిపెదే హస్తంబు

నెత్తిపై మందర మెత్తి విడుతె — అర. కాం. - 3 ఆ., 123 ప.

యని పలుకుట యప్రస్తుతప్రశంసాలంకార హృద్యము.

ఆక్షేపః స్వయముక్తస్య ప్రతిషేధో విచారణాత్

—చం. లో., 72 కా.

కల్యాణరాముని కమనీయరూపసంపద యిట్లు వర్ణింపఁ బడినది -

కాంతిలో రసమబ్బెఁగాఁబోలుఁ గాదుపో

రసముపైఁ గాంతి నీరంధ్రమయ్యెఁ

— బా. కాం. - 10 ఆ., 257 ప.

ఇందాక్షేపము హృదయానందకరము.

యథాసంఖ్యము : క్రమికములకు క్రమముగా నన్వయముఁ జెప్పుట యథాసంఖ్యము.

యథాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః

— చం. లో., 108 కా.

వేదవతి చక్కదనము వర్ణించుచు ఆననము, మేను, కేలు, కుచద్వయి క్రమముగా చంద్ర సువర్ణ ప్రవాల చక్ర కలనల నొప్పుచున్నవని -

తన యాననము చిత్తమును సుప్రసాదమై

కువలయాహ్లాదంబుఁ గూర్చుచుండ

దన మేను నాసికయును భవ్యరూపమై

ఘన సదామోద సంఘటనఁగోర

దనకేలు నెమ్మోవియును సానురాగమై

సలలిత స్నిగ్ధత్వసరణి మెఱయ

దన కుచద్వయము కటియును యోగరూఢమై

యనిశాతిశయవృత్తతనువహింప

లీలఁ జంద్ర సువర్ణ ప్రవాల చక్ర
కలన లొప్పార సర్వాంగ విలసనము ల
మూల్యములుగాఁగ రాజిల్లు మునితనూజ
యాతని స్మయాబ్ధిముంచె నహార్యతనయ

బా. కాం. - 4 ఆ., 37 ప.

అని వర్ణించుట యథాసంఖ్యము.

లోకోక్తి : లోకోక్తి సమయోచితముగాఁ బ్రయోగించుట లోకోక్త్యలంకారము.

లోకప్రవాదానుకృతిః లోకోక్తి రితి భణ్యతే

— చం. లో., 156 కా.

సీత రావణునిఁ బరుసములగు మాటల నీసడించుచు -

రాజు చెట్టవాని రాష్ట్రమెల్ల హరించు
ననెడు మాట నిక్క మసుర! వినుము

— అర. కాం. - 3 ఆ., 152 ప.

అనినట్లు ప్రయోగింపఁబడినది. ఇచటి లోకోక్త్యలంకారము మనోజ్ఞము.

స్వభావోక్తి : జాత్యాది స్వభావమును జక్కగా వర్ణించినచో నది స్వభావోక్తి.

స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్తస్య వర్ణనమ్

— చం. లో., 159 కా.

సైన్యము నందలి వానరుల స్వభావముఁ జిత్రించుట స్వభావోక్తిసుందరము.

పేరెత్తి పిలుచుచుఁ బేరెమ్ములిడువార
లెగుచు కోర్కులకు నగ్గలయువారు

— యు. కాం. - పూ. భా., 1 ఆ., 144 ప.

అనుమానము : 'అనుమితికరణ మనుమానమ్' అను లక్షణము ననుసరించి సహృదయ హృదయంగమముగాఁ జెప్పిన ననుమానాలంకార మగును.

అతివకౌ నంబరం బగు టరయ నిజమ
కౌన లావణ్య జాహ్నవి ఘనత కెక్కె-
నందు వళులను వీచికలందగించె
నాభి సుడియు శ్రోణులు పులినములు నయ్యె

— బా. కాం. - 4 ఆ., 221 ప.

సంకరము : క్షీరనీరముల వలె రెండలంకారముల కలయిక సంకరాలంకారము.

నీరక్షీరన్యాయేనాస్ఫుటభేదాలంకారమేలనే సంకరః
— కు. ఆ., 253 పు.

విశ్వామిత్రుఁడు రాముని బహూకరించుట -

జిగివెన్నెలలు చిల్కు- నగుమోము నెలతెల్వి
కంబు జంబులు వికాసంబెనయుట
— బా. కాం. - 7 ఆ., 145 ప.

ఇత్యాదిగా వర్ణింపఁబడినది. ఇందు రూపక విరోధాభాసములు క్షీరనీరములవలె కలసి సంకరాలంకార మగుచున్నది.

ఇట్లు బహువిధములగు శబ్దార్థాలంకారములతో శ్రీరామకథా౽మృతము నాంధ్ర సరస్వతి కలంకారమై సార్థకమైనది. షడృతుశోభ నొకచో సంభావించినతీరు హృద్యమై కావ్యమున కలంకార మగుచున్నది.

పఱచిన విరులపై పైఁగ్రమ్మపూజడి, కుసుమాకరముసిరి కొమరు దెలుప
నగవు మల్లెలవిప్పు నవహర్ష బాష్పా ప్తి, గ్రీష్మశృంగారలక్ష్మిని గణింపఁ
జలువ పందిళ్ళనీడలు ముత్తెముల సరు, ల్వర్షాగమము కల్మివలనుసూప
గొడుగులు చామర ల్పిడములు పద్మాది, సంపత్తిశారదైశ్వర్య మొసఁగ
నెలయు ఫలసమృద్ధి హిమరస స్ఫూర్తిహే, మంతశిశిర కళల సంతరింప
గూర్మి ఋతువులాఋఁగూడి యప్పట్టునఁ బెండ్లివారిఁ గొలుచు పెనుపు దోఁచె.

— బా. కాం. 10 ఆ. 303 ప.

వాల్మీకి రామాయణమును రచింపఁగా సంస్కృత సాహిత్యమున ననేక కవిపుంగవులచే బహువిధ కల్పనాచమత్కృతులతో విభిన్న ప్రక్రియలలో రామకథ మనోహరముగా సంతరింపఁబడినది. రామాయణాంధ్రీకర్తలు తత్పూర్వ గ్రంథము లందలి విశేషములనేగాక దేశమున ప్రసిద్ధి వహించిన మఱికొన్ని ఘట్టములను గూడఁ గలిపి యనువదించినారు. శ్రీ తాడేపల్లి వారును పూర్వకవి క్షుణ్ణ మగు మార్గమునే యనుసరించి సంస్కృతాంధ్రము లందలి రామాయణేతర గ్రంథముల నుండి రామకథకు సంబంధించిన సన్నివేశాదికమును గ్రహించి తమ శ్రీరామకథాఽమృతమున సందర్భ సుందరముగఁ బ్రవేశపెట్టినారు.

## సంస్కృత గ్రంథముల నుండి గ్రహించినవి :

వేదవతీ చరిత్రము— వాల్మీకమున నిది యుత్తరకాండమునఁ జెప్పఁబడినది. కాని "ఆనందరామాయణము" న నిది బాలకాండముననే వర్ణింపఁబడినది. తెనుఁగున శ్రీకృష్ణరామాయణము నందు రావణుని వృత్తాంతము, వేదవతిచరిత్రము మొట్ట మొదటనే వివరింపఁబడినవి. శ్రీరామకథాఽమృతమున నయ్యది యట్లే వర్ణితము.[1]

సీత లంక యందుఁ బొడముట- రావణుఁడు గురునాజ్ఞ నామెఁ బెట్టె యందుంచి సముద్రమునఁ బడద్రోయుట- ఆమె జనకుని యజ్ఞభూమి గర్భంబున నుద్భవించుట మొదలగునవి బ్రహ్మవైవర్తక పురాణమున వర్ణింపఁబడినవి. ఆనంద రామాయణమున నిట్లే కలదు.[2] శ్రీరామకథాఽమృతమునీ కథాభాగము విపులముగా వర్ణింపఁబడినది.[3]

రాముని బాల్యక్రీడలను గూర్చి యానందరామాయణమున ముచ్చటింపఁ బడినది.[4] తెనుఁగున రంగనాథరామాయణమున నివి చెప్పఁబడినవి.[5] శ్రీరామకథాఽమృతమున నియ్యవి విపులముగా వర్ణింపఁబడినవి.[6] అట్లే విద్యాభ్యాసాదులు వర్ణించుట యానందరామాయణ ప్రభావము.[7]

---

1. బా. కాం.- 4 ఆ., 2-116 ప॥లు
2. సా. కాం.- 3 స.
3. బా. కాం.- 4 ఆ., 117-50 ప॥లు
4. సా. కాం.- 2 స., 23 శ్లో
5. బా. కాం.— 13 పు.
6. బా. కాం.- 3 ఆ., 165-85 ప॥లు
7. బా. కాం.- 3 ఆ., 223-85 ప॥లు

రావణుఁడు శివధనుస్సు నెక్కిడ యత్నించి పరాభవము నందుట యానంద రామాయణమున వర్ణింపఁబడినది. [1] శ్రీరామకథాఽమృతమున నది యాదరింపఁ బడినది. [2]

రాముఁడు శివధనుర్భంగముఁ గావింప నానందమున విశ్వామిత్రుఁడు రామునిఁ గౌగలించినట్లు లానందరామాయణమునఁ గలదు. [3] శ్రీరామకథాఽమృత మున నది యనుసరింపఁబడినది.

శివధనుర్భంగ ఘట్టమున భవభూతి విశ్వామిత్ర పాత్రవై శిష్ట్యము నుగ్గడించుచు సీతారాముల వివాహబంధము గూర్చుట పరమావధిగా సంభావించి యిరు పక్షములవారి కాతఁడే పెండ్లి పెద్దగాఁ గీర్తించినాఁడు. "యత్రదాతా గృహీతాచ స్వయం కుశికనందనః" ( ఉ. రా.- 1 అం., 17 శ్లో. ) ఆవిషయ మింద స్పష్టపఱుచుట సంభవించినది. [4]

ధనుర్భంగమునకు ముందే సీతారాము లిరువురుఁ బరస్పరానురాగమునఁ బ్రవర్తిల్లుట, యయోగవిప్రలంభము మున్నగునవి వర్ణించుట కానందరామాయణము స్ఫూర్తి నిచ్చుచున్నది. శ్రీరామకథాఽమృతమున నీఘట్టము విపులముగా వర్ణింపఁ బడినది. [5]

అజునిఁ జూడ వచ్చిన పురస్త్రీల సంభ్రమములు రఘువంశమున వర్ణింపఁ బడినవి.[6] శ్రీరామకథాఽమృతమునఁ గల్యాణమండపముఁ జేరు రాకొమరులఁ గాంచు నొయ్యారులను వర్ణించుటలోఁ దత్ప్రభావముఁ గాంచనగును. [7]

---

1. సా. కాం.— 3 స., 67-79 శ్లో॥లు
2. బా. కాం.- 4 ఆ., 289- 93 ప॥లు
3. సా. రా - 3 స., 56 శ్లో.
4. బా. కాం.- 9 ఆ., 130 ప.
5. బా. కాం.- 8 ఆ., 43-188 ప॥లు
6. రఘు. వం.- 6 స., 6-12 శ్లో॥లు
7. బా. కాం.- 10 ఆ., 306-19 ప॥లు

సీతారాముల వివాహానంతరము పెండ్లి వారు భోజనాదికములు నిర్వర్తించి నట్లు లానందరామాయణమునఁ గలదు.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యది యనుసరింపఁ బడినది.

వాల్మీకి సుందరకాండ యందు హనుమంతుని ద్వార రామునకు సందేశ మును బంపు సీత ముఖమున "కాకాసుర వృత్తాంతముఁ" జెప్పించినాఁడు. నిజమునకీ యితివృత్తము చిత్రకూటముననే ప్రవర్తిల్లినది. చిత్రకూటమున నిది యొక నాటి వృత్తముగా నానందరామాయణమున వర్ణింపఁబడినది.[2] రఘువంశమునను, పద్మ పురాణమునను నీ కథ యిట్లే కలదు. శ్రీరామకథాఽమృతమున నయ్యది యనుస రింపఁబడినది.[3]

దేవాసుర సంగ్రామమున దేవతలకు సాయమొనరింపఁబోయిన దశరథుని రథమునం దిరుసు సీల రాలిపోగా కైక చేతి వ్రేలిడి దాని రక్షించినట్లు లానంద రామాయణమునఁ గలదు.[4] శ్రీరామకథాఽమృతమునఁ దదను గుణముగా వర్ణింపఁ బడినది.[5]

భరతుఁడు రామార్పితమైన మనంబున బ్రహ్మముని వలె నున్నాఁడనుట యానంద రామాయణమునఁ జెప్పఁబడినది.[6] శ్రీరామకథాఽమృతము నందు భరతుని పాత్రచిత్రణమున నానందరామాయణ ప్రభావ మధికముగాఁ గానవచ్చుచున్నది.[7]

శబరి పండ్లు రుచి చూచి రామలక్ష్మణులకు భక్తితోఁ బెట్టుట పద్మపురాణమున వర్ణితము.[8] శ్రీరామకథాఽమృతమున నావిషయ మనుసరింపఁ బడినది.[9]

---

1. సా. కా.- 3 స., 23-7 శ్లో॥లు
2. సా. కా.- 88-90 శ్లో॥లు
3. అయో. కాం. - 8 ఆ., 5-10 ప॥లు
4. సా. కా.- 1 స., 78-80 శ్లో॥లు
5. అయో. కాం.- 2 ఆ., 125-6 ప॥లు
6. సా. రా.- 6 స., 19 శ్లో.
7. అయో. కాం.- 9 ఆ., 405-12 ప॥లు
8. తత్త్వదీపికావ్యాఖ్య, అర. కా. - 74 స., 17 శ్లో.
9. అర. కాం. - 4 ఆ., 298-99 ప॥లు

## ఆంధ్ర గ్రంథముల నుండి గ్రహించినవి :

భాస్కర రామాయణమున మల్లికార్జునభట్టు 'అయోధ్యాపురమును మూల గ్రంథము నందున్న దానికంటె హెచ్చుగా వర్ణించియున్నాఁడు. ఈ పురవర్ణనలో ప్రౌఢప్రబంధరీతి నవలంబించి గజాశ్వాది వర్ణన మొనర్చియుండెను'.[1] (బా. కాం. - 27-43 ప.) శ్రీరామకథామృతమున నీ ప్రభావము సుస్పష్టముగాఁ గాననగును.[2]

వసంతర్తువు రాఁగా దశరథుఁడు తనసతులతోఁ గూడి వనవిహార జలక్రీడాదుల సలిపినట్లు రామాభ్యుదయమున వర్ణితములైనవి.[3] జె. వి. సుబ్బారాయుఁడుగారీ విషయము 'ఈ కావ్యమున ప్రథమాశ్వాసమున నున్న దశరథ వనవిహార జలక్రీడాదులు రామభద్రుని స్వకపోల కల్పితములు'[4] అని వివరించియున్నారు. శ్రీరామకథామృత మున నీఘట్ట మతి విపులముగా వర్ణింపఁబడినది.[5]

రామాభ్యుదయమునఁ గౌసల్యాదుల గర్భ లక్షణములు వర్ణిపఁబడినవి.[6] అమూలకమగు నీ ఘట్టము శ్రీరామకథామృతమునం దనుసరింపఁబడినది.[7] సంస్కృతమున 'రామాభ్యుదయము'ను గ్రంథము గలదు. అయ్యది సాళువ నరసింహ రాయలు వ్రాసినట్లు ప్రతిసర్గలోను గద్యము వ్రాయఁబడినది. 5 సర్గలో మాత్ర మరుణ గిరినాధుఁడు వ్రాసినట్టులుట్టంకింపఁబడినది. రామాభ్యుదయకవి అయ్యలరాజు రామ భద్రుఁడా సంస్కృతము నందలి భావముల ననుసరించినాఁడు. చూ. రామాభ్యుదయ వైభవము. శ్రీ డా. కొత్తపల్లి విశ్వేశ్వరశాస్త్రి.

---

1. భా. రా. - పీఠిక, శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులు
2. బా. కాం. - 1 ఆ., 273 - 328 ప॥లు
3. రా. అ., 1 ఆ., 161-211 ప॥లు
4. ద్విపదరామాయణ భారతి, 76 పు.
5. బా. కాం - 2 ఆ., 72-105 ప॥లు
6. రా. అ , 3 ఆ., 80 6 ప॥లు
7. బా. కాం. - 3 ఆ., 2-22 ప॥లు

గౌతమాశ్రమమున నింద్రుఁడు కోడియై కూయుట రంగనాథ రామాయణమునఁ జెప్పఁబడినది.[1] శ్రీరామకథాఽమృతమున నయ్యది వర్ణింపఁబడినది.[2]

గుహుఁడు రాముని పాదములు గడిగి పడవ నెక్కించుకొనుట మొల్లరామాయణమున వర్ణింపఁబడినది.[3] శ్రీరామకథాఽమృతమున నట్టిది యాదరింపఁబడినది.[4]

విభీషణుఁడు రావణునిచేఁ బరాభవింపఁబడి తల్లి కైకసిఁ జేరి, రాముని శరణు వేడఁబోవ ననుమతిఁ గొనుట రంగనాథ,[5] భాస్కర[6] రామాయణములందు వర్ణింపఁబడినది. మఱియు కృష్ణశ్రీ సంపాదితమగు 'స్త్రీల రామాయణపు పాటలు' అను గ్రంథమున 'లంకాసారథి' అను ఘట్టమున నిది వర్ణితము. శ్రీరామకథాఽమృతమున నీఘట్టమట్లే యనుసరింపఁబడినది.[7]

ఉత్తరకాండమున సీతారాముల వనవిహార ఘట్టము కంకటి పాపరాజు ప్రౌఢమగు వర్ణనలతో విపులముగా వర్ణించి యున్నాఁడు[8] శ్రీరామకథాఽమృతమున మూలాధికమగు నట్టి వర్ణనమున కాతని రచనయే స్ఫూర్తినిచ్చినది.[9]

ఈ కవులు రామాయణేతర గ్రంథముల నుండియుఁ గొన్ని కథాంశములను గ్రహించి శ్రీరామకథాఽమృతమున సమయోచితముగ నిరూపించినారు. కొన్ని సన్నిశములు యథాతథముగ నున్నవి. కొన్నింటి ప్రభావము మాత్రమే కలదు - వానినిఁ గూడ నీ సందర్భమునఁ బరిశీలించుట సముచితము.

---

1. బా. కాం. - 44 పు., వావిళ్ళవారి ప్రతి
2. బా. కాం. - 7 ఆ., 26 ప.
3. మొ. రా.
4. అయో. కాం. - 5 ఆ., 156-7 ప॥లు
5. రం. రా. - యు. కాం., 259-60 ప॥లు
6. భా. రా. - యు. కాం., 155-62 ప॥లు
7. యు. కాం. - పూ. భా., 2 ఆ., 267-72 ప॥లు
8. ఉ. రా. (కంకటి), 6 ఆ., 20-143 ప॥లు
9. ఉ. కాం. - ఉ. భా., 1 ఆ., 5-172 ప॥లు

## రామకథేతరము లయిన కావ్యముల ప్రభావము :

విశ్వామిత్రుని జన్మ ప్రకారము భారతమున వర్ణితము.[1] శ్రీరామకథామృతమున శతానందుఁడు విశ్వామిత్రచరిత్ర వివరించు సందర్భమున నా కథాభాగముగ్గడింపఁబడినది.[2]

మార్కండేయపురాణమున హరిశ్చంద్ర చరిత్ర వర్ణింపఁబడినది.[3] శ్రీరామ కథామృతమున విశ్వామిత్ర చరిత్రమున కనుబంధముగా నీ హరిశ్చంద్రోపాఖ్యానము వివరింపఁబడినది.[4] ఇయ్యదియు విశ్వామిత్రుని ప్రభావమును దెలుపు కథావిశేష మగుట సందర్భసుందరము.

స్కాందమునను, కాశీఖండమునను వింధ్యావారణ వృత్తాంతము వర్ణితము.[5] శ్రీరామకథామృతమున నగస్త్యుఁడు వాతాపీల్వలును బొడవడగించుట యను మూల కథాభాగముతోఁబాటు తన్మహిమాను వర్ణనము గావించు వింధ్యావారణ వృత్తాంతముఁ జేర్చి చెప్పఁబడినది.[6]

అరుణగరుడోపాఖ్యానము మహాభారతమునం దాదిపర్వమున నొక ముఖ్య ఘట్టము.[7] శ్రీరామకథామృతమున జటాయువు రామాదులకుఁదా నరుణుని సంతతిగా నుడువు మూలకథాంశమునకుఁ దోడు కశ్యప తనయులగు నరుణగరుడుల జన్మక్రమములు, వారి మహితోద్యోగ సంపత్ఫలవిశేషములు గీర్తింపఁబడినవి.[8]

---

1. శాం. ప. - 49 అధ్యా., 1-30 శ్లో॥లు
2. బా. కాం. - 7 ఆ., 228-35 ప॥లు
3. బా. కాం. - 8 ఆ.
4. బా. కాం. - 7 ఆ., 461-501 ప॥లు
5. కాశీఖండము, 2 ఆ., 148-64 ప॥లు
6. అర. కాం. - 1 ఆ., 233-45 ప॥లు
7. ఆం. మ. భా., ఆది. ప., 2 ఆ.
8. అర. కాం. - 1 ఆ., 324-33 ప॥లు

దశరథ బాల్యచరితము వాల్మీకమునఁ జెప్పఁబడలేదు. తన 12వ యేటనే రాజార్షియై సింహాసన మధిష్ఠించి, గ్రహగతి నవరింప శనైశ్చరునిపై దండెత్తి, యాతని జయించుట, శనిస్తోత్రము, వరదానము మున్నగునవి స్కాందమున వర్ణింపఁ బడినవి. [1] శ్రీరామకథామృతమున నిది యంతయుఁ జేర్చి చెప్పఁబడుటలో దశరథ చరిత్రకుఁ బరిపూర్ణత సంపాదింపఁబడినది. [2]

నైషధము నందు నలదమయంతుల వివాహసందర్భమున బువ్వముబంతి వేడుకలు విపులముగా వర్ణింపఁబడినవి. [3] శ్రీరామకథామృతమున సీతారాముల వివాహసమయమున నావేడుకలు వివరముగా వర్ణింపఁబడుట యందు నైషధ ప్రభావము గోచరించుచున్నది. [4]

నైషధమున దమయంతి నలుని యందనురక్తయై తద్విరహమునఁ బొగులుచు చంద్ర, మన్మథోపాలంభనములు గావించుట వర్ణింపఁబడినది. [5] శ్రీరామకథామృతమున సీత రామవిరహార్తయై చంద్ర మన్మథ మలయానిలోపాలంభములు గావించుటలో నైషథ ప్రభావము గణింపఁదగియున్నది. [6]

కుమారసంభవమున తారకాసుర విజృంభణ, దేవతలు బ్రహ్మతో మొఱ వెట్టు కొనుట వర్ణింపఁబడినవి. [7] శ్రీరామకథామృతమున కామాశ్రమ వర్ణన సందర్భమున 'కుమారసంభవ' ప్రభావము స్పష్టముగా గోచరించుచున్నది [8]

పోతన భాగవతమున వామనావతార ఘట్టము వర్ణింపఁబడినది. [9] శ్రీరామ కథామృతము నందలి సిద్ధాశ్రమ వర్ణన ఘట్టమున పోతన ప్రభావ మధికముగఁ

---

1. ప్రభాసఖణ్ణ, 49 అ.
2. ఉ. కాం. - పూ. భా., 9 ఆ., 201-39 పద్యాలు
3. 16. స., 16-130 శ్లో॥లు
4. బా. కాం. - 10 ఆ., 404-25 ప॥లు
5. 4 స., 43-110 శ్లో॥లు
6. బా. కాం. - 8 ఆ.,
7. 2 స., 1-64 శ్లో.
8. బా. కాం. - 5 ఆ., 159-80 ప॥లు
9. 8 స్కం.

గన్పట్టుచున్నది. [1] అట్లే శ్రీరాముని బాల్యక్రీడాదికములు పోతన రచించిన కృష్ణ లీలలను దలపించుచున్నవి. ఈ ఘట్టమున వేంకటప్పయ్యశాస్త్రిగారు భక్తితో రాముని బాలునిఁజేసి కూర్చుండఁబెట్టుకొని, వానితో నాడుచు పాడుచు నానంద రసపారవశ్యమున రచించిరని సమకాలికులగు పలువురు సాహితీవేత్తలగు సహృదయులు ప్రశంసించిరి. ఇట్టి కావ్యము బహుధా పండిత కీర్తనీయమై కవుల బహుముఖ ప్రజ్ఞావిలసనమునకు దర్పణముగాఁ బరగినది. (బా. కాం. 3 ఆ.)

శివపురాణము లీలాఖండము నందు హనుమంతుఁడు రుద్రవీర్యోద్భవుఁడని తెలుపు గాథయొకటి గలదు. శ్రీరామకథాఽమృతమున నగస్త్యుఁడు 'హనుమచ్చరిత్ర'ఁ జెప్పు సందర్భమున నీవిషయము వివరింపఁబడినది. [2]

గౌతముఁడు నారదుని ప్రేరణమునఁ దన యాశ్రమమునఁ బ్రసవించుచున్న గోవునకుఁ బ్రదక్షిణముఁగావించి, భూప్రదక్షిణఫలము నంది,యహల్యను వివాహమాడుట శ్రీరామకథాఽమృతమున భారతాద్యన్య పురాణములనుండి గ్రహింపఁబడి, వర్ణింపఁ బడినది. [3]

శ్రీరామకథాఽమృతమున నీవిధముగా నితర రామకథా ప్రధానములగు కావ్యముల ప్రభావమేగాక రామకథేతర కావ్యముల ప్రభావము గోచరించుచున్నది

1. బా. కాం. - 5 ఆ., 330 410 ప॥లు
2. ఉ. కాం. - పూ. భా., 8 ఆ., 16-19 ప॥లు
3. బా. కాం. - 7 ఆ., 15-18 ప॥లు

ఇందధికముగ బలి, రావణునకు వాసుదేవుని ప్రభావంబుఁ జెప్పిన తీరు హృద్యము.

అఖిల సర్జనకర్తయయిన పితామహుఁగన్నాఁడు నిజనాభికమల మందుఁ
బిన్నకుఁబిన్నయై పెద్దకుఁబెద్దయై, విశ్వవిశ్వంబున వెలసినాఁడు
చేపట్టినాఁడు విశ్వైషమాయామాత, యామహామాయవశ్యయయికొలువ
సకల సంహారంబు సలుపు రుద్రునితోడ, నంగాంగి భావంబు నందినాఁడు
వేదశాస్త్రపురాణాది వాదములకు, నందరానెన్నఁదగుచోట నమరినాఁడు
భక్తికెక్కటిఁజిక్కి మద్ద్వారసీమ, సొరిదిఁగావలిఁగాయంగఁజొచ్చినాఁడు

\- ఉ. కాం.- పూ. భా. 4 ఆ. 560 ప.

# 9. అనువాదకుల యాత్రీయత

శ్లో॥ బాలాం బాలాం ఫుల్లకల్హార పీఠీ
పాఠీనాక్షీం పుస్తకాభీ వరాక్షైః
భాస్వద్ధస్తాం సాంధ్య భాస్వత్సవర్ణాం
ధ్యాయే బాలాం గౌరవాష్టావధానే ॥

— శ్రీ రాఘవ నారాయణశాస్త్రి

కవి, కావ్యము నవినాభావ సంబంధముఁ గలవగుట కవిహృదయము ప్రతి బింబించు దర్పణము కావ్య మనుట నిర్వివాదాంశము. కావ్యము నందలి ప్రతి పాత్ర యందును కవి తాదాత్మ్యమును జెంది రచనఁ గావించినప్పుడే కావ్యము సజీవమై కల కాలము సాహిత్య ప్రపంచమున నిలుచును.

రామాయణ మొక రసవత్కావ్యపారిజాత మగుటయేగాక యధ్యాత్మ సుందరనందనమై హైందవసంస్కృతీ బంధురమగు మహితామ్నాయమునై భాసించు చున్నది. ఇందలి పాత్ర లతిలోకరమణీయములు. భారతీయ తత్త్వప్రతిష్ఠా పతాకములు.

శ్రీరామకథాఽమృత కావ్యనిర్మాతలగు శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి గారు, వారి తనయులు శ్రీ రాఘవనారాయణశాస్త్రి గారు నట్టి కోవకుఁ జెందినవారే యగుట మూలకావ్యము నందలి స్థాయి నందుకొని యాంధ్రీకరణమున నా పరమార్థము సుందరముగాఁ బ్రతిపాదించిరి. పితాపుత్రు లిర్వురు మూర్తిలోఁ గవితా మూర్తిలో సనాతన ధార్మిక సంప్రదాయ సంపద రూపుదిద్దుకొనినవారు. వారి యాత్మీయతలో నెట్టి విభేదముఁ గానరాదు. మహోదాత్త మగు రామాయణేతివృత్తమే తమ కావ్యవస్తువుగా స్వీకరించి సర్వార్థములు సుసంపన్నముగావించుట యందులకుఁ దార్కాణము. సంస్కారమునుబట్టి విషయ మవగతమగు ననుట యనుభవసిద్ధమే కదా! వీరు సహజముగ భక్తి పుంగవులు, తపస్సంపన్నులు నగుట నట్టి వ్యక్తిత్వ మాయా పాత్రల ముఖమున గోచరించుచునే యున్నది. శ్రీరామకథాఽమృతమున మూలాధికమై వారి యాత్మీయతను బ్రత్యేకముగాఁ బ్రదర్శింపఁదగిన విషయములీ ప్రకరణమునఁ జెప్పఁబడుచున్నవి.

> పొగడినఁ బొగడన యగు న
> య్యగణిత కల్యాణగుణుని యవతారకథల్
> నిగమనమని కలదే స
> న్నిగమాగమతత్త్వసారవిర్ణయ నిపుణా! - బా. కాం.- 3ఆ., 163 ప.

అని రాముని యనంతవిలాసములు సంభావించిన కవిహృదయము శివుని ముఖమున వర్ణింపఁబడినది. అట్టి దృఢాభిప్రాయమే శ్రీరామకథాఽమృత రచనమున శాస్త్రి గారికిఁ బ్రేరణ నిచ్చినది. అది 'సన్నిగమాగమ తత్త్వసారముగ నంతరింపఁబడి వారి నిపుణతకు విదర్శనమై యొప్పుచున్నది.

పొగడిన యదె పొగడగ నగు

జగతీధరతనయ ! రామచరితం బెల్లన్ — బా. కాం.— 3 ఆ., 32 ప.

అనునదియు రాము చరితము నెడ వారికిఁగల యభిమానమునకు, భక్తితాత్పర్యములకు నిదర్శన మనఁదగియున్నది.

రావణసంహార మొనరించి, భూభార తరణముఁ గావింపవేడుటకై బ్రహ్మాదులు విష్ణుని సందర్శింపఁబోయిరి. అట్టియెడ క్షీరసాగరమున శేషశయనుఁడై వెలుగొందు నాతనిఁ జేరి 'కను దమ్ములు గేల్దమ్ము లొక్కటఁజేయ మొగిడ్చి' -

శ్రీమత్ప్రశ్రయ హర్షభక్తి భయము ల్చిత్తాబ్జమం దొక్కటన్
సామానాధికరణ్యమంద నజుఁడంచత్స్వేదరోమాంచుఁడై
భూమిశ్రీ సహితుం బురాణపురుషుం బ్జాబ్యుం (త్రయీవేద్యుఁ) దే
జోమూర్తిం గనలేక కాంచి పొగడెన్ శ్రుత్యంత సూక్తంబులన్
- బా. కాం.— 1 ఆ., 236—7 ప॥లు

అని వర్ణింపఁబడినవి. ఇట బ్రహ్మ 'కనుదమ్ములు మొగుడ్చుట,' 'అంచత్స్వేద రోమాంచుఁడగుట' కూడనివి. కావున నట్టిది తద్భావభావనా భావితాంతఃకరణులగు శాస్త్రిగారి యనుభవ విశేషమే యని చెప్పఁదగియున్నది.

దశరథ తనయులకు నామకరణ మొనరించు సందర్భమున జ్యేష్ఠునకు "రామ" యను నామమిడినారని తన్మహాత్మ్యమును శివుఁడు పార్వతితోఁ జెప్పుచు రామపద మన సామాన్యనామపదము గాదనియు నది "లలిత శుభవర్గ యపవర్గలక్ష్మి మెచ్చు రమ్యపద మ" నియు వివరించి, మఱియు -

విను కల్మిచెలి దక్కఁగొను మర్ల మాతంగి
బ్రహ్మవిద్యావల్లి ప్రాకుఁగొమ్మ
చెడుఁగు రాకాసులఁ జీల్చు మహాశక్తి
చిమ్మచీకటి పిండుఁ జెండువెలుఁగు
కల్యాణవృష్టి మేల్కాంచు తొల్కాఱుమించు
దొనఁగు గూడెము లేర్చు తోఁకచిచ్చు
ఢీకొను వగల గుండెలలోన పెనుగాల
మఖిల-సిద్ధు లీడు సిద్ధాంజనంబు

యాతనాబ్ధిఁ గడవఁబెట్టు యంత్ర నౌక
యంతరాయ మహోత్పాత శాంతి మఖము
ముక్తి రామానుసంధాన మూలగురువు
రామనామ మనఁగ నగరాజతనయ

— బా. కాం. - 3 ఆ., 112 ప.

అని మూలాధికముగా సంభావించుటలో కవి రామభక్తి తాత్పర్యములు వెల్లడియగుచున్నవి.

సీతా సౌభాగ్య వర్ణన సందర్భమునఁ జెలికత్తెల నోట నమూలకముగా -

ఎన్ని నోములు మును నోమియున్నవార
మెన్ని పున్నెమ్ములన్నెఱిఁగన్నవార
మట్లుగాకున్న నమరునె యమ్మలార
యమరుల కలభ్య మగు నిట్టి యమృతధార

— బా. కాం. - 7 ఆ., 176 ప.

అని పలికించుట కవి తమకీ కవితామృతధార లభ్యమగుటకు సంతృప్తిఁబడిన విధమును సూచించుచున్న దనవచ్చును.

తాటక రామబాణనిహతయై శాపాంతమును బొంది రాముని స్తుతించుట శ్రీరామ కథామృతమున విపులముగ నభివర్ణింపఁబడినది.[1] అది యమూలకమై త్రికరణముల రాముని సేవించు కవియాత్మీయతను వెలార్చుచున్నది.

నినుఁ జిత్తసీమ నెఱి నిల్పివేఁడ బా
వనవృత్తి నీకథలు పాటఁబాడ నీ
మను వెప్ప జిహ్వ నలుమంగఁజూడ నా
కొనగూర్పు రామపదయోగి ! శ్రీహరీ !

— 5 ఆ., 295 ప.

సిద్ధాశ్రమమున యాగ పరిసమాప్త్యనంతరము మునులు సద్గోష్ఠిఁ గావించుచుఁ బ్రమాణపురస్సరముగ 'రామతత్త్వమే పరబ్రహ్మమ'ని సంభావించి యొండువృత్తులెడలి వితృతృప్తులై యానందించిరి.[2] అందు విశ్వామిత్రుఁడు రామునుద్దేశించి -

1. బా. కాం. – 5 ఆ., 287-95 పద్యములు 2. బా. కాం. - 6 ఆ., 6 ప.

ఎదురుచూచెదుఁ దలలెత్తి యీ పులకలు
తనివోకనీదు నేత్రమునఁ దవిలి
తెప్పపాటున మేలి మెప్పుగా దేరాలి
భాగ్యమట్టులు దృష్టి పంక్తికిపుడు
ధుర్యమౌ పలుకు మాధుర్యంబునకు శ్రుతి
నాశ్రయించెడు నాల్క యదనెఱింగి
కలిగె సంకల్ప వికల్పకల్పన మిథ్య
గా నేక లక్ష్యంబు కలిమి మదికి ....

— 6 ఆ., 8 ప.

ఇత్యాదిగా స్వానుభూతిఁ బ్రకటించినట్లు వర్ణించుట యమూలకమై రాముని దర్శించినట్టి యానంద మీ కవి యాత్మీయతను వెల్లడించుచున్నది.

వామదేవుఁడు రామదేవుని ప్రభావంబు నాగరుల కెఱిగించుచు

కలి కాలుష్యమడంచుఁ ద్రెంచు విపదాక్రాంతిన్ సమర్థించు ని
ట్టలమౌ సంపదఁ,దెల్పిఁబెంచు ద్విషదాడంబరంబు మాయించు మా
యల మంత్రంబుల సంచు, మంచు మిహిరుం డట్లాహరించున్ విని
ర్మల మీరామపదం బెదంగొలిపి సమ్భావింపుఁ డేవేళలన్

— అయో. కాం. - 4 ఆ., 42 ప.

అని తెలిపినట్లు విశేషముగా వర్ణించుట రామనామము నెడ గవికిఁ గల ప్రీతి గౌరవము విశదమగుచున్నది. అది వారికిఁ గల గాఢమగు విశ్వాసము కాఁగా శ్రీరామకథాऽమృతము రచించి జననంబు సార్థకంబు గావించుకొనినారు.

గుహుఁడు రాముని రాక విని సపరివారుఁడై యెదురేగి పూజించి 'రామమయమానసుఁడై' 'ప్రాణము లెల్లఁ బరమావధి' యగు నాతని భక్తితో సంభావించినట్లు వర్ణించినతీరు హృద్యము. మూలాధికమగు నయ్యది కవి యాత్మీయతను నిరూపించుచున్నది.[1] అట్లే శ్రీరామప్రభృతుల గంగఁ దాటించు సందర్భము నా

1. అయో. కాం. - 5 ఆ., 110.11 పద్యములు

గుహుఁడు 'నిన్నాపగ దాటించెద నన్నాపయిఁ జేర్పవె భవాబ్ధి యవ్వలిదరికిన్' అని ప్రార్థించినట్టు లమూలకముగా వర్ణించుటలోఁ గవుల యాశయమే వ్యక్తమగుచున్నది. మఱియు నచ్చటి ధీవరులు బోధకలనా సుధీవరులై –

రామన్న భావింపుఁ డేమన్న మోక్షంబు
రాదన్నలార ! యీ పాదరయుఁడు
రామన్న సంపదల్ రామన్న సేవింపఁ
బోమన్న యనుచుగారాము సూపు
రామన్నఁ బూజింపరా మన్న ల్గార్చు
రా మానమేలరా పామరుండ
రామన్న దేవుండు రామన్న కన్నయ్యా
రా, మముగన్న యీ రామ లక్ష్మి

రా, యనుచు రావదేర బిరాన యనుచు
రాపొనర్పంగఁ జెల్ల దురా, యటంచుఁ

— అయో. కాం. - 5 ఆ., 217 ప.

దములోఁ దాము పలికిరనుట కవుల హృదయమును స్పష్టపఱచు చున్నది.

రామాదులు వాల్మీకిమహర్షి ని సందర్శింప నాతఁ డర్ఘ్యపాద్యాదులు సమకూర్చి 'తన్మయ మానసుఁడై యనితర భావమున' రాముని బొగడిన విధము దెలుపుట యమూలకమై కవి రామభక్తి విశేషమును బ్రదర్శించు చున్నది.[1] అట్లే వాల్మీకి తన పూర్వవృత్తాంత మెఱింగించి తుదకు రామదర్శనమునఁ దనకుఁ గలిగిన స్వానుభవముఁ బ్రకటించిన విధము కవి యాత్మీయతను దెలుపుచున్నది.

కన్నులె మిన్నులిట్టి వినుఁగాంచుటఁ గర్ణ యుగంబు తృప్తి గై
కొన్నది నేఁటి నీనుడులఁ గోర్కె లెలర్పకయున్నె మున్నె రా
మన్ననుఁ గొన్న నాల్కకుఁ దదంచిత భాషణయుక్తి నింక నే
మన్నను దీఱ దింద్రియచయంబు ముదాత్మత మించె శ్రీహరీ !

— అయో. కాం. - 5 ఆ., 358 ప.

---

1. అయో. కాం. - 5 ఆ., 307-9 పద్యములు

అట్టి యింద్రియాతీతమగు యోగానందము ననుభవించిన కవుల ధన్యత ప్రశంసార్హము. వారి వాఙ్మయతపస్సున కిది ఫలముగా సంభావింపవచ్చును.

పాదుకా పట్టాభిషేకము సలిపి రామసేవలోఁ దదన్యమును మరచి భరతుఁ డనుభవించిన పారవశ్యమును జెప్పుచు –

కదిసె రాముండు శృంగార ధాముఁడటంచుఁ
    జెలఁగి యొక్కతటి మేల్సిరిఁ దలిర్చు
నవె జానకీజాని యడుగు కెందామర
    లనుచు నొకప్పుఁడాటాడఁజొచ్చుఁ
గలిగె నాథుని కటాక్షములంచు నొకవేళ
    నుబ్బితబ్బిబ్బుచెయ్యుల నొనర్చుఁ
బొనరెఁ దన్ముఖశశి స్ఫురణలం చొకమాఱు
    దృక్చకోరికల సంతృప్తిగూర్చుఁ

జొక్కు నొక్కెడ నొకపరి సోలు మేలి
పాటపాడు నొక్కొకసారి భజన నృత్త
గీతవాదిత్ర ముఖ్యము ల్గీలుకొలుపుఁ
బరవసము దన్నుఁ బొదువ నా భరతవిభుఁడు

— అయో. కాం. - 9 ఆ., 408 ప.

అవి మూలమునలేని యాతని యలౌకికత, రాజర్షిత్వము వర్ణించుట యాత్మీయమై యాతనికిఁగల రామభక్తి విశేషమును బ్రకటించుచున్నది. ఈ ఘట్టము లలిత మర్యాదుఁడగు ప్రహ్లాదుని శుభవర్తనమును దలపింపఁ జేయుచున్నది.' ఇట్లు రామ సందర్శన భాగ్యము సంధించిన మహోన్నత వ్యక్తి శ్రీ వేంకటప్పయశాస్త్రిగారు. అట్టి వారి యానందమే ఈ కావ్యరూపమున లోకమున కందించి యభినందనీయులైనారు.

అత్రిమున్యాశ్రమమున సీతాస్వయంవర వృత్తాంతము విని యనసూయ సీత నభినందించుచు -

మధురభాషిణి నీనుడి మధురమయ్యె
నా స్వయంవరవృత్త మనర్ఘ్యమయ్యె
విన్న యీ శ్రుతియుగము ప్రవీణమయ్యె
పలు పలుకులేల తపము సాఫల్యమయ్యె

ఆనందించితినమ్మా
శ్రీనందితమైన త్వద్విశిష్టకథా సం
ధానమున నిదియచాలును
సూనృతవాఙ్మయి ! యశేష శుభములు గూర్పన్

— అయో. కాం. - 10 అ., 234-5 పుటలు

అని పలుకుట యమూలకమై కవి యాత్మీయతగా నెన్నఁదగియున్నది.

హనుమంతుఁడు భిక్షురూప మవధరించి రామలక్ష్మణులను సమీపించి -

ఇంతగా ఫలించె నేనాఁటి సుకృతంబొ
యన్నలార ! నాదు కన్నుదోయి
కొదవె మేలిపండు వారుల కలభ్యమై
తనరు యుష్మదీయ దర్శనమున

అనియు,,

జన్మ సాఫల్య మందగాంచి
కాక కంటినె భవదంఘ్రి కంజవనము

— కి. కాం. - 1 అ., 51, 52 పుటలు

అనియు సంభావించినట్లు మూలాధికముగా వర్ణింపఁబడుట కవి స్వీయాభిప్రాయ ప్రకటనగా నెన్నఁదగియున్నది.

తార రాముని గాంచెనని చెప్పుచు -

అని దిక్కుల్పరికించి కాంచె జలదశ్యాము న్మహోద్దాముఁ బా
వననామున్ సుగుణాభిరాము వృతభాస్వద్దాము శృంగార ధా
ము నసత్యేతర కాము శ్రీవిజితకాము న్సజ్జన స్వాశ్రితా
వనకాము న్మఖిలక్ష్యసోము ధృతిదీప్యద్భూము శ్రీరామునిన్

— కి. కాం. - 1 ఆ., 373 ప.

అని యమూలకముగా రామగుణాభి వర్ణనముఁ గావించుట కవి భక్తిని, రామకీర్తనము నందలి యాసక్తినిఁ దెలుపుచున్నది.

విభీషణుఁడు రావణునిచేఁ బరాభవింపఁబడినవాఁడై తల్లి కైకసిఁజేరి యనుమతిఁ బడసి రామశరణార్థియై పోవుచు 'రామపదాసంజిత భక్తి పారమగు తత్త్వమునఁ' నాతఁడు రామునిసంభావించినతీరు శ్రీరామకథామృతమున నమూలకము,[1] కవి స్వీయభావమునై యొప్పుచున్నది. మఱియు నయోధ్యావాసులగు జనులు సీతతో లక్ష్మణునితోఁ గూడి పురముఁ బ్రవేశించు రాముని దృగుత్సవముగాఁగ గనుగొని 'దృఙ్మనస రసాయనము రామ మానసమున మననం బొనరించిరి. అయ్యదియే వారల కాత్మానందంబనుభూతి పదంబనఁగ నైనద'ని వర్ణించుట హృద్యము.[2] అమూలకమగు నీ భావము కవి యాత్మీయతను బ్రకటించుచున్నది. అట్లే -

మొలకనవ్వులతోడి ముచ్చటలందీర్చు
ధర్మసందేహ విదారితయును
గలికికాన్పులతోడి కన్నుల నందిచ్చు
సకలసమృద్ధి ప్రసాదితయును

బొమముడితోడి విస్ఫురణమైఁ బోకార్చు
దుష్టసంకల్పారి దూషితయును
నొచికంబుతోడివౌ నొయ్యారములఁబొల్చు
లక్ష్మీవిలాసోప లక్ష్యతయును

1. యు. కాం. - పూ. భా. 2 ఆ., 274-81 పఙులు

2. ,, ,, ,, 439 ప.

రామునందకాని రాణింప వెందును
మనము వానియందె మగ్నమయ్యె
తలఁతునెపుడు లోన దర్శింతుఁ దద్రూప
మెంతుగుణగణముల నెలమిఁగొంతు

— యు. కాం. - ఉ. భా., 2 ఆ., 597 ప.

అని శివుఁడు పార్వతితోఁ జెప్పి తద్భావనా భావితాంతః కరణుండయినట్లు వర్ణించుట యమూలకమై త్రికరణముల రామ సేవాతత్పరుఁడైన కవి యాత్మీయతను సూచించు చున్నది.

పట్టాభిషిక్తుఁ డగు రాముని బ్రశంసింప వచ్చిన యగస్త్యాది మునులు, 'మహీ జనామయములఁ దీర్పనౌ మహౌషధము, దుష్టామరారిహరము, మామహితము' నైన రామనామ మంత్రమహిమము నుగ్గడించుట యమూలకము. అట్టిది యాత్మీయమై కవి స్వీయాభిప్రాయ ప్రకటనముగా నెన్నఁదగి యున్నది.[1] అట్లే పరమేశ్వరుఁడు పార్వతితో -

అన్నిటను రామనామమె
సన్నతగాత్రీ లగింపఁ జాలునులే య
భ్యున్నతి నెలకొల్పగ శ్రీ
సన్నాహముతోడి సుప్రసన్నతఁ గూర్పన్

— అర. కాం. 3 ఆ., 345 ప.

అని చెప్పుటయుఁ గవీశ్వరుని భావముగానే గుర్తింపఁదగియున్నది.

కైలాసమును బెకలింపఁబోయి పరాభవము నందిన రావణుఁడు శివుని స్తుతించిన విధము మూలాధికమై కవి శివభక్తి తాత్పర్యములను బ్రకటించు చున్నది.[2] అట్లే రావణుఁడు నర్మదానదీతీరమున శివపూజ గావించు సందర్భమున మూలాధికముగా మంత్రశాస్త్ర సంప్రదాయ వివరణము సేసిన విధము కవి యాత్మీయత కు

1. ఉ. కాం. - పూ. భా., 1 ఆ., 43-6 పాలు
2. ఉ. కాం. - పూ. భా., 4. ఆ., 55-72 పాలు

విదర్శనమనఁదగి యున్నది. [1]

సీతతోఁగూడి రాముఁడు కొలువుదీరి యుండ నదన్యులాతనిఁ గని కనుదోయి మనంబున లయింప సమాధి వహించిరని వర్ణించుచు -

ఆ సిరినేలువానిఁ గనవొ గనుదోయి మనంబు నందె యు
చ్ఛ్వాసముదోఁపకే విలయసంగతి నంగతమౌటఁ దృప్తిమై
నాసలువాసి కోసల సుతాత్మజ భూతిమయం బయంబుగా
నా సభవారు వొందిన సమాధి వచింపఁదరంబె చిన్మయీ !

— ఉ. కాం. - పూ. భా., 8 ఆ., 31 ప.

అనుట చిన్మయులగు కవుల కనుభవమగు సమాధ్యవస్థా విశేషమునే వివరించుచున్నది. మఱియు నట్టియెడ భరతుఁడు -

దక్షిణనేత్రమం దెసఁగు తత్పురుషుండవు నీ వదక్షిణం
బక్షిణిఁ జెందియున్నది మహాత్మ! భవత్సతి సీత మిమ్ము నే
కక్షితి వేళవించి కనఁగానగు యోగికి నందె డెంద మ
ప్డే లయమంద బుద్ధికల యే తనుఁగొల్వగనౌ నధీశ్వరా !

యని రాముని సంభావించినట్లు వర్ణించుటయు స్వీయ యోగానుభవ ప్రకటనముగాఁ దెలియఁదగి యున్నది. నేత్రద్వయ మొకచోఁ జేర్చి చూచినవారికి మనసు లయించి యింద్రియాతీతసుఖ మనుభూత మగుట యోగిజనానుభవ గమ్యమగు విషయము.

రాముని వీడి తమ తమ నెలవులకుఁ జేరిన కవులు రామవిరహమును భరింపఁజాలరైరి. 'నాఁటికి నొక్కసారి యయినన్ రఘురామునిఁ జూడకుండుట' తమ దురదృష్టముగా భావించి తదన్యమును విరసించి యడవి యందు రాముని తీపి గుర్తులు తలపోయుచు, నతని నడవడులలో నన్నిరసములుఁ గలవని యనుభవంబులకుఁ జొచ్చి యరసి యరసి సంతసింపఁదొడఁగిరి. తుదకు హనుమని బోధల కగ్గమై రామాజస్ర కైంకర్య సంపద నెగడుచు బూవులుఁ గొనివచ్చి పూరుషోత్తము బొమ్మఁ

1. ఉ. కాం. - పూ. భా., 7 ఆ., 55-72 పలు

బూజింతు మేమని పోవువారు, వాని పవిత్రము అవ్యాదిగా నక్షేపమును మతి నవరువారు జగతిఁ గాననగు రూపము లన్నియు లౌకికరూపములే యని సేవలోనవ్వగాఁ జేరువారు, శ్రీరాముఁ డాత్మారాముఁడై నాడిపె యని నేత్రములు్మోగిచి ధ్యానింపువారు నగుచుఁ జేరనైరి. వనచరుల కయ్యెడ మునులకు లేని యేకాంతభక్తి కలిగినవి. అట్లు రామానుగ్రహపాత్రులగుచు నెనఁగునెడ –

> కనులఁగట్టినయ ట్లినుఁగాననైన
> వచ్చు నానందబాష్పము ల్వెచ్చెర నవి
> పోవ విరహాశ్రువులు దోఁచుఁ జో యెపేని
> గపుల కన్నుల తడి యాఱుగతి కలుగదు

– ఉ. కాం.- పూ. భా., 10 ఆ., 231 ప.

అమూలకమగు నిట్టి "కపుల నిర్వేదము" కవి యాత్మానుభవపూర్వక మగు భక్తిభావ బంధురతకు నిదర్శనమనుటలో సంశయములేదు. ఏకాంతభక్తి యనఁగా మిక్కిలి గాఢభక్తి. అవికలమని భావము.

సీతారాముల వనవిహారమును యోగదృష్టిఁ గల కవులు "మాకి పట్టె పట్టనుచు వాగ్వ్యాపార రమావిహారకలఁగొని" యనువర్ణించినతీరు నిత్యము శాస్త్రి గారు సేయు యోగాభ్యాస విద్యారహస్య విశేషము లనుట యతిశయోక్తికాదు. కావుననే యోగానుభవ ప్రకటనము సాధ్యముకానిదయ్యు శుకము నియతి చూచినది చూచినట్లే వర్ణింపనగునని చెప్పి యా యత్నమునకుఁ గడంగిపారము ముట్టిరి. "శుక మునియతి" యనియు నిట సంభావింపఁదగియున్నది.

> చూచునప్పుడు సుఖమునఁ జూపు మునుఁగు
> నొడువు నెడ సాగు మామూలు నోటిపాట
> చూచినది చూచినట్టులే శుకము నియతి
> వలచి వర్ణింప నగు నదో వైభవంబు

— ఉ. కాం.- ఉ. భా., 1 ఆ., 129 ప.

అట్టి వర్ణనము [1] యౌగికమమగు షట్చక్ర విహారణమై భాసిల్లు చున్నది. ఆపైవారు "వేయిరేకుల తామర విరివిధమున సంస్కృతమ్మవునచ్చోటఁ జేరిరి." ఇయ్యదియే

1. ఉ. కాం.- ఉ. భా., 1 ఆ., 128-70 పలు

సహస్రారము. అచటి సౌందర్యమనన్య సామాన్యము. అదియే యోగు లగు వారికెల్ల ననుభావంబులకు స్థానమై ప్రమోదావహమగుచున్నది. దీనినే సప్తమచక్రమందురు. తదుపరి "దృశ్యాదృశ్యముకద్దు తద్దిశ లపత్వీరంబు" ఇత్యాదిగా గురుపీఠమును వివరించి, యందు "సుఖ సంప్రసాదమన మాదేవుండు దీపించు" నని వివరించి సంపశ్యులకు గానఁగారాని యాయనిర్వచనీయమగు నానంద స్వరూపమును నిరూపించినారు. ఇదియే అష్టమచక్రము. సహస్రారమునకు బెత్తెడుపైనయని కొందఱు, బ్రహ్మరంధ్రమునకు బెత్తెడు వెనుకయని కొందఱుదీనినభివర్ణించిరి. పూర్ణదీక్షాపరులు, అనఁగా పాదుకాంత దీక్షితులగుయోగులకిది యనుభవ గోచరమగుచుండునని యభియుక్తులగు వారు చెప్పుదురు. అటగురుపాదకులు దర్శింపనగునట. ఈ ప్రకరణమున యోగానుభవముగలకవులు శ్రీరామగురుపాదుకలు దర్శించి ధన్యతములైనారు. ఇటజీవులయందు వర్ణించు "అష్టా చక్రా, నవాద్వారా" అనునారోక్తి సుఖలసుందరముగ వివరింపఁబడినది

ఆద్యులైన ఋషులు కథాభాగము నాధారముగాఁగొని పరమార్థమును బోధించి యిహపర సుఖములు ఘటించి, యలౌకికమగు బ్రహ్మమును శబ్దరూపమునఁ బ్రకటించి వాఙ్మయమును సుసంపన్నముఁ జేసినారు. అట్టి యార్షసంప్రదాయజ్ఞులగు శ్రీరాఘవనారాయణశాస్త్రి గారనుగ్రహ బుద్ధితో సామాన్యులకు గూడ నా యసామాన్యమగు యోగ విద్యఁదెలుపుటకై మధురముగా, మధురాక్షరముగా, నక్షరముగా, నిట్టు లక్షరబద్ధముఁ గావించి జగతి కారాధ్యులై వరలినారు.

ఇట్లు వాఙ్మనసాతీతరూపుఁడు ననంత శక్తిసంపన్నుఁడు నైన పరమ పురుషుఁడు దశరథరాముఁడై పొడమి లోకకంటకుల నిహతుల గావించి స్వాశ్రిత సజ్జనావలిఁ బ్రోచి యోగమునఁ బరతత్త్వరూపుఁడై యనిర్వచనీయస్థితిఁ దనరినాఁడని వర్ణించి యాద్యంతము నత్యంత సమర్థతతో నిర్వహించి తమ తత్త్వవేతృత వెలార్చినారు.

ఆశ్రమ ప్రాంతమున భర్తృపరిత్యక్త యగు సీత రోదనము విని శిష్యులు దెలుప వాల్మీకి మహర్షి "బాలవచనములను బ్రహ్మవచనములను నొకటి సేసి బుద్ధి సంబద్ధంబు నిశ్చయించి వెడలినాఁడ" ని చెప్పుచు నాతని తపోదృష్టినిఁ గీర్తించుట కవికిఁ గల తపోభిమానమును బ్రకటించుచున్నది.

అక్షులు గలవందఱకుం

జక్షుష్మంతుండు వాడె సంపాదించెన్

నక్షత్రము తపమున నొక
యీక్షణ మెక్కుడుగ దాన నెఱిఁగికొనె గతిన్
- ఉ. కాం.- ఉ. భా., 2 ఆ., 238 ప.

శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు తమ "త్రిశంకుస్వర్గ" మను నాటకమున "నుపాసన మేరికి నెంత సేయదు" అని సరస్వతి ముఖమునఁ బలికించుటయు వారికిఁగల విశ్వాసమును దెలుపుచున్నది. ఆత్మీయమగు ననుభవ మట్టిదేయగుట సత్యము.

అట్లే భరద్వాజుఁడు భరతునకు విందు గావించిన సందర్భమున నా యెంత చందమెదలో నెంచి విద్యావంతుఁడు విశ్రాంతిఁ జెంది-

ఒక్కొకట నొక్కొకఁడు నతి
కెక్కిన సిరి నెరసెనేమొ యెనసి సకలమీ
చక్కఁగను గంట నెక్కొనెఁ
దక్కొలనరాదె యెదియుఁ దాపసు నెఱికిన్
- అయో. కాం.- 7 ఆ., 323 ప.

అని "యనితరవేద్య, మనంతవిలాసము" నైన ముని తపశ్శక్తి గౌరవము నుగ్గడించుట కవి యాత్మీయతను బ్రకటించుచున్నది.

భక్తి కర్మయోగములు జ్ఞానస్థితి నంది కైవల్యము నొసంగుచున్నవి శ్రీరామకథాఽమృత కవులు పితాపుత్రు లిద్వరు భక్తి కర్మ జ్ఞానములఁ సేవించిన సముదాత్త జీవితగాములు. అద్వైతము వారి యభిమత సిద్ధాంతము. అట్లని యన్యము దూష్యము గాదు. విశిష్టాద్వైత సిద్ధాంతాదు లెడనెడ వివరింపఁబడుట యందులకు నిదర్శనము. సీతారాముల యశోకవనవిహార ఘట్టమున వారద్వైత సుఖ మనుభ వించుచున్నారను సందర్భమున నిట్లు చెప్పఁబడినవి.

బిందునాదకలాతీత భేదరహిత
వాద దురవాప నామరూప ప్రకార
తా నవచ్ఛిన్న కేవలత్వావభాస
మాన మద్వైత సుఖ మభిమత మతంబు
- ఉ. కాం.- ఉ. భా., 1 ఆ., 165 ప.

ఉపనీతుఁ డగు రాముఁడు తన యజినాది చిహ్నధారణములతో నొప్పుచు నద్వైతమును బ్రకటించుచున్నాఁ డను శివుని నోట హరిహరాద్వైతము నిరూపింపఁ బడినది. కృత్యాదిని హరిహర బ్రహ్మమును గీర్తించిన వీరికిదియే యభిమతము.

తనకు నాకు భేదమనరాదుగాన ని
య్యిరవెఱుంగఁజేసె నెల్లవారి
కన నతండు వొల్చె నజినాది మామక
చిహ్నధారణమునఁ జిత్ప్రకాశ !

– బా. కాం.- 3 ఆ., 210 ప.

మఱియు విష్ణుభావ సౌందర్యగర్భిత మగు రాముని స్వరూపాదుల నెంత శ్రద్ధగాఁ జిత్రించిరో శైవము నంత భక్తితో నభివర్ణించిరి. హరిశ్చంద్రో పాఖ్యానమునఁ బరమేశ్వరుఁడు దర్శన మిచ్చినట్లు వర్ణించినవిధము హృద్యము. అమూలక మగు నిది వారి యాత్మీయతను వెల్లడించుచున్నది.

సికమీఁది పూబంతిఁ జిందు మరందమౌ
చదలేటి వలపునఁ బొదలుప్రోడ
సామేని చొక్కాట మే మెచ్చి తక్కిన
నెమ్మేని మఱపున నెగడు మేటి
యగ్నిశిఖాంచితమగు చుక్కబొట్టున
మదను దర్పోద్ధతి మలఁచుదంట
తలమానికముల తళుక్కలమించు పాప పే
రుల సంగడమ్మున వెలయు వలఁతి
మునులు వేల్పులుఁ దనతోడ మొనయుదేర
వాగ్రమేశ్వరు లుభయ పార్శ్వములఁ జెట్టఁ
బట్టి రా గట్లరాయని పట్టి చెలువుఁ
దట్టె చూపట్టె విశ్వేశుఁ డరుస మెసఁగ

– బా. కాం. 7 ఆ., 495 ప.

వట్టాభిరాముని( జూచి -

సీతావిభవ మంక సీమాచితముగా(గ

మొగమున నగవుల మొలక లె_త్త(

దనచేతి ధర్మంబు ననుజు(డింపున(దాల్ప

నభయముద్రాంకిత హ_స్తమొప్ప(

దను(గొల్చువారి చి_త్తము లేకరసములై

యానందఘాయ_స్వ మంది వెలయ

నిటు నటు కాని కాన్పెలమికి( గుదురొచు

మునుల శాంభవిముద్ర ముచ్చటింప

సింహముఖ దివ్యపీఠికాసీను( డగుచు(

గనుల కలిమి దయావృష్టి( గడలుకొన(గ

లోకమేలెడు శ్రీరాము నేకమూ_ర్తి

యార్తు లెడలించు( గావుత మాత్మ నిలిచి

— ఉ. కాం.— ఉ. భా., 1 ఆ., 226 ప.

అని కన్నుల నానందము( గొనియాడుచు( బలుకు పరమేశ్వరుని భావము కవీశ్వరుని యాశయమేగాని యొండుగాదు. అట్లె

సౌమిత్రి హ_స్త సంశోభితంబైన, యిష్వాసమరుల దుష్టేచ్ఛలడ(ప

భరతుని మూ_ర్తితో భాసిల్లుభావంబు, పరులకు భ_క్తి సంపదలుగూర్ప

శత్రుఘ్ను నౌచిత్య సరణి సంచారంబు, సర్వకార్యముల సుస్థలముల(జేయ

నర్ధాంగియైన సీతమ్మ కటాక్షమ్ము, లాశ్రితార్తుల నెల్ల నవల( దోల

సకల గుణజాలములకు సంశ్రయు(డవయ్యు

నగుబు( దానందసాంద్రు(డన్న గరిమమున

సింహముఖ పీఠి నెక్కొ_న్నసిరి( దలిర్ప

నీప్రజల చి_త్తభిత్తుల నిలుపుమయ్య.

- ఉ. కాం. పూ. భా. 10 ఆ. 15 ప.

అని వైతాళికులు సంప్రార్థించినట్లు వర్ణించుట శాస్త్రిగారి యాత్మీయమగు నభిలాషయే

కాని వేరుకాదు. "అనుసూతుల నూతన స్తవరాజములతో సమ్మానవసమ్మానితమూర్తి శ్రీరామచంద్రుని మేల్కొల్పి" రని వర్ణించుటయు నీయభిప్రాయమును ధృవపరచు చున్నది. ఇందు "ధారుణీధరా ! యవధారు .... ఇత్యాది వచనరచన శ్రీరామగుణ కీర్తన మొనరించునదై విబుధజన సంభావనీయ మగుచున్నది.

ఇందింకను వేదశాస్త్ర సంప్రదాయములు పాటించి వివరించుట; ఆర్ష జీవిత వైభవము నిరూపించుట; ఆదర్శదాంపత్యము; గుణగరిష్ఠులగు స్త్రీపురుషుల స్వరూప స్వభావములు చిత్రించుట; ధర్మము నుగ్గడించుట; తత్త్వమును బ్రకటించుట; నైకవిద్యా రహస్యము లావిష్కరించుట; మునిభావ మెఱుఁగజేయుట; రాముని చరితము నందలి "సారాంశముఁ" దెలుపుట మొదలగున వన్నియు నమూలకముగా వర్ణింపఁబడుట వలన నవి శ్రీరామకథా౽మృత కావ్యశిల్పనిర్మాణదక్షులగు నీ పితాపుత్రు లిరువురి యాత్మీయతను జక్కగా నిరూపించుచున్నవి.

కావ్యము యొక్క విశిష్టత సాహిత్యలోకమున నది సంపాదించుకొనిన స్థానమునుబట్టి తెలియ నగుచున్నది. కావ్యతత్త్వవిదులగు సహృదయులు, సద్విమర్శకులు నట్టిస్థానము నిర్ణయింప సమర్థు లగుచున్నారు. కవి కావ్యమును గూర్చి కథా భాగమునఁ బాత్రలముఖమునఁ బరోక్షముగాఁ జెప్పించిన విధమును బరిగణింపఁదగియున్నది. శ్రీరామకథాஉమృత వైశిష్ట్యమును గూర్చి యెవ్వరేవిధముగా నభిప్రాయపడిరో యీ ప్రకరణమునఁ బరిశీలింపఁ బడుచున్నది.

లోకమున వాల్మీకమునకు నధ్యాత్మమునకు వేరు వేరుగా ననువాదములు గలవు. రెండును నేకకాలమున నొకే గ్రంథముగా సంతరించినవా రరుదు. 'శ్రీ వాల్మీకి సంయమి వరకృతి నాంధ్రీకరించుచు నధ్యాత్మరామాయణ ఘట్టము లిందుఁజేర్చుచు' వ్రాయఁబడిన యీ గ్రంథము కథా తత్త్వముల రెంటిని దనలోఁ బొదుగుకొని విశిష్టత సంపాదించుకొనినది. నాగలింగమ్ వేంకటేశ్వరశాస్త్రిగా రీవిషయమున 'ఉభయ రామాయణ ధోరణుల నుట్టంకించినను ఈ గ్రంథము కథావ్యత్యాసాదులకు తావీయక సుపరిష్కృతమై ఏకముఖంబునం బారు గంగా యమునా ప్రవాహములంబోలి పావనమై వెలారుచున్నది'[1] అని యభిప్రాయపడిరి. శ్రీరామకథాஉమృతమా రెండు గ్రంథములు పఠించిన ఫలము నేకకాలమున నొసంగుటకు సమర్థమగుచున్నది.

సీతా కృత భూప్రవేశ సందర్భమున సంక్రుద్ధుఁడగు రాముని యూరడించి శాంతునిఁ గావించుచు బ్రహ్మ, "సర్వసద్గుణములు నీయందు పరిపూర్ణములైనవి సచ్చరిత్రుఁడవైన నీకంటె నన్యుల కెవ్వరికినీ కావ్య నాయకార్హత లేదు. కావున వాల్మీకి నీయీ శుభచరిత్రమెల్ల నాదికావ్యము (రామాయణము) గా సంతరించినాఁడు" అని పలికినట్లు వాల్మీకమునఁ గలదు.

> ఆది కావ్య మిదం రామ త్వయి సర్వం ప్రతిష్ఠితమ్ ।
> నహ్య న్యోஉర్హతి కావ్యానాం యశోభాక్ రాఘవాదృతే ॥
>
> ఉ. కాం. 98 స. 18 శ్లో.

అట్టియెడ శ్రీరామకథాஉమృతమున

> శ్రీకల్యాణ గుణాంచిత ! నీకేతగుఁ గావ్య వర్ణ నీయత్వము వా
> వాల్మీకికి తగుఁ గవిపద మీ, ప్రాకట కావ్యాఖ్య తగు భవత్కృతికి విభూ ॥

---

1. శ్రీరామకథామృతము (వ్యాసము) - బా. కాం., పీఠిక

రామకథాఽమృతమనఁగా, నీమహిత చరిత్ర మెన్న నిపుణము, పుణ్య
మ్మామము కొన భువి జనించెద, రీముని కవితాబ్ధి నమృత మెత్తి యిడఁగవుల్
ఉ. కాం. ఉ. భా. 8 ఆ. 120-21 పaలు

అని చతుర్ముఖుఁడగు బ్రహ్మ పలికినట్లు వర్ణింపఁబడినది. ఇందు శ్రీరామకథాఽమృతము వాల్మీకిముని కవితాబ్ధిఁ బొడమిన యమృతముగా సంభావింపఁబడినది. "ముని భావరహస్య వివరణమే" యీ కావ్యమునకు సార్థకతను సంపాదింపఁజేయ నిది యమృతమై రామకథా వాఙ్మయమునఁ బరమ విశిష్ట స్థానము నందుకొనినది.

మందరపర్వతము గవ్వముగాఁ గొని, వాసుకి త్రాడు కాఁగా సురాసురులు క్షీర సాగరమథనము గావింపఁ దొలుత విషాదు లెన్నియో వెలువడినవి. తుదకెట్లో విశేష ప్రయత్నమున నుద్భవించిన యమృతము బహుజనశ్రమైక సాధ్యమైనది. ఆదియు మోహినిచేఁ బంచిపెట్టఁబడి యొక పక్షమువారికే లభించుటయు సంభవించినది. శ్రీరామకథాఽమృత మెట్టి శ్రమయు, ననర్థము లేక విలక్షణమై విశిష్టమై సర్వామోద మును గూర్చు చున్నది. మఱియు నది దివ్యులకేగాక సర్వుల దివ్యులఁజేయుచు సాహిత్యప్రపంచమున సహృదయుల కెల్లర కత్యంత ముపాదేయమై యలరుచున్నది. కావుననే శ్రీ ముళ్ళపూడి నారాయణశాస్త్రిగారు -

నమందరో నాఽపిచమోహినీ శ్రమో
న దివ్య దైత్యాలపి నాఽపి శేషః
విషోద్గతి ర్నాఽపిచ సర్వ మేత
ద్విలక్షణం రామకథాఽమృతేఽభవత్ [1]

అని శ్రీరామకథాఽమృతము నభివర్ణించినారు. శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారును 'దేవత లోకవరి చవిచూచి విడిచిన యమృతము కంటె రామచరితామృతము నిత్యమ్ముఁగ్రోల సారె సారెకు రుచి నుప్పొంగుచుంగు' [2] నని శివుని ముఖమునఁ బలికించుటయుఁ దద్వైశిష్ట్యమును వెల్లడించుచున్నది. 'రామచరితామృతమ్ము నందలి సారస్య మింత చెవిసోకిన మాత్ర మనసే మోడు చిగురించును, జడచిత్తములకుఁ జిగురు పుట్టును'.[3]

1. స్మారక సంచిక, 19 పు.
2. బా. కాం. - 1 ఆ., 215 ప.
3. సుం. కాం. 2 ఆ., 239 ప.

అనగాఁ జైతన్యవంతములు, సుఖసంపత్సమృద్ధములు నగునని భావము. సీతకు రామకథ వినుచు హనుమని ముఖమున నిట్లు చెప్పింపఁ బడుట హృద్యము.

రామజనన సందర్భమున నారదుఁడు 'సేమ మమృతత్వమిదు శ్రీరామ కథాఽమృతము, భువి నరప్రకృతి కిఁకన్ నోములు ఫలించెనని వీణానువృత్తి నుబ్బుచు పలికి'[1] నట్లు వర్ణించుట రమణీయార్థస్ఫూర్తి నొసగుచున్నది. రామాదులు ప్రయాగఁజేరు సందర్భమున నందలి సరస్వతీ నదిఁ గూర్చి -

సారస్వత ప్రవాహము
సారతరం బాంతర ప్రసక్తి నెగడు నీ
తీర మెనయు వారికి మది
నారయఁ గొనరాని భాగ్యమని యొకఁడున్నె ![2]

అని ప్రశంసింపఁబడినది. ఇందు నదీపరమగు నర్థమే గాక కావ్యపరమగు నర్థము ప్రతిభాసించుచున్నది. సరస్వత్యాః ఇదం సారస్వతమ్ అనగా సరస్వతీ సంబంధ మైనది. అట్టి సారస్వత ప్రవాహతీరముఁ జేరువారల కది సకల సౌభాగ్యములు ప్రసాదించును. శ్రీరామకథాఽమృతమే యొక సారతరంబగు సారస్వత ప్రవాహము కాఁగా నాంతర ప్రసక్తి నధ్యాత్మ సుందరమగు నంచు లభింపనిది లేదు. అనగా నది స్వయంసంపూర్ణము, సకల కళాకమనీయము. ఇత్యాది 'జయలక్ష్మీ కీర్తి విద్యాభ్యుతులఁ గల్పించి, సుశ్రేయోదాయక మగు'[3] ననుట నిస్సందేహ సంభావ నీయ మగుచున్నది, ఇట్టి శ్రీరామకథాఽమృత వైశిష్ట్యమును గూర్చి -

శ్రీలకు తానక మానం
దాలయ మఘహారి హరి హరిచరితం బా
వేల నతివేల రుచులకుఁ
జాలై యుప్పొంగెఁ బ్రథితభావరసజ్ఞా![4]

1. బా. కాం. - 3 ఆ., 35 ప.
2. అయో. కాం. - 5 ఆ., 241 ప.
3. బా. కాం. - 1 ఆ., 272 ప.
4. కి. కాం. - 2 ఆ., 372 ప.

అని పరమేశ్వరుఁడుఁ బార్వతితో ననినాఁ డనుట మాననీయము. అట్లే మైథిలీ పరిణయ సందర్భమున 'కవి సుకృతపరిపాకము, స్వవితాఖిలలోక మధిరసాలోకము, సత్యనివేకము, హృతశోకము, రవికులమణి సద్గుణాకరశ్లోకము, సర్వజనకామ్యము'నైన 'సీతారాముల కథాప్రసధాభిధానమున' 'నతిశయోక్తు లొరయవు, పునరుక్తులు చొరవు, అసంగతులకుఁ జొరవలేదు'[1] అని కవి శివుని ముఖమునఁ బ్రకటించినాఁడు.

సామాన్యముగ లోకమున నేకావ్య మందైనను నారంభమున నున్న రసస్థితి పోనుపోను తగ్గుచుండుట సాహితీసుసంపన్నులగు సహృదయుల కనుభవ సిద్ధమగు విషయము. మనుచరిత్ర, పారిజాతాపహరణాది కావ్యము లిందులకు నుదాహరణములుగా నెన్నఁదగును. అమృతము నందు వలె రామకథాఽమృతముఁనందు మాత్ర ముత్తరోత్తర మట్టి రసవైభవము దోఁచి యధికమగు రుచి సిద్ధించుచున్నదను శివుని పలుకులలోఁ దద్వైశిష్ట్య ముగ్గడింపఁ బడుచున్నది.

> అన్యకృతి ప్రబంధముల నైక్షవదండము నందుఁబోలె సా
> మాన్యముగా రసస్థితి క్రమంబుగఁ దగ్గుచునుండు దేవమూ
> ర్ధన్య సుధారసంబునను రామకథాఽమృతధార యందు న
> న్యాన్యతఁదోఁచు నభ్యధికమౌ రుచి యెన్నిదినమ్ము లానినన్ [2]

అశోకవనమున సీత -

> రామకథాఽమృత సేవ ని
> రామయమై యేకలక్ష్యయౌ వృత్తి మహా
> శ్రీమహిత యగుచుఁ దనకు ....

చున్నదని వర్ణించుట నీ శ్రీరామకథాఽమృత సేవాతత్పరులు నట్టి నిరామయత్వాదులు భజింతురను భావమును వెల్లడించుచున్నది.

శ్రీరామకథాఽమృతమున నాయకుఁడు 'నవరసాలంకృతి నాయకుఁడగు' రాముఁడు కాఁగాఁ బాత్ర లన్నియు భారతీయాత్మప్రతీకములుగాఁ జిత్రితములైనవి.

---

1. బా. కాం. 9 ఆ., 288—89 పద్యములు
2. ఉ. కాం. - పూ. భా., 10 ఆ., 34 ప.

వైదికధర్మ ప్రపంచనమగు 'మునిభావరహస్య వివరణమి'ందు ప్రశంస్యము. అందులకు వ్యాఖ్యాన చతుష్టయానుసరణము శ్లాఘనీయము.

అతని గూఢార్థమ్ము లరచేత నిడునప్డు
కవివతంసము లొక్కొ వ్యాఖ్యాతలొక్కొ[1]

అని శ్రీ అంబడిపూడి రామబ్రహ్మకవి యీ విషయమై శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారిని ప్రస్తుతించినారు. 'అగస్త్యుఁడు రాముని చరితమున బహు రహస్యములు గలవని వాక్రుచ్చుట', 'అగస్త్యుఁడు సారాంశముఁ జెప్పుట' అను ఘట్టములు రామకథలోని యనేక సంశయములకు సమాధానము లగుచున్నవి. కేవలము కథఁ జెప్పుటయే గాక కవి లోకమునఁగల విమర్శ లాకళించుకొని సమాధానముఁ జెప్పి నవవగాహన గల్పించుటయుఁ జేయఁదగియున్నది. కావున వారాపద్ధతి ననుసరించుట వలనఁ గావ్యమునకు విశిష్టత సిద్ధించినది. లోకహితార్థము పార్వతి రామకథా విశేషములఁ బ్రశ్నింప శివుఁడు సమాధానించిన తీరు మిక్కిలి యౌచిత్యసుందరము. ఈ కావ్యమున నాశ్వాసాద్యాశ్వాసాంత పద్యములు వేదాంతార్థ బంధురములై యవి యన్నియు నొకచోఁ జేర్చి చూడగల్గినఁ దత్త్వపరమగు నొక మహద్గ్రంథముగాఁ బరిణమించు నట్టివైఁదోఁచుచున్నవి. శ్రీ నాగలింగమ్ వేంకటేశ్వరశాస్త్రి గారీ విషయమునిట్లు ప్రశంసించిరి. 'శ్రీ శాస్త్రిగారు తిక్కన యొక్క వైదిక సంప్రదాయాను బంధమునకు, ఔపనిషదర్థ వివేశనప్రథితములగు నాశ్వాసాంత పద్యములకు, తెలుఁగు నుడికారపు సొంపునకు మురిసి, సొగసి అట్లే తమ వాఙ్మయమును గూడ వెలార్ప గొప్ప జతన మును చేసినారు.'[2]

తిక్కన తన భారత రచనమును 'ప్రబంధమండలి' గా భావించినట్లు శ్రీరామకథాఽమృతమునఁ బ్రతిఘట్టము నొక ప్రత్యేక ప్రబంధ మనఁదగురీతి సమగ్ర సుందరముగాఁ దీర్చిదిద్దుట గాననగును. 1. ఋష్యశృంగచరిత్ర, 2. వామన చరిత్ర, 4. సీతారాముల వివాహఘట్టము, 5. అహల్యావృత్తాంతము, 7. సీతా రాముల యశోకవనవిహారము, 7. హనుమచ్చరిత్ర 8. హరిశ్చంద్ర చరిత్ర,

---

3. స్మారకసంచిక, 16 పు.
1. శ్రీరామకథాఽమృతము (వ్యాసము)

9. దశరథుని బాల్యచరిత్రము, మొదలగునవి యిందు పరిగణింపఁదగియున్నవి. కథా పుష్టికి, కావ్య పరిపూర్ణతకు, సంబంధి కథావర్ణనము గావించుట కావ్యసౌందర్య హేతువై పొసఁగుచున్నది. ప్రజాదరణము నంది ప్రచారములోనున్న 'యమూలకము లగు సన్నివేశముల నాదరించుట రసపోషణమునకుఁ బాత్రచిత్రణమునకు దోహదముఁ గూర్చుచున్నది. శ్రీరామకథాऽమృతమున మూలాధికమగు శ్రుతిస్మృతులు సందర్భోచితముగాఁ బొందుపరుపఁబడి కావ్యగౌరవము నినుమడింపఁజేయుచున్నవి. శుభశకున ములు గాంచి యెలరు రాముని ముఖమున నావిషయ మిట్లు ప్రస్తావింపఁజేయుట హృదయంగమము.

అపాతతః ప్రసక్తత
నేపారవె మంగళైక హేతువులుశ్రుతుల్
శ్రీపద్యలు కవిభావ
వ్యాపారము దానఁగృతి నపారమకాదే' ( బా. కాం. 8 ఆ. 175 ప. )

వాల్మీకిరామాయణమున గాయత్రీబీజాక్షరములు వేయి శ్లోకముల కొకటి చొప్పున నిబంధింపఁబడినవని సంప్రదాయజ్ఞులగు వారి భావన. అందు సంయుక్తాక్షరములలో నేదో యొక వర్ణము మాత్రమే స్వీకరింపఁబడినట్లు గాయత్రీరామాయణము వలనఁ దెలియుచున్నది. శ్రీరామకథాऽమృత కర్తలు 'త్స' రువొక్కఁడె .... , 'ణ్య'ంతము .... , 'స్య'చ మొప్ప .... , 'నః'ఖం పన .... ఇత్యాదిగా సంయుక్తాక్షరములు మొదలగునవి యథాతథములుగాఁ బ్రయోగించుటంజేసి దీని ప్రత్యేకత నిరూపింపఁబడుచున్నది. కావ్యమున ననేక విధముల 'వేదశాస్త్రసంప్రదాయ పాలనము' గావించుట తద్గౌరవాపాదకమై యెసఁగుచున్నది. భక్తి కర్మ జ్ఞానముల సమన్వయ మిందు హృద్యము.

సీతకు రత్నభూషణము లుంచి వివాహోచితాలంకరణముఁ గావించి 'చెలులు గాంచిరి సృష్టిపై చిత్రశ్రీమపృ దుభయశ్రీ విశేషమ్ము లూహఁ బెరయ' [1]

---

1. బా. కాం.- 10 ఆ., 277 ప.

అని వర్ణింపఁబడినది. ఇట నుభయశిల్పి విశేషములనఁగా 'భువన నిర్మాణచతురుఁడగు బ్రహ్మ, నగలు చేయు విశ్వకర్మ ల (కంసాలి) నేర్పు' అని కథాపరమగు నర్థము కాఁగా, కావ్యపరమగునెడ వాల్మీకి, శ్రీరామకథాఽమృతకవుల కావ్యశిల్ప విశేషములను నర్థాంతరము ధ్వనించుచున్నది. సీత సహజముగ సౌందర్యరాశి. ఆమెకు మేలిరతనాల నగ లలంకరించిరి. అయ్యెడ భూషణభూష్యభావము సిద్ధించినది. అట్టియెడఁ చెలు లామె సౌభాగ్యమును గాంచి యచ్చెరువందిరి. అట్లే కవిబ్రహ్మ యగు వాల్మీకి సృజించిన కావ్య సౌందర్యముతోఁబాటు శ్రీరామకథాఽమృత కవులు స్వీయకవితాగుణములు చేర్చి యపూర్వశోభలు వెలార్చిరనునది ఫలితార్థము. ఇట్లే కావ్యపై శిష్ట్య మిందు గ్గడింపఁబడినది.

రాముని మేల్కొలుపు వందిమాగధులు స్తోత్రబంధములు పఠించిరని యిట్లు వర్ణింపఁబడినది-

తేలియలొల్కు పల్కు జిగి, తెల్వియుఁ దేటయుఁ బెంపుసొంపు స
న్మానిత సద్గుణాలి రసమార్దవ మంచ దలంక్రియా విలా
సానుగమమ్మ వ్యంజన నందిన భావము లొప్ప కావ్యల
క్ష్మీ నవమూర్తులో యన రచించిరి వందులు స్తోత్రబంధముల్ [1]

వివాహోచితాలంకృతమగు జనకుని పట్టణశోభ యిట్లు వర్ణింపఁబడినది.

పదవిలా సంబద్ధ పరిపుష్టిమెఱయించు, వింతయొయ్యారంబు వెరవుసూప
లలితశోభన కలాలంకారసామగ్రి, తకుఁజకులీను నొడళ్ళఁదరము మీఱ
మహనీయ గుణలక్ష్మి సహసముద్భాతాభి, రూపసంపన్నతారూఢి నెగడ
భావగమ్య రసప్రభావంబుగ్రితకాంతి, పూరచాంద్రస్ఫూర్తి బొలుపుఁబెనుప
జీవనాడులు వ్యంజనల్సెలఁగ నమృత, సేచనంబున నాయకస్థితి వచింపఁ
గై శికీ ముఖవృత్తుల కావ్యమట్లు, గన్నెలెలయించి రయ్యలాకాంతునగరు.

[ బా. కాం. 10 ఆ., 254 ప. ]

---

1. బా. కాం. 9 ఆ. 23 ప.

సీతారాముల వివాహసమయమున బువ్వముబంతి వర్ణన మిట్లు సాగినది -

> రామకథాऽమృతోచితము రమ్యముగా రసముప్పతిల్ల క్ష్మా
> రాముఁడు గూర్చినట్టి గుణరమ్యములైన పదార్థముల్ మహో
> ద్దామత. బాకశుద్ధిఁగని తత్పరత న్దనివొందఁజేసె వి
> ద్యామహితాత్ములౌ బిబుధులంపిణు మేలని యుప్పు యాడగన్ [1]

ఇట్టి వర్ణనములు పరమార్థముగ శ్రీరామకథాऽమృత కావ్యసంపద్వైభవ మును బ్రకటించునవి యగుట సహృదయ హృదయంగమములై యలరుచున్నవి.

ఇట్లు శ్రీరామకథాऽమృతము మనోహరములగు స్వతంత్ర వర్ణనలు, నపూర్వ ములగు పాత్రచిత్రణములు, నచుంబితములగు మధురభావములు, గంభీరమైన యర్థములు గలిగి ధారాళమైన శైలి, విశిష్టమగు నలంకారములతో నొప్పుచు నాంధ్ర సరస్వతి కపూర్వశోభ వెలయించుచున్నది. 'ఉభయభాషాధురీణులగు వీరి కవిత ధారా వాహికమై, మంజుల పదశోభితమై, సముచితాలంకార సంస్కృతమై మురిపముల గూర్చుచున్నది. అటనట కలిగిన పద్యముల యందలి వింత విరుపులు గూడ ఒక వింత యొరపు చేర్చుచున్నవి. వర్ణనములున్ను, కథాంశములున్ను సమవిభక్తములై సారస్వతసర్వస్వమున కాలవాల మగుచున్నవి. కావ్యగుణ సందర్భముల కన్నింటికిని గ్రంధమంతయు ఉదాహరణమే యగుచున్నది' [2] అని నాగలింగమ్ వేంకటేశ్వర శాస్త్రిగారును, 'రామకథాऽమృతమ్ము మధురమ్ము' [3] అని చల్లా పిచ్చయశాస్త్రిగారును, 'అలఘు రసప్రవాహనిలయంబగు' [4] నని ముదిగొండ రామలింగశాస్త్రి గారును, 'రామగాథాऽమృతం బమలం బెల్లెడఁబాఱఁ సర్వజగదాహ్లాదంబు గావించు' [5] నని వేమూరి సీతారామశాస్త్రి గారును, 'సుమనస్స్తుత్యరసార్ద్రగుంభిత వచశ్శృద్ధిం బ్రకాశించు కబ్బములందియ్యది యగ్రగణ్యమగు' [6] నని మేధా దక్షిణామూర్తిశాస్త్రి గారును,

> ఒక్కొక పద్యమునం గడు
> చక్కని పాకంబు భావసరళత ధ్వనియుం
> దక్కటి శబ్దాలంకృతు
> లిక్కవిరాడ్గ్రంధమునన యెసఁగు బళియనన్ [7]

---

1. బా. కాం. - 10 ఆ., 415 ప.
2-7. స్మారకసంచిక

అని కవితావేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారును, 'ఈ కథామృతకావ్యము రామహృదయరహస్యార్థముల నెన్నింటినో ప్రకాశింపఁజేయుచున్న'[1] దని మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారును, శ్రీరామకథామృతమును గుఱించి ప్రశంసావృష్టిఁ గురిపించిరి. శతావధానులు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి గారు 'శ్రీ వేంకటప్పయ్యశాస్త్రిగారు తిక్కనాదులఁ బోలిన కవీశ్వరులనియు, వారి శైలి ప్రౌఢమైన ప్రబంధశైలి యనియు .... కవి సర్వజ్ఞుఁడుగా నుండవలెనను న్యాయము శ్రీ శాస్త్రి గారి యందు వర్తించినదనియు, వారి గ్రంథములలో సర్వశాస్త్రముల యొక్క సారము సుగమముగ నిరూపింపఁబడినదనియు'[2] నభివర్ణించిరి. మఱియు కావ్యమునఁగల వివిధ ఘట్టములు పలువురిచేఁ బ్రస్తుతింపఁబడినట్లు శ్రీ కవితాసుబ్రహ్మణ్యశాస్త్రి గారిట్లు పేర్కొనిరి –

శ్రీపతి కపినేత చిత్తమచ్చెరువొందె
  బ్రహ్మదండకపుదండంబు పద్యమందు
పరకవి మత్తేభహరి వేంకటకవీంద్రుఁ
  డలరె బికధ్వని పలుకునందు
అప్పరాయ నృపాలుఁ డహహా యంచును మెచ్చెఁ
  బాలుగారెడు పద్యపఠనమందు
రామకృష్ణమనీషి కేమొ సంతసమాయె
  మే-న-కా యను శ్లేషమూను టందు

కవిత మీయంత వెల్గుటగాఁ దలంచి
రఖిల రసవేత్తలౌ కవు లబ్జుముఖులు
పాకమున సొంపు ధ్వనియింపు బలు కుదింపు
రసములను బెంపు మీ పద్యరచన లింపు[3]

1. తెలుగులో రామాయణాలు (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ), ప్రపంచ తెలుగు మహాసభ ప్రచురణ
2. కృష్ణాపత్రిక, 10-22-1934
3. స్మారకసంచిక, 30 పు.

ఇట్టి 'రామకథాఽమృతంబు గ్రోల నంతకంత కధికమయ్యె దృష్ణ' అధిప! యెక్కింతయు దిక్కకుండఁ దృప్తి తెలుగుపడ నుడువు'[3] మని యడిగిన పార్వతితోఁ బరమేశ్వరుఁడు 'ఓ విశ్వకర్త్రి! కొనవె యా విశ్వాత్మకుని చరితమమృతము కాదే' ' అని వివరించినాఁడు. ఇందు వక్త విశ్వనాథుఁడు. శ్రోత విశ్వకర్త్రి. కథ విశ్వాత్మకుని చరితము. కావున నిది యమృతమే యని సంభావింపఁబడినది. మఱియు-

శ్రీరామకథాఽమృత సారము
శ్రీమత్సింహాసనేశ్వరీ సంపృష్టం
బామృత్యుంజయ సంస్కృత
మా మరముని మానితంబునై రాజిల్లెన్ [2]

అని వర్ణింపఁబడినది. ఇందు శ్రీరామకథాఽమృతసార మీశ్వరముఖ వినిర్గత మగుట విశేష ప్రశస్తి నందినది. దీనిని చదివినవారు, వినినవారును సింహాసనేశ్వరులు, మృత్యుంజయులు, నామరముని మానితులు నగుదు రనుట శుభాశంసనము. ఇంకను 'రామకథా సుధార్ణవ తరంగభృతిన్ బెనుపొందుచున్న శ్రీరామకథాఽమృతం బిది' 'తారకమంత్ర రసైకతానతన్' 'జిత్సుఖధామ మహోదయంబు' లొసంగు ననుట మహితము, మాన్యము నగుచున్నది. "లోకమున ప్రజలు స్వర్గాది సుఖము లాశించి యాగాదికర్మ లాచరింతురు. అది వారికి నమృతముపైఁగల ప్రీతిని వెల్లడించును. ఎట్టి క్రతువ్రతము లాచరింపకున్నను రామగాథాసుధ అయోధ్యాపురవాసుల కట్టి శుభమునే ప్రసాదించుచున్న"దని వర్ణించుట సర్వథా శ్రీరామకథాఽమృత ఫలశ్రుతిగా సంభావింపఁదగియున్నది.

కర్మము లొనరింతురు తమ
కర్మిలి యమృతమ్మునందు నతిశయముగాఁ ద
చ్ఛర్మము సేకుఱె నిటు ని
ష్కర్ములగు నరులకె రామగాథా సుధతోన్.

శ్రీ. రా. క. ఉ. కా. - పూ. ఖా. 9 ఆ. 297 ప.

ఇట్టిది శ్రీరామకథాఽమృత వైశిష్ట్యము.

# సింహావలోకనము

వాల్మీకి కృతమగు శ్రీమద్రామాయణమునకు వెలువడిన యాంధ్రానువాదము లలో నాధునికమైనదే యైనను శ్రీరామకథామృత మత్యంత విశిష్ట స్థాన మలంకరించినది. ఏతద్గ్రంథ రచయితలైన శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు తత్పుత్రులైన శ్రీ రాఘవనారాయణశాస్త్రి గారును ఆ అనువాదమును విద్వజ్జన మనోరంజకముగా తీర్చిదిద్దిన విధ మత్యంత ప్రశంసనీయము. తపోనిష్ఠా గరిష్ఠులై బహుశాస్త్ర విష్ణాతులై రామకథా ప్రచారమునకు బద్ధకంకణులై య్యాగ్రంథమును రచించిరని గ్రంథ ప్రాశస్త్యమును పలువురు పండితులు బహుధా పేర్కొనుచున్నారు. వాల్మీకి రామాయణముతోఁబాటు సందర్భసముచితముగను, సుమనోమనోహరముగను అధ్యాత్మ రామాయణము నందలి విషయములను గూడ జతపఱచుట వారి ప్రత్యేకత నిరూపించుచున్నది. శ్రీ తక్కెళ్ళపాటి ఆచార్యులవారు, శ్రీ ఆదిభొట్ల నారాయణదాసుగారు, శ్రీ రాయుఁడుశాస్త్రిగారు, మొదలగు పండిత ప్రకాండులు, బాగుగా కీర్తించుటచే దీని ప్రసస్తి వెల్లడియగుచున్నది. కంచిపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీచంద్రశేఖర సరస్వతి స్వాముల వారీ గ్రంథము పరమహంస పూజనీయ మగునని పల్కుట సర్వథా సత్యము.

ఆ అనువాదకుల జీవితవిశేషములు, శ్రీమద్రామాయణ ప్రాశస్త్యము, శ్రీరామకథామృత రచనా సముద్దేశము నిందు నిరూపింపఁబడెను. అట్లే వాల్మీకి రామాయణమును అధ్యాత్మరామాయణమును ఈ కవు లనువదించుటలోఁ బ్రదర్శించిన మెలకువలు, కథాకథనము, పాత్రచిత్రణము రసపోషణము మున్నగు కావ్యత్వనిరూపక విషయము లందు అనువాదకుల స్వతంత్రతయు, నీ యనువాదమున ప్రతిఫలించిన కవుల ఆత్మీయతయు నిందు నిరూపింపఁ బడినవి. ఆంధ్ర సాహిత్యమునను రామకథా వాఙ్మయమునను శ్రీరామకథామృత కావ్యవిశిష్టత యథాశక్తిగా నిరూపింపఁ బడినది.

ఉత్తమ రామాయణానువాదముగా శ్రీరామకథామృతము నాంధ్రుల కందఁజేసి శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారు, శేషపూరణకర్తలు, తత్పుత్రులు శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు శతధా కృతకృత్యులైరి. మనము ధన్యులమైతిమి.

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః !
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్ ॥

# ఉపయుక్త గ్రంథపట్టిక


| | |
|---|---|
| అభిజ్ఞానశాకుంతలము | కాళిదాసు |
| అభిజ్ఞానశాకుంతలము (ఆంధ్రానువాదము) | శ్రీ ముళ్ళపూడినారాయణశాస్త్రి |
| అనంతుని ఛందస్సు | అనంతుఁడు |
| అష్టాధ్యాయి | పాణిని |
| అనర్ఘ రాఘవమ్ | మురారి |
| అమరకోశము | అమరసింహుఁడు |
| అప్పకవీయము | అప్పకవి |
| అధ్యాత్మరామాయణము | విశ్వామిత్రుఁడు |
| అష్టాంగ హృదయము | వాగ్భటుఁడు |
| ఆనందరామాయణము | వశిష్ఠుఁడు |
| ఆంధ్రమహాభారతము ( ఆ. ప. ) | నన్నయ |
| ఆంధ్రమహాభారతము (విరా. ప.) | తిక్కన |
| ఆంధ్రమహాభారతము (అర. ప.) | ఎఱ్ఱన |
| ఆంధ్రమహాభాగవతము | పోతన |
| ఆంధ్రశబ్దచింతామణి | నన్నయ |
| ఆపస్తంభగృహ్యసూత్రము | ఆపస్తంభుఁడు |
| ఉత్తరరామచరితమ్ | భవభూతి |
| ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజు |
| ఋతుసూక్తము | శ్రీ చాగంటి గోపాలకృష్ణమూర్తి |
| కఠోపనిషత్ ( అష్టోత్తర శతోపనిషదః ) | |
| పరిశోధన వ్యాసము<br>కంకంటి ఉత్తరరామాయణ | [ శ్రీ రాచకొండ నరసింహమూర్తి |
| కిరాతార్జునీయము | భారవి |
| కావ్యప్రకాశ | మమ్మటుఁడు |
| కాశీఖండము | శ్రీనాథుఁడు |

కావ్యాలంకారసూత్రాణి (కామధేనువ్యాఖ్య) గోపేంద్రత్రిపురహరుఁడు
కావ్యాలంకార సంగ్రహము భట్టుమూర్తి
కావ్యాదర్శము దండి
కావ్యాలంకార సూత్రవృత్తి వామనుఁడు
కాణ్వసంహిత
కాదంబరి భట్టబాణుఁడు
కావ్యాలంకారః రుద్రటుఁడు
కావ్యకౌతుకము భట్టతౌతుఁడు
కువలయానందము అప్పయ్యదీక్షితులు
కుమారసంభవము కాళిదాసు
కుమారసంభవము నన్నెచోడుఁడు
కృష్ణాపత్రిక (10-12-1934)
గురూపహారము శ్రీ తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రి
గౌతమ న్యాయదర్శనము గౌతముఁడు
చంద్రాలోకము జయదేవుఁడు
చంపూరామాయణము భోజుఁడు
చంపూరామాయణము (భోజునికృతి కాంధ్రీకరణము)
జాతకాభరణము
తెలుగులో రామాయణములు శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
తెలుఁగుసాహిత్యములో రామకథ శ్రీమతి పండా శ్యమంతకమణి
తెలుఁగుసాహిత్యములో రామకథ విద్వాన్ రావూరి దొరసామిశర్మ
తైత్తిరీయోపనిషత్
తైత్తరీయ సంధ్యాభాష్యము (వావిళ్ల వారి ప్రతి)
తైత్తరీయ బ్రాహ్మణము
త్యాగరాజకృతులు త్యాగరాజు
తెలుఁగు రామాయణాల రమణీయత శ్రీ జోస్యుల సూర్యప్రకాశరావు

| | |
|---|---|
| దాశరథీశతకము | కంచెర్ల గోపన్న |
| దత్తభాగవతము | శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి |
| ధర్మశాస్త్రము | |
| ధ్వన్యాలోకము | ఆనందవర్ధనుఁడు |
| నలచంపూ | త్రివిక్రమభట్టు |
| నాకుతోచిన మాట | శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి |
| నాట్యశాస్త్రము | భరతుఁడు |
| పద్మపురాణము | వ్యాసుఁడు |
| పరిభాషేందుశేఖరమ్ | నాగేశభట్టు |
| పారిజాతాపహరణము | ముక్కుతిమ్మన |
| పాండురంగమహాత్మ్యము | తెనాలిరామకృష్ణుఁడు |
| పాతంజలి యోగసూత్రములు | పతంజలి మహర్షి |
| పానశాల | దువ్వూరి రామిరెడ్డి |
| ప్రపంచసారతన్త్రము | సంకలన గ్రంథము |
| ప్రతాపరుద్రీయము | విద్యానాథుఁడు |
| ప్రసన్నరాఘవము | జయదేవుఁడు |
| బాపూజీ ఆత్మకథ | శ్రీ తుమ్మల సీతారామమూర్తి |
| బృహదారణ్యకోపనిషత్ | |
| బోధాయనోక్త మహాన్యాసఖణ్డ | |
| బ్రహ్మసూత్రభాష్యము | ఆచార్య శంకరులు |
| భద్రాయురుపాఖ్యానము (నాటకము) | శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి |
| భగవద్గీత | వ్యాసుఁడు |
| భాస్కరరామాయణము | భాస్కరాదులు |
| భీమేశ్వరపురాణము | శ్రీనాథుఁడు |
| మనుస్మృతి | మనువు |
| మధురావిజయము | గంగాదేవి |

| | |
|---|---|
| మనుచరిత్రము | పెద్దన |
| మహాభారతము | వ్యాసుఁడు |
| మార్కండేయపురాణము | వ్యాసుఁడు |
| మాఘము (శిశుపాలవధ) | మాఘుఁడు |
| మంత్రరత్నమంజూష | త్రివిక్రమభట్టు (సంకలితము) |
| మొల్ల రామాయణము | మొల్ల |
| యామావిక | శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి |
| యోగశిఖోపనిషత్ | |
| యోగకుండల్యుపనిషత్ | |
| యోగతత్త్వోపనిషత్ | |
| యోగచూడామణ్యుపనిషత్ | |
| యాజుషపూర్వ ప్రయోగచంద్రిక | |
| రఘునాథరామాయణము | రఘునాథుఁడు |
| రఘువంశము | కాళిదాసు |
| రససిద్ధి | శ్రీ తుమ్మల సీతారామమూర్తి |
| రసగంగాధరము | జగన్నాథుఁడు |
| రంగనాథరామాయణము | రంగనాథుఁడు, తత్తనయులు |
| రాఘవపాండవీయము | పింగళి సూరన |
| రాఘవాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుఁడు |
| రామరహస్యోపనిషత్ | |
| రామాయణపరమార్థం | డా॥ ఇలపావులూరి పాండురంగారావు |
| రామాయణసుధాలహరి | కల్లూరి చంద్రమౌళి |
| రామాయణచంపూ | భోజుఁడు |
| లలితాసహస్రనామము (దేవీభాగవతము) | |
| వసుచరిత్రము | భట్టుమూర్తి |
| వాల్మీకి రామాయణము | వాల్మీకి మహర్షి |

| | |
|---|---|
| వనమాల | జీవనాథవైద్యుఁడు |
| వక్రోక్తిజీవితము | కుంతకుఁడు |
| వ్యక్తివివేకము | మహిమభట్టు |
| విక్రమోర్వశీయము | కాళిదాసు |
| వికృతివివేకము | అధర్వణుఁడు |
| విష్ణుసహస్రనామము | వ్యాసుఁడు |
| వేదాంతపరిభాష | |
| వైశేషికదర్శనము | కణాదుఁడు |
| శాంకరీస్తవము | శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి |
| శాండిల్యోపనిషత్ | |
| శివలీలార్ణవము | నీలకంఠ దీక్షితులు |
| శ్వేతాశ్వతరోపనిషత్ | |
| శివపురాణము | వ్యాసుఁడు |
| శృంగారప్రకాశ | భోజుఁడు |
| శృంగారనైషధము | శ్రీనాథుఁడు |
| శ్రీరామకథాऽమృతము | శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి<br>శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి |
| శ్రీకృష్ణరామాయణము | శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి |
| శ్రీకృష్ణకర్ణామృతము | లీలాశుకుఁడు |
| శ్రీరామకథాऽమృత కవికుమార చరితము | శ్రీ చెరువు సత్యనారాయణశాస్త్రి |
| శ్రీరామనామామృతమహిమ | శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి |
| శ్రీరామాయణ సారోద్ధారము | శ్రీ ములుకుట్ల నరసింహావధాని |
| శ్రీమద్రామాయణవైభవము | శ్రీ మల్లాది గోపాలకృష్ణమూర్తి |
| శ్రీమద్రామాయణము- విశ్వశ్రేయము | ,, ,, |
| శ్రీమద్రామాయణ నవనీతము | శ్రీకాశీభొట్ల వరాహనరసింహశర్మ |
| శ్రీమన్మంత్రరత్నాకరము (శివమంత్ర పటలము) | |

| | |
|---|---|
| షోడశి (రామాయణ రహస్యాలు) | శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ |
| సత్యనారాయణ వ్రతమహాత్మ్యము | శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి |
| సద్గురు పూజాకల్పము | |
| సాహిత్యదర్పణము | విశ్వనాథుఁడు |
| సాంఖ్యసూత్రములు | |
| స్కాందపురాణము | వ్యాసుఁడు |
| సిద్ధాంతకౌముది (బాలమనోరమ వ్యాఖ్య) | భట్టోజీ దీక్షితులు |
| సింహాసన ద్వాత్రింశిక | కొఱవి గోపరాజు |
| సీతారామాంజనేయ సంవాదము | |
| సుందరకాండ | ఉషశ్రీ |
| సుందరకాండము – తత్త్వదీపిక | శ్రీభాష్యం అప్పలాచార్యులు |
| సౌందర్యలహరి | శంకరులు |
| స్మారక సంచిక | సంకలన గ్రంథము |
| హర్షనైషధము | శ్రీహర్షుఁడు |
| హఠయోగప్రదీపిక | |
| హనుమ | దివాకర్ల వెంకటసుబ్బారావు |



పురస్త్రీల ప్రస్తావనములలో వారి యనుభూతి వర్ణించుట హృద్యము

మననం బొనరించిరి దృ
జ్మనస రసాయనము రాముమానసమున
య్యనఘుల కాత్మానందం
బనుభూతి పదంబనంగ నయ్యదియ కదే.

ఉ. కాం.- ఉ. భా. 2 ఆ. 439 ప.

# సంకేతపద సూచి

అ. — అధ్యాయము
అధ్యా. - అధ్యాయము
అన. రాఘ. - అనర్ఘ రాఘవము
అర. ప. - అరణ్యపర్వము
అ. రా. - అధ్యాత్మరామాయణము
అయో. కాం. — అయోధ్యాకాండము
అర. కాం. — అరణ్యకాండము
అధి. - అధికరణము
ఆ - ఆశ్వాసము
ఆ. - ఆననము
ఆ. రా. - ఆనందరామాయణము
ఆది. ప. - ఆదిపర్వము
ఉ. కా. - ఉత్తరకాండము
ఉ. భా. - ఉత్తరభాగము
ఉ. రా. చరితమ్ - ఉత్తరరామచరితమ్
ఉ. రా. - ఉత్తరరామాయణము
అం. - అంకము
కా. ఖం. - కాశీఖండము
కా. సూ. - కావ్యాలంకార సూత్రవృత్తి
కా. ప్ర. - కావ్యప్రకరణము
కా. ప్ర. - కావ్యప్రకాశ
కా. కౌ. - కావ్యకౌతుకము
కా. వ. — కాలవర్గు
కి. కా. - కిష్కింధాకాండము
కు. ఆ. - కువలయానందము
గద్య. - గద్యము
చం. లో. - చంద్రాలోకము
తృ. వ. - తృతీయవల్లి
తృ. అ. - తృతీయాధ్యాయము
ధ్వ. లో. - ధ్వన్యాలోకము
ప. - పద్యము
పరి. - పరిచ్ఛేదము
పు. — పుట
పూ. భా. - పూర్వభాగము
ప్ర. అ. ప్రథమాధ్యాయము
ప్ర. ఆ. - ప్రథమాననము
ప్ర. కా. - ప్రథమకాండ
ప్ర. వి. — ప్రథమవిమర్శనము
ప్ర. రు. - ప్రతాపరుద్రీయము
ప్ర. రాఘ. - ప్రసన్నరాఘవము
ప్ర. ర. - ప్రథమరత్నము
ప్ర. ప్ర. - ప్రథమప్రశ్నము
ప్ర. పా. - ప్రథమ పాఠము
బా. కాం. - బాలకాండము
బా. వ్యా. — బాలవ్యాకరణము
భా. రా. - భాస్కరరామాయణము
భ. తౌ. - భట్టతౌతుఁడు

| | | | |
|---|---|---|---|
| మొ. రా. | - మొల్ల రామాయణము | శాం. ప. | - శాంతిపర్వము |
| యు. కాం. | - యుద్ధకాండము | శ్లో. | - శ్లోకము |
| ర. వం | - రఘువంశము | శి. లీ. | - శివలీలార్ణవము |
| ర. నా. రా. | - రఘునాథరామాయణము | శ్రీ. రా. క. | - శ్రీరామకథా ఉపసృతము |
| ర. గం. | - రసగంగాధరము | స. | - సర్గ |
| రా. అ. | - రామాభ్యుదయము | సా. ద. | - సాహిత్యదర్పణము |
| రం. రా. | - రంగనాథరామాయణము | సుం. కాం. | - సుందరకాండము |
| వా. రా. | - వాల్మీకి రామాయణము | సూ. | - సూత్రము |
| వసు. చ. | - వసుచరిత్రము | స్కం. | - స్కందము |
| వి. ప. | - విరాటపర్వము | సా. కాం. | - సారకాండ |
| వి. వే. | - వికృతివివేకము | | |

---

శ్రీరామ చంద్రు చరితము, సారభవద్వచన రచన సంపన్నంబై
గోరములఁ దీర్పఁజాలు నుదార రసాయనమకాఁగఁ దద్దయుగరిమన్.
అనిచెప్పుమనియడిగిన పార్వతికి శివుఁడిచ్చిన సమాధానము శ్రుతిఫలముఁనగుట
రమణీయము

చరితార్థవై తిలే సాధ్వీ వసంతమా ! హరికథా శ్రుతి కలితాదరమున
లేరు తన్బోలిన నారీ లలామలెందేనియు నను కీర్తి నెనయఁ గంటి
వర్ధించితివి, తొంటియట్లె కథాశేషమాన తిమ్మనుచు మహార్థమదియు
నీయిచ్చ వలగొని నే వివరించెదఁ దెలివిమై నొక్కింతఁ ద్రిక్కుకుండఁ
గల రహస్యమెల్లఁ గనఁగాంచు మీకృతి నిత్యతృప్త వగుచునెగడుటాన
వఖిల తత్త్వ సారమని మెచ్చె దిట్లిది యెంచువారలునుఁ దరించువారు
గణపతీ ! నీకచేకూరెఁ గాక పుట్టు సంద్రమ్ము దాఁటింపఁబోలు నౌక
యెల్ల యఘములఁ బోకార్పదెట్లు వీక రామహృదయ రహస్యార్థ రమ్యటీక.

ఉ. కా. పూ. భా. 1 ఆ 12. 17, 18 పాలు.

# ఈ గ్రంథ ప్రచురణకు ఉదారముగా విరాళమిచ్చిన దాతలు



| | |
|---|---|
| శ్రీ కంగెళ్ళ రామారావు, గుంటూరు | 1116 |
| శ్రీ యుతులు అలకాపురం రాజులు | 1116 |
| శ్రీ చేబ్రోలు జగన్మోహనరావు, పొన్నూరు | 500 |
| శ్రీ వేముల వెంకటేశ్వర్లు, రాంభొట్లపాలెం | 558 |
| శ్రీ రాచర్ల లక్ష్మీనారాయణ, గుంటూరు | 500 |
| శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ, గుంటూరు | 500 |
| శ్రీ ఆలపాటి కోటేశ్వరరావు, పొన్నూరు | 500 |
| శ్రీ కె.వి గోపాలరావు, విజయవాడ | 500 |
| శ్రీ చెరువు సూర్యనారాయణమూర్తి, గుంటూరు | 500 |
| శ్రీ పెనుమత్స కృష్ణంరాజు, ఖాజీపాలెం | 500 |
| శ్రీ జి.ఎస్ రాజు, విజయవాడ | 500 |
| శ్రీ మాధవీ ఎంటర్ ప్రైజెస్, గుంటూరు | 300 |
| శ్రీ కాశీఅన్నపూర్ణ సత్రము, చేబ్రోలు | 300 |
| శ్రీ హెచ్. టి. మురళీధరరావు, విజయవాడ | 250 |
| శ్రీ పసుమర్తి సీతారామావధాన్లు ,, | 250 |
| శ్రీ పొట్టూరి కోటేశ్వరరావు | 250 |
| శ్రీ బుసా కోటయ్య, పొన్నూరు | 250 |
| శ్రీ కొప్పురావూరి కృష్ణమూర్తి | 235 |
| శ్రీ ఎం. వి. కుటుంబరావు, విజయవాడ | 201 |
| శ్రీ షా అమీచంద్, తారాచంద్ అండ్ కంపెనీ, విజయవాడ | 201 |
| శ్రీ కామరాజు లక్ష్మీనరసింహారావు, గుంటూరు | 201 |
| శ్రీ నాదెళ్ళ సూరయ్య, శ్రీ తాతినేని శ్రీహరిరావు, విజయవాడ | 201 |

| | |
|---|---|
| శ్రీ ఆలపాటి అనసూయమ్మ, w/o సుబ్బారావు (లేటు) | 116 |
| శ్రీమతి మునిపల్లె వరలక్ష్మి w/o వెంకటేశ్వరరావుగార్ల జ్ఞాపకార్థం శ్రీ శేషతల్పశాయి & శ్రీమతి కరుణ | 116 |
| శ్రీమతి మూల్పూరి జానకీదేవి w/o మల్లిఖార్జునరావుగారి జ్ఞాపకార్థం శ్రీ శేషశాయి & శ్రీమతి కరుణ | 116 |
| శ్రీ చేబ్రోలు శీతారామయ్య, పొన్నూరు | 116 |
| శ్రీమతి గోవిందరాజు అరుంధతీదేవి, గుంటూరు | 116 |
| శ్రీ కునిశెట్టి మల్లికార్జునరావు, పెదనందిపాడు | 116 |
| శ్రీ పొట్టూరి శోభనాద్రిగారి జ్ఞాపకార్థం శ్రీ శేషగిరిరావు, లక్ష్మీరమాదేవి దంపతులు, పొన్నూరు | 116 |
| శ్రీ కె. కోటేశ్వరరావు, పొన్నూరు | 116 |
| శ్రీ మండవ వీరయ్యచౌదరి, ,, | 116 |
| శ్రీ చీమకుర్తి సుబ్రహ్మణ్యం ,, | 116 |
| శ్రీ బండి వెంకటేశ్వర్లు, వెల్లలూరు | 116 |
| శ్రీమతి దంతాల శీతారావమ్మ, ,, | 116 |
| శ్రీ వడాల వీరయ్య, వెల్లలూరు | 116 |
| శ్రీ మాడసాని వెంకయ్య, చుండూరు | 116 |
| శ్రీ ఇక్కుర్తి సీతారామయ్య, యాజలి | 116 |
| శ్రీ డా॥ యన్. హనుమంతరావు, రేపల్లె | 116 |
| శ్రీ వి. వి. నమ్మాళ్వారు, రేపల్లె | 116 |
| శ్రీ ఎన్. సుబ్బారావు, చింతలపూడి | 116 |
| శ్రీ వి. శ్రీనివాసరావు, పొన్నూరు | 116 |
| శ్రీ లావు వెంకటేశ్వర్లు, పెదనందిపాడు | 116 |
| శ్రీ పి. మల్లిఖార్జునరావు, ,, | 116 |
| శ్రీ కె. మల్లిఖార్జునరావు, నిడుబ్రోలు | 116 |
| శ్రీ ఇక్కుర్తి పానకాలరావు, వెల్లలూరు | 116 |

శ్రీ పాహుంకారు సదాశివశర్మ, తెనాలి 116

శ్రీ కారుమూరు విజయసాయిరెడ్డి తండ్రి నారాయణరెడ్డి,
మున్నంగివారిపాలెం 116

శ్రీ వజ్రాల యల్లారెడ్డి, ,, 116

శ్రీ కుర్రి సీతారామిరెడ్డి, మున్నంగివారిపాలెం 116

శ్రీ కారుమూరు వెంకటస్వారెడ్డిగారి జ్ఞాపకార్థము
కుమారుడు కృష్ణారెడ్డిగారు, మున్నంగివారిపాలెం 116

శ్రీ వల్లమూరి శ్రీనివాసరావుగారి జ్ఞాపకార్థము తండ్రి
అచ్యుతరాయశర్మ, రేపల్లె 116

శ్రీమతి సుభద్రగారి జ్ఞాపకార్థం శ్రీ పమిడిమర్తి
వీరరాఘవరావు, రేపల్లె 116

శ్రీ పి. నరసింహమూర్తి, గుంటూరు 116

శ్రీ దాసరి వెంకటరంగం, పెదనందిపాడు 116

శ్రీ ఈమని నాగిరెడ్డిగారి జ్ఞాపకార్థం కుమారుడు
కోటిరెడ్డి, చుండూరు 116

శ్రీ గంగిశెట్టి రాఘవయ్య, చుండూరు 116

శ్రీ మోదుగుల సాంబిరెడ్డి కుమారుడు రామిరెడ్డి చుండూరు 116

శ్రీ కారుమూరు వెంకటరెడ్డి, (ఈశ్వరార్పణమ్) 116

శ్రీ చెర్వు వెంకటనారాయణమూర్తి, పెరవలి 116

శ్రీ పోపూరి లక్ష్మీనరసింహశాస్త్రి, రేపల్లె 116

శ్రీ అల్లంశెట్టి వెంకటకృష్ణసాయి, ,, 130-20

శ్రీ ఓలేళ్ళ వెంకటశేషగిరిరావు, పొన్నూరు 116

శ్రీ వి. రామమోహనరావు, రేపల్లె 116

శ్రీ పి. పోతరాజు, ,, 116

శ్రీ కడిమిశెట్టి పున్నారావు, కొలగనేనిపాలెం 116

శ్రీ పినపాల నరసింహారావు, పొన్నూరు 116

శ్రీ బాపట్ల కామశాస్త్రి, రాంభొట్లపాలెం 116

శ్రీ సోమాశి సీతారామయ్యగారి కుమారులు, శ్రీ వెంకటేశ్వరశర్మ ,, 116

శ్రీ ధర్మాల కుమారస్వామి, జయరాకృష్ణ హోమియోస్టోర్స్, తెనాలి 116

| | |
|---|---|
| శ్రీ ముష్టి కృష్ణమూర్తి, రాంభొట్లపాలెం | 116 |
| శ్రీ అంబడిపూడి సుబ్బరామయ్య, ,, | 116 |
| శ్రీ మాచర్ల వెంకట్రావు, ,, | 116 |
| శ్రీ గొల్లపూడి వెంకటసుబ్బయ్యశాస్త్రి, వినయాశ్రమం | 116 |
| శ్రీ మాచర్ల గురవయ్య, రాంభొట్లపాలెం | 116 |
| శ్రీ ములుకుట్ల వేంకటాచలపతిగారి జ్ఞాపకార్థం దత్తు కుమారుడు లక్ష్మీనరసింహమూర్తి, పూండ్ల | 116 |
| శ్రీ జన్నాభట్ల వెంకటాద్రిమయ్యగారి జ్ఞాపకార్థం కుమారుడు శ్రీ వీరభద్రిశాస్త్రి, గుంటూరు | 116 |
| శ్రీ జాలాది లక్ష్మీనరసింహంగారి కుమారుడు వెంకటరత్నం, పొన్నూరు | 116 |
| శ్రీ పుప్పాల కృష్ణయ్యగారి కుమార్డు సుబ్బారావు, వెల్లలూరు | 116 |
| శ్రీ ఉపద్రష్ట మల్లిఖార్జునరావు, నిడుబ్రోలు | 116 |
| శ్రీ రాచకొండ యజ్ఞనారాయణ, గుంటూరు | 100 |
| శ్రీ లక్ష్మీజనరల్ ట్రేడింగ్ కంపెనీ, పొన్నూరు పార్టనర్స్ : శ్రీ కె. రామసుబ్బయ్య, శ్రీ కె. హనుమంతరావు | 100 |
| శ్రీ పి. ఆర్. ఎస్. ప్రసాదరావు, గుంటూరు | 100 |
| శ్రీ వి. వి. సుబ్రహ్మణ్యం, విజయవాడ | 116 |
| శ్రీ కూనల పూర్ణచంద్రరావు, ,, | 100 |
| శ్రీ చనుమోలు లక్ష్మణరావు, ,, | 116 |
| శ్రీ నర్రాజు బాలచంద్రరావు గుంటూరు | 116 |
| శ్రీ R.V.N. సుబ్బారావు, గుంటూరు | 101 |
| శ్రీ గుంటూరు చినవెంకయ్య, బ్రాహ్మణకోడూరు | 100 |
| శ్రీ తుమ్మలపెంట నాగేంద్రంగారి కుమారుడు వరదరాజు, పొన్నూరు | 116 |
| శ్రీ పేరుబోయిన చంద్రయ్యగారి కుమారుడు శ్రీ పున్నయ్య, గుంటూరు | 116 |
| శ్రీ బొలిశెట్టి వెంకటసుబ్బయ్యగారి కుమారుడు శేషగిరిరావు ,, | 116 |
| శ్రీ పంగులూరు గోపాలరావు ,, | 116 |

| | |
|---|---|
| శ్రీ మాజేటి సత్యనారాయణగారి భార్య సీతారత్నంగారు ,, | 116 |
| శ్రీ తాడికొండ సుబ్బారావు S/o వేంకటేశ్వర్లు ,, | 116 |
| శ్రీ తాళ్ళూరి కృష్ణమూర్తి, పొన్నూరు | 50 |
| శ్రీ మాజేటి సూర్యనారాయణ, ,, | 50 |
| శ్రీ మతుకుమల్లి విశ్వనాథశర్మ, ,, | 50 |
| శ్రీ చీమకుర్తి వెంకటేశ్వర్లు, ,, | 58 |
| శ్రీ కారుమూరు వెంకటేశ్వర్లు, ,, | 58 |
| శ్రీ పుల్లేటికుర్తి వెంకటకాళహస్తి ,, | 58 |
| శ్రీ దాసరి వెంకటేశ్వర్లు, ,, | 58 |
| శ్రీ నర్రా సుబ్బరామయ్య, ,, | 58 |
| శ్రీ విశ్వేశ్వరరావు ,, | 58 |
| శ్రీ ఊటుకూరు గోపాలరావు, గుంటూరు | 58 |
| శ్రీ కొలచిన ముఖర్జీ, రేపల్లె | 58 |
| శ్రీ ప్రతాప శ్రీరామమూర్తి, రాంభొట్లపాలెం | 58 |
| శ్రీ సోమాశి సుబ్బరామయ్య. ,, | 58 |
| శ్రీ శీమకుర్తి నాగేశ్వరరావు కు॥ వెంకటనరసింహారావు, పొన్నూరు | 58 |
| శ్రీ కోట వెంకటేశ్వర్లు, (B. Com) ,, | 58 |
| శ్రీ పి. వి. ఆర్. అప్పారావు, లైబ్రేరియన్, పొన్నూరు | 58 |
| శ్రీ బొగ్గవరపు శ్రీరాములు, విజయవాడ | 58 |
| శ్రీ ప్రభల సీతారామయ్య, గుంటూరు | 58 |
| శ్రీ తూములూరి వెంకటశీతారామాంజనేయ లక్ష్మీనారాయణశర్మ | 58 |
| శ్రీ అంబటిపూడి శ్రీరామమూర్తి, రేపల్లె | 58 |
| శ్రీ నీని సుబ్బారావు, చందోలు | 58 |
| శ్రీమతి చతుర్వేదుల పద్మాక్షమ్మ, గుంటూరు | 58 |
| శ్రీ పొన్నూరు రజితగిరిపతిరావు-రాజ్యలక్ష్మి, బెంగుళూరు | 58 |
| శ్రీ పొన్నూరు కృష్ణ-రుద్రమ్మ, ,, | 58 |
| శ్రీ పెండ్యాల సత్యసూర్యనారాయణ, నర్సరావుపేట | 58 |
| శ్రీ దొప్లేటి సత్యనారాయణ, గుంటూరు | 58 |
| శ్రీ అగ్నిహోత్రం రామకృష్ణమాచార్యులు, గుంటూరు | 58 |
| శ్రీ జొన్నలగడ్డ వెంకటకృష్ణారావు జ్ఞాపకార్థం సోదరుడు జానకిరామయ్య, పొన్నూరు | 58 |
| కీ॥ శే॥ బొడ్డపాటి ఆనందరావుగారి జ్ఞాపకార్థం శ్రీమతి అనసూయమ్మ కుమారులు దుర్గేశ్వర ప్రసాద్ | 58 |

బ్ర. వే. తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు, 'నా రామాయణము'ను పేర రచించిన పద్యములలోఁ గొన్ని యిట ముద్రింపఁబడుచున్నవి.

నను గని పెంచె హన్మాయమ్మ పాల్పోసి
వేంకటప్పయ్యశాస్త్రవేత్త సుకవి
రామకథాఽమృత రసము గ్రోలగ నిచ్చె
నానాఁటి కీనాఁటి కదియటుండె
విద్యార్థి సమితికి వెదవెట్టె జ్ఞాన స
స్యము విస్తరించు బీజము లుపాస్తు
లాత్మనీన పథంబునందునె నడిపించె
నన్ను నావారల నన్నుబోంట్ల
ఆర్యులార! సన్మార్గయియాసులార!
మిమ్ముఁ గొనియాడువాఁడ నా మనుకు వినుఁడు
పృథు తదుభయాన్వవాయ కరీర మేను
రాఘవుఁడ నేనె, నేనే నారాయణుఁడను
నన్నెఱుఁగ లేఁ డొకండె
నన్నాఁటికి నేనె యెఱుకనై యుండుట నే
నన్నను కారకములు లే
వన్నిఁటిఁ గ్రియలేదు లేఁడహమ్మన నొరుఁడున్
య్యా, మా, యది తలయెత్తెన్
భూమాకాశంబునంద మునుకద్ద యదే
నామాదిరి కన్పట్టెన్
శ్రీమానితమంచు నన్ను జెంది యదృచ్ఛన్
అవ్యక్తుండను నేను, దానదియు నవ్యక్తాకృతింజెందె, రూ
ప వ్యాపారము లేని నావలెనె, రూపవ్యాపృతుల్లేనిదై
భవ్యాత్మీయ సహస్థితి న్వెలసె సంభావ్య ప్రకారాత్మతన్
నవ్యం బధ్రువమద్ధి, ప్రత్నుఁడ, ధ్రువుండ న్నేను శీలించితిన్
నాలోనున్నటులున్న నాఽఽది యది దానందోఁచినట్లున్న నే
నాలోనైతివి తద్గుణానుగతిఁ దద్యాదార్ఢ్య మండంగఁ గా
మాలుల్ దోచె బహుప్రకారముల నంవర్తింప, నెట్లైన నే
నేలంబాయన సాము సేసెద స్వనంధి స్గర్తెఱుంగంగనై॥